భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవం 1997

# సురభి
# పెద్దబాలశిక్ష

సాంస్కృతిక సాక్షరాస్యత
**కల్చరల్ లిటరసీ**
ప్రాతిపదికగా






- బుడ్డిగ సుబ్బరాయన్

భాషా పీఠం
సంప్రదాయ
బాలసాహిత్యపీఠం
సాహిత్యపీఠం
విజ్ఞాన పీఠం
లోకజ్ఞాన పీఠం

మాతృభాషాభ్యసనానికి సురభి పెద్ద బాలశిక్ష కరదీపిక




పిల్లలకు సురభి పెద్ద బాలశిక్ష గుణశీల పేటిక

# సురభి - పెద్ద బాలశిక్ష

సాంస్కృతిక సాక్షరాస్యత (కల్చరల్ లిటరసీ) ప్రాతిపదికగా
రూపకల్పన చేయబడిన బాలవివేక కల్పతరువు

బుడ్డిగ సుబ్బరాయన్




పబ్లిషర్
ఎడ్యుకేషనల్ ప్రొడక్ట్స్ ఆఫ్ ఇండియా
హైదరాబాదు

# సురభి - పెద్ద బాలశిక్ష

గ్రంథకర్త : బుడ్డిగ సుబ్బరాయన్

ప్రథమ ముద్రణ : 1997



పరిచయ మూల్యం : రూ. $49^{99}$

చిత్ర రూపకల్పన, సలహాదారు &
ముఖచిత్రం : కె. దయానందం

చిత్రాలు : బాపు, గోలి శివరాం
ఎమ్.కె. సూరిబాబు
డి. శివప్రసాదు
కె. దయానందం

ఆర్ట్ అసిస్టెంట్ : రవి

టైప్ సెట్టింగ్ : అనూ గ్రాఫిక్స్
హైదరాబాదు లేజర్ డిజైన్స్
ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్
కీర్తన గ్రాఫిక్స్
బాలాజీ గ్రాఫిక్స్

ప్రాసెస్సింగ్ : మనోరూపా స్కానర్స్ ప్రై. లి.
హైదరాబాదు.

ముద్రణ : అనూ గ్రాఫిక్స్ & ప్రింటర్స్, చెన్నై

పబ్లిషర్ : ఎడ్యుకేషనల్ ప్రాడక్ట్స్ ఆఫ్ ఇండియా
I.E. హై-లైన్ అపార్ట్‌మెంట్స్,
3-4-495, బర్కత్‌పురా,
హైదరాబాదు - 500 027.

మార్కెటింగ్ : ఎడ్యుకేషనల్ ప్రాడక్ట్స్ ఆఫ్ ఇండియా
C/o. ఆదర్శ బుక్ కార్పొరేషన్,
సి-1, ఆదర్శ విహార అపార్ట్‌మెంట్స్,
ఆదర్శనగర్, హైదరాబాదు-500 063.



# SURABHI - PEDDA BALASIKSHA

Author : BUDDIGA SUBBARAYAN

First Edition : 1997



**Introductory Price : Rs. $49^{99}$**

Art Advisor &
Cover Design : K. Dayanandam

Art Work : Bapu, Goli Sivaram
M.K. Suribabu
D. Siva Prasad
K. Dayanandam

Art Assistant : Ravi

Type Setting : Anu Graphics
Hyd. Laser Designs
Fontline Graphics
Keertana Graphics
Balaji Graphics

Processing : Manorupa Scanners (P) Ltd.
Hyderabad

Printing : Anu Graphics & Printers
Chennai

Publisher : Educational Products of India
IE Hi-line Apts.,
3-4-495, Barkatpura,
Hyderabad - 500 027.

Marketing : Educational Products of India
C/o. Anu Book Corpn.,
C-1, Adarsh Vihar Apts.,
Adarsha Nagar,
Hyderabad - 500 063.

# ఆనంద వాక్యాలు

ఎన్నాళ్ళ నుంచో ఎదురు చూస్తున్నది ఇన్నాళ్లకు యీ ప్రశంసనీయ రూపం దాల్చింది. 'పెద్దబాల శిక్ష' కొత్త కూర్పు వెల్లు చూసింది. సామర్థ్యంకల సంకలనకర్త చేతిలో పడి కాలానుగుణ్యమైన మార్పులతో చేర్పులతో చక్కని ఆకృతిని సంతరింప చేసుకుంది. ఎంతో చరిత్ర గల '**బాలశిక్ష**' 'పెద్ద **బాలశిక్ష**'గా పెరిగి, ఇప్పుడు 'సురభి పెద్ద **బాలశిక్ష**'గా పరిపూర్ణతతో విస్తరించింది. 1832 లో నాటిన విత్తనం. ఈ 165 సంవత్సరాలలో నేడు యీ 1997లో యీ వటవృక్షంగా వ్యాప్తి చెందిన కథను మళ్లీ మళ్ళీ చెప్పుకొనడం చాలా చాలా అవసరం.

వర్తకానికి వచ్చి రాజ్యాధిపతులైన ఆంగ్లేయులు మనదేశాన్ని దోచుకొని పోవడం వాళ్ళకు తప్పుగా కనబడలేదు. వారి కొలువులో వున్న దేశీయులు బతుకు తెరువు కోసం చేతనైన ఆర్జనలు చేయడం తప్పు కాదనిపించింది. రెవెన్యూ డిపార్టుమెంటులో చాలీచాలని జీతాలతో పని చేస్తూ వున్న నేటివులు అడ్డదారులు తొక్కి ధనార్జన కోసం అక్రమాలూ అన్యాయాలూ మోసాలూ దగాలూ తప్పుడు రికార్డులు సృష్టించడం మొదలైనవి చేస్తున్నారని తెల్లదొరలు గుర్తించారు. నేటివులు విశ్వసనీయంగా ప్రవర్తించాలంటే ఏమి చర్యలు తీసుకోవాలి అని ఆలోచించారు. నేటివుల విద్యా విధానంలో లోపం వుందని తెలుసుకున్నారు. ఆనాటి మద్రాసు గవర్నరు సర్ తామస్ మన్రో 1822 జూలై రెండో తేదీన ఒక యీ దస్తు కోరారు. అందులో ఇలా వుంది:

> *"రాజ్యాలను సంపాదించాక మనం భౌగోళికంగా సర్వేలు చేయించాము. దేశంలో పండే పంటల ఆరాలు తీశాము. వనరుల గురించి భోగట్టాలు రాబట్టాము. జనాభా లెక్కలు గుణించాము. అంతేగాని నేటివుల విద్యావిధానం గురించి తెలుసు కోడానికి ఏమాత్రం ప్రయత్నించలేదు."*

నేటివులలో మన విశ్వాసాలకు భంగం కలగకుండా వారి విద్యావిధానంలో ఏ మార్పులను తీసుకు రావాలో తెలుసుకున్నారు. అప్పటి దాకా తమ సివిల్ సర్వెంట్ల చదువుల కోసమే పుస్తకాలను రాయించిన ప్రభువులు నేటివుల కోసం ప్రాథమిక గ్రంథాలను రాయించాలని అనుకున్నారు. 1832లో మేస్తర్ కుళులో అనే తెల్లదొర తన ఆశ్రితుడైన పుదూరు చదలవాడ సీతారామశాస్త్రిగారి చేత **బాలశిక్ష** అనే గ్రంథాన్ని రచింప జేశాడు. వీరి రచనా ప్రణాలికను చాలా జాగ్రత్తగా కుర్రవాళ్ల గ్రహణశక్తిని దృష్టిలో వుంచుకొని గ్రంథకర్త రూపొందించాడు. ఇటువంటి పుస్తకం కోసమే ఆవురావురమంటూ ఎదురు చూస్తూన్న దేశం దీనిని రెండు చేతులా ఆహ్వానించింది.

1856లో అంటే మొదటి ముద్రణకు రెండు పుష్కరాల తర్వాత వెలువడిన బాలశిక్షలోని పుటల సంఖ్య 78. డెమ్మీ ఆక్టావో సైజు. 1865లో అంటే రమారమి పదేళ్ల తర్వాత ముద్రణలో పుటల సంఖ్య 90. అంటే పన్నెండు పేజీలు పెరిగాయన్నమాట. పాత ముద్రణలో లేని సాహిత్య విషయాలను, ఛందస్సు సంస్కృత శ్లోకాలూ, భౌగోళిక విషయాలను యిందులో చేర్చారు. దానిని

**'బాలవివేకకల్ప తరువు'**గా రూపొందించారు. అందుకనే అప్పటిదాకా బాలశిక్షగా ప్రచారంలో వున్న పుస్తకం 'పెద్దబాలశిక్ష'గా కొత్త పేరును దాల్చింది. ఈ పెద్దబాలశిక్ష పుట్టినది మొదలు ఎన్ని ముద్రణలు పోయిందో చెప్పలేం.

ఈ గ్రంథకర్త గురించీ దీనిని ప్రోత్సహించి రాయించిన దొర గురించి చాలా కాలం ఎవరికీ తెలియదు. నా సాహిత్య పీఠం 1983లో నాటి పుదూరు చదలవాడ సీతారామశాస్త్రిగారి గురించి విపులంగా రాశాను. కాని దొర వివరాలేం చెప్పలేదు. ఇతను కుంఫిణీ వారి సివిల్ సర్వెంటు. సీమలో తన సివిల్ సర్వీసులో చేర్చుకోదలచిన యువకుల విద్య కోసం కుంఫిణీవారు 'హెయిల్‌బరీ' ని స్థాపించారు. 1817లో తెలుగు పరీక్షలకు 14 మంది విద్యార్థులు కూర్చున్నారు. వాళ్లలో క్లులో (Clu Low) అనే యువకుడు కూడ వున్నాడు. పరీక్షలలో ఉత్తీర్ణుడై వచ్చి మద్రాసు ప్రభుత్వంలో వివిధ హోదాలలో పని చేశాడు. ఈ 'క్లులో' దొరని నేటివులు 'కుళులో' దొర అని పిలిచే వారు. ఇతని ప్రాపకం దొరికాక చదలవాడ సీతారామశాస్త్రిగారు 1830లో **"ప్రశ్నోత్తర రత్నమాల"** అనే పేరుతో ఒక ఆంధ్ర వ్యాకరణాన్ని పెద్దలకోసం రాశారు. రెండేళ్ళ తర్వాత 1832లో బాలశిక్షను రూపొందించారు. 1865 నుంచీ ఇది పెద్దబాలశిక్షగా ప్రసిద్ధి చెందింది. **'బాలవివేక కల్పతరువు'** అని దీనిని గ్రంథకర్త పేర్కొన్నారు.

ఆ పెద్దబాలశిక్ష కల్పతరువు అయితే ఇప్పుడు శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్‌గారి సామర్థ్యంతో రూపొందినది కామధేనువు. అందుకే దీనికి ఆయన **'సురభి పెద్దబాలశిక్ష'** అని పేరు పెట్టారు. ఈ నాలుగు వందల పై చిలుకు పుటలున్న గ్రంథం ఏ ప్రణాళికలో రచించినది సుబ్బరాయన్‌గారు తమ మాటల్లో విపులంగా చెప్పనే చెప్పారు. ఎంతో ఓపికతో శ్రద్ధతో దక్షతతో ఆయన నెరవేర్చిన ఈ సత్‌క్రియ శ్లాఘనీయం. విజ్ఞాన సర్వస్వం, బాలల అకాడమీ కార్యకలాపాలవల్ల కుర్రవాళ్ల గ్రహణశక్తిని బాగా అర్థం చేసుకున్న సుబ్బరాయన్‌గారు ఆధునిక కాలంలో పెంచుకొనవలసిన సాంప్రదాయిక సంపదను యిందులో నిక్షిప్తం చేశారు. నేడు వివిధ ప్రకాశకులు ప్రచురించి మార్కెట్లో పెట్టిన ఇతర పెద్ద బాలశిక్షలకు దీనికి గల తేడా ఎంతో వుంది. ఇది తరగని గని. దీనిలో కావలసినది తవ్వుకొని తలకెత్తుకొని పాఠకులు సంతోషంతో సద్వినియోగం చేసుకుంటూ పోతారు. సుబ్బరాయన్‌గారికి ధన్యావాదాలు చెప్పుకుంటూ వుంటూనే వుంటారు.

**'విద్య నిగూఢ గుప్తమగు విత్తము'** అన్న సత్యం ఈ సత్‌గ్రంథంవల్ల మరోసారి నిరూపితం అయింది. ఈ మంచి పని నా స్ఫూర్తి వల్ల కలిగిందని సుబ్బరాయన్‌గారు అంటున్నారు. అది వారి హృదయ స్వచ్ఛతకు నిదర్శనం. నేను నిమిత్తమాత్రుణ్ణే. కాని ఈ సత్ఫలితానికి సంతోషించే మొదటి వాళ్ళలో మొదటి వాడిని.

1, శివప్రకాశ్ మొదలివీధి
చెన్నై, 9.9.97

ఆరుద్ర

# నా మాట

*"విషయ సంకలనము విజ్ఞానమా? కాదు*
*ఇటుక ఆమ వేరు - ఇల్లు వేరు*
*అస్థి పంజరమ్ము అసలు దేహము కాదు*
*ప్రత్తి వేరు - నేతబట్ట వేరు"*

**అ**ని ఒక సుకవి చెప్పిన ఈ చాటు పద్యంలోని విషయాలు, ఇటుకలు, అస్థిపంజరాలు, ప్రత్తి - ఇవన్నీ ఆయా అంత్యవస్తు నిర్మాణానికి పనికి వచ్చే ముడి పదార్థాలే. ఇటుకలు లేకుండా ఒక చిన్న ఇల్లుగాని మేడగాని భవంతిగాని సౌధంగాని నిర్మించలేము కదా! అలాగనే అసలు దేహానికి రూపు రేఖల నిచ్చేది అస్థిపంజరమే కదా! అది లేకపోతే మాంసం, రక్తం, వివిధ అవయవాలు ఒక గంపలో పోస్తే దేహం కాదు కదా! మరి, చీర నేయాలన్నా పంచె నేయాలన్నా, దుప్పటి నేయాలన్నా మౌలికమైనది ప్రత్తియే కదా కావల్సింది!? విషయ సంకలనమే లేకపోతే విజ్ఞాన ప్రచారం సాధ్యం అవుతుందా!!!

అందుచేత ఆ సుకవికి కృతజ్ఞతలు చెప్పుకుంటూ - ప్రాపంచిక ధోరణిని అవగాహన చేసుకునేందుకు విషయ సంకలనమనేది తప్పనిసరి అని మనవి చేస్తున్నాను. అందుకే కాబోలు క్రీ.శ. 1832 ప్రాంతంలో పుదూరు చదలవాడ సీతారామశాస్త్రి అనే మహాపండితులొకరు తెలుగులో **'పెద్ద బాలశిక్ష'** అనే విషయ సంకలనాన్ని ఒక దానిని నిర్మించి తెలుగు జాతికి అందించారు. ఇందులో విషయపరిజ్ఞానానికి - అంటే భాషాసంస్కృతులకు కావల్సిన పునాదిరాళ్లనదగిన భాషా విషయాలు - అక్షరాలు, గుణింతాలు, వత్తులు, సరళమైన పదాలు - రెండు మూడు నాలుగు అక్షరాలతో కూడిన మాటలు, తేలిక వాక్యాలు - నీతి వాక్యాలు, ప్రాసవాక్యాలు, సంప్రదాయ సంస్కృతికి సంబంధించినవీ, అందరూ తెలుసుకోదగ్గవీ నాటికి తెలిసిన చారిత్రక, భౌగోళిక, జ్ఞాన సంబం విషయాలనూ రూఢి వాచకాలనూ ఈ పుస్తకం ఆది స్వరూపంలోనే ఆ[illegible]ము పుదూరు వారు పొందుపరచారు. **పెద్దబాలశిక్షను ఆదిలో 'బాలశిక్ష'** అని అన్నారన్న విషయం గమనించాలి.

ఆ తరువాత, ఈ నూటఅరవైఅయిదు ఏళ్ళనుంచీ (1832-1997) ఇప్పటివరకూ **'పెద్ద బాలశిక్ష'**ను తెలుగు సమాజం ఆదరించగా కొన్ని మార్పుల చేర్పులతో ఎంతో మంది ప్రచురణకర్తలు ఎన్నో పండిత పరిష్కరణలతో అందిస్తూ వచ్చారు. ఆమధ్య ఎన్నో 'గుజిలీ' ఎడిషన్లు కూడా లభిస్తూ వచ్చాయి. పుదూరి వారి తర్వాత పేర్కొనదగిన పరిష్కరణ వావిళ్ళ వారిది. ఇది 1916లో వెలువడింది. దీని విపుల పరిష్కరణను 1949లో అందించారు. ప్రస్తుతం తెలుగునాట మార్కెట్టులో పది రకాల **'పెద్దబాలశిక్ష'**లు లభిస్తున్నాయి. కాగా వాస్తవానికి ఇవన్నీ దాదాపు ఒకే మూసపోతకు చెందినవే అని నా అభిప్రాయం. 1983లో రాష్ట్ర ప్రభుత్వం దీని ప్రాశస్త్యాన్ని గ్రహించి కొన్ని భాగాల్ని పాఠ్యాంశాలుగా కూడ చేర్చింది. పత్రికాధిపతులు, విజ్ఞులు **'పెద్ద బాలశిక్ష'**ను గుణశీల పేటికగా అభివర్ణించారు.

అయితే 'ఇవన్నీ ఉండగా మళ్లీ మీరెందుకు మరొకటి తలపెట్టారు?' అని అడగవచ్చు. దీనికి సమాధానం ఒకటే. పెద్ద బాలశిక్ష భావన (కాన్సెప్ట్)లో ఇమిడేలాగ నేటి కంపూటరు యుగానికి ప్రయోజనపడే విధంగా దీన్ని తీర్చిదిద్దటమే నా ధ్యేయం. పైగా 'పెద్ద బాలశిక్ష' భావనకు దరిదాపుగా వచ్చే **'సాంస్కృతిక సాక్షరాస్యత' - 'కల్చరల్ లిటరసీ'** - కోర్ నాలెడ్జి ఇప్పుడు ముఖ్యంగా ప్రగతికన్న యునైటెడ్ స్టేట్స్‌వంటి దేశాల్లో పాదుకుంటున్నది. నాగరికమైన ప్రతివ్యక్తీ తెలుసుకోదగ్గ విషయాలు ప్రచారం చెయ్యడం ఈ సాంస్కృతిక సాక్షరాస్యతా భావన లక్ష్యం. ఈ కల్చరల్ లిటరసీ భావనను (1987) మొదటిసారిగా ప్రవేశపెట్టినవాడు ఇ.జి.హిర్ష్ (జా) ఈయన వర్జీనియా యూనివర్సిటీ ఛార్లెస్‌విల్లీ (యు.ఎస్.ఏ.)లో ఇంగ్లీషు భాషా పఠన (రీడింగ్ ఇంగ్లీషు) పీఠాధిపతులు. ఈ భావనకు ఆ దేశంలో ఇప్పుడు మంచి ఆదరణ ఉంది. నేడు ముఖ్యంగా సమాజంలో అట్టడుగున ఉన్నవారు అగ్రపౌరులతో సమానంగా ప్రజాస్వామ్యంలో పాలుపంచుకోవడానికి ఈ సాంస్కృతిక సాక్షరాస్యత దోహదకారిగా గుర్తింపబడినది. ఆ దేశంలోని ప్రాథమిక తరగతుల్లో ఈ భావననాధారంగా పాఠ్యాంశాలు కూడ అమలులో ఉన్నాయి. పండిత పరిశోధకులు నిడదవోలు వెంకట్రావు **'పెద్ద బాలశిక్ష'**ను గురించి **'ఆంధ్ర వచన వాఙ్మయ'**మనే ఆయన గ్రంథంలో రాస్తూ దాన్ని ఒక **'బాలల విజ్ఞాన సర్వస్వం'**గా పేర్కొన్నారు. తమ వ్యాసపీఠంలో పెద్ద బాలశిక్ష - ఒక ప్రతీక్ష లో దీని నూతన ప్రతిని తయారు చేయవలసిన ఆవశ్యకతను ఉగ్గడిస్తూ **'ఇది చాలా పెద్దపని, శ్రద్ధతో చేయవలసిన పని'** అని శ్రీ ఆరుద్ర అన్నారు. 1995లో నేను చెన్నై (మద్రాసు) వెళ్లినప్పుడు పెద్ద బాలశిక్షను పునర్నిర్మించడానికి ప్రయత్నం చేస్తున్నానని ప్రస్తావించాను. తప్పకుండా చేయండని ఆరుద్ర ఆశీర్వదించారు కూడ! అందుచేతనే 'పెద్ద బాలశిక్ష'కు పునః రూపకల్పన చేయవలసిన అవసరం ఏర్పడింది.

ఆంధ్రమహిళాసభ వారు షాద్‌నగర్‌లో రైతాంగానికి ఫంక్షనల్ లిటరసీ ప్రాజెక్టు (యునెస్కో) ను నిర్వహిస్తున్న రోజులవి. అప్పుడే 1966లోనే 'పెద్ద బాల శిక్ష'ను పునర్నిర్మించాలనే కోరిక ఉండేది. ఒక ప్రణాళిక సిద్ధ పరచుకున్న తరువాత దీనికి సంబంధించిన చిత్ర రచనకై బాపూగారితో ప్రస్తావించాను కూడ. అయితే, ఈ మూడు దశాబ్దాల్లోనూ ఆయన్ని కలిసినప్పుడల్లా 'ఎంత వరకూ వచ్చింది మీ పెద్ద బాలశిక్ష?' అని వాకబు చేస్తూ ఉండేవారు. ఇటీవల, పని మొదలు పెట్టినప్పుడు కొన్ని చిత్రాలు కోరగా వారు పంపించారు కూడ. కాగా, సుమారు పావు శతాబ్ది (1950-76) విజ్ఞాన సర్వస్వ (తెలుగు భాషా సమితి) సంపాదక మండలిలో పని చేస్తూ మూడు సంపుటాలకు ముఖ్య సంగ్రాహకుని (చీఫ్ కంపైలర్)గా ఉండడం వల్లనూ **బాలల విజ్ఞాన సర్వస్వం** (చిల్డ్రన్స్ ఎన్‌సైక్లోపీడియా(1990)ను నిర్మించడంలోనూ బాలల అకాడమికి ఒక పుష్కరం (1976-88) పాటు కార్యదర్శిగా బాలల సాహిత్య నిర్మాణాన్ని నిర్వహించడంలోనూ గడించిన అనుభవం స్ఫూర్తినిచ్చిన తరుణంలో, అంటే ఇప్పుడు ఆంధ్ర మహిళ సభవారి సాక్షరతాభవన్ (లిటరసీ హౌస్)కు గౌరవ కార్యదర్శిగా ఉన్న సందర్భం ముఖ్యంగా నన్ను ఈ పనికి కార్యోన్ముఖుణ్ణి చేసింది.

భాషోద్ధారకులు వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రులు 1949 పరిష్కరణలో ఇలా చెప్పారు:

*"భారత దేశమునకు స్వరాజ్యము లభించినందున ఇక ముందు దేశభాషలకు .... విశేషవ్యాప్తి ఏర్పడి ఇట్టి **(పెద్ద బాలశిక్ష)** గ్రంథములకు వేలకువేలు ప్రచారమగునని తలంచుచున్నాను."*

ఇప్పుడు భారత దేశానికి స్వరాజ్యం వచ్చి ఏభయేళ్లయి స్వర్ణోత్సవాలు (1997) జరుగుతున్న తరుణంలో వయోజనలకే గాక ముఖ్యంగా తెలుగు పిల్లలకు తెలుగుదనాన్ని నేర్పి చక్కని పండితపౌరులుగా తీర్చిదిద్దే సామర్థ్యం ఈ పెద్ద బాలశిక్షకు ఉంది. అంతేగాక వారు **మాతృభాషాభ్యసనాన్ని** శ్రద్ధాసక్తులతో చేపట్టడానికి వీలుగా 'పెద్ద బాలశిక్ష' భావనను ఈ విధంగా పునర్నిర్మించి **'సురభి - పెద్దబాలశిక్ష'**గా తెలుగు జాతికి అందించే అవకాశం డెబ్బయ్యోపడిలో పడిన నాకు కలిగినందుకు అదృష్టంగా భావిస్తున్నాను.

దీన్ని **సురభి - పెద్ద బాలశిక్ష** అని అన్నాను కదా! **'సురభి'** అంటేనే **'కామధేనువు'**. కావల్సిన వాటిని సమకూర్చే ఒక దివ్య స్వరూపిణి: **'కోర్కుకోపియా - అక్షయపాత్ర.** **'సురభి-పెద్ద బాలశిక్ష'**ను ఆరు ప్రధాన భాగాలుగా వింగడించాను. వాటికి పీఠాలు అని పేరు పెట్టాను. అవి : **1. భాషా పీఠం; 2. సంప్రదాయ సంస్కృతీ పీఠం; 3. బాల సాహిత్య పీఠం, 4. సాహిత్య పీఠం; 5. విజ్ఞాన పీఠం; 6. లోక జ్ఞాన పీఠం.**

**ఇందులోని భాషను గురించి** : మొదటి రెండు పీఠాల్లోనూ శబ్దస్పష్టతకు భంగం వాటిల్లకుండా సరళ గ్రాంధికభాషను తరువాత రెండు పీఠాల్లోనూ ఆయా రచయితలు వాడుకచేసిన భాషను యథాతథంగానూ, చివర్రి రెండు పీఠాల్లో శిష్టవ్యావహారిక భాషను వాడుక చేశాను.

**సురభి - పెద్ద బాలశిక్ష** పిల్లలకూ పెద్దలకూ విద్యార్థులకూ ఉపాధ్యాయులకూ ఆధార గ్రంథం (సోర్స్ బుక్)గానూ జ్ఞానసంహితగానూ ఉపయోగించుటకుగాను ప్రత్యేకంగా రూపకల్పన చేయబడింది. కాగా, బోధనా పద్ధతుల ననుసరించి బోధనాభ్యసన వాచకం (ప్రైమర్)గా ఉపయోగించడానికి ఇది పరిమితంగానే పనికి వస్తుందని నా భావన. అయితే ఇందలి విషయసామగ్రి బోధనాభ్యసన సౌలభ్యానికి ఇంటిలోనూ బడిలోనూ వయోజనులకు నేడు **నిరంతర విద్యా రంగం** (కంటిన్యూయింగ్ ఎడ్యుకేషన్)లో కార్యకర్తలకూ అక్షరాస్యులందరికీ కరదీపికగా ధారాళంగా ఉపయోపగపడి దోహదకారి అవుతుందనడంలో మాత్రం సందేహం లేదు. చిన్నా పెద్దా పాఠకలోకానికి ఈ **సురభి - పెద్ద బాలశిక్ష** ఏమాత్రం ప్రయోజనపడినా నా కృషి సార్థకమైనట్లే!

ఇదివరలో లాగానే, అంటే **బాలల విజ్ఞాన సర్వస్వం** (1990), **ఉత్తమ నాయకత్వం** (1992) పుస్తకాల్ని నిర్మిస్తున్నప్పుడు నా రచనా వ్యాసంగానికి చేయూతనిచ్చినట్టే నా శ్రీమతి సౌభాగ్య కమల ఈ **'సురభి - పెద్ద బాలశిక్ష'** కృషిలో కూడా ఉత్సాహ ప్రోత్సాహదోహదాదులు అందించినవైనం ఈ సందర్భంలో పేర్కొనడం సముచితమని నాకు తోచింది. ఈ పుస్తకానికి **'ఆనంద వాక్యాలు'** రాస్తూ మహా పండిత పరిశోధకులు శ్రీ ఆరుద్రగారు పెద్దబాలశిక్ష పుట్టుపూర్వోత్తరాలను గురించి విపులంగా వ్యాఖ్యానించి నందుకు వారికి కృతజ్ఞతాపూర్వక అభివందనాలు తెలుపుకుంటున్నాను. ఈ **సురభి-పెద్ద బాలశిక్ష**ను దోషరహితం చేయడానికి ప్రయత్నించాను. సవరణలు సూచించినచో మలి ముద్రణలో సరిదిద్దు కోగలనని సహృదయులకు మనవి చేస్తున్నాను.

అక్టోబరు 2, 1997
1-ఇ-హై-లైన్ అపార్ట్మెంట్స్ 3-4-495
బర్కత్‌పురా, హైదరాబాదు - 500 027

బుడ్డిగ సుబ్బరాయన్
**బుడ్డిగ సుబ్బరాయన్**

## కృతజ్ఞతలు

ఈ సురభి పెద్ద బాలశిక్షను రూపకల్పన చేయడంలో నాకు సలహా సహకారాలు అందించిన నా ఆప్త మిత్రులు శ్రీ ఎస్.ఎమ్. కొండయ్య, శ్రీ బుర్రా సుబ్రహ్మణ్యం గార్లకు కృతజ్ఞతాభినందనలు తెలుపు కుంటున్నాను.

బుడ్డిగ సుబ్బరాయన్



శ్రీ బుడ్డిగ వెంకన్నగారు



శ్రీమతి బుడ్డిగ సుబ్బారావుగారు

మానాన్నగార్ని అమ్మగార్ని స్మరిస్తూ

ఈ 'సురభి - పెద్దబాలశిక్ష'ను

తెలుగు జాతికి సమర్పిస్తున్నాను

బుడ్డిగ సుబ్బరాయన్

బుడ్డిగ సుబ్బ రాయన్

# విషయసూచి



గమనిక : సూక్ష్మ విషయవారీసూచీ వివరాలు ఆయా పీఠాల ప్రారంభంలో చూడవచ్చును.

# భాషా పీఠం

## విషయసూచి

శ్రీరస్తు

తెలుగు ప్రథమాక్షరములు

## ఓం న మః శి వా య: సి ద్ధం న మః

**తెలుగు అక్షరములు - 57**

**అందులో అచ్చులు - 16 : ఇవి ప్రాణాక్షరములు - స్వరములు**

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ
ఎ ఏ ఐ ఒ ఓ ఔ (అం అః)

**హల్లులు - 38 : ఇవి వ్యంజనములు**

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ
ట ఠ డ ఢ ణ త థ ద ధ న
ప ఫ బ భ మ
య ర ఱ ల ళ వ శ ష స హ క్ష

ఉభయాక్షరములు - మూడు; ం సున్న. ఁ అరసున్న. ః విసర్గము

> *గమనిక :* ఌ ౡ, 'ఱ' ప్రస్తుతము వ్యవహారములో లేవు. 'క్ష' సంయుక్తాక్షరముగా వ్యవహారము. 'ౘ ౙ'·ల ఉచ్చారణ ఛాయా భేదము సూచించుటకు సి.పి. బ్రౌన్ వీటి శీర్షమున రెండు (‾) అంకె వుంచి చ, జ అక్షర స్వరూపములను రూపొందించారు. ఇవి బ్రౌన్ 'ౘ ౙ 'లుగా వ్యవహారము.

ప్రస్తుతము వ్యవహారములో ఉన్న అక్షరములు-51

అచ్చులు-14

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఎ ఏ ఐ ఒ ఓ ఔ

హల్లులు - 34

క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ
త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల ళ వ శ ష స హ.

**ఉభయాక్షరములు - ం, ఁ, ః**

ఈ మూడింటిని - ం సున్న, ఁ అరసున్న, ః విసర్గము అని అందురు

తెలుగు - వర్ణమాల

# అక్షరములు వ్రాయు విధానము

అ ఆ ఇ ఈ ఉ ఊ

ఋ ఎ ఏ ఐ ఒ ఓ ఔ

క ఖ గ ఘ

చ ఛ జ ఝ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ల ళ వ శ

ష స హ

| అచ్చుల విభాగములు | | |
|---|---|---|
| హ్రస్వములు ... | 6 | - అ ఇ ఉ ఋ ఎ ఒ |
| దీర్ఘములు ... | 6 | - ఆ ఈ ఊ ౠ ఏ ఓ |
| వక్రములు ... | 4 | - ఎ ఏ ఒ ఓ |
| వక్రతమములు | 2 | - ఐ ఔ |

| వర్గములు | |
|---|---|
| వర్గప్రథమములు | క చ ట త ప... |
| వర్గద్వితీయములు | ఖ ఛ ఠ థ ఫ... |
| వర్గతృతీయములు | గ జ డ ద బ... |
| వర్గచతుర్థములు | ఘ ఝ ఢ ధ భ... |
| వర్గపంచమములు | ఙ ఞ ణ న మ ... |

ఈ ఇరువది అయిదు స్పర్శములు.

| హల్లుల విభాగములు | | |
|---|---|---|
| పరుషములు .. | 5 | - క చ ట త ప |
| సరళములు ... | 5 | - గ జ డ ద బ |
| ద్రుతము ... | 1 | - న |
| స్థిరములు ... | 25 | - ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ఱ. ల ళ వ శ ష స హ |
| కేవల స్థిరములు... | 10 | - ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ |
| అనునాసికములు... | 5 | - ఙ ఞ ణ న మ |
| అంతస్థములు... | 6 | - య ర ఱ ల ళ వ |
| ఊష్మములు... | 4 | - శ ష స హ |

| | |
|---|---|
| అ ఆ క ఖ గ ఘ ఙ హ | - కంఠ్యములు |
| ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ | - తాలవ్యములు |
| ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ఱ ష | - మూర్ధన్యములు |
| త థ ద ధ న ల స చ జ | - దంత్యములు |
| ఉ ఊ ప ఫ బ భ మ | - ఓష్ఠ్యములు |
| ఙ ఞ ణ న మ | - అనునాసికములు |
| ఎ ఏ ఐ | కంఠతాలవ్యములు |
| ఒ ఓ ఔ | - కంఠోష్ఠ్యములు |
| వ | - దంతోష్ఠ్యములు |
| ం | - నాసిక్యము |

**పదములు**

అర ఊడ ఒర గద ఝంప దశ బక లత

ఆశ ఋణ ఓడ ఘట తడ ధన భవ వధ

ఇల ఎద ఔర చల టంక నస మఖ శర

ఈగ ఏల కథ ఛట ఠవ పగ యమ సభ

ఉష ఐన ఖర జడ డంక ఫణ రస హర

| | | | | |
|---|---|---|---|---|
| అంబ | కంప | జంప | దంత | మంచ |
| అంత | గంగ | బంక | నంద | మంట |
| ఇంత | గంట | ఢంక | పంగ | మంద |
| ఎంత | గంత | తంట | పంట | సంజ |
| కంత | చంక | తంబ | బండ | సంత |
| కంద | జంట | దండ | మంగ | హంస |

| | | | | |
|---|---|---|---|---|
| కటకట | గణగణ | జరజర | దబదబ | భగభగ |
| కణకణ | గబగబ | జలజల | ధగధగ | మలమల |
| కరకర | గరగర | టకటక | నకనక | రవరవ |
| కలకల | గలగల | టపటప | పటపట | లబలబ |
| కసకస | చకచక | డమడమ | పరపర | వలవల |
| గడగడ | చరచర | తళతళ | బడబడ | సలసల |

## కూడిక పదములు

| | | | |
|---|---|---|---|
| అరగంట | ఈతగంప | కమలజడ | పనసపంట |
| అవతల | ఉలవపంట | కలహంస | పలకలజత |
| అమలతల | ఉమనడక | జంటపడవ | మరపడవ |
| ఇవతల | ఉషపలక | తలగడ | రమజడ |
| ఈగవల | ఊకగంప | పడమర | హంసనడక |

ఆ పలకల జత ఎంత? ఈ తలగడ ఎంత?

# గుణింతము

| అచ్చులు హల్లులతో చేరునప్పుడు వచ్చు గుర్తులు | | | |
|---|---|---|---|
| అ | ˇ | క | తలకట్టు |
| ఆ | ా | కా | దీర్ఘము |
| ఇ | ి | కి | గుడి |
| ఈ | ీ | కీ | గుడి దీర్ఘము |
| ఉ | ు | కు | కొమ్ము |
| ఊ | ూ | కూ | కొమ్ము దీర్ఘము |
| ఋ | ృ | కృ | సుడి |
| ౠ | ౄ | కౄ | సుడి దీర్ఘము |
| ఎ | ె | కె | ఎత్వము |
| ఏ | ే | కే | ఏత్వము |
| ఐ | ై | కై | ఐత్వము |
| ఒ | ొ | కొ | ఒత్వము |
| ఓ | ో | కో | ఓత్వము |
| ఔ | ౌ | కౌ | ఔత్వము |
| అం | ం | కం | పూర్ణానుస్వారము |
| అః | ః | కః | విసర్గము |

**రూప భేదము గల వత్తులు**

| | | |
|---|---|---|
| క | ్క | 'క' వత్తు |
| త | ్త | 'త' వత్తు |
| న | ్న | 'న' వత్తు |
| మ | ్మ | 'మ' వత్తు |
| య | ్య | 'య' వత్తు |
| ర | ్ర | 'ర' వత్తు (క్రావడి) |
| ల | ్ల | 'ల' వత్తు |
| [illegible] | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | [illegible] |

| హల్లుల వత్తులు | |
|---|---|
| క | ్క |
| ఖ | ్ఖ |
| గ | ్గ |
| ఘ | ్ఘ |
| చ | ్చ |
| ఛ | ్ఛ |
| జ | ్జ |
| ఝ | ్ఝ |
| ఞ | ్ఞ |
| ట | ్ట |
| ఠ | ్ఠ |
| డ | ్డ |
| ఢ | ్ఢ |
| ణ | ్ణ |
| త | ్త |
| థ | ్థ |
| ద | ్ద |
| ధ | ్ధ |
| న | ్న |
| ప | ్ప |
| ఫ | ్ఫ |
| బ | ్బ |
| భ | ్భ |
| మ | ్మ |
| య | ్య |
| ర | ్ర |
| ల | ్ల |
| ళ | ్ళ |
| వ | ్వ |
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |

| గుణింతాలతో పదములు | |
|---|---|
| కాంతి | బడి |
| కాలు | బీట |
| కూడు | బూజు |
| కైక | బృంద |
| కొంగు | మృతి |
| గిరి | మైలు |
| గీత | మేట |
| గాథ | యాళి |
| గూడు | యుగ |
| చంటి | రాగి |
| చీమ | రీతి |
| చూపు | రూక |
| జింక | రౌతు |
| జాడీ | లావు |
| జాలు | లిపి |
| టెంక | లుంగీ |
| డోలు | లోతు |
| తాడు | వీణ |
| తీట | వేట |
| తూటా | వైరి |
| తేగ | శిఖ |
| తైల | శీల |
| తోడు | శూల |
| దారి | శోభ |
| పాటు | శౌరి |
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |

గుర్తులు, వత్తులు, మాటలు

## ఆయా అక్షరములు మార్పు లేకుండా వచ్చే వత్తులు

ఖ ఙ జ ఞ ణ ఱ

## తలకట్టు మాత్రం తొలగిస్తే వత్తులు

| | | |
|---|---|---|
| గ | ్గ | 'గ' వత్తు |
| ఘ | ్ఘ | 'ఘ' వత్తు |
| చ | ్చ | 'చ' వత్తు |
| ఛ | ్ఛ | 'ఛ' వత్తు |
| ఝ | ్ఝ | 'ఝ' వత్తు |
| ట | ్ట | 'ట' వత్తు |
| ఠ | ్ఠ | 'ఠ' వత్తు |
| డ | ్డ | 'డ' వత్తు |
| ఢ | ్ఢ | 'ఢ' వత్తు |
| ప | ్ప | 'ప' వత్తు |
| ఫ | ్ఫ | 'ఫ' వత్తు |
| బ | ్బ | 'బ' వత్తు |
| భ | ్భ | 'భ' వత్తు |
| శ | ్శ | 'శ' వత్తు |
| స | ్స | 'స' వత్తు |
| ళ | ్ళ | 'ళ' వత్తు |
| హ | ్హ | 'హ' వత్తు |

## ద్విత్వములతో మాటలు

| | | | |
|---|---|---|---|
| అక్క | కొప్పు | జున్ను | పచ్చ |
| అగ్గి | గబ్బు | జెర్రి | పద్దు |
| ఇల్లు | గిల్లి | డబ్బు | పువ్వు |
| ఉట్టి | గుర్రు | డిల్ల | బద్ద |
| ఉల్లి | గెడ్డ | డొల్ల | బస్సు |
| ఎర్ర | గొప్ప | నక్క | బెట్టు |
| ఒడ్డు | ఘల్లు | నిమ్మ | బొగ్గు |
| కత్తి | చల్ల | నువ్వు | ముక్కు |
| కిళ్లీ | చిల్లు | నెయ్యి | రొమ్ము |
| కుర్ర | చుక్క | నొప్పి | లడ్డు |
| కొక్కె | చొప్ప | నొక్కి | శయ్య · |

## హల్లుతో మరొక హల్లు చేరే సంయుక్తాక్షర పదములు

| | | | |
|---|---|---|---|
| అర్క | చక్ర | నిద్ర | లగ్న |
| ఉర్వి | జడ్జి | పెండ్లి | వర్ష |
| కీర్తి | టర్కీ | భర్త | వృక్ష |
| కృష్ణ | తృష్ణ | భార్య | షష్ఠి |
| ఖర్చు | త్రాణ | మంత్రి | శుద్ధి |
| గార్గి | దర్జీ | యజ్ఞ | స్వస్తి |
| చర్చ. | దృష్టి | యుక్తి | హ్రస్వ |

| | | |
|---|---|---|
| అర్భకుడు | గుల్మము | పుత్రుడు |
| అశ్వత్థామ | చంద్రుడు | భాగ్యము |
| ఊర్వశి | ట్రాన్సిస్టరు | మృత్యువు |
| ఐక్యము | దర్శనము | మ్యాన్మార్ |
| కట్నము | నిశ్చలము | విఘ్నేశ్వర |
| గర్భము | పద్మము | సూర్యుడు |

## సంయుక్తాక్షరములు - రెండు హల్లులపై అచ్చు కలియుట

క్ష్య, క్ష్మ, గ్ర్భ, త్ర్య, త్థ్న, త్స్న, న్స్ప, ప్ర్య, ష్ట్క, స్త్య, ష్ఠ్య, స్త్ర, ర్ఘ్య, ష్ట్ర, ష్ట్వ

### సంయుక్తాక్షరములతో పదములు

#### *ఒక హల్లు - రెండు వత్తులు*

| | |
|---|---|
| అర్ఘ్యము | లక్ష్మయ్య |
| ఇన్స్పెక్టరు | వస్త్రము |
| జ్యోత్స్న | వైశిష్ట్యము |
| ధృతరాష్ట్రుడు | స్త్రీ |
| రాష్ట్రపతి | స్వాతంత్ర్యము |

#### ఇటు చదివితే ఒకటి - అటు చదివితే ఒకటి

| | |
|---|---|
| కడప | పడక |
| కలప | పలక |
| డంక | కండ |
| పడగ | గడప |
| లత | తల |

#### ఎటు చదివినా ఒకటే

| | |
|---|---|
| కనుక | పులుపు |
| కిటికి | మిసిమి |
| గంగ | వికటకవి |
| జలజ | రంగనగరం |
| నందనందనం | సంతసం |
| మందారదామం | సరస |

### జంట పదములు

| | |
|---|---|
| అండ దండలు | చాలు మూలము |
| అంద చందాలు | చీకు చింత |
| అదుపు పొదుపు | ధన ధాన్యాలు |
| అన్నెము పున్నెము | తిండి తిప్పలు |
| అభము శుభము | పాప పుణ్యాలు |
| ఆకు అలములు | పెండ్లి పేరంటములు |
| ఆబాలగోపాలం | పూలు పండ్లు |
| ఇల్లు వాకిలి | పెట్టె బేడా |
| ఇంపు సొంపులు | పేరుప్రతిష్ఠలు |
| ఈడు జోడు | బాగోగులు |
| ఉప్పు పప్పు | బేరసారాలు |
| ఊరూవాడా | భోగ భాగ్యాలు |
| ఎదుగుబొదుగు | మూటాముల్లె |
| కట్నకానుకలు | రూపు రేఖలు |
| కలిమిలేములు | వంకరటింకర |
| కాయగూరలు | వన్నె చిన్నెలు |
| కాలు సేతులు | వీలు సాలు |
| కుడి ఎడమలు | వెండిబంగారాలు |
| కూలీనాలీ | వేళాపాళా |
| గొడ్డు గోదాలు | సిరి సంపదలు |
| చదువు సంధ్యలు | శ్రద్ధాసక్తులు |

### గమ్మత్తు మాటలు

| | | | |
|---|---|---|---|
| కండ లేని కండ | కలకండ | బడి కాని బడి | రాబడి |
| కర్రకాని కర్ర | జీలకర్ర | మాట కాని మాట | టమాట |
| కాయ కాని కాయ | తలకాయ | మామ కాని మామ | చందమామ |
| కోడి కాని కోడి | పకోడి | రాణి కాని రాణి | పారాణి |
| గొడుగు కాని గొడుగు | పుట్టగొడుగు | రాయి కాని రాయి | తురాయి |
| తాళం కాని తాళం | పాతాళం | వెల కాని వెల | కోవెల |
| ధారం కాని దారం | మందారం | హారం కాని హారం | ఆహారం |
| పండు కాని పండు | విభూది పండు | మానం కాని మానం | అవమానం |

## హల్లులతో కూడి పలికెడు గుణింతము

| | ˇ | ా | ి | ీ | ు | ూ | ృ | ౄ | ె | ే | ై | ొ | ో | ౌ | ం | ః |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్ | క | కా | కి | కీ | కు | కూ | కృ | కౄ | కె | కే | కై | కొ | కో | కౌ | కం | కః |
| ఖ్ | ఖ | ఖా | ఖి | ఖీ | ఖు | ఖూ | ఖృ | ఖౄ | ఖె | ఖే | ఖై | ఖొ | ఖో | ఖౌ | ఖం | ఖః |
| గ్ | గ | గా | గి | గీ | గు | గూ | గృ | గౄ | గె | గే | గై | గొ | గో | గౌ | గం | గః |
| ఘ్ | ఘ | ఘా | ఘి | ఘీ | ఘు | ఘూ | ఘృ | ఘౄ | ఘె | ఘే | ఘై | ఘొ | ఘో | ఘౌ | ఘం | ఘః |
| చ్ | చ | చా | చి | చీ | చు | చూ | చృ | చౄ | చె | చే | చై | చొ | చో | చౌ | చం | చః |
| ఛ్ | ఛ | ఛా | ఛి | ఛీ | ఛు | ఛూ | ఛృ | ఛౄ | ఛె | ఛే | ఛై | ఛొ | ఛో | ఛౌ | ఛం | ఛః |
| జ్ | జ | జా | జి | జీ | జు | జూ | జృ | జౄ | జె | జే | జై | జొ | జో | జౌ | జం | జః |
| ట్ | ట | టా | టి | టీ | టు | టూ | టృ | టౄ | టె | టే | టై | టొ | టో | టౌ | టం | టః |
| డ్ | డ | డా | డి | డీ | డు | డూ | డృ | డౄ | డె | డే | డై | డొ | డో | డౌ | డం | డః |
| ఢ్ | ఢ | ఢా | ఢి | ఢీ | ఢు | ఢూ | ఢృ | ఢౄ | ఢె | ఢే | ఢై | ఢొ | ఢో | ఢౌ | ఢం | ఢః |
| ణ్ | ణ | ణా | ణి | ణీ | ణు | ణూ | ణృ | ణౄ | ణె | ణే | ణై | ణొ | ణో | ణౌ | ణం | ణః |
| త్ | త | తా | తి | తీ | తు | తూ | తృ | తౄ | తె | తే | తై | తొ | తో | తౌ | తం | తః |
| థ్ | థ | థా | థి | థీ | థు | థూ | థృ | థౄ | థె | థే | థై | థొ | థో | థౌ | థం | థః |
| ద్ | ద | దా | ది | దీ | దు | దూ | దృ | దౄ | దె | దే | దై | దొ | దో | దౌ | దం | దః |
| ధ్ | ధ | ధా | ధి | ధీ | ధు | ధూ | ధృ | ధౄ | ధె | ధే | ధై | ధొ | ధో | ధౌ | ధం | ధః |
| న్ | [illegible] | నా | ని | నీ | ను | నూ | నృ | నౄ | నె | నే | నై | నొ | నో | నౌ | నం | నః |
| ప్ | [illegible] | పా | పి | పీ | పు | పూ | పృ | పౄ | పె | పే | పై | పొ | పో | పౌ | పం | పః |
| ఫ్ | [illegible] | ఫా | ఫి | [illegible] | ఫు | ఫూ | ఫృ | ఫౄ | ఫె | ఫే | ఫై | ఫొ | ఫో | ఫౌ | ఫం | ఫః |
| బ్ | [illegible] | బా | బి | [illegible] | బు | బూ | బృ | [illegible] | బె | బే | బై | బొ | బో | బౌ | బం | బః |
| భ్ | [illegible] | భా | భి | [illegible] | భు | భూ | భృ | [illegible] | భె | భే | భై | భొ | భో | భౌ | భం | భః |
| [illegible] | [illegible] | మా | [illegible] | [illegible] | ము | [illegible] | మృ | [illegible] | మె | మే | మై | మొ* | మో | మౌ | మం | మః |
| [illegible] | [illegible] | యా | [illegible] | [illegible] | యు | [illegible] | యృ | యౄ | యె | యే | యై | యొ* | యో | యౌ | యం | యః |
| [illegible] | [illegible] | రా | రి | రీ | రు | రూ | రృ | రౄ | రె | రే | రై | రొ | రో | రౌ | రం | రః |
| [illegible] | [illegible] | లా | లి | లీ | లు | లూ | లృ | లౄ | లె | లే | లై | లొ | లో | లౌ | లం | లః |
| వ్ | వ | వా | వి | వీ | వు | వూ | వృ | వౄ | వె | వే | వై | వొ | వో | వౌ | వం | వః |
| శ్ | శ | శా | శి | శీ | శు | శూ | శృ | శౄ | శె | శే | శై | శొ | శో | శౌ | శం | శః |
| ష్ | ష | షా | షి | షీ | షు | షూ | షృ | షౄ | షె | షే | షై | షొ | షో | షౌ | షం | షః |
| స్ | స | సా | సి | సీ | సు | సూ | సృ | సౄ | సె | సే | సై | సొ | సో | సౌ | సం | సః |
| హ్ | హ | హా | హి | హీ | హు | హూ | హృ | హౄ | హె | హే | హై | హొ | హో | హౌ | హం | హః |

* ప్రస్తుతం వీటిని 'మొ, యొ' గా రాస్తున్నారు

## వత్తులు - సంయుక్తాక్షరములు

| | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క్క | క్గ | క్ట | క్డ | క్త | క్ద | క్ధ | క్న | క్ప | క్బ | క్మ | క్య | క్ర | క్ల | క్వ | క్శ | క్ష | క్స |
| ఖ్క | ఖ్గ | ఖ్ట | ఖ్డ | ఖ్త | ఖ్ద | ఖ్ధ | ఖ్న | ఖ్ప | క్బ | ఖ్మ | ఖ్య | ఖ్ర | ఖ్ల | ఖ్వ | ఖ్శ | ఖ్ష | ఖ్స |
| గ్క | గ్గ | గ్ట | గ్డ | గ్త | గ్ద | గ్ధ | గ్న | గ్ప | గ్బ | గ్మ | గ్య | గ్ర | గ్ల | గ్వ | గ్శ | గ్ష | గ్స |
| ఘ్క | ఘ్గ | ఘ్ట | ఘ్డ | ఘ్త | ఘ్ద | ఘ్ధ | ఘ్న | ఘ్ప | ఘ్బ | ఘ్మ | ఘ్య | ఘ్ర | ఘ్ల | ఘ్వ | ఘ్శ | ఘ్ష | ఘ్స |
| చ్క | చ్గ | చ్ట | చ్డ | చ్త | చ్ద | చ్ధ | చ్న | చ్ప | చ్బ | చ్మ | చ్య | చ్ర | చ్ల | చ్వ | చ్శ | చ్ష | చ్స |
| ఛ్క | ఛ్గ | ఛ్ట | ఛ్డ | ఛ్త | ఛ్ద | ఛ్ధ | ఛ్న | ఛ్ప | ఛ్బ | ఛ్మ | ఛ్య | ఛ్ర | ఛ్ల | ఛ్వ | ఛ్శ | ఛ్ష | ఛ్స |
| జ్క | జ్గ | జ్ట | జ్డ | జ్త | జ్ద | జ్ధ | జ్న | జ్ప | జ్బ | జ్మ | జ్య | జ్ర | జ్ల | జ్వ | జ్శ | జ్ష | జ్స |
| ఝ్క | ఝ్గ | ఝ్ట | ఝ్డ | ఝ్త | ఝ్ద | ఝ్ధ | ఝ్న | ఝ్ప | ఝ్బ | ఝ్మ | ఝ్య | ఝ్ర | ఝ్ల | ఝ్వ | ఝ్శ | ఝ్ష | ఝ్స |
| ట్క | ట్గ | ట్ట | ట్డ | ట్త | ట్ద | ట్ధ | ట్న | ట్ప | ట్బ | ట్మ | ట్య | ట్ర | ట్ల | ట్వ | ట్శ | ట్ష | ట్స |
| ఠ్క | ఠ్గ | ఠ్ట | ఠ్డ | ఠ్త | ఠ్ద | ఠ్ధ | ఠ్న | ఠ్ప | ఠ్బ | ఠ్మ | ఠ్య | ఠ్ర | ఠ్ల | ఠ్వ | ఠ్శ | ఠ్ష | ఠ్స |
| డ్క | డ్గ | డ్ట | డ్డ | డ్త | డ్ద | డ్ధ | డ్న | డ్ప | డ్బ | డ్మ | డ్య | డ్ర | డ్ల | డ్వ | డ్శ | డ్ష | డ్స |
| ఢ్క | ఢ్గ | ఢ్ట | ఢ్డ | ఢ్త | ఢ్ద | ఢ్ధ | ఢ్న | ఢ్ప | ఢ్బ | ఢ్మ | ఢ్య | ఢ్ర | ఢ్ల | ఢ్వ | ఢ్శ | ఢ్ష | ఢ్స |
| ణ్క | ణ్గ | ణ్ట | ణ్డ | ణ్త | ణ్ద | ణ్ధ | ణ్న | ణ్ప | ణ్బ | ణ్మ | ణ్య | ణ్ర | ణ్ల | ణ్వ | ణ్శ | ణ్ష | ణ్స |
| త్క | త్గ | త్ట | త్డ | త్త | త్ద | త్ధ | త్న | త్ప | త్బ | త్మ | త్య | త్ర | త్ల | త్వ | త్శ | త్ష | త్స |
| థ్క | థ్గ | థ్ట | థ్డ | థ్త | థ్ద | థ్ధ | థ్న | థ్ప | థ్బ | థ్మ | థ్య | థ్ర | థ్ల | థ్వ | థ్శ | థ్ష | థ్స |
| ద్క | ద్గ | ద్ట | ద్డ | ద్త | ద్ద | ద్ధ | ద్న | ద్ప | ద్బ | ద్మ | ద్య | ద్ర | ద్ల | ద్వ | ద్శ | ద్ష | ద్స |
| ధ్క | ధ్గ | ధ్ట | ధ్డ | ధ్త | ధ్ద | ధ్ధ | ధ్న | ధ్ప | ధ్బ | ధ్మ | ధ్య | ధ్ర | ధ్ల | ధ్వ | ధ్శ | ధ్ష | ధ్స |
| న్క | న్గ | న్ట | న్డ | న్త | న్ద | న్ధ | న్న | న్ప | న్బ | న్మ | న్య | న్ర | న్ల | న్వ | న్శ | న్ష | న్స |
| ప్క | ప్గ | ప్ట | ప్డ | ప్త | ప్ద | ప్ధ | ప్న | ప్ప | ప్బ | ప్మ | ప్య | ప్ర | ప్ల | ప్వ | ప్శ | ప్ష | ప్స |
| ఫ్క | ఫ్గ | ఫ్ట | ఫ్డ | ఫ్త | ఫ్ద | ఫ్ధ | ఫ్న | ఫ్ప | ఫ్బ | ఫ్మ | ఫ్య | ఫ్ర | ఫ్ల | ఫ్వ | ఫ్శ | ఫ్ష | ఫ్స |
| బ్క | బ్గ | బ్ట | బ్డ | బ్త | బ్ద | బ్ధ | బ్న | బ్ప | బ్బ | బ్మ | బ్య | బ్ర | బ్ల | బ్వ | బ్శ | బ్ష | బ్స |
| భ్క | భ్గ | భ్ట | భ్డ | భ్త | భ్ద | భ్ధ | భ్న | భ్ప | భ్బ | భ్మ | భ్య | భ్ర | భ్ల | భ్వ | భ్శ | భ్ష | భ్స |
| మ్క | మ్గ | మ్ట | మ్డ | మ్త | మ్ద | మ్ధ | మ్న | మ్ప | మ్బ | మ్మ | మ్య | మ్ర | మ్ల | మ్వ | మ్శ | మ్ష | మ్స |
| య్క | య్గ | య్ట | య్డ | య్త | య్ద | య్ధ | య్న | య్ప | య్బ | య్మ | య్య | య్ర | య్ల | య్వ | య్శ | య్ష | య్స |
| ర్క | ర్గ | ర్ట | ర్డ | ర్త | ర్ద | ర్ధ | ర్న | ర్ప | ర్బ | ర్మ | ర్య | ర్ర | ర్ల | ర్వ | ర్శ | ర్ష | ర్స |
| ల్క | ల్గ | ల్ట | ల్డ | ల్త | ల్ద | ల్ధ | ల్న | ల్ప | ల్బ | ల్మ | ల్య | ల్ర | ల్ల | ల్వ | ల్శ | ల్ష | ల్స |
| ళ్క | ళ్గ | ళ్ట | ళ్డ | ళ్త | ళ్ద | ళ్ధ | ళ్న | ళ్ప | ళ్బ | ళ్మ | ళ్య | ళ్ర | ళ్ల | ళ్వ | ళ్శ | ళ్ష | ళ్స |
| వ్క | వ్గ | వ్ట | వ్డ | వ్త | వ్ద | వ్ధ | వ్న | వ్ప | వ్బ | వ్మ | వ్య | వ్ర | వ్ల | వ్వ | వ్శ | వ్ష | వ్స |
| శ్క | శ్గ | శ్ట | శ్డ | శ్త | శ్ద | శ్ధ | శ్న | శ్ప | శ్బ | శ్మ | శ్య | శ్ర | శ్ల | శ్వ | శ్శ | శ్ష | శ్స |
| ష్క | ష్గ | ష్ట | ష్డ | ష్త | ష్ద | ష్ధ | ష్న | ష్ప | ష్బ | ష్మ | ష్య | ష్ర | ష్ల | ష్వ | ష్శ | ష్ష | ష్స |
| స్క | స్గ | స్ట | స్డ | స్త | స్ద | స్ధ | స్న | స్ప | స్బ | స్మ | స్య | స్ర | స్ల | స్వ | స్శ | స్ష | స్స |
| హ్క | హ్గ | హ్ట | హ్డ | హ్త | హ్ద | హ్ధ | హ్న | హ్ప | హ్బ | హ్మ | హ్య | హ్ర | హ్ల | హ్వ | హ్శ | హ్ష | హ్స |

## రెండు అక్షరముల మాటలు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అల | ఖైదు | జీడి | దార | పైరు | భేరి | రమ | శిగ |
| ఆట | ఝాన్సీ | జూలు | దోమ | పొడి | భోగి | రాజు | శీల |
| ఇది | గద | జేబు | దొడు | పోరు | మర | రీతి | శుచి |
| ఈగ | గారె | జైలు | ధర | ఫాను | మామ | రుచి | శూల |
| ఉలి | గీత | జోడు | ధార | బల | మిష | రూక | శృతి |
| ఊరు | గుడి | టపా | ధీర | బావ | మీట | రేకు | శైల |
| ఋషి | గూడ | టేకు | ధుని | బిగి | మృతి | రైలు | శోభ |
| ఎర | గృహ | టోపీ | ధూళి | బీద | ముడి | రొద | శౌరి |
| ఏరు | గెల | ఠీవి | నది | | | రోజు | షరా |
| ఐదు | గేదె | డాబు | నావ | | | రౌతు | షోకు |
| ఒర | గోరు | డేగ | నిధి | | | లత | సతి |
| ఓడ | గౌరి | డోలు | నీరు | | | లావు | సాము |
| ఔర | ఘన | తల | నుడి | | | లిపి | సిరి |
| కల | ఘాటు | తాత | నూనె | | | లీల | సీమ |
| కాకి | ఘోష | తిను | నృప | | | లూట | సుధ |
| కింద | చలి | తీగ | నెల | | | లెగ | సూది |
| కీడు | చాప | తూము | నేత | | | లేడి | సెగ |
| కుల | చితి | తృటి | నోరు | బుస | మూత | లోభి | సేవ |
| కూత | చీమ | తెర | నౌక | బూర | మెడ | వస | సైగ |
| కృషి | చుర | తేలు | పని | బేల | మేక | వాన | సొర |
| కెంపు | చూపు | తొడ | పాప | బైట | మైలు | విధి | సోది |
| కేక | చెడు | తోక | పిడి | బోను | మొర | వీణ | సౌరు |
| కొవ | చేప | తాడు | పీట | భాష | మోము | వృక్ష | హరి |
| కోతి | చోటు | దశ | పులి | భిక్ష | మౌళి | వెల | హాయి |
| కౌజు | చౌక | దాత | ఫీజు | భీతి | యతి | వేట | హిమ |
| ఖని | జడ | దిశ | పూవు | భుజ | యాస | వైరి | హీన |
| ఖాళీ | జాతి | దెస | పెను | భూమి | యువ | వోటు | హేల |
| ఖూనీ | జిల | దేవి | పేరు | భృగి | యోగి | శర | హైమ |
| | | | | | | శాఖ | హోలి |

## మూడు అక్షరముల మాటలు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అరక | గృహము | తివాచి | నాలుక | పేలాలు | భజన | రూపము |
| ఆపద | గెలుపు | తీరిక | నిజము | పైకము | భారతి | రేవతి |
| ఇటుక | గేయము | తులసి | నీచుడు | పొలము | భీముడు | లవుడు |
| ఈనెలు | గొడుగు | తూనీగ | నుదురు | పోలిక | భుజము | లాభము |
| ఉడుము | గోరులు | తృణము | నూకలు | ఫలము | భూతము | లోభము |
| ఊయల | ఘనము | తెమడ | నెలత | ఫాలము | భేదము | వనము |
| ఋతువు | చరఖా | తేజము | నేరేడు | బకము | భోగము | వాలము |
| ఎలుక | చారుడు | తైలము | నొసలు | బాలుడు | మదము | విషము |
| ఏనుగు | చిలక | తొడిమ | నౌకరు | బికారి | మామిడి | వీరుడు |
| ఒకటి | చీకటి | తోడేలు | పడగ | బీగము | మిడుత | వెదురు |
| ఓటమి | చూపులు | దసరా | పాపము | బురద | మీగడ | వేసవి |
| కలువ | చెదలు | దానము | పిడక | బూడిద | మునగ | వైనము |
| కానుక | చేనేత | దినము | | | మూలము | శరము |
| కిరీటి | చోరుడు | దీపము | | | మృతుడు | శాపము |
| కీరము | జలము | దూషణ | | | మెతుకు | శివుడు |
| కుడుము | జాతర | దృఢము | | | మేషము | శుకుడు |
| కూపము | జిగురు | దేవర | | | మైనము | శూరుడు |
| కొలను | జీతము | దైవము | | | మోసము | శేషుడు |
| కోకిల | జులాయి | ధనము | | | యముడు | శైవము |
| గజము | జూదము | ధీరుడు | | | యాగము | శోకము |
| గానము | జేజేలు | ధూపము | పీతిక | బెదురు | యుగము | శౌచము |
| గిలక | జైనుడు | ధేనువు | పులుసు | బేరము | రణము | సరదా |
| గీతము | తపము | ధోరణి | పూతన | బైరాగి | రాకాసి | సామెత |
| గులాబీ | తాబేలు | నలుడు | పెదవి | బొమిక | రుణము | సిరము |

## నాలుగు అక్షరముల మాటలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అలసట | గొణుగుడు | తీగెచాటు | నారదుడు | బిడారము | రహస్యము |
| ఆహారము | గోదావరి | తురగము | నిముషము | బీరకాయ | రాజఠీవి |
| ఇవతల | గౌరవము | తూలనాడు | నీలవేణి | బురబుర | ఋణదాత |
| ఈశ్వరుడు | ఘాతకుడు | తెలవారు | నూతనము | బూటకము | రేచీకటి |
| ఉదరము | చదరము | తేటమాట | నెరజాణ | బృహస్పతి | రోదనము |
| ఊరగాయ | చామరము | తొడుమూట | నేతిబీర | బెండకాయ | లవణము |
| ఎగతాళి | చిగురాకు | తొలకరి | నైలునది | బేరగాడు | లాలనము |
| ఏరువాక | చీలికలు | తోరణము | నౌకాయాన | బోసినోరు | లోలకము |
| ఐశ్వర్యము | చులకన | దవనము | పడమర | భరతుడు | లౌకికము |
| ఒరవడి | చూపరులు |  | | భారమితి | వదనము |
| ఓడరేవు | చెడుగుడు | | | భీకరము | వామనుడు |
| ఔదార్యము | చేతబడి | | | భువనము | వాలుజడ |
| కమలము | చోదకుడు | | | భూతదయ | విహారము |
| కాగితము | ఛత్రపతి | | | భోజనము | వీడుకోలు |
| కిరీటము | జగడము | | | భౌతికము | వేగిరము |
| కుమారుడు | జాగరణ | | | మహారాజు | వైతరణి |
| కూలివాడు | జిలజిల | | | మాటకారి | శిశిరము |
| కృషీవల | జీవితము | | | మిరియము | శీతలము |
| కెరటము | జులపాలు | దానవుడు | పాతకుడు | మీనరాశి | శునకము |
| కేతనము | జూదగాడు | దివిజుడు | పీకులాట | ముదుసలి | శూలపాణి |
| కైలాసము | జోగులాట | దీవెనలు | పురుషుడు | మూషికము | శోధనము |
| కొలతలు | ఝంకారము | దుమారము | పూతరేకు | మెలకువ | సమూహము |
| కోడెదూడ | టకటక | దూషణము | పెనుగాలి | మేనమామ | సాగరము |
| కౌపీనము | టాకుటీకు | దృష్టాంతము | పేదరాలు | మైనాకుడు | సీమరేగు |
| ఖర్వాటుడు | డమరము | దేవళము | పైరుగాలి | మొనగాడు | సూరదాసు |
| గరళము | డాబుసరి | దొరబాబు | పొరపాటు | మోసగాడు | సెనగలు |
| గాయకుడు | డేగచూపు | దోసపాదు | పోరాటము | యమగోల | సేవకుడు |
| గిరగిర | డోలకము | దౌర్జన్యము | పౌరుషము | యాదవులు | సైనికుడు |
| గునపము | తరగతి | ధనియాలు | ఫలితము | యువరాజు | సొగసరి |
| గూనివాడు | తామసము | ధారాళము | బలపము | యోజనము | సౌదామిని |
| గెలిచేయు | తిరుగలి | నకులుడు | బానమీద | యౌవనము | హృదయము |

# వ్యవహార పదజాలము

**అడవి జంతువులు**

అడవి దున్న
ఎలుగుబంటు
ఏనుగు
ఓరాంగ్ఉటాన్
కణుజు
కోతి
ఖడ్గమృగం
గొరిల్లా
చింపాంజీ
చిరుతపులి
జిరాఫీ
దుప్పి
పెద్దపులి
లేడి
సింహం
హిప్పోపొటమస్

**ఆకుకూరలు**

ఉల్లికోళ్లు
కరివేపాకు
కాలీఫ్లవరు (గోబీ)
కొత్తి[illegible]
[illegible]
గో[illegible]
ము[illegible]కూర
తో[illegible]కూర
పాలకూర
పొన్నగంటికూర
బచ్చలికూర
మునగకూర
మెంతికూర
సెలరీ

**ఎండుపప్పులు,పండ్లు**

అంజూర
ఆల్‌బుకారా
కిస్‌మిస్
కుర్బానీ
ఖర్జూర
జీడిపప్పు
ద్రాక్ష
పిస్తా
బాదం
వాల్‌నట్
వేరుసెనగ
సారపప్పు

**ఓషధులు**

అక్కలకర్ర
అత్తిపత్తి
అశ్వగంధి
ఈశ్వరి
తెల్ల నల్ల
ఉత్తరేణి
ఉమ్మెత్త
కృష్ణతులసి
రామతులసి
కలబంద
కలిం[illegible]ష్ట్రం
గాడి[illegible]
సుం[illegible]
చిత్ర[illegible]లం
దుం[illegible]స్త్రం
నేపాళం
బిల్వపత్రం
బిళ్లగన్నేరు
బ్రహ్మదండి
బ్రాహ్మి
ముషిణి
రుద్రజడ
వాము
సరస్వతీ ఆకు
సర్పగంధి
సుగంధి
సునాముఖి

**కలప చెట్లు**

అంకుడు
ఇరుగుడు చేవ
ఏగిస
టేకు
బండారు
నేరేడు
బిల్లు
రక్తచందనం
మద్ది
వెదురు
సాల
పొణుకు

**కీటకాలు**

కందిరీగ
కీచురాయి
గండు చీమ
గొంగళి పురుగు
గొల్లభామ
చిమ్మట
చీమ
చెదపురుగు
జెర్రి
తూనీగ
తేనెటీగ
తేలు
దోమ
నల్లి
పట్టుపురుగు
పురికొస
పేను
బొద్దింక
మిడుత
మిణుగురు పురుగు
రోకలిబండ
సాలీడు
సీతాకోక చిలుక

**కూరగాయలు**

ఉల్లి
కాకరకాయ
టమాట
దోస
పచ్చిమిర్చి
పొట్ల
బీర
బూడిద గుమ్మడి
బెండకాయ
ములక్కాడ
ముల్లంగి
వంకాయ
సూరే గుమ్మడి
సొరకాయ

**చెట్లు**

ఉసిరి
గానుగ
చింత
తుమిక
తుమ్మ
దిరిసన
పనస
బూరుగు
మర్రి
మామిడి
మోదుగ
యూకలిప్టస్
రెల్ల
సరుగుడు (ఈల)
సుబాబుల్
వాక
వేప

**చేతి పనిముట్లు**

ఉలి
కట్టింగ్ ప్లైయర్స్

గునపం
డబుల్ స్పేనర్
పట్టకారు
పార
బాడిశె
మంకీ రెంచ్
స్క్రూడ్రైవర్
స్పేనర్
సుత్తి
సి ('C') క్లాంప్
రంపం

**చేపలు**

ఇంగిలాయి
ఇసుకదొందు
కట్టచేప
కొర్రమీను
గండుమీను
చావడాయి
జెల్ల
టేకి
తమ్మరొట్ట
పండుగప్ప
పరిగ
పాలబొంత
పులస
బేడిస
బొచ్చె
బొమ్మిడాయి
మాగ
మోజు
రవ
రాములు
వాలుగ
సార

**తాళజాతి**

ఆయిల్ పామ్
ఈత
ఖర్జూరం
తాడి

కొబ్బరి
పోక

**దుంపకూరలు**

కంద
కారటు
గాజర
చామ
చిరుగడ
టర్నిపు
పెండ్లం
బంగాళదుంప(ఆలూ)
బీటు
నూల్‌కోల్

**ధాన్యాలు**

ఆరికెలు
ఓట్లు
గంటెలు
గోధుమ
జొన్న
బార్లీ
మొక్కజొన్న
రాగులు (చోళ్లు)
వరి
వరిగలు
సజ్జలు (బజ్రా)
సోమలు

**నిమ్మ జాతి**

గజనిమ్మ
దబ్బ (నార-పుల్ల)
నారింజ
నిమ్మ
పంపర పనస
బత్తాయి
మాదీఫలం
మొసంబి (చీనీ)
సంత్రా (కమలా నారింజ)
సాత్కుడి

**నీటిని తోడే సాధనాలు**

ఏతం
కారెం
కాలువ పారుదల
కుండ ఏతం
గూడ
చిలుకు పారుదల
చుక్కపారుదల (డ్రిప్)
చేద
తొక్కుడు ఏతం
పంపుసెట్టు
పికోటా
ఫిల్టరు పాయింటు
బాల్చి
బోరు
మరకారెం
మోట
రహాట్

**నూనె గింజలు**

అవిసె
ఆముదాలు
ఆయిల్ పామ్
ఆవాలు
కుసుమలు
గడ్డి నువ్వులు
నువ్వులు
పత్తి గింజలు
పొద్దు తిరుగుడు
వేరు సెనగలు

**నేల పక్షులు**

ఉష్ట్రపక్షి
కాకి
కొంగ
కోడి
కౌజు
గద్ద
గుడ్లగూబ
గువ్వ
గోరువంక
జెముడు కాకి

డేగ
తీతువ పిట్ట
నెమలి
పసుల పోలిగాడు
పాలపిట్ట
పావురం
పిచ్చుక
పెంగ్విన్
బాతు
భరతపక్షి
రాబందు
రామచిలుక
వడ్రంగి పిట్ట

**పండ్లు**

అనాస
అరటి
ఆపిలు
ఈత
జామ
తాటి
దానిమ్మ
మామిడి
నారింజ
నేరేడు
పనస
బొప్పాయి
రేగు
సపోటా

**పప్పుదినుసులు**

(అపరాలు)
అనుములు
అలచంద
ఉలవ
కంది
చిక్కుడు
పిల్లిపెసర
పెసర
బఠాణీ
బొబ్బర
మినుప
సెనగ



**నీటిని తోడే సాధనములు :**

1. కుండ ఏతము (ఒక మనిషి లాగునది); 2. మోట; 3. తొక్కుడు ఏతము; 4. గూడ; 4. రహట్; 6. మరకారెము (ఆర్కి మెడియన్ స్క్రూ); 7. ఫిల్టర్ పాయింట్ (బోరు); 8. ఎలక్ట్రిక్ పంపు సెట్టు (బావినుండ); 9. చుక్క పారుదల(డ్రిప్); 10. చిలుకు పారుదల (స్ప్రే ఇరిగేషన్)

### పరిమళ ఓషధులు

దవనము
నిమ్మగడ్డి (సిట్రనెల్లా)
నేల సంపంగి
పచేలీ మల్లె
పన్నీరు (జెరేనియం)
మరువము
మాచిపత్రి
రూపాగడ్డి
(పామరోజా)

### పరిమళ ద్రవ్యాలు

కర్పూరం
చందనం
తమలపాకు
బావంచాలు
మంచిగంధం
వక్క
వట్టివేరు

### పువ్వులు

కనకాంబరం
కలువ
గులాబీ
చామంతి
తామర పువ్వు
నీల గోరింత
బంతి
మందార
మల్లె
ముద్ద మందార
మొగలి
విరజాజి
సంపంగి
సన్న జాజి

### పెంపుడు జంతువులు

ఆవు
ఎద్దు
కుందేలు
కుక్క
గాడిద
గుర్రం
గేదె/బర్రె
గొర్రె
దున్నపోతు
లేగదూడ
పిల్లి
మేక

### బంధు వర్గము

అమ్మ/ తల్లి
అమ్మమ్మ/నాయనమ్మ
అయ్య/తండ్రి/ నాన్న
అల్లుడు/కోడలు
అవ్వ/ తాత
చెల్లెలు, అక్క
తమ్ముడు, అన్న
పినతండ్రి (బాబాయి)
పిన్ని
పెద నాన్న
బావ/మరదలు
మనుమడు/మనుమరాలు
మేనకోడలు
మేనల్లుడు
మేనమామ/మామ
మేనత్త / అత్త
వదిన

### మత్తు పదార్థాలు

కల్లు
కాఫీ
కోకో
గంజాయి (మారిజానా)
తేయాకు (టీ)
నల్లమందు
బ్రాందీ
విస్కీ
సారాయి

### మన్యం సరుకు

ఇప్పపువ్వు
కస్తూరి
కుంకుడు
గుగ్గిలం
చింతపండు
చేదుకట్టు
జవ్వాది
పుట్టతేనె
పునుగు
పులిగోరు
లక్క
సాంబ్రాణి (గస్స పలుకు)

### రసవిషపాషాణాలు

గరళం
గోరోజనం
నాభి
నేపాళం
పాదరసం
పాషాణం
పుదీనా పువ్వు
రసకర్పూరం
రొయ్యపీత
వాంపువ్వు
హరిదళం

### వృత్తులు

కంచర
కమ్మరి
కుమ్మరి
చాకలి
చెప్పులు కుట్టేపని
దర్జీ
మంగలి
వడ్రంగి
సాలె
స్వర్ణకారుడు(కంసాలి)

### సముద్రపుదినుసులు

ఆలుచిప్ప
గవ్వ
గాజురొయ్య
గుల్ల
చితుకు
నత్త
తాబేలు
నీలకంఠరొయ్య
పగడం
పీత
పులిరొయ్య
ముత్యం
రొయ్య
శంఖు
సొరపే

### సుగంధ ద్రవ్యాలు

అల్లం
ఆకుపత్రి
ఆవాలు
ఇంగువ
ఏలకులు
కరక్కాయ
కుంకుమపువ్వు
గసగసాలు
జాజికాయ
జాపత్రి
జీలకర్ర
దాల్చిన
ధనియాలు
పచ్చకర్పూరం
పసుపు
మిరియాలు
మిర్చి
మెంతులు
లవంగం
వాము
వావిటాలు
వెల్లుల్లి

## జాతీయములు - పదబంధములు

| | | | |
|---|---|---|---|
| అంతఃకలహం | ఆణిముత్యం | కచ్చాపచ్చగా | [illegible] |
| అంతేవాసి | ఆత్మగౌరవం | కంఠశోష | కాళ్లకింద నిప్పు[illegible] |
| అందెవేసినచేయి | ఆత్మతృప్తి | కట్టుబాటు | కులకాంత |
| అక్కునచేర్చుకొను | ఆమూలాగ్రం | కటికచీకటి | కుక్కినపేను |
| అగమ్యగోచరం | ఆర్థిక వ్యవస్థ | కటిక దారిద్ర్యం | కుడిభుజం |
| అజ్ఞాతవాసం | ఆవాహము | కడుపు తరుక్కు పోవుట | కుప్పిగంతులు |
| అట్టహాసము | అక్షతలు వేయుట | కనకవర్షం | కుమ్మరిపురుగులాతొలుచు |
| అడకత్తెర | అష్టదిగ్బంధనం | కర్తవ్యము | కుతకుతలాడుట |
| అడపాదడపా | ఇష్టానుసారం | కనకాభిషేకం | కూలంకషంగా |
| అడ్డచక్రం | ఇష్టారాజ్యం | కనులపండుగ | కొంగుబంగారము |
| అడ్డదిడ్డంగా | ఉదకాలాడడం | కన్నుకొట్టుట | కొంటెకోణంగి |
| అడ్డుపుల్ల | ఉడుతాభక్తిగా | కబుర్లపోగు | కొంపముంచుట |
| అత్యాచారం | ఉబుసుపోక | కప్పల తక్కెడ | కొనసాగుట |
| అధిక ప్రసంగం | ఉబ్బితబ్బిబ్బై | కరతలామలకం | కొమ్ములు మొలవడం |
| అణిగి మణిగి | ఉల్లాసం | కర్రపెత్తనం | కొరకురానికొయ్య |
| అనుకూలవతి | ఉలికిపడడం | కర్పూర నీరాజనం | కొల్లగొట్టడం |
| అనర్ఘరత్నం | ఊకదంపుడు | కలగాపులగం | కోలాహలము |
| అనివార్యం | ఊచకోత | కలగూరగంప | కోర్టుపక్షి |
| అపకారం | ఊతపదము | కవిలెకట్ట | కోటికి పడగెత్తడం |
| అపచారం | ఎండగట్టుట | కార్పణ్యం | క్రమవిరుద్ధం |
| అపప్రథ | ఎండమావులు | కార్యసిద్ధి | క్రమశిక్షణ |
| అప్రస్తుతప్రసంగం | ఎంతచెడ్డా | కాకలుతీరిన | క్రియాశూన్యత |
| అభిశంసించుట | ఎగనామం పెట్టు | కాకతాళీయం | ఖరాఖండిగా |
| అమాంబాపతు | ఎత్తుగడ | కాచివడపోయుట | గండపెండేరం |
| అరణ్యవాసం | ఎదురీత | కాలచక్రం | గండభేరుండం |
| అల్లకల్లోలం | ఏకగ్రీవము | కాలదోషం | గండరగండడు |
| అవకతవకలు | ఏకచ్ఛత్రాధిపత్యం | కాలధర్మం | గందరగోళం |
| అష్టదిగ్గజములు | ఏకాగ్రత | కాలయాపన | గంధర్వ గానం |
| ఆకురాయి | ఏతావాతా | కాలు జారుట | గగనకుసుమం |
| ఆకాశరామన్న | ఏరువాక | కాలుదువ్వుట | గజారోహణం |
| ఆకాశవాణి | ఒయ్యారపు నడక | కిటకిట | గట్టెక్కించటం |
| ఆగ్రహావేశాలు | కంకణము కట్టుకొనుట | కీకారణ్యం | గడ్డుకాలం |
| ఆజానుబాహుడు | కంచుకోట | కీడెంచి మేలెంచుట | గతంగతః |
| ఆటకట్టు | కంజాయింపు | కీలకపాత్ర | గతంగతః |
| ఆటుపోటు | కంటికి రెప్పలా | కీలుబొమ్మ | గతజల సేతుబంధం |

| | | | | |
|---|---|---|---|---|
| గప్పాలు కొట్టు | చిచ్చరపిడుగు | ఠికానా లేకపోవడం | ధర్మవిరుద్ధం | నీళ్ళువదలటం |
| గయ్యాళిగంప | చుట్టు ముట్టటం | డీలాపడు | ధర్మాసనం | నీళ్ళుపోసుకొనుట |
| గాంధీలెక్క | చెట్టపట్టాల్ | డొంకతిరుగుడు | వారినిపోయే దానయ్య | నూరిపోయుట |
| గావుకేక | చెట్టుకొక పిట్ట | తగినశాస్తి | దుంపతీయటం | నేతిబీరకాయ |
| గీటురాయి | చిత్తశాంతి | తగ్గుముఖం | దురదృష్టకరం | నేత్రపర్వం |
| గుండుగుత్తగా | చిత్త శుద్ధి | తలకు మించినపని | దురుద్దేశం | నోటికి తాళం |
| గుండెచెరువై పోవుట | చిన్నచూపు | తలంబ్రాలు | దిగ్గజము | పకడ్బందీగా |
| గుండెలు తీసిన బంటు | చిన్నబుచ్చటం | తలలోనాల్క | దివ్యక్షేత్రం | పంగనామాలు పెట్టటం |
| గుండెమీద కుంపటి | చిల్లిగవ్వ | తల పట్టుకొను | దృఢసంకల్పం | పండంటికాపురం |
| గుట్టుచప్పుడు కాకుండ | చిర్రుబుర్రులు | తలాతోక | దేవిడీమన్నా | పండితపుత్రుడు |
| గుణపాఠం | చిలక గోరింకల్లాగా | తారకమంత్రం | దెబ్బకొట్టడం | పటాపంచలు చేయటం |
| గుప్పెడు మనస్సు | చెక్కుచెదరకుండ | తాళిబొట్టు | దేహశుద్ధి | పట్టపగ్గాలులేవు |
| గుమాయింపు | చెవిలో పువ్వు పెట్టుట | తిరకాసు | దౌర్భాగ్యం | పట్టపగలు |
| గొర్రెతోక | చెవులుపట్టిఆడించుట | తిరుక్షవరం | నఖశిఖ పర్యంతం | పట్టిందెల్ల బంగారం |
| గొలుసుకట్టుగా | చేజారిపోవటం | తిలకాష్ఠమహిషబంధం | నగ్నసత్యం | పట్టుగొమ్మలు |
| గౌరవప్రదం | చేదు అనుభవం | తిలోదకాలు | నడుం బిగించటం | పడుగూ-పేక |
| ఘంటాపథం | చేదోడువాదోడు | తీపిగుర్తు | నయమార్గం | ప్రతీకారం |
| ఘననివాళి | చేయితిరిగిన వాడు | తుదముట్టించటం | నయవంచన | పంతగొండి |
| ఘనాపాఠీ | జగజెట్టి | తురపుముక్క | నయానోభయానో | పప్పులోకాలు |
| ఘోటకబ్రహ్మచర్యం | జగమొండి | తులసికోట | నర్మగర్భంగా | పరాకాష్ఠ |
| చక్రం తిప్పడం | జనసందోహం | తులసినీళ్ళు | నాలుక కరుచుకోవడం | పలుకరింత |
| చల్లనిమాట | జవసత్వాలు | తృణమో పణమో | నిండుకుండ | పల్లెత్తుమాట |
| చల్లని కబురు | జీవనమార్గం | తెల్లముఖం | నిర్వాకం | పిచ్చాపాటీ |
| చర్వితచర్వణం | జీవనసమరం | తొడకొట్టుట | నిప్పులు పోయడం | పిచ్చివాని చేతిరాయి |
| చూపుల గుర్రం | జీవితాంతం | తొడపాశం | నిలదీయడం | పితలాటకం |
| చాకిరేవు | జీర్ణోద్ధరణ | తోకముడుచు | నిలువుదోపిడి | పిత్రార్జితం |
| చాటిచెప్పుట | జైలుపక్షి | తూర్పార పట్టు | నీకూ నాకూ రాంరాం | పిల్లికూత |
| చాణక్యనీతి | టింగురంగా | దండకారణ్యం | నీతినియమాలు | పీటముడి |
| చాపకింద నీరులాగ | టోకరా కొట్టడం | ధర్మసంస్థాపనం | నీరుకారిపోవటం | పీడకల |
| చిక్కు సమస్య | టోపీ వేయడం | ధ్వజమెత్తటం | నీళ్ళు చల్లడం | పీతలమంగం |

పుంఖాను పుంఖాలుగా
పుట్టిమునుగుట
పుణికి పుచ్చుకొనటం
పుణ్యక్షేత్రం
పుత్రవాత్సల్యం
పునరుక్తి
పునరుద్ధరించటం
పునఃపరిశీలన
పునరుజ్జీవనం
పల్లుకొరకడం
పుల్ల విరుపుమాట
పులిఅడుగు
పులిపంజా
పులివేషం
పుష్పకవిమానం
పూజాపురస్కారాలు
పూర్వాశ్రమం
పూలపల్లకీ
పూసగుచ్చినట్టు
పెట్టి పుట్టినవాడు
పెద్దపీట
పెదవి విరవడం
పెళ్ళినూరేళ్ళ పంట
పేకమేడ
పైలాపచ్చీసు
పొగచూరటం
పొదరింటి పుల్లమార
ప్రాణప్రదం
ప్రాణప్రతిష్ఠ
బట్టబయలు
చేయటం
బడితపూజ

బతికి పోవడం
బలాత్కారం
బాకీశ్రీరామ
బాణాసంచా
బాదరబందీ
బాలారిష్టం
బెల్లంకొట్టిన రాయి
బొందెతో కైలాసం
బ్రహ్మరాత
బ్రహ్మవిద్య
భక్తిభావం
భగీరథప్రయత్నం
భరతవాక్యం
భల్లూకపుపట్టు
భార్యావిధేయుడు
భావగోపనం
భావవ్యక్తీకరణం
భీష్మప్రతిజ్ఞ
భీష్మించటం
భుజకీర్తులు
భుజబలం
మంగళం పాడటం
మంతనాలు
మంత్రసానిగండం
మంత్రదండం
మందగమనం
మందుపెట్టడం
మక్కికిమక్కీ
మట్టికరిపించటం
మటుమాయమగు
మడతపేచీ
మధురస్వప్నం

మనస్తాపం
మనసువిరగటం
మనోనిబ్బరం
మహాయజ్ఞం
మాటామంతీ
మాయోపాయం
మిడతంబొట్లు
మిసమిసలాడు
ముంజేతికంకణం
ముక్కుమీదవేలు
ముక్తాయింపు
ముత్యాలసరం
ముద్దుగుమ్మ
మునిగే పడవ
మూజువాణీ
మూణ్ణాళ్ళముచ్చట
మూలస్తంభం
మృతసంజీవని
మృష్టాన్నం
మెహర్బాణీ
మేక వన్నె పులి
మేజువాణి
మేలుబంతి
మేళతాళాలు
మొసలి కన్నీరు
యథాస్థితి
యమయాతన
రంగరంగవైభవం
రాగద్వేషములు
రాజనీతి
రామబాణం
రామరాజ్యం
రాజ్యవ్యవస్థ

రాసకేళి
రెంటికీచెడ్డరేవడు
లంకాదహనం
లబ్ధప్రతిష్ఠుడు
లబ్దిదారు
లావాదేవీలు
లోకవిదితం
లోకోభిన్నరుచి
లౌకికరాజ్యం
వగలాడి
వజ్రాయుధం
వడ్డించిన విస్తరి
వరప్రసాదం
వలలోవేసుకోవడం
వసుధైక కుటుంబం
వ్యవహారసరళి
వాగ్దానభంగం
వృత్తిధర్మం
వాగ్వివాదం
వాలుచూపు
వితండవాదన
విదురనీతి
వినసొంపు
విశ్వరూపం
విశ్వామిత్రసృష్టి
వెన్నుచూపుట
వెర్రివేషం
వెర్రిబాగులవాడు
విజయదుందుభి
వీరులతో పోరాటం
వ్యూహరచన
శ్రద్ధాంజలి
శల్యసారథ్యం శుశ్రూషణ శూన్యహృదయవేదన

శ్లాఘనీయం
శుష్కవాగ్దానం
శిథిలావస్థ
శిరోధార్యం
శిరోభారం
శూన్యహస్తాలు
శొంఠిపిక్క
శ్రీరామరక్ష
శ్రీకృష్ణజన్మస్థానం
శ్రుతపాండిత్యం
సంకల్పసిద్ధి
సత్యనిష్ఠాపరీక్ష
సంభ్రమాశ్చర్యం
సమాయత్తం
సమ్మోహనాస్త్రం
స్వర్గధామం
సర్వాంతర్యామి
సహజీవనం
సింహావలోకనం
సిగ్గుచేటు
సిరి, చుక్క,
మొగ్గ
సిద్ధహస్తుడు
సుఖశాంతులు
సుగ్రీవాజ్ఞ
సుదర్శనచక్రం
సూటీపోటీమాటలు
స్థితప్రజ్ఞుడు
స్వైరవిహారం
హస్తవాసి
హాలాహలం





## ప్రాసవాక్యములు

- అడుసు తొక్కనేల
  కాలు కడగనేల
- అలుక పూనరాదు
  అతిష కొట్టరాదు
- ఊరగలసి మనుము
  ఊని పనుల గనుము
- ఎక్కువైన బుద్ధి
  ఎక్కు కార్య సిద్ధి
- ఏకమగుట ఒప్పు
  ఏడ్పుటెపుడు ముప్పు
- ఐక్యమిచ్చు బలము
  ఐనదెల్ల శుభము
- ఒట్టి వాని మాట
  గట్టి నీళ్ళ మూట
- ఓటుమాట విడువు
  ఓర్పుమించి నడువు
- కట్టులేని నోరు
  కట్టతెగిన ఏరు
- కొంటె సిరుల నీటు
  కుంటి వాని దాటు
- గట్టిమాట నుడువు
  గర్వమంత విడువు
- గాజు గిన్నె సాటి
  రాజు కొలువు తోటి
- చదువులేని మొద్దు
  కదలలేనిఎద్దు
- చెప్పుకొనకు ఇచ్చి
  చెప్పకేగు లచ్చి
- జాటతనము తప్పు
  జూదమాడ ముప్పు
- టక్కు లెల్లవిడుము
  టాకి గాను నుడుము
- దుడుకు మాని నడువు
  దురుసు తనము విడువు
- దేవ దేవరమ్మ
  కావుమయ్య మమ్మ
- నయము తప్పవద్దు
  నడత చెడిన దిద్దు
- నారిలేని ఇల్లు
  నారిలేని విల్లు
- నీతిలేనివాడు
  కోతికంటె బీడు
- పాపబుద్ధి కలచు
  పాము చెలిమి చెరచు
- ప్రియము లేని విందు
  నయముగాని మందు
- మంచి విద్య చదువు
  మంచి బుద్ధి లొదవు
- మాట తప్పబోకు
  మంచి విడువబోకు
- మొదట ఇంట గెలువు
  పిదప రచ్చ గెలువు
- యతుల నిందవలదు
  యాచనెపుడు తగదు
- రచనమొకటి పలుకు
  వాదు లెపుడు జనకు
- రచ్చకెక్క నేల
  రవ్వసేయ నేల
- రాజులేని వూళ్ళు
  పూజలేని గుళ్ళు
- రూక లేని వాడు
  పోకచేయలేడు
- లాభమాని కూర్చు
  లోభకుడుదదీర్చు
- వినయమెప్పుడు గోరు
  ధనము లెస్సవారు
- సఖుల కీడు బాపు
  సాటివాని మేపు
- సతిని బొంది మెలగు
  సుతుల బింది చెలగు
- హానిపనికి దడువు
  హాస్యమెపుడు విడువు

## నీతి వాక్యములు

- అప్పిచ్చుట ముప్పు తెచ్చుటకే!
- అసత్యము ఆడరాదు.
- అసాధరణమైన ప్రజ్ఞ గలవాడు సుఖపడతాడు.
- ఆడినమాటతప్పరాదు.
- ఆన పెట్ట వలదు.
- ఆజ్ఞ మీరజనదు.
- ఆశకు లోబడరాదు.
- ఇంపు మాటలాడు.
- ఇష్ట వేల్పు కొలువు.
- ఈడు వాని గూడు.
- ఉత్తమాట బెండు.
- ఊసులాడ కుండు.
- ఎగతాళి మాటలాడకు.
- ఏమరుపాటునఉండకు
- ఒకరు జేసిన ఉపకారము మరవరాదు.
- ఒరులను నొప్పించకు.
- కండ బలముకన్న బుద్ధిబలము మిన్న.
- కత్తిపోటు కన్న కలము పోటు మిన్న.
- ఓర్పులేక చరించకు.
- కలనైన బొంకవద్దు.
- కలుపుమొక్క ఉంచవద్దు.
- కల్లమాటలాడరాదు.
- కాని చెలిమి చేయకు.
- చిన్న వారిని బెదిరించకు.
- జనత సమత తలపు.
- జాతి ఖ్యాతి నిలుపు.
- టక్కులేమి చేయకు.
- టక్కువాని కూడకు.
- డబ్బులెస్స గెలువు.
- డంబమొదలి నడువు.
- తగవు తలచ వద్దు.
- తన గొప్పతో ఇతరులను హీనపరచకు.
- తరుల కూల్చవద్దు.
- దానాలలో అన్నదానం గొప్ప.
- దురహంకారము మంచిదికాదు.
- దొంగసొమ్ము కొనకు.
- ధర్మచింత మానకు.
- ధనంకన్నా గుణంమిన్న.
- పరులకు ఉపకారమే చేయవలెను.
- పాపబుద్ధి విడువు.
- పిలువని పేరంటానికి పోరాదు.
- పెద్దల ఆశీర్వచనము వ్యర్థము కాదు.
- పెద్దలెంట నడువు.
- పేదలను అవమానించ రాదు.
- బంధువులను విడువరాదు.
- బాసలాడబోకు.
- భాగ్యముచే బంధువులను తృణీకించరాదు.
- భేషజాలు పోకు.
- మనవి వినుట ఒప్పు.
- మమత విడుట తప్పు.
- రహస్యాలు దాచు.
- రోగులను దయ చూడు.
- లాభమూని గూర్చు.
- లోతునీట దిగకు.
- లోభముడుగ దీర్చు.
- వంకర మాటలాడకు.
- విద్యాదాతను వీడకు.
- సభల యందు సిగ్గుమానాలి.
- సాధన పడని పనులు మానాలి.
- సొంపు సిరుల సలుపు.

# సద్బుద్ధి వాక్యములు

అంకె తప్పువేయ రాదు.
అడ్డు మాట చెప్ప రాదు.
అన్నమాట తప్ప రాదు.
అప్పు చేయవద్దు
అపకారము చేసినా వారికి ఉపకారమే చెయ్యాలి.
ఆకలితో ఉన్నవారికి అన్నము పెట్టాలి.
ఆడిన మాట తప్పరాదు.
ఓర్వలేనితనమును విడవాలి.
కలిమి వచ్చెనని గర్వపడరాదు.
కష్టపడిన వానికి సుఖము కలదు.
కలిమిన గర్వ పడవద్దు..
కల నైనా బొంక వద్దు
కీడు కోర రాదు.
కీర్తి పొందుటకు ప్రయత్నించాలి.
కొంటె చేష్టలు మానాలి.
కొండెములు చెప్పువానితో పగ పూనరాదు.
కోటివరహాలు ఇచ్చినా హీనుని.
కొలువకూడదు
గర్వపడరాదు.
గురుభక్తి ఉంచాలి.
గురువు చెప్పిన మాట నమ్మాలి.
చదువుకునే సమయము వ్యర్థం చేయరాదు.
చదువు మీద శ్రద్ధ ఉంచాలి.
చాడీలు చెప్పరాదు.
చెడు గుణము విడిచి పెట్టాలి.
చెడుపని చేయరాదు.
చెడ్డ చోటు విడిచి పెట్టాలి.
తనగుట్టు బయట పెట్ట గూడదు.
తప్పు నిజం చేయరాదు.
తనవాశ్రయించిన వానిని రక్షించాలి.
తన్నుతాను పొగడుకొనరాదు.
తల్లిదండ్రులను కష్టాలు పెట్టరాదు.
దేవుని నిందింపవద్దు.
దొంగలతో స్నేహము చేయరాదు.
దొంగసొమ్ము కొనరాదు.
ధర్మ చింతన మానరాదు.
నమ్మిన వారిని చెరుపరాదు.
పదిమంది వద్దనిన పని చేయ రాదు.
పరుల సొమ్ము కోరవద్దు.
పరుల నింద వేయవద్దు
పాపము చేయరాదు.
పుణ్యము చేయుచూ ఉండాలి.
పెద్దల మాట వినాలి.
పేదలమీదఎల్లప్పుడూ దయ ఉంచాలి.
ప్రజ్ఞ చెప్పుకొనరాదు.
మంచిగుణము విడువ రాదు.
మంచి చోటు చేరాలి.
మాయ చేయ రాదు.
యోగ్యత తెలిసి స్నేహము చెయ్యాలి.
రాజద్రోహము చేయరాదు.
రుచిగా ఉన్నదని చాలా తినరాదు.
లేమిని చింత పడవద్దు.
లోతు చూడకుండా నీళ్ళల్లో దిగవద్దు.
విద్య ఎంత వచ్చినను తృప్తి పడ రాదు.
విద్య చెప్పిన వారిని మరచి పోకూడదు.
శుచిశుభ్రతలు పాటించాలి.
సంపద ఉన్నదని గర్వించ రాదు.
సత్యము తప్ప రాదు.
సభలో నవ్వ రాదు.
సాధ్యముకాని పనికి పూన రాదు.
స్నేహముగల చోట అప్పుచేయరాదు.

## దృష్టాంత వాక్యములు

**అ**ణుకువుగా ఏరు నమ్రతతో సంచరించునట్టు వీరారు ఉపకారము సత్పురుషులకే చేయాలి. చెడ్డవానికి చేయరాదు. ఆవుకు గడ్డి వేసిన పాలు ఇస్తుంది. పామునకు పాలుపోసినా కరచి విషము కక్కుతుంది కదా!

***

**ఎ**ల్లప్పుడూ ప్రియవచనములు చెప్పువారికి మర్యాదను ఇస్తారు. కఠిన వచనములు చెప్పువారికి అవమానము కలుగుతూ ఉంటుంది. ఎల్లప్పుడూ వినసొంపుగా పలికే రామచిలుకకు పాలు పండ్లు పెట్టి పెంచుతారు. కఠినముగా 'కావు, కావు' మనే కాకిని రాళ్లతో తరుముతారు కదా!

***

**ఐ**శ్వర్యవంతుడు తన వద్దగల ధనమును పేదలకిచ్చి దరిద్రుడైనా కీర్తి హెచ్చును గాని తగ్గదు. సానపెట్టిన వజ్రము ఎత్తు తగ్గినా వెల హెచ్చిపోతుందిగాని తగ్గదు కదా!

***

**ఐ**శ్వర్యవంతునిగా పుట్టినా గుణములేని వానిని ఎవరూ దగ్గరకు రానివ్వరు. పేదవానికి పుట్టినా గుణముకలవానిని అందరూ అక్కున చేర్చుకొందురు. వాసన లేని గడ్డిపువ్వు ఎవ్వరికిని యోగ్యము కాదు. వాసనగల మల్లెపువ్వును అందరూ ధరింతురు గదా!

***

**దు**ష్టుని సహాయముతో ఏదైనా పని కావలసినప్పుడు వానితో కొంచెముగా సహవాసము చేయవలెను. మిక్కిలి సహవాసము చేయరాదు. తాంబూలము వేసికొనునప్పుడు సున్నమును కొద్దిగానే చేర్చుకుందురుగాని ఎక్కువగా చేర్చరు గదా!

***

**బ**లవంతుడు మీదకు వచ్చినప్పుడు వంగి నమ్రత చూపిన మేలు కలుగును. ఎదిరించిన చేటు కలుగును. ఏటి వరదకు వంగియున్న దర్భపోచలు మేలు పొందును. ఎదురు నిలచిన చెట్లు మానులుకూకటి వేళ్ళ పడి చేటు పొందును.

***

**బి**డ్డలకు చిన్నతనములో నేర్పిన విద్యలే లెస్సగా బుద్ధియందు పట్టును. రంగు నూతన వస్త్రమునకు పట్టినట్టు పాత వస్త్రమునకు పట్టదు కదా!

***

**మా**నవంతుడు తన కెంతో ప్రయాసము వచ్చినను గొప్ప పనినే కోరును గాని చిన్న చితకా, పనిని కోరడు. గ్రాసములేకను, ఆకలితోనున్న సింహం ఎప్పుడూ ఏనుగు కుంభస్థలం మీద మాంసమును కోరును గాని పచ్చి గడ్డిమేయలేదుకదా!

***

**రూ**పము చక్కగా ఉన్నంత మాత్రమున మంచివాడనియూ వంకరగా ఉన్నందున చెడ్డవాడనియు అనుటకు వీలులేదు. పనిని బట్టి అంచనా వేయాలి. చక్కగా వున్న బాణము చెడ్డపని చేయును. వంకరగా వున్న వీణ సప్తస్వరములు పలికి చెవుల కింపగును కదా!

# ద్వంద్వ వాక్యములు

## అవశ్యం చేయవలసిన పనులు

పితృవాక్యపాలనచే శ్రీరాముడు కీర్తి మంతు డయ్యాడు. మాతృవాక్యపాలనచే గరుడుడు యశస్సును పొందాడు. సత్యవ్రతంచే భీష్ముడు పొగడ్తకు అర్హుడయ్యాడు. ఓర్పు చేత ధర్మరాజు పూజ్యత నొందాడు. సత్యవాక్యపాలనచే హరిశ్చంద్రుడు ఖ్యాతిని ఆర్జించాడు. దానంచే బలిచక్రవర్తి నుతికెక్కాడు. పెద్దలు తలపెట్టిన పని నెరవేర్చుట చేత భగీరథునికి ప్రఖ్యాతి గలిగింది.

## ఎప్పుడూ చేయకూడని పనులు

అహంకారం వల్ల హిరణ్యకశిపుడు హాని పాలయ్యాడు. జూదమాడి నలచక్రవర్తి దుఃఖపడవలసి వచ్చింది. పరస్త్రీ మోహం చేత రావణుడు నాశనమయ్యాడు. పరుల ద్రవ్యాన్ని కాజేద్దామనే దురుద్దేశంతో దుర్యోధనుడు కీడు పాలయ్యాడు. సోదరుని పట్ల పగచేత వాలి మృతి చెందవలసి వచ్చింది.

## అమృతం

మంచిపనులు చేయువానికి స్వర్గమందునూ, చకోరాలకు చంద్రునియందునూ, చాతకము లకు మేఘాలందునూ పండి తులకు విద్య యందునూ, కవులకు వాక్కు నందునూ, భక్తులకు ఆరాధించే దైవ సమానులందునూ, రోగులకు ఔషధము లందునూ. అమృతం ఉండును.

## విషం

ఈగకు తలయందునూ, చోరులకు చేతు లందునూ, కాముకునకు కన్నులయందునూ, తేలుకు కొండియందునూ, చాడీలు చెప్పేవాడికి నాలుక యందునూ, మూర్ఖునకు నిలువెల్లనూ విషం ఉండును.

## ఎప్పుడూ సుగుణాలను విడచిపెట్టనివి

బంగారానికి పుటం పెట్టినా వన్నె మారదు. గంధపు చెక్కను ఎంత అరగతీసినా సువాసనను విడచిపెట్టదు. శంఖం భస్మమయినా తెలుపు మారదు. పాలు ఎంత మరిగినా రుచిపోదు. వజ్రాన్ని సాన పెట్టి అరగతీసినా కాంతి తగ్గదు. దాత ఎంత ధనరాశి తగ్గినా దాతృత్వం విడచిపెట్టడు. వీరుడు శత్రువులచే నరక బడినా పరాక్రమాన్ని త్యజించడు. మంచి వాడు ఎంత ప్రయాసపొందినా మర్యాద మాత్రం తప్పడు.

## ఎప్పుడూ దోషమును విడవనివి

పాముకు పాలు పోసినా విషం పోదు. కుక్క తోకను బద్దవేసి కట్టినా చక్కగా కాదు. వేపచెట్టుకు తేనె పోసి పెంచినా చేదుపోదు. గుడ్డి కంటికి చారెడుకాటుక పెట్టినా కనిపించదు. ఉల్లిపాయను పన్నీరులో వేసినా కంపు పోదు. మడ్డివాని కెంత చెప్పినా తెలివి మాత్రం రాదు.

## ఐశ్వర్యం

సంపద కలిగిన కీర్తి వస్తుంది. ఏ పనిని చేపట్టినా తగియుండును. గొప్పతనం వచ్చును. ఏమాట చెప్పినా చెల్లుతుంది. శత్రువులు మిత్రులగుదురు. ఘనమైన పెద్ద పని గడ్డిపోచవలె తోచును. ఎప్పుడూ చూడనివారు సైతం మిత్రునివలె చూచుదురు. తలచిన పని చేకూరుతుంది. సామర్థ్యం పెరుగుతుంది. వస్త్రాలు, వాహనాలు మొదలయిన భోగాలు

కలుగు తాయి. తనవారిలో మర్యాద పెరుగు తుంది.

### దారిద్ర్యం

దరిద్రుని తల్లి తప్పులు చెప్పుతుంది. భార్య కూడా లక్ష్యపెట్టదు. నోట వచ్చు మాటలు అన్నియు విపరీతంగా తోస్తాయి. తీరని దుఃఖం అనుభవించును. న్యూనతా భావం కలిగి వుండును. సభలోనికి పోవుటకు సంకోచించును. ఐశ్వర్య వంతుని ఎదుట నిలబడటానికే భయ పడును. శౌర్యం సన్నగిల్లును. ఇంటికి వచ్చిన చుట్టాలు యమదూతలవలె కనిపిస్తారు. పెత్తనం దక్కదు. ఎవరితో ఏమి చెప్పినా తిరిగి మాట్లాడరు. అందరూ చులకన చేస్తారు. అపహాస్యం పాలు చేయుదురు.

### పుణ్యం

సర్వమానవులకూ మంచిచేయు ఆలోచన కలుగుట మనస్సు చేసిన పుణ్యం. మంచిమాట ఉచ్చరించుట నోరు చేసిన పుణ్యం. దానం చేయుట చేతులు చేసిన పుణ్యం. మంచి కార్యార్థియై చనుట కాళ్ళు చేసిన పుణ్యం. మంచి దృశ్యం చూచి ఆనందించుట కన్నులు చేసిన పుణ్యం. మంచి మాటలు, కథలు వినుట చెవులు చేసిన పుణ్యం.

### పాపం

పరులకు కీడు తలపెట్టుట మనస్సు చేసిన పాపం. పరులను పరుష వాక్యాలతో దూషించుట నోరు చేసిన పాపం. పరుల ధనాన్ని అపహరించుట చేతులు చేసిన పాపం. దుష్టకార్యార్థియై వెళ్లుట కాళ్ళు చేసిన పాపం. పరనిందలు వినుట చెవులు చేసిన పాపం. చెడు దృశ్యాలు చూచుట కన్నులు చేసిన పాపం.

### మరణించినా జ్ఞాపకం ఉండేవారు

పరోపకారార్థం నూతులు, చెరువులు తవ్వించి, జలాధారాలను కల్పించిన వారు, చెట్లు పాతించి వనాలు పెంచినవారు, విద్యావేత్తలు, గుడి, గోపురం, సత్రం, చావడి నిర్మింపజేసినవారు, శాశ్వత ధర్మనిధులు కల్పించినవారు, నీతి తప్పనిరాజు, సమాజక్షేమానికి మేలు చేయువారు, రణరంగంనుండి వెనుకకు పారిపోని వీరుడు గొప్ప విద్య నేర్చినవాడు, సత్పుత్రుని కన్నవారు - వీరు మరణించినా బతికివున్నట్లే లెక్క.

### బతికిఉన్నా మరణించిన వారితో సమానం

ఎల్లప్పుడూ ఇంటిలోనే ఉండువారు, రాజసభలో భంగపడినవారు, తీరని దుఃఖాన్ని అనుభవించు వారునూ, స్త్రీధనంచే జీవనం చేయువారునూ, అర్థించిన వారికి ఉపకారం చేయని వారునూ, సమాజానికి కీడు చేయువారు, రహస్యమైన పని రచ్చకు తెచ్చువారునూ, ఎడతెగని దారిద్ర్యాన్ని అనుభవించు వారునూ, తీరని రోగంచే బాధపడు వారునూ బతికి వున్నప్పటికీ మరణించిన వారితో సమానం.

### మంచివారు

విద్య చెప్పినవాడు, మంచిని ఉపదేశించిన వాడు, విపత్తు సమయంలో ఆదుకున్న వాడు, దారిద్ర్యాన్ని పోగొట్టిన వాడు, భయాన్ని పోగొట్టినవాడు, కన్నతండ్రియు, పోషించినవాడు, కన్యాదానం చేసినవాడు - వీరు మంచివారుగా పరిగణింప బడ తారు.

### చెడ్డవారు

రాజాజ్ఞ మీరినవాడు, సభలో ఎదిరించిన వాడు, యజమాని దగ్గర అణకువలేని సేవకుడు, తనవంటివాడు లేడని గర్వించినవాడు,

తల్లిదండ్రులకు కష్టం కలిగించినవాడు, చేసిన ఉపకారం మరచి కృతఘ్నత చూపువాడు, విరసంగా పరిహాసం చేయువాడు : వీరు చెడ్డవారుగా పరిగణింపబడతారు.

**మంచి అలవాట్లు - వ్యాధిని పుట్టించనివి**

మంచి, శుచియైన భోజనం, భోజనం చేసి కొంచెంనడచుటయు, స్నాన పానాదులు క్రమపద్ధతిలో అనుసరించుటయు, సకాలంలో జలమల విసర్జనములును, దినమునకు రెండుసార్లు భుజించుట, సకాలంలో నిద్రించుట - రోగాలను పుట్టించవు.

**చెడ్డ అలవాట్లు - వ్యాధిని పుట్టించేవి**

మితిమీరిన భోజనం, మనో దుఃఖం, అధికంగా సంచారం చేయుట, భోజనము చేసి స్నానం చేయుట, జలమల నిరోధం, మంచిగాలి సోకకుండుట, మగువలతో విలాసం, మద్య ధూమపానాలు, పాచి పోయిన కూరలు తినుట - రోగాలను పుట్టిస్తాయి.

**అవసరాలకు ఉపయోగించేవి**

ఆయా కాలములందు పెట్టిన పైరు, సచ్ఛీలుని వద్ద దాచిన ధనం, యుక్త వయస్సులో పుట్టిన సంతానం, చిన్న తనముననే అభ్యసించిన విద్య, సత్పురుషుల స్నేహం, మంచివానికి చేసిన ఉపకారం - ఇవి అవసరమైనప్పుడు ప్రయోజన పడతాయి.

**అవసరాలకు ఉపయోగపడనివి**

అకాలమునందు పెట్టిన పైరు, మోసకారి వద్ద వుంచిన ధనం, ముదిమిని పుట్టిన సంతానం, కపటం కలవాని స్నేహం, చెడ్డవానికి చేసిన ఉపకారం, అప్పిచ్చిన సొమ్ము - ఇవి కావలసినప్పుడు అక్కరకు రావు.

**ఒకటి కలిగి ప్రకాశించేవి**

సూర్యుడు గల పగలు, చంద్రుడు గల రాత్రి, పిల్లలుగల ఇల్లు, ఉత్తముడు గల భూమి, రాజుగల రాజ్యం, వేగం గల గుర్రం, గుణవతి, శీలవతి భార్యగా గల పురుషుడు, శ్రుతిగల రాగం, సత్యంగల వాక్కు, వివేకం గల తపస్సు, రైతుగల ఊరు, చదువుగల బుద్ధి ప్రకాశిస్తూనే ఉంటాయి.

**ఒకటి లేక ప్రకాశింపనివి**

పిల్లలులేని ఇల్లు, మాధుర్యం లేని కవిత, గుణంలేని స్త్రీ, వాసన లేని పువ్వు, భక్తిలేని పూజ, ఆయుధం లేని బంటు, ప్రీతిలేని విందు, పెద్దలు లేని ఊరు, మంచిమాటలు లేని స్నేహం - ప్రకాశింపవు.

**ఒక గుణం ఉన్నచో మరియొక సుగుణం కలుగుతుంది**

అధికారముచేత సామర్థ్యం, సంపదచేత మర్యాద, వస్త్రాభరణాదులచేత సౌందర్యం, దాతృత్వం చేత కీర్తి, ప్రియవాక్యం చేత లోకవశ్యత, వినయం చేత గొప్పతనం, సుగుణంచేత ధనం సిద్ధంగా వస్తాయి.

**ఒక దోషం చేత మరియొక దోషం కలుగుతుంది**

కోపం చేత హింస, కామం చేత వ్రతనాశం, వంచన చేత అసత్యం, గర్వం చేత అపజయం, తనవల్ల కానిపని చేత అపాయం, లోభం చేత దొంగతనం, అజ్ఞానం చేత అవివేకం, దౌష్ట్యంచే శత్రుత్వం, చెడ్డపనిచేత అపకీర్తి సిద్ధిస్తాయి.

## శబ్ద దోషనిఘంటువు (స్పెల్లింగ్ డిక్షనరీ)

| ఇష్టరూపం | అనిష్టరూపం | ఇష్టరూపం | అనిష్టరూపం |
|---|---|---|---|
| అంతస్తు | అంతస్థు | ఆయుస్సు | ఆయష్షు |
| అంశము | అంసము | ఆర్థిక | ఆర్ధిక |
| అక్షాంశ | అక్షాంస | ఆశీస్సులు | ఆసీస్సులు |
| అక్షంతలు | అక్షింతలు | ఆస్తి | ఆస్థి |
| అగాధం | అగాథం | ఇదమిత్థము | ఇతమిద్దము |
| అధినేత | అదినేత | ఇష్టము | ఇష్ఠము |
| అద్భుతం | అధ్బుతం | ఉచ్చ | ఉఛ్చ |
| అధః | అథో | ఉచ్చారణ | ఉఛ్ఛారణ |
| అధికము | అదికము | ఉచ్ఛ్వాసనిశ్వాసం | ఉఛ్వాస నిస్వాసం |
| అధిష్ఠానవర్గం | అధిష్టానవర్గం | ఉదాహరణ | ఉదహరణ |
| అధిష్ఠించు | అధిష్టించు | ఉద్భవించు | ఉధ్భవించు |
| అధో: | అథో: | ఉద్దిష్ట | ఉద్దిష్ఠ |
| అధ్యయనం | అద్యయనం | ఉద్ధృతం | ఉధృతం |
| అధోగతి | అథోగతి | ఉపాధ్యాయుడు | ఉపాధ్యాయుడు |
| అనాథ | అనాధ | ఉరికంబం | ఉరికంభం |
| అనుక్షణం | అణుక్షణం | ఊర్ధ్వ | ఊర్ధ్వ |
| అప్రతిష్ఠ | అప్రతిష్ట | ఋజురేఖ | రుజురేఖ |
| అభాండాలు | అబాండాలు | ఒడిదొడుకు | వడుదొడుకు |
| అర్థము (ధనము, ప్రయోజనముకొరకు) | అర్ధము | ఒత్తిడి | వత్తిడి |
| | | కందకం | కంధకం |
| అర్ధము (సగము) | అర్థము | కథ | కధ |
| అర్ధ వ్యాసము | అర్థ వ్యాసము | కనిష్ఠ | కనిష్ట |
| అర్థాంతరంగా | అర్ధాంతరంగా | కరగు | కరుగు, కఱుగు |
| అవధి | అవథి | కర్కాటకం | కర్కటకం |
| అవలంబించు | అవలంభించు | కర్మ | ఖర్మ |
| అవస్థ | అవస్త | కల్యాణం | కళ్యాణం |
| అశాస్త్రీయమైన | అశాస్త్ర్యమైన | కష్టము | కష్ఠము |
| అస్తవ్యస్తం | అస్తవ్యస్థం | క్లిష్ట | క్లిష్ఠ |
| అస్పృశ్యత | అశ్రుస్యత | కులస్థుడు | కులస్తుడు |
| అస్థికలు | అస్తికలు | క్రూర | కౄర |
| అస్వస్థత | అశ్వస్తత | కృత్రిమ | క్రుత్రిమ |
| ఆంశిక | ఆంసిక | కొంచెము | కొంచము |
| ఆధారం | ఆథారం | ఖచ్చితం | కచ్చితం |
| ఆధునిక | ఆథునిక | గంధకం | గంథకం |
| ఆధ్యాత్మిక | ఆథ్యాత్మిక | గడియ | ఘడియ |

| ఇష్టరూపం | అనిష్టరూపం | ఇష్టరూపం | అనిష్టరూపం |
|---|---|---|---|
| గరిష్ఠ | గరిష్ట | దేశస్థులు | దేశస్తులు |
| గాఢ | ఘాఢ | దైవాధీనం | దైవాదీనం |
| గాథ | గాధ | దొరకు | దొరుకు, దొఅకు |
| గూఢచారి | గూడాచారి | దౌష్ట్యం | దౌష్ర్యం |
| గృహస్థు | గృహస్తు | ధాతువు | థాతువు |
| గ్రంథి | గ్రంది | ధూపం | దూపం |
| గ్రామస్థులు | గ్రామస్తులు | ధర్మం | థర్మం |
| చతుర్థ | చతుర్ద | ధారణ | థారణ |
| చలామణీ | చెలామణీ | ధ్రువీకరణ | ధృవీకరణ |
| ఛాయ | చాయ | ధ్రువపరచు (రూఢిచేయు) | ధృవపరచు |
| ఛిన్నభిన్నం | చిన్నాభిన్నం | నమూనా | నమోనా |
| ఛేదము | చ్ఛేదము | నష్టం | నష్ఠము |
| జాగరణ | జాగారణ | నాగరికత | నాగరకత |
| జాగ్రత్త | జాగర్త | నిరసన | నిరశన |
| జాగ్రదావస్థ | జాగ్రదావస్త | నిధి | నిథి |
| జాడ్యం | జాఢ్యం | నిరోధించు | నిరోథించు |
| తటస్థ | తటస్త | నిర్దిష్ట (నిర్దేశింప బడిన) | నిర్దుష్ట |
| తత్త్వం | తత్వం | నిర్దుష్ట(దోషర హితము) | నిర్దిష్ట |
| తనఖా | తణఖా, తణ్ఖా | నిర్దేశించు | నిర్దేశించు |
| తుఫాను | తుపాను | నిర్ధరించబడిన | నిర్థరించబడిన |
| దరఖాస్తు | దరఖాస్థు | నిర్ధారణ | నిర్థారణ |
| దవాఖానా | ధవఖానా | నిర్బంధం | నిర్భందం |
| దళారీలు | దళారులు | నివసిస్తున్న | నివశిస్తున్న |
| దశ | దస | నివాసం | నివాశం |
| దారుణం | ధారుణం | నిల్వ (storage, balance) | నిలవ |
| దారుఢ్యం | ధారుడ్యం | నిశిత | నిసిత |
| దిగ్బంధం | దిగ్భందం | నిశ్చయము | నిస్చయము |
| దుర్భరం | దుర్బరం | నిశ్శబ్దం | నిశ్శబ్దం |
| దుర్గ | ధుర్గ | నిషేధం | నిషేదం |
| దుర్భేద్యం | దుర్భేధ్యం | నిష్ఠ | నిష్ట |
| దృక్పథము | దృక్పధము | నిస్స్వార్థ | నిస్వార్ధ |
| దృఢముగా | ధృడముగా | నేపథ్యం | నేపధ్యం |
| ధ్రువం (ఉత్తర, దక్షిణ) | ధ్రువం | నేరస్తుడు | నేరస్థుడు |
| దృశ్యము | ధ్రుశ్యము | నైరృతి | నైఋతి |
| దృష్టాంతము | దృష్ఠాంతము | పథకము | పధకము, పదకము |
| దృష్టి | దృష్ఠి | పటిష్ఠ | పటిష్టము |
| దెస | దెశ | పణం (డబ్బు) | ఫణం |

| ఇష్టరూపం | అనిష్టరూపం | ఇష్టరూపం | అనిష్టరూపం |
|---|---|---|---|
| పదార్థము | పదార్ధము | ప్రవృత్తి | ప్రవ్రుత్తి |
| పద్ధతి | పద్థతి | ప్రశంస | ప్రసంశ |
| పరాకాష్ఠ | పరాకాష్ట | ప్రశస్తి | ప్రసశ్తి |
| పరిణామం | పరినామం | ప్రసక్తి | ప్రశక్తి |
| పరిధి | పరిథి | ప్రసిద్ది | ప్రశిద్ది |
| పరిపుష్టం | పరిపుష్ఠం | ప్రశ్నార్థకం | ప్రశ్నార్ధకం |
| పరిమాణం | పరిమానం | ప్రస్తుతము | ప్రస్థుతము |
| పరిశ్రమ | పరిస్రమ | ప్రస్ఫురణ | ప్రస్పురణ |
| పశుగ్రాసము | పసుగ్రాసము | ప్రాథమిక | ప్రాధమిక |
| పసుపు | పశుపు | ప్రారబ్ధకర్మ | ప్రారబ్దఖర్మ |
| పాపభీతి | పాపబీతి | బంధించు | బందించు |
| పారమార్థిక | ప్రరమార్దిక | బద్ధమైన | బద్దమైన |
| పారిశుద్ధ్యము | పారిశుధ్ద్యము | బలిష్ఠము | బలిష్టము |
| పింఛను | పించను | బాగుగ | బాగా |
| పీఠము | పీటము | బాధ | భాధ |
| పునరుద్ధరణ | పునరుద్దరణ | బాష్పము | భాష్పము |
| పుపుస | పుపుస | భీరువు | భీరువు |
| పుష్టి | పుష్ఠి | బుద్ధి | బుద్థి |
| పృథక్కరణ | పృదక్కరణ | బుద్ధిమంతుడు | బుద్ధివంతుడు |
| పృథ్వి | పృధ్వి | బుద్ధిమాంద్యం | బుద్దిమాంధ్యం |
| పౌరోహిత్యం | పౌరహిత్యం | భీతావహం | బీతావహం |
| ప్రకాశము | ప్రకాసము | బీభత్సం | భీబత్సం |
| ప్రకృతి | ప్రక్రుతి | బోధ | భోద, భోథ, బోథ |
| ప్రగతి పథం | ప్రగతిపధం | భూయిష్ఠము | భూయిష్టము |
| ప్రగాఢ | ప్రఘాడ | భేదము | బేధము, భేధము |
| ప్రతిష్ఠ | ప్రతిష్ట | భోజనం | బోజనం |
| ప్రతిష్ఠంభన | ప్రతిష్టంబన | ముగ | మొగ |
| ప్రతిష్ఠాత్మక | ప్రతిష్టాత్మక | మతస్థులు | మతస్తులు |
| ప్రతిస్పర్ధ | ప్రతిస్పర్థ | మద్దతు | మధ్దతు |
| ప్రథమ | ప్రధమ | మద్యపానం | మధ్యపానం |
| ప్రదక్షిణం | ప్రదిక్షణం | మధ్య | మథ్య |
| ప్రదర్శన | ప్రదర్సన | మధ్యాహ్నం | మద్యాహ్నం |
| ప్రదానం | ప్రథానం | మనస్తాపం | మనస్థాపం |
| ప్రధాన | ప్రథాన | మహత్త్వము | మహాత్త్వము |
| ప్రబుద్ధుడు | ప్రబుద్దిడు | మిత్రుడు | మిత్రుడు |
| ప్రముఖుడు | ప్రముకుడు | మిథునము | మిధునము |
| ప్రవర్ధన | ప్రవర్థన | మిథోఘట్టనం | మిధోఘట్టనం |

| ఇష్టరూపం | అనిష్టరూపం | ఇష్టరూపం | అనిష్టరూపం |
|---|---|---|---|
| మిథ్యాబింబం | మిధ్యాబింబం | విచ్ఛిన్న | విచ్చిన్న |
| మిశ్రం | మిస్రం, మిశ్రమం | విదితం | విధితం |
| ముఖం | ముకం | విద్యుచ్ఛక్తి | విద్యుశ్ఛక్తి |
| ముభావం | ముబావం | విద్యుదీకరణ | విద్యుద్దీకరణ |
| మూలశంక | మూలశంఖ | విధేయుడు | విథేయుడు |
| మృదుభాష | మృధుభాష | విభేదాలు | విబేదాలు |
| మేధస్సు | మేదస్సు | విరుద్ధ | విరుద్ద |
| మౌఢ్యం | మౌడ్యం | విలేఖరి | విలేకరి |
| యథాతథం | యధాతదం | విశదం | విసదం |
| యథాప్రకారం | యధాప్రకారం | విశదీకరించు | విసదీకరించు |
| యథార్థం | యధార్దం | విశిష్ట | విశిష్ఠ |
| యథాలాపము | యదాలాపం,యదాలాభం | విస్మయం | విశ్మయం |
| యథేచ్ఛగా | యధేచ్చగా | వీథి | వీది, వీధి |
| యథోచితంగా | యదోచితంగా | వృథా | వృధా |
| యాదృచ్ఛికంగా | యాధ్రుచ్చికంగా | వృథావ్యయం | వృధావ్యయం |
| యుద్ధం | యుద్దం | వృద్ధి | వృద్ది, వృథ్ధి |
| యౌవనం | యవ్వనం | వృద్ధుడు | వృద్దుడు |
| రథసారథి | రధసారధి | వృద్ధాప్యం | వృద్యాప్యం |
| రాశి (నక్షత్ర) | రాసి | వేర్లు (roots) | వ్రేళ్లు |
| రాసి (గణాత్మక) | రాశి | వేలు | వ్రేలు |
| ఋజువు | ఋజువు | వేష్టనము | వేష్ఠనము |
| రూఢపరచు | రూడపరచు | వ్యత్యస్తం | వ్యత్యస్థం |
| లబ్ధం | లబ్దం | వ్యర్థం | వ్యర్దం |
| లబ్ధప్రతిష్ఠులు | లబ్ద ప్రతిష్టులు | వ్యవస్థ | వ్యవస్త |
| లబ్ధిదారు | లబ్దిదారు | వ్యాధి | వ్యాథి |
| వరుస | వరస | వ్యాసార్ధం | వ్యాసార్థం |
| వర్ధంతి | వర్థంతి | వ్యుత్పత్తి | ఉత్పత్తి |
| వర్ధకం | వర్థకం | శంకు (cone) | శంఖు |
| వర్ధిల్లు | వర్థిల్లు | శంకుస్థాపన | శంఖుస్థాపన |
| వాగ్దానం | వాగ్ధానం | శత్రువు | శతృవు |
| వాఙ్మయం, వాంగ్మయం | వాజ్ఞ్మయం | శాకాహారం | శాఖాహారం |
| వాఙ్మూలం, వాంగ్మూలం | వాజ్ఞ్మూలం | శాసనం | శాశనం |
| వాయవ్య | వాయువ్య | శిథిలం | శిధిలం |
| వార్ధక్యం | వార్థక్యం | శిబిరం | శిభిరం |
|  |  | శిస్తు | శిస్థు |

| ఇష్టరూపం | అనిష్టరూపం | ఇష్టరూపం | అనిష్టరూపం |
|---|---|---|---|
| శీఘ్రం | శీగ్రం | సుశ్రుత సంహిత | సుస్రుత సంహిత |
| శుద్ధం | శుద్దం | సూచన | శూచన |
| శుద్ధి | శుద్ధి, సుద్ది | సొంత | స్వంత |
| శ్మశానం | స్మసానం/స్మశానం | సౌధం | సౌదం |
| శ్రుతి | శృతి | సౌష్ఠవం | సౌష్టవం |
| శ్రేణి | శ్రేని/స్రేణి | స్తంభం | స్థంభం |
| శ్రేష్ఠము | శ్రేష్టము | స్తంభించి | స్థంబించి |
| శ్వాసము | శ్వాశము | స్తనం | స్థనం |
| షష్టిపూర్తి(60) | షష్ఠిపూర్తి | స్తిమితం | స్థిమితం |
| షష్ఠి (6) | షష్టి | స్తూపం | స్థూపం |
| సంతృప్తి | సంత్రుప్తి | స్థానం | స్తానం |
| సందర్భం | సందర్బము | స్థానభ్రంశం | స్తానబ్రంశం |
| సందిగ్ధం | సందిగ్థం | స్థాపన | స్తాపన |
| సంబంధం | సంభంధం | స్థాయి | స్తాయి |
| సంవర్ధనం | సంవర్దనం | స్థితి | స్తితి |
| సంశయం | సంసయం | స్థిరము | స్తిరము |
| సంస్థ | సంస్త | స్తూపం | స్థూపం |
| సంస్థానము | సంస్తానం | స్థానభ్రంశం | స్తానబ్రంశం |
| సమర్థన | సమర్దన | స్థూల | స్తూల |
| సమష్టి | సమిష్ఠి | స్నిగ్ధం | స్నిగ్దం |
| సమృద్ధి | సమృద్ది | స్పష్టంగా | స్పష్ఠంగా |
| సమ్మేళనం | సంమేళనం సంమ్మేళనం | స్పర్ధ | స్పర్థ |
| సరకు | సరుకు | స్రష్ట | స్రష్ఠ |
| సస్యము | సశ్యము | స్వచ్ఛం | స్వచ్చం |
| సాదృశ్యం | సాదృస్యం | స్వర్గస్థుడు | స్వర్గస్తుడు |
| సాధనం | సాదనము, సాథనం | స్వస్తి | స్వష్టి |
| సాధ్యం | సాథ్యము | స్వస్థత | స్వస్తత |
| సామర్థ్యం | సామర్ద్యం | స్వేచ్ఛ | స్వేచ్చ |
| సార్థకత | సార్దకత | స్వేదనం | శ్వేదనం |
| సార్వభౌమాధికారం | సార్వబౌమాథికారం | హఠాత్తు | హటాత్తు |
| సౌభ్రాతృత్వం | సౌబాతృత్వం | హద్దు | హద్దు |
| సిద్ధం | సిద్థం, సిద్దం | హార్దిక | హార్థిక/హార్దిక |
| సిద్ధాంతం | సిద్థాంతం, సిద్దాంతం | హెచ్చు | హెచ్చు |
| సుబ్బారాయుడు షష్ఠి | సుబ్బారాయుడుషష్టి | హెచ్చరిక | హెచ్చరిక |

## వ్యావహారిక రచనాశైలి: మంచి తెలుగు రాయడం ఎలా?

వాక్య నిర్మాణంలోనూ, పదాల, క్రియల విభక్తి ప్రత్యయాల ప్రయోగంలోనూ, అన్వయంలోనూ దోషాలు - కొన్ని ఉదాహరణలు

గమనిక : రెండవ వాక్యం సరియైనది

అంబేద్కర్ జయంతి పురస్కరించుకుని ఏప్రిలు 10 సెలవుదినం ప్రభుత్వం ప్రకటించారు.
*అంబేద్కర్ జయంతిని పురస్కరించుకుని ఏప్రిలు 10 సెలవు దినంగా ప్రభుత్వం ప్రకటించింది.*

* * *

అక్షరాస్యతా కార్యక్రమం ద్వారా ప్రజలను చైతన్యం చేస్తున్నారు.
*అక్షరాస్యతా కార్యక్రమం ద్వారా ప్రజలను చైతన్యవంతం చేస్తున్నారు.*

* * *

అత్తా ఆడబడుచుల సూటి పోటి మాటలను భరించలేక పద్మ ఉరిపోసుకుని మరణించింది.
*అత్తా ఆడబడుచుల సూటి పోటి మాటలు భరించలేక పద్మ ఉరిపోసుకుని మరణించింది.*

* * *

అపరిష్కృతంగా ఉన్న విద్యార్థుల సమస్యలు వెంటనే పరిష్కరించారు.
*అపరిష్కృతంగా ఉన్న విద్యార్థుల సమస్యల్ని వెంటనే పరిష్కరించారు.*

* * *

'అపూర్వశిల్ప సంపద కాపాడండి' అని మొరపెట్టుకున్న ప్రభుత్వం పట్టించు కోవడం లేదు.
*'అపూర్వశిల్ప సంపదను కాపాడండి' లని మొరపెట్టుకున్నా ప్రభుత్వం పట్టించు కోవడం లేదు.*

* * *

ఫోర్డు సంస్థ మన రాష్ట్రంలో మోటార్ కార్లు ఉత్పత్తి చేసే కర్మాగారం స్థాపించాలను కొంటున్నారు.
*ఫోర్డు సంస్థ మన రాష్ట్రంలో మోటార్ కార్లను ఉత్పత్తి చేసే కర్మాగారం స్థాపించాలను కొంటున్నది.*

* * *

ఆ పని పూర్తిచేయడానికి పదిమంది మనుష్యులకు వారంరోజులు పడుతుంది.
*ఆ పని పూర్తి చేయడానికి పదిమందికి వారం రోజులు పడుతుంది.*

* * *

ఆరుద్ర తెలుగు సాహిత్యం కొరకు ఎంతో కృషి చేసి 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' అనే సంపుటాల్లో అందించారు.
*ఆరుద్ర తెలుగు సాహిత్యం కోసం ఎంతో కృషి చేసి 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' అనే సంపుటాలు అందించారు.*

* * *

ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేసేందుకు గట్టి కృషి చేస్తామని ప్రధాని ప్రకటించారు.
*ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడానికి గట్టి కృషి చేస్తామని ప్రధాని ప్రకటించారు.*

* * *

ఈ మధ్య ఎప్పుడు జరగని రీతిలో ఈ ఘోర సంఘటన జరిగింది.
*ఈ మధ్య ఎప్పుడూ జరగని రీతిలో ఈ ఘోర సంఘటన జరిగింది.*

* * *

ఒక తీర్మానం ద్వారా ఇంటర్మీడియెట్ మార్కులు కలపాలని ప్రభుత్వం నియమించిన ఎమ్‌సెట్ కమిటీ పేర్కొన్నారు.

ఒక తీర్మానం ద్వారా ఇంటర్మీడియెట్ మార్కులు కలపాలని ప్రభుత్వం నియమించిన ఎమ్‌సెట్ కమిటీ పేర్కొన్నది.

* * *

ఒక్కొక్కటి నాలుగు **లక్షలు** రూపాయలతో నాయుడుపేటలో పది పాఠశాల **భవనాలు** నిర్మిస్తామన్నారు.
*ఒక్కొక్కటి నాలుగు **లక్షల** రూపాయలతో నాయుడుపేటలో పది పాఠశాల **భవనాల్ని** నిర్మిస్తామన్నారు.*

* * *

ఓ సైకిలు షాపును నిర్వహిస్తున్న డేవిడ్‌కు తన కుమార్తెను ఇవ్వలేదని మేరీ తల్లి సుగుణమ్మ తెలిపింది.
*ఓ సైకిలు షాపును నిర్వహిస్తున్న డేవిడ్‌కు తన కుమార్తెను ఇవ్వలేనని మేరీ తల్లి సుగుణమ్మ తెలిపింది.*

* * *

కేసు నమోదు చేయడానికి పోలీసు స్టేషన్‌కు వచ్చిన **యువతి** సిగ్గుతో తలవంచుకొనే విధంగా పోలీసులు దుర్భాషలాడారు.
*కేసు నమోదు చేయడానికి పోలీసు స్టేషనుకు వచ్చిన **యువతిని** సిగ్గుతో తలవంచుకునే విధంగా పోలీసులు దుర్భాషలాడారు.*

* * *

కంకిపాడుకు చెందిన ముగ్గురు **తీవ్రంగా** వుయ్యూరుకు చెందిన ఇరవయి అయిదు మంది స్వల్పంగా **గాయపడ్డారు.**
*కంకిపాడు వుయ్యూర్లకు చెందిన ముగ్గురు **తీవ్రంగాను** ఇరవయి అయిదు మంది స్వల్పంగాను **గాయపడ్డారు.***

* * *

కనీస **సౌకర్యమైన** మంచినీటి **సమస్యను** పరిష్కరించడానికి ఏలూరు పురపాలక సంఘం ఒక కొత్త **పథకాన్ని** చేపట్టింది.
*కనీస **అవసరమైన** మంచినీటి **సమస్య** పరిష్కరించడానికి ఏలూరు పురపాలకసంఘం ఒక కొత్త **పథకం** చేపట్టింది. (మంచినీరు సౌకర్యం కాదు అవసరం)*

* * *

కాకినాడలో ఏడాదికి పన్నెండు **వందలు కోట్లు టన్నులు** ఉత్పత్తి సామర్థ్యంగల ఎరువుల **ఫ్యాక్టరీ** నెలకొల్పారు.
*కాకినాడలో ఏడాదికి పన్నెండు **వందల కోట్ల టన్నుల** ఉత్పత్తి సామర్థ్యంగల ఎరువుల **ఫ్యాక్టరీని** నెలకొల్పారు.*

* * *

కేంద్రప్రభుత్వం ప్రవేశపెట్టే సంక్షేమ **కార్యక్రమాల్ని** ప్రజలు భాగస్వాములైనప్పుడే పథకాలు అమలు కావడానికి అవకాశం వుంది.
*కేంద్రప్రభుత్వం ప్రవేశపెట్టే సంక్షేమ **కార్యక్రమాలలో** ప్రజలు భాగస్వాములైనప్పుడే పథకాలు అమలు కావడానికి అవకాశం వుంది.*

* * *

గాయత్రి **తెలుపు** లంగా వేసుకుంది.
*గాయత్రి తెల్ల లంగా ధరించింది.*

జూదగాళ్లు అరెస్టు.
*జూదగాళ్ల అరెస్టు.*

చేతిపంపులు సరిగా పనిచేయక గ్రామీణులు నానా యాతనలు **పడుతున్నారని** చెప్పారు.
చేతిపంపులు సరిగా పనిచేయక గ్రామీణులు నానాయాతనలు **పడుతున్నామని** చెప్పారు.

గాయపడ్డవారిలో ముగ్గురు మహిళలు ఒక పిల్లవాడు వున్నారు. **వారిని** ఆసుపత్రిలో చికిత్స చేస్తున్నారు.
*గాయపడ్డ వారిలో ముగ్గురు మహిళలు ఒక పిల్లవాడు వున్నారు. **వారికి** ఆసుపత్రిలో చికిత్స చేస్తున్నారు.*

* * *

జన్మభూమి **పథకాన్ని** ప్రారంభం అయ్యాక దాన్ని ముందు ముందు కూడా కొనసాగిస్తామని రాష్ట్ర ముఖ్యమంత్రి అన్నారు.
*జన్మభూమి **పథకం** ప్రారంభం అయ్యాక దాన్ని ముందు ముందు కూడా కొనసాగిస్తామని రాష్ట్ర ముఖ్యమంత్రి అన్నారు.*

* * *

తనకు తెలుగు సరిగా **రానందున** ప్రజల సమస్యలను **పరిష్కారంలో** జాప్యం జరగడంలేదని కలెక్టరు చెప్పారు.
*తనకు తెలుగు సరిగా **రాకపోయినను** ప్రజల సమస్యలను **పరిష్కరించడంలో** జాప్యం జరగడంలేదని కలెక్టరు చెప్పారు.*

* * *

దుండగులు లోనికి ప్రవేశించి **ప్రజలు గాయపడుతున్న** సందర్భాలు చాలా ఉన్నాయి.
*దుండగులు లోనికి ప్రవేశించి **ప్రజలను గాయపరుస్తున్న** సందర్భాలు చాలా ఉన్నాయి.*

* * *

దేశంలో మార్పు తీసుకురాడానికి **యువకులకు** సమీకరించి వారిలో విశ్వాసం కలిగించి **పోరాటం చేయడానికి సిద్ధం కావాల్సిన అవసరం ఉందన్నారు.**
*దేశంలో మార్పు తీసుకురావడానికి **యువకులను** సమీకరించి **పోరాటం చేయించడానికి** సిద్ధంగా **ఉండాలన్నారు.***

* * *

నల్గొండ జిల్లా **ప్రజలకు** సరియైన మంచినీరు లభించక **రోగాలు** అనారోగ్యానికి గురవుతున్నారు.
*నల్గొండ జిల్లా **ప్రజలు** సరియైన మంచినీరు లభించక **రోగాలకూ** అనారోగ్యానికీ గురవుతున్నారు.*

* * *

నిర్దోషులైన **తమకు** ఇన్‌స్పెక్టర్ అన్యాయంగా లాఠీతో కొట్టాడని ఆయన అన్నాడు.
*నిర్దోషులైన **తమను** ఇన్‌స్పెక్టర్ అన్యాయంగా లాఠీతో కొట్టాడని ఆయన అన్నాడు.*

* * *

నీటిపారుదల వ్యవస్థను **ఆధునీకరించ** వలసిన అవసరం ఎంతైనా ఉంది.
*నీటిపారుదల వ్యవస్థను **ఆధునికీకరించ** వలసిన అవసరం ఎంతైనా ఉంది.*

* * *

పంచె, కండువా **ధరించిన** స్వచ్ఛమైన తెలుగులో ఆ దుండగులు మాట్లాడారని పొరుగువారన్నారు.
*పంచె, కండువా **ధరించి** స్వచ్ఛమైన తెలుగులో ఆ దుండగులు మాట్లాడారని పొరుగువారన్నారు.*

* * *

పాఠశాల వార్షికోత్సవ ఏర్పాట్లలో **సిబ్బంది తలమునకలై ఉన్నారు.**
*పాఠశాల వార్షికోత్సవ ఏర్పాట్లలో **సిబ్బంది తలమునకలై ఉంది.***

* * *

పుట్టగొడుగుల్లాగ పుట్టుకొస్తున్న పూర్వ ప్రాథమిక విద్యాసంస్థలు గూర్చి విద్యామంత్రిని పత్రికలవారు ప్రశ్నించారు.

*పుట్ట గొడుగుల్లా పుట్టుకొస్తున్న పూర్వ ప్రాథమిక విద్యాసంస్థలను గురించి విద్యామంత్రిని పత్రికలవారు ప్రశ్నించారు.*

* * *

పురపాలక సంఘం వారు పోలీసుల సాయంతో కబ్జా ఇళ్ళు కూలగొట్టి బస్తీ కుటుంబాలన్నిటినీ నిరాశ్రయులను చేశారు.

*పురపాలకసంఘంవారు పోలీసుల సాయంతో కబ్జా ఇళ్ళు కూలగొట్టి బస్తీకుటుంబాలన్నిటినీ నిరాశ్రయం చేశారు.*

* * *

బొండాడ గ్రాను ప్రాంతంలో ఉన్న అన్ని మురికి కాలువల నీరు ఈ ఉప్పుటేరులోకే వస్తాయి.

*బొండాడ గ్రామ ప్రాంతంలో ఉన్న అన్ని మురికి కాలువల నీరు ఈ ఉప్పుటేరులోకే వస్తుంది.*

* * *

భక్తి ప్రధాన గానం ద్వారా విశేష ప్రాచుర్యమొందిన శోభారాజ్ సంగీత కచేరీ త్యాగరాయ గానసభలో గంటకు పైగా సాగింది.

*భక్తి ప్రధాన గానం ద్వారా విశేష ప్రాచుర్యం పొందిన శోభారాజ్ సంగీత కచేరీ త్యాగరాయ గానసభలో గంటకు పైగా సాగింది.*

* * *

భవన నిర్మాణం పూర్తిచేసి గృహ ప్రవేశంకు సిద్ధంగావుంది.

*భవన నిర్మాణం పూర్తి అయి గృహప్రవేశానికి సిద్ధంగా వుంది.*

* * *

మహిళా రిజర్వేషన్ పథకాన్ని గూర్చి పట్టించుకున్న నాథుడే లేదు.

*మహిళా రిజర్వేషన్ పథకాన్ని గూర్చి పట్టించుకున్న నాథుడే లేడు.*

* * *

మహిళా జనాభ్యుదయ పథకాలు విఫలం చెందుతున్నాయి.

*మహిళా జనాభ్యుదయ పథకాలు వైఫల్యం చెందుతున్నాయి/విఫలమవుతున్నాయి.*

* * *

మరణించిన మంచిగంటి సుబ్బారావు మండల ప్రజాపరిషత్తు అధ్యక్షునిగా పనిచేస్తూ మండలం ఆదర్శవంతంగా తీర్చిదిద్దడంలో కీలకపాత్రధారని ఎమ్.ఎల్.ఎ రవి అన్నారు.

*మరణించిన మంచిగంటి సుబ్బారావు మండల ప్రజాపరిషత్తు అధ్యక్షునిగా మండలాన్ని ఆదర్శవంతంగా తీర్చిదిద్దడంలో కీలకపాత్ర వహించారని ఎమ్.ఎల్.ఎ రవి అన్నారు.*

* * *

యువతి వివస్త్ర కేసులో ముగ్గురి అరెస్టు చేశారు.

*యువతిని వివస్త్రను చేసిన కేసులో ముగ్గురిని అరెస్టు చేశారు.*

* * *

లొంగిపోయిన నక్సలైట్లపై వారి ప్రతీ చర్యలు కనిపెట్టడానికి గట్టి నిఘా ఏర్పాటు చేశారు.

*లొంగిపోయిన నక్సలైట్లు తిరిగి కార్యకలాపాల్లో పాల్గొనకుండా గట్టి నిఘా పెట్టారు.*

'రామ నన్ను' యని త్యాగయ్య విరచితమైన కాంభోజరాగ కీర్తన కచేరీలో పాడారు.
*కాంభోజిరాగంలో 'రామనన్ను' అనే త్యాగయ్య కృతి కచేరీలో పాడారు.*

* * *

రామాపురానికి చెందిన హరిజన బాలిక **అదృశ్యమై** జాడ దొరకలేదు.
*రామాపురానికి చెందిన హరిజన బాలిక **అదృశ్యమైంది.** (అదృశ్యం అంటే జాడ దొరకక పోవడం-పునరుక్తి దోషం)*

* * *

రాజస్థాన్ భారీ దొంగతనాలకు పాల్పడ్డ గజదొంగ గోకుల్‌సింగ్ కోసం ఆంధ్రా సి.బి.సి.ఐ.డి. వారు నల్లమలై **అడవుల్లో** గాలింపు చేపట్టారు.
***రాజస్థాన్‌లో** భారీ దొంగతనాలకు పాల్పడ్డ గజదొంగ గోకుల్‌సింగ్ కోసం ఆంధ్రా సి.బి.సి.ఐ.డి. వారు నల్లమలై **అడవులను** గాలింపు చేపట్టారు.*

* * *

రాజకీయ నాయకులకు పదవులు శాశ్వతం కాదని,ప్రజల హృదయాలలో స్థానం సంపాదించాలని ముఖ్యమంత్రి అన్నారు.
*రాజకీయ నాయకులకు పదవులు శాశ్వతం కాదని,ప్రజల హృదయాలలో స్థానం **సంపాదించటమే** ప్రధానమని ముఖ్యమంత్రి అన్నారు.*

* * *

రామారావు తన పెద్ద కుమారుని ఇంజనీరింగు విద్యకై రెండు లక్షల రూపాయలు వెచ్చిస్తూ **చదివించాడు.**
*రామారావు తన పెద్ద కుమారుని ఇంజనీరింగు విద్యకై రెండు లక్షల రూపాయలు వెచ్చించి చదివించాడు.*

* * *

**రోగులను** ప్రేమాభిమానాలను చూరగొన వలసిన డాక్టరే **రోగులపట్ల** చీదరించు కొన్నాడు.
***రోగుల** ప్రేమాభిమానాలను చూరగొన వలసిన డాక్టరే **రోగులను** చీదరించుకొన్నాడు.*

* * *

**నేటి** రాత్రి రేడియోలో రాష్ట్ర గవర్నరు ప్రసంగిస్తారు.
***రేడియోలో నేటి** రాత్రి రాష్ట్ర గవర్నరు ప్రసంగిస్తారు.*

* * *

నారాయణరావు **భార్యకు** అనేక రకాలుగా చిత్రహింసలు పెడుతున్నాడు.
*నారాయణరావు **భార్యను** అనేక రకాలుగా చిత్రహింసలు పెడుతున్నాడు.*

* * *

వరంగల్లు నగరంలో పదవ తరగతి నుంచి విశ్వవిద్యాలయ స్థాయి వరకూ చదివినవారు **ఉద్యోగులలో** ఉన్నవారి సంఖ్య వేలల్లో ఉందని మంత్రి అన్నారు.
*వరంగల్లు నగరంలో పదవ తరగతి నుంచి విశ్వవిద్యాలయ స్థాయి వరకూ చదివినవారు **ఉద్యోగాలలో** ఉన్న వారి సంఖ్య వేలల్లో ఉందని మంత్రి అన్నారు.*

* * *

వర్షంకోసం కొన్ని గ్రామాల్లో **పూజలు** నిర్వహిస్తూ స్త్రీలు ఇళ్లవద్ద వరుణదేవుని కొరకై ఎదురుచూస్తున్నారు.
వర్షంకోసం కొన్ని గ్రామాల్లో **స్త్రీలు ఇళ్ళవద్ద పూజలు చేస్తూ** వరుణదేవునికొరకై ఎదురుచూస్తున్నారు.

* * *

విజ్ఞాన యాత్ర చేస్తున్న బృందంలో ఇద్దరు అక్కడికక్కడే మరణించారు. **ఏడుగురు** ఆసుపత్రిలో చేర్చారు.
విజ్ఞానయాత్ర చేస్తున్న బృందంలో ఇద్దరు అక్కడికక్కడే మరణించారు. **ఏడుగురిని** ఆసుపత్రిలో చేర్చారు.

* * *

**వ్యవసాయ కూలీలు, కడుబీద కుటుంబాలకు చెందిన గేదెలు** రైల్వే గేటు సమీపంలో గౌతమీ ఎక్స్‌ప్రెస్ ఢీకొంది.
***బీద వ్యవసాయ కూలీలకు చెందిన గేదెలను*** *రైల్వే గేటు సమీపంలో గౌతమి ఎక్స్‌ప్రెస్ ఢీకొంది.*

* * *

సకాలంలో పాఠ్యపుస్తకాలు సరఫరా **కానియెడల** విద్యార్థులు పరీక్షలు తప్పే అవకాశం ఉంది.
*సకాలంలో పాఠ్యపుస్తకాలు సరఫరా* ***కాకపోతే/కాకుంటే*** *విద్యార్థులు పరీక్షలు తప్పే అవకాశం ఉంది.*

* * *

విద్యార్థులకు బహుమతి ప్రదానం **చేయుటకు** ఏర్పాటు చేసిన సమావేశానికి రాష్ట్ర విద్యామంత్రి ముఖ్య అతిథిగా హాజరైనారు.
*విద్యార్థులకు బహుమతి ప్రదానం* ***చేయడానికి*** *ఏర్పాటు చేసిన సమావేశానికి రాష్ట్ర విద్యామంత్రి ముఖ్య అతిథిగా హాజరైనారు.*

* * *

**సభలో** ఇటీవల్ల మృతి చెందిన సుప్రసిద్ధ రచయితలు పద్మశ్రీ మూర్తి కళాప్రపూర్ణ రావులకు సభ శ్రద్ధాంజలి ఘటించింది
*ఇటీవల మృతి చెందిన సుప్రసిద్ధ రచయితలు పద్మశ్రీ మూర్తి కళాప్రపూర్ణ రావులకు సభ శ్రద్ధాంజలి ఘటించింది.*

* * *

హరిజనవాడలో అంబేద్కర్ విగ్రహం **ప్రతిష్ఠన** చేశారు.
*హరిజనవాడలో అంబేద్కర్ విగ్రహాన్ని* ***ప్రతిష్ఠాపన*** *చేశారు.*

* * *

హైదరాబాదులో **అక్రమ నీటివాడకంవల్ల** మెట్రోసంస్థకు నష్టం వస్తున్నది.
హైదరాబాదులో ***నీటిని అక్రమంగా వాడడం*** వల్ల మెట్రో సంస్థకు నష్టం వస్తున్నది.

* * *

హర్తాళ్ **విజయవంతానికి** అన్ని రాజకీయ పక్షాలవారు సహకరించారు.
*హర్తాళ్* ***విజయానికి*** *అన్ని రాజకీయ పక్షాలవారు సహకరించారు.*

* * *

## భాషాస్వరూపం, రచనాశైలి విషయంలో కొన్ని సూచనలు

1. భాష, శైలి నేటి వాడుకభాషకు సన్నిహితంగా ఉండాలి.
2. శబ్ద స్వరూప నిర్ణయంలోనూ, అర్థవివేచనలోనూ రూఢికి ప్రాధాన్యం ఇవ్వాలి.
3. రూప వైవిధ్యాన్ని అంగీకరించాలి. పారిభాషిక పదాల విషయంలో తప్ప [illegible] నియతం కాదు.
4. విషయానికి ప్రాధాన్యమిచ్చిన కర్తకు ప్రాధాన్యం తగ్గించవలసి నప్పుడు తప్ప కర్మణి([illegible]) ప్రయోగం పనికిరాదు.
5. సంధులు చేయరాదు. విసంధిని పాటించాలి. ఉదా:- 'పాలోత్పత్తి' కాదు - 'పాలు ఉత్పత్తి' అనాలి.
6. ఇతర వాక్య పద్ధతులద్వారా సాధ్యం కానప్పుడు, అస్పష్టతను తొలగించడానికి మాత్రమే యత్తదర్థక ప్రయోగం (రెలిటివ్ కన్‌స్ట్రక్షన్) చేయాలి.
7.. అర సున్న 'ఁ', బండి'ఱ'లను వాడనేవద్దు. చే జే లను కూడా వాడనక్కరలేదు. (ఛందస్సు ప్రకారం వ్రాసిన పద్యాలు, కావ్యాంశాలు తప్ప)
8. పంక్తి మొదట సున్నానూ, పొల్లునూ హల్లునూ రాయకండి.
9. ఉచ్చారణలో ధ్వని ఛాయాభేదం వినిపించే సందర్భాల్లో 'స' కారాన్ని 'శ' కారంగా రాయండి. ఉదా. **చేసి-చేశారు, వేసి-వేశారు.**
10. 'ష', 'స' వాడుకలో జాగ్రత్త వహించాలి. తెలుగుపదాలు ఉదా:- **కష్టం, నష్టం** - ఇంగ్లీషు పదాలు లిపి పరివర్తన చేసినప్పుడు **కష్టమ్స్, సిష్టమ్స్** అని రాయకూడదు.
11. వ్యక్తుల, స్థలాల పేర్లనుగాని, ఇంగ్లీషుద్వారా ఎరువుగా వచ్చిన సాంకేతిక పదాలనుగాని లిపి పరివర్తన చేసి రాసేటప్పుడు ఇంగ్లీషు నిఘంటువులలోని ఉచ్చారణ క్రమాన్నిగాని, ఆయా భాషల్లోని ఉచ్చారణ పద్ధతినిగాని యథాతథంగా పాటించటం సాధ్యంకానప్పుడు, విద్యావంతులైన తెలుగువాళ్ళు ఆయా శబ్దాలనూ ధ్వనులనూ ఉచ్చరించే విధానమే ప్రమాణంగా స్వీకరించండి.
12. అన్యదేశ నామాల (హలంతం కానప్పుడు)తుది హ్రస్వాన్ని దీర్ఘంచేసి రాయాలి. దీనివల్ల తెలుగులో అది అన్యదేశమని తెలియడమేగాక విభక్త్యాదులు పరమైనప్పుడు జరుగు వ్యాకరణ కార్యాలు సుకరమవుతాయి.

   ఉదా: ఆసియ - **ఆసియా**, రష్య - **రష్యా**, ఇటలి - [illegible], [illegible] - **టోక్యో**
13. తెలుగులో సాంప్రదాయికంగా అలవాటైన పద్ధతిలోనే రాయండిగాని మూలభాషలోని ఉచ్చారణ పద్ధతిని గ్రహించనక్కరలేదు. ఉదా. **జడ్జి (జజ్-కాదు)**

14. వ్యక్తుల, స్థలాల పేర్లను తెలుగు చేయవద్దు. ఉదా. అలెగ్జాండర్ (అలకసుందరుడు - కాదు).

15. 'క్రింద', 'క్రొత్త, గ్రద్ద, గ్రుడ్డు, త్రాగు, వ్రాత,' వంటి పాత రూపాలు రాయవద్దు. 'కొత్త, గద్ద, గుడ్డు, తాగు రాత,' అని రాయండి.

16. ణ, ళల కింద ఒత్తులుగా 'ణ, ళ'లు రాస్తే చాలు. ఉదా. వాణ్ని, నీళ్లు.

17. వాక్యాంతంలోనూ, ప్రత్యయాలకు ముందూ 'ము' స్థానంలో పూర్వానుసారం/ నిండు సున్న/ రాయండి. ఉదా. మేము వచ్చాం; దేశంలో.

18. కర్త ఏకవచనంలో ఉన్నా గౌరవ సూచనకోసం క్రియను బహువచనంలో రాయవచ్చు. ఉదా. **నెహ్రూ ఇలా అన్నారు.**

19. ఏక/బహువచన రూపాల్లో వచ్చే అర్థభేదం గుర్తించండి. ఉదా. కంది (ఏక వచనంలో ఇది విశేషణం; బహువచనంలో విశేష్యం); నోటు రాశాడు; నోట్సు రాశాడు; నోట్లు రాస్తున్నాడు కాదు - ఈ వాక్యాల్లోని 'నోట్' శబ్దానికున్న అర్థభేదం గమనించండి.

20. ఒకటి రెండు తప్ప తెలుగులో దీర్ఘాంతపదాలు లేవు. దీర్ఘాంతాలైన అన్యదేశ్యాలకు పాక్షికంగా హ్రస్వాంతరూపాలు వాడుకలో ఉన్నాయి. ఉదా: మేస్త్రీ, మేస్త్రి, చప్రాసీ, చప్రాసి.

21. వ్యక్తినామ, స్థలనామాలకు బహువచనం చేర్చి సామాన్య నామాలుగా వాడవచ్చు. ఉదా. **ఎందరు గాంధీలు పుట్టినా హింసాతత్వం పోదు, ఎన్ని ఢిల్లీలున్నా మన దేశం పెద్ద పల్లెటూరే.**

22. కొన్ని అన్యదేశ్యాలను మూలభాషలోని బహువచన రూపంతోనే తెలుగులో వాడవచ్చు. ఉదా. సేల్స్‌మెన్ (సేల్సుమన్లు-కాదు).

23. వాక్యంలో కర్మగా ఉన్న పదం మానవ వాచకమైతే నిత్యంగాను, జడవాచకమైతే వైకల్పికంగాను ద్వితీయావిభక్తి ప్రత్యయం చేరుతుంది. ఉదా. **వాడు ప్రజలను పీడిస్తున్నాడు; వాడు ఏనుగెక్కాడు/ఏనుగునెక్కాడు.**

24. ఆయా విభక్తి ప్రత్యయాలకు బదులు వాక్య రచనా పద్ధతిని మార్చి వాటి అర్థాలను మరింత స్పష్టంగా సూచించవచ్చు.

25. సంఖ్యావాచకాల చివర 'ఓ' చేర్చి విశేషణ రూపాలు కల్పించండి. 'అవ' వాడవద్దు. ఉదా. **రెండో, మూడో. ఇరవయ్యో. (రెండవ, మూడవ, ఇరవయ్యవ వద్దు).**

26. విశేషణాల చివర 'అటువంటి/టటువంటి' - చేర్చి సాగదీయవద్దు. ఉదా. **వచ్చే (వచ్చేటటువంటి-అని రాయకండి).**

27. సాధ్యమయినంతవరకు '**క్రమేణ, ఏతావతా**' వంటి సంస్కృత అవ్యయాలనుగాని, 'పిదప, మరియు' వంటి పాతకాలపు తెలుగు మాటలనుగాని వాడవద్దు.

28. సమాసకల్పనలో ఇంగ్లీషు వంటి అన్య భాషల్లోని క్రమం పాటించకండి. తెలుగు వాడుకను గుర్తించండి. ఉదా. (ఎక్స్-సెంట్రల్ మినిస్టర్ = కేంద్ర మాజీ మంత్రి (మాజీ కేంద్ర మంత్రి- కాదు)

29. తెలుగు నుడికారాన్ని సంస్కృతీకరించ వద్దు. అలాగే అన్యదేశ్య సమాసాలను మక్కికిమక్కి అనువదించవద్దు. ఉదా. the cold touch of poverty = దుర్భర దారిద్ర్యం (దారిద్ర్య శీతలస్పర్శ-కాదు); 'చేయు' వంటివి చేర్చి, హిందీ/ఉర్దూ క్రియారూపాల చివరి 'ఆనా' స్థానంలో 'ఇంచు' చేర్చిగాని, 'చేయు' వంటివి చేర్చిగాని, తెలుగులో క్రియలను సృష్టించవచ్చు. ఉదా:**బౌల్ చేయు/బౌలింగ్ చేయు; ఫిరాయించు; రుబాబ్‌చేయు.**

30. క్రియాజన్య విశేషణాల మీద సర్వనామ పదాలు చేర్చి సార్వనామిక విశేష్యాలను కల్పించటం తెలుగుభాషకు సహజం. వీటితో పురుష బోధ చేయవచ్చు. కాలబోధ సాధ్యంకాదు. ఉదా. **వచ్చే-వాడు, వచ్చే-ది** మొ. వీటికి అన్ని విభక్తుల్లోనూ రూపాలుంటాయి. ఉదా. **వచ్చేవాడు,** వచ్చేవాడివి. ఇత్యాది.

31. తెలుగు వాక్యాలు ప్రధానంగా రెండు రకాలు: (1) క్రియారహితాలు, (2) క్రియాసహితాలు. వాక్యంలో క్రియాపదం ఉండితీరాలనే నియమం తెలుగులో లేదు. ఉదా. **అది చెట్టు** (క్రియారహితం); **ఆమె వచ్చింది** (*క్రియాసహితం).*

32. తెలుగు వాక్యాల్లో సహజమైన క్రమం కర్త-కర్మ-క్రియ. ఈ క్రమాన్ని మార్చి ప్రాధాన్య వివక్ష చేయవచ్చు. ఉదా. **అతడు** నిన్న **వచ్చాడు; అతడు వచ్చింది** నిన్న; నిన్న **వచ్చింది అతడు.**

33. సాధ్యమయినంత వరకు చిన్న చిన్న వాక్యాలు రాయాలి. అసమాపక క్రియలతో వాక్యాలను పొడిగించవద్దు. వీలయినంతవరకు తెలుగుమాటలే వాడండి. సుదీర్ఘ సమాసాలు వాడవద్దు. సాధ్యమయినంతవరకూ అన్యభాషాపదాలు వాడకండి. ఇందులోని కొన్ని సూచనలు తెలుగు అకాడమీ (1984) భాషాశైలి నియమావళినుండి గ్రహించాము.

34. వ్యవహారంలో వున్న **నమ్మకం, నెమ్మది, మొగ(హ)మాటం** వంటి పదాల్ని విశేష్య పదాలుగా మార్చవలసి వచ్చినప్పుడు అల్ప ప్రాణం వత్తు మాత్రమే వస్తుంది. **నమ్మకస్తుడు, నెమ్మదస్తుడు, మొగమాటస్తుడు**గా రాయాలి (మహా ప్రాణం వత్తు 'థ' రాదు). అయితే గ్రామ, కుల, మత, వ్యాపార వంటి సంస్కృత పదాల్ని విశేష్య పదాలుగా మార్చవలసి వచ్చినప్పుడు గ్రామస్థుడు... ఇత్యాది 'థ' వత్తు రాయాలి.

*గమనిక:* ఇందులో కొన్ని సూచనలను తెలుగు అకాడమీ వారి **'భాషాశైలి నియమావళి'** నుండి గ్రహించాను. ఇంకను వ్యాసరచన, వ్యావహారిక భాషాశైలిని గూర్చి తెలుసుకొనగోరువారు భద్రిరాజు కృష్ణమూర్తి, ఎమెనో బరో గార్ల **'వ్యావహారిక వ్యాకరణం'** (ఆక్స్‌ఫర్డ్ ప్రచురణ), తెలుగు తెలుగు నిఘంటువులు - బహుజనపల్లి సీతారామాచార్యులు గారి **శబ్దరత్నాకరం;** కొట్ర శ్యామల కామశాస్త్రిగారి **ఆంధ్ర వాచస్పత్యం;** చలంచర్ల రంగాచార్యులుగారి **ఆంధ్ర శబ్ద రత్నాకరం;** తెలుగు యూనివర్శిటీ వారి **సూర్యాంధ్ర నిఘంటువు; తెలుగు - తెలుగు నిఘంటువు;** జి.ఎన్. రెడ్డిగారి **పర్యాయపద నిఘంటువు;** ముసునూరి వెంకటశాస్త్రిగారి **విద్యార్థి కల్పతరువు** - ఇత్యాది గ్రంథాలను సంప్రదించండి.

# సంప్రదాయ సంస్కృతీ పీఠం

## విషయసూచి

# సంప్రదాయ సంస్కృతీ పీఠం

## వేదములు

### చతుర్వేదములు

వేదములు నాలుగు. అవి ఋగ్వేదము. యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదము. ఈ వేదములందలి మంత్రములు యజ్ఞయాగాదులందు వినియోగింతురు.

**ఋగ్వేదం:** పాదబద్ధములగు మంత్రమును 'ఋక్కు' అని అందురు. ఈ వేదము నందు ఇటువంటి మంత్రములే ఉండుట వలన దీనికి **'ఋగ్వేదము'** అనిపేరు. ఈ వేదమునకు 21 శాఖలు కలవు. ఆ 21 శాఖలలో శాకలశాఖ, బాష్కలశాఖ అనే రెండు శాఖలు మాత్రం ప్రస్తుతం లభించు చున్నవి. యజ్ఞ సమయమునందు హవిర్భాగముల గ్రహించు నిమిత్తం హోతయను ఋత్విక్కు ఈ వేదమంత్ర ములతో దేవతలను ఆహ్వానించును. అందుచే ఈ వేదమునకు **'హౌత్రవేద'** మనిపేరు. ఈ ఋగ్వేదమును 10 మండలములుగ విభజించిరి. ఒక శాఖ వారు 8 అష్టకములుగా విభజించారు.

### యజుర్వేదము

ఇందు కృష్ణయజుర్వేదము శుక్లయజుర్వేదము అనియు రెండు విధములు కలవు. *'తిత్తిరి'* అనుపేరు గల ఆచార్యుడు శిష్యప్రశిష్యులకు బోధించెను. అందుచే 'తైత్తిరీయ'మని పేరు వచ్చింది. ఈ తైత్తిరీయవేదమునకు సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము అను మూడు భాగములు ఉన్నవి. ఈ సంహితయందు 7 అష్టకములు (కాండములు), 44 ప్రశ్నలు (ప్రపాఠకములు) 651 అనువాకములు, 2196 పంచాశత్తులు (పనసలు) ఉన్నవి.

**పనస :-** ప్రతి పనసయందు ఏభయి పదములు ఉన్నవి. అనువాకాంతము నందున్న పనసలకును, అనువాకము నందున్న పనసలకును పదములు కొంచెము హెచ్చు తగ్గులు ఉండును. సంస్కృతభాషలో దీనిని 'పంచాశత్తు' అని అందురు.

### శుక్లయజుర్వేదము

వాజసనేయ సంహిత అని దీనికి మరొక పేరు. ప్రస్తుతం ఈ వేదమునందు మాధ్యందిన శాఖ,కాణ్వశాఖ అని రెండు శాఖలు కలవు. ఈ రెండు శాఖల వారిని తెలుగునాట 'ప్రథమశాఖ' అంటారు. శుక్లయజుర్వేదములో 40 అధ్యాయములు కలవు. ఈవేదమునకు *'శతపథ బ్రాహ్మణము'* అనిపేరు. ఈ వేద మంత్రములతో 'అధ్వర్యుడు' అను ఋత్విక్కు యజ్ఞమునందు హోమాది ప్రధాన కృత్యములను ఆచరించును. సకల కర్మలు ఆపస్తంబ మహర్షి చేసిన కల్ప సూత్రమును అనుసరించి జరిపించు కుంటారు.

## సామవేదము

సామము అనగా గానము. గానము చేయదగదిన మంత్రములు గల వేదము కావున 'సామవేదము' అని పేరు వచ్చింది. ఈ వేదమునకు 1000 శాఖలు కలవని సంప్రదాయం. అయితే ఇప్పుడు ఒకే ఒక్క శాఖ మాత్రము లభించుచున్నది. యజ్ఞకాలమునందు 'ఉద్గాత' అను ఋత్విక్కు ఈ వేదమంత్రములతో గానము చేయుచూ దేవతలను స్తుతించును. అందుచేతనే ఈ వేదమునకు 'ఉద్గాతృవేదము' అని మరొకపేరు ఉంది. ఈ వేదమునకు తాండ్యబ్రాహ్మణము మున్నగు బ్రాహ్మణగ్రంథములు ఎనిమిది కలవు.

## అథర్వవేదము

ఈ వేదమును 20 కాండములుగా విభజించిరి. ఒకప్పుడు ఈ వేదమునకు తొమ్మిదిశాఖలు ఉండేవి. ఇప్పుడు ఒక శాఖ మాత్రమే లభించుచున్నది. ఋత్విక్కు (బ్రహ్మ) అవశ్యము తెలుసుకొనవలసిన విధి ఈ వేదమునందు కలదు. అందుచేత దీనిని బ్రహ్మవేదము అని కూడా అందురు.

ఇతర వేదములకంటె శాంతిక, పౌష్టిక కర్మలు ఈవేదమునందు అధికముగా ఉన్నవి. దీనికి 'గోపథ బ్రాహ్మణము' అని మరొక పేరు కూడ కలదు.

వేదమునందు సంహిత అనియు, బ్రాహ్మణము అనియు ప్రధాన భాగములు కలవు. సంహిత అనగా మంత్రములు మాత్రము గల భాగము. బ్రాహ్మణము అనగా అర్థగాంభీర్యంగల మంత్రముల అర్థములను వివరించునట్టి గాని, మంత్రములను వల్లించుచూ చేయవలసిన పనిని గాని తెలియ జేయునట్టి గ్రంథము. అయితే కృష్ణయజుర్వేదమునకు మాత్రము ఈ లక్షణము సరిపోదు అని విజ్ఞుల అభిప్రాయము.

ప్రస్తుతము వ్యవహారములో ఉన్న విశేషములు: 1. ఋగ్వేదమునకు ఆశ్వలాయన సాంఖ్యాయన సూత్రములును; 2. కృష్ణయజుర్వేదమునకు ఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ, హిరణ్యకేశీయు, మానవ, వైఖానస సూత్రములును; శుక్లయజుర్వేదమునకు పారస్కర, కాత్యాయన సూత్రములు. 3. సామవేదమునకు గోబిల ద్రాహ్యాయణాది సూత్రములు; 4. అథర్వ వేదమునకు కౌశిక సూత్రములును వ్యవహారమున కలవు.

ఆపస్తంబ సూత్రుడు అనగా కృష్ణ యజుర్వేదమునకు చేరినవాడు. వివాహము, ఉపనయనము మొదలగు కర్మలు ఆపస్తంబమహర్షి చేసిన కల్ప సూత్రముననుసరించి జరిపించు కొను వాడనియు గ్రహించవలయును. ఆది నుండియు ఏదియో ఒక వేదమునకు చేరి యుందురు. తరువాత అటులనే ఉండవలయునుగాని ఇష్టానుసారము వేదమునుగాని సూత్రమునుగాని మార్చుకొన వీలులేదు. ఇది ప్రాచీనకాలము నుండి సంక్రమించిన సంప్రదాయము.

సామవేద మంత్రములతో గానము చేయునట్టి ఋత్విక్కు.

**బ్రహ్మ:** ఈ ఋత్విక్కులు చేయునట్టియు, యజమాని చేయునట్టియు సకల కృత్యములను పర్యవేక్షించుచు సాక్షీభూతుడై అనుజ్ఞనిచ్చు ఋత్విక్కు.

**అగ్నీధ్రుడు:** దేవతలకు ఇచ్చునట్టి చరు పురోడాశాది హవిస్సుల చేయుటకును, ఇతర పనులు చేయుటకు సహాయము చేయునట్టి ఋత్విక్కు.

అగ్నిష్టోమము మొదలగు గొప్పగొప్ప యజ్ఞము లందు పైన వివరించిన నలుగురు ఋత్విక్కులకు ఒక్కొక్కరికి ముగ్గురు వంతున సహాయ ఋత్విక్కులు ఉందురు, ఈ కర్మములందు సామాన్యముగా చరు పురోడాశములు అనునవి ఆజ్యముతోబాటు దేవతలకు ప్రత్యేకముగా ఒసగుదురు. చరు అనగా బియ్యముతో వండిన హోమద్రవ్యము. పురోడాశము అనగా బియ్యపు పిండితో కపాలమునందు అనగా నిప్పుమీద కాచిన పెంకులమీద-చక్కగా కాచి పక్వముగా చేసిన పిండిముద్ద.

**ఇష్టి:** అహితాగ్ని అయినవాడు ప్రతిపాడ్యమి యందును చేయవలసిన పని.

**స్రుక్కు:** ముఖ్యములయిన హోమము లను చేయునట్టి యజ్ఞపాత్రము. దీనిని కొయ్యతో చేయుదురు.

**స్రువము:** సామాన్యముగా ఈ పాత్రముతో ప్రాయశ్చిత్త హోమమును చేయుదురు.

**ప్రాయిశ్చిత్తము:** ఒక పనిని చేయవలసిన కాలమునందు చేయకపోయినను, చేయదగని పనిని చేసినను కలుగుచున్న దోషమును పోగొట్టుకొనుటకై చేయునట్టి పని.

**అహితాగ్ని:** గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అను మూడు అగ్నులను ఆధానము చేయు వ్యక్తి.

**పాకయాజి:** ఔపాసనవైశ్వదేవాది సప్తపాక యజ్ఞములను ఆచరించిన వ్యక్తి.

**హవిర్యాజి:** హవిర్యజ్ఞములగు సప్త విర్యజ్ఞములను ఆచరించిన వ్యక్తి.

**సోమయాజి:** సప్తసోమ సంస్థలను ఆచరించిన వ్యక్తి.

**సోమిదమ్మ** : సోమయాజి భార్య.

## వేదాంతములు - ఉపనిషత్తులు

ఉపనిషత్తులులకు మరొక పేరు వేదాంతములు. ఒకప్పుడు మహా ఋషులను ఋషిపుత్రులును ఒక్కచేరి ఆత్మయననేమి? అనాత్మ యననేమి? జీవుడన నెవ్వడు? జీవేశ్వరుల సంబంధమెట్టిది? మనమెచ్చటినుండి వచ్చితిమి? ఎచ్చటకు పోయెదము అను ప్రశ్నలను గురించి చర్చలు జరపగా ఫలించిన జవాబులే ఉపనిషత్తులు. ఈ ఉపనిషత్తుల సంఖ్య అపారము. నూట ఎనిమిది ఉపనషత్తుల పేర్లు ఒకచోట పేర్కొన్నారు. ఇందులో పది ఉపనిషత్తులు మాత్రము ఆది శంకరాచార్యుల కాలమున సర్వాంగీకారము పొందినట్లు తెలియచున్నది. అవి ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, చాందోగ్య, బృహదారణ్యకము - అను దశోపనిషత్తుల మీదనే ఆచార్యుల వారు భాష్యములు రచించారని తెలియచున్నది.

## హిందువుల ప్రార్థనలు

### గణపతి స్తుతి...

శ్లో ॥ శుక్లాంబరధరం, విష్ణుం!
శశివర్ణం చతుర్భుజమ్ !
ప్రసన్నవదనం ధ్యాయే
త్సర్వవిఘ్నోపశాన్తయే ॥

### గురుధ్యానం...

ఓం గురు బ్రహ్మ గురుర్విష్ణు :
గురుర్దేవో మహేశ్వర :
గురుస్సాక్షాత్పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః

### శ్రీరాముని దయచేతను...

శ్రీరాముని దమ చేతను
నా రూఢిగ సకల జనులు నౌరాయనగా
ధారాళమైన నీతులు
నోరూరగ జవులు బుట్ట నుడివెద సుమతీ!

### చేతవెన్న ముద్ద...

చేత వెన్నముద్ద చెంగల్వ పూదండ -
బంగారు మొలతాడు పట్టుదట్టి
సందె తాయెతులును సరిమువ్వ గజ్జెలు
చిన్ని కృష్ణ ! నిన్ను చేరి కొలుతు.

### నీవేతల్లివి దండ్రివి...

నీవేతల్లివి దండ్రివి
నీవే నా తోడు నీడ నీవే సఖుడా
నీవే గురుడవు దైవము
నీవే నా పతియుగతియు నిజముగ కృష్ణా!

### సరస్వతీనమస్తుభ్యం

సరస్వతీనమస్తుభ్యం వరదేకామరూపిణీ
విద్యారంభంకరిష్యామి
సిద్ధిర్భవతుమే సదా,
పద్మపత్ర విశాలాక్ష్మీ పద్మ కేసరవర్ణినీ
నిత్యం పద్మాలయాదేవీ
సామాంపాతు సరస్వతీ

### సర స్వతీస్తుతి...

తల్లీ నిన్నుదలంచి పుస్తకము చేతన్
బూనితిన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా
నుక్తుల్ సుశబ్దంబుఉశో
భిల్లం బల్కుము నాదువాక్కునన్
సంప్రీతిన్ జగన్మోహినీ
పుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ
పూర్ణేందు బింబాననా

### ఎవ్వని చే జనించు...

ఎవ్వనిచే జనించు జగ మెవ్వని
లోపల నుండు లీనమై
ఎవ్వనియందు డిందుపరమేశ్వరు
డెవ్వడుమూలకారణం
బెవ్వడనాది మధ్యలయు డెవ్వడు
సర్వము దానయైనవా
డెవ్వడు వాని నాత్మ భవు నీశ్వరునే
శరణంబు వేడెదన్.

### శాంతి మంత్రం...

ఓం సహ నా వవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినా వ ధీతమస్తు
మావిద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతి:

*శాంతి మంత్రం అర్థం :- మనము కలసి మెలసి యుందుముగాక కలసి ఫలితాన్ని అనుభవించెదముగాక! కలసి పనులను చేయుదుము గాక! తేజో పూర్ణులమయ్యెదముగాక! మాలో మాకు పరస్పర ద్వేష వైషమ్యులు లేకుండుగాక, శాంతి శాంతి శాంతితో విలసిల్లెదముగాక!!!*

# కాలమానము

విశ్వములో నక్షత్రములు, రాశులతో కూడి నక్షత్రము, దాని చుట్టూ గ్రహములు పరిభ్రమిస్తూ ఉంటాయి. అటు వంటి నక్షత్రాల్లో సూర్యగోళము ఒకటి. సూర్యుని చుట్టూ తిరిగే గ్రహములు తొమ్మిది. అందులో 'భూమి' అనే గ్రహం ఒకటి. సూర్యుని చుట్టూ భూమి తిరు గుతూ ఉంటుంది. భూమి చుట్టూ పరిభ్రమించే దాని ఉపగ్రహము చంద్రుడు. వీటి గతులను బట్టి రాత్రి, పగలు ఏర్పడు తూ ఉంటాయి. మానవుని ఆరు కనురెప్ప పాట్ల సమయాన్ని ఒక విగడియ అని సంప్రదాయం. 60 విగడియలు ఒక గడియ. $7\frac{1}{2}$ గడియలు ఒక జాము. 4 జాములు ఒక పగలుగాను, 4 జాములు ఒక రాత్రిగాను అంటే 8 జాములు (ఒక పగలు, ఒక రాత్రి కలిసి) ఒక తిథి లేదా ఒక రోజు (దినము) గాను సంప్రదాయంగా వ్యవహరిస్తున్నారు.

| | |
|---|---|
| కనురెప్పపాటు కాలము | - ఒక సెకను |
| 60 సెకనులు | - ఒక నిమిషము |
| 60 నిమిషములు | - ఒక గంట |
| 24 గంటలు | - ఒక రోజు (దినము) |
| 7 రోజులు | - ఒక వారము |
| 2 వారములు | - ఒక పక్షము |
| 2 పక్షములు | - 1 మాసము |
| 12 మాసములు | - 1 సంవత్సరము |

సాధారణముగా సంవత్సరానికి 365 రోజులు. నాలుగు సంవత్సరాలకు ఒక సారీ అధిక సంవత్సరం (లీపు) 366 రోజులు ఉంటాయి. అంటే అధిక సంవత్సరములో వచ్చే ఫిబ్రవరి మాసములో 29 రోజులు ఉంటాయి. నాలుగు అంకెచే భాగించబడే సంవత్సరాలు అన్ని అధిక (లీపు) సంవత్సరాలే. ఉదాహరణకు 1996 అధిక సంవత్సరము. ఆవిధముగా సంవత్సర కాలంలో 12 మాసములు, 24 పక్షములు, 52 వారములు, 3 కాలములు, 6 ఋతువులు, 365 రోజులు ఉంటాయి.

**కాలమండలములు**

భూమి దాదాపు గుండ్రముగా ఉంది. తన చుట్టూ తాను తిరుగుతుంది. ఇలా తిరగడానికి పట్టే కాలము 24 గంటలు భూమి సూర్యుని చుట్టూ పరిభ్రమిం చడానికి ఒక సంవత్సరము పడుతుంది. ఇలా తన చుట్టూ తాను తిరిగేటప్పుడు భూమి ఒక వైపు మాత్రమే సూర్యుని వైపు ఉంటుంది. భూమికి ఆ వైపు ఉన్న వారికి వెలుగుపడి పగలుగాను మరోవైపు ఉన్న వారికి వెలుగులేక చీకటి గాను ఉంటుంది. ఇలా రాత్రి పగలు ఏర్పడుతూ ఉంటాయి.




| ప్రపంచ గడియారం లండనులో నిట్టమధ్యాహ్నం 12.00 అయినప్పుడు ప్రపంచ నగరాల్లో | |
|---|---|
| ఇస్లామాబాదు | 1700 |
| కెయిరో | 1400 |
| చికాగో | 0600 |
| జినీవా | 1300 |
| జొహనీస్బర్గ్ | 1400 |
| టోక్యో | 2100 |
| దుబాయి | 1500 |
| న్యూఢిల్లీ | 1730 |
| న్యూయార్క్ | 0700 |
| పారిస్ | 1230 |
| బాంకాక్ | 1900 |
| మాస్కో | 1230 |
| లాస్ ఏంజిల్స్ | 0400 |
| వాషింగ్టన్ డి.సి. | 0700 |
| సిడ్నీ | 2200 |
| సింగపూర్ | 1900 |
| హైదరాబాదు | 1730 |

ప్రపంచం 24 కాలమండలాలుగా విభజింపబడింది. ఒక్కొక్క కాలమండలం 15° వెడల్పు ఉంటుంది. అంటే ఒక్కొక్క రేఖాంశం (1°) నాలుగు నిమిషాలు మాత్రమే ఉంటుంది. అందుచేత ప్రపంచాని కంతటికీ ఒకే కాలమానం ఉండదు. ఇంగ్లండులోని లండను సమీపాన ఉన్న గ్రీనిచ్ ద్వారా పోవు రేఖాంశం (0°), ప్రధాన రేఖాంశగా గుర్తింప బడింది. గ్రీన్‌విచ్ మీన్‌టైమ్ (జి.ఎమ్.టి.) ప్రపంచానికంతటికీ ప్రమాణం. 12వ కాల మండలం ప్రపంచం మధ్యగా 180° రేఖాంశ పోతూంది. ఈ రేఖను అనుసరించి అంతర్జాతీయ తేదీ రేఖ పోతూ ఉంటుంది. ఈ రేఖకు పశ్చిమాన్ని ఉన్న వారి కంటె తూర్పున ఉన్న వారికి ఒక రోజు కలిసి వచ్చి ముందు ఉంటారు. కాల మండలాలు సరళరేఖలుగా ఉండక పోవచ్చు. దేశ సరిహద్దులకు అనుగుణంగా ఉంటాయి. భారతీయకాల ప్రమాణాన్ని (ఇండియన్ స్టాండర్డ్ టైమ్) అలహాబాదు సమీపంలో 82° 30' తూర్పురేఖాంశను ప్రమాణంగా స్వీకరించారు. భారత దేశంలో ప్రతిచోట ఒకే కాల మానం అమలులో ఉంది.

కాలమానము - కాలమండలములు

సంప్రదాయ
సంస్కృతి పీఠం

**యుగములు - 4:** కృతయుగము 17,28,000 సంవత్సరములు, త్రేతాయుగము 12,96,000 సంవత్సరములు ద్వాపరయుగము 8,64,000 సంవత్సరములు, కలియుగము 4,32,0000 సంవత్సరములు

## సంవత్సరములు 60

1. ప్రభవ 1987
2. విభవ 1988
3. శుక్ల 1985
4. ప్రమోదూత 1990
5. ప్రజోత్పత్తి 1991
6. ఆంగీరస 1992
7. శ్రీముఖ 1993
8. భావ 1994
9. యువ 1995
10. ధాత 1996
11. ఈశ్వర 1997
12. బహుధాన్య 1998
13. ప్రమాది 1999
14. విక్రమ 2000
15. వృష(విషు) 2001
16. చిత్రభాను 2002
17. స్వభాను 2003
18. తారణ 2004
19. పార్థివ 2005
20. వ్యయ 2006
21. సర్వజిత్తు 2007
22. సర్వధారి 2008
23. విరోధి 2009
24. వికృతి 2010
25. ఖర 2011
26. నందన 2012
27. విజయ 2013
28. జయ 2014
29. మన్మథ 2015
30. దుర్ముఖి 2016
31. హేవిళంబి 2017
32. విళంబి 2018
33. వికారి 2019
34. శార్వరి 2020
35. ప్లవ 2021
36. శుభకృతు 2022
37. శోభకృతు 2023
38. క్రోధి 2024
39. విశ్వావసు 2025
40. పరాభవ 2026
41. ప్లవగ 2027
42. కీలక 2028
43. సౌమ్య 2029
44. సాధారణ 2030
45. విరోధికృతు 2031
46. పరీధావి 2032
47. ప్రమాదీచ 2033
48. ఆనంద 2034
49. రాక్షస 2035
50. నళ 2036
51. పింగళ 2037
52. కాళయుక్తి 2038
53. సిద్ధార్థి 2038
54. రౌద్రి 2039
55. దుర్మతి 2040
56. దుందుభి 2041
57. రుధిరోద్గారి 2042
58. రక్తాక్షి 2043
59. క్రోధన 2044
60. క్షయ 2045

**అయనములు 2** ఉత్తరాయనము-దక్షిణాయనము

**సంవత్సరమునకు ఋతువులు 6- వాటి ధర్మములు: మాసములు ధర్మములు**

1. వసంత ఋతువు - చైత్ర వైశాఖ- వృక్షములు చిగురించి పూవులు పూయును 2. గ్రీష్మ ఋతువు - జ్యేష్ఠ ఆషాఢ- వేసవి ఎండలు 3. వర్ష ఋతువు- శ్రావణ, భాద్రపద - దీర్ఘముగా కురియును. 4. శరదృతువు - ఆశ్వయుజ కార్తీక - వెన్నెల కాయును. 5. హేమంత ఋతువు- మార్గశిర, పుష్య - మంచు పడును. 6. శిశిర ఋతువు-మాఘ ఫల్గుణ - ఆకులు రాలును.

## తెలుగు మాసములు- ఒక వివరణ

భూమిచుట్టూ చంద్రుడు పరిభ్రమిస్తూ ఉండడంవల్ల మనకు రోజుకొక నక్షత్ర మండలమునుండి కనిపిస్తున్నాడని చెప్పవచ్చు. పంచాగ వ్యవహారములనుబట్టి నక్షత్ర మండలములో చంద్రుడు మనకు కనబడుచున్నాడో ఆ నక్షత్రమును ఆనాటి నక్షత్రముగా మనం గుర్తిస్తున్నాము. పూర్ణిమనాడు చంద్రుడు ఏ నక్షత్ర మండలములో కనిపిస్తాడో ఆ నక్షత్రం పేరు ఆ మాసముగా పరిగణిస్తున్నాము. మాటవరుసకు, చిత్తా నక్షత్రం, మండలములో చంద్రుడు పూర్ణిమనాడు కనిపించే మాసమునకు, చైత్ర మాసము గా వ్యవహారము. ఆ విధముగా విశాఖ-వైశాఖ; జ్యేష్ఠ-జేష్ఠ్యం; పూర్వాషాడ; ఉత్తరాషాడములు- ఆషాడము; పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, భాద్రపదము; అశ్వని-అశ్వయజము; కృత్తిక-కార్తీకము; మృగశిర-మార్గశిరము; పుష్యమి-పుష్యము; మఖ-మాఘము; పూర్వఫల్గుని, ఉత్తర ఫల్గుని-పాల్గుణము.అని ఆయా మాసములను పేర్కొనుట. తెలుగునాట సంప్రదాయము ఈ విషయములను గురించి తెలిపేది - **పంచాంగము.** ముఖ్యముగా పంచాంగము అయిదు విషయములను గూర్చి తెలుపుతుంది. అవి: **1. తిథి, 2. వారము, 3. నక్షత్రము, 4. యోగము, 5. కరణము.**

గ్రహములు సంచరిస్తున్న మార్గమును జ్యోతిశ్చక్రముగా ఊహచేసి, దానిని పన్నెండు భాగములుగా భాగించిరి. ఈ పన్నెండు భాగములు పన్నెండు రాశులుగా పరిగణించిరి. ఒక్కొక్క భాగములోనున్న నక్షత్రముల రాశులకు ఒక్కొక్క పేరు పెట్టిరి. మొత్తం నక్షత్రముల సంఖ్య 27. మరల ఒక్కొక్క నక్షత్రమును నాలుగు పాదములు కలదిగా ఊహించి అటువంటి నక్షత్ర భాగములు తొమ్మిదింటిని ఒక రాశిగా పరిగణించారు. వాటి అమరిక-విన్యాసములను ఊహించి ఆ ప్రకారము- 1. మేష, 2. వృషభ, 3. మిథున, 4. కర్కాటక, 5. సింహ, 6. కన్య, 7. తుల, 8.వృశ్చిక, 9. ధనుస్సు, 10. మకర, 11. కుంభ, 12. మీనరాశులు అను పేర్లతో పిలుస్తున్నారు. ఒక్కొక్క నక్షత్రమునకు నాలుగు భాగముల వంతున 27 నక్షత్రములకు (27×4) 108 భాగములు (పాదములు) అయినవి. 9 పాదములు ఒక రాశి కావున 108 పాదములకు 12 రాశులు అయినవి.

**యోగములు 27:** 1. విష్కంభ, 2. ప్రీతి. 3. ఆయుష్మాన్, 4. సౌభాగ్య, 5. శోభన, 6. అతిగండ, 7. సుకర్మ, 8. ధృతి, 9. శూల, 10. గండ, 11. వృద్ధి, 12. ధృవ, 13. వ్యాఘాత, 14 హర్షణ, 15. వజ్ర, 16. సిద్ధి, 17. వ్యతీపాత, 18. ఆవరీయాన్, 19. పరీఘమ, 20. శివ, 21. సిద్ధ, 22. సాధ్య, 23. శుభ, 24. శుక్ల, 25. బ్రాహ్మ, 26. ఐంద్ర, 27. వైధృతి.

**కరణములు 11:** 1. బవ, 2. బాలవ, 3. కేలవ, 4. తైతుల, 5. గరజ, 6. వణిజ, 7. భద్ర, 8. శకుని, 9. చతుష్పాత, 10. నాగవ, 11. కింస్తుఘ్న

**ఋతువులు ఎలా ఏర్పడును? :** సూర్యని చుట్టూ భూమి పరిభ్రమిస్తున్నప్పుడు భూమియొక్క స్థానాన్ని బట్టి ఋతువులు ఏర్పడతాయి. భూమి తన అక్షంపై ఒక వైపుకు ఒరిగి ఉంది. అందుచేత సూర్యరశ్మి భూమి మీద ఒకే విధంగా పడదు. వేసవిలో ఎక్కువ సూర్యరశ్మి శీతాకాలంలో తక్కువ సూర్యరశ్మి భూమిని చేరడంవల్ల ఆయా ప్రాంతాల్లో ఉష్ణోగ్రతలో వ్యత్యాసం కనిపిస్తుండడం కద్దు.

| తెలుగు నెలలు-12 | | ఇంగ్లీషు నెలలు 12 | |
|---|---|---|---|
| 1. చైత్రము | 7. ఆశ్వయుజము | 1. జనవరి (31) | 7. జూలై (31) |
| 2. వైశాఖము | 8. కార్తీకము | 2. ఫిబ్రవరి (28/29*) | 8.ఆగస్టు (31) |
| 3. జ్యేష్ఠము | 9. మార్గశిరము | 3. మార్చి (31) | 9 .సెప్టెంబరు (30) |
| 4. ఆషాఢము | 10. పుష్యము | 4. ఏప్రిల్ (30) | 10. అక్టోబరు (31) |
| 5. శ్రావణము | 11. మాఘము | 5. మే (31) | 11. నవంబరు (30) |
| 6. భాద్రపదము | 12. ఫాల్గుణము | 6.జూన్ (30) | 12. డిసెంబరు (31) |

*లీపు సంవత్సరం

## శక సంవత్సర సూచి

1991 22 మార్చి 1989 - 21 మార్చి 1990
1912 22 మార్చి 1990 - 21 మార్చి 1991
1913 22 మార్చి 1991 - 21 మార్చి 1992
1914 22 మార్చి 1992 - 21 మార్చి 1993
1915 22 మార్చి 1993 - 21 మార్చి 1994
1916 22 మార్చి 1994 - 21 మార్చి 1995
1917 22 మార్చి 1995 - 21 మార్చి 1996
1918 22 మార్చి 1996 - 21 మార్చి 1997
1919 22 మార్చి 1997 - 21 మార్చి 1998
1920 22 మార్చి 1998 - 21 మార్చి 1999
1921 22 మార్చి 1999 - 21 మార్చి 2000
1922 22 మార్చి 2000 - 21 మార్చి 2001

క్రీ.శ. 78 సంవత్సర ప్రాతిపదికగా 'శక' ఏర్పడింది (దీనిని శాలివాహన శకంగా పరిగణిస్తారు). 22 మార్చి 1957 నుండి భారత ప్రభుత్వప్రచురణలన్నిటిలో దీనిని గ్రిగరియన్ కేలండరు విధానంతో పాటు వాడుక చేయాలని చట్ట విధి. ఇతర హిందూ శకములు : విక్రమ శకం క్రీ.పూ. 58; కాల చూరి శకం క్రీ.శ. 248; గుప్త శకం క్రీ.శ. 320 హర్షశకం : క్రీ.శ. 606.

## వారములు - 7

1.ఆదివారము - భానువారము; 2. సోమవారము - ఇందువారము; 3. మంగళవారము - భౌమవారము; 4. బుధవారము - సౌమ్యవారము; 5. లక్ష్మివారము - గురువారముం; 6. శుక్రవారము - భార్గవవారము; 7. శనివారము - మంద(స్థిర)వారము.

## వారములు (ఇంగ్లీషు)

1. సన్ డే, 2. మన్ డే 3. ట్యూజ్ డే; 4. వెడ్నస్ (వెన్స్) డే, 5. తర్స డే; 6. ఫ్రై డే; 7. సాటర్ డే.

## హిందువుల పండుగలు : ఏటా వచ్చే పర్వదినములు

1. ఉగాది చైత్ర శుద్ధ పాడ్యమి (సంవత్సరాది); 2. శ్రీరామ నవమి చైత్ర శుద్ధ నవమి; 3. అక్షతదియ వైశాఖ శుద్ధ తదియ; 4. వ్యాసపున్నమి వైశాఖ శుద్ధ పూర్ణిమ; 5. గురుడ పంచమి శ్రావణ శుద్ధ పంచమి; 6. గోకులాష్టమి శ్రావణ బహుళ అష్టమి; 7. వినాయకచవితి భాద్రపద శుద్ధ చవితి; 8. విజయ దశమి (దసరా) ఆశ్వయుజ శుద్ధ దశమి; 9. దీపావళి అమావాస్య ఆశ్వీయుజ బహుళ అమావాస్య; 10. నాగులచవితి కార్తీక శుద్ధ చవితి; 11. చిలుక ద్వాదశి కార్తీక శుద్ధ ద్వాదశి; 12. శని త్రయోదశి - కార్తీక మాసము శనివారంతో కూడినది. 13. సుబ్బారాయుడు షష్టి మార్గశిర శుద్ధ షష్టి; 14. వైకుంఠ ముక్కోటి ఏకాదశి - మార్గశిర శుద్ధ ఏకాదశి; 15. మకర సంక్రాంతి: భోగి - కనుమ ; 16. శివరాత్రి - మాఘ బహుళ చతుర్దశి; 17. రథ సప్తమి - మాఘ శుద్ధ సప్తమి.

# ముత్యాల ముగ్గులు - రత్నాల ముగ్గులు



## రాశులు - గడియలు

| | |
|---|---|
| 1. మేషము $4\frac{1}{4}$ | 7. తుల 5 |
| 2. వృషభము $4\frac{3}{4}$ | 8. వృశ్చికము $5\frac{1}{4}$ |
| 3. మిథునము $5\frac{1}{4}$ | 9. ధనుస్సు $5\frac{1}{2}$ |
| 4. కర్కాటకము $5\frac{1}{2}$ | 10. మకరము $5\frac{1}{2}$ |
| 5. సింహము $5\frac{1}{4}$ | 11. కుంభము $4\frac{3}{4}$ |
| 6. కన్య 5 | 12. మీనము $4\frac{1}{4}$ |

## జ్యోతిశ్చక్రమునందు నక్షత్రములు - 27

| | | |
|---|---|---|
| 1. అశ్విని | 10. మఖ | 19. మూల |
| 2. భరణి | 11. పుబ్బ | 20. పూర్వాషాఢ |
| 3. కృత్తిక | 12. ఉత్తర | 21. ఉత్తరాషాఢ |
| 4. రోహిణి | 13. హస్త | 22. శ్రవణ |
| 5. మృగశిర | 14. చిత్త | 23. ధనిష్ట |
| 6. ఆర్ద్ర | 15. స్వాతి | 24. శతభిషము |
| 7. పునర్వసు | 16. విశాఖ | 25. పూర్వాభాద్ర |
| 8. పుష్యమి | 17. అనూరాధ | 26. ఉత్తరాభాద్ర |
| 9. ఆశ్లేష | 18. జ్యేష్ఠ | 27. రేవతి |

## కార్తెలు

**(జ్యోతిశ్చక్రమునందుగల నక్షత్రములననుసరించి)**

కార్తె పేరు - ఇంగ్లీషు తేదీలు - ఋతువు

అశ్విని ఏప్రిలు. 11-25 *గ్రీష్మ ఋతువు*
భరణి ఏప్రిలు. 26-9 మే
*మండు వేసవి కాలం*
కృత్తిక మే. 10-23
రోహిణి మే 24-6 జూన్
*ఎండతోపాటు గాలి దుమారం*
మృగశిర జూన్. 7-22 *వర్షఋతువు*
*తొలకరి వర్షాలు ప్రారంభం*
ఆర్ద్ర జూన్. 23-4 జూలై
పునర్వసు. జూలై 5-16
పుష్యమి జూలై. 16-1 ఆగస్టు
*నైర్రుతి ఋతుపవన వర్షాలు*
ఆశ్లేష ఆగస్టు 2-15
మఖ ఆగస్టు 16-26
పుబ్బ ఆగస్టు 30-11 సెప్టెంబరు
*వర్షాకాలం*
ఉత్తర సెప్టెంబరు. 12-25
హస్త సెప్టెంబరు 26-8 అక్టోబర్.
చిత్త అక్టోబరు 8-22 *శరదృతువు*
*ఈశాన్యఋతుపవన వర్షాలు*
స్వాతి అక్టో 23-4 నవంబరు
విశాఖ నవంబరు 1-17
అనూరాధ నవంబరు 18-30
*శీతాకాలపు వర్షాలు*
జ్యేష్ఠ డిసెం. 1-14 *హేమంత ఋతువు*
మూల డిసెంబరు 15-27
పూర్వాషాఢ డిసెంబరు 28 - జనవరి 9
*చలి వేస్తుంది*
ఉత్తరాషాఢ జనవరి. 10-22 *శిశిరఋతువు*
*మంచు కురుస్తుంది*
శ్రవణ జనవరి 23-4 ఫిబ్రవరి
*శిశిర ఋతువు*
ధనిష్ట ఫిబ్రవరి 5-17 - ఫాల్గుణం
శతభిష ఫిబ్ర18-2 మార్చి*వసంతఋతువు*
*ఎండలు ప్రారంభం*
పూర్వాభాద్ర మార్చి. 3-15
ఉత్తరాభాద్ర మార్చి. 16-27
రేవతి మార్చి. 28-ఏప్రిలు 10
*సాధారణ మైన ఎండలు*

## పక్షములు - 2

1. శుక్లపక్షం, 2. కృష్ణపక్షం

### తిథులు 15

| శుక్లపక్షం | కృష్ణ పక్షం |
|---|---|
| 1. పాడ్యమి | 1. పాడ్యమి |
| 2. విదియ | 2. విదియ |
| 3. తదియ | 3. తదియ |
| 4. చవితి | 4. చవితి |
| 5. పంచమి | 5. పంచమి |
| 6. షష్ఠి | 6. షష్ఠి |
| 7. సప్తమి | 7. సప్తమి |
| 8. అష్టమి | 8. అష్టమి |
| 9. నవమి | 9. నవమి |
| 10. దశమి | 10. దశమి |
| 11. ఏకాదశి | 11. ఏకాదశి |
| 12. ద్వాదశి | 12. ద్వాదశి |
| 13. త్రయోదశి | 13. త్రయోదశి |
| 14. చతుర్దశి | 14. చతుర్దశి |
| 15. పూర్ణిమ | 15. అమావాస్య |

## రాశిచక్రము




## దేశ వ్యవహారములు

తూర్పు, పడమర మొదలైనవి వ్యవహారములకు హేతువైన స్వరూపమే 'దేశం' అనే దిక్కు. అట్టి 'దేశం' అఖండమైనా సూర్యోదయ సూర్యాస్తమయములను బట్టి జనులు సూర్యుడు ఉదయకాలము రాగానే ఎక్కడ కనబడుచున్నాడో అది తూర్పుఅనీ దానికి కుడి పక్కన 'దక్షిణము', ఎడమ పక్కన 'ఉత్తరము' వెనుక వైపు 'పడమర' ఖండములుగా కల్పించుకుని అనేక వ్యవహారములందువాడుక చేస్తున్నారు.

## దిక్సూచి



# వైకుంఠ పాళీ

వైకుంఠపాళీ పటంలో 1 నుంచి 132 వరకు అంకెలుగల గళ్ళు ఉంటాయి. ఈ గళ్ళు రకరకాలయిన బొమ్మలతో కూడి ఉంటాయి. ఈ గళ్ళకు దిగువన పాములూ, ఏనుగులూ ఉంటాయి. అది పాతాళమనీ, ఆ ఏనుగులు అష్టదిగ్గజాలనీ పైనున్న భూమి (అంకెలు ఉన్న గళ్ళ)ని ఆ ఎనిమిది ఏనుగులూ మోస్తున్నాయనీ హిందువుల విశ్వాసం.

ఆట ప్రారంభించే ముందు ఆటగాళ్ళు తమ తమ ఆటకాయలను పాతాళంలో ఉంచి పందెం వేస్తూ పందాన్ని బట్టి ఆటకాయలను నడుపుతూ ఉంటారు.

వైకుంఠపాళీ ఆటను ఎందరైనా ఆడవచ్చు. అయితే ఆడే వాళ్ళు మాత్రం ఒక్కొక్కరు ఒక్కొక్కరకం ఆట కాయలను గుర్తుగా ముందే నిర్ణయించుకోవాలి. వైకుంఠపాళీ పటాన్ని పరమపద **సోపాన పట** మని కూడా వ్యవహరిస్తారు. దాన్ని ఆడేవారందరూ తమ ముందు పటాన్ని ఉంచుకుని ఆట ప్రారంభిస్తారు. ఆరు గవ్వలుగాని / పాచికలుగాని పందెం వేస్తూ ఆడుతారు.

వైకుంఠపాళీ పటంలో 16, 19, 30, 41, 52, 63, 65, 74, 79, 87 సంఖ్యలు గల గళ్ళల్లో నిచ్చెనలు ఉన్నాయి. ఏ పందానికైనా ఆటకాయ ఆయా గళ్ళలోనికి వచ్చినప్పుడు అక్కడ వున్న నిచ్చెన సాయంతో పై గడికి చేరుకోవచ్చు. ఉదాహరణకు 16 (**సుగుణం**) గడిలో ఉన్న నిచ్చెన దగ్గరకు ఆటకాయ వచ్చినప్పుడు ఆ నిచ్చెన సాయంతో 28 గడిని (**సాలోక్యం**) చేరుకుంటుంది. అలా చేరుకోవడానికి **'నిచ్చెన ఎక్కడం'** అంటారు. పుణ్యం చేసిన వారికి పుణ్యం దక్కి నిచ్చెన ఎక్కడ మవుతుందని చెప్పుతారు. అప్పుడు పై పందెం వేసుకునే అవకాశం ఇస్తారు. పై పందెంవల్ల మళ్ళీ నిచ్చెన ఎక్కినట్లయితే మళ్ళీ మరో పై పందెం- ఇలా ఆట కొనసాగుతూ ఉంటుంది.

ఈ పటంలో నిచ్చెనలు ఉన్నట్లుగానే అక్కడక్కడ పాములు కూడా ఉన్నాయి. ఆటకాయ నిచ్చెన పాదం దగ్గరికి వచ్చినప్పుడు పైకి వెళ్ళినట్లే పాము తల దగ్గరికి ఆటకాయ వచ్చినప్పుడు పాము కరిచి ఆటకాయ పాముతోక చివరివరకూ కిందికి దిగిపోతుంది. కాగా 26వ గడిలో ఉన్న పాము కరచినప్పుడు దాని తోక ఉన్న 3వ గడికి వచ్చి అక్కడ ఉన్న చిన్న పాము మూలంగా ఆటకాయ పాతాళం చేరుకుంటుంది. ఇట్లు పాముతోక దగ్గరకు రావడాన్ని **'పాము మింగడం'** అంటారు. ఇక 106వ గడిలో ఉన్న పెద్ద పాము మింగిందంటే ఆటకాయ ఒకేసారి 1వ గడిని చేరుకుంటుంది. చివరకు 121 గడిలో ఉన్న పామును తప్పించుకుని 122వ గడికి ఆటకాయ చేరుకున్నట్లయితే పుణ్యపథంలో పడ్డట్టే. అలా, ఆ తరువాతనున్న 132వ గడిని దాటి పైనున్న స్వర్గధామాన్ని ఆటకాయ చేరుకుంటుంది. అక్కడినుంచి చివరివరకూ వెళ్ళి తిరుగుముఖం పట్టి మధ్యనున్న విరాట్ స్వరూపాన్ని చేరుకోవాలి. తిరుగు ముఖం పట్టి, వచ్చేటప్పుడు ఏ పందెంలో సరిగ్గా విరాట్ స్వరూపాన్ని చేరుతుందో ఆ పందెం పడినప్పుడే ఆటకాయ పండినట్లు చెప్పవచ్చును. అంతవరకూ ఆ వరుసలో ముందరికీ వెనుకకూ ఆటకాయను నడుపుతూ ఉండాలి. విరాట్ రూపానికి ఆ వైపూ ఈ వైపూ ఉన్న బొమ్మల్ని ద్వారపాలకులనీ, వారు విరాట్ దర్శనం కాకుండా అడ్డగిస్తూ ఉంటారనీ, అందువల్ల వాళ్ళ చుట్టూ తిరిగిన తర్వాతనే ఆఖరికి విరాట్ దర్శనం **అవుతుందని జనశ్రుతి.**

## వైకుంఠపాళీ పటం




వైకుంఠపాళీ : ఇది నీడ పట్టున ఆడే ఒక ప్రాచీన సంప్రదాయ క్రీడ. హిందువులకు ప్రారబ్ధ కర్మ ఒక సంప్రదాయ భావం. 'పునరపి జననం. పునరపి మరణం' పునర్జన్మ అన్న హిందూ భావన ఇందు ఇమిడి ఉంది. జీవికి చెందిన ప్రారబ్ధ కర్మానుభావాన్ని తెలియజేస్తూ మానవుల దృష్టిని భక్తి, ఏకాగ్రత, దైవచింతనవైపుకు మరల్చే సాధనయే ఈ వైకుంఠపాళీ క్రీడ. ప్రారబ్ధ కర్మలు అనుభవించి పుణ్యలోకాలు చరించి స్వర్గ ప్రాకారాలు ప్రదక్షిణం చేసిన తరువాత విరాట్ రూపమును దర్శించుకొన్న జీవి బ్రహ్మైక్యాన్ని పొందుతుందని హిందువుల విశ్వాసం.



# భగవద్గీత

మహాభారతంలోని భీష్మపర్వంలో 'భగవద్గీత' ప్రస్తావన 24-25 అశ్వాసాల్లో వివరింప బడినది. కురుక్షేత్ర సంగ్రామ సమయాన అర్జునుడు రణరంగంలో స్వజనులతో పోరాటం సల్పనని మొరాయిస్తాడు. అప్పుడు శ్రీ కృష్ణ పరమాత్మ - అర్జునుడు, ఆ యిద్దరి మధ్య జరిగిన సంభాషణయే '**గీతోపదేశం**'. దానినే **భగవద్గీత** అని కూడా అంటారు. ఈ



**గీతోపదేశం**

హితబోధ ప్రధానంగా మూడు విషయాల మీద నడిచింది. 1. కర్మయోగం; 2. జ్ఞాన యోగం; 3. భక్తియోగం. భగవద్గీతలోని సారాంశం హిందూతత్వానికి మూల కందం. అందుచేతనే 'భగవద్గీత'ను హిందువులు తమ పవిత్ర గ్రంథంగా భావిస్తారు. హిందూమత ప్రవక్తలు - శంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్య - ముగ్గురూ గీతోపదేశాన్ని తమతమ మత సంప్రదాయాలకు అనుగుణంగా విశ్లేషించి గీతకు భాష్యాలు చెప్పి వాఖ్యలు వ్రాశారు.

మనస్సును వశపరచుకుని స్థిరచిత్తులుగా ఉండమనీ ఇంద్రియ నిగ్రహం కలిగి చిత్తశుద్ధితో వ్యవహరించమనీ గీతాసారంశం.

> ఉద్ధరే దాత్మనాత్మానంనాత్మాన వసాదయేత్
> ఆత్మైన హ్యాత్మనో బంధుమ రాత్మవ రిపురాత్మన:

తనను తానే బాగు చేసుకోవాలి. తనను తాను అధోగతి పాలు చేసుకొనరాదు. తాను చెప్పినటుల వినే మనస్సు (ఇంద్రియాల్ని అదుపులో పెట్టగల మనస్సు) తనకు చుట్టం. సర్వభూతములందును దయ గలిగి ఉండమని అంటుంది గీత. అప్పుడే అహాన్ని అరిషడ్వర్గాల్నీ జయించగలుగుతారు. 'నేనూ, నావారు, నా కులం' అని నీచ సంకుచిత భావాలను చేరనీయకూడదు. మన మనస్సు మన చెప్పుచేతల్లో ఉంటే మనం అనుకున్నదేదైనా సాధించగలం. అందుకనే

మనకు స్వాధీనంలో ఉండే ఇంద్రియాలు మన చుట్టాలు. మనస్సును అదుపులో పెట్టలేనప్పుడు అవే మన శత్రువులు.

అధైర్యంతోనూ పిరికితనంతోనూ సమస్యలను ఎదుర్కొనకుండ వెన్నుచూపే మానవులందర్నీ కింది శ్లోకం హెచ్చరించింది:

> క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుప పద్యతే
> క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప

గీతలో అర్జున విషాదయోగ, కర్మయోగ, నిష్కామయోగాలు ముఖ్యమైనవి. కర్మ యోగం అంటే ఫలితం ఆశించకుండ పని చేయుట; జ్ఞానయోగంలో సృష్టిని గూర్చి తెలుసుకొనుట; తారకబ్రహ్మ యోగంలో బ్రహ్మ, ఆత్మతత్త్వ కర్మలను గూర్చి అర్జునుడు అడిగిన ప్రశ్నలకు శ్రీకృష్ణుని జవాబులు; రాజరాజ గుహ్యాయోగంలో భూమి పుట్టుక వగయిరా గురించి వివరణ ఇచ్చాడు. పిదప, ఎక్కడ అధర్మం మొదలయి జగత్తులో దౌష్ట్యం విపరీతంగా పెరిగిపోతుందో అప్పుడు తాను మరల మరల అవతారం ఎత్తుతూ దుష్టశిక్షణ; శిష్టరక్షణ చేస్తూ ధర్మాన్ని పునః స్థాపితం నిర్వహిస్తూ ఉంటానని చెప్పాడు.

> పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్।
> ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

విశ్వరూప దర్శనం చూపించగానే అర్జునుడు ఆశ్చర్యచకితుడై శ్రీకృష్ణుని శ్లాఘిస్తాడు. తరువాత భక్తియోగాన్ని గూర్చి శ్రీకృష్ణుడు వివరిస్తాడు. గుణత్రయ విభాగయోగంలో జ్ఞానం యొక్క ఉత్కృష్టతను గూర్చి చెబుతూ ప్రకృతి, పురుషుల నుండి జగత్తు ఆవిర్భావం, సత్త్వం, రజస్సు, తమస్సు అను మూడు ప్రధాన గుణాల (గుణత్రయం) విశిష్టతలను గురించి వివరిస్తాడు. ఇంక, దైవాసుర సంపద్విభాగ యోగంలో మంచి పనులు, చెడ్డ పనులు, శాస్త్రీయ, అశాస్త్రీయ చర్యలను గురించీ చెప్పాడు. తరువాత **'ఓం'** నుగూర్చియు శాస్త్రీయమయిన తపస్సు విధానాన్ని గురించీ వివరిస్తాడు. తర్వాత మోక్ష సన్న్యాసాల్ని వివరిస్తూ జ్ఞాననిష్ఠ, త్యాగం, నిష్కామ కర్మయోగం-గీతోపదేశం యొక్క ఉత్కృష్టతలను గురించీ విశదీకరిస్తాడు.

> కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన ।
> మా కర్మఫల హేతుర్భూర్మాతే సఙ్గోస్త్వ కర్మణిః ॥

"పని (కర్మ)చెయ్యడమే నీ వంతు; దాని (కర్మ) ఫలాన్ని మాత్రం ఆశించకు. ఫలమేదో దక్కుతుందని మాత్రం పని (కర్మ) చెయ్యడం నీ ధ్యేయం కాకూడదు. అలా అని ఏ పనీ (కర్మ) చెయ్యకుండా ఉండనూ కూడదు." అని అర్జునునికి శ్రీకృష్ణపరమాత్మ నిష్కామ కర్మను గూర్చి బోధిస్తాడు. ఇక శ్రీవైష్ణవ సంప్రదాయం ప్రకారం, చివరగా:

> సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకమ్. శరణమ్ వ్రజ
> అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః॥

"సర్వధర్మాలను వదిలివేసి నన్ను ఒక్కడినే (శ్రీకృష్ణుని) శరణు వేడుకో నేనే నిన్ను పాపాలనుండి విముక్తుణ్ణిచేసి నీకు మోక్ష ప్రదానం చేయగల"నని చరమ శ్లోకంగా **'శరణాగతి'** భావాన్ని శ్రీకృష్ణుడు వివరిస్తాడు.



# క్రైస్తవ సంప్రదాయం



## శిఖరాగ్ర ప్రవచనం

*(సెర్మన్ ఆన్ ది మౌంట్)*

ఇది న్యూ టెస్టిమెంట్ - మాత్యూస్ సువార్త ననుసరించి ఏసుక్రీస్తు ప్రప్రథమ ప్రవచన సారాంశం : 1. "పరులు నీపట్ల ఎట్లా ఉండాలను కుంటున్నావో నీవు కూడ పరులపట్ల అలాగే ఉండాలి! 2. నీ అవతలి చెంప కూడా ఇవ్వు!! (టు టర్న్ ది అదర్ చీక్), 3.పరులకు మేలు చేయి (గో ది ఎక్స్ట్రా మైల్), 4. సూకరముల కడ ముత్యాలు చల్లకు; - నిష్ప్రయోజనమైన పనులు చేయకు; 5. పయోముఖ విషకుంభాలు ఉంటాయి, జాగ్రత్త !, 6.చంపదగిన యట్టి శత్రువు చేత జిక్కినా కీడు చేయక మేలు చేసి వదలివేయి; 7.'ఇతరుల మీద బురద చల్లకు, ఆ బురద నీ మీదే పడవచ్చు" - యిత్యాది మంచి మాటలు ఆనాడు వల్లించాడా కరుణా మయుడు. ఇవి, మోజెస్ మౌంట్ శినై శిఖరాగ్రం మీదనుండి వల్లించిన దశ ఆజ్ఞలు *(ది టెన్ కమాండ్మెంట్స్ - ఓల్డ్ టెస్టమెంట్)* కంటె శక్తివంతమైన సుభాషితములని విజ్ఞుల అభిప్రాయం.

## దశ ఆజ్ఞలు

1. నేను నీకు దైవాన్ని - నా కంటె మరొక దైవం నీకు లేడు". 2. నీ దైవాన్ని నిర్లక్ష్యం చెయ్యకు; 3. ప్రార్థనా పర్వదినాన్ని (శాబత్తు) మరవకు; 4. నీకు జన్మనిచ్చిన మాతాపితరులను గౌరవించు; 5. నీవు ఎవరినీ చంపకు; 6. నీవు వ్యభిచరించకు; 7. పరులసొమ్ము దొంగిలించకు; 8. నీ పొరుగు వానికి వ్యతిరేకంగా దొంగ సాక్ష్యం చెప్పకు; 9. పొరుగు వాని ఆస్తిని తస్కరించకు; 10. పరదార గమనం (పరస్త్రీ పొందు) కోరకు.

## క్రైస్తవుల పవిత్ర గ్రంథం: 'బైబిలు'.

*పాత నిబంధన (ఓల్డ్ టెస్టమెంట్)* ను యూదులు పాటిస్తారు. కొత్త నిబంధన (న్యూ టెస్టమెంట్) ను క్రైస్తవులు పాటిస్తారు. సర్వే జనః సుఖినోభవన్తు అనే సర్వ మానవ కల్యాణమే బైబిలులోని ఇతివృత్తం.

## క్రైస్తవ పర్వదినాలు

క్రిస్టమస్ - డిసెంబరు 25; *ఈస్టర్* - వసంతకాలంలో వచ్చే ఆదివారం; *గుడ్ఫ్రైడే* (కొంతమంది ఉపవాసం ఉంటారు); *ఏష్ వెన్స్డే* - ఈస్టర్ ఆదివారానికి ముందు ఏడవ బుధవారం.

## పునరుత్థానం (రిసరెక్షన్)

ఏసుక్రీస్తు సమాధి నుండి పునరుజ్జీవుడై ప్రాణంతో తిరిగి లేచుట. ఈస్టర్ ఆదివారం ముందు శుక్రవారం క్రీస్తు పునరుత్థాన పర్వదినంగా క్రైస్తవులు పాటిస్తారు. ఏసుక్రీస్తును సిలువపై వేసి మేకులు కొట్టి మరణానికి గురి చేసిన దానికి స్మారక చిహ్నంగా ఈ పుణ్యతిథి నాడు పండుగ చేసుకుంటారు. ✶



సంస్కార భోజనం (ఆఖరి భోజనం): (లాస్ట్ సపర్) రేపు మరణిస్తాడనగా ఏసుక్రీస్తు తన శిష్య ప్రవక్త బృందంతో చేసిన రాత్రి భోజనం. బ్రెడ్‌ను కోసి "నా శరీరపు తునకలు ఆరగించడానికి, ఇది నా రక్తం ఒక కప్పు ద్రాక్ష సారాయిని సేవించండి" అని శిష్య బృందానికి తనకు సిలువ వేసి చంపడానికి గుర్తుగా అందించిన దృశ్యం (లీనార్డ్ డావిన్సీ చిత్రించిన వర్ణ చిత్రం 15 వ శతాబ్దం).

* * *



సిలువపై ఏసుక్రీస్తు మరణం: తన శిష్యులలో ఒకడైన జూడాస్ ఇస్కారియేట్ అనేవాడు ముప్పయి నాణాలకు కక్కుర్తిపడి అధికారులకు ఆచూకీ తెలుపగా యూదులు నిర్బంధించారు. అప్పుడు రోమన్ పాలకులు ఏసుక్రీస్తు శిరస్సుపై ముళ్ళకిరీటంపెట్టి సిలువను భుజాలమీద ధరింపజేసి కొండ ఎక్కించి దానిపై అతనిని మేకులతో కొట్టి మరణానికి గురిచేస్తారు.

# ఇస్లాము సంప్రదాయం

## ఈమాన్ - ఇస్లామ్

కొన్ని విషయాలను విశ్వసించడం, అల్లాహ్ ఆజ్ఞల్ని పాలించడం ముస్లిమయిన ప్రతి వ్యక్తి తప్పనిసరి విధి. ఈ విశ్వాసాలు, ఈ ఆజ్ఞాపాలననే ఈమాన్ అని, ఇస్లామ్ అని అంటారు.

--- ఇస్లామ్‌కు సంబంధించిన అయిదు ముఖ్యాంశాలు:

1.అల్లాహ్ తప్ప మరెవరూ ఆరాధ్యులు (ఆరాధనలకు అర్హులు) కారని, ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) అల్లాహ్‌దాసుడు, ఆయన ప్రవక్త లని విశ్వసించడం.

2, రేయింబవళ్ళల్లో అయిదు పూటల నమాజ్ చెయ్యడం.

3, రమజాన్ నెలలో రోజా వ్రతాన్ని పాటించడం.

4. జకాత్‌ని చెల్లించడం.

5. శక్తి స్తోమతులు ఉన్నవారు హాజ్‌కై కాబా (మక్కా) పవిత్ర యాత్ర చెయ్యడం.

## నమాజ్

### అయిదు వేళల నమాజులు, రకాతుల సంఖ్య, సమయం

అ) నమాజ్: ఈమాన్ తరువాత రెండవ ముఖ్యమయిన విధి నమాజ్. ఇది ప్రాజ్ఞులయిన ప్రతి ముస్లిమ్ స్త్రీ పురుషులకు రేయింబవళ్ళల్లో అయిదు వేళలు విధిగా నిర్ణయమయింది. ఏడేళ్ళు నిండగానే బాలబాలికలకు నమాజ్‌ని నిర్దేశించడం విధి.

నమాజ్ నాలుగు రకాలు: 1. ఫర్జ్ నమాజ్ 2. వాజిబ్ నమాజ్ 3. సున్నత్ నమాజ్ (ఇది ఫర్జ్ కాకపోయినా దీన్ని దైవప్రవక్త (సఅసం) క్రమబద్ధంగా చేసేవారు.) 4. నఫిల్ నమాజ్

ఆ) నమాజ్ వేళలు: ఫ్రజ్ నమాజ్ ఉషోదయం తరువాత సూర్యోదయానికి పూర్వం వరకు చెయ్యవచ్చు. 2. జుహర్ నమాజ్ వేళ సూర్యుడు నడినెత్తి నుండి పడమర వైపుకు మరలిన తరువాత ప్రారంభమయి, ఒక వస్తువు నీడ దానికి రెండింతలయ్యేవరకు ఉంటుంది. 3. అస్ర్ సమయం, జుహర్ సమయం ముగిసిన తరువాత ప్రారంభమయు సూర్యాస్తమయం వరకు ఉంటుంది. 4. మగ్రిబ్‌వేళ సూర్యాస్తమయం తరువాత పశ్చిమాన ఎరుపురంగు కానరానంత వరకు ఉంటుంది. దాదాపు 1 గంట,15 నిముషాలు. 5. ఇషావేళ సూర్యాస్తమయానికి గంటన్నర తరువాత ప్రారంభమయి ఉషోదయం వరకు ఉంటుంది. 6. జుమా సమయం: జుహర్ మాదిరిగానే 7. ఈదుల్ ఫిత్ర్: రమజాన్ రోజా వ్రతాలు ముగిసిన పిదప జరుపుకుంటారు. 8. ఈదుల్ అజ్‌హా: జిల్‌హజ్జ పదవ తారీఖున జరుపుకుంటారు. ఇది హజ్రత్ ఇబ్రాహీమ్, హజ్రత్ ఇస్మాయి అల్ (అలైహిముస్సలామ్) చేసిన మహోన్నత త్యాగానికి జ్ఞాపకార్థం జరుపుకునే పండుగ.

రెండు పండుగల నమాజ్ వేళ, సూర్య కాంతి బాగా వ్యాపించిన తరువాత ప్రారంభమయి, సూర్యుడు నడినెత్తిన ఎక్కేవరకు ఉంటుంది.

### ముస్లిము పండుగలు

బక్రీద్, రంజాన్, మొహరమ్, మిలా ఉదీన్ నబీ: ఇస్లామ్ సంప్రదాయంలో చాంద్రమాన పద్ధతిని వాడుక చేస్తారు.

| నమాజుల పట్టిక | | | | | |
|---|---|---|---|---|---|
| నమాజ్ పేరు | ఫర్జ్‌కు పూర్వం సున్నతులు | ఫర్జ్ | ఫర్జ్‌కు తరువాత సున్నతులు | నఫిల్ నమాజ్ | వాజిబ్ నమాజ్ |
| ఫజ్ర్ | 2 | 2 | ఫర్జ్ నమాజ్ తరువాత సూర్యోదయం వరకు మరో నమాజ్ లేదు | | |
| జుహర్ | 4 | 4 | 2 | 2 | - |
| అస్ర్ | 4 | 4 | అస్ర్ తరువాత సూర్యాస్తమయం వరకు మరే నమాజ్ లేదు | | |
| మగ్రిబ్ | - | 3 | 2 | 2 | - |
| ఇషా | 4 | 4 | 2 | 2 | 3 |
| జుమా | 2+4 | 2 | 4 | 2 | - |
| ఈదుల్ ఫిత్ర్ | పండుగల్లో కేవలం రెండు రకాల నమాజ్ మాత్రమే చేస్తారు. ఆ తరువాత ఖుత్బా ప్రసంగం జరుగుతుంది. | | | | 2 |
| ఈదుల్ అజ్‌హా | | | | | 2 |

*ఆధారం: తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ 1994*

**ఇస్లామిక సంవత్సరముల సూచి**

1416 31 మే - 1995 - 15 మే - 1996

1417 16 మే - 1996 - 8 మే - 1997

1418 9 మే - 1997 - 27 ఏప్రిల్ - 1998

1419 28 ఏప్రిల్-1998 - 16 ఏప్రిల్ - 1999

1420 17 ఏప్రిల్ - 1999 5 ఏప్రిల్ - 2000

1421 6 ఏప్రిల్ - 2000

---

**ఇస్లామిక మాసములు**

1. మొహరం - 30 రోజులు
2. సఫర్ - 29 రోజులు
3. రబీ లవల్ - 30 రోజులు
4. రబీ సాని - 29 రోజులు
5. జుమాలవల్ 1 -30 రోజులు
6. జుమాసాని 2- 20 రోజులు
7. రజము - 30 రోజులు
8. షాబాన్ - 29 రోజులు
9. రంజాన్ - 30 రోజులు
10. షవ్వాల్ - 30 రోజులు
11. ధు అల్-ఖడాహ్ 30 రోజులు
12. ధు అల్ - హిజాజ్ - 29/30 రోజులు

ముస్లిముల పవిత్ర గ్రంథం : 'ఖొరాన్'. ఇందులో 'సుర' అనే 114 అధ్యాయాలు ఉన్నాయి. వీటిని ప్రార్థన (నమాజ్) సమయంలో వల్లిస్తారు. మహమ్మదు తన నలభయ్యవ ఏట మక్కా సమీపంలోని పర్వతగుహలో ధ్యానంలో ఆయనకు కలిగిన దివ్యానుభూతి ఫలితంగా రాత్రి సమయంలో ఆకాశవాణి ఆయన చేత ఆ స్తోత్రాలు పలికించిందనీ, అవి వాస్తవానికి 'అల్లా' పలుకులనీ ముస్లిముల విశ్వాసం. ఖొరాన్ పద్యపాదాలు అరబ్బీ భాషలో తాళయుక్తంగా కూర్చబడ్డాయి. ముస్లిములకు ఇవి కంఠస్థం. నమాజ్ (ప్రార్థన), ధార్మిక బుద్ధి, సర్వమానవ సౌభ్రాతృత్వం ఇందులో చోటు చేసుకున్నాయి. ప్రతి వ్యక్తీ ఇతరుల పట్ల వినయ విధేయతలూ అవసర మైనప్పుడు ధైర్య సాహసాలు ప్రదర్శిస్తూ జీవ యాత్ర సాగించాలని ఖొరాన్ బోధన. ✶

## లౌకిక వ్యవహారములందునూ సంప్రదాయ గ్రంథములందునూ కానవచ్చు సంఖ్యావాచకములు

### 2 రెండు సంఖ్యలు గలవి

**ద్వివిధోపాసనము** : సగుణ, నిర్గుణ.

**ద్వివిధాత్మలు** : జీవాత్మ, పరమాత్మ.

**ద్వివిధ కావ్యములు** : దృశ్య, శ్రవ్యకావ్యములు.

### 3 మూడు సంఖ్యలు గలవి

**త్రిమూర్తులు** : బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు (శివుడు)

**త్రిలోకములు** : స్వర్గ లోకము, మర్త్యలోకము, పాతాళలోకము.

**త్రికరణములు** : మనస్సు, వాక్కు, కాయము.

**త్రిగుణములు:(గుణత్రయము)** సత్త్వ గుణము, రజోగుణము, తమోగుణము.

**త్రిమతములు** : అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము.

**త్రిమతాచార్యులు**: శంకర, రామానుజ, మధ్వాచార్య.

**అవస్థాత్రయము** : జాగ్రద వస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ.

**క్రియాత్రయము**: మణి, మంత్రము, ఔషధము.

**నాయికాత్రయము** : స్వీయ, పరకీయ, సామాన్య.

**త్రివిధ నాయికలు** : ముగ్ధ ఉదయించుచున్న యౌవనము లజ్జగల స్త్రీ, మధ్య-సగము లజ్జ వీడిన యువతి ప్రౌఢ-సిగ్గువిడిచిన సంపూర్ణ యౌవనవతి.

**కావ్యరీతి త్రయము** : వైదర్భి, గౌడీ, పాంచాలి.

**పాకత్రయము** : ద్రాక్షా పాకము, కదళీ పాకము, నారికేళపాకము.

**అక్షిత్రయము** : కంచి కామాక్షి, మధుర మీనాక్షి కాశీ విశాలాక్షి.

**అంబాత్రయము** : మూకాంబ, జ్ఞానాంబ, భ్రమరాంబ.

**త్రికాలములు** : భూత కాలము భవిష్యత్తు కాలము, వర్తమాన కాలము.

**శక్తిత్రయము** : ప్రభుశక్తి, ఉత్సాహశక్తి, మంత్రశక్తి.

**ధనగతిత్రయము**: దానము, భోగము, నాశము.

**తాపత్రయము** ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము.

**త్రిదోషములు** : 1. వాత, పిత్త, శ్లేష్మములు.

2. అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవము.

3. పదవాక్య అర్థదోషములు.

4. స్వార్థత్యాగము, పదార్థ స్వీకారము, ప్రాప్తబాధ.

**త్రిక్షారములు** : సజ్జక్షారము, యవాక్షారము, వెలిగారము.

**త్రిపిటకములు(బౌద్ధం)** : సుత్త పిటకము, వినయ పిటకము, అభిధమ్మ పిటకము.

**త్రిపురుషము**: పితృ పితా మహా, ప్రపితా మహులు.

**త్రిగంధము** : ఏలకులు, జాపత్రి, దాల్చినచెక్క.

**త్రిఫలములు** : కరక, తాడి, ఉసిరిక.

**త్రిమదములు** : 1. విద్యా మదము, ధన మదము, కుల మదము. 2. తేనె, శర్కర, నేయి.

**త్రిలింగములు** : శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము.

**త్రివిద్యలు** : ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, భగవద్గీత.

**త్రివిధ రసాభాసములు** : భార్యా భర్తలలో ఒకరికి మాత్రమే అనురాగము గలిగి యుండుట, తిర్యఙ్మ్లేచ్ఛగత శృంగారము, కాంతకు బహునాయకాసక్తి.

**త్రేతాగ్నులు** : జఠరాగ్ని, దావాగ్ని, బడబాగ్ని.

**త్రివిధేషణలు** : దారేషణ- భార్య మొదలగు స్త్రీల యందు ఆశ, పుత్రేషణ-కుమారుల యందలి ఆశ: ధనేషణ - డబ్బు యందలి ఆశ.

**త్రివిధ కాంక్షలు :** కాంత, కనకము, కీర్తి.

## 4 నాలుగు సంఖ్యలు గలవి.

**చతుర్వేదములు :** ఋగ్వేదము, యజుర్వేదము, సామ వేదము, అథర్వవేదము.

**పురుషార్థచతుష్టయములు :** ధర్మము, అర్థము, కామము, మోక్షము.

**చతుర్విధకావ్య నాయకులు:**

*ధీరోదాత్తుడు :* ధైర్యంవంటి ఉదాత్త గుణములు గల వాడు.

*ధీరోద్ధతుడు:* గర్వము, అసూయ క్రోధము వంటి గుణము గల వాడు.

*ధీరశాంతుడు :* ప్రసన్నాత్ముడు, ధీరుడు.;

*ధీరలలితుడు:* నిశ్చింతుడు, కళలలో ఆసక్తి కలవాడు నిరంతరము సుఖజీవన నాభిలాషి

**చతుర్విధ శృంగారనాయకులు**

1. *అనుకూలుడు* - ఒకే : నాయిక యందు అను రాగము గల వాడు, 2. *దక్షిణుడు* - అనేక నాయికలను సమాన ముగా ప్రేమించువాడు, 3. *ధృష్టుడు* - నాయికపట్ల అప చారం చేసి కూడ నిర్భయముగా ప్రవర్తించే వాడు, 4. *శఠుడు* - ఇతరులకు తెలియకుండా నాయికకు మాత్రమే తెలియు నట్లు అప్రియము ఆచరించు వాడు.

**చతుర్విధ కవిత్వములు :** చిత్ర, ఆశు, బంధ, గద్య కవిత్వములు

**చతుర్విధ అభినయములు:** ఆంగిక, వాచిక, సాత్త్విక, ఆహార్య.

**చతుర్విధ ముక్తులు:** సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ములు.

**చతుర్విధ ప్రమాణములు :** ప్రత్యక్ష, అనుమాన, ఉప మాన, శబ్దములు.

**చతుర్విధవ్యూహములు :** వాసు దేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణములు.

**చతుర్విధ అంతఃకరణములు:** మనస్సు, బుద్ధి, చిత్తము, అహం కారములు.

**చతుర్విధరథకులు :** మహా రథుడు, అతిరథుడు, సమ రథుడు, అర్ధరథుడు.

**చతుర్విధ బలములు:** సేనాంగ చతుష్టయము- రథములు, గజములు, తురగములు, పదాతులు.

**చతుర్విధోపాయములు :**

సామము, దానము, భేదము, దండము.

**పురుషజాతి చతుష్టయము :** భద్రుడు, దత్తుడు, కూచి మారుడు, పాంచాలుడు

**స్త్రీజాతి చతుష్టయము :** పద్మిని, హస్తిని, చిత్తిని, శంఖిని.

**వయోవస్థా చతుష్టయము:** బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధక్యము.

**చతురాశ్రమములు :** బ్రహ్మ చర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము.

**కావ్యవృత్తి చతుష్టయము :** కైశికి, ఆరభటి, సాత్వతి, భారతి.

**అంతఃకరణచతుష్టయము :** మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము.

## 5 ఐదు సంఖ్యలు గలవి.

**పంచమహా కావ్యములు (తెలుగు :** మను చరిత్ర(పెద్దన), భట్టుమూర్తి వసు చరిత్ర రాఘవ పాండవీయము, (సూరన్న) పాండురంగ మాహాత్మ్యము (తెనాలి రామకృష్ణుడు) శృంగార నైషధము (శ్రీనాథుడు), పారిజాతాపహరణము(?) పాఠాంతరము (ఆముక్త మాల్యద).

**పంచకన్యలు :** అహల్య, తార, ద్రౌపది, మండోదరి, సీత.

**పంచారామములు :** అమరా రామము, కుమారారామము క్షీరా రామము, ద్రాక్షారామము, భీమారామము.

**పంచాయతన దేవతలు:** అంబిక, ఆదిత్యుడు, గణపతి, మహేశ్వరుడు, విష్ణువు.

**పంచ ముఖములు (పరమే శ్వరుని) :** అఘోరము, ఈశానము, తత్పురు షము, వామ దేవము, సద్యో జాతము.

**పంచపల్లవములు :** జువ్వి, మఱ్ఱి, మామిడి, మేడి, రావి.

**పంచవర్ణములు :** ఆకుపచ్చ, ఎరుపు, తెలుపు, నలుపు, పసుపు.

**పంచభూతములు :** పృధ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము.

**జ్ఞానేంద్రియ పంచకము :** ఘ్రాణేంద్రియము (వాసన -ముక్కు), రస నేంద్రి యము (రుచి -నాలుక), చక్షురింద్రియము (చూపు-కన్ను) త్వగింద్రియము (స్పర్శ-చర్మము), శ్రోత్రేంద్రియము, (వినికిడి-చెవి)

**కర్మేంద్రియపంచకము :** వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ.

**పంచపర్వములు :** కృష్ణ పక్షాష్టమి, కృష్ణపక్ష చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ, సంక్రాంతి.

**పంచమహాపాతకములు:** స్వర్ణస్తేయము, సురా పానము, బ్రహ్మ హత్య, గురుపత్నీ గమనము, మహాపాతక సహవాసము.

**పంచ ప్రాణములు :** ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము.

**పంచోపవాయువులు :** నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము.

**పంచభక్ష్యములు:** భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము.

**పంచ గంగలు :** కావేరి, కృష్ణవేణి, గౌతమి (గోదావరి), తుంగభద్ర, భాగీరథి.

**మాతృపంచకము :** రాజు భార్య, అన్న భార్య, గురువు భార్య, భార్యనుకన్న తల్లి, తన్నుకన్న తల్లి.

**పితృపంచకము:** తన్ను కన్నవాడు, తనకు ఉపనయనము చేసినవాడు, చదువు చెప్పిన గురువు; విపత్తు నందు అన్నము పెట్టి కాపాడినవాడు, ఆపద లందు అభయమిచ్చి రక్షించినవాడు.

**పంచాంగములు :** తిథి, వార, నక్షత్ర,. యోగ,. కరణములు.

**పంచకావ్యములు సంస్కృతము** రఘు వంశము కుమార సంభవము, మేఘ సందేశము, (కాళిదాసు) శిశు పాలవధ (మాఘుడు) కిరాతార్జునీయము (భారవి).

**విష్ణుదేవుని పంచాయుధములు** శంఖము, చక్రము, గద, ఖడ్గము, శార్ఙ్గము.

**పంచగవ్యములు :** గోమూత్రము, గోమయము, గోఘృతము (నెయ్యి), దధి (పెరుగు), గోక్షీరము (పాలు).

**పంచామృతములు :** పాలు, ఉదకము, పెరుగు, నేయి, తేనె.

**పంచపాండవులు:** ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు.

**పంచమహాకవులు:** భారవి, కాళిదాసు, భవభూతి, మాఘుడు, హర్షుడు.

**పంచకర్మలు:**(ఆయుర్వేదము) వమనము, రేచన, అనువాసన, నిరూహ, నస్యము (తర్కము)- ఉత్క్షేపణి, అవక్షేపణ, ఆకుంచన, ప్రసారణ, గమనములు.

**పంచకూల కషాయము:** పిప్పళ్లు, పిప్పలిదుబ్బులు, శేవ్యము, చిత్రకము, శొంఠి-వీటి కషాయము.

**పంచతంత్రము (గ్రంథము):** మిత్రలాభము, మిత్ర భేదము, సంధి - విగ్రహము, లబ్ధనాశం, అసంప్రేక్ష్య కారిత్వము.

**పంచమకారములు:** మత్స్య, మాంస, మధు, ముద్రా- మైధునములు.

**పంచరత్నములు:** వజ్ర, మౌక్తిక, మాణిక్య, నీల మరకతములు.

**పంచలోహములు:** బంగారు, వెండి, ఇత్తడి, కంచు, ఇనుము.

**పంచాక్షరి:** న, మ, శి, వా, య.

**పంచ ఉపపాండవులు:** ప్రతి వింధ్య, సుతసోమ, శుతకీర్తి శతానీక, శ్రుతసేనులు.

**పంచమహాయజ్ఞములు** :- బ్రహ్మయజ్ఞము పవిత్ర గ్రంథములను అధ్యయనము చేసి ప్రచారము చేయుట; దేవయజ్ఞము దైవప్రార్థనములు, ఆరాధనలు; పితృయజ్ఞము - పెద్దలకు కృతజ్ఞత తెలుపుకొనుట, నరయజ్ఞము - మానవసేవ; భూత యజ్ఞము - సర్వ ప్రాణుల పట్ల భూత దయ కలిగి యుండుట.

## 6 ఆరు సంఖ్యలు గలవి.

**అరిషడ్వర్గములు** : కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్స ర్యము.

**షణ్మతములు**: శైవము, వైష్ణవము, శాక్తేయము, గాణాపత్యము, సౌరము, కాపాలము.

**షట్చక్రములు**: మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూస, ఆహిత, విశుద్ధ, హంక్షములు.

**షడీతిబాధలు**: అతివృష్టి, అనావృష్టి మిడుతలు, పంది కొక్కులు, చిలుకలు, సన్నిహిత రాజులు.

**షడ్రసములు**: లవణము (ఉప్పు), ఆమ్లము (పులుపు), కటువు (కారము), మధురము (తీపి), చేదు, త్రికము (ఒగరు)

**షట్కర్మములు** : యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము.

**షట్శాస్త్రములు**: తర్క శాస్త్రము, వ్యాకరణము, వైద్యశాస్త్రం, జ్యోతిషశాస్త్రం, ధర్మశాస్త్రం, మీమాంస.

**షడ్గుణములు**: సంధి చేసికొనుట, కలహించుట, యుద్ధమునకు పోవుట, యుద్ధ కాలమునకు ఎదురు చూచుట, భేద పరచుట, బల వంతులను ఆశ్రయించుట (సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైతము, ఆశ్రయము)

**షడ్గుణైశ్వర్యములు** : జ్ఞానము, ధైర్యము, మాహాత్మ్యము, యశస్సు, శ్రీ, వైరాగ్యము.

**షట్చక్రవర్తులు**: నలుడు, హరిశ్చంద్రుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు, కార్త వీర్యార్జునుడు.

**శ్లోకం** : హరిశ్చంద్రోనలో రాజాపురుకుత్సః పురూరవః సగరః కార్తవీర్యశ్చషడేతే చక్రవర్తినః

## 7 ఏడు సంఖ్యలు గలవి.

**సప్త వ్యసనములు**: జూద మాడుట, స్త్రీలను గోరుట, మద్యపానం, వేటాడుట, కఠినపు మాటలాడుట, పరుల సొమ్మును అప హరించుట, పరులను నిందించుట.

**సప్తవిధకవులు** : ఆర్ధి, భూషణార్థి, రొచికుడు, వాచకుడు, వివేకి, శిల్పకుడు.

**సప్తర్షులు** : అత్రి, కశ్యపుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు, వశిష్టుడు, విశ్వామిత్రుడు.

**సప్త సముద్రములు** : ఇక్షు, క్షీర, ఘృత, జల, దధి, లవణ, సురాసముద్రములు.

**సప్త ద్వీపములు** : కుశద్వీపము, క్రౌంచ ద్వీపము, జంబూద్వీపము, పుష్కరద్వీపము, ప్లక్ష ద్వీపము, శాకద్వీపము, శాల్మల ద్వీపము.

**సప్తమాతృకలు** : ఇంద్రాణి, కౌమారి, చాముండి, బ్రాహ్మి, మహేశ్వరి, వారాహి, వైష్ణవి.

**సప్త వర్షములు**: ఇలావృత్త, కేతుమాల, కురు, భద్రాశ్వ, భారత, రమ్యక, హైరణ్యక.

**సప్త అధోలోకములు**: అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళ ములు.

**సప్త (ఊర్ధ్వ) భువనములు**: భూలోక భువర్లోక, స్వర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్య లోకములు.

**సప్త సంతానములు**: తటాక ప్రతిష్ఠ, ధననిక్షేపము, సత్ర ప్రతిష్ఠ, దేవాలయ ప్రతిష్ఠ, భూదేవాలయస్థాపనము, వనప్రతిష్ఠ అగ్రహార ప్రతిష్ఠ, ప్రబంధ నిర్మాణము.

**సప్తాంగములు(సభకు):** కవీశ్వరులు, విద్వాంసులు, పౌరాణికులు, పూర్వగాధలు చెప్పేవాడు స్తుతి పారకులు, హాస్యకారులు విదూషకులు గాయకులు

## ఎనిమిది సంఖ్యలు గలవి.

**అష్టైశ్వర్యములు:** దాసీ జనము, భృత్యులు, పుత్రులు మిత్రులు, బంధువులు, వాహన ములు, ధనము ధాన్యము.

**అష్టభోగములు:** అన్నము, వస్త్రము, గంధము, పుష్పము, పానుపు, తాంబూలవము, స్త్రీగానము.

**అష్టకష్టములు:** దాన్యము, దారిద్ర్యము, భార్య లేకుండుట, స్వయం కృషి లేకుండుట, యాచించుట, అడిగిన లేదనుట, అప్పువడుట, త్రోవనడచుట.

**అష్టసిద్దులు·** అణిమ (పరమాణు రూపము) మహిమ (విరాడ్రూపము) గరిమ (బ్రహ్మాండాదులు కంటె బరువుగా), లఘిమ (దూదివలె) ప్రాప్తి (వలయు వస్తువు లభింప జేసికొనుట) ప్రాకామ్యము (ఆకాశ సంచారము), ఈశత్వము (సమస్తమునకు అధికారి), వశత్వము (సమస్త భూత జాలమును లోబరచు కొనుట).

**అష్టవసువులు:** వరుణుడు, వృషభుడు నహుషుడు జయుడు, అనిలుడు, విష్ణువు, ప్రభాసుడు, ప్రత్యూషుడు. పారాంతరము : ఆపుడు, ధ్రువుడు, సోముడు, అధర్వుడు, అనిలుడు, ప్రత్యూషుడు, అనలుడు, ప్రభాసుడు.

**అష్టదిగ్గజములు :** ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము సుప్రతాకము.

**అష్టదిగజముల భార్యలు :** అభ్రము, కపిల, పింగల, అనుపమ తామ్రపర్ణి, శుభ్రదంతి, అంగన అంజనావతి.

**అష్టదిగజములు .** అల్లసాని పెద్దన, అయ్యలరాజు రామభద్రుడు తెనాలి రామకృష్ణుడు ధూర్జటి, నంది తిమ్మన, పింగళి సూరన భట్టుమూర్తి, మాదయగారి మల్లన.

**అష్ట మహిషులు :** కాళింది, జాంబవతి, భద్ర, మిత్రవింద, రుక్మిణి, లక్షణ, సత్యభామ, సుదంత, (ఈఎనమండుగురు శ్రీ కృష్ణుని భార్యలు).

**అష్టలక్ష్మి :** గజలక్ష్మి, జయ లక్ష్మి, ధనలక్ష్మి, ధాన్య లక్ష్మి, బలలక్ష్మి, రాజ్యలక్ష్మి, శౌర్యలక్ష్మి, సంతాన లక్ష్మి.

## అష్ట దిక్పాలురు - వివరములు

| దిక్కులు | దిక్పాలకుని పేరు | భార్య పేరు | వాహనం | నివాసం | ఆయుధం |
|---|---|---|---|---|---|
| తూర్పు | ఇంద్రుడు | శచీదేవి | ఐరావతం | అమరావతి | వజ్రాయుధం |
| ఆగ్నేయం | అగ్ని | స్వాహాదే[illegible] | పొట్టేలు | తేజోవతి | కోపము (శక్తి) |
| దక్షిణం | యముడు | [illegible] | [illegible] | సంయమని | కాలపాశం |
| నైరృతి | [illegible] | [illegible] | [illegible] | కృష్ణాంగన | కుంతం |
| పడమర | వరుణుడు | [illegible] | [illegible] | శ్రద్ధావతి | పాశం |
| వాయవ్యము | వాయువు | అంజనాదేవి | లేడి | గంధవతి | ధ్వజం |
| ఉత్తరం | కుబేరుడు | చిత్రలేఖ | శ్వేతాశ్వం | అలకాపురం | ఖడ్గం |
| ఈశాన్యము | శివుడు | పార్వతీ దేవి | వృషభం | కైలాసం | త్రిశూలం |

## అష్టవిధ శృంగార నాయికలు




**అష్టగంధములు:** కర్పూరము, కస్తూరి, పసుపు జవ్వాజి, అగరు పన్నీరు అత్తరు, శ్రీగంధము.

**అష్టాంగపూజ :** (అష్టవిధ అర్చనలు) రంగవల్లి (ముగ్గు) సుగంధము. అక్షతలు, పుష్పములు, ధూపము దీపము ఉపహారము (నైవేద్యము) తాంబూలము.

**అష్టావధానము:** చదరంగము, కవిత్వము, వ్రాయుట, చదువుట, గణితము, సంగీతము యుక్తి **చెప్పుట, వ్యస్తాక్షరి.**

వీటిలో కొన్ని ప్రాంతరాలు: వ్యస్తాక్షరి, దత్తపది, సమస్యాపూరణ, అప్రస్తుత ప్రసంగం.

**అష్ట విధ వివాహములు:** బ్రాహ్మము (కన్యాదానము) దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, రాక్షసము, ఆసురము (కన్యా శుల్కము/ ఓలి ఇచ్చి చేయుట) గాంధర్వము (ప్రేమపెండ్లి), పైశాచకము (బలాత్కారము) **- ఇది అందరికి నింద్యము.**

**అష్ట విధనాయికలు:** స్వాధిన పతిక (చెప్పినట్లు విని కోరినట్లు నడుచు మగడు గలది.) వాసకసజ్జిక (ప్రియునిరాకకై పడక గదిని అలంకరించునది) విరహోత్కంఠిత (సంకేత స్థలమునకు ప్రియుడు రాలేదని విరహావేదనపడు స్త్రీ), విప్రలబ్ధ (ప్రియునిచే వంచింపబడి రాయబారము పంపునది), ఖండిత (భర్త యందు పరస్త్రీ గమనము చూచి ఈర్ష్య పడునది), కలహాంతరిత **(భర్తను అవమానించి పశ్చా**

త్రాపపడునది), (ప్రోషిత భర్తృక (భర్తను తలచు కొనునది - దేశాటనలో ఉన్నప్పుడు), అభిసారిక (చక్కగా అలంకరించుకొని ప్రియుని కోసం సంకేత స్థలమునకు పోవునది).

**అష్టవిధమదములు :** అన్న మదము, అర్థమదము, స్త్రీ మదము,విద్యామదము, కుల మదము, రూప మదము, ఉద్యోగమదము, యౌవన మదము.

**అష్టాక్షరి:**ఓం నమో నారాయణాయ

**అష్టధాతువులు :** బంగారు, వెండి, రాగి, ఇనుము, తగరము, తుత్తు నాగము, సీసము, కంచు.

**అష్టన్యాయ సభాంగములు :** చట్టము (శాసనము), ప్రాడ్వివాకుడు, న్యాయ సభ్యుడు, కరణము, జ్యోస్యుడు, బంగారు, నీరు, నిప్పు.

**అష్టాంగ మార్గములు :** *(గౌతమ బుద్ధుని బోధల సారము)* మంచి భావనము, మంచి భాషణము మంచి యోచనము, మంచి జీవనము, మంచి ధ్యానము, మంచి నిర్ణయము,మంచి నడక (శీలము), ఆత్మ పరిశీలనము.

**అష్టాదశవర్ణనములు :** నగరము సముద్రము, ఋతువు, చంద్రోదయము, అర్కోదయము ఉద్యానము, సలిలక్రీడ, మధుపానము, రతోత్సవము, విప్రలంభము, వివాహము, పుత్రోత్పత్తి, మంత్రము, ద్యూతము, ప్రయాణము, నాయికాభ్యుదయము శైలము, యుద్ధము.

## 9 తొమ్మిది సంఖ్యలు గలవి.

**నవభక్తులు :** పరీక్షిత్తు, నారదుడు, ప్రహ్లాదుడు, భార్గవి పృథుడు, అక్రూరుడు, గరుత్మంతుడు, ధనంజయుడు, బలి చక్రవర్తి.

**నవవిధ స్థాయీభావములు :** రతి, ఉత్సాహము, శోకము, అచ్చెరువు, నవ్వు, భయము, జుగుప్స, శమము, రోషము.

**నవ గోప్యములు :** ఆయుష్య, ధనము, గృహచ్ఛిద్రము, మంత్రము, ఔషధము, మైథునము, దానము, మానము, అవమానము.

**నవకావ్య గుణములు :** శ్లేష, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అరార్థ దీపనము,కాంతి, ఔదార్యము, ఓజస్సు సమాధి.

**నవవిధ ప్రేమోదయావస్థలు:** శ్రద్ధ, సాధు సంగము, [illegible] క్రియ, అనర్థనివృత్తి, నిష్ఠ, రుచి,ఆసక్తి, భావము, ప్రేమ.

**నవ ఆత్మగుణములు :** జ్ఞానము, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, సంస్కారము.

**నవబ్రహ్మలు:** మరీచి, భరద్వాజుడు, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు, వామదేవుడు.

**నవధాన్యములు:** వడ్లు *(ధాన్యము)*, ఉలవలు, పెసలు, మినుములు, నువ్వులు, గోధుమలు, అనుములు, కందులు, సెనగలు.

**నవనిధులు:** మహాపద్మము పద్మము,శంఖము,మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, రవము.

**నవరత్నములు:** వజ్రము, వైడూర్యము, గోమేధికము, పుష్యరాగము, మరకతము, మాణిక్యము, నీలము, ప్రవాళము *(పగడము)* ముత్యము.

**నవరంధ్రములు (శరీరము) :** చెవులు రెండు, నేత్రములు రెండు, నాసారంధ్రములు రెండు, నోరు ఒకటి, మల, మూత్ర రంధ్రములు రెండు.

# దశావతారములు

| | | | | |
|---|---|---|---|---|
| మత్స్యావతారము | కూర్మావతారము | వరాహావతారము | నరసింహావతారము | వామనావతారము |
| పరశురామావతారము | రామావతారము | బలరామావతారము | కృష్ణావతారము | కల్కిఅవతారము |

**నవవిధభక్తులు :** అర్చనము, ఆత్మ నివేదనము, కీర్తనము, దాస్యము, పాదసేవనము, వందనము, శ్రవణము, సఖ్యము, స్మరణము.

**నవ రసములు:** శృంగార, హాస్య, కరుణ,రౌద్ర,వీర, భయానక,బీభత్స,అద్భుత, శాంతరసము.

**నవగ్రహములు:** సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని ,రాహువు, కేతువు.

**10 పది సంఖ్యలు గలవి**

**దశదానములు:** గోదానము భూదానము, తిలదానము, హిరణ్య దానము, వస్త్ర దానము, ఘృతదానము, ధన దానము, ధాన్య దానము, గుడదానము, లవణ దానము.

**దశరూపకములు:** అంకము, ఈహామృగము, డిమము, నాటకము, ప్రకరణము, ప్రహసనము, భాణము, వ్యాయోగము, వీధి, సమవాకారము.

**దశవిధ కావ్యగుణములు :** అర్థవ్యక్తి, ఓజస్సు, ఔదార్యము, ప్రసాదము, కాంతి, మాధుర్యము, శ్లేషము, సమత, సమాధి, సౌకుమార్యము.

**దశోపనిషత్తులు:** ఈశావ్య, ఐతరేయ, కఠ, కేన, ఛాందోగ్య, తైత్తిరీయం, ప్రశ్న, బృహదారణ్యక, మాండూక్య, ముండక ఉపనిషత్తులు.

**దశావతారములు :** శ్లోకం:- మత్స్య కూర్మవరాహశ్చ నారసింహశ్చ. వామన : రామోరామశ్చరామశ్చబుద్ధ కల్కిరేవచ.

*(పాఠ్యాంతరములు: బుద్ధావతారమునకు బదులు శ్రీకృష్ణావతారము ఉంది)*

**మన్మథదశావస్థలు :** కనులతో చూచుట, మనసుపడుట, సంకల్పించుట, నిద్ర

పట్టకుండుట, చిక్కిపోవుట అన్నిటవినుగు పుట్టుట, సిగ్గువిడుచుట, చిత్తభ్రమ నొందుట, మూర్ఛ నొందుట, ఆత్మహత్యకు యత్నించుట.

## 11 పదునొకండు సంఖ్యలు గలవి

**ఏకాదశ రుద్రులు :** ఉగ్రుడు, సోముడు, శర్వుడు, మృగవ్యాధుడు, రంతిజుడు, భిక్షుడు, అహి ర్బుధ్యుడు పినాకి, పాదుకేశ్వరుడు, కాపాలికే యుడు, భౌముడు, (పార్యాంతరములు కలవు).

## 12 పన్నెండు సంఖ్యలు గలవి

**ద్వాదశాదిత్యులు :** ఆర్యముడు, మిత్రుడు, అరుణుడు, అర్కుడు, భగుడు, ఇంద్రుడు, వివస్వంతుడు, పూషుడు, పర్జన్యుడు, త్వష్ట, విష్ణువు, అజఘన్యుడు.

## 13 పదమూడు సంఖ్యలు గలవి

**త్రయోదశ తత్త్వములు :** రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, దర్పము, డంభము, అహంకారము.

## 14 పదునాలుగు సంఖ్యలు గలవి

**చతుర్దశ మనువులు :** స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస , రైవత, చాక్షుష, వైవస్వత, సూర్య సావర్ణిక, దక్ష సావర్ణిక బ్రహ్మ సావర్ణిక, రుద్రసావర్ణిక, ధర్మసావర్ణిక, భౌచ్య మనువులు.

**చతుర్దశవిద్యలు :** ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంసా శాస్త్రము, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము.

**చతుర్దశ భువనములు :** సప్తఅధోలోకములు, సప్త ఊర్ధ్వలోకములు

## 16 పదహారు సంఖ్యలు గలవి:

**షోడశోపచారములు :** ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము.

**షోడశ సంపదలు :** కీర్తి, విద్య, బలము, జయము, పుత్రులు, స్వర్ణము, ధాన్యము, సత్కాలక్షేపము, సద్భోజనము, జ్ఞానము, సౌందర్యము, క్షమ, బాల్యము, ధైర్యము, అరోగత, నిరాయువు.

**షోడశమహాదానములు :** అగ్రహారదానము, అశ్వదానము, కన్యాదానము, గజదానము, గోదానము గృహదానము, భాగ్య దానము, తిలదానము, దాసీదానము, భూదానము, రత్నదానము, రథదానము, శయ్యాదానము, హిరణ్య దానము.

**షోడశకర్మములు :** గర్భాదానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశ్నము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, అగ్నేయము, వైశ్వదేవము గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము.

**షోడశమహారాజులు :** గయుడు, అంబరీషుడు, శశిబిందువు, అనంగుడు, పృథువు, మరుత్వంతుడు, మరుత్తు, సుహోత్రుడు, పరశు రాముడు, శ్రీరాముడు, దిలీపుడు, నృగుడు, రంతిదేవుడు యయాతి, మాంధాత, భగీరథుడు,.

**సోలాశృంగార :** రసికప్రియ గ్రంధమునాధారంగా స్త్రీల శృంగారాలంకరణలు : 1. దంత ధావనం (సుదతి) 2. సలుగుపెట్టి స్నానము చేయుట; 3. ఒంటికి పసుపు పూత; 4.



వస్త్ర ధారణ ( చీర - రవిక దుస్తులు), 5. కాళ్లకు పారాణి; 6. శిరోజాలంకరణ - వాలుజడ, ముడి, కొప్పు, జలపాలు వగయిరా), 7. పుష్పాలంకరణ; 8. పాపిడిలో కుంకుమ; 9. బుగ్గమీద చుక్క (సౌందర్య బిందు); 10. లలాట తిలకం) గంధంతో బొట్టు) 11. చేతులకు గోరింటాకు (హెన్నా-మెహిందీ) 12. తాంబూలం (ఏలకులతో); 13. పునుగు, జవ్వాది పరిమళ ద్రవ్యాలు పూసుకొనుట ; 14. అధరాల్ని ( పెదవుల్ని) ఎరుపు చేయుట 15 కళ్లకు కాటుక పెట్టుకొనుట 16. సర్వాభరణా లంకరణలు - మెడలో కంఠాభరణం, శతమానం/ మంగళ సూత్రం, నల్లపూసలు, చేతులకు గాజులు, చెవులకు దుద్దులు, ముక్కుపుడక, అడ్డబాస, చేతివేలికి ఉంగరం, ఒడ్డాణం, కాళ్లకు పట్టాలు / కడియం , కాలి వేళ్లకు మట్టెలు వగయిరా- అయితే వీటికి సంప్రదాయాచారం ప్రకారం ప్రాంతీయ పారాంతరాలు ఉన్నాయి. వివాహం తర్వాతనే మంగళ సూత్రము, నల్ల పూసలు, పాపిడిలో కుంకుమ, కాలి వేళ్లకు మట్టెలు ఉంటాయని గమనించాలి.

## 18 సంఖ్యలు గలవి

**పురాణములు (18) :** 1. బ్రాహ్మము, 2. పాద్మము, 3. వైష్ణవ, 4. శైవ, 5. భాగవత, 6. భవిష్యోత్తర, 7.నారదీయ, 8.మార్కండేయ, 9.ఆగ్నేయ, 10.బ్రహ్మకైవర్త, 11. లైంగ, 12.వరాహ, 13.స్కాంద, 14.వామన, 15.మత్స్య, 16. కూర్మ, 17.గరుడ, 18.బ్రహ్మాండ.

**ఉపపురాణములు కూడ 18 అవి** 1. సనత్కుమారీయం, 2. నారసింహీయము, 3. స్కాందము, 4. శివధర్మము, 5.దౌర్వాసము, 6.నారదీయం, 7.కాపిలము, 8.మానవము, 9.ఔశనము, 10.బ్రహ్మాండము, 11.వారుణము, 12. కౌశికము; 13 లైంగం, 14 సాంబము, 15. సౌరము, 16. పారాశరము, 17. మారీచము, 18. భార్గవము.

**మీమాంస:** ఇవిరెండు. 1. పూర్వ మీమాంస-జైమినీ మహర్షికృతము, 2. ఉత్తర మీమాంస-వ్యాసమహర్షి కృతము.

**న్యాయం (తర్క) శాస్త్రము:** గౌతముడు, కణాద మహర్షులు సిద్ధపరచిరి.

**అష్టాదశ పర్వములు (మహాభారతము) :** ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ,శల్య, సౌప్తిక, స్త్రీ, శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు.

**అష్టాదశ వర్ణనలు:** నగరము, సముద్రము, ఋతువు, చంద్రోదయము, అర్కోదయము, ఉద్యానము, సలిలక్రీడ, మధుపానము, రతోత్సవము, విప్రలంభము, వివాహము, పుత్రోత్పత్తి, మంత్రము, ద్యూతము, ప్రయాణము, నాయికాభ్యుదయము, శైలము, యుద్ధము.

**64** **చతుష్షష్టి కళలు** : భారతీయ సంస్కృతి సంప్రదాయమునననుసరించి వాత్స్యాయన (కామ సూత్ర) గ్రంధము నాధారంగా కళలు 64 :

1. గీతం. 2.వాద్యం 3. నృత్యం 4. ఆలేఖ్యం 5. విశేషక చ్ఛేద్యం - ముఖకాంతిని విశేషింప చేయునది (బొట్టు మొ.) 6. తండుల కుసుమ బలివికారం( ముగ్గులు) 7.పుష్పాస్తరణం; 8. దశనవసనాంగరాగం; 9 మణి భూమికా కర్మ; 10.శయన రచన; 11. ఉదకవాద్యం; 12.ఉదకాఘాతం; 13. చిత్రాశ్చయోగల; 14.మూల్యగ్రంథన వికల్పాల; 15. శేఖరకా పీడ యోజనం; 16. నేపథ్యప్రయోగం ; 27. కర్ణపత్ర భంగం :: 18గంధయుక్తి; 19. భూషణయోజనం; 20. ఐంద్రజాలం ; 21. కౌచుమారాశ్చయోగం:, 22. హస్త లాఘవం.; 23. విచిత్ర శాకయూషభక్ష్య వికారక్రియ; . 24. పానకరసరాగా సవయోజనం; 25. సూచీవాన కర్మాణి; 26. సూత్రక్రీడ; 27. వీణాడమరుకవాద్యాలు; 28. ప్రహేళికా; 29. ప్రతిమాలా; 30. దుర్వా చకయోగా: 31. పుస్తక వాచనమ్; 32. నాటకాఖ్యాయికా దర్శనమ్;33. కావ్య సమస్యాపూరణం ; 34. పట్టికా వానవేత్ర వికల్పం 35. తక్షకర్మాణి; 36. తక్షణం; 37. వాస్తు విద్య; 38 రూప్యరత్న పరీక్ష; 39. ధాతు వాద:; 40. మణిరాగా కర జ్ఞానం; 41.వృక్షాయు ర్వేదయోగా:; 42. మేషకుక్కుటలావకయుద్ధ విధి 43. శుకసారికా ప్రలాపన.44.ఉత్సాదనే సంవాహనేకేశమర్దనేచ కౌశలం; 45. అక్షర ముష్టికా కథనం; 46. మ్లేచ్ఛితక వికల్పా: 47. దేశభాషావిజ్ఞానం 48. పుష్ప శకటకల; 49. నిమిత్త జ్ఞానం 50. యంత్ర మాతృక 51. ధారణ మాతృక; 52. సంపాఠ్యం 53. మానసీకావ్యక్రియా 54. అభిదానకోశ:; 55. ఛందో జ్ఞానం; 56. క్రియాకల్ప 57. ఛలితకయోగం:; 58. వస్త్రగోపనం; 59.ద్యూత విశేషం: 60. ఆకర్ష క్రీడ ; 61. బాలక్రీడనం: 62.63.64. వైనయికానాం వైజయికానాం వ్యాయామికానాం విద్యానాంజ్ఞానం. (వీటికి పాఠాంతా రాలున్నట్లు తెలుస్తున్నది.)

## 72 యక్షప్రశ్నలు

మహాభారతం ( అరణ్యపర్వం)లో పాండవులు అరణ్యవాసంలో ఉన్నప్పుడు జరిగిన సంఘటనలో యమధర్మరాజు యక్షుడి వేషంలో వచ్చి ధర్మరాజుకు వేసిన 72 చిక్కుముడి ప్రశ్నలు. వాటికి ఆయనిచ్చిన సమాధానాలు :

1. సూర్యుణ్ణి నడుపునదేది ? - **బ్రహ్మం.**
2. సూర్యుణ్ణి సేవించు వారెవరు ?- **దేవతలు.**
3. అతడుదేనిచే అస్తమించును? **ధర్మం.**
4. అతనికి ఆధారమేమి? **సత్యం.**
5. మానవుడు దేనిచే శ్రోత్రియుడవుతాడు? **వేదం.**
6. మానవుడు దేనిచేత మహిమ పొందుతాడు? **తపస్సు.**
7. మానవునికి సహాయపడునదేది? **ధైర్యం**
8. మానవుడు దేనివల్ల బుద్ధిమంతుడు అవుతాడు? **విద్వాంసుని సేవించడం వల్ల**
9. మానవుడు మానవత్వమును ఎట్లు పొందును? **అధ్యయనము వలన.**
10. మానవునికి సాధుత్వా సాధుత్వాలు ఎట్లు సంభవిస్తాయి - **నిరంతరమూ వ్రతాచరణం వల్ల సాధుత్వమూ శిష్టాచార భ్రష్టత్వం వల్ల అసాధుత్వమూ.**
11. మానవుడు మనుష్యుడెట్లు అవుతాడు? **మృత్యుభయాన**
12. జీవన్మృతుడెవరు? **దేవతలకూ**

**అతిథులకూ పితృసేవకాదులకు పెట్టకుండా తినువాడు.**

13. భూమికంటె భారమైనది ఏది? జనని.

14. ఆకాశంకంటే పొడవైనది ఏది? తండ్రి.

15. గాలికంటె వేగమైనదేది; మనస్సు.

16. మానవునికి సజ్జనత్వం ఎలావస్తుంది?

**ఇతరులు తన పట్ల ఏపని చేస్తే ఏ మాట మాట్లాడితే తన మనస్సుకు బాధ కలుగుతుందో తాను ఇతరుల పట్ల ఆ పని చేయకుండా, ఆ భావము రానీయ కుండా ఆమాటలు మాట్లాడకుండా ఎవడు ఉంటాడో అట్టి వానికి సజ్జనత్వం వస్తుంది.**

17. తృణం కంటె దట్టమైనది ఏది ? చింత;

18. నిద్రలో కూడా కన్ను మూయనిది ఏది?

**చేప.**

19. రాజ్యమేలే వాడు దైవత్వం ఎలా పొందుతాడు? **అస్త్రవిద్యచే.**

20.రాజ్యాధినేతకు సజ్జనత్వం ఎలా కలుగుతుంది.

**యజ్ఞం చేయుటవలన.**

21 జన్మించియు ప్రాణంలేనిది? గుడ్డు.

22. రూపం ఉన్నా హృదయంలేనిదేది? రాయి.

23.మానవుడికి దుర్జనత్వం ఎలా వస్తుంది? **శరణుజొచ్చిన వారిని రక్షించక పోవడం వల్ల.**

24.ఎల్లప్పుడూ వేగం గలదేది? నది.

25. రైతుకు ఏది ముఖ్యం? వాన.

26. బాటసారికి, రోగికి, గృహస్థునకూ, చనిపోయిన వానికి బంధువులెవ్వరు?

**సార్థం, వైద్యుడు, శీలవతి అనుకూలవతి అయిన భార్య, సుకర్మ వరుసగా బంధువులు.**

27. ధర్మానికి ఆధారమేది? దయ దాక్షిణ్యం.

28. కీర్తికి ఆశ్రయమేది దానం.

29. దేవలోకానికి దారి ఏది? సత్యం.

30. సుఖానికి ఆధారం ఏది?

శీలం.

31. మనిషికి దైవిక బంధువులెవరు? భార్య/భర్త.

32. మనిషికి ఆత్మ ఎవరు? కుమారుడు.

33. మానవునకు జీవనాధారమేది?

**మేఘం.**

34. మనిషి దేనివల్ల సంతసించును?

**దానం.**

35. లాభాల్లో గొప్పది ఏది?

**ఆరోగ్యం.**

36. సుఖాల్లో గొప్పది ఏది?

**సంతోషం.**

37. ధర్మాల్లో ఉత్తమమైన దేది?

**అహింస.**

38.దేనిని నిగ్రహిస్తే సంతోషం కలుగు తుంది?

**మనస్సు.**

39. ఎవరితో సంధి శిధిలమవదు? **సజ్జనులతో.**

40. ఎల్లప్పుడునూ తృప్తిగా పడి యుండునదేది?

**యాగకర్మ.**

41. లోకానికి దిక్కు ఎవరు? **సత్పురుషులు.**

42. అన్నోదకాలు వేనియందు ఉద్భవిస్తాయి?

**భూమి, ఆకాశములందు.**

43. లోకాన్ని కప్పివున్నది ఏది? **అజ్ఞానం.**

44. శ్రాద్ధవిధికి సమయమేది?

**బ్రాహ్మణుడు వచ్చినప్పుడు.**

45. మనిషిదేనిని విడచి సర్వజనాదరణీయుడు శోకరహితుడు ధనవంతుడు, సుఖవంతుడు అగును?

**వరుసగా గర్వం క్రోధం, లోభం, తృష్ణ విడచినచో.**

46. తపస్సు అంటే ఏమిటి?
తన వృత్తికుల ధర్మం ఆచరించడం.

47. క్షమ అంటే ?ద్వంద్వాలు సహించడం.

48. సిగ్గు అంటే ఏమిటి?
చేయరాని పనులంటే జడవడం.

49. సర్వధనియనదగు వాడెవడు?
ప్రియా ప్రియాలను సుఖఃదుఖాలను సమంగా ఎంచువాడు.

50. జ్ఞానం అంటే ఏమిటి?
మంచి చెడ్డల్ని గుర్తించ గలగడం.

51.దయ అంటే ఏమిటి?
ప్రాణులన్నిటి సుఖమూ కోరడం.

52. ఆర్జవం అంటే ఏమిటి?
ఎదా సమభావం కలిగి వుండడం.

53. సోమరితనం అంటే ఏమిటి?
ధర్మం నెరవేర్చకుండా ఉండడం.

54. శోకం అంటే ఏమిటి?
అజ్ఞానం కలిగి ఉండటం.

55. ధైర్యం అంటే ఏమిటి?
ఇంద్రియ నిగ్రహం.

56. స్నానం అంటే ఏమిటి?
మనస్సులో మాలిన్యం లేకుండా చేసుకొనడం.

57. దానం అంటే ఏమిటి?
సమస్తప్రాణుల్నీ రక్షించడం.

58. పండితుడెవడు? ధర్మం తెలిసినవాడు.

59.మూర్ఖుడెవరు?
ధర్మం తెలియక అడ్డంగా వాదించేవాడు.

60.ఏది కాయం? సంసారానికి కారణమైంది.

61. అహంకారం అంటే ఏమిటి? అజ్ఞానం.

62. దంభం అంటే ఏమిటి?
తన గొప్పతానే చెప్పుకొవటం.

63. ధర్మం, అర్థం, కామం ఎక్కడ కలియును?
తన భార్యలో తన భర్తలో.

64. నరకం అనుభవించే వారెవరు?
ఆశపెట్టి దానం ఇవ్వనివాడు; వేదాల్నీ ధర్మ శాస్త్రాల్నీ దేవతల్నీ పితృదేవతల్నీ బ్రాహ్మల్నీ ద్వేషించేవాడూ, దానం చెయ్యనివాడు.

65. బ్రాహ్మణత్వం ఇచ్చేది ఏది? కులమా? ప్రవర్తనా? వేదాలు చదవడమా? శాస్త్రజ్ఞానమా?
ప్రవర్తన మాత్రమే.

66. మంచిగా మాట్లాడే వాడికి ఏమి దొరుకుతుంది? మైత్రి.

67. ఆలోచించి పని చేసేవాడు ఏమవు తాడు?
అందరి ప్రశంసలుపొంది. గొప్పవాడవుతాడు.

68. ఎక్కువ మంది మిత్రులు వున్నవాడు ఏమవుతాడు? సుఖపడతాడు.

69. ఎవడు సంతోషంగా ఉంటాడు.
అప్పులేని వాడు. తన ఇంట్లోనే వుంటూ ఏ ఆకో అలమో వండించుకుని తినువాడు.

70. ఏది ఆశ్చర్యం?
ప్రాణులు ప్రతి రోజూ మరణిస్తూ ఉండడం చూస్తూ మనిషి తానే శాశ్వతంగా ఈ భూమిమీద ఉండి పోతానను కోవడం.

71. లోకంలో అందరికన్నా ధననంతుడెవరు?
ప్రియమూ అప్రియమూ, సుఖమూ దుఃఖమూ మొదలైన వాటిని సమంగా చూసేవాడు.

72. స్థితప్రజ్ఞుడని ఎవరిని అంటారు?
నిందాస్తుతులందూ శీతోష్ణాదులందు, కలిమి లేములందూ సుఖదుః ఖాదులందూ సముడై, లభించిన దానితో సంతృప్తుడై అభిమానాన్నివిడచి అరిషడ్వర్గాలను జయించి స్థిరబుద్ధికలవాడై ఎవరైతే ఉంటాడో వానినే స్థితప్రజ్ఞడంటారు.

## కొన్ని పురాణనామములు వాటి వ్యుత్పత్తి

| వాచక శబ్దములు | వివరణ | ప్రయోగము |
|---|---|---|
| ఆంజనేయుడు | అంజనీదేవి కుమారుడు | హనుమంతుడు |
| ఆదిత్యులు | అదితికుమారులు | దేవతలు |
| కార్తికేయుడు | శివుని కుమారుడు | కుమారస్వామి |
| కౌంతేయులు | కుంతి కుమారులు | ధర్మభీమార్జునులు |
| గాంగేయుడు | గంగకుమారుడు | భీష్ముడు |
| చక్రి | చక్రముగలవాడు | విష్ణుమూర్తి |
| జానకి | జనక మహారాజు కుమార్తె | సీత |
| దాశరథి | దశరథుని కుమారుడు | శ్రీరాముడు |
| దైత్యులు | దితికుమారులు | రాక్షసులు |
| ద్రౌపది | ద్రుపదుని కుమార్తె | పాండవ పత్ని |
| పావని | పవనుని కుమారుడు | హనుమంతుడు |
| పార్థుడు | పృథకుమారుడు | అర్జునుడు |
| మానవులు | మనువు కుమారులు | మనుష్యులు |
| మైనాకుడు | మేనక కుమారుడు | హిమవంతుని కుమారుడు |
| మార్కండేయుడు | మృకండుని కుమారుడు | మృత్యుంజయుడు |
| రాధేయుడు | రాధ కుమారుడు | కర్ణుడు |
| వజ్రి | వజ్రాయుధముకలవాడు | ఇంద్రుడు |
| వాల్మీకి | వల్మీకములో పుట్టినవాడు | ఆదికవి |
| వైనతేయుడు | వినతకుమారుడు | గరుత్మంతుడు |
| వైరోచని | విరోచనుని కుమారుడు | బలిచక్రవర్తి |
| శూలి | శూలము కలవాడు | శివుడు |
| సాత్యకి | సత్యకుని కుమారుడు | కృష్ణుని సోదరుడు |
| సాత్రాజితి | సత్రాజిత్తు కుమార్తె | సత్యభామ |
| సౌమిత్రి | సుమిత్ర కుమారుడు | లక్ష్మణుడు |
| సౌభద్రుడు | సుభద్రకుమారుడు | అభిమన్యుడు |
| హైమవతి | హిమవంతుని కుమార్తె | శివుని పత్ని |

## భారతీయ సంప్రదాయంలో వైతాళికులు

**అశ్వనీదేవతలు:** మొట్టమొదటి వైద్యులు.

**ఆపస్తంభుడు:** కల్ప సూత్రకర్త.

**ఆర్యభట్టు :** ప్రప్రదమ ఖగోళ విజ్ఞాని.

**కణాదుడు :** మొట్టమొదటి భౌతిక శాస్త్రవేత్త

**కౌటిల్యుడు: (చాణక్యుడు)** మొట్టమొదటి ఆర్థిక రాజనీతి వేత్త. (పొలిటికల్ టెక్నాలజిస్ట్). ఆర్థికశాస్త్ర గ్రంథ కర్త.

**గణపతి :** మొట్టమొదటి లేఖరి

**గౌతముడు :** మొట్ట మొదటి సూత్ర కర్త గౌతమ స్మృతి.

**చరకుడు :** మానవశరీర చికిత్సా విధానమును ప్రవేశపెట్టిన వారిలో మొట్టమొదటి వాడు.

**తుంబురుడు :** ప్రప్రధమ వాద్యకారులలో ఒకరు. భృంగి, తుంబురు లలో ఒకరు.

**ధన్వంతరి :** ప్రపథమ ఔషధాల యోగకర్త.

**నటరాజు :** మొట్టమొదటి నర్తకుడు (తాండవం).

**నన్నయ్య :** ఆదికవి - (తెలుగు) మహాభారతము

**నారదుడు :** మొట్టమొదటి హరి కధకుడు.

**పతంజలి :** మొట్టమొదటి యోగ శాస్త్ర వేత్త

**పరాశరుడు :** ధర్మ సూత్ర కర్త.

**పాణిని :** మొట్టమొదటి వ్యాకరణ కర్త.

**బ్రహ్మగుప్తుడు :** బ్రహ్మస్ఫుట సిద్ధాంతం ద్వారా '0' సున్నా భావాన్ని ప్రపంచానికి ప్రప్రధమంగా అందించిన వాడు.

**భర్తృహరి :** మొట్టమొదటి సుభాషిత కర్త.

**భాస్కరాచార్య:** మొట్టమొదటి గణిత వేత్త : *లీలావతి గణితము కర్త .*

**భృంగి :** ప్రపధమ వాద్యకారులలో ఒకరు - భృంగి తుంబురు లలో ఒకరు.

**మనువు :** మొట్ట మొదటి సంఘ శాసన *(మనస్మృతి)* కర్త.

**యాజ్ఞవల్క్యుడు :** న్యాయ శాస్త్ర కర్త.

**వరాహమిహిరుడు :** మొట్ట మొదటి జ్యోతిష శాస్త్ర వేత్త. (బృహత్సహితకం)

**వాగ్భటుడు :** ఆయుర్వేద వైద్య చికిత్సా విధానంలో ఔషధ యోగ ప్రక్రియలను (ఫార్మకోపియా) సిద్ధపరచినవాడు. (క్రీ.శ. 7 వ శతా).

**వాత్స్యాయనుడు :** మొట్టమొదటి కామశాస్త్ర గ్రంథకర్త.

**వాల్మీకి :** ఆదికవి - సంస్కృత రామాయణ కావ్య కర్త.

**విశ్వకర్మ :** మొట్టమొదటి వాస్తు శిల్పి.

**వ్యాసుడు :** మొట్టమొదటి ఇతిహాస వ్యాఖ్యాత - సంస్కృత మహాభారతము.

**సంజయుడు:** మొట్ట మొదటి యుద్ధ విలేఖరి.

**సుశ్రుతుడు:** వైద్య చికిత్సా విధానంలో మొట్ట మొదటి వాడు.

**సూతుడు :** మొట్టమొదటి పౌరాణికుడు.

## పురాణ పురుష రూఢివాచక శబ్దములు

| వాచక శబ్దములు | వివరణ | ప్రయోగము |
|---|---|---|
| అగస్త్య భ్రాత | అగస్త్యమహర్షి సోదరుడు | అనామకుడు |
| అర్జునుడు | ధర్మరాజు సోదరుడు | యుద్ధరంగములో అపజయము ఎరుగని వాడు |
| అగ్నిహోత్రుడు | అగ్నిదేవుడు | పరిశుద్ధుడు, సర్వభక్షకుడు |
| అనాథుడు | ప్రభువులేని వాడు | వ్యర్థుడు |
| ఆకతాయి | విషముపెట్టిచంప ప్రయత్నించువాడు | పోకిరి |
| ఇంద్రజిత్తు | రావణుని కుమారుడు | అతి తంత్రగాడు |
| కంసుడు | ఉగ్రసేనుని కుమారుడు | పరమ దుర్మార్గుడు |
| కర్ణుడు | కుంతీ పుత్రుడు | మహాదాత |
| కర్కోటకుడు | సర్పముల రాజు | కఠిన చిత్తుడు |
| కుంభకర్ణుడు | రావణుని సోదరుడు | నిద్రముచ్చు |
| కాలాంతకుడు | యముడు | మహాసమర్థుడు |
| కుబేరుడు | ఉత్తర దిక్పాలుడు | అతి ధనశాలి |
| గణపతి, (వినాయక, విఘ్నేశ్వర) | ఈశ్వరుని కుమారుడు | అవిఘ్నకారి, బొజ్జకలవాడు, మొట్ట మొదటి లేఖరి. |
| చిత్రగుప్తుడు | యముని వద్ద లెక్కలు వ్రాసేవాడు | మిక్కిలి వ్రాతకాడు |
| జాంబవంతుడు | బ్రహ్మదేవుని కుమారుడు | అతివయోవంతుడు |
| తక్షకుడు | ఒక సర్పరాజు | మిక్కిలి క్రూరుడు |
| దుర్వాసుడు | మహాముని | ముక్కోపి |
| ధర్మరాజు | పాండవుల జ్యేష్ఠుడు | ధర్మము తప్పని వాడు |
| ధృతరాష్ట్రుడు | దుర్యోధనాదుల తండ్రి | పుట్టంధువు |
| నక్షత్రకుడు | విశ్వామిత్రుని శిష్యుడు | పట్టువిడవని వాడు |
| నలకూబరుడు | కుబేరుని కుమారుడు | మంచి రూపసి |
| నారదుడు | బ్రహ్మదేవుని కుమారుడు | కలహప్రియుడు త్రిలోక సంచారి |
| బకాసురుడు | గంధర్వుడు మహాబలవంతుడు | తిండిపోతు ప్రజాపీడకుడు |
| బలిచక్రవర్తి | ఒక రాక్షసుడు | గొప్పదాత |
| బృహస్పతి | దేవగురువు | మిక్కిలి బుద్ధిమంతుడు |
| భీముడు | ధర్మరాజు సోదరుడు | అతి బలశాలి |

| వాచక శబ్దములు | వివరణ | ప్రయోగము |
|---|---|---|
| మన్మథుడు | కృష్ణుని కుమారుడు | మిక్కిలి అందగాడు |
| మారీచుడు | రావణునిమిత్రుడు (రాక్షసుడు) | మాయలమారి |
| యమధర్మరాజు | దక్షిణదిక్పాలుడు | అతిభయంకరుడు |
| రావణుడు | పులస్త్య బ్రహ్మ మనుమడు రాక్షసుడు | లంకాధిపతి, అతి సమర్థుడు |
| విష్వక్సేనుడు | విష్ణువు యొక్క సేనాని | విఘ్నములు పోగొట్టువాడు |
| వైదికుడు | వేదము చదివినవాడు | లౌకికము తెలియని వాడు |
| శనైశ్చరుడు | నవగ్రహములలో ఏడవ గ్రహము | అదృష్టహీనుడు |
| శకుని | దుర్యోధనుని మేనమామ | కపటి |
| శల్యుడు | కర్ణుని సారథి | దొంగసారధి |
| శుక్రాచార్యుడు | రాక్షస గురువు | ఏకాక్షి |
| శ్రీరాముడు | దశరథునికుమారుడు | ఆదర్శపురుషుడు |
| సైంధవుడు | దుర్యోధనుని బావ మరిది | కార్యహాని చేయువాడు |
| హరిశ్చంద్రుడు | ఇక్ష్వాకుల వంశపురాజు | సత్యమునే పలికేవాడు |

## చరిత్ర రూఢి వాచక శబ్దములు

| | | |
|---|---|---|
| అమరజీవి | పొట్టి శ్రీరాములు | ఆంధ్రరాష్ట్ర అవతరణకై ఆత్మార్పణ చేసినవాడు |
| ఆంధ్ర కేసరి | టంగుటూరి ప్రకాశం | జాతీయ నాయకుడు |
| ఆంధ్రరత్న | దుగ్గిరాల గోపాలకృష్ణయ్య | స్వాతంత్ర్యసమరయోధుడు |
| ఛత్రపతి | శివాజీ | మరాఠా రాజ్యనేత |
| దేశబంధు | చిత్తరంజన దాసు | జాతీయ నాయకుడు |
| దేశభక్త | కొండా వెంకటప్పయ్య | జాతీయ వాది |
| దేశోద్ధారక | కాశీనాథుని నాగేశ్వరరావు | జాతీయ నాయకుడు |
| నేతాజీ | సుభాస్ చంద్రబోస్ | అజాద్ హింద్ ఫౌజు విప్లవనాయకుడు |
| పంజాబు కేసరి | లాలా లజపతిరాయి | జాతీయ నాయకుడు |
| జాతిపిత/మహాత్మా | మోహన్ దాస్ కరమ్‌చంద్ గాంధీ | జాతీయ నాయకుడు |
| యుగంధరుడు | ప్రతాపరుద్రుని మంత్రి | అతియుక్తి పరుడు |
| లోకమాన్య | బాలగంగాధర తిలక్ | 'స్వరాజ్యం నాజన్మహక్కు ' అని ఎలుగెత్తి చాటిన వాడు |
| విశ్వకవి/గురుదేవ్ | రవీంద్రనాథటాగూర్ | జాతీయ వాది - నోబెల్ బహుమతి గ్రహీత |
| సేవామాత | దుర్గాబాయి దేశ్ ముఖ్ | సంఘసేవిక |

| స్త్రీ రూఢివాచక శబ్దములు | | |
|---|---|---|
| స్త్రీవాచక శబ్దములు | వివరణ | ప్రయోగము |
| అరుంధతి | వశిష్ఠుని భార్య | ఉత్తమ ఇల్లాలు |
| ఊర్వశి | ఇంద్రసభలో నర్తకి - అప్సరస | సుబుద్ధికలది |
| కాంతం | మునిమాణిక్యం సృష్టించిన నాయిక | మంచి ఇల్లాలు |
| కైకేయి | దశరథుని మూడవ భార్య | అతి మూర్ఖురాలు |
| గాంధారి | ధృతరాష్ట్రుని భార్య | పతివ్రత |
| చిత్రాంగి | రాజరాజ నరేంద్రుని రెండవ భార్య | అతి దుర్మార్గురాలు |
| జ్యేష్ఠాదేవి/ పెద్దమ్మ | విష్ణుదేవుని పెద్ద భార్య | అదృష్ట హీనురాలు |
| తాటక | రాక్షస స్త్రీ | దుర్మార్గురాలు |
| నంగనాచి | కంచిపట్టణవాసి | అతి చాతుర్యము కలది |
| పార్వతీదేవి | శివుని భార్య | పెద్ద ముత్తయిదువ |
| పూతన | ఒక రాక్షసి | దుర్మార్గురాలు |
| భద్రకాళి | పార్వతి అంశ | దేవీ స్వరూపిణి |
| మండోదరి | రావణుని భార్య | ఒడ్డు పొడవుగల స్త్రీ |
| మంథర | కైకేయిదగ్గర దాసి | తంత్రముగల స్త్రీ |
| మధురవాణి | 'కన్యాశుల్కం' లో వేశ్య | ప్రౌఢనాయిక |
| మిత్రవింద | కృష్ణుని భార్య | మిక్కిలియుక్తి గల స్త్రీ |
| యెంకి | నండూరి సుబ్బారావు తన పాటలలో సృష్టించిన నాయిక | జానపద నాయిక |
| రంభ | ఇంద్రసభలో నర్తకి - అప్సరస | అతి సుందరాంగి |
| రుద్రమ | కాకతీయరాణి | ధీమంతురాలు |
| లక్ష్మీదేవి | విష్ణుమూర్తి భార్య | ధనమునకు అధిష్ఠాన దేవత |
| వరూధిని | పెద్దన సృష్టించిన గంధర్వ స్త్రీ | నెరజాణ (ప్రౌఢ నాయిక) |
| శూర్పణఖ | రావణుని సోదరి | దుర్మార్గురాలు |
| సత్యభామ | కృష్ణుని భార్య | భర్తను లొంగదీసుకున్న స్వాధీనపతిక |
| సరస్వతి | బ్రహ్మదేవుని భార్య | విద్యకు అధిష్ఠాన దేవత (వాగ్దేవి) |
| సీతాదేవి | శ్రీరాముని భార్య | మహా పతివ్రత |

## అచేతన వస్తు రూఢి వాచక శబ్దములు

| స్త్రీవాచక శబ్దములు | వివరణ | ప్రయోగము |
|---|---|---|
| అంబాజీ పేట ఆముదము | కోనసీమలోని ఊరు | మోసము |
| అపరంజి | బంగారు | మిక్కిలి యోగ్యుడు |
| ఉక్కు | ఒక ధాతు మిశ్రమము | గట్టివాడు |
| కల్పవృక్షము | దేవతల వృక్షము | అన్ని భాగములు ఉపయోగపడేది |
| కుంభకోణము | దక్షిణాది పట్టణము | మోసము |
| గాండీవము | అర్జునుని ధనుస్సు | తిరుగులేని గురి |
| చట్రాయి(చట్టుబండ) | అతి కఠినమైన పెద్ద బండ | ఏమిచేయని బండ |
| నరకము | పాపాత్ములు ఉండు స్థలము | సహింపరానిది |
| నిమ్మకాయలు | లికుచ ఫలములు | పిచ్చివారు |
| పర్వతము | కొండ | ఉన్నతమైనది |
| పుంజులూరు | ఒక గ్రామము | వ్యర్థుడు |
| బంగారము | ఉత్తమమైన ధాతువు | ఉత్తముడు |
| మన్ను | మృత్తిక | ఏమీ లేనిది |
| ముత్యము | నవరత్నములలో ఒకటి | మిక్కిలి యోగ్యుడు |
| రత్నము | మణి | మిక్కిలి యోగ్యుడు |
| వజ్రము | నవరత్నములలో ఒకటి | మిక్కిలి యోగ్యుడు |
| వసనాభి | విషము | అతి దుర్మార్గుడు |
| విషము | ప్రాణులను చంపు వస్తువు | మిక్కిలి దుర్మార్గుడు |
| సంకెళ్ళు | శృంఖలములు | బంధకములు |
| సముద్రము | సాగరము | అంతములేనిది-నెరవేరలేని పని |
| సీసము | లోహములలోఒకటి | పిచ్చివాడు |
| స్తంభము | గుంజ | మూఢుడు |
| స్వర్గము | పుణ్యము చేసిన వారి నివాసం | సుప్రదేశము, ఆనంద నిలయము |

| జంతు రూఢి వాచక శబ్దములు | | |
|---|---|---|
| ఉడుము | ఒక సరీసృపము | పట్టు గలవాడు |
| ఎనుబోతు | మహిషము | మడ్డివాడు |
| కరటక దమనకులు | పంచతంత్రములోని జంతుపాత్రలు, నక్కలు | అతి తంత్రము గలవారు |
| కర్కోటకము | సర్పము | అతిక్రూరుడు |
| కామధేనువు | క్షీరసాగర మధనములో లభించిన గోవు | సమస్తమును ఇచ్చునది |
| కుక్క | శునకము | వదరుబోతు |
| కోతి | వానరుడు | చెడ్డపని చేసేవాడు |
| గాడిద | గార్దభము | మందబుద్ధి |
| గొర్రె | మేషజాతి | అమాయకుడు |
| గోవు | ఆవు | సాధుజంతువు పూజింపదగినది |
| జలగ | జలచరము | పీడించువాడు |
| తక్షకుడు | సర్పము | అతిక్రూరుడు |
| తేలు | వృచ్చికము | హాని చేసేవాడు |
| దోమ | మశకము | అల్పబుద్ధికలవాడు |
| నక్క(గుంటనక్క) | జంబుకము | తంత్రముగలవాడు |
| పక్షి | రెక్కలుగల జంతువు | తెలివిలేనిది |
| పక్షిరాజు | గరుత్మంతుడు | అనామధేయుడు |
| పశువు | చతుష్పాదజంతువు | తెలివితక్కువ వాడు |
| పిల్లి | మార్జాలము | అమాయకత్వాన్ని ప్రదర్శించేది |
| పులి | వ్యాఘ్రము | అతి ధైర్యశాలి |
| భల్లూకము | ఎలుగుబంటు | గట్టిపట్టుకలది |
| మేకపోతు | మగమేక | పైకి గంభీర్యముప్రదర్శించినా సత్తాలేని వాడు |
| లేడి | హరిణము | పరుగులో మేటి |
| శేషాహి | ఆదిశేషుడి సర్పము | మిక్కిలి సమర్థుడు |
| సింహము(కేసరి) | మృగరాజు | అతి శూరుడు |

# భారతీయ సంస్కృతి - నామనిఘంటువు.

**అంబాలిక, అంబిక :** విచిత్ర వీర్యుని భార్యలు. ధృతరాష్ట్ర పాండురాజులకు తల్లులు.

**అక్రూరుడు:** శ్రీకృష్ణుని మేనమామ.

**అగ్ని :** వేదములలో పేర్కొన్న ఒక దేవత. అతని భార్య స్వాహాదేవి.

**అతికాయుడు :** రావణుని కుమారుడు. లక్ష్మణునిచే చంపబడతాడు.

**అత్రి :** బ్రహ్మమానసపుత్రులలో ఒకడు. అనసూయ ఈయన భార్య.

**అనసూయ :** అత్రి భార్య. దండకారణ్యంలో సీతకు స్త్రీ ధర్మాన్ని బోధించింది.

**అనిరుద్ధుడు :** శ్రీకృష్ణుని మనుమడు. ప్రద్యుమ్నుని కొడుకు. బాణాసురుని కుమార్తె ఉషకు మగడు.

**అభిమన్యుడు :** అర్జునుడు - సుభద్రల కుమారుడు, కురుక్షేత్ర సంగ్రామంలో మూడవనాడు పద్మవ్యూహంలోపల దూరి బయటకు రావడం తెలియక మరణానికి గురి అయ్యాడు.

**అర్జునుడు :** పాండవ మధ్యముడు. పాండురాజు భార్య కుంతికి దేవేంద్ర ప్రసాదమున జన్మించిన కొడుకు. ఫల్గునుడు, పార్థుడు, కిరీటి, విజయుడు, సవ్యసాచి, ధనంజయుడు, శ్వేత వాహనుడు వంటి పేర్లు కలవాడు.

**అర్ధనారీశ్వరుడు:** శివుని సగం శరీరం ఆక్రమించిన ఈశ్వరి.

**అశ్వత్థామ :** ద్రోణుని కుమారుడు. కృపి ఇతని తల్లి. ఇతడు చిరంజీవి. పాండవద్వేషి

**అష్టావక్రుడు :** ఏకపాదుడు-సుజాత పుత్రుడు.

**అహల్య :** గౌతముని భార్య.

**ఆంజనేయుడు :** అంజనాదేవి కుమారుడు. హనుమంతుడు, పవనుడు, మారుతి ఇతర పేర్లు, రామాయ ణంలో శ్రీరామునికి నమ్మిన బంటు.

**ఇంద్రుడు :** స్వర్గానికి అధిపతి. తూర్పు దిక్కుకు పాలకుడు.

**ఉచ్చైశ్రవము :** ఇంద్రుని గుర్రము

**ఉలూచి :** నాగకన్య. వాసుకి కూతురు. అర్జునుడు ఈమె యందు ఇలావంతుని కన్నాడు.

**ఉష :** బాణాసురుని కూతురు. అనిరుద్ధుని మోహించి చిత్రలేఖ సహాయంతో పెళ్లాడింది.

**ఊర్మిళ :** లక్ష్మణుని భార్య. జనకమహారాజు జ్యేష్ఠ పుత్రిక. భర్త లక్ష్మణుడు అన్న రాముని వెంట అరణ్యాలకు పోయినప్పుడు ఈమె నిద్రించుచూనే ఉండెనట *(ఊర్మిళాదేవి నిద్ర)*

**ఊర్వశి :** ఒక అప్సరస. మోహనాంగి (ఇంద్రుని సభలోని నర్తకి).

**ఋష్యమూకం :** అన్న వాలిచే తరమబడి సుగ్రీవుడు తల దాచుకున్న కొండ.

**ఋష్యశృంగుడు :** విభాండక ఋషి కుమారుడు. లోక వ్యవహారజ్ఞాన శూన్యుడు.

**ఏకలవ్యుడు :** ద్రోణాచార్యుని బొమ్మ పెట్టు కొని ధనుర్విద్య నేర్చుకున్న బోయవాడు

**కంసుడు :** ఉగ్రసేనుని కుమారుడు. శ్రీకృష్ణుని మేనమామ.

**కణ్వుడు :** ఒక ఋషి. శకుంతల పెంపుడు తండ్రి.

**కబంధుడు :** దండకారణ్యంలో రాక్షసుడు.

రామలక్ష్మణులు ఈతని చేతులు నరికి వేశారు.

**కర్కోటకుడు** : వాసుకి తమ్ముడు. అతిక్రూరుడు.

**కల్పవృక్షం** : (కల్పవల్లి) : కోరిన కోర్కెలు తీర్చే చెట్టు. క్షీరసాగరమధన సమయంలో హాలాహలం తర్వాత వెలువడినది.

**కశ్యపుడు** : ఒక ప్రజాపతి. మరీచి - కళలకు పుట్టినవాడు.

**కాళి**: పార్వతి అవతారం, ఉమ, కాత్యాయిని, గౌరి, ఈశ్వరి, భవాని, దుర్గ, సర్వమంగళ, చాముండి - ఇతర పేర్లు.

**కామధేనువు** : కోరిన కోరికల్ని సమకూర్చే దివ్య శక్తులు గలగోవు. మరొక పేరు సురభి.

**కుంతి**: మహాభారతంలోని ధర్మరాజు, భీముడు, అర్జునులకు తల్లి, కర్ణునికి కూడా తల్లి.

**కుమారస్వామి** : శివుని కుమారుడు. సుబ్రహ్మణ్యస్వామి. తారకజిత్తు, పార్వతీ నందనుడు ఇతర పేర్లు. దేవతలకు సేనా నాయకుడు. వాహనం నెమలి. ఆయుధం శక్తి.

**కృష్ణుడు** : దేవకి శ్రీవసుదేవుల పుత్రుడు. కంసునికి మేనల్లుడు. కురుక్షేత్ర యుద్ధ సమయంలో పార్థుడు మొరాయించగా 'గీతోపదేశం' చేస్తాడు. కృష్ణుడు కారాగారంలో పుట్టాడు. శిశుపాలుణ్ణీ కంసుణ్ణీ వధిస్తాడు. ఈయనకు ఎనమండు గురు భార్యలు. అందులో రుక్మిణి, సత్యభామ ప్రముఖులు. వైష్ణవమత సంప్ర దాయంలో ఈయన్ని దివ్యపురుషునిగా ఆరాధిస్తారు.

**కృష్ణద్వైపాయనుడు** : వ్యాసునికి మరొక పేరు.

**కేదారేశ్వరుడు** : శివునికి మరొక పేరు.

**కైకేయి** : దశరథుని మూడవ భార్య. భరతుని తల్లి.

**కైలాసపర్వతం** : శివుని నివాసము. హిమాలయాల వెనుకనున్న కొండ.

**కౌరవులు** : కురువంశ రాజులు, మహాభారతంలో దుర్యోధనాదులు నూరు మంది.

**కౌశికుడు** : ధర్మవ్యాధుని వల్ల ధర్మ విశేషాలను తెలుసుకున్న వాడు.

**ఖాండవం** : ఇంద్రుని వనం. అగ్ని దేవుడు ప్రార్థింపగా కృష్ణార్జునులు దానిని అతనికి ఆహారంగా సమర్పించారు.

**గాండీవం** : అర్జునుని ధనుస్సు. దీనిని అగ్నిదేవుడు ఖాండవ దహనమప్పుడు అర్జునునికి ఇచ్చాడు.

**గాంధారి** : ధృతరాష్ట్రుని భార్య. పరమ పతివ్రత. భర్త అంధుడుగాన తాను పరపురుషదర్శనం చేయ కూడదను నియమముచే తాను ఎల్లప్పుడూ కళ్లకు గంతలు కట్టుకొనియే ఉండును.

**గోదాదేవి** : శ్రీవిల్లిపుత్తూరు లోని విష్ణుచిత్తుని తులసివనంలో ఆమె లభించగా పెరియాళ్వార్ పెంపకంలో పెరిగి చూడికొడుత్తాళ్ ఆళ్వారు అయింది.

**గోవింద భగవత్పాదులు**: శంకరాచార్యులు వారి గురువు. గౌడపాదాచార్యుల శిష్యులు.

**గౌతమ సూత్రాలు** : గౌతమ మహర్షి ప్రోక్తమైన ధర్మశాస్త్రం.

**ఘటోత్కచుడు** : భీముడు-హిడింబల పుత్రుడు.

**ఘృతాచి** : ఒక అప్సరస. భరద్వాజ మహర్షి ఈమెను చూచినప్పుడు వీర్య స్ఖలనమైంది. ద్రోణుడు పుట్టాడు.

**జ్ఞానప్రసూనాంబ** : పరాశక్తి అవతారం. కాళ హస్తీశ్వరుని భార్య.

**చంద్రమతి** : హరిశ్చంద్రుని భార్య. మహా పతివ్రత. భర్త సత్యసంధతను నిలుపుటకు తాను దాసిగా అమ్ముడు పోయింది.




**పురాణనామ చిత్రచయనిక**

1. గణపతి 2. పార్వతీ పరమేశ్వరులు; 3. అర్ధనారీశ్వరుడు 4. శివలింగం, 5 సూర్యభగవానుడు (ఆదిత్యుడు) 6. రావణుడు; 7. ఆంజనేయుడు; 8 పుష్పక్ విమానం, 9 తుంబురుడు, 10. కామధేనువు; 11. బుద్ధుడు, 12. వాగ్దేవి-సరస్వతి, 13. ఐరావతం, 14 నటరాజు; 15. హయగ్రీవుడు 16 నారదుడు; 17 నంది (శివుని వాహనం) 18 కాళికాదేవి (దుర్గ), 18 (అ) మహిషాసురమర్ధిని; 19 శ్రీమహా విష్ణువు; 19 (ఆ) బ్రహ్మ 19 (ఇ) ఆదిశేషుడు; 20 లక్ష్మీదేవి, 21 గరుత్మంతుడు (విష్ణువాహనం).

**చాముండేశ్వరి** . మైసూరు సమీపంలో ప్రతిష్ఠించబడివున్న దేవి.

**చిత్రగుప్తుడు** : యమలోకంలో పాప పుణ్యాలను లెక్కకట్టే వాడు.

**చిత్రరేఖ** : బాణాసురుని కూతురు ఉషకు చెలికత్తె.

**చిత్రాంగద** : అర్జునుని భార్య. చిత్రవాహ ముని కుమార్తె. ఈమె కుమారుని పేరు బభ్రువాహనుడు.

**జంబుమాలి** : ప్రహస్తుని కుమారుడు. రావణుని సేనాధిపతుల్లో ఒకడు అశోకవన భంగ సమయంలో హనుమంతుడు ఈతనిని చంపాడు.

**జటాయువు**: సంపాతి తమ్ముడు. సీతాపహరణ సమయాన రావణుడు చంపాడు.

**జనమేజయుడు** : పరీక్షిత్తుని కుమారుడు.

**జమదగ్ని** : పరశురాముని తండ్రి రేణుక ఆయన భార్య.

**జయవిజయులు** : వైకుంఠంలో శ్రీమహావిష్ణువు ద్వార పాలకులు భాగవత పురాణం లోని పాత్రలు - హిరణ్యాక్ష హిరణ్య కసిపులు. రావణ కుంభ కర్ణులు శిశుపాలుడు దంతవక్త్రులుగా అవతార మెత్తుతారు.

**జరాసంధుడు** : బృహద్రధుని పుత్రుడు జరాయువు రాక్షసిచే సంధింపబడినవాడు భీముడు ఏనిని చంపాడు.

**జాంబవంతుడు** : సుగ్రీవుని మంత్రి. రామ రావణ యుద్ధంలో రామునికి సాయ పడ్డాడు

**జాంబవతి** : జాంబవంతుని కూతురు శ్రీకృష్ణుని అష్ట భార్యలలో ఒకతె

**జ్ఞానప్రసూనాంబ** : పరాశక్తి అవతారమగు కాళహస్తీశ్వరుని భార్య.

**జ్యోతిర్లింగాలు** : ద్వాదశ శైవలింగాలు : 1. సోమనాధుడు (రాష్ట్రం);2 మల్లి కార్జునుడు (శ్రీశైలం ) ; 3. మహాకాయుడు (ఉజ్జయిని) ;4. భీమశంకరుడు (డాకిని); 5. విశ్వేశ్వరుడు (వారణాసి) ;6. త్ర్యంబకేశ్వ రుడు (గోదావరి) ; 7. వైద్యనాదుడు (చితాభూమి) , 8. నాగనాధుడు (ద్వారకా నగరం) ' 9. రామేశ్వరుడు (సేతు బంధం) , 10 భస్మేశ్వరుడు (శివాలయం) '11. కేదార లింగం (కేదారనాధుడు) ; 12. ఘుస్మంగం

**తాటక** : మారీచ సుబాహుల తల్లి. అతి క్రూరురాలు.

**తార** : తారుని కుమార్తె. వాలి భార్య, అంగదుని తల్లి వాలి మరణానంతరం వాలి సోదరుడు సుగ్రీవుడు ఈమెను పెండ్లాడాడు.

**త్రిశంకుస్వర్గం** : సత్యవంతునికై విశ్వామిత్రుడు సృష్టించినది.

**దత్తాత్రేయుడు** : అత్రిమహర్షి, అనసూయ దంపతుల బిడ్డ.

**దమయంతి** : నలమహారాజు భార్య. పతియందు అత్యంత అనురాగం గలది.

**దశరధుడు** : అయోధ్య మహారాజు. శ్రీరాముని తండ్రి. కౌసల్య, సుమిత్ర. కైకేయి ఈయన భార్యలు.

**దామోదరుడు** : కృష్ణుడు. బాల్యమున తల్లి యశోద ఇతని నడుమున తాడునేసి రోటికి కట్టుటచే ఈ పేరు వచ్చింది.

**దుర్యోధనుడు** : ధృతరాష్ట్రునకు గాంధారికి కలిగిన నూరుగురు కుమారులలో (కౌరవ) జ్యేష్ఠుడు

**దుర్వాసుడు** : అత్రి-అనసూయలకు పుట్టినవాడు. మహా కోపిష్టి ఇతడు శపించి నట్టు ఇతివృత్తంగల కధలు అనేకం.

**దుష్యంతుడు** : శకుంతల భర్త. భరతుని తండ్రి.

**దుస్సల** : ధృతరాష్ట్రునకు గాంధారికి పుట్టిన ఏకైక కుమార్తె. దుర్యోధనాదుల సోదరి.

**దేవకి**: కృష్ణుని కన్నతల్లి. వసుదేవుని భార్య.

**దేవదత్తం** ' అర్జునుడికి దేవేంద్రుడు ఇచ్చిన శంఖం.

**దేవాంతకుడు** : రావణుని కుమారుడు. హనుమంతుడు ఇతనిని చంపాడు.

**ద్రుపదుడు** : పాంచాలరాజు.ద్రౌపది తండ్రి. ఈయన కుమారులు ద్రుష్టద్యుమ్నుడు, శిఖండి.

**ద్రోణుడు** : మహాభారతంలోని పాత్ర భరద్వాజమహర్షిఘృతాచి అనే అప్సరసను చూస్తే వీర్యస్ఖలనమైంది. ఆ వీర్యాన్ని ఒక ద్రోణ(కుండ)లో ఉంచగా ద్రోణుడు పుట్టాడు. ధనుర్విద్యలో దిట్ట. కృపాచార్యుని బావమరిది. అశ్వత్థామ ఈయన పుత్రుడు. కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవ పక్షంలో పోరాడాడు.

**ద్రౌపది** : పాంచాల రాజైన ద్రుపదుని కూతురు. మహాభారతంలో ప్రముఖపాత్ర. అర్జునుడు మత్స్య యంత్రాన్ని కొట్టగా ఆమె పాండవులకు భార్య అయింది. ద్రౌపది మహా పతివ్రత.

**ధన్వంతరి** : క్షీరసాగర మథన సమయంలో పుట్టిన అనేకములలో ఒకటి. ఆయుర్వే దానికి అధిష్ఠాన దేవత.

**ధర్మరాజు**: మహాభారతంలోని పంచ పాండవులలో ప్రధముడు. యుధిష్ఠిరుడు మరొకపేరు. సద్గుణాలకు పేరొందినవాడు. జూదంలో ఓడిపోయి విరాట కొలువులో కంకుభట్టుగా ఉంటాడు.

**ధర్మవ్యాధుడు** : మిధిలా నగరంలో ఉండే ఎరుకలవాడు. సమస్త ధర్మాల్ని చక్కగా తెలిసినవాడు.

**ధృతరాష్ట్రుడు** : కురువంశరాజు అయిన విచిత్రవీర్యుని కుమారుడు. పుట్టుగుడ్డి. గాంధారి ఈయన భార్య. దుర్యోధనాది నూరుగురు ఈయన పుత్రులు.

**నకులుడు**: పంచపాండవులలో నాల్గవవాడు. మాద్రి పెద్దకొడుకు.

**నటరాజు** : తాండవ భంగిమలోనున్న శివుడు. సృష్టి, స్థితి, లయ, త్రయోభవ (ఖ్యాతి) అనుగ్రహ(మోక్షతి)అను పంచ మహాకార్యాల్ని తాండవం ద్వారా పరమ శివుడు ప్రదర్శిస్తాడు.

**నరకలోకం**: యముని కొలువు. పురాణాలను బట్టి 28 నరకలోకాలు ఉన్నాయి.

**నారదుడు**: బ్రహ్మ కుమారుడు హరి నారాయణ గాథలు గానం చేయువాడు. త్రిలోక సంచారి. కలహప్రియుడుగా ప్రతీతి.

**నాడీజంఘుడు** : బక శ్రేష్ఠుడు.

**పంచవటి** : రాముడు వనవాస సమయాన దండకారణ్యంలోని ఆశ్రమం.

**పరశురాముడు**: జమదగ్ని కుమారుడు. తల్లి రేణుక. అస్త్రవిద్యయందు ఆరి తేరినవాడు.

**పరాశరుడు** : శక్తి మహర్షి పుత్రుడు వశిష్ఠ మహర్షి పౌత్రుడు. ఈయన సంపర్కంవల్ల సత్యవతి అనే మత్స్యగంధికి వ్యాసమహర్షి పుడతాడు.

**పరీక్షిత్తు** : అభిమన్యు - ఉత్తరలకు పుట్టినవాడు. అర్జునునికి మనుమడు. జనమేజయుడు ఈయన పుత్రుడు. పరీక్షిత్తు అంటే అంతటా దర్శించగల వాడని అర్థం.

**పాంచజన్యం** : విష్ణుని శంఖం.

**పాశుపతాస్త్రము** : శివుని గూర్చి తపస్సు చేసి అర్జునుడు పొందిన అస్త్రం.

**పుష్పకము** : కుబేరుని విమానము. పిదప రావణుడు, శ్రీరాముడు పొందారు. దీనిలో ఎంత మంది అయినా కూర్చోవచ్చు.

**పూతన** : ఒక రాక్షసి. బాలకృష్ణునిచే చంపబడింది.

**ప్రవరాఖ్యుడు** : 'మనుచరిత్ర' లో పాత్ర.

**బలరాముడు** : శ్రీకృష్ణునికి అన్న.

**బాణుడు** : బలిచక్రవర్తి కుమారుడు. ఉషకు తండ్రి.

**బుద్ధుడు**: బౌద్ధమత స్థాపకుడు. లుంబిని ఆయన జన్మస్థలి. 'షగభిజ్ఞుడు' అని ప్రసిద్ధి. అనగా దివ్యదృష్టి దివ్యశ్రోత్రము, పూర్వనివాసానుస్మృతి, పరచిత్త జ్ఞానం, అప్రత్యక్షవిషయజ్ఞానము, వియద్గమనాగమన వ్యూహాదిలక్షణ బుద్ధి అను ఆరింటిని ఎరిగినవాడు.

**బృందావనం** : యమునానదీ తీరాన మధురలో ఉన్న వనం. ఇచ్చటి గోకులంలో శ్రీకృష్ణుడు గోపికలతో అనేక లీలలు సల్పాడు.

**భద్రకాళి** : పార్వతి నామం.

**భరతుడు** : భరతుడు పేరుగలవారు ముగ్గురు కలరు.1. దశరథ-కైకేయి కుమారుడు, శ్రీరాముని సోదరుడు. 2. ఋషభుని జ్యేష్ఠ పుత్రుడు. ఇతని పేరుమీదనే 'భారతదేశ' మని పేరు వచ్చింది. 3. శకుంతల-దుష్యంతులకు పుట్టిన వాడు.

**భీముడు**: పాండవులలో మధ్యముడు. మహా బలశాలి. బలానికి రూఢివాచకం. పాండవు లందరితో బాటు ద్రౌపది ఈయన ధర్మపత్ని. హిడింబి కూడ ఈయన భార్యే. ఘటోత్కచుడు వీరి కుమారుడు

**భీష్ముడు** : సర్వధర్మ శాస్త్రవేత్త. విలు విద్యలో నేర్పరి. ఆజన్మ బ్రహ్మచారి. కౌరవ సేనకు దళవాయి. కురుక్షేత్ర సంగ్రామమున పది దినాలు పోరి అర్జునునిచే నేలకొరిగి ఉత్తరాయన పుణ్య కాలం కొరకై శరతల్పంపై శయనించాడు.

**మత్స్యయంత్రం**: ద్రౌపదీ స్వయంవరంలో పైన ఒక మత్స్య యంత్రాన్ని నిర్మించి దాని కింద ఉన్న నీటిలో ఆ యంత్ర ప్రతిబింబాన్ని చూస్తూ ఆ యంత్రాన్ని ఛేదించగలిగినవాడే తన కుమార్తెకు తగిన వరుడని ద్రుపద మహారాజు ప్రకటిస్తాడు. దానిని అర్జునుడు ఛేదించి ద్రౌపదిని పరిణయమాడుతాడు.





**మత్స్య యంత్రం**

**మన్మథుడు** : విష్ణువుకు మానసపుత్రుడు. రతీదేవి ఈయన భార్య పుష్పధన్వుడు. మంచి రూపం కలవాడు.

**మహిషాసుర మర్దిని** . మహిషాసురుడనే రాక్షసుణ్ణి చంపడం వల్ల పార్వతికి ఈ పేరు వచ్చింది.

**మానస సరోవరం** . పవిత్ర తటాకం ఇది హిమాలయ పర్వతశిఖరాల మధ్య టిబెట్టులో వుంది. హిందువులకు పవిత్ర తీర్థస్థలి.

**మారీచుడు** : రాక్షసి తాటక కుమారుడు.

రావణునిచే సీతాపహరణ సమయంలో ఇతడు బంగారు జింకగా మాయారూపం దాల్చాడు.

**మేనక:** విశ్వమిత్రుని తపోభంగానికి ఇంద్రుడు నియమించిన అప్సరస వీరికలయికవల్ల శకుంతల జన్మించింది.

**మేరు పర్వతం :** గొప్ప పర్వతం. ధైర్యసాహసాల్ని సాధారణంగా దీనితో పోలుస్తారు.

**మోహిని :** క్షీరసాగర మథనమప్పుడు ఫలించిన అమృతం అసురులకు దక్కకుండా మోసం చేయడానికి విష్ణువు ధరించిన స్త్రీ వేషం.

**యమ ధర్మ రాజు :** కాలుడు అని మరొక పేరు. మరణానికి అధిష్ఠానదేవత. పితృ లోకానికి అధిపతి. భూలోకంలో నరులు చేసిన పాప పుణ్యాలను బట్టి పాపులకు శిక్ష విధించేవాడు.

**యశోద :** శ్రీకృష్ణుని పెంపుడు తల్లి. నందుని భార్య.

**యాజ్ఞవల్క్యం:** అష్టాదశ స్మృతులలో ఒకటి.

**యాజ్ఞవల్క్యుడు :** యజుర్వేద ధురంధరుడు అయిన వైశంపాయుని శిష్యుడు.

**యుధిష్ఠిరుడు :** ధర్మరాజుకు మరొక పేరు.

**రంభ :** ఒక అప్సరస. ఇంద్ర సభలో రూపరేఖా లావణ్యాలు గల నర్తకి.

**రతీదేవి :** మన్మధుని భార్య.

**రాధ :** శ్రీకృష్ణుని ప్రియురాలు. నందుని చెల్లెలు.

**రావణుడు :** లంకాధిపతి. రామాయణంలో ప్రతి నాయకుడు. విశ్వవసుని పుత్రుడు. దశకంఠుడు. మండోదరి ఈయన భార్య. ఇంద్రజిత్తు మేఘనాధుడు ఇతని కొడుకులు.

**రుక్మిణి :** శ్రీకృష్ణుని పెద్ద భార్య. ప్రద్యుమ్నుడు తల్లి.

**రేణుక :** పరశురాముని తల్లి.

**రేవతి :** బలరాముని పత్ని.

**లంఖిణి :** లంకను కాపలాకాస్తున్న రాక్షసి.

**లక్ష్మీదేవి :** విష్ణుమూర్తి భార్య క్షీర సాగరమథన సమయంలో పుట్టింది.

**లవకుశులు:** సీతారాముల కవల పిల్లలు

**లీలావతి :** హిరణ్యకశిపుని భార్య.

**లోపాముద్ర :** అగస్త్యుని భార్య . మహా పతివ్రత.

**వజ్రదంష్ట్రుడు :** రావణుని భటుడు. వీనిని అంగదుడు చంపుతాడు.

**వరూధిని :** మనుచరిత్రలోని నాయిక. ఒక గంధర్వ స్త్రీ . శృంగార నాయిక.

**వశిష్ఠుడు :** సప్తమహర్షుల్లో ఒకరు. ఇతని భార్య అరుంధతి. దశరధునికి గురువు.

**వసుదేవుడు:** శ్రీకృష్ణుని జనక తండ్రి.

**వాలి:** సుగ్రీవుని అన్న. అంగదుడు ఈయన పుత్రుడు. తార ఈయన భార్య.

**వాల్మీకి :** వల్మీకం అంటే పుట్ట. పుట్టలోంచి పుట్టిన వాడు వాల్మీకి. సంస్కృత భాషలో మహాకవి. రామాయణ కర్త. మొట్టమొదటి కావ్యకర్త.

**వికర్ణుడు :** గాంధారి - ధృతరాష్ట్రుల కుమారుడు. ద్రౌపదీ వస్త్రాపహరణకు ముందు సభలో దుర్యోధనుని చర్య గర్హించినవాడు.

**విచిత్రవీర్యుడు:** ధృతరాష్ట్రపాండురాజుల తండ్రి.

**విదురుడు :** వ్యాసమహర్షికి అంబిక అంతఃపురం లోని దాసి యందు పుట్టినవాడు. నీతి విద్యాపారంగతుడు. ధృతరాష్ట్రునికి నీతిని బోధిస్తూ ఉంటాడు.

**విభీషణుడు :** రావణుని సోదరుడు. ఇతడు రావణునికి నీతిబోధచేయగా వినిపించు కోలేదు.




దేవదానవులు క్షీరసాగరంలో మందర పర్వతాన్ని కవ్వంగాను వాసుకిని కవ్వపుతాడుగాను చేసి మదించగా లక్ష్మి, కల్పవృక్షం, కామధేనువు, హాలాహలం చివరకు అమృతం ఉద్భవించినప్పుడు విష్ణుమూర్తి 'మోహిని' వేషంలో ఆ అమృతాన్ని దేవతలకే పంచుతాడు.

**విరటుడు :** మత్స్య దేశాధిపతి. ఇతని రాజ్యంలోనే పాండవులు తమ అజ్ఞాత వాసాన్ని గడిపారు.

**విశ్వావసుడు :** రావణుని తండ్రి.

**విశ్వామిత్రుడు:** గాధిరాజు కుమారుడు. గొప్ప తపస్సంపన్నుడు. కౌశికుడు ఇతని పూర్వాశ్రమనామం. ఇంద్రునిచే నియమితు రాలైన మేనక ఆయన తపోభంగానికి చేసిన కృషిలో శకుంతల పుడుతుంది. త్రిశంకు స్వర్గాన్ని నిర్మిస్తాడు.

**విష్ణువు:** త్రిమూర్తు (బ్రహ్మవిష్ణు మహేశ్వరులు) లలో రెండవవాడు ఈయన భార్య లక్ష్మి. వాహనం గరుత్మంతుడు. ఆయుధం సుదర్శన చక్రం. వైకుంఠం ఈయన నివాసస్థలి.

**వీరభద్రుడు :** శివుని ద్వారపాలకుడు (అంగరక్షకుడు. దక్షయజ్ఞ సమయంలో పార్వతి ఆత్మాహుతికి పాల్పడగా కోపోద్రిక్తుడైన శివుడు తన జటనొక దానిని నేలకు వేసి కొట్టగా వీరభద్రుడు, భద్రకాళి (పార్వతి అంశ) ఉద్భవించారు.

**వేదవతి :** పూర్వజన్మలో సీత పేరు.

**వైశంపాయనుడు :** వ్యాసుని శిష్యుడు. ఇతడు వ్యాసుని ఆజ్ఞ మేరకు జనమేజయునికి మహాభారత కథను వినిపించాడు.

**వ్యాస మహర్షి :** సంస్కృత మహాభారత కర్త పరాశర మహర్షికి మత్స్యగంధి అయిన సత్యవతికి పుట్టినవాడు. ఈయనకు గల మరొక పేరు కృష్ణ ద్వైపాయనుడు.

**శివధనుస్సు :** సీతా స్వయంవర సమయాన తనకుమార్తెకు భర్త అయ్యే అర్హతగలవాడు దీనిని (శివధనుస్సు) ఎక్కు పెట్టగలడని జనక మహారాజు ప్రకటిస్తాడు. శ్రీరాముడు శివధనుస్సును ఎక్కుపెట్టి సీతను వివాహమాడతాడు.


శివ ధనుస్సు

**శివుడు :** త్రిమూర్తులలో లయకారుడు. ఈయనకు గలపేర్లు సర్వ, పశుపతి, భౌమ, ఉగ్ర, మహాదేవ, భవుడు. గంగా - గౌరి ఈయన భార్యలు. కైలాసం ఈయన నివాసస్థలి. గణపతి, కుమారస్వామి, వీరభద్రుడు ఈయన కుమారులు. శివుని వాహనం నంది.

**శ్రీరాముడు :** అయోధ్యకు మహారాజు. దశరథుడు చేసిన పుత్రకామేష్టి యాగఫలితంగా కౌసల్యకు పుడతాడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేస్తూ ఉంటాడు. సీత ఈయన భార్య. రావణునితో యుద్ధం చేస్తాడు. హనుమంతుడు ఈయనకు నమ్మిన బంటు.

**సహదేవుడు :** మాద్రికి రెండో కొడుకు పాండవులలో ఆఖరివాడు.

**సుందోప సుందులు :** రాక్షస సోదరులు.

**సుగ్రీవుడు:** వాలి తమ్ముడు తండ్రి ఋక్ష విరజువు. భార్య రుమ.

**సైంధవుడు :** దుస్సల భర్త.

**స్వర్గ లోకం :** పుణ్యాలోకం.

**హరిశ్చంద్రుడు :** సత్యవ్రతుడు ఇతని భార్య చంద్రమతి. విశ్వామిత్రుడు ఇతనిచే అసత్యమాడిస్తానని శపథంచేసి విఫలుడవుతాడు.

గమనిక: ఇంకను వివరములు కోరు వారు 'పురాణనామ చంద్రిక', పూర్వ గాధాల హరి పురాణనామకోశం చూడండి).

**విరటుడు** : మత్స్య దేశాధిపతి. ఇతని రాజ్యంలోనే పాండవులు తమ అజ్ఞాత వాసాన్ని గడిపారు.

**విశ్వావసుడు** : రావణుని తండ్రి.

**విశ్వామిత్రుడు**: గాధిరాజు కుమారుడు గొప్ప తపస్సంపన్నుడు. కౌశికుడు ఇతని పూర్వాశ్రమనామం. ఇంద్రునిచే నియమితురాలైన మేనక ఆయన తపోభంగానికి చేసిన కృషిలో శకుంతల పుడుతుంది. త్రిశంకు స్వర్గాన్ని నిర్మిస్తాడు

**విష్ణువు**: త్రిమూర్తు (బ్రహ్మవిష్ణువు మహేశ్వరులు) లలో రెండవవాడు ఈయన భార్య లక్ష్మి. వాహనం గరుత్మంతుడు. ఆయుధం సుదర్శన చక్రం. వైకుంఠం ఈయన నివాసస్థలి.

**వీరభద్రుడు** : శివుని ద్వారపాలకుడు (అంగరక్షకుడు. దక్షయజ్ఞ సమయంలో పార్వతి ఆత్మాహుతికి పాల్పడగా కోపోద్రిక్తుడైన శివుడు తన జటనొక దానిని నేలకు వేసి కొట్టగా వీరభద్రుడు, భద్రకాళి (పార్వతి అంశ) ఉద్భవించారు.

**వేదవతి** : పూర్వజన్మలో సీత పేరు.

**వైశంపాయనుడు** : వ్యాసుని శిష్యుడు. ఇతడు వ్యాసుని ఆజ్ఞ మేరకు జనమేజయునికి మహాభారత కధను వినిపించాడు.

**వ్యాస మహర్షి** : సంస్కృత మహాభారత కర్త పరాశర మహర్షికి మత్స్యగంధి అయిన సత్యవతికి పుట్టినవాడు. ఈయనకు గల మరొక పేరు కృష్ణ ద్వైపాయనుడు.

**శివధనుస్సు** : సీతా స్వయంవర సమయాన తనకుమార్తెకు భర్త అయ్యే అర్హతగలవాడు దీనిని (శివధనుస్సు) ఎక్కు పెట్టగలడని జనక మహారాజు ప్రకటిస్తాడు. శ్రీరాముడు శివధనుస్సును ఎక్కుపెట్టి సీతను వివాహమాడతాడు.



శివ ధనుస్సు

**శివుడు** : త్రిమూర్తులలో లయకారుడు. ఈయనకు గలపేర్లు సర్వ, పశుపతి భౌమ, ఉగ్ర, మహాదేవ, భవుడు. గంగా - గౌరి ఈయన భార్యలు. కైలాసం ఈయన నివాసస్థలి. గణపతి, కుమారస్వామి, వీరభద్రుడు ఈయన కుమారులు. శివుని వాహనం నంది.

**శ్రీరాముడు** : అయోధ్యకు మహారాజు. దశరధుడు చేసిన పుత్రకామేష్టి యాగఫలితంగా కౌసల్యకు పుడతాడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేస్తూ ఉంటాడు. సీత ఈయన భార్య. రావణునితో యుద్ధం చేస్తాడు. హనుమంతుడు ఈయనకు నమ్మిన బంటు.

**సహదేవుడు** : మాద్రికి రెండో కొడుకు పాండవులలో ఆఖరివాడు.

**సుందోప సుందులు** : రాక్షస సోదరులు.

**సుగ్రీవుడు**: వాలి తమ్ముడు. తండ్రి ఋక్ష విరజువు. భార్య రుమ.

**సైంధవుడు** : దుస్సల భర్త.

**స్వర్గ లోకం** : పుణ్యాలోకం.

**హరిశ్చంద్రుడు** : పత్యవ్రతుడు. ఇతని భార్య చంద్రమతి విశ్వామిత్రుడు ఇతనిచే అసత్యమాడిస్తానని శపధంచేసి విఫలుడవుతాడు.

గమనిక: ఇంకను వివరములు కోరు వారు పురాణనామ చంద్రిక', పూర్వ గాధాల హరి, పురాణనామకోశం చూడండి).

# బాలసాహిత్య పీఠం

## విషయసూచి

## సుమతి నీతులు

బద్దెన కవి

అక్కరకు రాని చుట్టము
మ్రొక్కిన వరమీని వేల్పు, మోహరమునఁ దా
నెక్కిన బాఱని గుఱ్ఱము
గ్రక్కున విడువంగవలయుఁ గదరా సుమతీ !

అడిగిన జీతం బియ్యని
మిడిమేలపు దొరను గొల్చి మిడుకుట కంటెన్
వడిగల యెద్దులఁ గట్టుక
మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ !

అప్పిచ్చువాఁడు వైద్యుడు,
నెప్పుడు నెడతెగక పాఱు నేఱును ద్విజుడున్,
జొప్పడిన యూర నుండుము
చొప్పడకున్నట్టి యూరు సొరకుము సుమతీ!

ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగాఁ
నపకారికి నుపకారము
నెప మెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ !

ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికా మాటలాడి యన్యులమనముల్
నొప్పింపక, తానొవ్వక,
తప్పించుక తిరుఁగువాఁడు ధన్యుడు సుమతీ!

ఎప్పుడు దప్పులు వెదకెడు
న ప్పురుషుని గొల్వఁగూడ, దది యెట్లన్నన్
సర్పంబు పడగ నీడను
గప్పవసించిన విధంబు గదరా సుమతీ!

ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తురదియెట్లన్నన్
దెప్పలుగఁ జెరువు నిండిన
గప్పలు పదివేలు చేరుగదరా సుమతీ!

ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల దోషము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువులాజ్ఞ మేదిని సుమతీ!

కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండఁ బెట్టి శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టముఁ గట్టిన
వెనుకటి గుణమేల మాను? వినరా సుమతీ!

కమలములు నీటఁ బాసినఁ
గమలాప్తుని రశ్మి సోఁకి కమలిన భంగిన్
దమ తమ నెలవులు దప్పినఁ
దమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ!

కూరిమిగల దినములలో
నేరము లెన్నఁడును గలుగ నేరవు: మఱి యా
కూరిమి విరసంబైనను
నేరములే తోఁచుచుండు నిక్కము సుమతీ!

చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైన యట్లు పామరుడు దగన్
హేమంబుఁ గూడఁ బెట్టిన
భూమీశుల పాలఁజేరు భువిలో సుమతీ!

చేతులకుఁ దొడవు దానము
భూతల నాథులకుఁ దొడవు బొంకమి ధరలో
నీతియ తోడ వెవ్వారికి
నాతికి మానంబు తొడవు నయముగ సుమతీ!

తన కోపమే తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ
దన సంతోషమే స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!

తన యూరి తపసితనమును
తన పుత్రుని విద్య పెంపుఁదన సతి రూపున్
దన పెరటి చెట్టు మందును
మనసున వర్ణింప రెట్టి మనుజులు సుమతీ!

తన కలిమి యింద్రభోగము
తన లేమియె సర్వలోక దారిద్ర్యంబున్
దన చావు జగత్ప్రళయము
తను వలచిన యదియె రంభ తథ్యము సుమతీ!

తనవారు లేని చోటను
జనువించుక లేనిచోట జగడము చోటన్
అనుమానమైన చోటను
మనుజునకును నిలువఁదగదు మహిలో సుమతీ!

తలనుండు విషము ఫణికిని
వెలయంగాఁదోఁక నుండువృశ్చికమునకున్
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ!

ధనపతి సఖుఁడై యుండియు
నెనయంగా శివుఁడు భిక్ష మెత్తఁగ వలసెన్
దనవారి కెంత గలిగినఁ
దన భాగ్యమె తనకుగాక తథ్యము సుమతీ!

నడవకుమీ తెరు వొక్కట
గుడువకుమీ శత్రునింట గూరిమి తోడన్
ముడువకుమీ పర ధనముల
నుడువకుమీ యొరుని మనసు నొవ్వఁగ సుమతీ!

నయమునఁ బాలును ద్రావరు
భయమున విషమైనగాని భక్షింతురుగా
నయ మెంత దోసకారియొ
భయమే చూపంగవలయు బాగుగ సుమతీ!

నవరస భావాలంకృత
కవితాగోష్ఠియును మధుర గానంబును దా
నవివేకి కెంత జెప్పినఁ
జెవిటికి శంఖూదినట్లు సిద్ధము సుమతీ!

నీరే ప్రాణాధారము
నోరే రసభరితమైన నుడువుల కెల్లన్
నారియె నరులకు రత్నము;
చీరయె శృంగార మంద్రు సిద్ధము సుమతీ!

పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్రుని గనుఁగొని పొగడగ
పుత్రోత్సాహంబు నాడు పొందుర సుమతీ

బంగారు కుదువఁ బెట్టకు
సంగరమునఁ బాఱిపోకు సరసుఁడ వైనన్
అంగడి వెచ్చము లాడకు
వెంగలితోఁ జెలిమి వలదు వినురా సుమతీ!

బలవంతుఁడ నా కేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా?
బలవంతమైన సర్పము
చలిచీమల చేతఁజిక్కి చావదె సుమతీ!

మాటకు బ్రాణము సత్యము
కోటకుఁ బ్రాణంబు సుభగ కోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ!

లావుగల వానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు బలవంతుఁ డౌ
గ్రావం బంత గజంబును
మావటివాఁ డెక్కినట్లు మహిలో సుమతీ!

వినదగు నెవ్వరు చెప్పిన
విననంతనె వేగపడక వివరింపఁ దగున్
గని కల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ!

అనగ ననగ రాగ మతిశయిల్లుచునుండు
దినగ దినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన. విశ్వ

అనువుగానిచోట నధికుల మనరాదు,
గొంచమైన నదియు గొదువగాదు
కొండయద్దమందుఁ గొంచెమైయుండదా: విశ్వ.

అన్ని దానములను నన్నదానమె గొప్ప
కన్నతల్లికంటె ఘనములేదు
ఎన్న గురునికన్న నెక్కుడు లేదయా! విశ్వ.

అల్పజాతి వాని కధికార మిచ్చిన
దొడ్డ వారి నెల్ల దొలగఁజేయు
జెప్పుదినెడుకుక్క చెఱకు తీపెరుగునా: విశ్వ

అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండుఁ బల్కు జల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా! విశ్వ.

అత్మశుద్ధిలేని యాచార మది యేల?
భాండ శుద్ధిలేని పాక మేల?
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా? విశ్వ.

ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు
కాచి యతుకవచ్చు క్రమముగాను
మనసు విరిగెనేని మరిచేర్పరాదయ! విశ్వ.

ఉత్తముని కడుపున నోగు జన్మించిన
వాఁడె చెఱచు వాని వంశమెల్లఁ
జెఱకు వెన్నుపుట్టి చెరుపదా తీపెల్ల. విశ్వ.

ఉప్పు కప్పు రంబు నొక్క పోలికనుండు
జూడ జూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్య పురుషులు వేరయా విశ్వ.

ఉప్పులేనికూర యొప్పదు రుచులకు
పప్పులేని తిండి ఫలము లేదు
అప్పులేనివాడె యధిక సంపన్నుండు. విశ్వ.

ఎద్దుకైనగాని యేడాది దెలిపిన
మాటఁదెలిసి నడుచు మర్మ మెరిగి
మొప్పె తెలియలేడు ముప్పదేండ్లకునైన. విశ్వ.

ఎలుకతోలుఁ దెచ్చి యేడాది యుతికిన
నలుపు నలుపే కాని తెలుపు గాదు
కొయ్యబొమ్మను దెచ్చి కొట్టినఁ బలుకునా! విశ్వ.

కనగ సొమ్ము లెన్నొ కనకంబునొక్కటే
పసుల వన్నెలెన్నొ పాలువొకటే
పుష్ప జాతులెన్నొ పూజ యొకటే! విశ్వ.

కర్మ మధికమయిన గడచి పోవగరాదు.
ధర్మరాజు తెచ్చి తగనిచోట
గంకుభట్టుచేసెఁ గటగటా దైవంబు. విశ్వ.

కోతి నొనరు దెచ్చి కొత్తపుట్టము గట్టి
కొండముచ్చులెల్లఁ గొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యులుందురు. విశ్వ.

కోపమునను ఘనత కొంచమై పోవును
కోపమునను మిగులఁగోడు గలుగుఁ
గోపమడచెనేని కోర్కెలు నీడేరు. విశ్వ.

క్షీరసాగరమందు పవ్వళించియున్న స్వామికి
గొల్లభామల ఇళ్ల బాలు గ్రోలనేల
ఎదుటివారి సొమ్ము ఎల్ల వారికి తీపి. విశ్వ

గంగిగోవు పాలు గంటెడైనను జాలు
కడివెడైననేమి ఖరము పాలు
భక్తికలుగు కూడు పట్టెడైనను జాలు. విశ్వ.

గొడ్డుటావుఁ బితుకఁగుండఁగొంపోయిన
పండ్లనూడఁదన్నుఁ పాలనీక
లోభివాని నడుగ లాభంబు లేదయా! విశ్వ.

చంప-దగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చాలు. విశ్వ.

చిక్కియున్న వేళ సింహంబునై నను
బక్కకుక్క కరచి బాధచేయు
కలిమిలేని వేళఁ బంతంబు చెల్లదు. విశ్వ.

చిత్త శుద్ధి కలిగి చేసిన పుణ్యంబు
కొంచమైన నదియుఁ గొదువగాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత విశ్వ.

చిప్పబడ్డ స్వాతిచినుకు ముత్యంబాయె
నీటబడ్డ చినుకు నీట గలిసె
బ్రాప్తిగలుగుచోట ఫల మేల తప్పురా! విశ్వ.

చెప్పులోని రాయి చెవిలోన జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు నింతింత గాదయా! విశ్వ.

ధనముకూడఁబెట్టి దానంబు చేయక
తానుఁదినక లెస్స దాచు కొనగ
తేనెటీగ గూర్చి తెరువరి కియ్యదా! విశ్వ.

నిక్కమైన మంచి నీల మొక్కటిచాలుఁ
దళుకు బెళుకు రాళ్ళు తట్టెడేల
చాటుపద్య మిలను చాలదా యొక్కటి? విశ్వ.

నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగు బట్టు
బైట కుక్కచేత భంగపడును
స్థానబల్మిగాని తనబల్మి కాదయా! విశ్వ.

పట్టు పట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియఁ బట్టవలయు
బట్టివిడచుకన్న బరగ జచ్చుట మేలు. విశ్వ.

పరగ రాతిగుండు పగుల గొట్టవచ్చు
కొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరిగింపగా రాదు. విశ్వ

పుట్టిన జనులెల్ల భూమిలో నుండిన
బట్టునా జగంబు పట్టదెపుడు
యముని లెక్క రీతి నరుగుచు నుందురు. విశ్వ.

పెట్టి పోయలేని వట్టి నరులు భూమి
పుట్టనేమి వారు గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు పుట్టవా గిట్టవా? విశ్వ.

మిరపగింజచూడ మీద నల్లగనుండుఁ
గొరికిచూడు లోనఁ జురుకు మనును
సజ్జను లగువారి సార మిట్లుండురా! విశ్వ.

మేడిపండు చూడ మేలిమై యుండును
పొట్టవిప్పిచూడఁ బురుగులుండు
పిరికివాని మదిని బింక మీలాగురా! విశ్వ.

మొదట ఆశపెట్టి తుదిలేదు పొమ్మను
పరమలోభులైన పాపులకును
ఉసురు తప్పకుంటు నుండేలు దెబ్బగా! విశ్వ.

రాము డొకడు పుట్టి రవికుల మీడేర్చె
కురుపతి జనియించి కులముఁ జెఱిచె
ఇలను బుణ్యపాప మీలాగు కాదొకో! విశ్వ.

లక్ష్మియేలినట్టి లంకాధిపతి పురము
పిల్లకోతిపొజు కొల్లబెట్టెఁ
జేటుకాలమయిన జెరుప నల్పులె చాలు. విశ్వ.

వాన కురియకున్న వచ్చును క్షామంబు
వాన కురిసెనేని వరదపారు
వరద కరవు రెండు వరసలో నెరుగుడీ! విశ్వ.

విత్తముగలవాని వీపున పుండైనను
వసుధలోనఁజాల వార్తకెక్కు
బేదవానియింట బెండ్లైన నెరుగరు. విశ్వ.

వేము పాలువోసి ప్రేమతో బెంచిన
చేదువిరిగి తీపిఁజెంద బోదు
ఓగు నోగెఁగాక యుచితజ్ఞ డెటులౌను. విశ్వ.

వేరు పురుగు చేరి వృక్షంబు జెఱచుఁను
చీడ పురుగు జేరి చెట్టుఁ జెఱచుఁ
కుత్సితుండు చేరి గుణవంతుఁ జెఱచురా! విశ్వ

ంమరుఁ జెవి శాస్త్రమునఁ గుండ లమునఁ గాదు
లయమున నొప్పు దీవిచే వెలయుఁ బాణి
రురుదయాఢ్యుల మేను పరోపకార
లన రాణించు గంధంబు వలనఁ గాదు.

ందుకమువోలె సుజనుఁడు
ందం బడి మగుడ మీఁదికి న్నెగయు సుమీ
ందుఁడు మృత్పిండమువలె
గిందం బడి యడఁగియుండుఁ గృపణత్వమునన్

కుసుమగుచ్ఛంబునకుఁ బోలె బొసఁగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు
సకలజనమస్తక ప్రదేశముల నైన
వనమునం దైన జీర్ణ భావంబు గనుట.

తనిసిరే వేల్పు లుదధిర రత్నములచేత
వెఱచిరే ఘోరకాకోల విషముచేత
విడిచిరే యత్న మమృతంబు వొడయుదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

తరువు లతిరసఫలభార గురుతఁ గాంచు
నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుఁ
డుద్ధతులు గారు బుధులు స మృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము.

తెలియని మనుజాని సుఖముగ
దెలుపందగు సుఖతరముగ దెలుపగ వచ్చుం
దెలిసిన వానిం దెలిసియుఁ
దెలియని నరుఁదెల్ప బ్రహ్మదేవుని వశమే

ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ
గుముదహర్షంబు గావించు నమృతనూతి
యర్థితుఁడు గాక జల మిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితా చరణమతులు

సత్య సూక్తి ఘటించు ధీ జడిమమాన్చు
గౌరవమొసంగు జనులకు గలుషమడఁచు
గీర్తి ఁబ్రకటించు జిత్త విస్ఫూర్తిజేయు
సాధు సంగంబు సకలార్థ సాధనంబు

అసమాన ప్రియనీతివర్తనము ప్రా ణాంతంబునందున్ మలీ
మస మగ్రాహ్య మదుష్టయాచన మసం పత్ప్రార్థనాభావమున్
వ్యసనావాప్తిని ధైర్యముం బుధజనా త్యంతానుకూలత్వ మీ
యసిధారా వ్రతచర్య యెవ్వఁడు మహార్యశ్రేణికిం దెల్పెనో.

ఆకాశంబుననుండి శంభునిశిరంబందుండి శీతాద్రిసు
శ్లోకం బైనహిమాద్రినుండి భువి భూలోకంబునం దుండి య
స్తోకాంభోధిఁ బయోధినుండి పవనాంధోలోకము జేరె గం
గాకూలంకష పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్

ఆపదలందు ధైర్యగుణ మంచితసంపదలందుఁ దాల్మియున్
భూపసభాంతరాళమునఁ బుష్కలవాక్పటుత్వ మాజి బా
హాపటశక్తియున్ యశము నందనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ బ్రకృతి సిద్ధగుణంబులు సజ్జనాళికిన్.



ఆరంభింపరు నీచ మానవులు వి ఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువి ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో నుత్కృష్ట శాల్యోదనం
బొకచో బొంత ధరించు నొక్కొక్కతఱిన్ యోగ్యాంబరశ్రేణి లె
క్కకు రానీయడు కార్యసాధకుడు దుఃఖంబునన్ సుఖంబునన్ మదిన్

క్షీరము మున్ను నీటి కొసఁ గెన్ స్వగుణంబులు దన్నుఁ జేరుటన్
క్షీరము దప్త మౌట గని చిచ్చుఁజొచ్చెన్ వెతచే జలంబు దు
ర్వారసుహృద్విపత్తిఁ గని వహ్నిఁ జొరం జనె దుగ్ధ మంతలో
నీరముఁగూడి శాంతమగు నిల్చు మహాత్ములమైత్రి యీగతిన్.

జానుగ భూతికిం దొడవు సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మౌనము నీతి విద్యకు శ మంబు సుబుద్ధికి విత్తవృద్ధికిన్
దానము దాల్మి శక్తికిని ధర్మనిరూఢి కదంభవృత్తియుం
బూనికతోడ సర్వగుణ భూషణ మెన్నఁ గ శీలమే సుమీ.

తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరా ర్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబుఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం
గముగావించెడువార లెవ్వరొ యెఱుం గన్ శక్యమే యేరికిన్.

తెలివి యొకింత లేనియెడఁ దృప్తుఁడ నై కరిభంగి సర్వముం
దెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితిఁ దొల్లి యిప్పుడు
జ్జ్వలమతు లైనపండితుల సన్నిధి నించుక బోధశాలి నై
తెలియనివాఁడ నై మెలగి తిం గత మయ్యె నితాంతగర్వమున్!.

ధర ఖల్వాటుఁ డొకండు సూర్యకరసంత ప్తప్రధానాంగుఁడై
త్వరతోడన్ బరువెత్తి చేరి నిలిచెన్ దాళద్రుమచ్ఛాయఁ ద
చ్ఛిరముం దత్ఫలపాతవేగమున విచ్చెన్శబ్దయోగంబుగాఁ
బొరి దైవోపహతుండు వోవుకడకుం బోవుంగదా యాపదల్.

నీతి ప్రౌఢవిహారు లైననిపుణుల్ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందినసంపదల్ నిలువనీ గాఢంబుగా పోఁగనీ
ఘాతం బప్పుడు పొందనీ నియతిమై కానీ యుగాంతంబునన్
నీతి శ్లాఘ్యపదంబు దప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్.

నీరము తప్తలోహమున నిల్చి యనామక మై నశించు నా
నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థిత మై తనర్చు నా
నీరమె శుక్తిలోఁ బడి మణిత్వము గాంచు సమంచిత ప్రభం
బౌరుషవృత్తు లిట్లధ ము మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

విద్య నిగూఢగుప్త మగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుఁడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటిధనంబు లే దిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే.

భూషలు గావు మర్త్యులకు భూరిమయాంగదతారహారముల్
భూషిత కేశపాశమృదు పుష్ప సుగంధజలాభిషేకముల్
భూషలు గావు పూరుషుని భూషితుఁ జేయుఁ బవిత్రవాణి వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్.

రాతిరి మూషికంబు వివరంబొనరించి కరండబద్ధవ మై
భీతిలి చిక్కి యాస చెడి పెద్దయు డస్సినపామువాత సం
పాతముఁ జెందె దానిఁ దిని పాము దొలంగెబిలంబుత్రోవనే
యేతఱి హాని వృద్ధులకు నెక్కటి దైవమ కారణం బగున్.

సకలకలావిభూషితులు శబ్దవిదుల్ నయతత్త్వబోధకుల్
ప్రకటకవీంద్రు లేన్నృపతి సజ్జను నిర్ధను లై చరింతు రా
వికృతపుజాడ్య మాదొరది విత్తము లేకయ వారు పూజ్యు లం
ధకజనదూషితంబులు ఘనంబులుగావె యమూల్యరత్నముల్.

హర్తకుఁ గాదు గోచర మ హర్నిశమున్ సుఖపుష్టిసేయు స
త్కీర్తి ఘటించు విద్య యను దివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ బోదు యుగాంతపువేళనైన భూ
భర్తలు దద్ధనాధికుల పట్టున గర్వము మాను టొప్పగున్.

# దేశభక్తి గీతాలు

## దేశభక్తి

గురజాడ వెంకట అప్పారావు

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టి మాటలు కట్టి పెట్టోయ్
గట్టి మేల్ తలపెట్ట వోయి !

పాడి పంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటు పడవోయి
తిండి కలిగితె కండ కలదోయి
కండ కలవాడేను మనిషోయి !

ఈసురోమని మనుషులుంటే
దేశ మేగతి బాగుపడునోయి
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయి

అన్ని దేశాల్ క్రమ్మవలె నోయి
దేశి సరుకుల నమ్మవలె నోయి
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయి !

వెనుక చూసిన కార్యమేమోయి
మంచి గతమున కొంచెమేనోయి
మందగించక ముందు అడుగేయి
వెనక పడితే వెనకే నోయి !

పూను స్పర్థను విద్య లందే
వైరములు వాణిజ్య మందే
వ్యర్థ కలహం పెంచబోకోయి
కత్తి వైరం కాల్చవోయి !

దేశాభిమానము నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకో కోయి
పూని యేదైనాను, వొక మేల్
కూర్చి జనులకు చూపవోయి !

ఓర్వ లేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసె నోయి
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి !

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి
ఒకరి మేల్ తన మేలనెంచే
నేర్పరికి మేల్ కొల్ల లోయి !

సొంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడు పడవోయి
దేశమంటే మట్టి కాదోయి
దేశమంటే మనుషులోయి !

చెట్ట పట్టాల్ పట్టుకుని
దేశస్థు లంతా నడవవలె నోయి
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలె నోయి !

మతం వేరైతేను యేమోయి
మనసు వొకటై మనుషులుంటే
జాతియన్నది లేచి పెరిగీ
లోకమున రాణించు నోయి !

దేశ మనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలె నోయి
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలె నోయి !

ఆకులందు[illegible] అణగి మణగీ
కవిత కో[illegible] నోయి
పలుకులను [illegible] దేశమం[illegible]భ
మానములు మొలకెత్త వలెనోయి!

**జన్మభూమి** — రాయప్రోలు సుబ్బారావు

ఏ దేశమేగినా ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండుగౌరవము

ఏ పూర్వ పుణ్యమో, ఏయోగబలమో
జనియించినాడ వీ స్వర్గఖండమున
ఏమంచి పూవులన్ ప్రేమించినావో
నినుమోసె యీ తల్లి కనక గర్భమున.

లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరులింకెందు
సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడల జెండాలు ఆడునందాక.

అందాకగల ఈ అనంత భూతలిని
మన భూమి వంటి చల్లని తల్లిలేదు
పాడరా నీ తెల్గు బాలగీతములు
పాడరా నీ వీర భావ భారతము.

తమ తపస్సులు ఋషుల్ ధారవోయంగ
శౌర్యహారము రాజచంద్రులర్పింప
భావ సూత్రము కవిప్రభువు లల్లంగ
రాగ దుగ్ధము భక్తరత్నముల్ పిదుక.

దిక్కుల కెగదన్ను తేజమ్ముమెలుగ
రాళ్ళ తేనియలూరు రాగాలు సాగ
జగముల నూగించు మగతనం బెగయ
సౌందర్యమెగ బోయు సాహిత్యమలర.

వెలిగినదీ దివ్యవిశ్వంబు పుత్ర
దీపించె నీ పుణ్యదేశంబు పుత్ర
పొలముల రత్నాలు మొలిచెరా యిచట
వార్ధిలో ముత్యాలు పండెరా యిచట.

పృథివి దివ్యౌషధుల్ పిదికెరా మనకు
కానల కస్తూరి కాచెరా మనకు
అవమానమేలరా ? అనుమానమేల ?
భారతీయుడనంచు భక్తితో పాడ.

**జయ జయ ప్రియ భారతి** — దేవులపల్లి వేంకటకృష్ణ శాస్త్రి

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ, దివ్యధాత్రి
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయ నేత్రి
జయ జయ సశ్యామల సు
శ్యామ చలచ్చేలాంచల
జయ వసంత కుసుమలతా
చరిత లలిత చూర్ణ కుంతల
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా

జయ జయ జయ ప్రియ భారత ॥
జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ
జయ గాయక వైతాళిక
గళ విశాల పద విహరణ
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా
జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ, దివ్యధాత్రి !

## తమ్ముడా !

రాయప్రోలు సుబ్బారావు

శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలుపారిన భాగ్యసీమయి
వరలినది యీ భరతఖండము
భక్తిపాడర ; తమ్ముడా !
వేదశాఖలు పెరిగె నిచ్చట
ఆదికావ్యం బందె నిచ్చట
బాదరాయణ పరమ ఋషులకు
పాదు సుమ్మిది చెల్లెలా !
విపిన బంధుర వృక్షవాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట
విపుల తత్వము విస్తరించిన
విమల తలమిదె తమ్ముడా !
సూత్ర యుగముల శుద్ధవాసన
క్షాత్రయుగముల శౌర్యచండిమ
చిత్రదాస్యముచే చరిత్రల
చెఱిగిపోయెనె చెల్లెలా !
మేలి కిన్నెర మేళవించీ
రాలు కరగగ రాగమెత్తీ
పాల తీయని బాల భారత
పదము పాడర తమ్ముడా !
నవరసమ్ములు నాట్యమాడగ
చివుర పలుకులు చెవుల విందుగ
కవిత లల్లిన కాంత హృదయుల
గారవింపవె చెల్లెలా !
దేశ గర్వము దీప్తిచెందగ
దేశ చరితము తేజరిల్లగ
దేశ మరసిన ధీరపురుషుల
తెలిసి పాడర తమ్ముడా !
పాండవేయుల పదును కత్తులు
మండి మెఱసిన మహిత రణకథ
కండగల చిక్కని తెఱుంగుల
కలసి పాడవె చెల్లెలా !
లోకమంతకు కాక పెట్టిన
కాకతీయుల కదన పాండితి
చీకిపోవని చేవ పదముల
చేర్చి పాడర తమ్ముడా !
తుంగభద్రా భంగములతో
పొంగి నింగిని పాడిది త్రుళ్ళీ
భంగపడని తెలుంగు నాథుల
పాట పాడవె చెల్లెలా !

## నారాయణ నారాయణ

దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి

నారాయణ నారాయణ అల్లా అల్లా
మాపాలిట తండ్రీ నీ పిల్లల మేమెల్లా ॥నారా॥
మతమన్నది నాకంటికి మసకైతే
మతమన్నది నా మనసుకు మబ్బైతే
మతం వద్దు గితం వద్దు మాయామర్మం వద్దు ॥నారా॥
ద్వేషాలు రోషాలు తెచ్చేదే మతమైతే
కలహాలు కక్షలు కలిగించేదే గతమైతే
మతం వద్దు గతం వద్దు
మరణ హెూమం వద్దు ॥నారా॥
మతమన్నది గాంధీజీ హితమైతే
మతమన్నది లోకానికి హితమైతే
హిందువులం ముస్లిములం
అందరము మానవులం,
అందరమూసోదరులం ॥నారా॥

## భారతీయ వీరులం

- దాశరథి

ారతీయ వీరులం
రతమాత బిడ్డలం
ారతీయ వీరులం
రతమాత బిడ్డలం
ాతృదేశ గౌరవం
ాపాడే ధీరులం
ాతృదేశ గౌరవం
ాపాడే ధీరులం
ంతి కోరు పాపలం
మత పెంచు బాలలం
ంతికోరు పాపలం
మత పెంచు బాలలం
ంము భావి పౌరులం
్యాగధనుల వారసులం
ంము భావిపౌరులం

త్యాగధనుల వారసులం
వేష భాష లేవైనా
మతాచార మేదైనా
వేషభాషలేవైనా.
మతాచారమేదైనా
మనం భారతీయులం
ఒకేతల్లి పిల్లలం
మనం భారతీయులం
ఒకే తల్లి పిల్లలం
ప్రపంచాన మన దేశం
ప్రతిభను నిలబెట్టుదాం
మనమంతా సైనికులం
మనం ప్రజాసేవకులం
జాతి స్వేచ్ఛ నపహరించు
శత్రువునెదిరించుతాం

విజయం సాధించుతాం
జయపతాక నెగరేద్దాం
విజయం సాధించుతాం
జయపతాక నెగరేద్దాం
హిమశైల కిరీటయై
సముద్ర పాదపీఠయై
గంగ, యమున, గోదావరి
కృష్ణ వేణి సహితయై
విలసిల్లే భరతమాత
మన తల్లికి జోహార్
మన తల్లికి జోహార్
భారతీయ వీరులం
భరతమాత బిడ్డలం
భారతీయ వీరులం
భరతమాత బిడ్డలం.

## తల్లీ భారతి !

— దాశరథి

ల్లీ భారతి వందనం
ల్లీ భారతి వందనం
ఇల్లే మా నందనం
ుమంతా నీ పిల్లలము
చల్లని ఒడిలో మల్లెలము
ల్లిదండ్రులను గురువులను
ల్లవేళల కొలిచెదమమ్మా
ల్లిదండ్రులను గురువులను
ల్లవేళల కొలిచెదమమ్మా
దువులు బాగా చదివెదమమ్మా
ాతి గౌరవం పెంచెదమమ్మా
దువులు బాగా చదివెదమమ్మా
ాతి గౌరవం పెంచెదమమ్మా
ులమత భేదం మరచెదము

కలతలు మాని మెలగెదము
కుల మత భేదం మరచెదము
కలతలు మాని మెలగెదము
మానవులంతా సమానులంటూ
మమతను సమతము పెంచెదము
తెలుగు జాతికీ అభ్యుదయం
నవభారతికే నవోదయం
తెలుగు జాతి అభ్యుదయం
నవభారతికే నవోదయం
భావిపౌరులం మనం మనం
భారత జనులకు జయం జయం
భావిపౌరులం మనం మనం
భారత జనులకు జయం జయం

## సారే జహాఁసె అచ్ఛా - మహ్మద్ ఇక్బాల్

సారే జహాఁసె అచ్ఛా హిందూస్తాఁ హమారా
హమ్ బుల్ బులేఁహై ఇస్‌కే, యే గుల్ సితాఁ హమారా॥
పరబత్ వో సబ్ సే ఊంఛా హమ్‌సాయా ఆస్మాఁ కా
వో సంతరీ హమారా! వోపాస్‌బాఁ హమారా॥
గోదీమె ఖేల్ తీహైఁ ఇస్‌కీ హజారోఁ నదియాఁ
గుల్‌షన్ హై జిన్ కేదమ్ సే రష్‌కె జినాఁ హమారా॥
మజ్ - హబ్ నహీఁ సిఖాతా ఆపస్‌మె బైర్ రఖ్‌నా
హిందీ హైఁ హమ్, వతన్
హైఁహిందూస్తాఁ హమారా॥

అర్థం: ప్రపంచంలో భారతదేశం ఉత్తమమయింది. ఇది మనందరికీ ఒక పూదోట. మనమంతా ఇక్కడ బుల్‌బుల్ పిట్టలం. మిన్నునంటుతున్న ఆఎత్తయిన పర్వతం మనల్ని కాపలా కాస్తూ రక్షిస్తున్నది. భారతమాత ఒడిలో వేల కొద్దీ నదులు ఆడుతున్నాయి. ఈ నదీ జలాలతో పూచిన పూదోటను చూచి స్వర్గమే ఈర్ష్య పడుతుంది. పరస్పరవైరాన్ని మతం బోధించదు. మనమంతా భారతీయలం. మనదేశం భారతదేశం.

## ఝండా ఊంఛా రహే హమారా - శ్యామ్ లాల్ గుప్త పార్షద్

విజయీ విశ్వ తిరంగా ప్యారా
ఝండా ఊంఛా రహే హమారా ॥ ఝండా ॥

ర్సానే వాలా
ధా సర్సానే వాలా
కో హర్షానే వాలా
తృ భూమికా తన్ మన్ సారా । ఝండా।

స్వతంత్రతాకీ భీషణ రణ్ మే
లగ్‌కర్ బఢె జోష్ క్షణ్ క్షణ్‌మే
కావే శత్రు దేఖ్‌కర్ మన్‌మే
మిట్ జావే భయ సంకట్ సారా ॥ ఝండా ॥

ఇన్ ఝండేకే నీచే నిర్భయ
లే స్వరాజ్య యహ అవిచల నిశ్చయ్
బోలో, భారత్ మాతాకీ జయ్
స్వతంత్రతా హి ధ్యేయ హమారా । ఝండా

ఇస్‌కీ షాన్ నీజానేపావే
చాహె జాన్ భలేహి జాయె
విశ్వ విజయ కర్ కే దిఖ్ లావే
తబ్ హొవే ప్రణ పూర్ణ హమారా ॥ ఝండా।

### త్రివర్ణ పతాక భావం

ప్రీతికరమైన మన త్రివర్ణ పతాకం
విజయంతో విశ్వంలో ఎగురుగాక! ఎప్పుడూ
శక్తిని విరజిమ్మేది ప్రేమామృతం చిలికేదీ
వీరులకు స్ఫూర్తినిచ్చేది మాతృభూమి
తనువుకు మనస్సుకై ప్రతీకగా ఉండేది.

భీకరమైన స్వాతంత్ర్య పోరాటంలో క్షణక్షణం
శత్రువులనెదిరించే స్ఫూర్తిని కలిగిస్తూంది.
ఈ పతాకాన్ని చూచినంతనే మనస్సుల్లో
భయభ్రాంతులు ఎగిరిపోతాయి. ఈ
పతాకపు నీడలో భయం లేని వారమై స్థిర
చిత్తులమై స్వరాజ్యం సాధించేందుకు
నిర్ణయించుకొని స్వాతంత్ర్యమే మా లక్ష్యమని
భరతమాతకు జయమని నినాదమిస్తున్నారు.
ప్రాణాలు పోయినా ఈ పతాక గౌరవాన్ని
రక్షించుకోవాలి. విజయం సాధించి
చూపిస్తాము. అప్పుడే మన ప్రతిజ్ఞ
నెరవేరుతుంది.

## ప్రపంచ బాలల గీతి — యునిసెఫ్ బాలలగీతి - తెలుగు సేత-సుధామ.

ఎల్లలెరుగని వాళ్ళము - కల్లలెరుగని వాళ్ళము
బాలలం మేమొక్కటే - లోకమూ మాకొక్కటే.
గోధుమ రంగున కొందరు - పసుపువన్నె ఇంకొందరు
తెలుపు, నలుపు, ఆపిల్ ఎరుపూ -
ఏ రంగైనా ముచ్చట గొలుపూ
సంగేదైనా, రూపేదైనా - నివసించే ఆ చోటేదైనా
బాలలం మేమొక్కటే - లోకమూ మాకొక్కటే.
న్నం, పప్పు, చారూ, కూరా - శాకాహారం అనువారైతే
డ్డూ, చేపా, కోడీకూరా - మాంసాహారం అనువారైతే
ండేదైనా, తీరేదైనా -తినగోరే ఆ రుచులేవైనా
బాలలం మేమొక్కటే - లోకమూ మాకొక్కటే

అవునందురు,.ఎస్ అందురు కొందరు
- ఒకే, టాటా అందురు కొందరు
సీ, దేఖో, జా అంటూ కొందరు .
పలువిధాలుగా పలుకుచుందురు॥
మాటేదైనా, పాటేదైనా - పెదాలు కలిపే
భాషేదైనా
బాలలం మేమొక్కటే -
లోకమూ మా కొక్కటే.
దేశాల్ వేర్వేరైనా కానీ - సందేశం మాదిదే
యిదే సంతోషంతో సకల ప్రపంచం - పకపక
లాడాలన్నదే.

## పిల్లల్లారా పాపల్లారా — దాశరథి
ఎస్.సి ఇఆర్.టి. వారి 'కలిసి పాడదాం' అనే సామూహిక బాలల గేయం

ల్లల్లారా పాపల్లారా రేపటి భారతపౌరుల్లారా
ద్దలకే ఒక దారిని చూపే పిన్నల్లారా పిల్లల్లారా
మీ కన్నుల్లో పున్నమి జాబిలి
న్నాడు, ఉన్నాడు పొంచున్నాడు.
మీ మనస్సులో దేవుడు కొలువై ఉన్నాడు
ఉన్నాడు అతడున్నాడు
భారత మాతకు ముద్దులు పాపలు,
మీరేలే మీరేలే
అమ్మకు మీపై అంతులేని ప్రేమలే, పిల్లల్లారా
ప్రేమలే

రేపటి భారత పౌరుల్లారా . . . .
భారత దేశం ఒక్కటే ఇల్లు
భరత మాతకు మీరే కళ్ళు,
మీరే కళ్ళు, మీరే కళ్ళు
జాతిపతాకం పైకెగ రేసి
జాతి గౌరవం కాపాడండి
బడిలో బయటా అంతా కలిసి
భారతీయులై మెలగండి
కన్యాకుమారికి కాశ్మీరానికి
అన్యోన్యతను పెంచండి
వీడని బంధం వేయండి. పిల్లలారా।

## అంతా ఒక్కటే — న్యాయపతి రాఘవరావు

అంతా ఒక్కటే మనమంతా ఒక్కటే,
ఆంధ్రులమైనా తమిళులమైనా
సిక్కులైనా కన్నడులైనా
మరాఠి అయినా గుజరాత్ అయినా
పంజాబ్ అయినా బంగ్లా అయినా-। అంతా।
వందనమండీ వందనం (తెలుగు)
వణక్కమమ్మా వణక్కం (తమిళం)
నమస్కార్ నమస్కార్ ( హిందీ)

ఇస్సలాం ఇస్సలాం (అస్సామీ)
భాషలు వేర్వేరయినాగానీ
భావాలన్నీ ఒకటేనోయ్ -వేర్వేరయినాగానీ
జాతులు, మతములు
నీతులు అన్నీ ఒకటేనోయ్,
దేశాలన్నీ ఒకటే అయితే ద్వేషాలేమీ ఉండవుగా,
బాలప్రపంచం, భావిప్రపంచం
భావిభారత వారసులం - । అంతా॥

# పిల్లల ఆటల పాటలు

## కాళ్ళా గజ్జి

కాళ్ల గజ్జి - కంకాలమ్మ
వేగు చుక్క - వెలగ మొగ్గ
మొగ్గగాదు - మోదుగ నీరు
నీరుగాదు - నిమ్మలవాయ
వాయగాదు - వాయింటకూర
కూరగాదు - గుమ్మడిపండు
పండుగాదు - పాపడమీసం
మీసంగాదు - మిరియాలపోతు
పోతుగాదు - బొమ్మల శెట్టి
శెట్టిగాదు - శామమన్ను
మన్నుగాదు - మంచిగంధపు చెక్క
లింగులిటుకు - పందెమాల పటుకు
కాలు పండినట్లు - కడకు దీసి పెట్టు.

## గుడుగుడు కుంచం

గుడుగుడుకుంచం గుండేరాగం,
పావడపట్టల పడిగేరాగం,
అప్పడాలగుట్టం ఆడుకోబోతే.
పే పేగుట్టం పెళ్ళికి పోతే,
అన్నా ! అన్నా! నీ పెళ్లెపుడంటే
రేపుగాక, ఎల్లుండి
- కత్తిగాదు, బద్దాగాదు గప్, చిప్ !

## దాగుడు మూతలు

దాగుడు మూత దండాకోర్
పిల్లీ వచ్చె ఎలుకా దాగే
ఎక్కడి దొంగలు అక్కడనే
గప్ చిప్ సంబారు బుడ్డి ।
కళ్ళు మూసి కాలీకోర్
ఎక్కడి దొంగలు అక్కడనే
అడుక్కో - బుడుక్కో సంబారు బుడ్డి
గప్ చిప్ - గప్ చిప్ ॥

## చెమ్మ చెక్క

చెమ్మ చెక్క, చేరెడేసి మొగ్గ
అట్లుపొయ్యంగ, ఆరగించంగ
ముత్యాల చెమ్మచెక్క ముగ్గు లెయ్యంగ
రత్నాల చెమ్మచెక్క రంగు లెయ్యంగ
పగడాల చెమ్మచెక్క పందిరెయ్యంగ
పందిట్లో మా బావ పెండ్లి చెయ్యంగ
చూచివద్దాం రండి, సుబ్బరాయుడి పెండ్లి
(సూర్య దేవుడి పెండ్లి, చూచివత్తాం రండి)
మా వాళ్లింట్లో పెండ్లి, మళ్లీ వద్దాం రండి
దొరగారింట్లో పెండ్లి
దోచుకువద్దాం రండి !

## వానా వానా వల్లప్ప

వానా వానా వల్లప్ప
వాకిలి తిరుగు చెల్లప్ప
కొండ మీది గుండురాయి
కొక్కిరాయి కాలు విరిగె
దానికేమి మందు ?
వేపాకు పసుపూ వెల్లుల్లి పాయ
నూనమ్మబొట్టు
నూటొక్కసారి
పూట కొక్క తూరి

## ఒప్పుల కుప్పా ఒయ్యారి భామా

ఒప్పుల కుప్పా ఒయ్యారి భామా
మినపా పప్పు మెంతీ పిండి
తాటీ బెల్లం తవ్వెడు నేయి
గుప్పెడు తింటే కులుకూ లాడి
నడుమూ గట్టె నామాటె చిట్టీ
దూదూ పుల్ల దురాయ్ పుల్ల
చూడాకుండాజాడా తీయ్
ఊదాకుండా పుల్లా తియ్
దాగుడు మూత దండాకోర్
పిల్లీ వచ్చె ఎలుకా భద్రం
ఎక్కడి దొంగాలక్కడ్నే గప్ చిప్

**ఒక్కటి ఓ చెలియా,**

~క్కటి ఓ చెలియా,
రెండూ రోకళ్లు;
మూడూ ముచ్చిలకా,
నాలుగు నందన్నా ;
ఐయిదుం బేడల్లు,
ఆరుంజవ్వాజి;
ఏడూ యెలమంద,
ఎనిమిది మనమంద;
తొమ్మిది తోకుచ్చు,

**వారాలు**

ఆదివారం నాడు అరటి మొలచింది.
సోమవారం నాడు సుడివేసి పెరిగింది.
మంగళవారం నాడు మారాకు తొడిగింది.
బుధవారం నాడు పొట్టిగెల వేసింది.
గురువారం నాడు గుబురులో దాగింది.
శుక్రవారం నాడు చూడగా పండింది.
శనివారం నాడు చకచకా గెలకోసి
అందరికి పంచితిమి అరటి అత్తములు
అబ్బాయి అమ్మాయి అరటి పండ్లివిగో.

**చెన్నపట్నం - చెరుకుముక్క**

చెన్నపట్నం, చెరుకుముక్క
నీకోముక్క, నాకోముక్క
రామునిపట్నం, బిందెలజోడు
నీకోబిందె, నాకోబిందె;
నాళీపట్నం కాసులజోడు
నీకోకాసు, నాకోకాసు.

**చుట్టాల సురభి**

చుట్టాల సురభి - బొటన వ్రేలు
పెండేల కొరివి - చూపుడు వ్రేలు
గిట్టుసన్యాసి - మధ్యవ్రేలు
ఉంగరాలభోగి - ఉంగరపు వ్రేలు
పెళ్లికి పెద్ద - చిటికెనవ్రేలు
తిందాం తిందాం ఒకవేలు !
ఎట్లా తిందాం ఒకవేలు ?
అప్పుచేసి తిందాం ఒకవేలు !
అప్పెట్టా తీరుతుంది ఒకవేలు?
ఉన్నాగదా నేను అన్నింటికీ
పొట్టివాణ్ణి గట్టివాణ్ణి బొటనవేలు !

**ఎందుకురా ?**

ఎండలు కాసే దెందుకురా ?
మబ్బులు పట్టే టందుకురా .
మబ్బులు పట్టే దెందుకురా ?
వానలు కురిసే టందుకురా.
వానలు కురిసే దెందుకురా ?
చెరువులు నిండే టందుకురా ?
చెరువులు నిండే దెందుకురా ?
పంటలు పండే టందుకురా ?
పంటలు పండే దెందుకురా ?
ప్రజలు బ్రతికే టందుకురా .
ప్రజలు బ్రతికే దెందుకురా ?
దేవుని కొలిచే టందుకురా.
దేవుని కొలిచే దెందుకురా ?
ముక్తిని పొందే టందుకురా.

**అల్లీబిల్లీ పాట**

కొండాపల్లీ కొయ్యా బొమ్మా
నీకో బొమ్మా నాకో బొమ్మా.
నక్కాపల్లీ లక్కా పిడతలు
నీకో పిడత నాకో పిడత.
నిర్మల పట్నం బొమ్మల పలకలు
నీకో పలకా నాకో పలకా.
బంగినపల్లీ మామిడి పండ్లూ
నీకో పండూ నాకో పండూ
ఇస్తానుండూ తెచ్చేదాకా
చూస్తూవుండూ ఇచ్చేదాకా.

**రింగు రింగు బిళ్ల - రూపాయి దండ**

దండ కాదురా! - తామర మొగ్గ
మొగ్గ కాదురా! - మోదుగ నీడ
నీడ కాదురా! - నిమ్మల బావి
బావి కాదురా! - బచ్చల కూర
కూర కాదురా! - కుమ్మరి మెట్టు
మెట్టు కాదురా! - మేదర సిబ్బి
సిబ్బి కాదురా! - చీపురు కట్ట
కట్ట కాదురా! - కావడి బద్ద
బద్ద కాదురా! - బారెడు మీసం
మీసం కాదురా! - మిరియాల పొడుం
పొడుం కాదురా! - పోతురాజు

**చిలకమ్మ పెండ్లి**

చిలకమ్మ పెండ్లి అని - చెలికత్తెలందరూ
చెట్లు సింగారించి - చేరి కూర్చున్నారు
పందిట పిచ్చుకలు - సందడి చేయగ
కాకుల మూకలు - బాకాలూదగ
కప్పలు బెకబెక - డప్పులు కొట్టగ
కొక్కొరోకోయని - కోడికూయగా
ఝుమ్మని తుమ్మెద - తంబుర మీటగ
కుహూకుహూ యని - కోయిల పాడగా
పిల్లతెమ్మెరలు - వేణువూదగా
నెమలి సొగసుగా - నాట్యం చేయగా
సాలీడిచ్చిన చావు కట్టుకొని
పెండ్లికుమారుడు బింకము చూపగ
మల్లీమాలతి - మాధవీ లతలు
పెండ్లి కుమారుని - పెండ్లి కూతురిని
దీవిస్తూ తమ పూవులు రాల్చగ
మైనా గోరింక మంత్రము చదివెను
చిలకమ్మ మగడంత - చిరునవ్వు నవ్వుతూ
చిలకమ్మ మెడకట్టె - చింతాకుపుస్తె

- గిడుగు వేంకట సీతాపతి

**నెమలి కన్ను**

ధగధగ మెరిసే కాంతినిచల్లే
కళ్ళు నెమలి కెవరిచ్చారో
పురి విప్పుతు అది నాట్యమాడగా
తాండవకృష్ణుడు జ్ఞప్తికి రాడా !

మేఘాలందం నీలాలందం
కాంతల కాటుక కన్నుల అందం
అందా లన్నీ జీవం దాలిచి
నీలో నాట్యం చేసేనే !

జ్ఞాపకముంటే చెప్పరాదుటే
కృష్ణుని బాల్య క్రీడలు మాతో !
కృష్ణుని వేణికి నీవా అందం
నీకే అందం ఆ వేణా !

చెప్పరాదటే చిన్ని కృష్ణునీ
కూకటి ముడితో తాండవమాడిన
నాటి వైభవము నీదే అయితే
కృష్ణగాథలను కర్ణామృతముగ !

ఆ నాడామురళ ళాలించితివట
గోపాలోన్నత శిరమున నిలిచి
మురళీ మోహన దివ్య గీతముల
ప్రతిబింబములా నీలో తళుకులు !

నిన్ను బాలకులు నిత్యాలు కోరుతు
నీతో ఆటలు ఆడేవేళల
వారు కృష్ణ లను భావము పుట్టును
నిజమంటావా కాదా చెప్పవె !

- చింతా దీక్షితులు

## పొడుపు కథలు

అందమైన చెరువులలో ముద్దువచ్చే పిట్ట మూతికి బంగారం తోకతో నీరు తాగుతుంది.

అందరాని వస్త్రంపై అన్నీ వడియాలే.

అమ్మా అంటే కదులుతాయి, నాన్నా అంటే కదలవు.

అరటాకు మీద ముల్లు పడ్డా ముల్లుమీద అరటాకు పడ్డా అరటాకుకే ప్రమాదం.

ఆకాశంలో ఉంటుంది కాని మేఘం కాదు, తోక ఉంటుంది కాని ఎద్దు కాదు, అటూ ఇటూ తిప్పితే చాలు పరుగు తీస్తుంది.

. ఇద్దరు పెళ్ళాల మొగుడు ఇరుకున పడి చచ్చెనట.

. ఊరంతా తిరుగును నీళ్లని చూచి భయపడును.

. గదులన్నీ తిరిగి తిరిగి గడపదాటి ఇల్లంతా నాకి మూలకొచ్చి కూర్చుటుంది.

. గబగబ నడచిపోయేవి రెండు, గట్టెక్కి చూచేవి రెండు, అంది పుచ్చుకునేవి రెండు ,ఆలకించేవి రెండు.

0. ఒడలి నిండ కన్నులుండు ఇంద్రుడు కాదు, కంఠమందు నలుపు, కాదు శివుడు! ఫణుల బట్టి చంపు పక్షీంద్రుడా? కాదు

1. తలపై టోపీ ఉంది మహారాజు కాదు గొంతుదాక తాగుతాను తాగుబోతును కాదు అందరికీ కావాలి నేను !

2. తోకలేని పిట్ట ఆకలెరుగని పిట్ట తొంబై ఆమడలు పోతుంది.

13. పైన పలకలు కింద పలకలు పలకల నడుమ మెలికల పాము

14. వంకర టింకర - శొ; వాని తమ్ముడు అ; నల్లని పిల్లా - మి; నాకేమిస్తావు - తే అన్నీ కలిపితే ఒకమందు.

15. రక్త సంబంధం రవ్వంత లేకుండా మానవాళికెల్ల మామగారు.

16. సముద్రంలో పుట్టి సముద్రంలో పెరిగి ఊళ్లోకి వచ్చి అరిచేది.

17. చుట్టూ కంప, కంపల పెంకు, పెంకుల శంఖు, శంఖులో తీర్థం.

18. నల్లని పండు పుల్లగనుండు.

19. చెయ్యని కుండ, పొయ్యని నీళ్లు, వెయ్యని సున్నం తియ్యగ నుండు.

20. చింపిరి చింపిరి, గుడ్డలు ముత్యాల వంటి బిడ్డలు

21. కిటకిట తలుపులు కిటారి తలుపులు తియ్యా వెయ్యా తీపులు లేవు.

22. అడవిలో పుట్టింది అడవిలో పెరిగింది మాయింటికొచ్చింది తైతక్కలాడింది.

23. గోడమీద బొమ్మ! గొలుసుల బొమ్మ! వచ్చీపోయేవారిని వడ్డించే బొమ్మ!

24. చిటారు కొమ్మ మీద మిఠాయి పొట్లం.

25. కాయమీద మాను కడు రమ్యమై వుండు, మానుమీద లతలమలయుచుండు, లతల మీద వేళ్లు నాట్యమాడు.

---

I. ప్రమిద 2. నక్షత్రాలు 3. పెదవులు 4. కన్య-పురుషుడు 5. గాలిపటం 6. పోక 7. చెప్పులు 8. ...పురు 9. కాళ్లు, కన్నులు, చేతులు, చెవులు 10. నెమలి 11. కలం 12. ఉత్తరం 13. నాలుక 14. ...ంఠి, అల్లం, మిరియం, తేనె 15.చందమామ 16.శంఖం 17.టెంకాయ 18.చింతపండు 19.లేత ...బ్బరికాయ 20.మొక్కజొన్నపొత్తు 21. కనురెప్పలు 22.కవ్వం 23.తేలు 24.తేనెపట్టు. 25.వీణ

26. ఇంట్లో మూలన కూర్చుంటుంది ఎండకు, వానకు బయుటకు బయలుదేరుతుంది.

27. దేహామెల్లను కండ్లు దేవేంద్రుడు కాదు నరవాహనంలేక నడచి పోదు, తనకు జీవుడు లేదు, తగిలి జీవులను చంపు.

28. దేశదేశాలకు ఇద్దరే రాజులు

29. చాచుకొని చావట్లో పడుకుంటుంది. ముడుచుకుని మూల నించుంటుంది.

30. నన్నని దంతాలున్నాయి కాని ఎలుకనుకాను, కుచ్చుతోక నాకున్నది నక్కను కాను, చేసేతిని సాయం శ్రీరామునికి కోతిని కాను, అయితే నేనెవర్ని?

31. సీతాకాదు, కొకాలేదు , రామచిలుకా కాదు, అదేమి ?

32. తలకాయ గూటిలో దాసేటోడు.

33. తూట్ల తూట్ల గుర్రం, తురాయి గుర్రం ఎంత మంది ఎక్కినా మోస్తుంది.

34. నాకు కాళ్ళు లేవు చేతుల్లేవు కాని నడుస్తాను.

35. తెల్లటి పొలంలో నల్లటి విత్తనాలు, చేతితో చల్లుతారు, నోటితో ఏరుతారు.

36. నాలుగు కాళ్ళుండు నడయాడలేదు. చేతులు రెండుండు పనిచేయ లేవు. ఎవరైనా వస్తే మర్యాద చేస్తుంది, కూర్చుండ బెడుతుంది; గౌరవిస్తుంది.

37. ఒక పండు - పండుకు పన్నెండు తొనలు, తొనకు ముప్పయిగింజలు పదునైదు తెలుపు పదునైదు నలుపు.

38. తల నుండి పొగ చిమ్ముచుండు భూతముగాదు, కన్ను లెర్రగ ఉండు రాకాసిగాదు,పాకిపోవుచుండు పాముకాదు.

39. పదములారుకలవుబంభరంబా, కాదు: తొండ ముండు గాని దోమకాదు, రెక్కలుండు గాని పక్షి గానేరదు.

40. నిగనిగ లాడే నిర్మల వస్తువు, ఘుమ ఘుమ లాడే గుమ్మగు వస్తువు, భుగభుగ మండేపరిమళవస్తువు, నీటికి నానదు గాలికి కరుగు, నిప్పుకు మండు.

41. మా తాత దొడ్డిలో మంచి ఎద్దుల మంద, ఎద్దులు పడుకుంటే పగ్గాలు మేస్తాయి.

42. తెల్లని బంతి చల్లని బంతి అందని బంతి ఆడని బంతి.

43. అన్నీ వేసి చూడు ననలావేసి చూడు!

44. మూట విప్పితే ముత్యాలు

45. రంగం లేని రంగం

46. సంపాదన ఒకరిది, అనుభవం ఇంకొకరిది.

47. తండ్రి గర గర, తల్లి పీచు పీచు బిడ్డలు రత్న మాణిక్యాలు మనుమలు మంచి ముత్యాలు .

48. నానోరు మూసుకోదు నా నాలుక ఊరు కోదు తగిలితే ' అరుస్తాను, నేనెవరిని?

49. పుట్టెడు సెనగల్లో ఒక్కటే రాయి.

50. అడవిలో పుట్టాను మేదరోళ్ల ఇంటిలో మెలిగాను. కడుపునిండా ఒంటినిండా గాయాలు.

---

26.గొడుగు 27.వల 28.సూర్యుడు, చంద్రుడు 29. చాప 30.ఉడుత 31. సీతాకోకచిలుక 32.తాబేలు 33.మంచం 34.పాము 35. అక్షరాలు 36. కుర్చీ 37. పంచాంగం-సంవత్సరం,పన్నెండు నెలలు, ముప్పది రోజులు, శుక్లపక్షం ,కృష్ణపక్షం, 38. రైలుబండి 39. ఈగ 40. కర్పూరం. 41. గుమ్మడికాయ 42. జాబిలి 43. ఉప్పు 44. దానిమ్మ పండు 45. చదరంగం 46. చేతులు కడుపు 47. పనసపండు 48. గంట 49. చంద్రుడు 50. వేణువు.

రాముని బంటు రాముని బంటు
హనుమంతులవారు
హనుమంతుడి కొక తోక ఉన్నది
అందమైన తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది
పొడుగుపాటి తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది
లావుపాటి తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది
బలమైనది తోక
తోకను నడుముకు చుట్టుకు తాను
రాముని మొక్కాడు
తోకను ఎత్తి చెంగున ఎగిరి
సముద్రము దాటాడు
లంకలోపల అశోకవనమున
సీతను చూచాడు
తోకను ముడిచి చేతులు చేర్చి
సీతకు మొక్కాడు
ఆనవాళ్ళను సీతకు చూపి
అభయ మిచ్చినాడు
సీతాదేవుల దీవెన పొంది
తోక ఎత్తినాడు
తోకను ఎత్తి ఎగిరి రాక్షసుల
మూకను కొట్టాడు
మేఘనాధుడికి దొరకాలంటూ
దొరికి పోయినాడు
రావణాసురుని రచ్చకూటమూ
ప్రవేశించినాడు
రాములవారిని భూషించాడు
రావణు తిట్టాడు

రావణాసురుడు కోపముతోను
కోతీ అన్నాడు
కోతిని బట్టి తోకను కాల్చి
తన్నం డన్నాడు.
ముడిచిన తోక సాగదీసిరి
రాక్షసులంతాను
కోకను తెచ్చి బట్టలు తెచ్చి
తోకకు చుట్టారు
ఎర్రబట్టలూ తెల్లబట్టలూ.
నల్ల బట్టలున్నూ
ఉన్ని బట్టలూ పట్టు బట్టలూ
నార బట్టలున్నూ
సన్నటి బట్టలు ముదుగు బట్టలూ
జరీ బట్టలున్నూ
మోపులకొద్దీ బట్టలు తెచ్చి
తోకకు చుట్టారు
ఎంత చుట్టినా ఎంత చుట్టినా
తోక పెరుగుతోంది
రాక్షసు లంతా విసిగీ విసిగీ
నూనెలు తెచ్చారు
కొబ్బరి నూనె నువ్వుల నూనె
వేరుసెనగ నూనె
కుసుమల నూనె ఆముదమున్నూ
వేప నూనెయున్నూ
గానుగ నూనె యిప్పనూనెయూ
గంధపు నూనెయునూ
చేపల నూనెలు ఆవునేతులూ
పశువుల కొవ్వున్నూ
మంచి వాసనల నూనెలు తెచ్చి
మడ్డి నూనెలను తెచ్చి

కుండలకొద్దీ బిందెలకొద్దీ
తోకను తడిపారు
చెకుముకి కొట్టి నిప్పును పట్టి
బట్టల కంటించి
గంతులువేస్తూ చప్పట్లు కొడుతూ
గట్టిగ నవ్వారు
రాక్షసు లంతా కేకలు వేస్తూ
పరిహాసము చేసి
కోతికి శాస్తి అయినది అంటూ
గోల చేసినారు
రాముని తలుచుకు, సీతను తలుచుకు
హనుమంతులవారు
హుమ్మని అర్చి ఘుమ్మున లేచి
రాక్షసులను చూచి
హనుమంతుడు తనదేహము పెంచి
తోకను పెంచాడు
గిర్రు గిర్రున తోకను వాళ్ళ
మొహాన్న తిప్పాడు
మొర్రో అంటూ రాక్షసు లంతా
పారిపోయినారు
ఆకాశానికి అవాయిలాగా
హనుమంతుడు ఎగిరి
అంటించాడు అంటించాడు
లంకా పట్నాన్ని
మేడల మీదికి మిద్దెల మీదికి
హనుమంతుడు ఎగిరి
అంటించాడు అంటించాడు
లంకా పట్నాన్ని
మంటలు మండే తోకను ఎత్తి
హనుమంతులవారు
రాచనగరులూ అంతఃపురములు
నాట్యశాలలూ యాగశాలలూ
స్నాన శాలలూ పణ్యశాలలూ
గుర్రపుశాలలు ఏనుగుశాలలు
పశువులశాలలు మండపంబులూ
అంటించాడు అంటించాడు
లంకా పట్నాన్ని
భగభగ భగభగ భగభగ భగభగ
మండుతోంది తోక
చురచుర చురచుర చురచుర చురచుర
అంటుకుంది లంక
భగ్గు భగ్గునా చుంయి చుంయి మని
మండుతోంది తోక
చిటపట పటపట భగ్గు భగ్గునా
మండుతోంది లంక
పొగలు సెగలతో బుస్సు బుస్సు
మని
మండుతోంది లంక
హోరు హోరుమని పరేలు మంటూ
మండుతోంది లంక
పటపట పరేలు ఢామ్మ్ ఢామ్మనీ
మండుతోంది లంక
పిడుగులు కురుస్తు మెరుపులు
మండుతోంది లంక
వాయుదేవుడు మంటలు పెంచె
లంక మండుతోంది
ఎర్రటి మంటలు తెల్లటి మంటలు
పచ్చ మంటలున్నూ
మంటలు మంటలు పొగలూ సెగలూ
మండుతోంది లంక
చిన్నలు పెద్దలు పురుషులు స్త్రీలూ
రాక్షసులంతాను
ఇళ్ళను విడిచి బయటికి వచ్చి

గొల్లున పడ్డారు
మండే తోకను జెండా ఎత్తి
లంకను చూచాడు
బూడిదపోగులు పొగలూ మంటలు
అంతట చూచాడు
చెంగున ఎగిరి సముద్రము దగ్గరి
కాతడు వచ్చాడు
తోకను దింపి నీటను ముంచి
మంటలు ఆర్పాడు
తోకను ఎత్తీ మళ్ళీ ఎగిరి
సముద్రము దాటేడు
తోకను నడుముకు చుట్టబెట్టుకొని
రాముని మొక్కాడు
తోకకు చుట్టీ రాళ్ళను తెచ్చి
వంతెన కట్టాడు
తోక వెంబడే వాళ్ళంతాను
వంతెన దాటారు
రాక్షసవీరులు చూచారండీ
హనుమంతుడి తోక
తోకనుచూచీ భయపడ్డారు
రాక్షసు లంతాను
మళ్ళీ వచ్చె మళ్ళీ వచ్చె
హనుమంతుడి తోక
అదిగో తోక అదిగో తోక
అమ్మయ్యో తోక!
తోక కొట్టినది తోక మట్టినది
తోక చంపె నయ్యో!
చచ్చా నయ్యో! చచ్చా నయ్యో!
తోక తగిలె నయ్యో!
ఇదుగో తోక అదుగో తోక
హనుమంతుడి తోక
పారిపొండిరా దుమికి పొండిరా

ఇదుగో చెట్టు అదుగో గొయ్యి
పదండి దాక్కోండి
తోక కాదురా శంభుడి శూలం
ఖస్సున పొడిచింది
తోక కాదురా విష్ణుని చక్రం
గిర్రున తిరిగింది
తోక కాదురా ఇంద్రుని వజ్రం
పరపర నరికింది
తోక కాదురా యముని దండమూ
దబదబ మొత్తింది
ఇదుగో తోక అదుగో తోక
అల్లదిగో తోక
అమ్మయ్యో అమ్మయ్యో అదె
హనుమంతుడి తోక
తోకను చూచి రాక్షసు లంతా
హడలిపోయినారు
తోకను చూచి రాక్షసు లంతా
బెదిరి చెదిరినారు
తోక దెబ్బకీ రాక్షసు లంతా
చచ్చిపోయినారు
తోక ముడిచి హనుమంతుడు వచ్చి
రాముని మొక్కాడు
తోకా నుదురూ చేతులు రాముని
పాదాలను చేర్చి
తోకను ఎత్తి చేతులు ఎత్తి
రాముని మొక్కాడు
తోకతోడను గొడుగును పట్టీ
సీతారాములకు
రామా రామా అంటూ ఉండెను
హనుమంతుల వారు.

## కోతి తపస్సు

-మహీధర నళిని మోహనరావు

మనసు లెవ్వరు లేని చోటను
వనములో నొక పర్ణ శాలను
ముని వరేణ్యుడు ముక్కు మూసుక
మూడు పొద్దుల జపము చేయును.
అడవిలో తిరుగాడు మర్కట
మతని వాలకమెల్ల చూచెను
వాగులో స్నానమ్ము చేయుట
పచ్చి కూరల నార గించుట
కనులు మూసుక కదల కుండుట
మరము వేసుక మాల తిప్పుట
ఇంత మాత్రపు పనులు తానును
ఇట్టె చేయుదు నని తలంచెను
జప తపమ్ములు తాను సైతము
సలుపు కోరిక పెచ్చు పెరుగగ
వానర మ్మొకనాడు మౌనికి

వంగి దండము పెట్టి ఇట్లనె :
"ఓ ఋషీశ్వర ! నాకు నేర్పరె
మీరు చేసే జపతపమ్ములు "
దాని కాతడు నవ్వి ఇట్లనె :
"తపము చేయుట చాల కష్టము
ఇంద్రియమ్ముల నిగ్రహించుట
ఎంత వారికి కష్ట సాధ్యము
స్వేచ్ఛగా విహరించు నీకీ
బెడద లన్నీ యేల చెప్పుము ?"
ఎన్ని చెప్పిన వినక మర్కట
"మెంత కష్టము నైన నోర్చెద
తపము చేసే పద్ధతంతయు
తెలుపుడ"ని బతిమాలసాగెను
మౌని వర్యుడు సరేలెమ్మని
మర్కటము గొనిపోయె శాలకు



గోడకడ పద్మాసనంబున
కూరుచుండగ జేసె కోతిని.
అందుబాటున మేలు జాతిది
అరటి పండొకటుంచి ఇట్లనె:
"ఆ ఫలమ్మును తినెడి కోరిక
నణచు కొనుటే తపము సుమ్మీ
ఇంతవర కభ్యాసమైతే
ఎంతయో సాధించినట్లే"
"ఏమిటో యనుకొంటి తపమన
నింతియేనా?" అన్నదా కపి
ఊపిరిని బిగపట్టి తాపసి
యోగ నిద్రను మునిగి పోయెను.
కోతి సైతము కనులు మూసుక
కొంత వడి కూర్చుండ గలిగెను.
కాని ముగ్గిన పండు వాసన
దాని ముక్కుల గుప్పు మనగా
కండ్లు తెరచును, పండు జూచును
కండ్లు మూయును తప్పుతప్పని.
"పండు తినుటకు ఆంక్షగానీ
పట్టి వాసన చూడ తప్పా ?"
అని తలంచుచు పండు చెంతకు
అల్ల నల్లన జరుగసాగెను.
"పట్టినే నా చేత పండును
పట్టు కుంటే దోష మేమిటి?"
అని తలంచుచు కోతి మెల్లన
అరటి పండును చేత బట్టెను.
పండు వంకకు చూచు నొకపరి
పరమ యోగిని చూచు నొకపరి
"నేటి నుండియె తపము మొదలిడి తీరవలెనని
శాస్త్ర మెక్కడ ?
ఇంతలోనే మించి పోయెడి
దేమి రేపటి నుండి చేతును"
అని తలంచుచు కోతి గుటుకున
అరటి పండును మింగి చనియెను.



# పిల్లల కథలు

## స్నేహశీలమే మిన్న !

ఒకప్పుడు సూర్యుడూ వాయుదేవుడూ వారిలో ఎవరు బలవంతుడా అని వాదులాడు కున్నారు. "నేనే బలవంతుడ"నని నిరూపిస్తానంటూ వాయు దేవుడు సూర్యునితో "అటుచూడు, ఆ చొక్కావేసుకొని దర్జాగా నడుస్తున్న మనిషిని చూపిస్తూ అతను ఎంత త్వరగా తన చొక్కా తీసి పార వేస్తాడో చూడు", అని సవాలు చేశాడు. అలా, అంటూ వాయుదేవుడు గట్టిగా గాలి వీయడం మొదలు పెట్టాడు. మొదట ఆ మనిషి చొక్కా బొత్తాలు బిగించాడు. ఇంకా తీవ్రంగా వాయుదేవుడు వీచాడు. అప్పుడతను తన చొక్కాను ఇంకా గట్టిగా బిగించి కప్పుకొన్నాడు. ఇంకా ఇంకా తీవ్రంగా వీస్తే ఇంకా ఇంకా బిగించాడు. చివరకు వాయుదేవుడు ఏమీ చేయలేక తన ఓటమిని అంగీకరించాడు. అప్పుడు సూర్యుడు నింపాదిగా మబ్బుల చాటు నుండి బయటకు వచ్చి ఆ మనిషి వైపు చిరునవ్వు చిందించాడు. అప్పుడు అతను నొసటన చేరిన చెమట బిందువుల్ని తుడుచుకున్నాడు. .ఇంకాసేపటికి తన చొక్కాకు వున్న బొత్తాలు విప్పాడు. ఇలా కొద్ది సేపటికి చొక్కానే విప్పి విసిరి పారేశాడు!

"చూడు ? వాయుదేవా! ఉగ్రంగా బలాన్ని ప్రదర్శించడంకంటే స్నేహశీలిగా నెమ్మదితనం కుదురు ఎంత మేలు చేశాయో" అని పాఠం బోధిస్తూ నిర్మలంగా మరొక చిరునవ్వు నవ్వాడు సూర్యుడు. *-ఇది సంప్రదాయ కథ!*



# తేనె చుక్క కోసం

రాజాధిరాజు అడవిలో వేటకు బయలు దేరాడు. జింక, దుప్పి వేటాడి సేద తీర్చుకుంటానికిగాను ఒక పెద్ద బావి పక్కమున్న చెట్టు కిందకు చేరాడు. అక్కడికి ఒక పెద్ద పులి వచ్చింది. రాజు హడలిపోయి చెట్టెక్కేశాడు. ఇంతలోనే అది పెళ పెళ విరిగింది. పక్కమున్న కొమ్మ పట్టుకొని వేలాడుతూ ఒక సారి పైకి చూశాడు. పైన ఒక పెద్ద నాగుపాము పడగెత్తి ఆడుతోంది. తన నెత్తి మీద పైనున్న కొమ్మకు పట్టివున్న తేనెపట్టునుండి మధు బిందువులు చుక్కచుక్కలుగా పడుతూ ఉన్నాయి. కిందకు చూస్తే లోతైనదిగుడుబావి. పట్టుకున్న కొమ్మ కూడా విరిగి పోతూంది. కింద మరొక వైపు చూస్తే రాజుగారు ఎప్పుడు దిగి వస్తాడా పట్టి తినేద్దామా అని ఆశగా పెద్దపులి పైకే చూస్తున్నది. ముందు నుయ్యి, వెనుక గొయ్యి అన్నట్టు వుంది రాజుగారి పని! ఇన్నికష్టాల్లో ఇరుక్కున్నప్పటికి విరిగిన కొమ్మపట్టుకొని రాజాధి రాజుగారు పై నుండి తేనెపట్టు నుండి పడుతున్న తేనె చుక్కల కోసం తాపత్రయ పడుతూ నాలుక చాపి పడుతూన్న చుక్కలన్నీ దర్జాగా ఆరగిస్తున్నాడు. మానవునికి ఆశ అంటే అలాంటిది, మరి! -*మధుబిందు జాతక కథ*



# సత్యమేవ జయతే

ఒక ఊరి పొలిమేరలో ఒక ఆవు పచ్చగడ్డి మేస్తూ ఉంది. పక్కనున్న అడవి నుంచి ఒక పెద్దపులి అక్కడకు వచ్చి ఆవుని చంపబోయింది. ఆవు తప్పించుకొని, "ఓ పులి మహారాజా, ఊరిలో నాకొక చిన్న లేగదూడ ఉంది. అది నా పాల కోసమై ఎదురు చూస్తూ ఉంటుంది. నేను ఇప్పుడే వెళ్లి నా దూడకు పాలుఇచ్చి వచ్చేస్తాను. ఆ తరువాత నన్నుచంపి నీవు తిను. నన్ను నమ్ము తప్పక వచ్చేస్తాను" అని బతిమాలింది, పులిని. అయితే పులికి ఏ మాత్రం నమ్మకం కలుగ లేదు. అయినా ఏలాగో ఒప్పుకుంది. దూడకు పాలు ఇచ్చి మంచి బుద్దులు చెప్పి, తిరిగి వచ్చేసి "ఓ పులిరాజా, నీవు ఇప్పుడు నన్నుచంపి తిను" అని కోరింది. పెద్దపులి క్రూరమృగం అయినా దానికి, ఆవు నిజాయితీ పట్ల ఆశ్చర్యం వేసింది. మెచ్చుకొని ఆవును చంపకుండా నీవు వెళ్లి, "నీ దూడతోనే హాయిగా ఉండు"అని పంపి వేసింది. సత్యం, నిజాయితీ, నచ్ఛీలత అపాయంనుండి కాపాడతాయి, మరి!!

- ఇది ప్రబంధకధ



# రాము - శ్యాము

రాము శ్యాము ఇద్దరు మిత్రులు. ఒకనాడు ఇద్దరూ అడవిలో నడుస్తూండగా అకస్మాత్తుగా ఎలుగుబంటి ఎదురైంది. ఇద్దరూ భయపడ్డారు. శ్యాము దాన్ని చూచి గబగబా చెట్టెక్కి కొమ్మల్లో దాక్కున్నాడు. రామూకి చెట్టెక్కడం చేతకాదు. అయితే వాడికి సమయస్ఫూర్తి ఉంది. ఎలుగుబంటి చచ్చిన వాళ్లని ముట్టుకోదని విని ఉండటం చేత తాను వెంటనే నేలమీద బోర్లా పడుకున్నాడు. చచ్చిన వాడిలా నటించాడు. ఆ ఎలుగు రామూ దగ్గరకు వచ్చి చుట్టూరా తిరిగింది. అటూ ఇటూ చూచింది. వాసన చూచింది. చెవులు తాకి చూచింది. అయినా రామూ ధైర్యంగా ఊపిరి బిగబట్టుకొని ఉండటం చేత ఎలుగుబంటి రామూ చచ్చిపోయాడని నిర్ధారణకు వచ్చి తన దారిన తాను వెళ్ళిపోయింది. అది అలా పోగానే శ్యామూ చెట్టు మీద నుండి దిగివచ్చి "మిత్రమా ఎలా ఉన్నావు? ఆ ఎలుగు నీ చెవి దగ్గర మూతిపెట్టి నీతో ఏదో చెప్పినట్టుంది. ఏమి చెప్పింది?" అని అడిగాడు. రాము వ్యంగ్యంగా "ఆపదలో ఉన్న మిత్రుణ్ణి విడిచిపెట్టి తాను సురక్షితంగా చెట్టెక్కి కూర్చున్నవాణ్ణి నమ్మవద్దని చెప్పింది" అన్నాడు. శ్యామూ సంగతి అర్థం చేసుకొని శ్యామూ సిగ్గుపడ్డాడు.

- ఇది పాశ్చాత్య కథ



## భూశయనం కథ

భూపతిరాజు రామవరం అనే ఊరిలో ఒక జమిందారు. దాతగా ప్రసిద్ధి. ఆ ఊరిలోనే సోమయ్య అనే రైతు కూడ ఉండేవాడు. ఈ రైతు పేరాశాపరుడుగా ప్రతీతి. ప్రతిరోజూ భూపతిరాజు దగ్గరకు సోమయ్య వచ్చి ఏదో యాచిస్తూ ఉండేవాడు.

జమిందారు కరుణించి ఒక రోజు "సోమయ్యా! ఒక పని చెయ్యి. ఈ గ్రామం అంతా నాదేకదా! నువు ఒక రోజు ఉదయాన్నే లేచి బయలుదేరి తూర్పు దిక్కుగా నడచివెళ్లి మరల సూర్యుడు అస్తమించే లోపుగా వచ్చేయి. నీవు నడచినంతమేర కుడివైపు అరకిలో మీటరు ఎడమవైపు అరకిలోమీటరు నీకు దానం చేస్తా"నని వాగ్దానం చేశాడు. మరో షరతు కూడ పెట్టాడు. ఆరోజు సోమయ్య ఎక్కడ బయలు దేరాడో అక్కడకి సూర్యాస్తమయం లోపున తిరిగి రావాలి. రాలేకపోతే అతను దానానికి అర్హుడు కాదు. సోమయ్య మర్నాడు ఉదయాన్నే లేచి బయలుదేరిన చోటు గుర్తు పెట్టుకొని కొంత దూరం వెళ్ళాడు. మళ్ళీ ఆచోటుకి సాయంకాలానికి వచ్చేయ్యాలికదా! ఆబ కొద్దీ ఇంకా ఇంకా ఇంకా వెళ్ళాలనిపించింది. సాయంకాలం పొద్దు గూకేలోపున రాలేనా అని ధైర్యం చెప్పుకొంటూ ఆశగా నడవసాగాడు. అలా చాలా దూరం పోయి తిరుగు ముఖం పట్టాడు. కాని సగం దూరం తిరుగు ప్రయాణానికే నగర్పు, ఆయాసం వచ్చింది. పొద్దు తగ్గిపోతూ ఉంది. పొద్దు గూకేలోపున బయలుదేరిన చోటు చేరడానికి గబ గబా నడవడం ప్రారంభించాడు. ఆయాసం మరీ ఎక్కు వైంది. బయలు దేరిన చోటుకు పది మీటరులు ఉండగా శక్తి ఉడిగి సోమయ్య పడి పోయాడు. లేవలేకపోయాడు. చివరికి ఊపిరాడక చనిపోయాడు. దురాశకు పోతే అంతేగదా! ఆశకొద్దీ చాలా దూరం పోకుండా ఓపిక ఉన్నంతదూరమే వెళ్ళి సకాలంలో తిరిగి వచ్చి వుంటే తేలికగా భూమిని సొంతం చేసుకొనిఉండేవాడుకదా!!

- ఇది టాల్‌స్టాయి కథ.



# అందని పండ్లు పుల్లన

ఒక వూరి పొలిమేరలో ఒక నక్క ఉండేది.ఒక రోజు దానికి ఆహారం ఏమీ దొరక లేదు. ఆకలితో కడుపు కాలిపోతువ్నది. ఊరిలోకి వస్తూ ఉంటే ద్రాక్షతోట కనిపించింది. గుత్తులు గుత్తులుగా కనిపించే ద్రాక్ష పండ్లు చూడగానే దానికి నోరూరి, ప్రాణం లేచి వచ్చింది. ద్రాక్ష పందిరి కింద కూర్చొని పండ్ల గుత్తుల వైపుకే చూస్తూ ఉంది. ఎగిరి ద్రాక్ష గుత్తుల్ని అందుకోవడానికి ప్రయత్నించింది. కాని అవి అందలేదు. ఒక సారి బోర్లా పడింది. మళ్లీ ప్రయత్నించి ఎగిరింది. లాభంలేక పోయింది. మరొకసారి ఎగిరింది. పండ్లు మాత్రం అందటం లేదు. అలా ఎగరటం, పడటం చాలసార్లు చేసింది. ఫలితం మాత్రం దక్కలేదు. ఇక తనకు అయ్యే పనికాదు అని నిర్ణయానికి వచ్చి మరొక వైపుకి వెళుతూంది. ఈ చోద్యం చూస్తున్న ఒక కుందేలు ఈ లోపున అటు వచ్చింది. "నక్కబావా! నక్కబావా! ద్రాక్ష పండ్లు తినలేదా?" అని అడిగింది. నక్కకు మొదట ఏం చెప్పాలో తెలియలేదు. పైకి చిరునవ్వు చిందించి, కొస్త తమాయించుకొని "ఆ ద్రాక్ష పండ్లు పుల్లగా ఉన్నాయి. అందుకే తినలేదు" అని అంటూ నిలబడకుండా తనదారిన తాను వెళ్లిపోయింది. అంతే మరి ! అందని పండ్లు ఎప్పుడూ పుల్లనే కదా !!

- ఇది ఈసోపు కథ.



## కోడి గుడ్డంత బంగారం

ఒక ఊరిలో ఒక రాజావారుండే వారు. ప్రతి రోజు ఒక క్షురకుడు వతనుగా వచ్చి రాజావారికి గెడ్డంగీసి వెళ్లడం ఆనవాయితీ. గెడ్డం గీస్తున్నంత సేపూ క్షురకుడు రాజావారితో ఆ ఊళ్లో కబుర్లు చెప్పడమూ ఆయన సరదాగా వినడమూ ఇలాగ గడిచిపోతూ ఉండేది ప్రతి రోజు డబ్బు గురించి క్షురకులకు మంచి సంగతులు మాత్రమే చెబుతూఉండేవాడు. ఎల్లప్పుడూ మంచి సంగతులే చెబుతున్నావేమిటి? అని రాజావారు అతణ్ణి అడిగారు ఒక రోజున. "మరి మంచి సంగతులుంటే మంచినేగదా, నేను చెబుతాను." అంటూ ఉండేవాడు. ఇలా ఉండగా ఒక రోజు 'డ్డం చేస్తూ క్షురకుడుతన కత్తుల పాదిని అక్కడే ంచి బయటకు వెళ్ళాడు. అప్పుడు రాజావారు ఏమిచేశారంటే ఆ పాది అరను లాగారు. అందులో కోడిగుడ్డంత బంగారం ఉండ కనిపించింది. ఇదా సంగతి! అని ఆ రాజావారు బంగారం గుడ్డును తీసి మళ్ళీ ఎప్పటి లాగనే పాదిని సర్దివేశారు. మర్నాడు ఉదయమే మామూలుగా క్షవరం చేయడానికి రాజావారి దగ్గరకు క్షురకుడు వచ్చాడు. ఈ సారి "మన ఊళ్ళో దొంగలు పడ్డారు. పరిస్థితులు ఏమీ బాగా లేవు". అంటూ విచారం వెళ్ళగక్కాడు. అప్పుడు రాజావారు తాను తీసిపెట్టిన బంగారు గుడ్డును తిరిగి ఇచ్చి వేస్తూ మనిషి తాను బాగుంటే ప్రపంచమంతా బాగు. లేకపోతే ప్రపంచమంతా చెడ్డ అన్నది మానవ సహజం అని అర్థంస్ఫురించే *"తన కలిమియే ఇంద్ర భోగము తన లేమియె సర్వలోక దారిద్రంబున్"* అన్న సుమతి నీతిని బోధించాడు.

*- ఇది సంప్రదాయ కథ*



## పిల్లి మెడలో గంట

ఒక ఇంటిలో ఒక పిల్లి ఉండేది. ఆ ఇంటిలోనే గాదె కింద చాలా ఎలుకలు కూడ కాపురం ఉన్నాయి. ప్రతిరోజు ఆ పిల్లి ఎలుకల్ని పట్టి చంపి తినేస్తూ ఉండేది. ఇలా ఉండగా ఒక రోజు గాదెకింద ఉన్న ఎలుకలు అన్నీటిని ఒక సభ చేశాయి. ఎలుకలన్నీ గుమి గూడి వాటిలో అనుభవం ఉన్న ఒక ముసలి ఎలుక ఒక ప్రతిపాదన చేసింది. అదేమిటంటే ఆ పిల్లి మెడలో ఒక గంటను కట్టితే అది ఇటువచ్చే సంగతి అందరికీ తెలుస్తుంది.అప్పుడు దొరకకుండా ఎవరికి వారు అందరూ పారిపోవచ్చునని సలహా ఇచ్చింది. మిగతా ఎలుకలన్నీ ఈ ప్రతిపాదన బాగానే ఉంది అన్నాయి. అయితే పిల్లి మెడలో గంట కట్టేది ఎవరు? అంటే ఎవరూ ముందుకు రావడం లేదు. చివరికి పిల్లి మెడలో గంట కట్టే ధైర్యం ఎవరికీ లేదు. అసాధ్యం అని గప్‌చిప్‌గా ఊరుకున్నాయి.

-ఇది ఈసోపు కథ



# ముందుచూపు

ఒక తటాకంలో మూడు చేపలు ఉండేవి. మూడూ మూడు రకాల స్వభావం కలవి. వాటిలో ఒక చేప ముందుచూపు కలది. దానిపేరు దీర్ఘదర్శి. అది దూరదృష్టితో ఆలోచించి భవిష్యత్తులో రాబోయేది అప్పుడే ఆలోచించి తెలుసుకుని జాగ్రత్త పడేది. రెండవ చేప ప్రాప్త కాలజ్ఞ. సమయస్ఫూర్తి కలది. అవసరం వచ్చినప్పుడు దానికి తగిన ఉపాయం ఆలోచించేది. మూడవ చేప కడు బద్ధకస్తురాలు. తర్వాత చూద్దాంలే అనేరకం. ముందుగాగాని, ఆపద వచ్చినప్పుడు గాని ఆలోచించక కానీలే అంటూ కాలయాపన చేసే సోమరి.

ఇలా ఉండగా, వేసవి కాలం రానే వచ్చింది. ఎండలు తీవ్రంగా ఉన్నాయి. అప్పుడు దీర్ఘదర్శి ఎండలు మండుతున్నాయి. తటాకంలోని నీరు ఇంకి పోతూంది. దీనినుండి పారే కాలువ కూడా ఇంకి పోతున్నది. పూర్తిగా ఎండిపోతే చేపలు ఈ తటాకంలోనే ఉండిపోయి జాలర్ల వలలో పడి చావ వలసి వస్తుంది. వెంటనే ఈ తటాకం నుండి మరో పెద్ద చెరువు చేరడం మంచిది. అంటూ దీర్ఘదర్శి తనమిత్రులిద్దరినీ పిలిచి హెచ్చరించింది. కాలువ ఎండినంత మాత్రాన తటాకం ఎండుతుందా? అంత ఆపత్కాలం వస్తే అప్పుడే చూసుకోవచ్చులే అంటూ దీర్ఘదర్శి మాటలు పెడచెవిన పెట్టి మిగిలిన రెండు చేపలు ఖాతరు చెయ్యక ఉండిపోయాయి. దీర్ఘదర్శి మాత్రం వెంటనే కాలువ ద్వారా మరో మడుగు చేరుకుని సుఖశాంతులతో కాలం గడుపుతూ ఉంది.

ఇలా ఉండగా, తర్వాత కొన్నాళ్లకు కాలువ పూర్తిగా ఎండి పోయింది. తటాకంలోని నీరు తగ్గింది. జాలర్లు వలలు పుచ్చుకొని చేపలు పట్టడానికి తటాకం ప్రవేశించారు. రెండవ చేవ ప్రాప్తకాలజ్ఞుడు మాత్రం అపాయం వచ్చిందని కనిపెట్టి బురదలో దాక్కుని ఉంది. మూడవ చేప కడు బద్ధకస్తురాలు కదా ! దిక్కుతోచక అటూ ఇటూ చూస్తూ జాలర్ల వలలో చిక్కుకుంది. జాలర్లు దానిని పట్టి కూర వండుకు తిన్నారు. రేపు అనే మాటకు అర్థం లేదు. దూరదృష్టి ఉండాలి. కనీసం సమయస్ఫూర్తి అయినా ఉండాలి.లేకపోతే మూడవ చేప గతే మరి!

*- ఇది పంచతంత్ర కథ.*



# గాలిలో మేడలు

సత్తెయ్య సదాచార పరాయణుడు. ఒక రోజున ఆ ఊరిలో ఒకరి ఇంట వ్రతం జరుగగా ఆ ఇంటి వాళ్ళు సత్తెయ్యకు ఒక సంచెడు ధాన్యం దానంగా ఇచ్చారు. వాటిని భుజాన వేసుకొని ఎండలోనే ఇంటి ముఖం పట్టాడు. దారిలో సేద తీర్చుకునేందుకు కుండలు చేసే కుమ్మరి వాని ఇంటివద్ద ఆగి అరుగు మీద నడుం వాల్చాడు. అందుకు వాళ్ళ అనుమతి కూడా తీసుకున్నాడు. ఆ అరుగు మీదనే కుండల దొంతర పక్కన తన వద్దనున్న ధాన్యం మూట గురించి ఇలా ఆలోచించసాగాడు. "ఇక ధాన్యపుమూటలోని గింజల్ని విత్తనాలుగా నా పెరటిలో వేస్తే అవి కొన్నాళ్ళకు వందరెట్లు పెరిగి పంట చేతికి వస్తుంది. ఆ పంట ధాన్యాన్ని కొన్ని ఎకరాల్లో నాటితే ఎంతో చెప్పలేనన్ని పుట్లు ధాన్యం పండుతుంది. ఆ పంటలను మరల కోసి అమ్మితే వచ్చే డబ్బుతో పాడిపశువుల్నీ కొని, పాలు అమ్మితే కొన్ని వేల రూపాయలు ఆదాయం వస్తుంది. అప్పుడు నేను కాలు మీద కాలు వేసికొని మహారాజులా బతుకుతాను. అలా సంపదలో ఉన్న సమయంలో నా బంధువులు, అందమైన తమ అమ్మాయిల్ని ఇచ్చి వివాహం జరిపేందుకు పోటీ పడుతూ ఉంటారు. అయితే నేను మాత్రం ఛీకొట్టి నా అంతస్తుకు తగరని చెప్తానను కొంటుండగా చుట్టరికానికి వచ్చిన వాళ్ళు కాళ్లా వేళ్లా పడతార్కు. అప్పుడు నేను ఊరుకోకుండా కాలితో ఒక తన్ను తంతాను, అంటూ కుండల దొంతరలను తన్నేశాడు. కుండలన్నీ పగిలి పోయాయి. ఆ ఇంటివాడు, కుమ్మరి అలా సత్తెయ్య తన్నడం; కుండలన్నీ పగిలిపోవడం చూసి కోపోద్రిక్తుడై అతణ్ణి అక్కడ నుండి తరిమి వేశాడు. పగటి కలలు కంటూ గాలిలో మేడలు కట్టబోతే అంతేమరి !

- ఇది పంచతంత్ర కథ.



## నాన్నా ! నాన్నా పులి

గోపయ్య ఒక పల్లెటూరి రైతు. అతనికి పొలం ఉంది. గొర్రెల మంద కూడా ఉంది. కూలీలతో ఒక రోజు మందని తోలుకు వెళుతూ తన కొడుకు వేణుని కూడా పొలానికి తీసుకుని వెళ్ళాడు. మందకి కొడుకుని కాపలా ఉండమని చెప్పాడు. సరే నన్నాడు వేణు. " ఇక్కడ అప్పుడప్పుడు పెద్దపులి వస్తూ ఉంటుంది. జాగ్రత్త!" అని హెచ్చరించి, "ఒకవేళ పులి వస్తే నాకు కేక పెట్టమని" చెప్పి తాను పొలం పనికి వెళ్ళి కూలీలతో పనులు చేయించడంలో నిమగ్నమయ్యాడు గోపయ్య. వేణు ఆకతాయి కుర్రాడు. తండ్రిని ఒక ఆట పట్టించాలని అనుకున్నాడు. " నాన్నా నాన్నా పులి వచ్చింది". అని బిగ్గరగా అరిచాడు. నిజంగా పులి వచ్చిందేమో అని గోపయ్య కూలీలతోనూ, కర్రలతోనూ పరుగెత్తుకు వచ్చాడు. కాని వేణూ నవ్వుతూ "పులీ లేదు గిలీ లేదు, హాస్యానికి కేక వేశాను!" అన్నాడు గోపయ్య. కూలీలు వెళ్ళిపోయారు. మళ్ళీ కాసేపటికి "నాన్నా !నాన్నా! పులి" అని అరిచాడు, గోపయ్యవాళ్ళూ మరొకసారి వచ్చారు. "ఈ సారీ వేళాకోళమే" అన్నాడు వేణు! మరికొద్ది సేపటికి పులి నిజంగానే వచ్చింది. ఈ సారి మళ్ళీ "నాన్నా ! నాన్నా! పులి" అని గట్టిగా అరిచాడు. ఎంత అరిచినా గోపయ్యవాళ్ళూ వినిపించు కోలేదు. హాస్యానికే మళ్ళా వేణు అరిచాడని లెక్క పెట్టలేదు. పులి మాత్రం గొర్రె పిల్లనొక దానిని చంపి ఈడ్చుకు పోయింది. వేణు ఏడుస్తూ నవ్వులాటకి అబద్ధమాడితే అపాయం ముంచు కొస్తుందని గ్రహించాడు. హాస్యానికైనా అబద్ధం ఆడరాదన్నమాట!

- ఇది ఈసోపు కథ .



# గాలిలో మేడలు

సత్తెయ్య సదాచార పరాయణుడు. ఒక రోజున ఆ ఊరిలో ఒకరి ఇంట వ్రతం జరుగగా ఆ ఇంటి వాళ్ళు సత్తెయ్యకు ఒక సంచెడు ధాన్యం దానంగా ఇచ్చారు. వాటిని భుజాన వేసుకొని ఎండలోనే ఇంటి ముఖం పట్టాడు. దారిలో సేద తీర్చుకువేందుకు కుండలు చేసే కుమ్మరి వాని ఇంటివద్ద ఆగి అరుగు మీద వడుం వాల్చాడు. అందుకు వాళ్ళ అనుమతి కూడా తీసుకున్నాడు. ఆ అరుగు మీదనే కుండల దొంతర పక్కన తన వద్దనున్న ధాన్యం మూట గురించి ఇలా ఆలోచించసాగాడు. "ఇక ధాన్యపుమూటలోని గింజల్ని విత్తనాలుగా నా పెరటిలో వేస్తే అవి కొన్నాళ్ళకు వందరెట్లు పెరిగి పంట చేతికి వస్తుంది. ఆ పంట ధాన్యాన్ని కొన్ని ఎకరాల్లో నాటితే ఎంతో చెప్పలేనన్ని పుట్లు ధాన్యం పండుతుంది. ఆ పంటలను మరల కోసి అమ్మితే వచ్చే డబ్బుతో పాడిపశువుల్నీ కొని, పాలు అమ్మితే కొన్ని వేల రూపాయలు ఆదాయం వస్తుంది. అప్పుడు నేను కాలు మీద కాలు వేసికొని మహారాజులా బతుకుతాను. అలా సంపదలో ఉన్న సమయంలో నా బంధువులు, అందమైన తమ అమ్మాయిల్ని ఇచ్చి వివాహం జరిపేందుకు పోటీ పడుతూ ఉంటారు. అయితే నేను మాత్రం ఛీకొట్టి నా అంతస్తుకు తగరని చెప్తా నను కొంటుండగా చుట్టరికానికి వచ్చిన వాళ్ళు కాళ్లా వేళ్లా పడతార్థు. అప్పుడు నేను ఊరుకోకుండా కాలితో ఒక తన్ను తంతాను, అంటూ కుండల దొంతరలను తన్నేశాడు. కుండలన్నీ పగిలి పోయాయి. ఆ ఇంటివాడు, కుమ్మరి అలా సత్తెయ్య తన్నడం; కుండలన్నీ పగిలిపోవడం చూసి కోపోద్రిక్తుడై అతణ్ణి అక్కడ నుండి తరిమి వేశాడు. పగటి కలలు కంటూ గాలిలో మేడలు కట్టబోతే అంతేమరి !

- ఇది పంచతంత్ర కథ.



# నాన్నా ! నాన్నా పులి

గోపయ్య ఒక పల్లెటూరి రైతు. అతనికి పొలం ఉంది. గొర్రెల మంద కూడా ఉంది. కూలీలతో ఒక రోజు మందని తోలుకు వెళుతూ తన కొడుకు వేణుని కూడా పొలానికి తీసుకుని వెళ్ళాడు. మందకి కొడుకుని కాపలా ఉండమని చెప్పాడు. సరే నన్నాడు వేణు. " ఇక్కడ అప్పుడప్పుడు పెద్దపులి వస్తూ ఉంటుంది. జాగ్రత్త!" అని హెచ్చరించి, "ఒకవేళ పులి వస్తే నాకు కేక పెట్టమని" చెప్పి తాను పొలం పనికి వెళ్లి కూలీలతో పనులు చేయించడంలో నిమగ్నమయ్యాడు గోపయ్య. వేణు ఆకతాయి కుర్రాడు. తండ్రిని ఒక ఆట పట్టించాలని అనుకున్నాడు. " నాన్నా నాన్నా పులి వచ్చింది". అని బిగ్గరగా అరిచాడు. నిజంగా పులి వచ్చిందేమో అని గోపయ్య కూలీలతోనూ, కర్రలతోనూ పరుగెత్తుకు వచ్చాడు. కాని వేణూ నవ్వుతూ "పులీ లేదు గిలీ లేదు, హాస్యానికి కేక వేశాను!" అన్నాడు గోపయ్య. కూలీలు వెళ్ళిపోయారు. మళ్ళీ కాసేపటికి "నాన్నా !నాన్నా! పులి" అని అరిచాడు, గోపయ్యవాళ్ళూ మరొకసారి వచ్చారు. "ఈ సారీ వేళాకోళమే" అన్నాడు వేణు! మరికొద్ది సేపటికి పులి నిజంగానే వచ్చింది. ఈ సారి మళ్ళీ "నాన్నా ! నాన్నా! పులి" అని గట్టిగా అరిచాడు. ఎంత అరిచినా గోపయ్యవాళ్ళూ వినిపించు కోలేదు. హాస్యానికే మళ్ళా వేణు అరిచాడని లెక్క పెట్టలేదు. పులి మాత్రం గొర్రె పిల్లనొక దానిని చంపి ఈడ్చుకు పోయింది. వేణు ఏడుస్తూ నవ్వులాటకి అబద్దమాడితే అపాయం ముంచు కొస్తుందని గ్రహించాడు. హాస్యానికైనా అబద్ధం ఆడరాదన్నమాట!

- ఇది ఈసోపు కథ .



# డెమోక్లీజ్ ఖడ్గం

పూర్వం ఒకప్పుడు సిరాక్యుజ్ అనే రాజ్యాన్ని డయోనీసియస్ అనే పాలకుడు పాలిస్తూ ఉండేవాడు. ఆయన కొలువులోని మంత్రుల్లో డెమోక్లీజ్ ఒకడు. ఈ మంత్రి భట్రాజు గా ప్రసిద్ధి. ఎప్పుడూ డయోనీసియస్ రాజుని ఇంద్రుడూ చంద్రుడూ అంటూ అతిశయోక్తులతో పొగుడుతూ ఉండేవాడు. రాజుగా ఉండటం ఎంత అదృష్టమో, సర్వ సౌకర్యాలు ఆయనికి ఉంటాయంటూ ఉండేవాడు. అయితే డయోనీసియస్‌కు మాత్రం ఈ పొగడ్తలంటే ససేమిరా ఇష్టం ఉండేదికాదు. రాజ్యాన్ని పాలించడం అంటే వేళాకోళం కాదు. గుణపాఠంచెబితే కాని డెమోక్లీజును అదుపులో పెట్టడం కష్టమని ఒక పథకం వేస్తాడు, డయోనీసియస్. ఆ పథకం ప్రకారం, పంచభక్ష్యపరమాన్నాలతో ఒక విందు ఏర్పాటు చేసి డెమోక్లీజ్‌ను ఆహ్వానిస్తాడు. డెమోక్లీజ్ రాజావారి కబురు పట్ల సంబరపడుతూ తనకు సిద్ధపరచిన ఆసనంపై కూర్చొని ఒక సారి తలపైకి ఎత్తి చూస్తాడు. పైన నెత్తి మీద ఇంటి కప్పుకు ఒకే ఒక తల వెంట్రుకతో కట్టిన పదునైన ఖడ్గం వేలాడుతూ మెరుస్తూ ఉండడం గమనిస్తాడు. అంతే ఒక్క ఉదుటున కూర్చున్న చోటనుండి భయంతో ఆసనం నుంచి ఉరుకుతాడు. అప్పుడు రాజ్యమేలడం అంటే రాజభోగాలను అనుభవించడమే కాదు. రాచరికం నిర్వహించడమంటే కత్తి మీద సాము లాంటిదని డెమోక్లీజ్ గ్రహిస్తాడు. 'రాజ్యన్ని పాలించే మహారాజుకి ఎప్పుడు ఎటువంటి ఉపద్రవం వస్తుందో, ఎటువంటి విధాన నిర్ణయం సముచితమో ఎంత అప్రమత్తతతో రాజు అన్నవాడు ప్రతిక్షణం గడపాలో డెమోక్లీజ్‌కు అవగతమైంది. రాజ్యం ఏలడం అంటే విందు విలాసాలు కాదని కూడ తెలుసుకుంటాడు. ఇలా, రాజరికపు ఉపద్రవాలకు డెమోక్లీజ్ ఖడ్గం- డెమోక్లీజ్ సోర్డు అన్నది పర్యాయపదంగా రాజకీయ పరిభాషలో రూఢివాచక మయింది.

- ఇది పాశ్చాత్య కథ



## సత్యాన్నాస్తి పరోధర్మం:

సత్యంకంటే మరొక ధర్మం లేదన్నదే ఈ కథ సారాంశం. కుమారవర్మ రత్నాపురం రాజ్యానికి మహారాజు. సత్యవ్రతుడుగానూ ధర్మనిష్ఠ గలవాడుగానూ ప్రసిద్ధు డయ్యాడు. ప్రతిరోజూ బ్రహ్మ ముహూర్తాన ఆలోచనలు సాగించేవాడు. ఒకనాడు తెల్లవారుతూ ఉండగా రాజు అంతఃపురం నుండి ఓ దేవతాస్త్రీ బయటకు వెళ్లడం గమనించాడు. ఉండబట్టలేక " మీరెవరమ్మా? ఎక్కడికి వెళ్ళిపోతున్నారు" అని కుమారవర్మ అడిగాడు. "రాజా! నేనే ధనలక్ష్మిని చాలా కాలంగా ఇక్కడే ఉంటున్నాను. ఇంకో చోటుకి వెళ్లాలనిపించి వెళ్తున్నాను." అన్నది ఆమె. రాజు ఆలోచనలోపడ్డాడు. ధనం అనేది అతి చంచల స్వభావి. ఏ ఒక్క చోటా అది నిలకడగా ఉండదు. దాని స్వభావమే అంత, అని సరిపెట్టుకొని ఊరుకున్నాడు. ఇంతలోనే మరో స్త్రీ దేవత అటే వెళ్ళడం చూశాడు రాజు. "తల్లీ మీరెవరమ్మా" అని అడిగాడు. "మహారాజా దానలక్ష్మిని నేను, ఇప్పుడే ధనలక్ష్మి అటు వెళ్ళిందిగా ! ఆమెనే అనుసరిస్తున్నాను అంటూ మాయమైంది. కుమారవర్మ దీర్ఘాలోచనలో నుండగా కాసేపటికి మరో దివ్యకాంత ఆ మార్గానే నడుస్తున్నట్లు కనిపించింది. రాజు వెంటనే "మీరెవరమ్మా" అన్నాడు. " నేను ధర్మదేవతను మహారాజా దానలక్ష్మి ఇంతకు ముందే బయటకు వెళ్లడం మీరు చూశారు కదా ! ఆమె లేని చోట నాకు మాత్రం చోటెక్కడుంది". అని అంది. అప్పుడు కుమారవర్మ ప్రాధేయపూర్వకంగా "తల్లీ ధర్మ దేవతా! రాజు అంటేనే ధర్మ ప్రభువు"



కదా ! ధర్మం ఏమాత్రం తప్పినా రాజు అన్నవాడికి రాజ్యార్హత ఉండదు కదా! మరి. కాబట్టి నాయందు మీరు దయవుంచి ఎక్కడికీ వెళ్ళిపోకండమ్మా" అని ప్రార్థించాడు. మహారాజా ఈ మాటలు పూర్తి చేశాడో లేదో తెల్లటి వస్త్రాలు ధరించిన శ్వేతంబరి అనే మరొక దివ్యస్త్రీమూర్తి రాజావారి కంటబడింది. కుమారవర్మ "మీరెవరమ్మా, తల్లీ" అని అడిగాడు. మహారాజా,"నేను సత్యదేవతను రాజావారి దివాణం నుండి ధర్మదేవత నిష్క్రమించా లని తీర్మానించుకున్న తరుణంలో నాకూ ఇక్కడ స్థానం లేదని నిర్ణయించుకొని వెళ్లిపోతున్నాను", అంది ఆ దివ్య స్త్రీ. కుమారవర్మకు దుఃఖం కట్టలు తెంచుకుని వస్తుండగా "అమ్మా! ధనలక్ష్మీ, దానలక్ష్మీలు ఒక వేళ లేకపోయినా జీవయాత్ర జరిగి పోతుంది. ధర్మదేవత లేకపోతే మాత్రం నేను ఒక్క క్షణం కూడ జీవించలేను. నా ప్రార్థనను మన్నించి, మీరు ఎక్కడికీ వెళ్లవద్దు, అమ్మా!" అంటూ ఆమెకు పాదాభివందనంచేసూ" సత్యవ్రతుడు కానివాడు రాజ్యాన్ని పాలించే అర్హతను కోల్పోతాడు. నేను మిమ్మల్నే నమ్ముకుని ఉన్నాను. మీ అనుగ్రహం ఉంటే సరిపోతుంది. ధనలక్ష్మీ, దానలక్ష్మీ లేకపోయినా ఫర్వాలేదు రాజ్యాన్ని సుస్థిరంగా పాలించగల" నంటూ ప్రార్థిస్తాడు. అప్పుడు సత్యం మీద కుమారవర్మకు గల గౌరవప్రవత్తుల్ని గ్రహించిన సత్యదేవత, ధర్మదేవతలు అంతఃపురం వైపుకి మళ్లుతారు. కాసేపటికి ధనలక్ష్మీ, దానలక్ష్మీ కూడా రాజావారి అంతపురం, ప్రవేశించారు. ధర్మనిష్ఠ, సత్యనిష్ఠగల కుమార వర్మ తమకు ఆశ్రయమివ్వడానికి సర్వవిధాల తగినవాడని ఆయన్ని పరీక్షించడానికి వేసిన పథకం ఫలించిందని ఆ దివ్య స్త్రీమూర్తులు గ్రహించారు. ధర్మపాలన, సత్యపాలన అనేవి సచ్ఛీలతకు జీవగర్రలని ఈ ఉపనిషత్ కథ వల్ల తెలుస్తోంది.

- ఇది ఉపనిషత్ కథ

---

## తప్పులెన్నువారు తండోపతండంబు

ఏసు క్రీస్తు ప్రభువు ఒక రోజున బెతల్హామ్ పట్టణంలో రాజవీధి గుండా నడుస్తున్నాడు. ఆయన వెంట తన శిష్యులంతా ఒకరి వెంట మరొకరు వస్తున్నారు. ఆ సమయంలో పక్క సందులో నుంచి ఒక అనాథస్త్రీ పరుగెత్తు కుంటూ వచ్చింది. ఆమె జుట్టు విరబోసుకొని ఉంది. ఆమెను కొంత మంది తరుముకు వస్తున్నారు. ఆమెను "కొట్టండి, నరకండి, చంపండి" అనివారు అరుస్తూ ఉన్నారు. ఈ చోద్యమేమిటా అని చుట్టు పక్కలనున్న జనమంతా విరగబడి వింతగా చూస్తున్నారు. అదే సమయంలో ఆ అనాథ స్త్రీ ఏసుక్రీస్తు పాదాల మీద పడి ఏసు ప్రభూ! "వీళ్లంతా నా మీద రాళ్లు రువ్వుతున్నారు. నన్ను కాపాడు, తండ్రీ" అని ప్రాధేయ పూర్వకంగా మొరపెట్టుకుంది. కరుణామయుడయిన ఏసుప్రభువు "నీ కేమీ భయం లేదు తల్లీ" అని అభయమిచ్చాడు. జనం మాత్రం ఆమెపై రాళ్లు విసరడం మాత్రం మానలేదు. అప్పుడు క్రీస్తు ప్రసన్న వదనుడయి



ప్రశాంతంగా, "అసలు మీరు ఎందుకు ఆమెను కొడుతూ బాధకు గురి చేస్తున్నారు, చెప్పండి?" అని బిగ్గరగా అన్నాడు.

'ఈమె దౌర్భాగ్యురాలు, కులట, పతిత, ఎన్నో పాపాలు చేసింది. చెప్పకూడని తప్పులు ఎన్నో చేసింది. ఈవిడకు తగిన శిక్ష విధించి తీరాలి" అని కేకలు వేస్తూ ఆ జనం ఏక కంఠంగా అరుస్తున్నారు. పతిత పావనుడైన ఏసు వారిని ఉద్దేశిస్తూ, వాయవలారా! ఆమె తప్పులు చేసిన మాట వాస్తవమే అయివుండ వచ్చు గాక! చాల పాపాలు కూడా చేసి యుండవచ్చు. అందుకని ఈమెపై దాడి చేసి హింసిస్తున్నారు కదా! బాగుంది. అలాఅయితే ఈమెను తప్పక కొట్ట వలసిందే! కాస్త ఆగండి ఒక చిన్నమాట!!. అయితే మీలో అసలు తప్పు చేయని వారూ, పాపం చేయని వారూ మాత్రమే ఎవరో ముందుకు వచ్చి ఈమెపై రాయి విసరాలి" అన్నాడా దయాళువు. ఆ మాటలకు జనమంతా ఆశ్చర్య చకితులై ఒకరు ముఖం ఒకరు చూచుకుంటూ ఆ జనమంతా వారు వచ్చిన దారిని వెనక్కి తిరిగి కర్రలు దించి, రాళ్లు పక్కన పారవేసి ఎవరి ఇళ్లకు వారు తరలిపొయ్యారు. "తప్పులెన్నువారు తండోప తండంబు లుర్విజనులకెల్ల నుండు తప్పు, తప్పు లెన్నువారు తమ తప్పులెరుగు రని?" అన్నది మన వేమన సూక్తిని ఈ ఉదంతం జ్ఞాపకం చేస్తున్నది

- ఇది బైబిలు కథ

## ఏడు చేపలు కథ

ఒకప్పుడు ఓ రాజావారుండేవారు. ఆ రాజావారికి ఏడుగురు కొడుకులు. ఒక రోజున ఆ ఏడుగురు రాకుమారులు చెరువు దగ్గరికి చేపలు పట్టడానికి గాలాలు తీసుకుని వెళ్ళారు. చెరువులో గాలాలు వేసి ఏడుగురూ ఏడు చేపల్ని పట్టారు. వాటిని ఎండలో ఎండ పెట్టారు. ఆ సాయంత్రం ఆ ఎండిన చేపల్ని తీసుకొని వద్దామని వెళ్ళారు రాకుమారులు. ఆరు చేపలు బాగా ఎండాయి. కాని ఓ చేప మాత్రం అసలు ఎండనే లేదు. ఆ ఎండని చేప వద్దకు వాళ్ళు వెళ్ళి, "చేపా! చేపా! ఎందుకు ఎండలేదు?" అని అడిగారు. "నేనెలాగ ఎండుతాను! మరి ఎండలేదుగా! అంది, " మరి మిగతా ఆరు చేపలు ఎండాయిగా" అన్నారు వాళ్ళు. "నేనేం చెయ్యను ఆ గడ్డిదుబ్బు నాకేఅడ్డం వచ్చింది" అంది, 'ఆ ఎండని చేప'. "గడ్డిదుబ్బా, దుబ్బా! ఎందుకు అడ్డం వచ్చావు ఆ చేపకు!" అన్నారు రాకుమారులు. "నేనేం చెయ్యనయ్యలారా! నన్ను ఆవు మేయలేదు కదా !" అంది, "ఆవూ ! ఆవూ!! ఆ గడ్డి దుబ్బును ఎందుకు మేయలేదు!" అని అడిగారు. "నేనేం చెయ్యను బాబుల్లారా ! ఆ గొడ్లకాపరి నన్ను మేపలేదుగా" అంది ఆవు. "ఏయ్ గొడ్లను కాసేవాడా ఆవును ఎందుకు మేపలేదు?" అని అడిగారు. "అయ్యా, రాకుమారులారా' నేనేం చెయ్యను, అవ్వ నాకు బువ్వ పెట్టలేదుగా?" అని జవాబు చెప్పాడు గొడ్లకాపరి. అప్పుడు యువరాజులు అవ్వ దగ్గరకు వెళ్ళి" అవ్వా! అవ్వా !! గొడ్లకాపరికి బువ్వ ఎందుకు పెట్టలేదు?" అని దబాయించారు. అప్పుడా ముసలి అవ్వ ఏమందో తెలుసా!? "నా చిన్నారి బుజ్జి ఏడ్చిందిగా "గొడ్ల కాపరికి బువ్వ ఎట్లా పెట్టగలనూ ?" అని సాగ తీసింది.



హ్యాసుబ్జీ ఎందుకు ఏడ్చావమ్మా! అని అడిగారు "నేనేం చెయ్యనయ్యాలారా? నన్ను చీమ కుట్టిందిగా!" అంది, ఆ బుజ్జి. "చీమా చీమా బుజ్జిని ఎందుకు కుట్టావు?" అని అడిగారు. "నేనేం చెయ్యను నా బంగారు పుట్టలో వేలుపెడితే వేను కుట్టకుండా ఊరుకుంటానా!" అంది, ఆ చీమ. అప్పుడు ఏడుగురు రాకుమారులూ ఏమన్నారంటే చీమా, చీమా భలే ! భలే !! తెలివి అంతా మీదే, భలే! భలే!! అంటూ గుర్రం ఎక్కి రాజప్రాసాదానికి ఉడాయించారు.

- ఇది సంప్రదాయ కథ.

## స్వశక్తి

ధారా నగర రాజ్యానికి భోజరాజు 11వ శతాబ్దిలో పట్టాభిషిక్తుడయ్యాడు. రాజ్యపాలన చేస్తూ ఉన్నాడు. తన పాలనలో ఏమయినా లోటుపాట్లు ఉన్నాయేమో తెలుసుకొనడానికి మారువేషంలో దేశయాత్రకు బయలుదేరాడు. రెండు మూడు మజిలీలు పూర్తి చేశాడు, మూడో మజిలీలో ఉండగా, తాను విశ్రమిస్తున్న బస కిటికీ గుండా బయటకు చూశాడు. జనం తండోపతండాలుగా ఆ వైపు వెళ్లడం భోజరాజు గమనించాడు. ఏమిటా చోద్యం అని తానూ బయటకు బయలుదేరాడు. ఊరు బయట ఎవరో మహాత్ముడు ప్రవచిస్తున్నాడని తెలుసుకుని తానూ ఆ ప్రసంగం విని సందేహం తీర్చుకునే ఉద్దేశంతో ఉత్సాహంగా అటుపోయి మారు వేషంలోనే తానూ ఆ ప్రసంగం విన్నాడు. జనసందోహం తగ్గింది. చీకటి పడింది. భోజరాజు ఆ మహాత్ముని దగ్గరకు వెళ్లాడు.

అదే సమయంలో ఆ మహాత్ముడు కూర్చున్న చోటునుంచి లేవ బోతుంటే తాను కప్పుకున్న శాలువాకు మేకు తగిలి చినిగింది. అసలే అది పాత ఉత్తరీయం. అయినా, ఆ చినుగును కుట్టడానికిగాను సూదీ దారం తీసుకున్నాడు.



సూదిలో దారం దూరుస్తున్నాడు. కాని దారం పక్కకు పోయి సూది బెజ్జంలోకి వెళ్లడంలేదు. దీన్ని భోజరాజు గమనిస్తూనే ఉన్నాడు. ఆ మహాత్ముని సమీపించాడు. "స్వామీ! అది చినిగి పోయింది కదా! పైగా పాతది. దాన్ని కుట్టుకోవడం దేనికి? నా దగ్గర కొత్త శాలువా ఉంది తీసుకోండి, మహాప్రభూ!" అంటూ భోజరాజు తన శాలువా ఆయనకు ఇవ్వబోయాడు. కాని ఆయన స్వీకరించకుండా "ఎవరు నాయనా నీవు? నీవు నాకు సాయం చేయలనుకుంటున్నావా?" అన్నాడు ఆస్వామిజీ. అవును "స్వామీ ఈ కొత్త శాలువాను మీరు తీసుకోండి" అన్నాడు భోజరాజు. దానికి జవాబుగా ఆ మహాత్ముడు "నాయనా నాకు నీవు నిజంగా మేలు చేయాలంటే ముందుగా నీ కొత్త శాలువాను నీవు తీసుకో. నీకు చేతనైతే ఈ సూదిలో దారంపెట్టి ఇయ్యి బాబూ" అన్నాడా స్వామిజీ. భోజరాజు మారు మాట్లాడడానికి నోరు పెగలలేదు. అప్పుడా మహాత్ముడిలా అన్నాడు, "మిత్రమా నీ వద్ద నుండి శాలువా తీసుకొనవందుకు నన్ను అపార్థం చేసుకోవద్దు. ఎప్పుడూ మీరు పరుల దయా దాక్షిణ్యాల మీద ఆధారపడకూడదు. స్వశక్తి మీద ఆధారపడడం అనేది రాజు మొదలు సామాన్యుని వరకూ అందరూ అనుసరించదగిన సూత్రం" అన్నాడాయన. అప్పుడు స్వశక్తి, స్వాలంబన ఆ మహాత్ముడు తనకు ఉపదేశించిన మంత్రమని భోజరాజు అప్పటి నుండీ తన కొలువులో ఎవరి మీద ఆధార పడకుండ విధాన నిర్ణయాలు తీసుకోవడం మొదలు పెట్టాడు. అంటే ఎవరైన తమ తమ స్వశక్తి పైనే ఆధారపడాలన్నదే ఈ కథా సారాంశం. *ఇది సంప్రదాయ కథ*

## నిత్య సంతోషి

అవంతిపురం ఒక పెద్ద రాజ్యం. ఆ రాజ్యానికి ప్రభువు మహతివర్మ. రాజ్యానికి ఎంత పెద్దరాజైనా మహతివర్మ ఎల్లప్పుడూ దిగులుగానే ఉండేవాడు. సుఖమనేది ఎరుగడు. ఏదో ఒక రోగం అతనిని పీడిస్తుందని అతనికి అనుమానం. అనుమానానికి కారణం లేదు. వాస్తవానికి అతనికి ఏ రోగమూ లేదు. కాని ఏదో రోగాన్ని తలచుకుని దానితో బాధపడుతూ ఉండేవాడు. ఎంతో మంది వైద్యులు పరీక్షించారు. మందులు ఇచ్చారు. ఆ మందుల్ని సేవించేవాడు. నిజానికి మహతివర్మ తినని మందు లేదు.

ఒక రోజు మహతివర్మ కొలువుకు ఒక మహర్షి వచ్చాడు. రాజుగారు తన బాధను చెప్పి సలహా ఇవ్వమన్నాడు. ఆ మహర్షి రాజుగారి అసలు మానసిక బాధను గ్రహించి "నీవు నిత్యసంతోషిగా ఉండేవాని చొక్కా సంపాదించి తొడుగుకొనుము, నీ జబ్బు తగ్గుతుంది. నీవు ఇక మీదట సంతోషంగా ఉండగలవు" అన్నాడు.

మహారాజు భటులను రాజ్యం నలుమూలలకు పంపి నిత్య సంతోషిగా ఉండే వానిని పట్టుకు రమ్మని ఆజ్ఞల్ని జారీచేశాడు. వెంటనే ఆ రాజ భటులు దేశం అంతా తిరిగారు ఒక మైదానంలో ఒక పేద గొర్రెల కాపరి హాయిగా కేరింతలు కొడుతున్నాడు. ఆ భటులు వానిని చూచి వా



త్య సంతోషి అని గ్రహించి రాజువద్దకు తీసికొని ేయారు. అతని చొక్కా తీసి ఇమ్మన్ని అడుగగా ాడు భయపడి మారు మాట్లాడక తన ఒంటి ాద ఉన్న చొక్కాను తీసి మహతి వర్మకు మర్పించాడు. దానిని తీసుకుని తొడుక్కొని నవ్వేరు రాజుగారు . అప్పటి నుండి రాజుగారు దుఃఖమనేది ఎరుగక సంతోషంగా జీవించసాగారు. సంతోషమన్నది మన మనస్సుకు సంబంధించినదన్న విషయం ఈ కథ ద్వారా తెలుస్తుంది. -ఇది సంప్రదాయ కథ.

---

## కిట కిట - మకరీ కథ

ఉత్తర భారతదేశంలో సరయూనది ఒడ్డున ఒక రేడు చెట్టు ఉండేది. ఆ చెట్టు మీద కిట కిట నే కోతి నివసిస్తూ నేరేడు పండ్లు తింటూ ాయిగా ఉండేది. ఇలా ఉండగా ఆ నదిలో కరుడు అనే ఒక మొసలి వచ్చి చెట్టుపైకి ాస్తూ ఉండేవాడు. కోతి ప్రతి రోజు నేరేడు ండ్లను కోసి మకరుని వైపుకి విసిరేది. మొసలి పళ్ళను ఆరగిస్తూ ఉండేవాడు. కొన్ని పళ్ళను మొసలి భార్య మకరీకి కూడా పట్టుకెళ్లమని చెప్పేది. ఇలా ఉండగా తనను కాదని తన భర్త చాలసేపు తన చెలిమి కోతితోనే గడుపుతున్నాడు అని మకరీకి ఒక దుర్బుద్ధి పుట్టి కిటకిటని ఎలాగైనా చంపాలనుకుంది. ఎప్పటిలాగనే మకరుడు కోతి వద్దకు వెళ్లి నేరేడు పళ్లుతీసికొని వస్తూనే ఉన్నాడు. ఒక రోజు, మకరీ భర్తతో తనకు తీవ్రమైన జబ్బు చేసిందనీ దానికి మందు 'కోతి గుండె' అని వైద్యులు చెప్పేరని



అంది. మకరుడు దిగ్భ్రాంతి చెంది, అది తనకు సాధ్యంకాని పని అన్నాడు మకరుడు. తనకు కావల్సిన మిత్రుడు అతని గుండె కాయ ఏలా తీసుకు రావడం అని అన్నాడు. మకరీ అలక ఎక్కువయింది. "నామీద ప్రేమంటూ ఉంటే, నీవు నీ మిత్రుడి గుండెకాయ తీసుకుని వస్తావు". లేదా నీకూ నాకూ అంతే, అని అంది. మకరుడికి దిక్కుతోచడం లేదు. చివరకు సరే అని కోతి గుండెకాయ తీసుకు రావడానికి సమ్మతించాడు. మకరుడు చెట్టువద్దకు వెళ్లి తన స్వగృహానికి విందుకు రమ్మని కిటకిటని ఆహ్వానించాడు. మకరుని ఇంటికి విందుకు వెళ్లడానికి కిట కిట ఒప్పుకుంది. "ఎలా వెళ్లడం? నాకు ఈతరాదు. నీటిలో మునిగిపోతాను" అని కిటకట అంది. దానికి సమాధానంగా "నేను నా వీపుపై నిన్ను కూర్చు బెట్టుకుని జాగ్రత్తగా తీసుకువెళ్లతా"నని మకరుడు అన్నాడు. సరే, అంది కిటకిట. అప్పుడు మొసలి వీపు మీద కోతి కూర్చున్న తరువాత నీటిపై ప్రయాణం సాగుతూ ఉంది. దారిలో మకరుడు అసలు విషయం బయట పెట్టాడు. "నా భార్యకు జబ్బు చేసింది. దీనికి కోతి గుండెకాయ మందు అని వైద్యుల సలహా" అన్నాడు. కిటకిట వెంటనే "మకర మిత్రమా ఈ సంగతి నాకు అక్కడే చెప్ప లేక పోయావా? నా గుండెకాయ నీళ్లలో తడిసి పాడై పోతుందేమోనని అక్కడ నేరేడు చెట్టుకు తగిలించి వచ్చాను. నన్ను మరల ఆ చెట్టు దగ్గరకు తీసుకువెళ్లితే దాని తీసి నీకు ఇస్తాను" అని అంది. ఆ మకరుడు సరే నని తిరుగుముఖం పట్టి ఆతురతతో గుండెకాయ తీసుకురావడానికి ఒడ్డుకు చేరుకున్నాడు. ఒడ్డుకు చేరుకోగానే కిట కిట ఒక్క ఉదుటన ఉరికి గబగబా చెట్టెక్కి "ఓ మిత్రమా, నీవు ఇంత మిత్రద్రోహం చేస్తావనుకోలేదు. ఇలాటి మోసాలు ఇక చెయ్యక"ని హెచ్చరించింది.

- ఇది పంచతంత్ర కథ

## రాబర్టు బ్రూసు కథ

రాబర్టు బ్రూసు స్కాట్లండు దేశానికి రాజు. ఎన్నో సార్లు శత్రువులు తన పొరుగు రాజ్యంమీదికి దండయాత్రలు చేయగా ఓటమికి గురియైన ఆరవసారి బ్రూస్‌ను బందీగా పట్టుకున్నారు. చెరసాలలో బంధించారు. ఆ చెరసాలలో బందీగా ఉన్న సమయంలో గూడు కట్టుతున్న సాలీడు ఒకటి బ్రూసుకు కనిపించింది, సాలీడు తగిన పట్టుదొరకక బాధపడడం బ్రూసు చూశాడు. ఆ సాలీడు ఒకటి, రెండు, మూడు సార్లు ప్రయత్నించింది. కాని లాభం లేక పోయింది. ఈ విధంగా సాలీడు ప్రయత్నం చేయుట పై నుండి కిందకు జారి పడిపోవుట బ్రూసు ఏకాగ్రతతో పరిశీలిస్తూనే ఉన్నాడు. ఆలోచిస్తూనే ఉన్నాడు. చివరకది ఏమి చేస్తుందో చూద్దామని తలపోశాడు. ఆరు పర్యాయాలు అలా విఫలమైన సాలీడు ఏడవ పర్యాయం చేసిన ప్రయత్నం ఫలించింది. విజయం సాధించింది. సాలీడు అట్లు పట్టు విడవక గూడు నిర్మించుకోవటంలో చేసిన ప్రయత్నం బ్రూసుకు స్ఫూర్తి నిచ్చింది. తాను కూడ ఏడవ సారి గట్టిప్రయత్నం చేసి శత్రువును జయింప కృతనిశ్చయు డయ్యాడు. తాను అంతవరకు శత్రువుతో పలుమార్లు ఓడిపోయినంత మాత్రాన ఓర్పు కోల్పోవటం పాడిగాదు. ప్రయ్నతం మానరాదు. అని గ్రహించాడు. అట్లే బ్రూసు ఏడవ సారి ప్రయత్నంచేసి శత్రువులను అవలీలగా ఓడించి విజయం సాధించాడు.

అందు చేత నిరాశపడకుండ మనం విజయం సాధించగలమనే దృఢ సంకల్పంతో లక్ష్య సాధనకు కర్తవ్య దీక్షతో గట్టి కృషి చేసినచో అసాధ్యమంటూ ఏమి ఉండదని బ్రూసు కథవల్ల తెలుస్తూంది.

- ఇది పాశ్చాత్య కధ



## కుందేలు తెలివి

ఒక ముసలి సింహం అడవిలో మృగరాజు గా చెలామణి అవుతూ ఉంది. లేడి, దుప్పి, మేక, ఎలుగు, జింక, కుందేలు వంటి సన్నకారు జంతువుల్ని పట్టి ఇష్టం వచ్చినట్టు చంపి ప్రతి రోజూ తినేస్తూ ఉంది. ఒక రోజు ఈ సన్నకారు జంతువులన్నీ ఒక మహాసభ జరిపి సింహం బాధ చాల ఎక్కువగా ఉంది, దానిని తప్పించుకునే మార్గం ఆలోచించా లను కున్నాయి. ఎలుగుబంటి, "అందరమూ కలిసి ఒకేసారి సింహం మీదపడి చంపి వేద్దామా?" అని అంది. "అది కాని పని. ఆ పని మనం చేయలేము కదా!" అని అరచాయి జంతువులు. ఈలోపున నక్క "మనం మృగరాజుతో ఒక సంధి చేసుకుందాం" అని సలహా ఇచ్చింది. "ఏమని చేసుకుందాము" అని జింక అంది. అప్పుడు నక్క ఇలా అంది ఉత్సాహంగా 'రోజుకు మనలో ఒకరిని సింహానికి ఆహారంగా పంపుదాం, ఏలాఉంది? నా సలహా" అంది. "శహబాష్ బాగుంది" అన్నాయి అన్నీ. ఈ విషయం మృగరాజు సింహానికి చెప్పగానే! తన ప్రయత్నం లేకుండగనే ఆహారం దానంత అదే తన వద్దకు వస్తుందని భావించి ఆ ఏర్పాటుకు సంతసించి అంగీకారం తెలిపింది. అలా ప్రతి రోజు - ఒక రోజు జింక, రెండో రోజు మేక, మూడోనాడు ఎలుగు, ఐదోవ రోజు గొర్రె ఆహారంగా వెళ్లసాగాయి. ఇలా మృగరాజుకు వేటాడనవసరం లేకుండగనే రోజులు గడిచి పోతున్నాయి.

ఒక రోజున సింహానికి ఆహారంగా వెళ్లే రోజు వంతు కుందేలు మీద పడింది. కుందేలు



తెలివి తేటల్లో దిట్ట. మృగరాజు వద్దకు అనుకున్న సమయనాకి వెళ్ళకుండా కావాలని ఆలస్యం చేసింది. ఈలోపున సింహానికి ఆకలి ఎక్కువ అయిపోయింది. ఆగ్రహావేశంలో ఉంది సింహం. కుందేలు రానే వచ్చింది. దాని మీద కోపంతో "ఏమింత ఆలస్యం, కుందేలా! ఇంత పొద్దెక్కింది. నాకేమో ఆకలి ఎక్కువగా ఉంది. నిన్ను తింటే నాకడుపు నిండుతుందా" అని గర్జించింది. దానికి సమాధానంగా, "నాతో మరొక జంతువును కూడ పంపారు. అయితే దాన్ని దారిలో ఒక సింహం అడ్డం వచ్చి చంపి తినివేసింద"ని బొంకింది, కుందేలు. "అయితే అలాగా నా కంటే బలమైన సింహం మరొకటి ఈ అడవిలో ఉందా? అంది సింహం. దాన్ని చూపించు నాకు" అని అరిచింది కోపంగా! "రండి మహాప్రభూ" అని చెప్పి సింహాన్ని ఒక దిగుడు బావి దగ్గరకు తీసికొని వెళ్ళి చూడండి లోపల ఉంది" అన్నది. దాని ప్రతిబింబం నీళ్లలో చూచుకొని సింహం దాన్ని చంపడానికి ఆ బావిలోకి ఉరికి చచ్చిపోయింది. అలా ఉపాయంతో ఎంత బలశాలినైనా నెగ్గవచ్చు నన్నది ఈ కథ సారాంశం. - ఇది ఈసోపు కథ

---

## " నీకు ఇష్టమైనంత "

పల్లెటూరి భూస్వామి సాంబయ్యకు లేక లేక కలిగిన సంతానం బాలయ్య. ఆ అబ్బాయి చిన్నతనంలోనే తల్లి చనిపోవటంతో, బాలయ్యే ఆ పసివాడికి తల్లి తండ్రీ అయి గారాబంగా పెంచసాగాడు.. కాని, సాంబయ్యకు హఠాత్తుగా జబ్బు చేసింది. అవసాన కాలం సమీపించిందని గ్రహించిన సాంబయ్య - స్నేహితుడు శేషయ్యను పిలిపించి బాలయ్యను పెంచి పెద్ద వాడిని చెయ్యాల్సిందిగా కోరాడు. తన దగ్గరున్న పది వేల వరహాల ధనాన్ని శేషయ్యకు ఇచ్చి "మా బాలయ్య పెద్దయ్యేంత వరకూ ఈ డబ్బు నీ దగ్గర ఉంచు. తరవాత "నీకు ఇష్టమైనంత" సొమ్ము మా అబ్బాయి బాలయ్యకు ఇచ్చి మిగిలింది నువ్వు తీసుకో "అని చెప్పి సాంబయ్య కన్ను మూశాడు.

కొన్నాళ్ల తరవాత బాలయ్య విద్యా బుద్ధులు నేర్చుకొని తన ఆస్తి పాస్తుల వ్యవహారాలు తానే చూసుకోదలచి వట్టుగా శేషయ్యతో చెప్పాడు. అంతేకాక, తన తండ్రి ఆయనకు ఇచ్చిన పదివేల వరహాల గురించి గుర్తు చేసి "మా నాన్న మాట ప్రకారం నాకు ఆ సొమ్ము ఇస్తారా?" అని శేషయ్యను అడిగాడు. కాని, ఆశ కొద్ది శేషయ్య ఆ డబ్బును బాలయ్యకు ఇవ్వటానికి ఇష్టపడలేదు. అయినా, తాను మాట తప్పిన వాడిననిపించుకోవటం మంచిది కాదు కనుక ఓ వెయ్యి వరహాలు బాలయ్యకు ఇచ్చి "ఇంక నువ్వు మీ ఇంటికి వెళ్ల వచ్చు" అని కటువుగా చెప్పి పంపేశాడు.

తండ్రికి స్నేహితుడుగా ఉండే శేషయ్య అన్యాయం చేసినందుకు బాలయ్య చాలా బాధపడ్డాడు. ఆబాధను ఎవరికి చెప్పుకొన్నా ప్రయోజనం లేకపోవటంతో మర్యాద రామన్నను కలిసి "నాకు న్యాయం చేయండి" అని వేడుకొన్నాడు. మర్యాద రామన్న ఆ మర్నాడు శేషయ్యను సభకు పిలిపించి "సాంబయ్య నీకు పది వేల వరహాలు ఇచ్చి

ఏమని చెప్పాడు." అని అడిగాడు. "ఆ పది వేలలో నాకు ఇష్టమైనంత సొమ్మును బాలయ్యకు ఇవ్వమన్నాడు ఆ మాట ప్రకారము నాకు ఇష్టమైనంత, అంటే వెయ్యి వరహాలు బాలయ్యకు ఇచ్చాను" అని శేషయ్య చెప్పాడు.

"అలాగైతే, మరి నువ్వు బాలయ్యకు వేయి వరహాలే ఇచ్చావేం? " అని నర్మగర్భంగా అడిగాడు రామన్న. "నాకు ఇష్టమైనంత ఇమ్మని సాంబయ్య చెప్పనే చెప్పాడు కదా! అందుకే నాకు ఇష్టమైనంత సొమ్ము . . .? వెయ్యి వరహాలూ బాలయ్యకు ఇచ్చాను" అని రెట్టిస్తూ బదులిచ్చాడు శేషయ్య. "అలాగైతే, సాంబయ్య ఇచ్చిన పదివేలలో నీకు ఇష్టమైనంతడబ్బు వెయ్యి వరహాలు కాదు కదా! తొమ్మిదివేల వరహాలు కదా! అలాంటపుడు నువ్వు బాలయ్యకు తొమ్మిది వేల వరహాలు ఇవ్వాలి కాని వెయ్యి వరహాలే ఇవ్వటం అన్యాయం కదా" అని మర్యాద రామన్న చిరునవ్వు నవ్వుతూ శేషయ్యను అడిగాడు.

శేషయ్యకు మర్యాదరామన్న మాటలలోని అసలు రహస్యం అర్థం కాక వెర్రి చూపులు చూశాడు. అప్పుడు మర్యాద రామన్న ఆ రహస్యాన్ని వివరించాడు. "సాంబయ్య నీకు ఇచ్చిన పదివేల వరహాలలో నీకు ఇష్టమైనంత సొమ్మును బాలయ్యకు ఇవ్వమన్నాడు కదా! ఆ మాటలలోని అంతరార్థం ఏమిటో తెలుసా? నువ్వు బాలయ్యకు ఇచ్చిన వెయ్యి వరహాలూ నీకు ఇష్టంలేని సొమ్ము. నీవు తీసుకొన్న తొమ్మిదివేల వరహాలూ నీకు ఇష్టమైన డబ్బు! కనుక నీకు ఇష్టమైన తొమ్మిది వేల వరహాలనూ సాంబయ్య కొడుకు బాలయ్యకు ఇవ్వటమే న్యాయం! మిగిలిన సొమ్ము, వెయ్యి వరహాలు, అంటే నువ్వు బాలయ్యకు ఇచ్చిన డబ్బును నువ్వు తీసుకోవటం న్యాయం! నువ్వు



ఇష్టపడి నీదగ్గర ఉంచుకొన్న తొమ్మిది వేల వరహాలనూ బాలయ్యకు ఇవ్వకుండా, దురాశకొద్దీ ఆ డబ్బును కాజెయ్యాలనుకొన్నావు. న్యాయం ప్రకారం నీకు ఇష్టమైన ఆ తొమ్మిది వేలవరహాలూ వెంటనే బాలయ్యకు ఇవ్వాల్సిందిగా నేను తీర్పు చెబుతున్నాను" అని శేషయ్యను ఆదేశించాడు మర్యాద రామన్న.

బాలయ్యను మోసగించాలనుకొని భంగ పడిన శేషయ్య సిగ్గుతో తలవంచుకొన్నాడు. తక్షణమే బాలయ్యకు మరో ఎనిమిది వేల వరహాలు చెల్లించి అక్కడి నుంచి వెళ్లిపోయాడు. సమయస్ఫూర్తిగా వ్యవహరించి న్యాయమైన తీర్పు చెప్పినందుకు బాలయ్య పదే పదే మర్యాద రామన్నకు కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. - ఇది మర్యాదరామన్న కధ

## బాతు - బంగారు గుడ్డు

ఒక గ్రామంలో సూరయ్య రైతు బిడ్డ. భార్య పిల్లలు కూడా ఉన్నారు. అతను ఒక బాతుపిల్లను తెచ్చి పెంచుతూ ఉండేవాడు. ఆ బాతు పిల్ల పెరిగి పెద్దదైంది. అదృష్టవశాత్తు ఒకనాడు అది ఒక బంగారు గుడ్డు పెట్టింది. ఆలా ప్రతిరోజూ ఆ బాతు బంగారు గుడ్డునే పెడుతూ ఉండేది. సూరయ్య దంపతులకు బంగారం రోజూ



లభించడంతో ఆనందోత్సాహాలతో ఒళ్లు మర్చి పోయారు. దంపతులిద్దరికీ ఆశ పెరిగింది. పేరాశాపరులయ్యారు. ఒక రోజు సూరయ్య దంపతులు ఇలా ఆలోచించసాగారు. "ఈ బాతు ప్రతిరోజు ఒక బంగారు గుడ్డు పెడుతున్నది గదా! కావున దీని పొట్టలో ఇంకను చాలా బంగారు గుడ్లు ఉండి తీరాలి. ప్రతిరోజు ఒక్కొక్క బంగారుగుడ్డు కోసం వేచి ఉండడం కంటే ఆ బాతును కోసి, దాని పొట్టలోని గుడ్లన్నీ ఒకేసారి తీసుకుంటే మంచిది". ఆలస్యమెందుకని సూరయ్య దంపతులు బాతును కోసి పొట్ట చీల్చారు. కాని అందులో ఒక బంగారు గుడ్డు అయినా కూడ ఎక్కడ కానరాలేదు వారికి. సూరయ్య దంపతులు దురాశదుఃఖానికి చేటని లెంపలు వేసికొని ఏడ్చి ఏడ్చి ఊరుకున్నారు.

- ఇది ఈసోపు కథ

## శిబి చక్రవర్తి కథ

శిబి చక్రవర్తి ఆపదలో ఉన్నవారికి సాయం చేసేవాడు. ఎవరు ఏది అడిగినా దానం చేసేవాడు. ఒక రోజున ఒక పావురం వచ్చి ఆయన దగ్గర వాలింది. తనను కాపాడమని బతిమాలింది. "నరేకాపాడతాను" అని ఆయన మాట ఇచ్చారు. ఇంతలో ఒక డేగవచ్చింది. "ఈ పావురం నా ఆహారం. నేను తినాలి. దాన్ని నాకు ఇచ్చెయ్." అని కోపంగా అడిగింది డేగ. "పావురాన్ని ఇవ్వను. దానికి బదులు ఇంకేదయినా అడుగు" అన్నాడు శిబి. "అయితే పావురమంత బరువు గల నీ తొడమాంసం ఇయ్యి" అని అడిగింది డేగ. శిబి త్రాసు తెప్పించాడు. ఒక వేపు పళ్ళెంలో పావురాన్ని ఉంచాడు. రెండో వేపు పళ్ళెంలో తన తొడమాంసం కోసి వేశాడు. ఎంత మాంసం కోస్సి వేసినా పావురంతో సమానం కాలేదు. చివరికి తానే త్రాసులో రెండో పళ్ళెంలో కూర్చున్నాడు. పావురానికి బదులుగా. మొత్తం తన శరీరాన్నంతా తినెయ్యమని డేగను అడిగాడు. వెంటనే డేగ ఇంద్రునిగా మారింది. పావురం అగ్ని దేవుడుగా



మారింది. వాళ్ళను చూసి శిబి ఆశ్చర్యపోయాడు. ఇంద్రుడు, అగ్నిదేవుడు ఇలా అన్నారు, "శిబి చక్రవర్తీ! మేం నిన్ను పరీక్షించాలని వచ్చాం. ఈ పరీక్షలో నీవే గెలిచావు, నీ దానగుణమూ,త్యాగమూ చూసి సంతోషించాం. గొప్ప దాతగా ప్రపంచంలో నీ పేరు నిలిచిపోతుంది." అని దీవించి అదృశ్యమయి పోయారు. - ఇది పురాణ కథ

---

## సూది కథ

ఒకసారి పరమానందయ్యగారి కాలిలో ముల్లు విరిగింది. ఆ ముల్లు తీసి వేయటానికి సూది కావాలి. అది తన ఇంట్లో లేక పోవటం వల్ల ఇరుగు పొరుగు వారిని ఎవరినైనా అడిగి సూదిని తెమ్మని శిష్యులకు పురమాయించారాయన. "సరే! అలాగే " అంటూ ఆ ఐదుగురు శిష్యులు సూది తీసుకురావటానికి వెళ్లారు. కాని, శిష్యుల గురించి ఇదివరకే తెలిసి ఉండటంతో అందరూ "మా దగ్గర లేదు" అనీ "మా ఇంట్లో సూది లేదు" అనీ చెప్పి, తప్పించుకొన్నారు.

శిష్యులు పట్టువదలకుండా పొరుగూరు వెళ్ళి సూదిని సంపాయించేందుకు ప్రయత్నించారు. ఓ అవ్వ వారికి సూది ఇచ్చింది. సూది చిన్నదిగా ఉంటుంది. కనుక ఓ శిష్యుడు దాన్ని జాగ్రత్తగా పట్టుకొని, చేజారితే ఎక్కడైనా పడిపోతుందనే భయంతో, సూది వైపే చూస్తూ తమ ఊరు బయలు దేరాడు. మిగిలిన నలుగురూ అతనిని అనుసరించారు. అయితే, ఓ శిష్యుడికి "సూదిని ఒక్కడే తీసుకు వెళ్తున్నాడు. గురువు గారికి ఉపకారం చేయటం వల్ల వచ్చే పుణ్యం వాడికి ఒక్కడికే దక్కేలా ఉంది" అని అనుమానం వచ్చి, మిగిలిన వారితో ఆ మాటే అన్నాడు. దాంతో, ఎవరికి వారికే తానే గురువుగారికి ఉపకారం చేయాలనిపించింది. అంతే! సూదిని "నేను తెస్తాను" అంటే "నే నే తెస్తాను" అంటూ, అప్పటి వరకూ సూదిని పట్టుకున్న శిష్యుని పై మిగిలిన నలుగురూ కలియబడ్డారు.

ఆ హడావుడిలో సూది ఎక్కడో పడిపోయింది. అందరూ సూదికోసం వెదికారు. మొత్తం మీద చివరికి సూది దొరికింది. మళ్ళీ సూదిని "నేను తెస్తాను ..." అని, "నేనే తెస్తాను" అనీ వాదులాడుకొన్నారు. ఒకడు సూదిని ఒక వైపు పట్టుకోగా, మరొకడు ఇంకొవైపు పట్టుకొన్నాడు. ఇంకొకడు సూదిని మధ్యలో పట్టుకొని ఆశ్రమం వైపు నడవసాగారు. కాని మరో ఇద్దరు శిష్యులకు ఆ సూదిని పట్టుకొనే అవకాశంలేక పోవటంతో వాళ్లిద్దరికీ కోపం వచ్చింది. "గురువుగారికి ఉపకారం చేసి ఆ పుణ్యాన్ని మీరు ముగ్గురే కాజేయాలను కొంటున్నారా? మీరు ఇక్కడే ఉండండి! మేమిద్దరం గురువు గారి దగ్గరకు వెళ్లి సూదిని ఎలా తీసుకురమ్మంటారో అడిగివస్తాం" అంటూ వాళ్లు ఆశ్రమానికి పరుగెత్తుకు వచ్చారు.

పరమానందయ్యగారు సంగతి తెలుసుకొని "ఏకష్టం వచ్చినా, ఏ సుఖం వచ్చినా మీరంతా కలసి పంచుకోవాలి నాయనలారా!" అని హితవు చెప్పారు. వెంటనే ఆ ఇద్దరు శిష్యులు పరుగు పరుగున సూది తెస్తున్న వాళ్ల దగ్గరకు వచ్చి



గురువుగారు చెప్పిన సలహా వివరించారు. అప్పుడు ఐదుగురు కలిసి సూదిని ఆశ్రమానికి ఎలా తీసుకు వెళ్లాలా అని శిష్యులకు సందేహం వచ్చింది. బాట పక్కనే వారికి తాటి పట్టె ఒకటి కనిపించింది. దానిని చూడగానే శిష్యులకు ఓ ఉపాయం స్ఫురించింది. సూదిని తాటి పట్టెకు గుచ్చి, "ఇక దీన్ని పట్టండిరా! మనందరం కలసి ఈ తాటి పట్టెను మోసుకుపోదాం! కష్టాన్ని అంతా కలసి పంచుకోవటం అంటే ఇలాగే మరి" అని ఒకరికి ఒకరు సర్ది చెప్పుకొన్నారు.

ఆ ఐదుగురూ తాటిపట్టెను భుజాల పైకి ఎత్తుకొని ఆపసోపాలు పడుతూ ఆశ్రమాన్ని చేరుకొన్నారు. తాటి పట్టెను కిందకు దించి సూది కోసం వెదికితే, ఇంకేముంది? అంత పెద్ద తాటి పట్టెలో సూది నిలిస్తే కదా! ఆ సూది దారిలో ఎప్పుడో ఎక్కడో జారిపడిపోయింది. పాపం ! ఆ శిష్యులు తెల్లముఖాలు వేశారు. తాటి పట్టె మంచిది కాకపోవటం వల్లనే సూది జారిపడిపోయిందని వారిలో వారు చర్చించుకో సాగారు తప్ప, తమ తెలివి తక్కువ తనాన్ని వారు గుర్తించ లేక పోయారు. అదే సమయంలో ఆ గ్రామంలోని ఓ పెద్ద మనిషి పరమానందయ్యగారితో ఏదో పని ఉండి ఆశ్రమానికి వచ్చి, జరిగింది తెలుసుకొని, ఆ శిష్యుల అమాయకత్వానికి జాలిపడ్డాడు. పక్కింట్లోంచి సూది తెచ్చి, పరమానందయ్యగారి కాలిలోని ముల్లును బయటకు తీసి ఆయనను ఆ బాధనుంచి విముక్తుణ్ణి చేశాడు.

- ఇది పరమానందయ్య శిష్యుల కథ

## రామలింగడి తెలివి

విజయనగరం రాయలవారి కొలువులో తెనాలి రామలింగడు ఒక మహాకవి. ఎంతటి వారినయినా తన తెలివితో ఓడించేవాడు. రాజును సంతోషపరచి బహుమతులు పొందేవాడు. నాగులు, సోములు పేరుమోసిన గజదొంగలు. ఒకసారి వీరి చూపు రామలింగడి ఇంటిమీద పడింది. రామలింగడి ఇంటిలో చొరబడి నగలు దొంగిలించాలని ఆలోచించి ఒక పథకం వేశారు. మరునటి రోజు సాయంకాలం నగలు దొంగిలించడానికి నాగులు, సోములు రామలింగడి ఇంటి వెనుకకు చేరారు. వెనుకవైపు నున్న పెరటి గోడమీద నుంచి దూకారు. ఇంకా చీకటి పడలేదు. పెరటిలో ఒక అరటి తోట ఉంది. చీకటి పడేదాకా అరటి చెట్ల వెనుక దాగారు. రామలింగడికి భోజనం వేళయింది. చేతులు కడుగుకోవడానికి రామలింగడు పెరటిలోకి పోయాడు. అనుకోకుండా అరటిచెట్లు వైపు చూశాడు. చీకటిలో దాగిన దొంగల్ని గమనించాడు. రామలింగడు కంగారు పడకుండా ఒక ఉపాయం ఆలోచించాడు పెళ్లాన్ని పిలిచాడు. "ఊరిలో దొంగల భయం ఎక్కువగా ఉంది. ఈరోజుల్లో నగలు నాణాలు ఇంటిలో ఉంచకూడదు వాటిని ఒక సంచిలో



మూటకట్టి ఆమూటను బావిలో వేసేద్దాం" అన్నాడు. "బావిలో ఉంటే ఎవరికి కనిపించవు. ఏమంటావు" అని ఆమెను అడిగాడు. ఆమె సరేఅంది. ఈ మాటలు దొంగలకు వినిపించాయి. రామలింగడి ఉపాయం ఫలించింది. తరువాత రామలింగడు ఆమె చెవిలో ఏదో ఊదాడు. ఇంటిలోపలికి పోయి నగలు తీసి మూటను తయారు చేశారు. ఒక మూటను బావిలో పడేశారు. మూటను బావిలో వేయడం దొంగలు చూశారు. వెదకబోయిన తీగ కాలికి తగిలిందని దొంగలు సంతోషించారు. అందరూ నిదురపోయేదాకా ఉండి తరువాత బావిలో దిగుదాం అని దొంగలు నిర్ణయించు కున్నారు. అప్పుడు ఎవరూ చూడకుండా నగలమూట తీసుకుందాం అనుకున్నారు. బాగా చీకటిపడింది. అందరూ నిదురపోయారు. నాగులు, సోములు అరటి చెట్ల వెనుక నుంచి లేచి బావిలోకి తొంగి చూశారు. మొదట నాగులు బావిలోకి దిగి నగల మూట కోసం చాలాసేపు వెతికాడు. నగల మూట ఏమీ చేతికి తగలలేదు. చివరకి విసిగిపోయాడు. బావిలో చాలా నీరు ఉండటంచేత నగలమూట దొరకడం లేదనుకొని నీరు బయటికి తోడితే మంచిదని నాగులు కేకవేశాడు. సరేనని చేద బావిలోకి విడిచాడు సోములు. చాలాసేపు నీరు తోడిపోశారు. రామలింగడు పెరటిలోకి తొంగి చూశాడు. దొంగలు నీరు తోడి పోయడం చూశాడు. మళ్లీ ఉపాయం ఆలోచించాడు. చప్పుడు చేయకుండా పెరటిలోకి పోయి అరటి చెట్లకు నీరు బాగా పారేలాగా పాదులు చేశాడు. కొంత సేపటికి నాగులు బయటకు వచ్చాడు. అప్పుడు సోములు బావిలోకి దిగాడు. ఎంత తోడినా బావిలోని నీరు తరగలేదు. కాని అరటి చెట్లకు నీరు బాగా పారింది. తెల్లవారు ఝామున కోడికూసే వేళ వరకూ తోడిపోశారు. అప్పుడు చివరకు సోములుకు ఒక మూట దొరకగా దాన్ని తాడుకు బిగించాడు. నాగులు మూటనుపైకి లాగాడు. నగలు దొరికాయని నాగులు సోములు మురిసిపోయారు. మూట ముడి విప్పారు. ఎంతో ఆశగా చూశారు కాని అందులో నగలు లేవు గాని ఒక పెద్ద బండరాయి ఉంది. దొంగలకు నోట మాట రాలేదు.

రామలింగడు తమను ఎలా మోసం చేశాడో తెలిసింది. జరిగిందేదో జరిగిందని పారిపోయారు. ఇంతకాలం తమను మించిన వారులేరని ఆ దొంగలు మిడిసిపడేవారు. ఎంతోమందిని దోచుకోగలిగారు. కాని రామలింగడి ఇంటిని మాత్రం దోచుకోలేక పోయారు. తెలివిగా రామలింగడే దొంగలను ఉపయోగించుకో గలిగాడు. జరిగిన సంగతి రాజుకు తెలిసింది. రాజు రామలింగడి తెలివికి సంతోషించాడు. బహుమతులతో గౌరవించాడు, రామలింగడి ఉపాయం అలాంటిది మరి.

*- ఇది తెనాలి రామలింగడి కథ.*

# సాహిత్య పీఠం

విషయసూచి

లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యెఁ బ్రాణంబులున్
రావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా.



తన వెంటన్ సిరి, లచ్చి వెంట నవరోధవ్రాతమున్ దానివెం
టను బక్షీంద్రుడు వాని పొంతను ధనుః కౌమోదకీ శంఖచక్ర
'నికాయంబున', నారదుడు, ధ్వజనీకాంతుండు రా వచ్చి దొ
య్యన వైకుంఠ పురంబునం గలుగు వారా బాలగోపాలమున్
- పోతన భాగవతం

గజేంద్రమోక్షం

భాగవతపురాణంలోని ఒకగాథ. ఇంద్రద్యుమ్నుడు అను మహారాజు గజరూపంలోనూ హుహూ అనే రాక్షసుడు మొసలిరూపంలోను పెనుగు లాడుతూ గజం మొర పెట్టుకోగా విష్ణుమూర్తి చక్రాయుధంతో మొసలిని నరికినప్పుడు వారు శాప విముక్తులవుతారు. ❖

| 11వ శతాబ్ది | 12 శతాబ్ది | 13వ శతాబ్ది |
|---|---|---|
| ఆదికవి - శబ్దశాసనుడు<br>**నన్నయ**<br>**మహాభారతము**<br><br>ప్రప్రథమ శతకకర్త<br>**బద్దెన**<br>**నీతి శాస్త్రముక్తావళి**<br>**సుమతీ శతకము** | కవి రాజ శిఖామణి<br>**నన్నెచోడ**<br>**కుమార సంభవము**<br><br>**మల్లికార్జున పండితుడు**<br>**శివతత్త్వ సారము**<br><br>**వేములవాడ భీమకవి**<br>**చాటువులు**<br><br>వీరశైవ ద్విపదకవి<br>**పాలకురికి సోమన**<br>**బసవ పురాణము**<br>**పండితారాధ్య చరిత్రము** | ప్రప్రథమ రామాయణ కవి<br>**గోన బుద్ధారెడ్డి రంగనాథుడు**<br>**రంగనాథ రామాయణము**<br><br>కవిబ్రహ్మ-ఉభయ కవి మిత్రుడు<br>**తిక్కన**<br>**మహాభారతము**<br>**నిర్వచనోత్తర రామాయణము**<br><br>ప్రప్రథమ వ్యాకర్త<br>**కేతన**<br>**దశకుమార చరిత్రము**<br><br>ప్రప్రథమ పురాణ అనువాదకుడు<br>**మారన**<br>**మార్కండేయ పురాణము**<br><br>ప్రబంధపరమేశ్వరుడు<br>**ఎర్రన** (చిత్రా ప్రగడ)<br>**మహాభారతము (శేషభాగం)**<br>**హరివంశము**<br><br>**మంచన**<br>**కేయూరబాహు చరిత్ర**<br>**జాయాపసేనాని**<br>**నృత్య రత్నావళి** |

## సంగ్రహ సాహిత్య పటం

# తెలుగు సాహిత్య పరిణామంలో ప్రముఖ ఘట్టాలు

*గమనిక: ఈ సంగ్రహ సాహిత్య పటం సమగ్రం కాదు. రేఖామాత్రంగానే రూపొందించబడింది. ఇంకను వివరాలు కోరువారు దాసరి లక్ష్మణ స్వామిగారి వర్ణన రత్నాకరము (1927)రెండు సంపుటాలూ ఆరుద్ర గారి సమగ్ర ఆంధ్ర సాహిత్యం-13 సంపుటాలూ (1989) సంప్రదించాలి.*

## 14వ శతాబ్ది

రామాయణ కవి
**హుళక్కి భాస్కరుడు**
భాస్కర రామాయణము

**విన్నకోట పెద్దన**
కావ్యాలంకార చూడామణి

సంవిధాన చక్రవర్తి
**నాచన సోమన**
ఉత్తర హరివంశము

ప్రౌఢ కవి : కవిసార్వభౌముడు
**శ్రీనాథుడు**
శృంగార నైషధం †
పలనాటి వీరచరిత్రము,
హరవిలాసము

సహజ కవి
**పోతన**
మహాభాగవతము

కవి, కథకుడు
**జక్కన**
విక్రమార్క చరిత్ర
వాాకి నా రాణి
**పిల్లలమర్రి పిన వీరభద్రుడు**
జైమినీ భారతము
శృంగార శాకుంతలము

## 15వ శతాబ్ది

అనంతుడు
భోజరాజీయము

ప్రజ్ఞతో ద్విపదలల్లిన కవి
**గౌరన**
హరిశ్చంద్రోపాఖ్యానము
నవనాథచరిత్రము

**దూబగుంట నారాయణ కవి**
పంచతంత్రము

**నంది మల్లయ్య & ఘంట సింగన్న**
ప్రబోధ చంద్రోదయము

పదకవితా పితామహుడు
**తాళ్లపాక అన్నమాచార్య**
దివ్యనామ సంకీర్తనలు

రాజకవి
**శ్రీకృష్ణదేవరాయలు**
ఆముక్తమాల్యద

ఆంధ్ర కవితాపితామహుడు
**అల్లసాని పెద్దన** *
మనుచరిత్రము †

**నంది తిమ్మన** *
పారిజాతాపహరణము

> *
> శ్రీకృష్ణదేవరాయలవారి
> భువన విజయము
> కొలువులో
> అష్టదిగ్గజ కవులు
>
> †
> పంచ కావ్యములు

## 16వ శతాబ్ది

**పిడుపర్తి సోమన**
బసవ పురాణము
**అయ్యల రాజు రామభద్రుడు***
రామాభ్యుదయం

**మాదయ్య గారి మల్లన***
రాజశేఖర చరిత్రము

**ధూర్జటి** *
కాళహస్తి మాహాత్మ్యము

**తెనాలి రామకృష్ణ** *
పాండురంగ మాహాత్మ్యము†

ద్వ్యర్థి కవి - కథక చక్రవర్తి
**పింగళి సూరన***
కళాపూర్ణోదయము
రాఘవ పాండవీయము †

తొలి తెలుగు కవయిత్రి
**మొల్ల**
మొల్ల రామాయణము

**రామరాజ భూషణుడు** *
**(భట్టుమూర్తి)**
వసుచరిత్ర †

అచ్చతెనుగు కవి
**పొన్నికంటి తెలగన్న**
యయాతి చరిత్ర

**సారంగు తమ్మయ**
వైజయంతీ విలాసము

తిట్టు కవి
**కూచిమంచి జగ్గ కవి**
చంద్రరేఖా విలాపము

**అద్దంకి గంగాధర కవి**
తపతీసంవరణోపాఖ్యానము

## 17వ శతాబ్ది

**పింగళి ఎల్లన**
తోభ్యా చరిత్ర

యక్షగాన కవయిత్రి
**రంగాజమ్మ**

యుగ కవి
**చేమకూర వేంకట కవి**
విజయ విలాసము

**హరిభట్టు**
వరాహపురాణము
మత్స్య పురాణము

**కాకుమాని మూర్తి**
రాజవాహన విజయము

ప్రజా కవి
**వేమన**
నీతి శతకము

వాగ్గేయకారుడు
**కంచర్ల గోపన్న**
**రామదాసు కీర్తనలు**
దాశరథీ శతకము

వాగ్గేయకారుడు
**క్షేత్రయ**
మొవ్వగోపాలశృంగార పదములు

వాగ్గేయ కారుడు
**నారాయణ తీర్థులు**
కృష్ణలీలాతరంగిణి
తరంగములు

**కూచిమంచి తిమ్మన**
నీలా సుందరి పరిణయము
అచ్చ తెలుగు రామాయణము

## 18వ శతాబ్ది

**సముఖము వెంకట కృష్ణప్ప**
**నాయక**
అహల్యా సంక్రందనీయము

'భర్తృ హరి' ని తెనిగించిన
**ఏనుగు లక్ష్మణకవి**
సుభాషితములు

**ఎలకూచి బాల సరస్వతి**
రంగ కౌముది
భర్తృహరి సుభాషితములు

**కస్తూరి రంగకవి**
ఆనంద రంగ ఛందం

విజ్ఞాన సర్వస్వ కవి
**అయ్యల నారాయణామాత్య**
హంసవింశతి

చిత్రకవి
**సింగనార్యుడు**
బిల్హణీయము

**అడిదం సూర కవి**
కవిజన రంజనము

శృంగార కవయిత్రి
**ముద్దు పళని**
రాధికా సాంత్వనము

**శేషము వేంకటకవి**
తారాశశాంక విజయము

**కంకంటి పాపరాజు**
ఉత్తర రామాయణము

## 19వ శతాబ్ది

**తరిగొండ వెంగమాంబ**
రాజయోగ సారము
జ్ఞానవాశిష్ట రామాయణము

**పిండిప్రోలు లక్ష్మణ కవి**
రావణ జన్మ రహస్యము

హాస్యకవిజాణ
**కవి చౌడప్ప**
తిట్టుకవిత్వము

వాగ్గేయకారుడు
**త్యాగయ్య**
కృతులు, నౌకా చరిత్రము
ప్రహ్లాద చరిత్రము

సుప్రసిద్ధ వ్యాకర్త
**పరవస్తు చిన్నయసూరి**
బాల వ్యాకరణము, నీతిచంద్రిక

**గోపీనాథ వేంకట కవి**
గోపీనాథ రామాయణము

**కాసుల పురుషోత్తము**
ఆంధ్ర నాయక చరిత్రము

నిఘంటు నిర్మాత
**చార్లెస్ ఫిలిప్ బ్రౌన్**

**పుదూరి సీతారామశాస్త్రి**
పెద్ద బాలశిక్ష

నిఘంటు నిర్మాత
**బహుజనపల్లి సీతారామాచార్యులు**
శబ్దరత్నాకరము

**మండపాక పార్వతీశ్వర శాస్త్రి**
హరిహరేశ్వర శతకము,
రాధాకృష్ణసంవాదము

బహుముఖ వ్యాఖ్యాత
**వేదం వేంకటరాయ శాస్త్రి**
ప్రతాప రుద్రీయము

# 20వ శతాబ్ది

ధునిక సాహిత్య వైతాళికుడు
**ందుకూరి వీరేశలింగం పంతులు**
రాజశేఖర చరిత్రము

ప్రజల కవి
**గురజాడ అప్పారావు**
కన్యాశుల్కము

వ్యవహార భాషావాది
**గిడుగు వెంకట రామమూర్తి**
బాలకవి శరణ్యము, గద్య చింతామణి

హరికథాపితామహుడు
**ఆదిభట్ల నారాయణదాసు**
హరికథా ప్రబంధములు

శతావధానులు జంటకవులు
**దివాకర్ల తిరుపతి శాస్త్రి,**
**చెళ్లపిళ్లవేంకట శాస్త్రి**
(తిరుపతి వెంకటకవులు)
శ్రీ కృష్ణరాయబారము,
పాండవోద్యోగవిజయములు

విజ్ఞాన సర్వస్వ నిర్మాత
**కొమర్రాజు వేంకట లక్ష్మణరావు**
ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం

జ్ఞానపీఠ్ పురస్కార గ్రహీత
**విశ్వనాథ సత్యనారాయణ**
శ్రీమద్రామాయణ కల్పవృక్షము,
కిన్నెరసాని, వేయి పడగలు

**శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి**
రామాయణ, భారత,
భాగవతములు

గద్యకర్త
**పానుగంటి లక్ష్మీనరసింహారావు**
సాక్షి వ్యాసములు

ానపద బాణీ ననుసరించిన కవి
**నండూరి వెంకట సుబ్బా రావు**
యెంకి పాటలు

**వడ్డాది సుబ్బరాయకవి**
వేణీసంహారము

**గడియారం వేంకట శేష శాస్త్రి**
శివభారతము

**దువ్వూరి రామిరెడ్డి**
పానశాల, కృషీవలుడు

స్త్రీ స్వేచ్ఛకై రచనలు సాగించిన
మహారచయిత
**గుడిపాటి వేంకటచలం 'చలం'**
మైదానం, స్త్రీ, మ్యూజింగ్స్

జంటకవులు
**వేంకట పార్వతీశకవులు**
బాలగీతావళి, ఏకాంతసేవ

కవి రాజా
**త్రిపురనేని రామస్వామి**
సూత పురాణము
వచనకవి

**బాలగంగాధర తిలక్**
అమృతం కురిసినరాత్రి

నవల నాటక రచయిత
**చిలకమర్తి లక్ష్మీ నరసింహం**
గణపతి, గయోపాఖ్యానము

**బసవరాజు అప్పారావు**
గీతాలు

**ఉమర్ అలిషా**
విచిత్ర బిల్హణీయము,
ఖండ కావ్యములు

ఆధి వాస్తవ కవి
**శ్రీరంగం నారాయణబాబు**
రుధిరజ్యోతి
ఫిడేలు నాయుడుగారి వేళ్ళు

అభ్యుదయ ప్రజాకవి
**శ్రీ శ్రీ - శ్రీరంగం శ్రీనివాసరావు**
మహాప్రస్థానం

జాతీయ గేయ కవి
**గరిమెళ్ళ సత్యనారాయణ**
మాకొద్దీ తెల్లదొరతనము

**దాశరథి కృష్ణమాచార్యులు**
తిమిరంతో సమరం, రుద్రవీణ

భావకవి
**రాయప్రోలు సుబ్బారావు**
తృణకంకణము

**గుర్రం జాషువా**
గబ్బిలం, ఫిరదౌసి

బాలవాఙ్మయబ్రహ్మ
**చింతా దీక్షితులు**
లక్కపిడతలు, సూరి సీతి వెంకి

సరస్వతీపుత్ర
**పుట్టపర్తి నారాయణాచార్యులు**
శివ తాండవము, పాద్యం

**అడవి బాపిరాజు**
నారాయణరావు, హిమబిందు

భావకవి
**దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి**
కృష్ణపక్షం, ఊర్వశి, ప్రవాసము

కవి - సాహిత్య చరిత్రకారుడు
**ఆరుద్ర**
త్వమేవాహమ్,
సమగ్ర ఆంధ్రసాహిత్యం

జ్ఞానపీఠ్ పురస్కార గ్రహీత
**సి. నారాయణ రెడ్డి**
కర్పూర వసంతరాయలు,
విశ్వంభర, నాగార్జునసాగరము

**బోయి భీమన్న**
గుడిసెలు కాలిపోతున్నాయి
రాగవైశాఖి

## లోకోక్తులు

***అతి సర్వత్రవర్జయేత్:*** ఎప్పుడూ అతి పనికి రాదు.

***అనురాగో ను రాగేణ ప్రత్యష్టవ్య:*** అనురాగం చూపి అనురాగం పొందనగును.

***అన్నదాతా సుఖీభవ:*** అన్నదానం చేసిన వారు సుఖంగా ఉండాలి.

***అన్నన్య క్షుధితం పాత్రమ్:*** ఆకలితో ఉన్నవానికే అన్నం పెట్టాలి.

***అన్యధా శరణం నాస్తి, త్వమేవశరణం మమ:*** మరెవరూ నన్ను రక్షించరు. నువ్వే (దేవుడు) నాకు దిక్కు.

***అర్థనా మార్జనం కార్యం, వర్ధనం రక్షణం, తథా భక్ష్యమాణో నిరాదాయ, సుమేరపి హీయతే:*** ధనాన్ని సంపాదించాలి. దానిని పెంచి పోషించాలి. రాబడిలేక ఉన్న సంపదను తింటూ కూర్చుంటే మేరుపర్వతం సైతం తరిగిపోతుంది.

***అల్పవిద్యో మహాగర్వీ:*** కొద్దిగా విద్య గలవాడే ఎక్కువ గర్వపడతాడు.

***అశాంతస్య కుత స్సుఖమ్:*** శాంతము లేనివారికి సౌఖ్యమూ లేదు.

***అసతోమా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ మృత్యోర్మా అమృతంగమయ:*** అసత్యంనుండి సత్యానికీ చీకటి నుండి వెలుగుకీ మృత్యువు నుండి అమృత త్వానికీ.

***ఆత్మవత్సర్వభూతాని:*** సమస్త ప్రాణులనూ తన మాదిరిగా పరిగణించాలి.

***ఆత్మవహ్యాత్మనో బంధురాత్మ వరిపురాత్మన:*** తనమనస్సే తనకు బంధువూ, శత్రువు కూడా!

***ఆత్మారథం జీవలోకేస్మిన్ కోన జీవతి మానవ: పరం పరోపకారార్థం! యో జీవతి సజీవతి:*** మానవులందరూ తమ కొరకే ఈ జగత్తులో జీవిస్తున్నారు. కాని పరోపకారం కోసం ఎవరు జీవిస్తున్నారో వారే నిజంగా జీవిస్తున్నట్టు. అంటే, తమకోసమే జీవించే వారు జీవన్మృతులని భావించాలి.

***ఆరోగ్యమానృణ్య మవిప్రవాస:, సత్ప్రత్యయావృత్తి రభీతివాస:, సద్భిర్మనుష్యైం ప్రయోగ: షడ్జీవలో కస్య సుఖానిరాజన్:*** ఆరోగ్యం, ఋణ రాహిత్యం, దూరదేశ వాసం లేకపోవడం, నమ్మకమైన వృత్తి, నిర్భయ జీవనం, సత్పురుషులతో సంబంధం అనే ఆరు అంశాలూ సుఖశాంతులను కలుగజేస్తాయి.

***ఉత్తమం స్వార్జితం భుక్తం, మధ్యమం పితురార్జితమ్, కనిష్ఠం భ్రాతృవిత్తంచ, స్త్రీ విత్తం అధమాధమమ్:*** సొంత సంపాదన ఉత్తమం, తండ్రి ద్వారా సంక్రమించిన ఆస్తిపై ఆధారపడటం మధ్యమం, సోదరుల ఆర్జనపై ఆధారపడడం అధమం, స్త్రీ సంపాదనపై ఆధారపడటం అధమాధమం.

***ఉదర నిమిత్తం బహుకృత వేషం:*** కోటి విద్యలు కూటి కొరకే.

***కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, భోజ్యేషు మాతా, శయనేషు రంభా, రూపేచలక్ష్మీ, క్షమయాధరిత్రీ సత్కర్మయుక్తా కుల ధర్మపత్నీ॥***

ఇంటి పనులు చేసేటప్పుడు దాసీ వలెనూ, సలహా సంప్రదింపులలో మంత్రిలాగా ఉండాలి. బయట అందరికీ కనిపించేటప్పుడు మహాలక్ష్మి లాగ కళకళలాడాలి. భోజనం వండి వడ్డించే టప్పుడు తల్లిలా ఆప్యాయత చూపాలి. భర్తతో కూడి శయనించడంలో రంభవలె శృంగార లీలలతో ఆయనను ఆకట్టుకోవాలి. ఇలా ధర్మపత్ని స్వధర్మం మారుతూ ఉంటుంది.

***కృషితో నాస్తి దుర్భిక్షం:*** కష్టించి పనిచేస్తే కరువు ఉండదు.

***గతజలసేతు బంధనం:*** వరదవెల్లువ ఆగిన తరవాత ఆనకట్ట కట్టటం నిరుపయోగం.

***జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ:*** తల్లినీ జన్మభూమినీ మించిన స్వర్గం లేదు.

***జాతస్యహిధ్రువోమృత్యు:*** పుట్టిన ప్రతి ఒక్కరికీ మృత్యువు తప్పదు.

***జ్యాయాం సమసి శీలేన విహీనంనైవ అపిశూద్రంచ ధర్మజ్ఞం సద్వృతి మభి పూజతే:*** తనకంటే పెద్దవాడైనంత మాత్రాన శీలహీనుణ్ణి పూజించ నక్కర లేదు. ధర్మమెరిగిన, సత్ప్రవర్తన గల వ్యక్తి హీనకులజుడైనా పూజించాల్సిందే.

***దారేషు కించిత్స్వజనేషు కించిద్గోప్యం వయస్యేషు సుతేషు కించిత్ యుక్తం నవా యుక్తమిదం విచింత్య వదే ద్విపశ్చిన్మహాతో సురోధాత్*** - కట్టుకున్న భార్యకు కొన్ని విషయాల్ని మిత్రులకు కొన్ని సంగతుల్ని సొంత పుత్రులకు కొన్నిటిని గోప్యంగా ఉంచాలి. ఏదియుక్తమో ఏది యుక్తం కాదో బాగుగా ఆలోచించి మరీ మసలు కోవాలి.

***దుర్బలస్య బలం రాజా:*** బలహీనునికి రాజే బలం.

***ధనం మూలమిదం జగత్:*** ప్రపంచములో ధనమే ప్రధానం.

***ధర్మోరక్షతి రక్షిత:*** ధర్మాన్ని నువ్వు కాపాడితే ధర్మం నిన్ను కాపాడుతుంది.

***ధైర్యం సర్వత్ర సాధనమ్:*** ధైర్యము అన్ని పరిస్థితులందును కార్యసాధకము.

***నదీనాం సాగరోగతి:*** నదులన్నీ సముద్రంలో కలవక తప్పదు

***నభూతో నభవిష్యతి:*** గతంలో జరగలేదు, భవిష్యత్తులో జరగబోదు.

***నహికల్యాణ కృత్కశ్చి దుర్గతిం తాతి గచ్ఛతి:*** మంచిపని చేసిన వారికి ఎప్పటికీ చెడు జరగదు.

***పరోపకారార్థం మిదం శరీరమ్:*** ఈ శరీరం ఇతరుల ఉపకారానికే వినియోగించాలి.

***మాతా సమం నాస్తి శరీరపోషణం, చింతాసమం నాస్తి శరీరశోషణం, భార్యా సమం నాస్తి శరీరతోషణం, విద్యాసమం నాస్తి శరీరభూషణం:*** తల్లితో సమానంగా శరీరపోషణ చేసేవారుండరు. చింతతో

సమానంగా శరీరాన్ని నీరసింపచేసేది మరొకటి ఉండదు. భార్యతో సమానంగా శరీరానికి సంతోషం కలిగించేవారు మరొకరుండరు. విద్యతో సమానంగా ఉండే శరీరభూషణం మరొకటి ఉండదు.

**యతో ధర్మస్తతో జయః** ఎక్కడ ధర్మం ఉంటుందో అక్కడ జయం ఉంటుంది.

**యథారాజా తథాప్రజాః** రాజు ఎలా ఉంటే ప్రజలూ అలాగే ఉంటారు.

**యదృచ్ఛా లాభ సంతుష్టః** కలిగిన దానితో సంతృప్తి చెందు.

**యథార్థవాదీ లోకవిరోధీః** నిజం చెప్పే వాడు అందరికీ విరోధి అవుతాడు.

**యుక్తియుక్తం వచోగ్రాహ్యం బాలదపి శుకాదపిః** యుక్తమైన మాటలను బాలుడు పలికినా, చిలుక పలికినా స్వీకరించాలి.

**వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి, లోకోత్త రాణాం హిం చేతం కోహి విజ్ఞాతు మరతి:** లోకోత్తరులైన మహానుభావులకు ఎప్పుడు కోపం వస్తుందో వారికి మాత్రమే తెలుస్తుంది. అదెలాగంటే వారి మాటలు వజ్రంలా కఠినంగా ఉన్నా, వారి మనస్సు పుష్పంలా మృదువుగా ఉంటుంది.

**వినాశకాలే విపరీతబుద్ధిః** వినాశకాలం దాపురిస్తే విపరీతమైన బుద్ధులు పుడతాయి.

**వ్యసనే ష్వేవపర్వేషు యస్య బుద్ధిర్న హీయతే నతేషాం పారమధ్యేతి తత్ర భావాద సంశయమ్:** ఆపదలు కలిగినప్పుడు ఎవని బుద్ధి భ్రంశం పొందదో అట్టి స్థిరచిత్తుడు తన బుద్ధిబలంచేత ఆపదలనుండి కడ తేరగలడు.

**శీలం శౌర్యమనాలస్యం పాండిత్యం మిత్ర సంగ్రహః అచోర హరణీయాని పంచైతాన్యక్షయో నిధిః** శీలం, శౌర్యం, చురుకు తనం, పాండిత్యం, స్నేహ శీలం అనే సుగుణ పంచకం దొంగలు హరింపజాలని తరగని నిధులు.

**శీలేన శోభతే విద్యాః** శీలంవల్ల విద్య రాణిస్తుంది.

**సంగాద్గుణ దోషాభవంతిః** సహవాసం వల్ల గుణదోషం కలుగుతుంది.

**సంతోషస్త్రీషు కర్తవ్యః కలత్రేభోజనేధనే త్రిషుచైవ న కర్తవ్యో దానే తపసి పాఠనే** - తన భార్యయందును, భోజనము నందును ధనమునందును తృప్తి చెందాలి. దానం, తపస్సు విద్యాభ్యాసమున మాత్రం తృప్తి పొంద కూడదు.

**సత్యమేవ జయతేః** సత్యమే జయస్తుంది.

**సత్యం వద ధర్మమ్ చరః** ఎల్లప్పుడూ సత్యాన్నే వచించు ధర్మాన్నే ఆచరించు.

**సర్వేజనా సుఖినో భవన్తుః** సకల జనులూ సుఖశాంతులతో వర్ధిల్లాలి.

**సహసా విదధీత నక్రియామ్ః** ఏ పనినీ తొందరపడి చేయటం సమంజసం కాదు.

**హితం మనోహరి చ దుర్లభవచః** హితమగు మాటలు మనోరంజకమవటం దుర్లభం.


చెడు వినవద్దు - చూడవద్దు - మాట్లాడవద్దు

## సూక్తులు

అక్షరరూపం దాల్చిన సిరా చుక్క లక్ష మెదళ్లకు కదిలిక.

- కాళోజి నారాయణ రావు

అసూయా అపోహా లేనివాడే మానవుడు.

- రామాయణం.

ఆత్మబలం లేకపోతే దేనిలోనూ రాణించ లేడు.

- ఒక సూక్తి

ఇవ్వడం నేర్చుకో, తీసుకోవడం కాదు, పని అలవర్చుకో, పెత్తనం కాదు.

- పరమహంస.

ఉత్సాహమే బలం. బలం గలవాడు ఎలా అన్నిటినీ సాధించగలడో ఉత్సాహవంతుడూ అలాగే సాధించగలుగుతాడు. ఉత్సాహవంతునికి లభించనిది అంటూ ఏదీ లేదు.

- ఒక సూక్తి

ఏకాగ్రత జీవితానికి ప్రధాన లక్ష్యం. ఏ రంగంలోనైనా విజయం సాధించాలంటే ఏకాగ్రత ఎంతో అవసరం. - ఎమర్సన్.

ఒంటరిగా ఉన్నప్పుడే నీ మిత్రుడికి చీవాట్లు పెట్టు. కాని నలుగురిలో ఉన్నప్పుడు మాత్రం పొగుడు. - సైరస్

కష్టించి పని చేయాలి. సంతృప్త మనస్కులు కావాలి. కర్తవ్యాన్ని సంతోషంగా నిర్వర్తించాలి.

- మోక్షగుండం విశ్వేశ్వరయ్య.

కామక్రోధాలే మనిషికి పతనాలు.

-ఒక సూక్తి

కొడుకు సమర్థుడూ, సన్మార్గుడూ, వ్యసన రహితుడైన మంచివాడైతే వాడే ప్రయోజకుడై, స్వశక్తితో ఆస్తిపాస్తులు, పేరు ప్రతిష్ఠలు సంపాదించుకుంటాడు కనుక వాడికి పిత్రార్జితం అవసరం ఉండదు. అలా కాకుండా ఆ కొడుకు అసమర్థుడూ, దుర్మార్గుడూ, వ్యసనపరుడూ అయితే పిత్రార్జితం అంతనీ క్షణాల మీద కరగపెట్టి కడగళ్ళ పాలవుతాడు. అలాంటి వాడికి ఇచ్చీప్రయోజనం లేదు. అందుచేత కొడుకులు మంచివాళ్ళు అయినా చెడ్డవాళ్ళు అయినా వాళ్లకోసం తను కష్టపడి సంపాదించి, మురగవేసి ఉంచాల్సిన అవసరం లేదు.

- ఒక సూక్తి

కొత్తవారి పట్ల సౌమ్యం, సౌజన్యం చూపే మనిషి ప్రపంచ పౌరునిగా లెక్క.

- ఫ్రాన్సిస్ బేకన్

చుట్టూరా ఆవరించుకొని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంతచిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది.

-ఒక సూక్తి

తన వైఫల్యాలకు పరిస్థితుల్ని నిందించకుండా ఆ పరిస్థితుల్ని తనకు అనుకూలముగా మలచుకోగలిగిననాడే విజయం సాధించగలుతాడు.

- బెర్నార్డ్ షా

తినడానికి చేపను ఇచ్చేకంటే చేపను పట్టే నైపుణ్యాన్ని నేర్పితే మేలు. - చీనా సూక్తి

**నీ**తిలేని వ్యాపారం, కృషిలేని సంపద, శీలం లేని విద్య; త్యాగంలేని ఆరాధన,మానవత లేని శాస్త్ర విజ్ఞానం,నియమనిష్ఠలు లేని రాజకీయం - ఇవే సామాజిక పాపాలు.

- మహాత్మాగాంధీ

**నీ**వు నీకోసం జీవిస్తే నీవు నీలోనే నిలిచి పోతావు. నీవు జనంకోసం జీవిస్తే నీవు జనంలో నిలిచి పోతావు. - అంబేద్కర్

**నే**ను సాధించిన విజయాల వెనుక రహస్యమేమీ లేదు. కేవలం కష్టించి పని చేయడమే.- టర్నర్.

**ప్ర**తి చిన్న అభిప్రాయభేదాన్నీ రాద్ధాంతం చెయ్యకపోవడమే పెద్దమనిషి లక్షణం.

- ఆస్కార్ వైల్డ్

**ప్ర**త్యర్థుల నుంచి నేర్చుకోగలిగిందే సిసలైన విద్య. - డిజ్రేలీ.

**బ**తకడానికే తినాలి. తినడానికే బతక రాదు.

- ఒక సూక్తి

**బు**రద చల్లకండి-మీరు ఉద్దేశించిన వారిపై అది పడక పోవచ్చు; పైగా మీ చేతులు మాత్రం బురదవుతాయి. - పార్కర్

**బు**ద్ధి వికాసం కంటే హృదయవికాసమే మానవత్వానికి ప్రధానం - ఒక సూక్తి

**భ**యపడేలా చేసే వ్యక్తిని ఎవరూ ప్రేమించరు.

- అరిస్టాటిల్

**మ**న మనస్సే మనకు పెట్టని కోట. అది దెబ్బతింటే జీవన సమరంలో మనం ఓడిపోతాం.

- రాజాజీ

**మ**నభావనలే మనకు మనుగడనిచ్చేవి.

- ధమ్మపదం

**మ**నసు అతి పవిత్రమైంది. స్వర్గాన్ని నరకం గానూ నరకాన్ని స్వర్గం గానూ మార్చగల శక్తి దానికి ఉంది. - మిల్టన్

**మ**నిషి కంటె అతి పురాతనమైంది సంఘం. ఆ సంఘ బలిమిలో తన స్థానం తెలుసు కోవడమే మనిషి చేయగలిగింది.

• - రూసో

**మ**నిషి పరిపూర్ణత అతని ఆస్తుల్లో కాదు అతని స్వభావంలో ఉంది.

- వివేకానంద

**మ**హాపురుషుల జీవిత విశేషాలు తెల్సుసుకో నిచ్చగించని వారు జీవితాంతమూ బాల్య దశలోనే గడుపుతారు. - ప్లుటార్క్

**మా**ట్లాడుతున్నప్పుడు ప్రజల భాషలో మాట్లా డాలి. కాని ఆలోచిస్తున్నప్పుడు మాత్రమే మేధావుల ఒరవడిని అనుసరించాలి.

- అరిస్టాటిల్

**వి**రిగిన చేయి పనికి వస్తుంది. కాని విరిగిన హృదయం మాత్రం పని చేయదు.

- పారశీక సూక్తి

**స**మర్థులయిన వారు ఎప్పుడూ నాయకత్వం వహించి మార్గదర్శకు లవుతారు. మిగిలిన వారు వారిని అనుసరిస్తూ ఉంటారు.

- సర్వేపల్లి రాధాకృష్ణన్.

సామర్థ్యం ఉండగానే సరి కాదు; అవకాశం కూడా కలిసి రావాలి - నెపోలియన్.

**స**హస్రయోధుల్ని సహస్ర రణరంగాల్లో జయిం చినా, తన్నుతాను జయించుకున్న వాడే మహాయోధాగ్రేసరుడు. - ధమ్మపదం.

**సు**షుప్తావస్థలో ఉన్నప్పుడు అందరి ముఖాలు ప్రశాంతంగా కనిపిస్తాయి. మేల్కొన్నప్పుడు చూడాలి మానవ ప్రవర్తన ఎలా ఉంటుందో!

- హెూచిమిన్.

# న్యాయములు

**అంధకూప న్యాయం:** గుడ్డివారు వరుసగా పోవునప్పుడు మొదటివాడు నూతిలో పడగా అందరూ పడిన రీతి.

***అంధపంగున్యాయం:*** గుడ్డివాడు కుంటి వాడు ప్రయాణం చేయనారంభిస్తూ గుడ్డివాని భుజం పై నెక్కి కుంటివాడు మార్గం చూపిస్తూ ఉండగా గుడ్డివాడు నడచిన రీతి.

**అంధాక్షిమీలన్యాయం:** గుడ్డి కన్నులు మూసినను తెరచినను ఒక్కటే.

**అగ్నివమి న్యాయం:** అగ్నికి చెదలు పట్టవు.

**అచలచలన్యాయం:** నౌక, రైలు ఎక్కిపోతు న్నప్పుడు తీరం, చెట్లు నడుస్తున్నట్లును నౌక, రైలు నిలచియున్నట్లు కనబడురీతి.

***అజగళ న్యాయం:*** మేకకున్న మెడచన్నులు ఉన్నా ఒక్కటే లేకున్నా ఒకటే.

***అభ్ర మయూర న్యాయం:*** మేఘం చూచిన నెమలికి సంతోషమనురీతి.

***అరణ్యరోదన న్యాయం:*** అడవిలో ఏడ్చే వానిని ఓదార్చేవారుండరు. (నిష్ప్రయోజనం)

***అరుంధతీ ప్రదర్శన న్యాయం:*** సులభంగా గ్రహింపరాని సూక్ష్మవస్తువును తెల్పవలసి వచ్చినప్పుడు ముందుగా దానివంటి సూక్ష్మవస్తువును తెలిపి అది తెలిసిన పిమ్మట సూక్ష్మవస్తువును తెలుపురీతి.

***అవినాభావ సంబంధ న్యాయం:*** ఒకదాని కొకటి సంబంధించి యుండుట. ఉదా: కుండకు మట్టికి గల సంబంధం.

***అహింసా పరమో ధర్మ:*** అహింస కంటే మిక్కిలి ధర్మం లేదు.

***ఆకాశ ముష్టి హనన న్యాయం:*** ఆకాశాన్ని పిడికిలితో గుద్దుటకు వీలులేదనురీతి.

***ఆదర్శగజ న్యాయం:*** పెద్ద ఏనుగును చిన్న అద్దమందు చూపుట.

***ఉత్ఖాత దంష్ట్రభుజగన్యాయం:*** కోరలు తీసిన నాగుపాము పైకి భయంకరంగా కనిపించినా కరవలేదు.

***ఉష్ట్రకంటక భక్ష్య న్యాయం.*** ఒంటె ముళ్ల కొమ్మల్ని నోటికి గుచ్చుకొనకుండ తినురీతి.

***కజ్జల జల న్యాయం:*** కాటుక కరుగదు.

***కపోత న్యాయం:*** కళ్లంలో పావురాలు వాలి గింజలు తినుచుండగా వేటగాడు వల వేయగా అన్నియు ఒక మారుగ లేచి వలను ఎత్తుకు పోవుట.

***కరణీ ప్రసవ న్యాయం:*** ఏనుగుకి ఒక పిల్ల పుట్టినా మేలే అనుట.

***కరతలామలక న్యాయం:*** అరచేతిలో ఉసిరి కాయ. చక్కగా తెలియడం.

***కరదీపిక న్యాయం:*** తన చేతిలోని దీపం

తనకు ఉపయోగించక ఇతరులకే ఉపయోగపడురీతి.

***కాకతాళీయం:*** కాకి వాలగనే అప్రయత్నంగా తాటిపండు పడుట.

***కాకదంత న్యాయం:*** కాకి దంతాలను పరీక్షించుట.

***కాకాక్షిన్యాయం:*** కాకికి ఒకకన్ను మాత్రమే కనబడును.

***కాకాభీతి న్యాయం:*** పగలు కాకికూత విని జడిసి పెనిమిటిని కౌగలించుకున్న నంగనాచి స్త్రీ అమావాస్య అర్ధరాత్రి గోదావరి నదిని దాటి ప్రియుని కలుసుకొనుటకు వెళ్లిన రీతి.

***కార్యకారణ న్యాయం:*** కార్య వస్తువును బట్టి కారణవస్తువు ఉన్నట్టు.

***కుంభదీపికా న్యాయం:*** కుండలో పెట్టిన దీపంపైకి కనిపించదు.

***కులాలకీట న్యాయం:*** కుమ్మరి పురుగు మన్ను దూరినా మట్టి అంటదు.

***కూపస్థ మండూక న్యాయం:*** నూతిలో కప్ప మాదిరి ఏమీ తెలియని స్థితి.

***కూర్మాంగ న్యాయం.*** తాబేలు తన కాళ్లు, కళ్లు ముడుచుకొనుట.

***గుడ జిహ్వికా న్యాయం:*** బెల్లం నాలుక మీద ఉన్నంత సేపే తీపి.

***గృహదీపికా న్యాయం:*** ఇంట్లో దీపం ఉంటే ఇల్లంతా వెలుగు.

***గేహ శూర న్యాయం:*** ఇంట్లో డంబాలు పలికేవాడు ఏ పనికీ పనికిరాడు.

***ఘరట్ట న్యాయం:*** తిరుగలి దిమ్మలు ఒక దానితోనే పని నెరవేరేది.

***చందన న్యాయం:*** ఒక చుక్క చందన తైలం శరీర మంతటినీ చల్లబరచినట్లు

***జలతైల బిందు న్యాయం:*** నీటి మీద పడిన తైలబిందువు నీరంతా పాకుట.

***జాలమత్స్య న్యాయం:*** 'వలలో చిక్కిన చేప.

***తమో దీప న్యాయం:*** దీపముంటే చీకటి ఉండదు.

***తాళాధిరోహణ న్యాయం:*** తాటిచెట్టు ఎక్కే వానిని కొంతవరకే ఎగతోయ గలుగుట.

***తిలతండుల న్యాయం (తైలపిష్ట న్యాయం):*** బియ్యం, నువ్వులూ కలపడం కష్టం.

***తీర బక న్యాయం:*** ఒడ్డున ధ్యానం చేసేకొంగ చేప కొరకే.

***తీర్థకాక న్యాయం:*** కాకి గంగలో మునిగినా ఫలితం శూన్యం.

***తృణ రజ్జు న్యాయం:*** బలంలేని గడ్డిని ఎంటిగా చేసి ఏనుగునైనా కట్టవచ్చు - ఐకమత్య చిహ్నం

***దగ్ధ పద మార్జాల న్యాయం:*** నలుగురు దూదివర్తకులు, పిల్లికథ.

***దర్వీపాక రస న్యాయం:*** గరిటె అన్ని

పాత్రల్లోనూ మెలగుచున్నా వాటి రుచి మాత్రం దానికి తెలియదు.

***నాసికాంగులీ న్యాయం:*** ఎవరి ముక్కులో వారి వేలు పట్టును.

***నీరనీర న్యాయం:*** నీరూనీరూ కలిస్తే విడదీయుట కష్టం.

***పయోముఖ విషకుంభ న్యాయం:*** లోపలి విషము నోట పాలను గల కుండ.

***పరిణామ న్యాయం:*** కాలాన్ని బట్టి ప్రతివస్తువునకు మార్పు తప్పని సరి.

***బధిర కర్ణ జప న్యాయం:*** చెవిటివాడి చెవిలో రహస్యం చెప్పడం నిష్ప్రయోజనం.

***మణిసూత్ర న్యాయం:*** పూసలో దారం వలె.

***మత్స్య కంటక న్యాయం:*** చేపను తినేటప్పుడు ముల్లును తీసి తినాలి.

***మండూక తోలన న్యాయం:*** కప్పల తక్కెడ. స్థిరత్వం లేకపోవుట.

***మర్కట కిశోర న్యాయం:*** కోతిపిల్ల తల్లి పొట్టన కరచుకొని ఉండుట. స్వప్రయత్నం ఉంటేనే భగవంతుడు రక్షించుననుట.

***మధు మక్షిక న్యాయం:*** తేనెటీగలు చేర్చిన తేనె మనుష్యుల అధీనమగుట.

***మార్జాల కిశోర న్యాయం:*** పిల్లి తన పిల్లను నోటకరచుకుని కాపాడుట. స్వప్రయత్నం లేకుండానే భగవంతుడు రక్షించుననుట.

***లవణామలకీ న్యాయం :*** సముద్రపు ఉప్పు, అడవిలోని ఉసిరికాయ కలిసెననుట దాంపత్యం.

***వటబీజ న్యాయం :*** చిన్న మర్రి గింజలో పెద్ద మర్రి ఉన్నట్లు.

***వలీముఖ నారికేళ న్యాయం:*** కోతి టెంకాయలను పడవేయుటే గాని తాను తినదు.

***వృశ్చికా గర్భ న్యాయం:*** ఆడతేలు పిల్లలు పుట్టగానే మరణించడం కద్దు. ఒక్కొక్కరి పుట్టుక తల్లి చావుకి కారణమవుతుంది.

***శ్వశ్రూభికా న్యాయం :*** కోడలు లేదనిన దానికి అడ్డంపడి అత్త లేదనుట.

***శ్వాస మకర న్యాయం :*** మొసలి నీటిలో ఉండి ఏనుగునైనా లాగగలదు.

***సర్పరజ్జు న్యాయం :*** తాడును చూచి పాము అని భయపడుట.

***సింహావనలోక న్యాయం:*** సింహం కొంతదూరం పోయి తిరిగి వెనుకకు చూచుట.

***సౌధసోపాన యాన న్యాయం:*** మేడమెట్లు అన్నీ ఒక్కసారి ఎక్కలేము గదా!

***స్థాలీపులాక న్యాయం:*** ఉడుకుతున్న అన్నంగురించి ఒక మెతుకును బట్టి అన్నం అంతా ఉడికినదీ లేనిదీ చెప్పుట.

***హస్తిమశక న్యాయం:*** ఏనుగును దోమతో పోల్చుటేమిటి?

| తిరుక్కురళ్ నీతులు | తిరువళ్ళువర్ |
| --- | --- |

ఇంకనేమి వలయు ఇల్లాలు బాగున్న ?
ఇంటిసిరులు తొలగు ఇంతి చెడిన.

ఊరి చెరువు నీరు ఉమ్మడి సొత్తట్లు
మంచివాడు కలిమి నెంచవలయు.

ఒకడు చేయవలయు ఒప్పార పుణ్యంబు
తప్పుచేయ నింద తప్పదెపుడు.

కరుణతోడ పలుక పరబాధ లేకుండు
ఇహము పరము రెంట ఇంపు పెంచు.

కలిమి దినములందు కడునమ్ర వలయు
లేమిలోన రీవి లెస్సయగును..

కాని పనులనన్ని మానవలయు : కీర్తి
బాగుపడదలచిన వాడు మొదట.

గుండెలందు చిన్న కోపాగ్ని కణమున్న
నెయ్యమనెడు దోనె నిప్పు పాలు.

గొప్పవారలెపుడు గొప్పకార్యములనే
చేయదగిన రీతి చేయగలరు.

చదువు వంటి కలిమి తరగని సంపద
మిగత కలుములన్ని ఎగత మగును.

చెల్లునపుడు పనులు చేయాలి సూటిగా
చెల్లనపుడు నెరవు నొల్లవలయు.

తనకు కీడు సేయ తన ఈర్ష్యయే చాలు
బాధ పెట్ట తనకు పగతుడేల ?

తలపు మంచిదైన పలుకు తీయనైన
కర్మ కరిగిపోవు ధర్మమెదుగు.

తీపిమాట మేలు తెలిసిన పిమ్మట
మొరటు మాటలేల మొరుగు జనుడు.

నేడు చదువు కొన్న నేడు జన్మలదాక
బడయు గలడు దాని ఫలము నరుడు

దయయు, ఈవి, ఏలుదక్షత, పరిరక్ష
నాల్గుయున్న నృపతి వెల్గుచుండు.

దొంగనవ్వు మొదట దుర్భాషలా వెన్క
ధర్మ హానికన్న దారుణమ్ము.

ధర్మమెరిగి యుక్త కర్మ మెరిగి మాట
మర్మ మెరిగి చెప్ప మంచి సఖుడు.

నోరు మంచిదైన పేరు మంచి జగాన
సాటి రాదు రాదు దీటుకొనగ.

పట్టు విడకుండ పాటు పడెడువారు
వెనుక నెట్టగలరు విధిని కూడ.

పరుష వాక్యమెపుడు పలుకడు సుజనుడు
నోట జారిపడదు చేటు పలుకు

పలుకులోన రాదు వలపపాతము
మనసులోన సమతయునికి యున్న.

భాష సొంపు తెలిసి భాషించు వక్తలు
మాట జారలేరు మాన్యులెదుట.

మంచి వాడు మేలు మరచి పోకూడదు
పరులు కీడు నేయ మరువ వలయు.

మంచి నుడులు విడిచి కొండెము లాడుట
పచ్చి కాయ తినుట పండు విడిచి.

మచ్చలేని మనసు మంచికి కాణాచి
వేరు చేత లెల్ల వెకిలి పనులు.

మచ్చలేని వారి మైత్రి విడువరాదు
బాధలందు నిన్ను ఆదుకొనరె.

సమయమందు చేయు స్వల్ప సహాయము
ధరణి కన్న హెచ్చు బరువుతూగు.

మాట మంచిదైన మర్యాద చూపిన
మిత్రరాశి పెరుగు మేలుకలుగు.

వేరు నణచకున్న నోరైన అణచుకో
మాట జారినంత చేటు కలుగు.

శీల వంతురాలు స్థిరముగా నున్నచో
ఆమెకన్న మిన్న యువని గలదె.

సదవగాహన, పని సామర్థ్యము తగిన
హితవు చెప్పగలుగు నతడు మంత్రి.

సాధుజనుడు తనకు సాయపడినవాని
ఏడు జన్మలందు కూడ తలచ

ఆరుద్ర గారి దక్షిణ వేదం నుండి

### అదిగో అల్లదిగో

అదిగో అల్లదిగో శ్రీహరివాసము
పదివేల శేషుల పడగలమయము.

అదె వేంకటాచల మఖిలోన్నతము
అదిగో బ్రహ్మాదుల కపురూపము.
అదిగో నిత్యనివాస మఖిలమునులకు
అదె చూడు అదెమ్రొక్కు ఆనందమయము అది

చెంగట నల్లదిగో శేషాచలము
నింగినున్న దేవతల నిజనివాసము
ముంగిట నల్లదిగో మూలనున్న ధనము
బంగారు శిఖరాల బహు బ్రహ్మమయము అదిగో
కైవల్య ప్రదము శ్రీ వేంకట నగమదిగో
శ్రీ వేంకటాపతికి సిరులైనదీ
భావింప సకలసంపదరూప మదిగో
పావనముల కెల్ల పావన మయము ।అదిగో

### ఎంత సదివిన...

ఎంతసదివిన నేమివినిన తన
చింత యేల మాను సిరులేల కలుగు

ఇతర దూషణములు ఎడసిన గాక
అతి కాముకుడు గానియప్పుడు గాక
మతి చంచలము గొంత మానిన గాక
గతియేల కలుగు దుర్గతులేలమాను। ఎంత॥

పరధనముల యాస పాసినగాక
అరిది నిందలులేని యప్పుడు గాక
విరసవ ర్తనము విడిచిన గాక
పరమేల కలుగు నాపద లేలమాను ఎంత
వేంకటపతి నాత్మ వెదకిన గాక
కింక మనసున దొలగిన గాక
బొంకుమాట లెడసి పోయిన గాక
శంక యేలమాను జయమేల కలుగు ఎంత

### కొండలలో నెలకొన్న...

కొండలలో నెలకొన్న కోనేటిరాయడు వాడు
కొండలంత వరములు గుప్పెడు వాడు
కుమ్మరదాసుడైన కురువరతి నంబి
ఇమ్మన్న వరములెల్ల నిచ్చిన వాడు
దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కురవర్తి రమ్మన్న
చోటికి వచ్చి నమ్మినవాడు కొం
అచ్చపు వేడుకతోడ ననంతాళువారికి
ముచ్చిలి వెట్టికి మన్ను మోచినవాడు
మచ్చిక దొలక దిరుమలనంబి తోడుత
నిచ్చ నిచ్చ మాటలాడి నొచ్చిన వాడు ।కొం
కంచిలోననుండ దిరుకచ్చినంబిమీద గరుణించి
తన యెడకు రప్పించిన వాడు
యెంచి నెకుడైన వేంకటేశుడు మనలకు
మంచివాడై కరుణ బాలించినవాడు ॥కొం

### తందనాన

తందస న ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన.
బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె పర
బ్రహ్మ మొకటే పరబ్రహ్మ మొకటే. తం
కందువగు హీనాధికము లిందు లేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మింతా నొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ తం
నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటునిద్ర అదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే
చండాలుడుండేటి సరిభూమి యొకటే ।తం
అనుగు దేవతలకును అలకామ సుఖమొకటే
ఘనకీటపశువులకు కామసుఖమొకటే

కలికితురాయి నీకు పొలుపుగ జేయిస్తిరామచంద్ర
నీపు కులుకుచుదిరిగెద వెవరబ్బసొమ్మని
రామచంద్ర ॥ఇ

మీ తండ్రి దశరధ మహారాజుపెట్టెనారామచంద్ర
లేక మీమామ జనకమహారాజు పంపెనా
రామచంద్ర ॥ఇ॥

అబ్బ తిట్టితినని యాయాసపడవద్దు రామచంద్ర
యీ దెబ్బలకోర్వక అబ్బ తిట్టితినయ్య
రామచంద్ర ॥ఇ॥

ఏటికి జల్లిన నీళ్ళాయె నాబ్రతుకురామచంద్ర
నేను అధములందరి కంటె నన్యాయమైతిని
రామచంద్ర ॥ఇ॥

**ఏతీరుగనను...**

ఏతీరుగనను దయజూచెదవో
యినవంశోత్తమ రామా
నాతరమా భవసాగరమీదను
నళినదళేక్షణ రామా ॥ఏ॥

శ్రీరఘునందన సీతారమణా
శ్రితజనపోషక రామా
కారుణ్యాలయ భక్తవరద నిను
కన్నది కానువు రామా ॥ఏ

మురిపెముతో నాస్వామివి నీవని
ముందుగ దెల్పితి రామా
మరువక యిక నభిమానముంచు
నీ మరుగు జొచ్చితిని రామా ॥ఏ॥

క్రూరకర్మములు నేరకచేసితి
నేరము లెంచకు రామా
దారిద్ర్యము పరిహారము చేయవే
దైవశిఖామణి రామా ॥ఏ॥

గురుడవు నామది దైవము నీవని
గురుశాస్త్రంబులు రామా
గురుదైవంబని యెరుగక తిరిగెడు
క్రూరుడనైతిని రామా ॥ఏ॥

నిండితి వఖిలాండకోటి
బ్రహ్మాండములందున రామా
నిండుగమది నీ నామముదలచిన
నిత్యానందము రామా ఏ

వాసవ కమలభవాసురవందిత
వారిధి బంధన రామా
భాసురవర సద్గుణములు గల్గిన
భద్రాద్రీశ్వర రామా ॥ఏ

వాసవనుత రామదాస పోషక
వందనమయోధ్య రామా
దాసార్చిత మాకభయ మొసంగవె
దాశరధీ రఘురామా ॥ఏ

**పొయ్యేటప్పుడు...**

పొయ్యేటప్పుడు వెంటరాదుగాపుచ్చిన వక్కె
వెయ్యారు దాచుకొనియు నర్థుల
కియ్యలేని లోభుల కయ్యయ్యో పొ

ఇచ్చినమాత్రం బిచ్చును దైవము హెచ్చుడినరాదు
వచ్చేటప్పుడు వెంటనేమైనతెచ్చుకొన్నదిలేదు పొ
హెచ్చుగనిది తెలియని పామరులు
దురాశను తగులుకొని
యిచ్చట నార్జించిన ధనమెచ్చట
కెత్తుకపొయ్యే రయ్యయ్యో పొ॥

తలతురువారలు పశుసుతాదులు
తనవని భ్రమసేరు
తన వారెక్కడ తానెక్కడనో
తనువు విడిచి యాజీవు డొంటిగ ॥పొ॥

ఇరువుగ తొలిజన్మమున
పేదలకియ్యని దోషమున
తిరిపెము లెత్తెడివారిని
గాంచియు దెలియకయున్నారు ॥పొ॥

పరులకు బలిభిక్షంబులు
బెట్టని పరమలోభు లిలను
ధరలో వేంకటవిఠలుని దలపక
ధనమదాంధమున దగిలి మానవుడు ॥పొ

# త్యాగరాజ కృతులు

## ఘనరాగ పంచరత్నములు

### జగదానందకారక

జగదానంద కారక ! జయ జానకీ
ప్రాణ నాయక! ।జ।
గగనాధిప ! సత్కులజ ! రాజ రాజేశ్వర !
సుగుణాకర ! సుజన (సేవ్య)
సేవ్య! భవ్య దాయక!
సదా సకల ।జ॥
అమర తారక నిచయ కుముద హిత
పరిపూర్ణా ! నఘ !
జదధి సురసురభూ పయోధి
వాసహరణ !
సుందరతర వదన ! సుధామయవ -
చో బృంద గోవింద సానంద ! మా -
వరాజ రాప్త శుభకరా ! నేక ।జ॥
నిగమనీరజా మృతజపోషక !
నిమిషవైరి వారిదసమీరణ !
ఖగ తురంగ ! సత్కవి హృదాలయా !
అగణితవానరాధిప! నతాంఘ్రియుగ!।జ।
ఇంద్ర నీలమణి సన్ని భాపఘన !
చంద్ర సూర్య నయ నా ప్రమేయ వా-
గీంద్ర జనక ! సకలేశ ! శుభ్ర నా -
గేంద్ర శయన ! శమనవైరి సన్నుత !।జ।
పాద విజిత మౌని శాప ! సవ పరి
పాల ! వర మంత్ర గ్రహణ లోల !
పరమ శాంత ! చిత్త జనకజాధిప
సరోజ భవ వరదా ! ఖిల - ।జ।
సృష్టి స్థిత్యంత కార కామిత !
కామిత ఫలదా ! సమాన గాత్ర, ! శ -
చీపతి ను ! తాబ్ధి మద హ ! రానురా -
గ రాగ రాజిత కథా సారహిత ! ॥జ॥
సజ్జన మానసాబ్ధి సుధాకర ! కు
సుమ విమాన సురసా రిపు కరాబ్జ-
లాలిత చరణ ! అవగుణా సురగణ -
మదహరణ ! సనాత ! నాజనుత ! ।జ
ఓంకార పంజర కీర పుర -
హర సరోజ భవ కేశవాది
రూప ! వాసవ రిపు జన కాంతక ! క -
లాధర కలాధారాప్త ! ఘృణాకర ! శ -
రణాగత జనపాలన ! సుమనో ర -
మణ ! నిర్వికార ! నిగమసారతర !।జ।
కరధృత శరజాలా ! సురమ -
దాప హర ! ణావనీసుర సురావన !
కవీన బిలజమౌని కృత చరిత్ర -
సన్నుత శ్రీత్యాగరాజనుత ! ।జ।
పురాణ పురుష ! నృవరాత్మ జా ! శ్రిత
పరాధీన ! ఖరవిరాధ రావణ -
విరావణ ! అనఘ ! పరాశర మనో -
హర ! వికృత త్యాగరాజ సన్నుత ! ॥జ।
అగణిత గుణ ! కనక చేల !
సాల విదళ నారుణాభ సమాన చర !
ణాపార మహి ! మాద్భుత ! సుకవిజన -
హృత్సదన ! సురముని గణ విహిత ! కల-
శ నీరనిధిజా రమణ ! పాప గజ -
నృసింహా ! వర త్యాగరాజాది నుత ! ।జ॥

---

### దుడుకు గల నన్నే దొర

దుడుకు గల నన్నే దొర -
కొడుకు బ్రోచురా ? ఎంతో ॥దు॥
కడు దుర్విషయాకృష్టుడై -
గడియ గడియకు నిండారు ॥దు॥

దిన మహోరాత్రములు తెగి ధనాఢ్యునకొకటే
వొనర నిరుపేదకును వొక్కటే అవియు తం
కొరవి శిష్టాన్నములు గొను నాకలొకటే
తిరుగు దుష్టాన్నములు తిను నాకలొకటే
వరగ దుర్గంధములపై వాయువొకటే తం
వరున బరిమళముపై వాయువొకటే తం
కడగి యేనుగు మీద గాయుయెండొకటే
పుడమి శునకము మీద బొలయు నెండొకటే
కడు బుణ్యులను బాప కర్ములను సరిగాన
జడియు శ్రీ వేంకటేశ్వరు నామ మొకటే తం

## బ్రహ్మ గడిగిన...

బ్రహ్మ గడిగిన - పాదము
బ్రహ్మము తానె నీ పాదము బ్రహ్మ
చెలగి వసుధ గొలిచిన దీ పాదము
బలి తల మోపిన పాదము
తలకక గగనము తన్నిన పాదము
బలరిపు గాచిన పాదము బ్రహ్మ
కామిని పాపము కడిగిన పాదము
పాము తల నిడిన పాదము
ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము
పామిడి తురగపు పాదము బ్రహ్మ
పరమ యోగులకు పరిపరి విధముల
వర మొసగెడి నీ పాదము
తిరు వేంకటగిరి తిరమని చూపిన
పరమ పదము నీ పాదము బ్రహ్మ

## ముద్దుగారే...

ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు
తిద్దరాని మహిమల దేవకి సుతుడు ముద్దు
అంత నింత గొల్లెతల అరచేత మాణికము
పంతమాడే కంసుని పాలి వజ్రము
కాంతుల మూడు లోకాల గరుడపచ్చబూ
చెంతల మాలోనున్న చిన్నికృష్ణుడు ముద్దు
రతికేళి రుక్మిణికి రంగు మోవి పగడము
మితి గోవర్ధనపు గోమేధికము
సతమై శంఖ చక్రాల సందుల వైడూర్యము
గతియై మమ్ము గాచేటి కమలాక్షుడు ముద్దు
కాళింగుని తలలపై గప్పిన పుష్యరాగము
యేలేటి శ్రీ వేంకటాద్రి యింద్రనీలము
పాలజలనిధిలోన బాయని దివ్యరత్నము
బాలునివలె దిరిగీ బద్మనాభుఁడు ముద్దు

## మనుజుడై పుట్టి ...

మనుజుడైపుట్టి మనుజుని సేవించి
అనుదినమును దుఃఖమందనేలా
జుట్టెడు గడుపుకై చొరని చోట్లు చొచ్చి
పట్టెడు గూటికై బతిమాలి
పుట్టిన చోటికే పొరలి మనసు వెట్టి
వట్టి లంపటము వదలనేరడు గాన
అందరిఁలో బుట్టి అందరిలో జేరి
అందరి రూపములటు దానై
అందమైన శ్రీ వేంకటాద్రీశు సేవించి
అందరానిపద మందె నటు గాన

## కొలనిదోపరికి గొబ్బిళ్ళో

కొలనిదోపరికి గొబ్బిళ్ళో
యదుకులస్వామికి గొబ్బిళ్ళో
కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండొక శిశువుకు గొబ్బిళ్ళో
దుండగంపు దైత్యుల కెల్లను తల
గొండు గండనికి గొబ్బిళ్ళో కొలని
పాప విధుల శిశుపాలుని దిట్టుల
కోపగానికిని గొబ్బిళ్ళో
ఏపున గంసుని నిదుముల పెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్ళో కొలని
దండి వైరులను దఱిమి దనుజుల
గుండె [illegible]
వెండి పైడి [illegible]
కొండలయ్యకును గొబ్బిళ్ళో కొలని

*గరుడగమనరారా...*

గరుడగమనరారా. నను నీ
కరుణనేలుకోరా గరుడ॥
పరమపురుష యే వెరపులేక నీ
మరుగుజొచ్చితిని అరమరసేయకు। గరుడ।
పిలువగానె రమ్మి
అభయము తలపగానెయిమ్మి
కలిమిబలిమి నాకిలలో నీవని
కలవరించితిని నను గన్నయ్య । గరుడ
పాలకడలి శయనా
దశరథబాల జలజనయనా
పాలముంచినను నీటముంచినను
పాలబడితినిక జాలముచేయక । గరుడ
ఏలరావు స్వామి
నననిపు డేలుకోవదేమి
ఏలువాడవని చాల నమ్మితిని
ఏలరావు కరుణాలవాల హరి । గరుడ।
ఇంత పంతమేలా
భద్రగిరీశ వరకృపాల
చింతలణచి శ్రీరామదాసుని
అంతరంగపతివై రక్షింపుము ।గరుడ।

**పలుకే బంగారమాయెనా**

పలుకే బంగారమాయెనా కోదండపాణి ॥పలు॥
పలుకే బంగారమాయె పిలిచిన పలుకవేమి
కలలో నీనామస్మరణ మరువ
చక్కనితండ్రి । పలు
ఇరువుగ నిసుకలోన పొరలినయుడుతభక్తికి
కరుణించి ప్రోచితివని నెరనమ్మితి
నిన్నేతండ్రి పలు।
రాతినాతిగ జేసి భూతలమున ప్రఖ్యాతి
జెందితివని ప్రీతితో నెరనమ్మితితండ్రి పలు।
ఎంతవేడినననీకు సుంతైన దయరాదు
పంతముచేయ నేనెంతవాడనుతండ్రి పలు।
శరణాగతత్రాణ బిరుదాంకితుడవుగాదా
కరుణించు భద్రాచల వరరామదాసపోష పలు

**ఇక్ష్వాకుల తిలక ...**

ఇక్ష్వాకుల తిలక ఇకనైనపలుకవె రామచంద్ర
నన్ను రక్షింపకున్నను రక్షకులెవరింక రామచంద్ర ఇ
చుట్టుప్రాకారములు సొంపుతోగట్టితి రామచంద్ర
యాప్రాకారముకుబట్టె పదివేలవరహాలు
రామచంద్ర ॥ఇ॥
గోపురమంట పాల్కుదురుగ గట్టిస్తి రామచంద్ర
ననుక్రొత్తగజూడక యిత్తరిబ్రోవుము రామచంద్ర ॥ఇ
భరతునకు చేయిస్తి పచ్చలపతకము రామచంద్ర
యా పతకమునకుబట్టె పదివేల వరహాలు
రామచంద్ర ॥ఇ॥
శత్రుఘ్నునకు నేను చేయిస్తిమొలత్రాడు
రామచంద్ర
ఆ మొలత్రాటికిబట్టె మొహరీలు పదివేలు
రామచంద్ర । ఇ
లక్ష్మణునకు జేయిస్తి ముత్యాలపతకము
రామచంద్ర
యా పతకమునకుబట్టె పదివేలవరహాలు
రామచంద్ర । ఇ॥
సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకమురామచంద్ర
యా పతకమునకుబట్టె పదివేలవరహాలు
రామచంద్ర ॥ఇ।
వాహనములు మీకు వరుసతో జేయిస్తిరామచంద్ర
జగన్మోహన సంకెళ్ళు వేసిరికాళ్ళకు
రామచంద్ర ఇ।

కలికితురాయి నీకు పొలుపుగ జేయిస్తిరామచంద్ర
నీవు కులుకుచుదిరిగెద వెవరబ్బసొమ్మని
రామచంద్ర ॥ఇ॥

మీ తండ్రి దశరథ మహారాజుపెట్టెనారామచంద్ర
లేక మీమామ జనకమహారాజు పంపెనా
రామచంద్ర ॥ఇ॥

అబ్బ తిట్టితినని యాయాసపడవద్దు రామచంద్ర
యీ దెబ్బలకోర్వక అబ్బ తిట్టితినయ్య
రామచంద్ర ॥ఇ॥

ఏటికి జల్లిన నీళ్ళాయె నాబ్రతుకురామచంద్ర
నేను అధములందరి కంటె నన్యాయమైతిని
రామచంద్ర ॥ఇ॥

**ఏతీరుగనను...**

ఏతీరుగనను దయజూచెదవో
యినవంశోత్తమ రామా
నాతరమా భవసాగరమీదను
నళినదళేక్షణ రామా ॥ఏ॥

శ్రీరఘునందన సీతారమణా
శ్రితజనపోషక రామా
కారుణ్యాలయ భక్తవరద నిను
కన్నది కానుపు రామా ॥ఏ॥

మురిపెముతో నాస్వామివి నీవని
ముందుగ దెల్పితి రామా
మరువక యిక నభిమానముంచు
నీ మరుగు జొచ్చితిని రామా ॥ఏ॥

క్రూరకర్మములు నేరకచేసితి
నేరము లెంచకు రామా
దారిద్ర్యము పరిహారము చేయవే
దైవశిఖామణి రామా ॥ఏ॥

గురుడవు నామది దైవము నీవని
గురుశాస్త్రంబులు రామా
గురుదైవంబని యెరుగక తిరిగెడు
క్రూరుడనైతిని రామా ॥ఏ

నిండితి వఖిలాండకోటి
బ్రహ్మాండములందున రామా
నిండుగమది నీ నామముదలచిన
నిత్యానందము రామా ॥ఏ॥

వాసవ కమలభవాసురవందిత
వారిధి బంధన రామా
భాసురవర సద్గుణములు గల్గిన
భద్రాద్రీశ్వర రామా ॥ఏ॥

వాసవనుత రామదాస పోషక
వందనమయోధ్య రామా
దాసార్చిత మాకభయ మొసంగవె
దాశరథీ రఘురామా ॥ఏ

**పొయ్యేటప్పుడు...**

పొయ్యేటప్పుడు వెంటరాదుగాపుచ్చిన వక్కైన
వెయ్యారు దాచుకొనియు వర్థుల
కియ్యలేని లోభుల కయ్యయ్యో ॥పొ॥

ఇచ్చినమాత్రం బిచ్చును దైవము హెచ్చడినరాదు
వచ్చేటప్పుడు వెంటనేమైనతెచ్చుకొన్నదిలేదు పొ
హెచ్చుగనిది తెలియని పామరులు
దురాశను తగులుకొని
యిచ్చట నార్జించిన ధనమెచ్చట
కెత్తుకపొయ్యే రయ్యయ్యో ॥పొ॥

తలతురువారలు పశుసుతాదులు
తనవని భ్రమసేరు
తన వారెక్కడ తానెక్కడనో
తనువు విడిచి యాజీవు డొంటిగ ॥పొ॥

ఇరువుగ తొలిజన్మమున
పేదలకియ్యని దోషమున
తిరిపెము లెత్తెడివారిని
గాంచియు దెలియకయున్నారు ॥పొ॥

పరులకు బలిభిక్షంబులు
బెట్టని పరమలోభు లిలను
ధరలో వేంకటవిఠలుని దలపక
ధనమదాంధమున దగిలి మానవుడు ॥పొ॥

## త్యాగరాజ కృతులు

### ఘనరాగ పంచరత్నములు

**గదానందకారక**

గదానంద కారక ! జయ జానకీ
ణ నాయక! ॥జ॥
గనాధిప ! సత్కులజ ! రాజ రాజేశ్వర !
గుణాకర ! సుజన (సేవ్య)
వ్య! భవ్య దాయక!
దా సకల ॥జ॥
మర తారక నిచయ కుముద హిత
రిపూర్ణా ! నఘ !
దధి సురసురభూ పయోధి
సహరణ !
ందరతర వదన ! సుధామయవ -
బృంద గోవింద సానంద ! మా -
రాజ రాప్త శుభకరా ! నేక ॥జ॥
గమనీరజా మృతజపోషక !
మిషవైరి వారిదసమీరణ !
గ తురంగ ! సత్కవి హృదాలయా !
గణితవానరాధిప! నతాంఘ్రియుగ !॥జ॥
ంద్ర నీలమణి సన్ని భాపఘన !
ంద్ర సూర్య నయ నా ప్రమేయ వా-
ంద్ర జనక ! సకలేశ ! శుభ్ర నా -
ంద్ర శయన ! శమనవైరి సన్నుత !॥జ॥
ాద విజిత మౌని శాప ! సవ పరి
ాల ! వర మంత్ర గ్రహణ లోల !
రమ శాంత ! చిత్త జనకజాధిప
రోజ భవ వరదా ! ఖిల - ॥జ॥
ృష్టి స్థిత్యంత కార కామిత !
ామిత ఫలదా ! సమాన గాత్ర, ! శ -
పతి ను ! తాబ్ధి మద హ ! రానురా -
 రాగ రాజిత కథా సారహిత ! ॥జ॥

సజ్జన మానసాబ్ధి సుధాకర ! కు
సుమ విమాన సురసా రిపు కరాబ్జ-
లాలిత చరణ ! అవగుణా సురగణ -
మదహరణ ! సనాత ! నాజనుత ! ॥జ॥

ఓంకార పంజర కీర పుర -
హర సరోజ భవ కేశవాది
రూప ! వాసవ రిపు జన కాంతక ! క -
లాధర కలాధారాప్త ! ఘృణాకర ! శ -
రణాగత జనపాలన ! సుమనో ర -
మణ ! నిర్వికార ! నిగమసారతర !॥జ॥

కరధృత శరజాలా ! సురమ -
దాప హర ! ణావనీసుర సురావన !
కవీన బిలజమౌని కృత చరిత్ర -
సన్నుత శ్రీత్యాగరాజనుత ! ॥జ॥

పురాణ పురుష ! నృవరాత్మ జా ! శ్రిత
పరాధీన ! ఖరవిరాధ రావణ -
విరావణ ! అనఘ ! పరాశర మనో -
హర ! వికృత త్యాగరాజ సన్నుత ! ॥జ॥

అగణిత గుణ ! కనక చేల !
సాల విదళ నారుణాభ సమాన చర !
ణాపార మహి ! మాద్భుత ! సుకవిజన -
హృత్సదన ! సురముని గణ విహిత ! కల-
శ నీరనిధిజా రమణ ! పాప గజ -
నృసింహ ! వర త్యాగరాజాది నుత ! ॥జ॥

### దుడుకు గల నన్నే దొర

దుడుకు గల నన్నే దొర -
కొడుకు బ్రోచురా ? ఎంతో ॥దు॥
కడు దుర్విషయాకృష్టుడై -
గడియ గడియకు నిండారు ॥దు॥

శ్రీ త్యాగరాజ

త్యాగరాజ కృతులు

చిరుత ప్రాయమునాడె భజనామృత -
రసవిహీన కుతర్కుడైన ।దు।
పర ధనములకొరకు నొరుల మదిని -
కరగ
బలికి కడుపునింప దిరిగినట్టి ।దు।
తన మదిని భువిని సౌఖ్యపు జీవనమే
యనుచు సదా దినములు గడిపెడి ।దు
తెలియని నటవిట క్షుద్రులు వనితలు
స్వవశమౌట కుపదేశించి శిలాత్ములై
సుభక్తులకు సమానమను
సంతసిల్లి స్వరలయంబులెఱుగకను
శిలాత్ములై నార్భకసేనా మిత ।దు
దృష్టికి సారంబగు లలనా
సదనార్భకసేనామిత
ధనాదులను, దేవాదిదేవ ! నెరనమ్మితి
గాకను పదాబ్జ భజనంబుమరచిన ॥దు।
చక్కని ముఖ కమలంబును సదా నా
మదిలో స్మరణ జేయక దుర్మదాంధ
జనుల గోరి పరితాపములచే దగిలి
నొగిలి దుర్విషయదురాసలను రోయలేక సతత
మపరాధియై చపల చిత్తుడైన ॥దు॥
మానవతను దుర్లభ మనుచు నెంచి పరమానంద
మందలేక, మదమత్సర కామలోభ
మోహములకు దాసుడై మోసబోతి గాక,
మొదటి కులజుడగుచు భువిని శూద్రుల
పనులుసల్పుచును యుంటినిగాక,
నరాధములను గోరిసార
హీనమతములను సాధింప తారుమారు। దు॥
సతులకై కొన్నాళ్లాస్తికై సుతులకై కొన్నాళ్ళు ధన-
తతులకై దిరిగితినయ్య ,
త్యాగరాజాప్త ! ఇటువంటి ।దు॥

**సాధించెనే ఓ మనసా!**

సాధించెనే ఓ మనసా ! ।సా
బోధించిన సన్మార్గ వచనముల
బొంకు జేసి తా బట్టినపట్టు ॥సా॥
సమయానికిదగు మాటలాడెనె సమ॥
దేవకి వసుదేవుల నేగించినటు సమ।
రంగేశుడు సద్గంగా జనకుడు
సంగీత సాంప్రదాయకుడు సమ
గోపి జన మనోరధ మొసంగ లేకయే
గేలియు జేసెడువాడు ।సమ॥
వనితల సదా సొక్క జేయుచును మ్రొక్క జేసె
పరమాత్ముడదియుగాక - యశోద
తనయుడంచు ముదంబునను ముద్దు
బెట్ట నవ్వుచుండు హరి సమ॥
పరమ భక్తవత్సలుడు సుగుణ
పారావారుం డా జన్మ మనఘుడీ కలి -
బాధల దీర్చువాడనుచునే హృదాంబుజమున
జూచుచుండగ ।సమ॥
హరే ! రామచంద్ర ! రఘుకులేశ !
మృదు సుభాష ! శేష శయన !
పరనారీ సోద రాజ విరాజతురగ !
రాజ రాజనుత ! నిరామయాపఘన
సరసీరుహ దళాక్ష ! యనుచు
వేడుకొన్న నన్ను తాబ్రోవకను ।సమ॥
శ్రీవేంకటేశ ! స్వప్రకాశ ! సర్వో న్నత ! సజ్జన-
మానస నికేతన ! కనకాంబరధర ! లస న్మకుట
కుండల విరాజిత హరే ! యనుచు నే పొగడగా
త్యాగరాజగేయుడు మానవేంద్రు
డైన రామచంద్రుడు ।సమ।
సద్భక్తులనడత లిట్లనెనే
యమరికగా నా పూజ గొనెనే అలుగ వద్దనెనే
విముఖులతో జేర బోకు మనెనే
వెత గలిగిన తాళు కొమ్మనెనే

దమశమాది - సుఖదాయకుఁడగు శ్రీ
త్యాగరాజనుతుడు చెంతరాకయే ॥సా॥

**కన కన రుచిరా...**

కన కన రుచిరా కనకవసన ! నిన్ను ॥క॥
దిన దినమును మనసున చనువున నిన్ను క
పాలుగారు మోమున శ్రీయపార -
మహిమ దనరు నిన్ను ॥క॥
కలకలమను ముఖ కళ గలిగిన సీత
కులుకుచు నోర కన్నులను జూచు నిన్ను ॥క॥
బాలార్కాభ సుచేల ! మణిమయ
మాలాలంకృత కంధర ! సరసిజాక్ష ! వర ॥క॥
పోల ! సురుచిర కిరీటధర ! సతతంబు
మనసారగ ॥క॥
సాపత్ని మాతయౌ సురుచిచే
కర్ణశూలమైన మాట వీనులఁ
జురుక్కన తాళక శ్రీహరిని ధ్యానించి
సుఖింపగ లేదా ? యటు ॥క॥
మృగమదలలామ శుభనిటల ! వరజటాయు
మోక్షఫలద ! పవమానసుతుఁడు నీదు
మహిమఁ దెల్ప సీత దెలిసి వలచి
సొక్క లేదా ? యారీతి నిన్ను ॥క॥
కామించి ప్రేమమీర కరముల నీదు
పాదకమలముల బట్టుకొను
వాడు సాక్షి, రామనామ రసికుడు
కైలాస సదనుడు సాక్షి,
మఱియు నారద పరాశర శుక
శౌనక పురందర నగజా ధర జ
ముఖ్యులు సాక్షిగాద ? సుందరేశ
సుఖ కలశాంబుధివా సా(శ్రితులకే ॥క॥
సుఖాస్పద విముఖాంబుధర
పవననిదేహ మానస విహా ! రాప్త -
సురభూజమానిత గుణాంక చిదా -
నంద ! ఖగతురంగ ! ధృతరథాంగ !
పరమ దయాకర కరుణారస
వరుణాలయ ! భయాపహార ! శ్రీరఘుపతే! ॥క॥
సతతము ప్రేమ పూరితుడగు త్యాగరాజ
నుత ! ముఖజిత కుముదహిత వరద !
నిన్ను ॥క॥

**ఎందరో మహానుభావులు ...**

ఎందరో మహానుభావు - లందరికి
వందనము ॥ఎం॥
చందురు వర్ణుని యంద - చందమును
హృదయార
విందమున జూచి బ్రహ్మానంద
మనుభవించులెవా ॥ఎం॥
సామగానలోల మనసిజలావణ్య
ధన్యమూర్ధన్యు ॥ఎం॥
మానస వనచరవర సంచారము సలిపి
మూర్తి బాగుగ బొడగనుడు వా ॥ఎం॥
సరగున పాదములకు స్వాంతమను
సరోజమును సమర్పణము జేయువా ॥ఎం॥
పతితపావనుడగు పరాత్పరుని గురించి
పరమార్థమగు నిజమా -
ర్గముతోను బాడుచును సల్లాపముతో
స్వరలయాది రాగముల దెలియు వా ॥ఎం॥
హరిగుణ మణిమయ - సరములు గళమున
శోభిల్లు భక్తకోటు లిలలో ?
తెలివితో జెలిమితో గరుణ గల్గి
జగమెల్లను సుధా దృష్టిచే బ్రోచు వా ॥ఎం॥
హొయలుమీర నడలు గల్గు సరసుని
సదా కనుల జూచుచును పులక
శరీరులై యానందపయోధి నిమగ్నులై
ముదంబునను యశము గలవా ॥ఎం॥

నీ మేను నామ వైభవంబులను
నీ పరాక్రమ ధైర్యముల శాంత
మానసము నీవులను
వచన సత్యమున, రఘువర ! నీయెడ
సద్భక్తియు జనించకను దుర్మతములను
కల్ల జేసినట్టి నీ మది
నెఱింగి సంతతంబుననను గుణ భజనా
నంద కీర్తనము జేయు వా ।ఎం।
భాగవత రామాయణ గీతాది
శ్రుతి శాస్త్ర పురాణపు
మర్మములన్ శివాది షణ్మతముల
గూఢములన్ ముప్పదిముక్కోటి
సురాంతరంగముల భావంబుల
నెఱింగి భావ రాగ లయాది సౌఖ్య -
ముచే చిరాయువు గలిగి నిరవధి
సుఖాత్ములై
త్యాగరాజాప్తులైన వా ఎం।
ప్రేమ ముప్పిరి గొను వేళ
నామము దలచువారు
రామభక్తుడైన త్యాగ
రాజనుతుని నిజదాసులైన వా ।ఎం

ఘనరాగ పంచరత్నములు సమాప్తం

---

**గిరిరాజ సుతా తనయ !**

గిరిరాజ సుతా తనయ సదయ ! ।గి।
సురనాథముఖార్చిత పాదయుగ !
పరిపాలయ మా, మిభరాజముఖి !
గణనాథ ! పరాత్పర ! శంకరా -
గమ వారినిధి రజనీకర !
ఫణిరాజకంకణ ! విఘ్న నివా -
రణ ! శాంభవ ! శ్రీత్యాగరాజనుత !॥గి॥

**శాంతము లేక సౌఖ్యము లేదు...**

శాంతము లేక సౌఖ్యము లేదు
సారస దళ నయన ! ॥శాం॥
దాంతునికైన వే - దాంతునికైన ।శాం।
దార సుతులు ధన ధాన్యము లుండిన
సారెకు జప తప సంపద గల్గిన ॥శాం।
ఆగమ శాస్త్రము లన్నియు జదివిన
బాగుగ సకల హృద్భావము దెలిసిన ।శాం।
యాగాదికర్మము లన్నియు జేసిన
భాగవతు లనుచు బాగుగ బేరైన ॥శాం।
రాజాధిరాజ ! శ్రీరాఘవ! త్యాగ-
రాజ వినుత! సాధు రక్షక ! తన కుప ।శాం।

**నగుమోము గనలేని...**

నగుమోము గనలేని నా జాలి దెలిసి
నన్ను బ్రోవగ రాద ? శ్రీ రఘువర ! నీ న
నగరాజధర ! నీదు పరివారు లెల్ల -
ఒగి బోధన జేసెడువారలు గారె ?
యిటు లుండుదురే ? నీ ।న॥
ఖగరాజు నీ యానతి విని వేగ చనలేడో ?
గగనాని కిలకు బహుదూరం బనినాడో ?
జగమేలెడు పరమాత్మ !
యెవరితో మొఱలిడుదు ?
వగ చూపకు తాళను న న్నేలుకోరా ;
త్యాగరాజనుత ! ।న

**సంగీత జ్ఞానము...**

సంగీత జ్ఞానము భక్తివినా-సన్మార్గము
గలదే ? మనస ! ॥సం।
భృంగి నటేశ సమీరజ ఘటజ మ -
తంగ నారదాదు లుపాసించు ।సం
న్యాయాన్యాయములు దెలుసును, జగములు
మాయామయమని దెలుసును, దుర్గుణ
కాయకాది షడ్రిపుల జయించెడి
కార్యముఁ దెలుసును, త్యాగరాజునికి సం

## నను పాలింప

నను పాలింప నడచి వచ్చితివో ?-
నా ప్రాణనాథ ।న।
వనజనయన మోమునుజూచుట జీ-
వనమని నెనరున -
మనసుమర్మము దెలిసి ॥న
సురపతి నీలమణినిభతనువుతో
నురమున ముత్యపు సరులచయముతో
కరమున శర కోదండ కాంతితో
ధరణి తనయుతో, త్యాగరాజార్చిత ! ।న॥

## చక్కని రాజ మార్గము లుండగ...

చక్కని రాజ మార్గము లుండగ
సందుల దూరనేల ? ఓ మనస ! ।చ।
చిక్కనిపాలు మీగడ యుండగ
చీయను గంగా సాగర మేల ? ॥చ॥
కంటికి సుందరతరమగు రూపమే; ము -
క్కంటి నోట చెలగెడు నామమే; త్యాగరా -
జింటనే నెలకొన్నదీ దైవమే, యిటు -
వంటి శ్రీసాకేతరాముని-భక్తియను ॥చ॥

## సామజ వర గమన!

సామజ వర గమన సాధు హృ
త్సార సాబ్జపాల ! కాలాతీత ! విఖ్యాత ! ॥సా।
సామనిగమజ సుధామయగానవి
చక్షణ ! గుణశీల ! దయాలవాల !
మాంపాలయ! ॥సా॥
వేద శిరో మాతృజ సప్త స్వర
నాదాచల దీప ! స్వీకృత
యాదవకుల మురళీ వాదనవి -
నోద! మోహన కర ! త్యాగరాజవందనీయ ! ॥సా॥

## మరుగేలరా!

మరుగేలర? ఓ రాఘవ! ।మ॥
మరుగేల ? చరాచర రూప! పరా -
త్పర ! సూర్య సుధాకర లోచన ! ॥మ॥
అన్ని నీవనుచు నంతరంగమున
దిన్నగ వెదకి - తెలుసుకొంటినయ్య ;
నిన్నెగాని మదిని నెన్నజాల నొరుల,
నన్ను బ్రోవవయ్యా, త్యాగరాజనుత ! ।మ।

## పట్టి విడువరాదు...

పట్టి విడువరాదు నా చెయి
బట్టి విడువరాదు నా చెయి ॥ప॥
పుట్టిననాఁడే నిజభక్తిని మెడ
గట్టి గుట్టు చెదరక బ్రోచి చెయి ॥ప॥
నిత్యానిత్యములను బోధించి,
కృత్యాకృత్యములను దెలిపించి,
ప్రత్యేకుడు నీవని కనిపించి, భృత్యుఁడైన
త్యాగరాజు చెయి ॥ప॥

## సీతా కల్యాణ వైభోగమే...

సీతా కల్యాణ వైభోగమే-
రామ కల్యాణ వైభోగమే ॥సీ॥
పవనజ స్తుతి పాత్ర పావన చరిత్ర
రవిసోమ నవనేత్ర రమణీయ గాత్ర ॥సీ॥
భక్త జన పరిపాల భరిత శరజాల
భుక్తి ముక్తిద లీల భూదేవ పాల
పామరా సురభీమ పరిపూర్ణ కామ
శ్యామ జగదభిరామ సాకేతధామ ॥సీ॥
సర్వలోకాధార సమరైకధీర
గర్వమానసదూర కనకాగధీర
నిగమాగమ విహార నిరుపమ శరీర
నగధ రాఘవిదార నతలోకాధార ॥సీ॥
పరమేశనుత గీత భవజలధిపోత
తరణికుల సంజాత త్యాగ రాజనుత॥సీ॥

# తత్త్వములు

### ఇక్కడ - అక్కడ !

కామ క్రోధ లోభ మోహము
మదామాత్సరము
కాల్చి వేయుదు రిక్కడ,-
ఎవరు చేసిన వారి కర్మము
లనుభవించే దక్కడ !
తల్లి దండ్రులు అన్నతమ్ములు
అక్కచెల్లె ల్లిక్కడ,
వెళ్లి పోయేటప్పుడెవ్వరు
రారు మనతో డక్కడ !
రంకు బొంకులు ఆడి దుష్టులు
రాలి పోవుదు రిక్కడ,
ఎవరు చేసిన వారి కర్మము
లనుభవించే దక్కడ !

---

### లోక మంతెవ రెంగిలి ? ఓ రమణా !

అరటి ఆకుల పళ్లె భోంచేద్దా మను కుంటే
వీగ ముట్టిన వెంగిలీ ఓ రమణా !
వెంగీ లెంగిలీ యని వేకాము చేసేవు
లోక మంతెవ రెంగిలీ, ఓ రమణా !

తల్లీ దిక్కడ పాలు తాగుదామని బోతె
అన్నా తాగిన వెంగిలీ ఓ రమణా !
ఆవూ దిక్కడ పాలు తాగుదామని బోతె
దూడా ముట్టిన వెంగిలీ ఓ రమణా !

రుక్షములో పళ్లైన భోంచేద్దామని బోతె
పక్షి ముట్టిన వెంగిలీ ఓ రమణా !
చలములో నీళ్లైన తాగదామని బోతె
కప్పా తాకిన వెంగిలీ ఓ రమణా !

---

### నందామయా !

నందామయా ! గురుడ నందామయా!
ఆనంద దేవికి నందామయా
ఆనందేవికి పుట్టేనయ్యా
అరి వీరంతారు అన్నయ్యు లంతారు
మూడు కాళ్ల వోరు ముంగలకే పుడతారు
ముసలోళ్ల కిబ్బంది కలిగేనయా ।
నందాపురే బ్రహ్మం నందాపురే
ఆనందా దేవికి పుట్టీన బ్రహ్మం
కుక్క తోకా బట్టి గోదారి ఈదితే
కోటిపల్లి రేవి తేలేనయా !!
తాడి సెట్టి వేళ్ల తాబేలే పుడుతేను
నెలకి మూడొర్షాలు కురిసే నయా ॥
ముక్కులేనీ వోడు ముందలికె పుడితేని
ములంకాయిల గనులు కడతారయా
అత్తలకె పెడతారు కోడళ్లు కురుసీలు
రంకు బోటికి లచ్చ తెలిసేనయా

---

### ఓ మనసా !

ఎంచి చూడవే ఓ మనసా ! గా
లించి చూడవే ఓ మనసా నీ
వొద్దన వున్నది వదలని మోక్షము
వంగి తిరుగవే ఓ మనుసా !

పంచ భూతములు ఓ మనసా ! ఇది
పరమ గురుడే ఓ మనసా !
పంచిమి లోపల పరమ గురుడు
పార తిరుగనే ఓ మనసా !

యాది చెప్పవే ఓ మనసా ! ఇది
అనంత గురుడే ఓ మనసా!
అయిదై దక్షరా లమరు బెట్టుకు
అంది చేర ఓ మనసా !
నీల్ల మీద బుగ్గో మనసా ! ఇది
నిలుకడ లేనిది ఓ మనసా !

నిలుకడ లేనిది ఆత్మ గురునికి
నిత్య ప్రయాణమై ఓ మనసా !

---

## జానపద గేయాలు

### గుత్తొంకాయ్ కూరోయ్ బావా! ( వెఱ్ఱి పిల్ల)

- బసవరాజు అప్పారావు

గుత్తొంకాయ్ కూరోయ్ బావా!
కోరివండినానోయ్ బావా!
కూరలోపలా నా వలపంతా
కూరిపెట్టినానోయ్ బావా!
కోరికతో తినవోయ్ బావా!

తియ్యని పాయసమోయ్ బావా!
తీరుగ వండానోయ్ బావా!
పాయసమ్ములో నా ప్రేమనియేటి
పాలుబోసినానోయ్ బావా!
బాగని మెచ్చాలోయ్ బావా!

కమ్మని పూరీలోయ్ బావా!
కర కర వేచానోయ్ బావ!
కర కర వేగిన పూరీలతో నా
కాంక్ష వేపినానోయ్ బావ!
కనికరించి తినవోయ్ బావా!

వెన్నెల యిదుగోనోయ్ బావా!
కన్నుల కింపౌనోయ్ బావా!
వెన్నెలలో నా కన్నె వలపనే
వెన్నగలిపినానోయ్ బావా!
వేగముగా రావోయ్ బావ!

పువ్వుల సెజ్జిదిగో మల్లె
పువ్వులు బరిచిందోయ్ బావా!
పువ్వులలో నా యవ్వనమంతా
పొదివి పెట్టినానోయ్ బావా!
పదనోయ్ పవళింతాం బావా!-

### మొక్కజొన్న తోటలో

- కొనకళ్ళ వెంకటరత్నం

సుక్కలన్ని కొండమీద
సోకుజేసుకునే వేళ,
పంటబోది వరిమడితో
పకపక నవ్వే వేళ,
సల్లగాలి తోటకంత
సక్కలగిల్లి పెట్టువేళ,
మొక్క జొన్న తోటలో
ముసిరిన సీకట్లలో,
మంచెకాడ కలుసుకో,
మరవకు మామయ్య.
చీకటి మిణుగురు జోతుల
చిటిల చిల్లులడక మునే,
సుద్దులరాగాలు చెవుల
నిద్దరతీయక మునుపే,
ఆకాశపుటొడిని తోట
ఆవలింత గొనక మునే,
పొద్దువాలుగంటనే
పుంతదారి వెంటనే,
సద్దుమణగనిచ్చిరా,
ముద్దులమామయ్య!
గొడ్డుగోద మళ్లేసే
కుఱ్ఱకుంకలకు గానీ,
కలుపుతీతలయి మళ్ళే
కన్నెపడుచులకు గానీ,
బుగ్గమీస మెలివేసే
భూకామందుకు గానీ,
తోవకెదురు వస్తివా,
దొంగచూపు చూస్తివా,
తంటా మన యిద్దరికీ
తప్పదు మామయ్య !!
కంచెమీద గుమ్మడిపువు
పొంచి పొంచి చూస్తాది;
విరబారిన జొన్న పొట్ట
వెకిలినవ్వు నవుతాది;
తమల తీగెలు కాళ్ళకు
తగిలి మొరాయిస్తాయి;
చెదిరిపోకు మామయా
బెదిరిపోకు మామయా
సదురుకొ నీ పదునుగుండె
సక్కని మామయ్య
పనలు కట్టి యెత్తి నన్ను
పలకరించ బోయినపుడు
చెరుకుతోట మలుపుకాడ
చిటిక వేసి నవ్వినపుడు,
మోట బావి వెనక నాతో
మోటసరస మాడినపుడు
కసిరితిట్టినాననీ,
విసిరికొట్టినాననీ,
చిన్నబోకు నలుగురిలో
సిగ్గది మామయ్య.

జానపద గేయాలు - గుత్తొంకాయ్ కూరోయ్,
ముక్కజొన్న తోటలో

## యెంకి పాట

నండూరి వెంకట సుబ్బారావు

యెంకి వొంటిపిల్ల లేదోయ్ లేదోయ్ !
యెంకి నా వొంకింక రాదోయ్ రాదోయ్ !
మెళ్ళో పూసల పేరు
తల్లో పూవులపేరు
కళ్ళెత్తితే సాలు
కనకాబి సేకాలు !
యెంకి వొంటిపిల్ల లేదోయ్ లేదోయ్ !
యెంకి నా వొం కింక రాదోయ్ రాదోయ్!
సెక్కిట సిన్నీ మచ్చ
సాపితే సాలదు లచ్చ !
వొక్కనవ్వే యేలు
వొజ్జిరవొయిడూరాలు :
యెంకివొంటి పిల్ల లేదోయ్ లేదోయ్ !
యెంకి నా వొంకిక రాదోయ్ రాదోయ్ !
పదమూ పాడిందంటె పాపాలు పోవాల !
కతలూ సెప్పిందంటె
కలకాల ముండాల !
యెంకివొంటి పిల్ల లేదోయ్ లేదోయ్ !
యెంకి నా వొంకింక రాదోయ్ రాదోయ్ !
తోటంతా సీకట్లె
దొడ్డీ సీకటి మయమె
కూటీ కెళితే గుండె
గుబగుబమంటా బయిమె !
యెంకి వొంటి పిల్ల లేదోయ్ లేదోయ్!
యెంకి నా వొంకింక రాదోయ్ రాదోయ్ !
రాసోరింటికైన
రంగుతెచ్చే పిల్ల !
నా సొమ్ము నా గుండె
నమిలి మింగిన పిల్ల
యెంకివొంటి పిల్ల లేదోయ్ లేదోయ్ !
యెంకి నా వొంకింక రాదోయ్ రాదోయ్!

---

## చల్ మోహనరంగా...

నీకు నీవారు లేరు నాకూ నా వారు లేరు
ఏటి ఒడ్డున ఇల్లు కడదము పదరా
చల్ మోహనరంగా
నీకు నాకు జోడు కలసెను గదరా
మల్లీ తోటలోన మంచినీళ్ళ బావికాడ
ఉంగరాలు మరచి వస్తిని కదరా
చల్।
కంటీకి కాటుకెట్టీ కడవా సంకాన బెట్టి
కంటి నీరు కడవ నింపితి గదరా
చల్॥
గట్టుదాటి పుట్టదాటి
ఘనమైన అడవిదాటి
అన్నిదాటి అడవి బడితిమి గదం.
।చల్॥
నీకు నాకు జోడు అయితే
మల్లె పూలా తెప్పగట్టీ
తెప్పమీద తేలిపోదము పదరా
చల్॥
అదిరా నీ గుండెలదరా
మధురా వెన్నెల రేయి
నిదరాకు రమ్మంటిని కదరా చల్।

## మంగళహారతులు

ఘల్లు ఘల్లున పాద
గజ్జె లందెలు మ్రోయ
కలహంస నడకల
కలికి ఎక్కడికే

జడ లోన గంగను
ధరియించు కొన్నట్టి
జగము లేలే జగ
దీశు సన్నిధికే మంగళం

బొడ్డుమల్లెల జాజి
దండలు మెడ నిండ
అంద మెరిగిన జగ
దంబా ఎక్కడకే

అందము విభూతి
అలరు శ్రీ గంధము
నలదిన నీల
కంఠేశు సన్నిధికే ।మం।

తళ తళ మను రత్న
తాటంకములు మెరయ
పసిడి మండలముల
పణతి ఎక్కడికే ॥మం।

కలియుగ జన్మము
గల శివుడై నట్టి
గురువైన శంభు
శంకరుని సన్నిధికే॥మం।

హెచ్చు పాపట బొట్టు
రత్న కిరీటమ్ము
ఏమమ్మ కరుణ
కటాక్షి ఎక్క డికే

కడుపెద్ద రుద్రాక్ష
మెడలో హారము దాల్చి
నందినెక్కెడు జగ
దీశు సన్నిధికే ॥మం॥

చెంగావి చీరలు
కొంగులు చెంగున
జారంగ
రంగైన నవమోహ
నాంగీ ఎక్కడికే ?

చంద్రుని శిరసున
ధరియించు కొన్నట్టి
మండల మేలే
నందీశు సన్నిధికే ।మం॥

సన్నంపు నడుముపై
బిళ్లల ఒడ్డాణము
మెరిసేటి బంగారు
బొమ్మా ఎక్కడికే ?

కన్నులు మూడు
భుజంబు లారు
గల అర్ధనారీశు
శివుని సన్నిధికే ।మం॥

---

### హారతి గైకొనుమా

హారతి గైకొనుమా శ్రీరామచంద్ర
॥హారతి।

కర్పూర హారతి కరుణతో గైకొను
కనికర ముంచుమా కౌసల్య తనయా
హారతి।

మంగళ హారతి మహిమతొ గైకొని
మరిమరి మమ్ముబ్రోవ దశరథ తనయా హారతి।

### కోరిన హారతులు

కోరిన హారతుల్ గోవిందునకు
కోమలాంగులు గూడివ్వరే ॥
పద్మనాభునికి పాటలు పాడిన
పాపము లన్నియు తొలగునుగా ।
గోకులమందున గోవర్ధనంబెత్తి
కాచి రక్షించిన శ్రీకాంతునకు ॥

### కర్పూర హారతుల్

కర్పూర హారతుల్ కరుణతో గైకొను
కమల నాభున కివ్వరే ॥
ఖగ వాహనుండె కాళింగి మర్దనుండె
కంస సంహారుడె శౌరీ ॥
శ్రీరమానాయక కోరిభజించెద
నేరము లెంచకు శౌరీ ॥
పంకజలోచన సామజవరద
సన్మోహ హృదయ శౌరీ ॥

# జోలపాటలు - లాలిపాటలు

## జోవచ్యు తానంద

జోవచ్యు తానంద జోజో ముకుంద
రావె పరమానంద రామ గోవింద
నందు నింటను జేరి నయము మీఱంగ
చంద్రవదనలు నీకు సేవ చేయంగ
నందముగ వారిండ్ల నాడుచుండంగ
మందలకు దొంగ మాముద్దురంగ. ।జోవ।

పాలవారాశిలో పవళించినావు.
బాలుగా మునుల కభయమిచ్చినావు
మేలుగా వసుదేవు కుదయించినావు
బాలుడై యుండి గోపాలుడైనావు.। జోవ।

అట్టుగట్టిన మీగ డట్టె తిన్నాడే
పట్టి కోడలు మూతిపై రాసినాడే
అట్టె తినెనని యత్త యడుగ విన్నాడే
గట్టిగా నిది దొంగ కొట్టుమన్నాడే జోవ

గొల్ల వారిండ్లకు గొబ్బునకుబోయి
కొల్లలుగా త్రావి కుండలనునేయి
చెల్లునా మగనాండ్ర జెలిగి యీశాయీ
చిల్లతనములు సేయ జెల్లునటవోయి । జోవ।

రేపల్లె సతులెల్ల గోపంబుతోను
గోపమ్మ మీ కొడుకు మా యిండ్ల లోను
మాపుగానే వచ్చి మామానములను
నీ పాపడే చెఱిచె నేమందుమమ్మ

ఒకని యాలినిదెచ్చి నొకని కడబెట్టి
జగడములు గలిపించి సతిపతులబట్టి
పగలు నలుజాములును బాలుడై నట్టి
మగనాండ్ర జేపట్టి మదనుడై నట్టి । జోవ।

అంగజుని గన్న మా యన్న యిటు రారా
బంగారు గిన్నెలో బాలు పోసెరా
దొంగ నీవని సతులు పొంగుచున్నారా
ముంగిట నాడరా మోహనాకార జోవ।

గోవర్ధనంబెల్ల గొడుగుగాబట్టి
కావరమ్మునమన్న కంసుబడగొట్టి
నీవు మధురాపురము నేలజేపట్టి
రీవితో నేలిన దేవకీపట్టి జోవ॥

అంగుగా దాళ్ళపా కన్నయ్యె చాల
శృంగార రచనగా జెప్పెనీ జోల
సంగతిగ సకల సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదనగోపాల । జోవ

## లాలి లాలమ్మా లాలి

లాలి లాలమ్మ లాలీ
లాలమ్మా లాలీ లాలమ్మా లాలీ
లాలమ్మా గుర్రాలూ
లంకల్లో మేసే - లంకల్లో మేసే
బుల్లెమ్మా గుర్రాలూ
బీడుల్లో మేసే - బీడుల్లో మేసే
అప్పన్న గుర్రాలూ
అడవుల్లో మేసే - అడవుల్లో మేసే
ఊరుకో అబ్బాయి - వెర్రి అబ్బాయి
ఉగ్గెట్టా మీయమ్మా
ఊరు కెళ్ళింది - ఊరు కెళ్ళింది
పాలిచ్చా మీయమ్మా
పట్నా మెళ్ళిందీ - పట్నా మెళ్ళిందీ
నీరోసే మీ యమ్మ-నీళ్ళకెళ్ళింది
నీళ్ళకెళ్ళిందీ లాలి

## ఊడిద చెట్లాకు ఉయ్యాల

ఊడిద చెట్లాకు ఉయ్యాల గట్టి
ఊపమని మీ అమ్మ ఊరు తిరిగొచ్చా ఒళ్ళో
పాలకు ఏడ్చేవు పట్టెద గిన్నె
పారిపో ఎల్లమ్మ పారిపోవమ్మ ఒళ్ళో
బుజ్జెమ్మ మామల్లు పాలమెల్లి తోలింద్రు
జోలల్లు పాడంగ జొన్నల్లు పండు ఒళ్ళో
దత్త పుత్తడి బొమ్మ తలనిండ జడలు
మామల్ల సంకాన ఆడు లచ్చమ్మ ఒళ్ళో
పల్లేరు గాయల్లు పతుపుల్లో పరచి
పండమని మీయమ్మ పల్లె తిరిగొచ్చు ఒళ్ళో



అంగటిలో అన్నీఉన్నాయి అల్లునినోట్లో శని.
అంత్య నిష్ఠూరం కన్నా ఆది నిష్ఠూరం మేలు.
అందని పండ్లకు అర్రులు చాచినట్లు.
అందరికీ నేను లోకువ నాకు నంబి లోకువ.
అందరిదీ ఒకదారి ఉలిపి కట్టెదొక దారి!
అందితే సిగ అందకపోతే కాళ్ళు.
అంధునకు అద్దం చూపినట్లు.
అంబలి తాగేవాడికి మీసాలు ఎత్తే వాడొకడు.
అగడ్తలో పిల్లికి అదే వైకుంఠం.
అగ్గిమీద గుగ్గిలం!
అగ్నికి వాయువు తోడైనట్లు.
అగ్నిలో మిడత పడినట్లు.
అగ్నిహోత్రంలో ఆజ్యం పోసినట్లు.
అడవిలో కాచిన వెన్నెల ముదిమిని చేసిన పెళ్లి.
అడిగితే గాని అమ్మయినా బువ్వ పెట్టదు.
అడిగే వాడికి చెప్పేవాడు లోకువ.
అద్దాలనాటి బిడ్డగాని గడ్డాల నాటి బిడ్డ గాదు!
అతని కంటె ఘనుడు ఆచంట మల్లన్న.
అతిరహస్యం బట్టబయలు.
అదిగో అంటే ఆరు నెలలు.
అదిగో తోక అంటే ఇదిగో పులి.
అద్దం అబద్ధం ఆడుతుందా !
అద్దెకు వచ్చిన గుర్రం అగడ్త దాటుతుందా!
అద్దం మీద ఆవగింజ.
అనుమానం పెనుభూతం.
అన్నపు చొరవే గాని అక్షరం చొరవలేదు.
అన్నీ వేసిచూడు నన్ను వేయకుండాచూడు
అన్నదట ఉప్పు.
అప్పుచేసి పప్పుకూడు.
అప్పులేని వాడే అధిక సంపన్నుడు.

అమ్మబోతే అడవి కొనబోతే కొరివి.
అయిన వారికి ఆకుల్లోను
కానివారికి కంచాల్లోను.
అయ్యవారిని చేయబోతే కోతి అయింది.
అరఘడియ భోగం ఆర్నెల్ల రోగం.
అరచేతిలో వైకుంఠం.
అరటిపండు ఒలచి చేతిలో పెట్టినట్లు.
అసలే కోతి, దానికి తేలు కుట్టింది, కల్లు
తాగింది, ఇక వికారచేష్టలు చేస్తుంది.
ఆకలి ఆకలి అత్తగారూ అంటే, రోకలి మింగే
కోడలా అన్నదట!.
ఆకలి రుచి ఎరుగదు; నిద్రసుఖం ఎరుగదు.
ఆకాశానికి నిచ్చెన వేయుట.
ఆలూలేదు చూలూలేదు కొడుకు పేరు
సోమలింగం!
ఆడబోయిన తీర్థమెదురైనట్టు.
ఆడలేనమ్మ మద్దెల ఓడు అన్నదట!
ఆత్రగానికి బుద్ధి మట్టు.
ఆదిలోనే హంసపాదు.
ఆయాసం ఒకరిది అనుభవం మరొకరిది.
ఆరునెలలు సహవాసం చేస్తే వారు వీరవుతారు.
ఆవగింజంత సందుంటే అరవయి గారెలు
అప్పుడే తినేవాడిని గదా!
ఆశకు అంతు లేదు.
ఇంగువ కట్టిన గుడ్డ.
ఇంట గెలిచి రచ్చ గెలువు.
ఇంటి కన్న గుడి పదిలం.
ఇంటికళ ఇల్లాలే చెబుతుంది.
ఇంటి చక్కదనం ఇల్లాలే చెబుతుంది.
ఇంటి దొంగను ఈశ్వరుడయినా పట్టలేదు.

**ఇంటి** పిల్లికి పొరుగు పిల్లి తోడు.
**ఇంటిపేరు** కస్తూరి ఇంటిలో గబ్బిలాల కంపు.
**ఇంటిలో** ఈగలమోత బయట పల్లకీమోత.
**ఇంటిలో** తిని ఇంటి వాసాలు లెక్కపెట్టినట్లు.
**ఇల్లు** అలకగానే పండుగగునా
**ఇల్లు** ఇరకటం ఆలు మర్కటం.
**ఇల్లు** కట్టి చూడు పెళ్ళిచేసి చూడు!
**ఇసుక** తక్కెడ పేడ తక్కెడ.
**ఈతకాయతో** తాటికాయ.
**ఈన** గాచి నక్కల పాలు చేసినట్లు.
**ఈవూరి** కావూరెంత దూరమో,
ఆవూరికి ఈవూరూ అంతే దూరం.
**ఉట్టికట్టుకు** ఊరేగుతారా!
**ఉట్టి** కెక్కలేనమ్మ స్వర్గానికెక్కుద్దా!
**ఉడుతకు** ఉడుతాభక్తి.
**ఉడుతకేలరా** ఊళ్లోపెత్తనం.
**ఉన్నమాటంటే** ఉలుకెక్కువ.
**ఉపకారానికిపోతే** అపకారం ఎదురైనట్లు.
**ఉయ్యాలలో** బిడ్డగానరాక ఊరంతా
వెదికినట్టయినది.
**ఊరంతా** చుట్టాలు ఉట్టికట్ట తావులేదు.
**ఉలిదెబ్బ** తిన్న శిలే శిల్పం అవుతుంది.
**ఎంచబోతే** మంచమంతా కంతలే.
**ఎంచిన** ఎరువేదీ అంటే యజమాని పాదమే.
**ఎంత** చెట్టుకు అంత గాలి.
**ఎంతవారలయినా** కాంతదాసులే.
**ఎందుకురా** ఒగర్పు అంటే ఎల్లుండి సంతకు
పోవాలిగదా! అన్నాడట.
**ఎక్కడయినా** బావగాని వంగతోటకాడ
మాత్రం కాదు..
**ఎక్కడున్నావే** కంబలీ అంటే వేసిన చోటనే
ఉన్నా వెంగళీ అన్నదట!

**ఎగదీసిన** బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య.
**ఎద్దును** అడిగా గంత కట్టేది?
**ఎద్దు** పుండు కాకికి రుచి.
**ఎరను** చూపి చేపను లాగినట్టు.
**ఎవరి** బిడ్డరా ఎక్కెక్కి ఏడుస్తుంది?
**ఎవరికి** వారే యమునా తీరే.
**ఎవరి** వెర్రి వారికి ఆనందం.
**ఏ** ఎండకా గొడుగు. ఏ గాలికి ఆ చాప.
**ఏకు** అయివచ్చి మేకు అయిన తీరు.
**ఏకులు** పెడితే బుట్ట చినుగుతుందా!
**ఏ** గూటి చిలుక ఆగూటి పలుకు పలుకుతుంది.
**ఏ** పుట్టలో ఏ పాముందో!
**ఏమీ** లేని విస్తరి ఎగిరెగిరి పడుతుంది,
అన్నీ ఉన్న విస్తరి అణిగిమణిగి ఉంటుంది.
**ఏరుదాటిన** తర్వాత తెప్ప తగలేసినట్టు.
**ఋణ** శేషం, వ్రణ శేషం, శత్రు శేషం
ఉంచరాదు.
**ఒక** ఒరలో రెండు కత్తులు ఇమడవు గదా!
**ఒక** చెయ్యి తట్టితే చప్పుడవుతాదా!
**ఒకపూట** తినేవాడు యోగి, రెండు పూటలు
తినేవాడు భోగి, మూడు పూటలు
తినేవాడు రోగి.
**ఒకే** దెబ్బకు రెండు పిట్టలు.
**కంచం** అమ్మి మట్టెలు కొన్నట్టు.
**కంచే** చేను మేస్తే ఏలాగు!.
**కందకు** లేని దురద బచ్చలి కెందుకు?
**కక్కువచ్చినా** కళ్యాణ గడియ వచ్చినా ఆగవు.
**కట్టె** వంక పొయ్యి తీరుస్తుంది.
**కడవంత** గుమ్మడికాయ కత్తిపీటకు లోకువ.
**కడుపు** కూటికి ఏడిస్తే కొప్పు పూలకి ఏడ్చిందట.
**కత్తి** మీద సాము.
**కన్ను** ఉండగా పాప తీయుట.

కయ్యానికయినా వియ్యానికయినా సమవుజ్జీ ఉండాలి
కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం.
కలిమిలేములు కావడి కుండలు.
కాకి బిడ్డ కాకికి ముద్దు గదా!
కాకి ముక్కుకు దొండపండు.
కాకి గూటిలో కోయిల పిల్ల వలె.
కాగలకార్యం గంధర్వులే తీర్చారు.
కాచే చెట్టుకే రాళ్ళ దెబ్బలు.
కానున్నది కాక మానదు.
కార్యం అయ్యే దాకా గాడిద కాళ్ళైనా పట్టాలి.
కాలికి వేస్తే మెడకు, మెడకు వేస్తే కాలికి.
కాలుజారినా తీసుకోగలం కాని, నోరు జారితే మాత్రం తీసుకోలేం గదా!
కాశీకి పోయినా కర్మ తప్పదు.
కాశీకి వెళ్ళి గాడిద గుడ్డును తీసుకువచ్చినట్టు.
కాసుంటే మార్గం ఉంటుంది.
కీలెరిగి వాత పెట్టినట్టు.
కుక్క కాటుకు చెప్పు దెబ్బ.
కుక్క తోక పట్టుకొని గోదారీదినట్టు.
కూటికి పేదయితే గుణానికి పేదా?
కూర ఎంతైనా కూడు కాదు.
కూసేగాడిద వచ్చి మేసేగాడిదను చెరచినట్టు.
కొంగు తడిస్తే చలిగాని కోకంతా తడిస్తే చలి ఏమిటి?
కొండంత తెలివి కంటె గోరంత కలిమి మేలు!
కొండ నాలుకకి మందువేస్తే ఉన్న నాలుక ఊడింది.
కొండను తవ్వి ఎలుకను పట్టినట్టు.
కొండవీటి చేంతాడు.
కొంపలంటుకున్న తరువాత నుయ్యి తవ్వుట.
కొట్టి కోలాహలం చేసినట్టు.
కొత్త అప్పుకుపోతే పాత అప్పు బయటపడ్డట్టు.
కొత్త బిచ్చగాడు పొద్దెరుగడు.
కొన్నది వంకాయ కొసిరింది గుమ్మడి.
కొబ్బరి చెట్టు ఎందుకు ఎక్కావంటే, దూడ గడ్డికోసం అన్నట్టు.
కొరివితో తల గోక్కున్నట్టు.
కోటి విద్యలు కూటి కొరకే.
కోడలికి బుద్ధి చెప్పి అత్త తప్పు చేయుట
కోతికి కొబ్బరికాయ దొరికినట్టు.
కోతి పుండు బ్రహ్మ రాక్షసి
క్షేత్రమెరిగి విత్తనం, పాత్ర మెరిగి దానం.
గతిలేనమ్మకు గంజియే పానకం.
గాజుల బేరం బువ్వకు సరి.
గుండ్రాయిదాస్తే పెళ్లి ఆగిపోతుందా!
గుడినీ గుడిలో లింగాన్నీ మింగేసేవాడు.
గుడ్డి కన్నా మెల్ల మేలు.
గుడ్డి ఎద్దు చేనులో పడ్డట్టు.
గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్టు.
గుమ్మడికాయల దొంగ అంటే భుజాలు తడుముకున్నట్టు.
గురివింద తన ముడ్డి కింద నలుపు తానెరుగదు గదా!
గురువుకు పంగనామాలు.
గుర్రం గుడ్డిదైనా దాణా తప్పదు.
గోచీకి పెద్దది అంగవస్త్రానికి చిన్నది.
గోటితో పొయ్యేది గొడ్డలితో నరక వలసి వచ్చింది.
గోడలకు చెవులుంటాయి.
గోరంత దీపం కొండంత వెలుగు.
గోరు చుట్టుమీద రోకటిపోటు.
చంద్రునికో నూలుపోగు.
చక్కనమ్మ చిక్కినా అందమే!

చచ్చిన వాని కళ్ళు చారెడు.
చచ్చిన వాని పెళ్ళికి వచ్చిందే కట్నం.
చదవేస్తే ఉన్న మతి పోయింది.
చాపకింద నీరులాగా!
చింత చచ్చినా పులుపు చావదు.
చిత్తం శివుడి మీద భక్తి చెప్పుల మీద.
చీకటి కొన్నాళ్ళు, వెన్నెల కొన్నాళ్ళు!
చెవిటి వానివద్ద శంఖం ఊదినట్టు.
చెట్టుముందా విత్తు ముందా అన్నట్టు!
చేతిలోది లేత చేలోది ముదర.
చేసుకున్న వారికి చేసుకొన్నంత మహాదేవ!
జుట్టంటూ ఉంటే ఎలాంటి కొప్పు
అయినా పెట్టవచ్చు.
జోగీయోగీ రాచుకుంటే బూడిద రాలుతుంది.
డబ్బులేని వాడే ముందు పడవెక్కేది!
తగిలిన కాలికే తగులు రీతి.
తడిగుడ్డతో గొంతు కోయుట.
తనదాకవస్తేగాని తలనొప్పి బాధ తెలీదు!
తన దీపమని ముద్దు పెట్టుకొన్నట్టు.
తన్నితే బూరెల గంపలో పడ్డట్టు.
తన్నుమాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం.
తల తాకట్టు పెట్టుట.
తలపాగా చుట్టడం రాక తల వంకరన్నట్టు.
తల ప్రాణం తోకకు వచ్చుట.
తల్లికి కూడు పెట్టని వాడు,
పిన తల్లికి చీరపెట్టాడట!
తాచెడ్డ కోతి వనమెల్ల చెరచినట్లు.
తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరవు.
తాటి చెట్టు కింద పాలు తాగినట్టు.
తాడిని తన్నువాడిని తలదన్నే వాడుంటాడు.
తాతకు దగ్గులు నేర్పనగునా!
తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు.
తాను వలచింది రంభ, మునిగింది గంగ.
తానొకటి తలిస్తే దైవమొకటి తలచును.
తినబోతూ రుచి అడగనేల!
తిలా పాపం తలో పిడికెడు.
తీగ లాగితే డొంకంతా కదిలినట్లు.
తులసి వనంలో గంజాయి మొక్క.
తెగించిన వానికి తెడ్డేలింగం.
దంచినమ్మకు బొక్కిందే దక్కుడు.
దిన దిన గండం నూరేళ్ల ఆయుస్సు.
దీపముండగనే ఇల్లు చక్కబెట్టుకోవలె.
దున్నపోతు ఈనిందంటే దూడను
కట్టమన్నట్టు.
దురాశ దుఃఖానికి చేటు.
దూరపు కొండలు నునుపు.
దేవుడు వరమిచ్చినను పూజారి
వర మీయడుగదా!
దొంగకు తేలుకుట్టినట్టు.
దొంగకు దొంగ బుద్ధి, దొరకు దొర బుద్ధి.
దొంగ చేతికి తాళం ఇచ్చినట్టు.
నడమంత్రపు సిరి వస్తే అర్ధరాత్రి గొడుగు
పట్టమన్నాడట.
నారు పోసినవాడే నీరు పోస్తాడు.
నిండుకుండ తొణకదు.
నిజమాడితే నిష్ఠూరం.
నిప్పుముట్టనిదే చెయ్యి కాలదు.
నిప్పు లేనిదే పొగరాదు.
నీరు పల్లమెరుగు నిజం దేవుడెరుగు.
నుదుట రాసి నోట పలికించుట.
నోరు మంచిదయితే ఊరు మంచిదే అగును.
పట్టుచీర ఎరువు ఇచ్చి పీట పట్టుకు తిరిగినట్టు.
పాడిందే పాడరా పాచిపళ్ళ దాసరి.
పాలుపోసి పెంచినా పాముకు విషం పోదు.

పిండి కొద్దీ రొట్టె.
పిచ్చి కుదిరింది తలకి రోకలిచుట్టమన్నట్టు.
పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమా!
పిట్ట కొంచెం కూత ఘనం.
పిడుక్కీ బియ్యానికీ ఒకేమంత్రం.
పిల్ల కాకికేమి తెలుసు ఉండేలు దెబ్బ.
పిల్లికి ఎలుక సాక్ష్యం చెప్పుట.
పిల్లికి చెలగాటం ఎలుకకి ప్రాణ సంకటం.
పుండుమీద కారం జల్లినట్టు.
పులిని చూచి నక్క వాత పెట్టుకొనుట.
పుల్లయ్య వేమవరం వెళ్లినట్టు.
పువ్వు పుట్టగనే పరిమళిస్తుంది.
పూలమ్మిన చోటనే పుల్లలమ్మవలసి రావడం.
పూలవాసన నారకు పట్టినట్టు.
పెదవి దాటితే పెన్న దాటినట్టు.
పెనంలోంచి పొయ్యిలో పడ్డట్టు.
పెరుగుట విరుగుట కొరకే.
పేదవాని కోపం పెదవికి చేటు.
పేనుకు పెత్తనమిస్తే తలంతా తెగ గొరిగిందట!
పోరాని చోటుకు పోరాదు.
పోరునష్టం పొందు లాభం.
బతికి ఉంటే బలుసాకు తిని బతకవచ్చు.
బూడిదలో పోసిన పన్నీరు.
బోడి తలకూ మోకాలుకు ముడి.
భక్తిలేని పూజ పత్రిచేటు.
మంచమున్నంతవరకూ కాళ్ళు చాచుకో!
మంచివానికి మాటే మందు.
మంత్రాలకు చింతకాయలు రాలుతాయా!
మగ్గం చేసిన తప్పు సాలె తీర్చాలి.
మనసుంటే మార్గం ఉంటుంది.
మనిషి కాటుకు మందు లేదు.
మీ ఇంట్లో పాలల్లోకి పంచదార లేకపోడమూ మా ఇంట్లో గంజిలోకి ఉప్పులేక పోవడం ఒకటే!
ముంజేతి కంకణానికి అద్దం దేనికి?
ముందుకు పోతే నుయ్యి వెనక్కి పోతే గొయ్యి.
ముక్కు పిండి వసూలు చేయడం.
మూలిగే నక్క మీద తాటి పండు పడ్డట్టు.
మెరిసేదంతా బంగారం కాదు!
మేఘాన్ని చూచి ఉన్న ముంతెడు నీళ్లూ ఒలక బోసినట్లు!
మొక్కై వంగనిది మానై వంగునా?
మొరుగుతున్న కుక్క కరవదు కదా?
మోసేవానికే తెలుసు బరువు.
రాజు కొట్టగా మొగసాలెకు మొరపెట్టుట.
రాజును చూచిన కళ్ళతో మొగుణ్ణి చూచిన మొట్టబుద్ధి.
రాయిగుద్దనేల చేయి నొవ్వనేల.
రెక్కాడితే గాని డొక్కాడదు.
రొట్టె విరిగి నేతిలో పడ్డట్టు.
రోటిలో తల దూర్చి రోకటి పోటుకు వెరవనేల.
రోలు వచ్చి మద్దెలతో మొరపెట్టినట్టు!
రౌతు కొద్దీ గుర్రం.
లంకమేత గోదారీత.
లావు మీద వంపు తెలియదు.
వడ్లగింజలో బియ్యపు గింజ.
వీపుమీద కొట్టినా ఫరవాలేదు గాని. కడుపుమీద మాత్రం కొట్ట కూడదు.
విరిగే దాని కంటే వంగేదే మేలు.
విస్సన్న చెప్పిందే వేదం!
శంఖంలో పోస్తేనేగాని తీర్థం కాదు.
శివుని ఆజ్ఞలేనిదే చీమయినా కుట్టదు.
సముఖాన రాయబారమేల?
సిరిరా మోకా లొడ్డినట్టు.
సొమ్మొకడిది సోకొకడిది.
స్థానబలిమి గాని తన బలిమి కాదు.
హనుమంతుడి ముందా నీ కుప్పి గంతులు!

## రామాయణము

సుడిగొని రామపాదములు సోకిన ధూళి వహించి రాయి యే
ర్పడ నొక కాంత యయ్యెనట పన్నుగ పాతని పాదరేణువి
య్యెడ వడినోడసోక నిది యేమగునో యని సంశయాత్ముడై
కడిగె గుహుండు రామపదకంజయుగంబు, భయమ్ము పెంపునన్

నీలమేఘచ్ఛాయబోలు దేహమువాడు ధవళాబజపత్రనేత్రములవాడు
కంబు సన్నిభమైన కంఠంబు గలవాడు బాగైనయట్టి గుల్ఫములవాడు
తిన్ననై కనుపట్టు దీర్ఘ బాహువులవాడు ఘనమైన దుందుభి స్వనమువాడు
పద్మరేఖలు గల్గు పదయుగంబులవాడు చక్కని పీనవక్షంబు వాడు
కపట మెరుగని సత్యవాక్యములవాడు రమణి రాముండు శుభలక్షణములవాడు
ఇన్ని గుణముల రూపింప నెసగువాడు వరుస సౌమిత్రి బంగారు వన్నెవాడు

- మొల్ల రామాయణం

## మహాభారతము

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వ లక్ష్యసంగ్రహమని యైతిహాసికు లితిహాస మనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయం బని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వ విదుడు వేదవ్యాసుఁడాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండఁజేసె భారతంబు.

నుతజలపూరితంబు లగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొక బావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొక సూనృత వాక్యము మేలు సూడఁగన్. - నన్నయ

పురుషుండు రెండు దెఱుగుల ధర నుత్తము డనగ బరగు దా నెయ్యెడలం
బరుసములు వలుకకునికిని, దురితంబు వొరయు పనులు దొఱకుట కతనన్.

తను లోకము గొనియాడగ, విని యుబ్బడు సజ్జనుండు, వెండియు గడుమే
లొనరించు, గీఁడొకించుక యును దనదెస దోపనీక యుడుపుచు వచ్చున్.

కటి గాని, రెంటి నిశ్చల యుక్తి జేర్చి, మూటి నాల్గింట గడు వశ్యములుగ జేసి,
మేనిటిని గెల్చి, యాఱిటి నెఱిగి, యేడు విడిచి వర్తించువాడు వివేక ధనుడు.

తగిన వేషంబు, దను దాన పొగడుకొనమి, నొచ్చియును గీడు పలుకమి,
యిచ్చి వగవ కునికి, దన కెంత నడవకయున్న, బథము దప్పకండుట
- నడవడి కొప్పు సేయు.

చెలిమియు, బగయును, దెలివియు, గలుకయు, ధర్మంబు బాపగతియును,
బెంపుందులువతనంబును వచ్చును బలుకుబడిన, కాన పొసగ బలుకగవలయున్.

ఎదిరికి హితమును బ్రియమును మది కింపును గాక బలుకు మాటలు పెక్కై
యొదవినను లెస్స, యటుగా కిది యది యన కూరకునికి యొంతయు నొప్పున్.

ఎఱుక గల వాని చరితలు గఱచుచు సజ్జనులగోష్ఠి గదలక ధర్మం
బెఱుగుచు నెఱిగిన దానిని మఱువ కనిష్ఠించోనది సమంజస బుద్ధిన్

ఒరులేయవి యొనరించిన నరవర అప్రియము తన మనంబున కగుదా
నొరులకు అవి సేయ కునికి పరాయణము పరమ ధర్మపథము కెల్లన్ - తిక్కన

అంబనవాంబు జోజ్జ్వల కరాంబుజ శారద చంద్ర చంద్రికా
డింబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణరత్న దీప్తికా
చుంబిత దిగ్విభాగశ్రుతి శూక్త వివక్త నిజ ప్రభావభం
వాంబరవీధి విశ్రుతవిహారి నలనుంగృపజూడు భారతీ. -- ఎఱ్రన. అరణ్యపర్వం

## మహాభాగవతము

పలికెడిది భాగవతమట పలికించెడివాడు రామభద్రుండట నే
పలికిన భవ హరమగునట పలికెద వేరొండు గాథ పలుకగనేలా.

ఊరకరారు మహాత్ములువారథముల ఇండ్లుకడకు వచ్చుట తెల్లన్
గారణముమేగళములకు నీరాల్ శుభంబు మాకు నిజము మహాత్మా

మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే! మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాలపల్లవ ఖాది యై చొక్కుఁ కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక మరుగునే సాంద్ర నీహారములకు
అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృత పాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు వినుత గుణశీల! మాటలు వేయునేల?

చదువని వాతుజ్ఞుండగు,
చదివిన, సదసద్వివేక చతురత గలుగున్
చదువగవలయును జనులకు
చదివించెదనార్యులొద్ద చదువుము తండ్రీ. – ప్రహ్లాదుడు తన తండ్రితో

పద్మరాగాది రత్న ప్రభాసమాన మహిత కాళియఫణి ఫణామంటపమున నళినలోచనవిఖ్యాత నర్తకుండు నిత్య నైపుణ్యమునఁ బేర్చి నృత్యమాడె.



ఎట్టితపంబు చేసెనొకొ యెట్టిసుకర్మము లాచరించెనో
యెట్టి నిజంబు బల్కెనొకొ యీ ఫణి పూర్వ భవంబునందు ము
న్నెట్టి మహానుభావులకు నెన్నఁడు జేరువ గాని నీవు నేఁ
డిట్టి వినోదలీలఁ దల లెక్కి నటించెద వీ ఫణీంద్రు పై.

| కాళీయమర్దనము |
| --- |
| కాళీయుని భార్యలైన నాగకాంతలు కృష్ణుని స్తోత్రము చేయుట |

కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు శేషశాయికి మ్రొక్కుశిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి
దేవదేవుని జింతించు దినము దినము చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పిడి గురుడుగురుడు దండి హరిజేరుమనియెడి తండ్రి తండ్రి.

లోకము లన్నియున్ గడియలోన జయించినవాడ వింద్రి యా
నీకము జిత్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుజేయు నీ
భీకర శత్రులార్వుర బ్రభిన్నుల జేసిన బ్రాణికోటిలో
నీకు విరోధి లేడొకడు నేర్పున జూడుము దానవేశ్వరా. - ప్రహ్లాదుడు తన తండ్రితో

ఇందు గలఁడందులేడని సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన అందందే గలడు - దానవాగ్రణి! వింటే? -ప్రహ్లాద చరిత్ర

వారిజాక్షులందు వైవాహికములందు - ప్రాణవిత్త మానభంగమందు
జకిత గోకులాగ్ర జన్మరక్షణ మందు - బొంకవచ్చు నఘము పొంద డధిప.

కారే రాజులు రాజ్యముల్ గలుగరే గర్వోన్నతిం బొంధరే
వా రేరీ సిరి మూటగట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బే రైనం గలదే శిబిప్రముఖులం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యి క్కాలమున్ భార్గవా!

ఇంతిం తై వటుఁ డింత యై మరియుఁ దా నింతై నభోవీథిపై
నంతై తోయదఁ మండలాభ్రమున కల్లం తై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంత యై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధి యై.

ఆశాపాశము దా గడు న్నిడుపు లే దంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు చేకూడియుం
గాసిం బొందిరి గాక వైన్య గయ భూకాంతాదులు న్నర్థకా
మాశన్ బాయగనేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే. - వామనావతారము

నల్లని వాడు పద్మనయనంబులవాడు కృపారసంబుపై
జల్లెడు వాడు మౌళి పరిసర్పితపింఛము వాడు నవ్వురా
జిల్లెడు మోము వాడొకడు చెల్వల మానధనంబుదెచ్చెనో
మల్లియలార మీ పొదలమాటున లేడు కదమ్మ చెప్పరే

## చాటువులు

అక్షరంబు వలయు కుక్షిజీవనులకు
అక్షరంబు జిహ్వాకిక్షురసము
అక్షరంబు తన్ను రక్షించు గావున
అక్షరంబు లోక రక్షితంబు.

చదువుమట్టు పడును, సంస్కృతిచెడిపోవు
సంపదలు తొలంగు, సౌఖ్యముడుగు,
గౌరవంబు వోవు, గావున సోమరి
తనము కన్న హీన గుణము గలదె?

వాక్కుకున్న పదును వాడి కత్తికి లేదు
మార్చగలదు మాట మనిషి మనసు
జారవలదు నోరు జాగ్రత్త జాగ్రత్త
శబ్దములకు గొప్ప శక్తి కలదు బాల!

వంకాయ వంటి కూరయు
పంకజముఖి సీత వంటి భామామణియున్
శంకరుని వంటి దైవము
లంకాధిపువైరి వంటి రాజును గలడే?

ఆడినమాట తప్పిన
గాడిదకొడుకంచు దిట్టగా వినిఁఅయ్యో
వీడా నా కొక కొడుకని
గాడిదయేడ్చెం గదన్న ఘన సంపన్నా!

రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటు గొల్వఁబ్రాల్పడి రకటా!
సంజయ! ఏమని చెప్పుదుఁ
గుంజర యూధంబు దోమకుత్తుక జొచ్చెన్

సతియే పతి సుఖదాయిని
సతియే పతి తోడునీడ - సంభావింపన్
సతియే పతి సర్వస్వము
సతిని సదా సాకవలెను సదయత బాలా!

సెనగపిండి ఉల్లిపాయచిన్నమిర్చకాయలున్
చౌనిపి అందు అల్ల మింత చౌనిపి ముద్ద చేసియున్
అనల తప్తమైన నేతియందు వైచి వేచినన్
చను పకోడి అనెడి పేర చక్కనైన ఖాద్యమై

భరతఖండంబు చక్కని పాడియావు -
హిందువులు లేగదూడలై ఏడ్చుచుండ
తెల్లవారలను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియబట్టి

తెలుఁగ దేలయన్న దేశంబు తెలుఁగేను
తెలుగు వల్లభుండ దెలుగొ కండ
యెల్లనృపులు గొల్వ నెఱుఁగవే బాసాడి
దేశ భాషలందు దెలుగు లెస్స

వాసన లేని పువ్వు, బుధవర్గము లేని పురంబు, భక్తి వి
శ్వాసము లేని భార్య, గుణవంతుడు గాని కుమారుడున్, సద
భ్యాసము లేని విద్య, పరిహాస ప్రసంగము లేని వాక్యమున్,
గ్రాసము లేని కొల్వు గొఱగానివి పెమ్మయ సింగధీమణి!

చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళు - నాగులేటినీళ్ళు నాపరాళ్ళు
సజ్జజొన్న కూళ్ళు సర్పంబులును దేళ్ళు - పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు

జొన్నకలి జొన్నయంబలి - జొన్నన్నము జొన్న పిసరు జొన్నలుతప్పన్
సన్నన్నము సున్నసుమీ - పన్నుగ బలనాటి సీమప్రజలందరకున్

సిరిగలవానికి జెల్లును - తరుణులు బదియారువేల దగబెండ్లాడన్
తిరిపమున కిద్ద రాండ్రా - పరమేశా! గంగవిడుము పార్వతి చాలున్.

## ఆధునిక భావ తరంగాలు

- ఖలీల్ జిబ్రాన్

### - పిల్లలు, సంధించిన బాణాలు

మీ పిల్లలు
మీ పిల్లలు కారు
వాళ్ళు జీవితేచ్ఛకు జన్మించిన వాళ్ళు.
వాళ్ళు మీ ద్వారా వచ్చారు తప్ప
మీ నుండి కాదు,
వాళ్ళు మీతో వున్నా మీకు చెందరు
వాళ్ళకు మీరు మీ ప్రేమని
పంచగలరేమోగాని
మీ ఆలోచనల్ని మాత్రం పంచలేరు;
వాళ్ళకు సొంత ఆలోచనలే వుంటాయి
కాబట్టి,
మీరు
వాళ్ళ శరీరాలకు తప్ప
ఆత్మలకు ఆశ్రయాన్నివ్వ లేరు
వాళ్ళ ఆత్మల ఆశ్రయం 'రేపు' అనే
విశాల గృహంలోనే.
మీరు కనీసం కలగనలేని అద్భుతం అది.
మీరు వాళ్ళల్లా ఉండడానికి ప్రయత్నిస్తే
ప్రయత్నించారు గాక,
వాళ్ళు మీలా వుండాలని మాత్రం మీరు
అనుకోకండి !
ఎందుకంటారా?
జీవితం వెనక్కి వెళ్ళదు కనుకా
నిన్నటితో మళ్ళీ అతుక్కుపోదు కనుకా.
మీరు
పిల్లలనే బాణాల్ని సంధించిన విల్లులు.
విలుకాడు అనంతంలోకి గురి చూసి
వీలైనంత వేగానికీ, దూరానికీ
వొదిలిన బాణాలు మీ పిల్లలు
బాణం సంధించడమే ఆనందం,
ఆ ఆనందానికే మీరు లొంగిపొండి!
వేగంగా పోయే
బాణాన్ని అతనెంత ప్రేమిస్తాడో,
అక్కర కొచ్చిన వింటిని కూడా
అంతే ప్రేమిస్తాడు మరి !

## ఎక్కడ మనస్సు నిర్భయంగా వుంటుందో

- రవీంద్రనాథ్ టాగూర్

ఎక్కడ మనస్సు
నిర్భయంగా ఉంటుందో
ఎక్కడ మానవుడు సగర్వంగా
తలెత్తుకు తిరుగుతాడో
ఎక్కడ విజ్ఞానం స్వేచ్ఛగా మనగలదో
ఎక్కడ ప్రపంచం ముక్కలు ముక్కలై
ఇరుకైన గోడల మధ్య మగ్గిపోదో
ఎక్కడ పరిశుద్ధ జ్ఞానవాహిని
మతాంధ విశ్వాసపు ఎడారిలో ఇంకిపోదో
ఆలోచనలు, ఆచరణలో
నిత్యం విశాల పథాలవైపు
ఎక్కడ మనస్సు పయనిస్తుందో
ఆ స్వేచ్ఛా స్వర్గం వైపు తండ్రీ
నన్నూ నా ప్రజలను నడిపించు!

*"వేర్ ద మైండ్ ఈజ్ విదౌట్ ఫియర్"*
*- 'గీతాంజలి 'నుంచి.*

మరో ప్రపంచం,
మరో ప్రపంచం,
మరో ప్రపంచం పిలిచింది!
పదండి ముందుకు,
పదండి త్రోసుకు పోదాం, పోదాం పైపైకి

కదం త్రొక్కుతూ,
పదం పాడుతూ,
హృదంత రాళం గర్జిస్తూ -
పదండి పోదాం,
వినబడలేదా
మరో ప్రపంచపు జలపాతం?

దారి పొడుగునా గుండె నెత్తురులు
తర్పణచేస్తూ పదండి ముందుకు!
బాటలు నడచీ,
పేటలు కడచీ,
కోట లన్నిటిని దాటండి!
నదీ నదాలూ,
అడవులు, కొండలు,
ఎడారులా మన కడ్డంకి?
పదండి ముందుకు!
పదండి త్రోసుకు!
పోదాం, పోదాం, పైపైకి!
ఎముకలు క్రుళ్ళిన,
వయస్సు మళ్ళిన
సోమరులారా! చావండి!
నెత్తురు మండే శక్తులు నిండే
సైనికులారా రారండి
"హరోం! హరోం హర!
హర!హర!హర!హర
హరోం హరా!" అని కదలండి!
మరో ప్రపంచం మహాప్రపంచం
ధరిత్రినిండా నిండింది!

పదండి ముందుకు!
పదండి త్రోసుకు!
ప్రభంజనంవలె హోరెత్తండీ!
భావ వేగమున ప్రసరించండీ!
వర్షుకాభ్రముల ప్రళయ ఘోషవలె
పెళ పెళ పెళ పెళ విరుచుకు పడండి!
పదండి,

పదండి,

పదండి ముందుకు!
కనబడ లేదా మరో ప్రపంచపు
కణకణమండే త్రేతాగ్ని!
ఎగిరి, ఎగిరి, ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు!
తిరిగి, తిరిగి, తిరిగి, సముద్రాల్
జలప్రళయ నాట్యం చేస్తున్నవి!
సలసల క్రాగే చమురా? కాదది,

ఉష్ణ రక్తకాసారం!
శివసముద్రమూ
నయాగరావలె
ఉరకండీ, ఉరకండీ ముందుకు!
పదండి ముందుకు!
పదండి త్రోసుకు!

మరో ప్రపంచపు కంచు నగారా
విరామ మెరుగక మ్రోగింది!

త్రాచులవలెనూ,
రేచులవలెనూ,
ధనంజయునిలా సాగండి!
కనబడ లేదా మరో ప్రపంచపు
అగ్ని కిరీటపు ధగధగలు,
ఎర్రబావుటా నిగనిగలు,
హోమజ్వాలల భుగభుగలు?

# విజ్ఞాన పీఠం

## విషయసూచి

# శాస్త్రం - విజ్ఞానం : సైన్సు

'సైన్సు' అన్న ఇంగ్లీషు పదానికి సమానార్థకంగా తెలుగులో శాస్త్రం-విజ్ఞానం అనే పదాలు వాడుకలోనికి వచ్చాయి. కాగా సైన్సు అంటే జ్ఞానాన్వేషణ అన్న అర్థం కూడ చెప్పుకోవచ్చు. జీవం-దానికి మూలమయిన ఆధారం గురించి తెలుసుకోవడానికి చేసే ప్రయత్నం కూడ 'సైన్సు' పరిధిలోకి వస్తుంది. పరిశీలన వలన, కొలతలు కొలవడం వలన, పరిశీలించగా లభ్యమైన ఫలితాల్ని బేరీజు వేసుకుని **ఏమిటి? ఎందుకు ? ఏలాగు?** అని ప్రశ్నించు కుంటూ పోతే ఇటు గంభీర మహాసముద్రాల రహస్యాలు, అటు రోదసీ కుహర రహస్యాలు బయట పడడానికి అవకాశం ఉంది.



విశ్వానికి సంబంధించిన భౌతికస్వరూపం అర్థం చేసు కోవడానికి 'సైన్సు' పరిశోధనలు బాగా ప్రయోజన పడతాయి. ఇదిగాక ఈనాడు ఇంజనీరింగు, టెక్నాలజీ అన్న పదాలు కూడ విరివిగా వ్యవహారంలో ఉన్నాయి. ఇంజనీరింగు అంటే సైన్సు ఫలితాల్ని వినియోగించి మానవునికి ప్రయోజన పడేటట్టుగా చేసుకునే విద్య. సైన్సు - ఇంజనీరింగు సూత్రాల్ని ఎక్కువ మంది ప్రజకు అందుబాటులోకి తెచ్చి ఆర్థికంగా లాయఖీ అయిన విధానాల్ని టెక్నాలజీ తెలుపుతుంది. మానవ పరిణామ క్రమంలో 'సైన్సు'కు ఎప్పుడో నాంది పలకడం జరిగింది. అది 'అగ్ని' ఉపయోగం తెలుసు కున్ననాడు, మొదటి సారిగా **'చక్రం'** ఉపయోగించిననాడు జరిగిందన వచ్చు. అయితే అప్పుడు వ్రాయడం - చదవడం' అనే విషయాలు మనిషికి తెలియవు. భాష అప్పట్కి కింకా పుట్ట లేదు. లిపి ప్రస్తావనే లేదు. పై కప్పు చదునుగా ఉన్న దాని కంటె వాలుగా ఉంటే వర్షపు నీరు జారి పోతుందన్న విషయ పరిజ్ఞానం తెలుసుకొన్న ఆదిమానవుడే పెద్ద విజ్ఞాని అని చెప్పవచ్చు!

### ఆహార సేకరణకై

అంతకు ముందు దేశదిమ్మరులుగా తిరుగాడే మానవుడు స్థిరంగా ఒకచోట జనవాసాలు ఏర్పరచుకున్ననాడే 'సైన్సు' అంటే విజ్ఞానం ఉరకులు పరుగులు మీద దౌడు తీయడం మొదలు పెట్టిందని చెప్పవచ్చు. సుమారు ఐదువేల ఏళ్లక్రితం ప్రాచీన బాబిలోనియావాసులు గణితం నేర్చుకుని

# ఆధునిక వైజ్ఞానిక శాస్త్ర ప్రగతి- ప్రముఖ ఘట్టాలు

క్రీ.పూ

400 హిపోక్రేట్స్ మానవ శరీరానికి దాపురించే వ్యాధులు ప్రకృతి సిద్ధమైనవేగాని ప్రారబ్దకర్మ-దైవీకంగా వచ్చేవి కావని వక్కాణించాడు.

330 అరిస్టాటిల్ తార్కిక శాస్త్రాధ్యయనం, వర్గీకరణ, ఆధునిక విజ్ఞాన శాస్త్రానికి పునాది.

300 యూక్లిడ్ జ్యామితిసూత్రాలను ప్రవచించాడు.

200 ఆర్కిమెడీజ్ ప్రయోగాలను చేసి భౌతిక సూత్రాలను ఆవిష్కరించాడు.

క్రీ.శ.

200 గాలెన్ మానవ శరీర శాస్త్ర సూత్రాలను రూపొందించాడు.

1500 లెనార్డ్‌డా విన్సీ - శాస్త్ర ప్రయోగ పద్ధతిని అభివృద్ధి చేశాడు.

1543 కోపర్నికస్-సూర్యుడు కేంద్రంగా భూమివంటి ఇతర గ్రహాలు దాని చుట్టు పరిభ్రమిస్తాయనే 'సూర్య కేంద్ర సిద్ధాంతా'న్ని ప్రతిపాదించాడు. *ఆండ్రిన్ వెశాలియస్: శాస్త్ర ప్రయోగాలు చేసి మానవ శరీర శాస్త్రంపై గ్రంథం వ్రాసి ప్రచారం చేశాడు.

1600 గెలీలియో శాస్త్ర వైజ్ఞానిక ప్రయోగాలలో, గణిత శాస్త్ర స్థానాన్ని నొక్కి చెప్పి భౌతిక శాస్త్రంలో అనేక ప్రాథమిక సూత్రాలను ప్రవచించాడు.

1609 కెప్లర్ - ఖగోళ అధ్యయనం ద్వారా శాస్త్ర ప్రతిపత్తిని స్థిర పరచాడు.

1628 విలియమ్ హార్వే రక్త ప్రసరణ వ్యవస్థను గూర్చి గ్రంథం వెలువరించాడు.

1780 రసాయన శాస్త్ర పరిశోధనలలో వైజ్ఞానిక విధానాన్ని ప్రవేశ పెట్టారు.

1687 ఐజాక్ న్యూటన్ గురుత్వాకర్షణ బలసూత్రాన్ని కనిపెట్టి మెకానిక్స్ సూత్రాలను ప్రవచించే ప్రిన్సిపియా గ్రంథాన్ని ప్రచురించాడు.

1730 కరోలస్ లిన్నేయస్ వృక్ష , జంతు వర్గీకరణ పద్ధతిని ప్రవేశపెట్టాడు.

జేమ్స్‌వాట్ ఆవిరియంత్రాన్ని సిద్ధపరచాడు.

1774 జోసెఫ్ ప్రీస్టలీ ఆక్సిజన్ ఉనికిని కనుగొన్నాడు.

1776 ఆడమ్ స్మిత్ సంప్రదాయ ఆర్థికశాస్త్ర విధానానికి కొత్త ఊపునిచ్చాడు.

1780 ఆంటోనీ లెవోజియర్ : ఆధునిక రసాయన శాస్త్ర విధానానికి పునాది వేశాడు- వస్తువు మండేటప్పుడు అది గాలిలోని ఆక్సిజన్‌తో మండుతుందని కనుగొన్నాడు.

1796 ఎడ్వర్డ్ జెన్నర్ : మశూచి రోగ నిరోధానికి టీకా మందును కనిపెట్టాడు.

1803 జాన్ డాల్టన్ : ఆధునిక పరమాణు సిద్ధాతానికి పునాది వేశాడు.

1830 చార్లెస్ లైయెల్ : ఆధునిక భూ శాస్త్రాని (జీయాలజీ) కి పునాది వేశాడు.

ఆగస్ట్ కాంమ్టే ఆధునిక సాంఘిక శాస్త్ర విధానాన్ని ప్రారంభించాడు.

1831 మైకేల్ ఫారాడే : అయస్కాంతాన్ని కదిలించి విద్యుత్ప్రవాహం పుట్టేట్టు చేశాడు.

1839 మతియాస్ స్క్లీడన్, థియొడోర్ ష్వాన్ : జీవకోటి అంతా కణములతో నిర్మితమైందని కనుగొన్నారు.

1858 చార్లెస్ డార్విన్ జీవ (వృక్ష, జంతు) కోటి పరిణామ క్రమ సిద్ధాంతాన్ని ప్రవచించాడు.

1860 జేమ్స్ క్లర్క్ మాక్స్‌వెల్ విద్యుదయస్కాంత సిద్ధాంతాన్ని రూపొందించాడు.

1866 గ్రెగర్ మెండల్: అనువంశిక సూత్రాన్ని ప్రచురించాడు.

1869 దిమిత్రీ మెండలీఫ్ : రసాయన మూల ద్రవ్యాల (పిరియాడిక్ టేబుల్) ఆవర్తన పట్టికను సిద్ధపరిచాడు. (పరమాణు భారములు - మూల ద్రవ్యాల ధర్మాల్ని బట్టి వర్గీకరణ.)

1876 లూయీ పాశ్చర్ : కిణ్వ ప్రక్రియను, రోగాలకు సూక్ష్మక్రిములు హేతువని కనుగొన్నాడు.

1879 విల్‌హెల్మ్ వూన్‌డ్ : ప్రయోగ మానసిక శాస్త్రానికి పునాది వేశాడు.

1882 రాబర్ట్ కాక్ : క్షయ వ్యాధికి కారణం సూక్ష్మజీవులని కనుగొన్నాడు.

1895 విల్హెల్మ్ రంజన్: 'X'(రే) కిరణాలను కనుగొన్నాడు.

1897 జె.జె.తాంవ్సన్ ప్రయోగాలద్వారా ఎలక్ట్రాన్ ఉనికి ప్రప్రథమంగా కనుగొన్నాడు.

1898 మేరీక్యూరీ, పియరీక్యూరీ దంపతులు - రేడియమ్ మూలద్రవ్యాన్ని ప్రయోగాత్మకంగా వేరు పరచారు.

1900 మాక్స్ ప్లాంక్ : క్వాంటమ్ సిద్ధాంతాన్ని ప్రవచించాడు.

1900 పాల్ ఎల్‌రిక్ : రసాయన ద్రవ్యంతో (కెమోతెరపీ) వ్యాధుల్ని నివారించవచ్చని కనుగొన్నాడు. * సిగ్మండ్ ఫ్రాయిడ్ మానసిక వ్యాధి నివారణకు సైకో - ఎనాలిస్‌ను ప్రవేశ పెట్టాడు.

1903 రైట్ సోదరులు విమానం ఆది స్వరూపాన్ని నిర్మించారు.

1905 ఆలబర్ట్ ఐన్‌స్టీన్ ప్రత్యేక సాపేక్ష సిద్ధాంతాన్ని (రెలిటివిటీ) ప్రవచించాడు.

1911 ఎర్నెస్ట్ రూతర్‌ఫర్డ్ పరమాణు రచనా స్వరూపాన్ని ప్రతిపాదించాడు. పరమాణు కేంద్రకం లోనే శక్తి నిబిడీకృతమై ఉంటుందని చెప్పాడు.

1928 అలెగ్జాండర్ ఫ్లెమింగ్ రోగనివారిణి 'పెన్సిలిన్' ను ఆవిష్కరించాడు.

1938 ఆటో హాన్ ప్రభృతులు యురేనియమ్‌ను న్యూట్రానులచే బద్దలుకొట్టగా తేలిక పరమాణువులు బయట పడుట చూశారు.

1942 ఎన్రికో ఫెర్మీ ప్రభృతులు : పరమాణు కేంద్రకంలో శృంఖల ప్రక్రియ (చెయిన్ రియాక్షన్) సాధించారు.

1940 దశకం : యల్లాప్రగడ సుబ్బారావు 'ఆరోమైసిన్'ను ఆవిష్కరించారు.

1947 షాక్లీ, బార్డీన్ బ్రాటీన్ : 'ట్రాన్సిస్టార్' ఆది స్వరూపాన్ని రూపొందించారు.

1957 రష్యా బృందం ప్రప్రథమ కృత్రిమ ఉపగ్రహం ఉపయోగించింది. *టెస్ట్ ట్యూబ్‌లో డి.ఎన్.ఏ ను పెంచినవాడు ఆర్థర్ కోర్నబర్గ్.

1958 అంతర్జాతీయ భూ - భౌతిక సంవత్సరంలో 66 ప్రపంచ దేశాలకు చెందిన విజ్ఞానులు భూమి, దాని పొరుగు ప్రాంతాలను గూర్చి అధ్యయనం చేశారు.

1960 కంప్యూటర్ నిర్మాణం మొదటి దశ ప్రారంభం (అనలోగ్, డిజిటల్ కంప్యూటర్లు).

1961 రష్యాకు చెందిన యూరీ గెగారిన్, యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన ఆలాన్ బి.షెపార్డ్ ప్రప్రథమ వ్యోమగాములయ్యారు. *క్రిక్ - వాట్సన్ డి.ఎన్.ఏ స్వరూపాన్ని రూపొందించారు.

1969 నీల్ ఆర్మ్ స్ట్రాంగ్ చంద్రమండలంపై కాలు మోపిన ప్రప్రథమ మానవుడు. (జూలై 21).

1980 దశకం : పెర్సనల్ కంప్యూటరు (పి.సి.) ఆవిర్భావం.

1990 దశకం : పెర్సనల్ కంప్యూటరు (పి.సి.) సర్వాంతర్యామి స్థాయినందుకుంది.

1997 'క్లోనింగ్' ప్రక్రియ ద్వారా ఇయాన్ విల్మట్ చే 'డాలీ' (గొర్రెపిల్ల) సృష్టి.

ఆకాశంలోని నక్షత్రాల చలనం గమనించడం మొదలు పెట్టి పంచాంగం నిర్మించడానికి పూనుకున్నారు. ఈజిప్టువాసులు జ్యామితిని, శస్త్ర చికిత్సను ప్రవేశపెట్టారు. అలాగనే చీనావారు విజ్ఞానాభివృద్ధికి కారకులయ్యారు. క్రీ.పూ. 300 ప్రాంతంలో వున్న గ్రీకు విజ్ఞాని ఆరిస్టాటిల్ ఆధునిక శాస్త్రవిజ్ఞానానికి పితామహుడని చెప్తుతారు. శాస్త్ర విజ్ఞాన విషయాల్ని నిశితంగా పరిశీలించి వాటిని వర్గీకరించడంలో ఆయన కృషి గణనీయం. మరో వందేళ్లనాడు ఆర్కిమెడీజ్ విజ్ఞాన ప్రయోగాలు చేయడంలో ఆద్యుడనే ముద్ర వేసుకున్నాడు.

అయితే, భారతదేశంలో వరాహమిహరుడు, ఆర్యభట్టు, భాస్కరాచార్య వంటి మహాగణిత మేధావులు సూర్య సిద్ధాంతంవంటి ఉద్గ్రంథాలను అందించారు. అసలు శూన్య '0' భావన అనేది ప్రపంచానికి ప్రసాదించింది భారతీయులే. దశాంశ పద్ధతీ భారతీయులదే.

యూరపులో రోమనులు అంతగా విజ్ఞానాభివృద్ధి పట్ల శ్రద్ధ చూపలేదు. అరబ్బులు మాత్రం గ్రీకు విజ్ఞానాన్ని పదిల పరచారు. అటు అమెరికా ఖండంలో అజ్‌టిక్, ఇన్కా, మాయా నాగరికతలవారు స్వతంత్రంగా కొంత విజ్ఞానాన్ని వృద్ధి చేసుకుని అవలంబించే వారనడానికి దాఖలాలు కన్పిస్తున్నాయి.

కాగా, యూరపులో 16వ శతాబ్దం నుండి సాంస్కృతిక పునరుజ్జీవనయుగం ప్రారంభ సమయం నాటికి అరబ్బులు పదిలపరచిన గ్రీకు విజ్ఞానాన్ని వెలుగులోకి తీసుకువచ్చి అధ్యయనం చేయడం మొదలు పెట్టారు. అది మొదలు సైన్సు - విజ్ఞాన ప్రగతి ఉరకలు - పరుగులు తీస్తూ అభివృద్ధి చెందింది.

సైన్సు కథాగతిలో మనం ఈనాడు దాని ఫలితాల్ని ఆరగిస్తూ సుఖశాంతులను అనుభవిస్తున్నాం. ఈనాటి విజ్ఞాన ప్రగతి మన పూర్వీకుల్ని సంభ్రమాశ్చర్యాల్లో ముంచి వేస్తుందా అన్నట్టు ఉంది! నేడు లభించే విజ్ఞాన సాధనాలు రేడియో, టెలిస్కోపు, రోదసీ పరిశోధనలు విశ్వరహస్యాన్ని బయట పెడుతున్నాయి. సుమారు పాతికేళ్ళ క్రితం ఒకనాడు (జూలై 21, 1969) నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్ర మండలంపై కాలు మోపడాన్ని ఈ ఇరవయ్యవ శతాబ్దంలో మానవుడు సాధించిన మహా ఘనవిజయంగా పేర్కొనవచ్చును. బయోటెక్నాలజీ, టిస్యూ కల్చర్, జెనిటిక్ ఇంజనీరింగ్ ప్రక్రియలను మానవుడు సాధించాడు. క్లోనింగ్ ద్వారా విల్మట్ అనే విజ్ఞాని డాలీ అనే గొర్రె పిల్లను సృష్టించడంతో (1997) జీవ శాస్త్ర రంగం ముందడుగు వేసింది.

ఈ శతాబ్దంలో సంభవించిన రెండు ప్రపంచయుద్ధ కాలాల్లో (1914-1919), (1939-45) విజ్ఞాన పరిశోధనా కృషి తార స్థాయికి జేరుకుంది. రెండవ ప్రపంచయుద్ధానంతరం ఈ విజ్ఞాన పరిశోధనా ఫలితాల్ని మానవ జాతి సుఖశాంతులతో మనుగడ సాగించడానికి ప్రపంచ దేశాలు వినియోగిస్తున్నాయి. వీటిలో పరమాణుశక్తి బయోటెక్నాలజీ, కంప్యూటర్ సాధనాలు ప్రముఖంగా పేర్కొనదగినవి.

## ఖగోళ శాస్త్రం

### విశ్వం

ద్రవ్యం, శక్తి, దేశం (స్పేస్) వంటి అస్తిత్వంగల దానిని "విశ్వం" అంటారు. విశ్వం వయస్సు 1500 కోట్ల సంవత్సరాలని ఖగోళ శాస్త్రజ్ఞుల అంచనా. గాలి గుమ్మటం వలె విశ్వం వ్యాకోచిస్తూ ఉంటుందంటారు. బ్రహ్మాండం బద్దలై (బిగ్ బేంగ్ సిద్ధాంతం) నప్పుడు 10 కోట్ల కాంతి సంవత్సరాల వ్యాసం కలిగి వ్యాకోచిస్తూ ఉందని విజ్ఞుల అభిప్రాయం. నిర్దిష్టస్థాయీ (స్టెడీ స్టేట్ తియరీ) సిద్ధాంతం ప్రకారం విశ్వానికి ఆద్యంతాలంటూ ఏమీ లేకుండా ద్రవ్యం సతతమూ సృజింపబడుతూ మారుతూ వయోవృద్ధి చెందుతూ ఉంటుందట.

ఆకాశంలో కనిపించే తారలు, గ్రహాలు ఇంకా ఖగోళవిశేషాలు, కొన్ని కనిపించని ఖగోళవిశేషాలు కలసి 'విశ్వం'గా వ్యవహరిస్తారు. కాంతిని, ఉష్ణాన్ని వెడలగక్కేవే నక్షత్రాలు. అంటే మన సూర్యుడు ఒక మోస్తరు పరిమాణంగల నక్షత్రమన్న మాట! భూమికి సమీపంలో ఉండడంవల్ల తక్కిన తారల కంటె సూర్యుడు పెద్దదిగా మనకు కనిపిస్తాడు. తారల మధ్య దూరంకూడ ఎక్కువే. అందుచేతనే కాంతి ఒక సంవత్సర కాలంలో ప్రయాణం చేసిన కాల ప్రమాణాన్ని 'కాంతి సంవత్సరం' ఆధారంగా తారల మధ్య దూరాన్ని కొలవడం పరిపాటి. సూర్యకాంతి భూమిని చేరడానికి 8 నిమిషాల 20 సెకనులు పడుతుంది. సూర్యుని తర్వాత సమీప తార ప్రాక్సిమా సెంటూరీ నుంచి కాంతి భూమిని చేరడానికి 4సం॥ 15 వారాలు పడుతుంది. అంటే ఆ రెంటికీ దూరం 4.3 కాంతి సంవత్సరాలు. బహుదూరానున్న తారలు భూమికి కోటానుకోట్ల కాంతి సంవత్సరాల దూరాన ఉన్నాయి.

### సృష్టి వివరణ

ప్రాచీన భారతీయ సంప్రదాయం ప్రకారం సర్వాంతర్యామి అనేవాడు ఒకడు ఉన్నాడని ప్రాచీన ఖగోళవిదుల అభిప్రాయం. ఆయనే సంకర్షణుడు. జలమయమగు ఈ




పాలపుంత (మిల్కీ వే) : భూమి మీదనుండి చూచినపుడు పాలపుంత ఇలా వుంటుంది. అప్పుడు దానికి సౌరకుటుంబం కొన్ని వందల కాంతి సంవత్సరాల దూరంలో వుంటుంది. ప్రజ్వరిల్లే శక్తి తరంగాల వేడిమికి భూమి మీద జీవరాసులు మనుగడ దుస్సాధ్యమవుతుంది.

విశ్వమునందు ఈయన తన శక్తిని ప్రయోగించాడు. ఫలితంగా హిరణ్యారూపమగు అండముగా విశ్వం ఏర్పడింది. అందు వాసుదేవుడు అనిరుద్ధుడుగా ఆవిర్భవించాడు. తమోవృతమగు విశ్వంలో అతడు ఆవిర్భవించి చీకటిని పోగొట్టాడు. మొట్టమొదట ఆవిర్భవించుటచే 'ఆదిత్యు'డనే పేరు వచ్చింది. అంధకారం నాశనమగుటచే 'సూర్యుడ'నియు, 'సవిత' అనియు పేర్లు కూడ కలవు. 'ఆదిత్యవర్ణం తమసస్తు పారే' అని శ్రుతి వాక్యం.

ప్రాచీన భారతదేశంలో ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు, భాస్కరాచార్యులు వంటి ఖగోళశాస్త్రవిదులు వేదాంగ జ్యోతిషమందలి ఖగోళ విశేషాలకు వ్యాఖ్యానాలను వ్రాసి అందించారు. భూమి ఘనగోళమనియు, అది తనలోతాను తిరుగుచున్నదనియు ఆనాడు ఆర్యభట్టు ప్రతిపాదించాడు.

**విశ్వంలో తారలెన్ని :** విశ్వంలో ఎన్ని తారలున్నాయో లెక్కపెట్టటం ఎవరి తరం కాలేదు. అయితే సాధారణంగా విశ్వంలో 200000,00000,00000,00000 కి తక్కువ కాకుండా తార లున్నాయని ఖగోళ విజ్ఞానుల భావన. సూర్యుని కంటే చిన్నవి కొన్ని. వీటిని హ్రస్వ తార (డ్వార్ఫ్) లని అంటారు. మరి కొన్ని సూర్యుని కంటె వంద రెట్లు వెయ్యిరెట్లు పెద్దవి కూడా ఉన్నాయి. వీటిని బ్రహ్మాండ తార (సూపర్ జెయింట్) లని అంటారు. సూర్యుని కంటె పది నుండి వంద రెట్లు ఉండేవాటిని భారీ తార (జెయింట్) అని అంటారు. తారలన్నిటి స్వభావం ఒక్కటే. అదే *గురుత్వాకర్షణబలం.* ప్రతి వస్తువుకూ ఈ బలం ఉంటుంది. ఆ బలంతోనే తనవైపుకు ప్రతి వస్తువును లాగటానికి ప్రయత్నిస్తూ ఉంటుంది. వస్తు ద్రవ్యరాశిని బట్టి గురుత్వాకర్షణ బలం ఉంటుంది. మాట వరుసకు భూమి విషయంలో నేలమీద బంతి పడినప్పుడు భూమికి ఉన్న గురుత్వాకర్షణ బలం బంతికి ఉన్న గురుత్వాకర్షణ బలం కంటె ఎక్కువ. అందుచేతనే అది కిందనే పడుతుంది. వాయుభరితమైన పెద్దతారకుఉన్న గురుత్వాకర్షణ బలం ఘనపదార్థంతో నిండిన చిన్నతార గురుత్వాకర్షణ బలం కంటె తక్కువ. 'బ్లాక్ హోల్'లు, క్వాసర్'లు, పల్సార్'లు' అని తారల్లో చాల రకాలు ఉన్నాయి. అవి భిన్నవర్ణాల్లో తెలుపు నుండి నీలం, పసుపు నుండి ఎరుపు కాంతిని విరజిమ్ముతూ ఉంటాయి. కొన్ని శ్వేత తారలు. 'శ్వేత హ్రస్వా'లుగా పరిగణింప బడతాయి. వాటి మధ్య నెరపబడే గురుత్వాకర్షణ బలం వల్ల అవి కుదించుకు పోయి చిన్నవిగాను, సాంద్రంగాను తయారవుతాయి. ప్రకాశహీనమైన తారలు కూడ కొన్ని ఉన్నట్టు తెలుస్తూంది. వీటినే 'బ్లాక్ హోల్' తారలని అంటారు. వాటిమధ్య గురుత్వాకర్షణ బలం ఎంత ఎక్కువ అంటే కాంతి తరంగాలు కూడ తప్పించుకోలేవు! విశ్వంలో తారలను పోలిన ఖగోళ విశేషాలు కానవస్తూ ఉండడం ఎవరికీ అంతుబట్టని విషయం. వీటిని 'క్వాసర్'లు అని అంటారు. వీటినుండి బలవత్తరమైన రేడియో తరంగాలుగా వెలువడుతూ ఉంటాయి. పల్సార్లు అనేవి కూడ మరొక రకం ఖగోళ విశిషాలు. ఇవి పల్స్‌గా క్రమవిరామాల్లో రేడియో తరంగాల్ని వెలువరిస్తాయి. కొన్ని x -కిరణాల్ని మరికొన్ని ఉష్ణ తరంగాల్ని వెలువరిస్తూ ఉంటాయి.

**తారాగుచ్ఛములు :** కొన్ని తారలుగుంపులుగా గుది [illegible]బడిన వాటిని రాశులుగా పేర్కొంటారు. [illegible] కొన్ని కోట్ల తారలుగా గుది అయినప్పుడు వాటికి 'గాలక్సీ'లుగా పేరు పెట్టారు. మనం 'పాల పుంత'

# ఖగోళశాస్త్ర పదములు - వివరణ

**అరోరా బొరియాలిస్ :** ఉత్తరధృవ ప్రాంతాల్లో రంగు రంగుల కాంతులు కన్పించే ఘట్టాలు. అరోరా ఆస్ట్రియాలిస్ అంటే దక్షిణ ధృవ ప్రాంతాల్లో కనిపించేవి.

**ఈక్వినాక్స్ :** భూమధ్యరేఖపై సూర్యుడు ఉన్న క్షణం (రాత్రి, పగలు సమానం) మార్చి 21, సెప్టెంబరు 23, సంభవిస్తుంది.

**ఉపగ్రహం :** ఖగోళం చుట్టూ సహజంగా గాని లేదా కృత్రిమంగా గాని పరిభ్రమించు ఖగోళ విశేషం.

**ఉల్క :** ఖగోళ విశేషం. విశ్వంలో మండుతూ భూమికి చేరిన గండశిల. (ఉదా: నమీబియాలో కన్పించిన ఉల్క, బరువు 66 మెట్రిక్ టన్నులు ఉంది.

**కక్ష్య :** ఒక ఖగోళం చుట్టూ మరొక ఖగోళం పరిభ్రమించు తారాపథం.

**కాంతి సంవత్సరం (లైట్ ఇయర్) :** ఒక సంవత్సరంలో కాంతి పయనించిన దూరం. ($9.46 \times 10^{12}$ కి.మీ.) ఖగోళాల మధ్య దూరం కొలిచే ప్రమాణం

**క్వాసర్ :** విశ్వంలో బహు దూరంలో వున్న క్వాసర్ కాంతి వంతమైన గాలక్సీ కంటే వంద రెట్లు ప్రకాశ వంతమైన ప్రసిద్ధి 60 కోట్ల కాంతి సంవ త్సరాల దూరంలో వున్న క్వాసర్ 3C272 అనేది మనకు అతి సమీపంలో వున్న క్వాసర్.

**గాలక్సీ :** కోటానుకోట్ల తారల కూటమి. లక్షల కొద్దీ గాలక్సీలు విశ్వంలో ఉన్నాయి. సర్పిలాకారంలో గాని, అండాకారంలోగాని ఇవి ఉంటాయి.

**గ్రహణం:** ఒక ఖగోళం మరొక ఖగోళాన్ని కన్పించకుండా చేయడం. ఉదా: సూర్య గ్రహణం, చంద్రగ్రహణం

**గ్రహములు :** సూర్యుని చుట్టూ పరిభ్రమించే తొమ్మిది గ్రహాలు. బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్, ఫ్లూటో.

**తోకచుక్క :** తలా తోకగల ఖగోళ విశేషం. తలవైపు నక్షత్ర కేంద్రకమూ, వాయు ధూళితో నిండిన కొన్ని లక్షల కి.మీ. పొడవైన తోక సూర్యుని వైపు కన్పిస్తుంది. ఇవి కన్పించే తరచుదనం రెండుఏళ్ల నుండి వేల సంవత్సరాలు ఉండుట కద్దు.

**ధృవ నక్షత్రం :** సూర్యోదయానికి ముందు తూర్పు వైపు కన్పించు తారా విశేషం .

**నక్షత్రం - తార :** వేడిమినిగాని, కాంతిని గాని స్వయంగా ఉత్పత్తి చేసికొను ఖగోళ విశేషం.సుమారు 5000 తారలు కంటికి కనపడతాయి.

**నెబులా :** విశ్వమందు కన్పించు వాయు, కణమయ నీహారికా విశేషం.

**పల్సార్ :** క్రాబ్ నెబులా లో వున్న ఈ పల్సార్ విస్ఫోటన సూపర్‌నోవా పరిశిష్టాల భ్రమణం. కాంతిపుంజము రేడియో తంరగాలు స్పందాలుగా (పల్స్) తిరుగు చుండే లైట్ హౌస్ కాంతి పుంజం వలే వెలువడతాయి.

**పాలపుంత (మిల్కీవే) :** మన భూమండలం చెంది గాలక్సీ సర్పిలం. ఇందు 200 శతకోటి తారలున్నట్లు అంచనా.

**సూర్యుడు :** మన నక్షత్రం. సౌర కుటుంబంలో మండుచున్న హైడ్రోజన్, హీలియం వాయుగోళం.

**సోలిస్టిస్ :** భూమధ్యరేఖ నుండి సూర్యునికి కడు దూరంగా ఉన్న క్షణం (పగలు ఎక్కువగా గాని తక్కువగా గాని ఉండే) - జూన్ 21, డిసెంబరు 21.



(మిల్కీ వే) అనబడే గాలక్సీలోని సౌరమండలానికి చెందిన వారం. రాత్రి సమయంలో ఆకాశంలో ఆయా తారలు అడ్డంగా పటకావలె ఉండడం వల్ల ఆ పేరు వచ్చింది. భ్రమించే తారల మయమైన పళ్ళెం వ్యాసం ఒక లక్ష కాంతి - సంవత్సరాలు ఉంటుంది. మన సూర్యుడు పళ్లెం కేంద్రం నుండి సుమారు ముప్పయి వేల కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నాడు. ఇలా కోట్లాది గాలక్సీలు విశ్వంలో ఉన్నాయి. అవి ఎన్ని అన్న సంగతి మనకు తెలియదు.

### గ్రహాలు, తోకచుక్కలు

తార చుట్టూ పరిభ్రమించే ఖగోళ విశేషమే గ్రహం. మన సూర్యుని చుట్టు పరిభ్రమించే తొమ్మిది గ్రహాల వ్యవస్థను *'సౌరకుటుంబం'* అని అంటారు. భూమి ఈ నవగ్రహాలలో ఒకటి. తారవలె గ్రహం స్వయం ప్రకాశం కాదు. సూర్య కిరణాలు పరావర్తితమై గ్రహం ప్రకాశిస్తుంది.

బుధుడు, శుక్రుడు, ప్లూటో గ్రహాలకు తప్ప మిగతా వాటికి ఉపగ్రహాలు వాటి చుట్టూ భ్రమిస్తూ ఉంటాయి. మన భూమికి ఒకే ఒక ఉపగ్రహం ఉంది. దానిపేరు 'చంద్రుడు'. మిగతా గ్రహాల చుట్టూ చాల ఉపగ్రహాలు భ్రమిస్తూ ఉంటాయి. గురుగ్రహానికి పదహారు ఉపగ్రహాలు ఉన్నాయి. తోకచుక్క (కామెట్) అనబడే ఖగోళ విశేషాలు కూడా సౌరకుటుంబ వ్యవస్థలో చోటు చేసుకున్నాయి. భారీ అంగాకార కక్ష్యలలో సూర్యగోళం నుండి దూరంగా అంగారక గురు గ్రహాల మధ్య రోదసీలో తిరుగుతూ ఉంటాయి. కొన్ని ఏళ్ల తర్వాత గాని, మరికొన్ని వేల సంవత్సరాల తర్వాత గాని దర్శనమిస్తూ ఉంటాయి. తోకచుక్కలో ధూళి, వాయువులు, మంచుముక్కల మిశ్రమం ఉంటుంది.

### విశ్వం వయస్సు

విశ్వం వయస్సు పదిహేను వందల కోట్ల సంవత్సరాలని విజ్ఞుల అభిప్రాయం. అంత కుముందు ద్రవ్యరాశి అంతా బ్రహ్మాండమైన (సూపర్ బ్లాక్ హోల్) బంతిగా జమ అయిందనీ - దానికి మహాప్రళయం (బిగ్ బాంగ్) సంభవించి ద్రవ్యమంతా భిన్న దిసెల్లోకి చెల్లాచెదురయిందని కొందరు శాస్త్రజ్ఞుల విశ్వాసం. అలా చెల్లాచెదురయిన ద్రవ్యరాశి ఖండికలనుండియే తారలు ఉద్భవించా యంటారు. ఒక సిద్ధాంతం ప్రకారం ఈ మహాప్రళయం ఇంకా కొనసాగుతూనే ఉందనీ తారలూ, గాలక్సీలు మహాప్రళయ కేంద్రం నుండి విస్తరిస్తున్నాయనీ చెప్పుతున్నారు. తారలూ, గాలక్సీలూ తీవ్రవేగంలో పయనిస్తూ ఉంటాయి.

అయితే కొందరు ఖగోళ విజ్ఞానులు మహాప్రళయం (బిగ్ బాంగ్) సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేస్తూ విశ్వం ఇప్పుడు ఎలా ఉందో ఎప్పుడూ అలాగే ఉండేదని వాదిస్తున్నారు.

### రాశులు

నిశిరాత్రి సమయంలో ఆకాశంలో ఒక నిర్దిష్టమైన మూల స్పష్టంగా కానవచ్చే నక్షత్ర గణాన్ని 'రాశి' అంటారు. మొత్తం మీద ఎనభయి ఎనిమిది రాశులు ఉన్నాయి. ఇందు నలభయి ఎనిమిదింటిని భూమి ఉత్తరార్ధంలోగాని భూమధ్య రేఖాప్రాంతం నుంచిగాని చూడనగును. ఈ రాశుల సహాయంతోనే వాటిని ఆధారంగా తీసికొని ఆకాశంలోని తారల స్థానాల్ని గుర్తించ గలుగుతున్నారు.

ప్రాచీన గ్రీక్, భారతీయ శాస్త్రజ్ఞులు పురాణ జంతువులు, దేవతలు, పురాణ పురుషుల



నెబులా
ఆండ్రమొడాలోని బృహుత్ నెబులా, అతి దూరంలో ఉన్న ఈ నెబులా మన మామూలు కంటికి కనిపిస్తూ ఉంటుంది.



సర్పిలాకార గాలక్సీ
మన సౌరకుటుంబంలో వున్న పాలపుంత గాలక్సీ వలనే వున్న కోట్ల కొద్దీ గాలక్సీలు సర్పిలాకారంలో వుంటాయి.

వాటి విన్యాసాలు కాలక్రమేణ మారిపోయాయి.

దక్షిణార్ధగోళంలోని రాశుల ఉనికి తెలియగనే వాటికి కూడా అటువంటి నామకరణాలే ఖగోళ విజ్ఞానులు చేశారు. ఈ పేర్లు లాటిన్‌లో ఉండటానికి కారణం ఖగోళ శాస్త్ర గ్రంథాలన్నీ ఆ భాషలోనే ఉండటం వల్లనే అని గమనించనగును.

### నక్షత్రాలు గాలక్సీలు

గ్రహాల్ని నక్షత్రాలనుండి తేలికగా గ్రహించవచ్చు. నక్షత్రాలు అంటే తారలు. ఇవి మినుకు మినుకుమని కాంతిని విరజిమ్ముతూ ఉంటాయి. కాగా, గ్రహాలు సూర్యకాంతిని పరావర్తించడంవల్ల ఒకే విధంగా ప్రకాశించడం మన అనుభవం.

### సూర్యుడు

మానవ జీవనంలో సూర్యుడు ప్రముఖ పాత్ర వహిస్తున్నాడు. ఎందుకంటే ప్రాణి కోటి మనుగడకు అత్యవ సరమయిన కాంతి,

> **సూర్యుడు : వివరాలు**
> భూమి నుంచి దూరం : 149600000 కి.మీ
> ధృవాల వద్ద వ్యాసం : 1,391, 000 కి.మీ.
> వయస్సు : 4.5 శతకకోటి సంవత్సరాలు
> ఉష్ణోగ్రత (సూర్యతలం) 5540°C

వేడిమి సూర్యుని వల్లనే ప్రాప్తిస్తున్నాయి. వాస్తవానికి సూర్యుడు ఒక అతి సాధారణ మయిన నక్షత్రమే. పీతహ్రస్వ (ఎల్లో డ్వార్ఫ్) అని ఖగోళ విజ్ఞానులు దాన్ని పిలుస్తూ ఉంటారు. ఐదువందల కోట్ల సంవత్సరాలనుండి ఈ సూర్యుడు ప్రకాశిస్తూనే ఉన్నాడు. ఇలా మరొక ఐదువందల కోట్ల ఏళ్లు ప్రకాశిస్తూ ఉంటాడని విజ్ఞుల అభిప్రాయం.

సూర్యగోళ కేంద్రంలో ఉష్ణోగ్రత కోట్లాది డిగ్రీలు ఉంటుంది. అంత అత్యధికోష్ణోగ్రత వద్ద అందులో ఉండే హైడ్రోజన్ పరమాణువులు ఒకొటికొకటి ఢీ కొని కలిసి హీలియమ్ పరమాణువులుగా

మారుట కద్దు. ఈ ప్రక్రియను 'ఫ్యూషన్' అంటారు. పరమాణు విద్యుత్కేంద్రాల్లో విద్యుదుత్పత్తికి ఈ ప్రక్రియనే ప్రయోగిస్తూ ఉంటారు.

లోపలినుండి వేడి వాయువులు ఎగయడం వల్ల సూర్యగోళం ఉపరితలం కుతకుత లాడుతూ ఉంటుంది. తత్ఫలితంగా సూర్య గోళంపై మచ్చలు కనిపిస్తూ ఉంటాయి. ఈ మచ్చలు వస్తూ పోతూ ఉండటం కద్దు. పదకొండేళ్లకొకసారి వీటి ప్రభావం తీవ్రస్థాయిలో ఉంటుంది. సూర్యగోళంపై ఉష్ణోగ్రత మిగతా



గెలీలియో
ప్రపమథమంగా దూరదర్శని 'టెలిస్కోప్'ని రూపొందించి గురుగ్రహానికి చెందిన చంద్రుని (16వ శతాబ్ది) చంద్రమండలం పైవున్న కొండల్ని చూశాడు.



కోపర్నికస్
సూర్యుడు కేంద్రంలో ఉండి చుట్టూ గ్రహాలు పరిభ్రమిస్తూ ఉంటాయని, సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు (1543)

చోట్లకంటె మచ్చలున్న చోట $2000^{0}C$ తక్కువ ఉంటుందని ఖగోళ శాస్త్రజ్ఞుల అంచనా. ఈ మచ్చలు ప్రబలినప్పుడు సూర్యగోళంపై అయస్కాంత ప్రసారంలో కూడ మార్పులు కలుగుతూ ఉంటాయి. భూమిమీద రేడియో ప్రసారాలపైనా, దిక్సూచిపైన ఈ మార్పుల ప్రభావం ఉంటుంది.

**సౌరకుటుంబం**

నవ గ్రహాలు సూర్యుని చుట్టూ పరి భ్రమిస్తున్నాయి. ఈ వ్యవస్థను 'సౌర కుటుంబ'మని పిలుస్తున్నాం. ఈ వ్యవస్థ లో సూర్యుని చుట్టూ మూడవ కక్ష్యలో భూ గ్రహం ఉంది. ఇంత వరకూ శాస్త్రవేత్తలకు తెలియవచ్చినంతవరకూ భూమి మీద తప్ప మరియే ఇతర గ్రహంమీదా ప్రాణికోటి ఉనికి గురించి దాఖలాలు లేవు. సూర్యుని నుండి దూరం పోయే కొద్దీ - సూర్యుని చుట్టూ -భూ గ్రహం పరిభ్రమించడానికి పట్టే కాలం ఒక సంవత్సరం - ఆ గ్రహసంవత్సరం నిడివి పెరుగుతూ ఉంటుంది. మాటవరుసకు సూర్యుని చుట్టిరావడానికి భూమికి 365 రోజులు పడుతుంది. సూర్యునికి దరిదాపుల్లోవున్న బుధుడు పరిభ్రమణ కాలం 88 రోజులు మాత్రమే. సూర్యునికి అతిదూరంలో వున్న ప్లూటో గ్రహ పరిభ్రమణకాలం చాల ఎక్కువ - 247 భూ - సంవత్సరాలు.

**ఆస్టరాయిడ్‌లు** : అంగారక గ్రహానికీ గురుగ్రహానికి మధ్యనున్న కక్ష్యల్లో ఆస్టిరాయిడ్స్ అనబడే లఘుగ్రహాలు ఉన్నాయి. ఈ లఘు గ్రహాల్లో పెద్దదైన సెరీస్ వ్యాసం 687 కి.మీ.

ఆస్టిరాయిడ్‌లలో చాలవరకూ అన్నీ చిన్నవియే. వాటి వ్యాసం 95 కి.మీ.లకు మించదు. పెద్ద గ్రహాలు విచ్ఛిన్నమైనప్పుడు ఫలించిన శిథిలాలేమో ఇవన్నీ. లేదా సౌరకుటుంబం ఏర్పడినప్పుడు ఒకే ఖగోళ విశేషంగా ఏర్పడలేక శిథిలాలుగా ఉండిపోయాయో, మరి !!

### కృత్రిమ ఉపగ్రహాలు

వార్తా ప్రసార రంగాభివృద్ధికి కృత్రిమ ఉపగ్రహాలు ఎంతగానో ప్రయోజన పడ్డాయి. భూభ్రమణ వేగానికి సాటిగా కక్ష్యలో కృత్రిమ ఉపగ్రహం పరిభ్రమిస్తూ ఉంటూ నేలపై నిర్దిష్ట స్థానానికి అనుగుణంగా ఒక కక్ష్యలో స్థిరంగా ఉంటుంది. మూడు వార్తా ప్రసార కృత్రిమ ఉపగ్రహాలు స్థిరకక్ష్యలో పరిభ్రమిస్తూ భూగోళంపై ఎక్కడ నుంచి అయినా రేడియో - టెలివిజన్ తరంగాలను స్వీకరించి మరల తిప్పి భూమి మీదకు పంపించగా అందరు రేడియో - టెలివిజన్ కార్యక్రమాల్ని ఒకేసారి విన గలుగుతున్నారు. చూసి ఆనందించ గలుగుతున్నారు. ప్రపంచంలో ఏ మూలనుండి అయినా కృత్రిమ ఉపగ్రహాల సాయంతో మనిషి లేకుండా రోదసీ పరిశోధనలు సాగుతూనే ఉన్నాయి. సౌరకుటుంబంలోని ఒక గ్రహం పక్క నుంచి కృత్రిమ ఉపగ్రహాలు దూసుకు పోతున్నాయి. ఫోటోలు తీసి భూమి

**గ్రహములు : వివరాలు**

| గ్రహం | వ్యాసం కి.మీ | దినం భూమిరోజులు గంటలు | సంవత్సరం (భూ/సంవత్సరం) | సూర్యుడునుంచి దూరం కి.మీ. |
|---|---|---|---|---|
| బుధుడు | 4880 | 58.6 రోజులు | 88/రోజులు | 57900000 |
| శుక్రుడు | 12109 | 243 రోజులు | 224 రోజులు | 108230000 |
| భూమి | 12835 | 24 గంటలు | 3652 రోజులు | 149590000 |
| కుజుడు | 6780 | 24.6 గంటలు | 687 రోజులు | 227720000 |
| గురుడు | 142,725 | 9.8 గంటలు | 11.6 సం | 778120000 |
| శని | 120050 | 10.2 గంటలు | 29.4 సం | 1428300000 |
| యురేనస్ | 51705 | 17.30 గం॥ | 84 సం॥ | 2872700000 |
| నెప్ట్యూన్ | 49 520 | 15.8 గం॥ | 11వ సం. | 4498100000 |
| ప్లూటో | 2215 | 6. 3 రోజులు | 247.8 సం | 5914300000 |






**సౌరకుటుంబం**

సౌరకుటుంబంలోని తొమ్మిది గ్రహాలు బుధుడు,శుక్రుడు, భూమి, అంగారకుడు, గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో - (సూర్యగోళం నుండి వాటి దూరం ఆధారంగా)

మీదకు చేరుస్తున్నాయి. అంగారక గ్రహం మీద ఒకప్పుడు నీరు ఉండేదని వీటివల్లనే తెలియవచ్చింది. గురుగ్రహానికి 13 ఉపగ్రహాలు ఉన్నట్టు టెలిస్కోపులవల్ల తెలియగా ఈ ఫోటోలవల్ల గురుగ్రహానికి మరో మూడు ఉపగ్రహాలు మొత్తం పదహారు ఉపగ్రహాలు ఉన్నట్లు తెలియ వచ్చింది.

రోదసీయానానికి పనికివచ్చే సాధనం రాకెట్టు. దాని ఇంజనులో ఇంధనం మండినప్పుడు చాలా వాయువు జనిస్తుంది. ఇంజనులోపల అప్పుడుఅత్యధిక ప్రేషం ఏర్పడుతుంది. చుట్టు పక్కల ప్రేషం ఒకే విధంగా ఉంటుంది. పీఠం మీదకంటే తల మీద ప్రేషం ఎక్కువ. పీఠంలో ఉన్న రంధ్రం నుండి వాయువు నిష్క్రమిస్తూ ఉండడం వల్ల ఈ పరిస్థితి ఏర్పడుతుంది. ఈ వ్యత్యాసప్రేషం వల్ల రాకెట్టుపైకి దూసుకు పోతుంది.

ఈ రోదసీయాత్రలు ఇంకను బాగా సాగుతూనే ఉన్నాయి. వీటివల్ల ప్రపంచశాంతి ఇనుమడిస్తుదని విజ్ఞుల అభిప్రాయం.

## అంతరిక్ష యానం

దాదాపు అరవయి ఏళ్ల కిందట చంద్రునిపై మానవుడు ఎప్పటికైన కాలూనగలడని ఊహించనే లేదు. ఆ రోజుల్లో అది వైజ్ఞానిక కాల్పనిక కథ మాత్రమే. ఉన్నట్టుండి ఒక రోజున 1957 అక్టోబరు 4 నాడు రోదసీ నుండి వెలువడిన రేడియో సంజ్ఞను భూమి మీద పట్టగలిగారు. అవి స్పూత్నిక్-1 వెలువరించిన రేడియో సంజ్ఞలు. మానవుడు నిర్మించిన ఈ కృత్రిమ ఉప గ్రహం మొట్ట మొదటిసారిగా భూకక్ష్యలో పరి భ్రమించినది. దీనిని రష్యా శాస్త్రజ్ఞులు రూపొందించి ప్రయోగించారు. నా లు గే ళ్ల తర్వాత 1961 లో మానవుడు రోదసీయానానికి శ్రీకారం చుట్టాడు. యూరీ గెగారిన్ అనే రష్యా యువకుడు మొట్టమొదటి వ్యోమగామి అయి చరిత్ర ప్రసిద్ధుడయినాడు. పిదప కాలంలో యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన వ్యోమగాములు రోదసీయానంలో పాల్గొని అనేక శాస్త్ర విషయాలు బయట పెట్టగలిగారు. నీల్ ఏ. ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఇ ఆల్డ్రిన్ అనే యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన వ్యోమగాములు రోదసీయాత్ర చేసి జూలై 21, 1969 నాడు చంద్ర మండలంపై ప్రప్రథమంగా కాలూనిన ప్రథమ మానవులయి సుప్రసిద్ధు లయినారు. వీరితో పాటు వెళ్ళిన మైఖేల్ కాలిన్స్ సారథ్యవాహనం (కమాండ్ మాడ్యూల్)లోనే ఉండి చంద్రుని చుట్టూ పరిభ్రమిస్తూ మరల ఆ యిద్దరిని ఎక్కించుకుని భూమికి తిరిగి వచ్చారు. ఆ తర్వాత 1970లలో యునైటెడ్ స్టేట్స్‌లో

**రోదసీలో మానవుడు**

| తేదీ | లక్ష్యం | వ్యోమగామి | దేశం /రాకెట్టు |
|---|---|---|---|
| 12-4-1961 | రోదసీ ప్రథమ మానవుడు | యూరీ గెగారిన్ | రష్యా, ముస్టసాక్ |
| 20-2-1962 | కక్ష్యలో ప్రథమ | జాన్‌గ్లెన్, ఫ్రెండ్‌షిప్ | అమెరికన్ |
| 16-6-63 | రోదసీలో ప్రథమ | వెలంటీనా తెరిస్కోవా | రష్యా ముస్తాక్ -6 |
| 16-3-66 | రోదసీలో - సమాగమం – | నీల్ ఆర్ స్ట్రాంగ్ డేవిడ్ స్కాట్ | అమెరికన్‌జెమిని-8 |
| 21-2-1967 | ప్రపథమ చంద్రయాత్ర | బోర్మన్ లోవెల్ ఏండర్స్ | అమెరికా అపోలో-8 |
| 21-7-1969 | చంద్రునిపైకాలు మోపిన ప్రప్రథములు | నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, ఆల్డ్రిన్ | అమెరికా అపోలో-11 |

# రోదసీయాన మహాప్రస్థానం

చంద్రమండల యాత్ర

చిరకాల స్వప్నం వాస్తవ రూపం చెందిన రోజు 21 జూలై 1969
మానవుడు చంద్రమండలం మీద అడుగుపెట్టడం
అనే సాహసోపేత కార్యం కంప్యూటరు వలనే
సాధ్యమైందని విజ్ఞుల అభిప్రాయం.



మానవుడు చంద్రమండలంపై కాలు మోపడానికి చేసిన ప్రయత్నకృషిలో పాల్గొన్న (అపోలో 7-17) వ్యోమగాముల్లో వైతాళికులు. కుడి చివర అపోలో11లో పయనించి చంద్రునిపై కాలూనిన ప్రప్రథమ మానవుడు నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్; ఆయన వెనుక తన సహచరుడు ఆల్డ్రిన్; ఆయన వెనుక కాలిన్ సారథ్య వాహనాన్ని నడిపిన వాడు.

(నేషనల్ జాగ్రఫిక్ సౌజన్యంతో)

రోదసీయాత్ర పరిశోధనలు జరిపించారు. ఆ పిదప అంగారక గ్రహం లక్ష్యంగా రోదసీ పరిశోధనలు కొనసాగు తున్నా యి.

ఇంతకీ రోదసీ పరిశోధలు వలన మానవ కల్యాణానికి సంబంధించిన విశేషాలు ఎన్నో ఫలించాయి. వాతావరణ పూర్వ నిర్దేశంలో రోదసీ పరిశోధలను ఎంతగానో ప్రయోజన పడ్డాయి. ఉప్పెనలు, తుఫానులు, మహా ప్రచండవాయువుల ఉనికి, వాయుగుండాల ఉనికి తెలియరావడం వల్ల ముందు జాగ్రత్తలు తీసుకొని పౌరులను సురక్షిత ప్రాంతాలకు తరలమని హెచ్చరికలు ఇవ్వడానికి చక్కగా ఉపయోగ పడుతున్నాయి. కృత్రిమ ఉపగ్రహాల సహాయంతో భూమి ఉపరితల ఫోటోలను నిర్దుష్టంగా తీయడానికి సాధ్యమైంది. రోదసీ పరిశోధనల ఫలితంగా జీవకోటి మనుగడకు అవసరమైన వాతావరణంలో అంటార్కిటికాపై ఓజాన్ పొరలో రంధ్రం పడడం 1985లో తెల్సింది.

**భూమి**

మనం నివసించే భూమిని చుట్టి వాతావరణం ఉంది. భూమి మీద ఆక్సిజన్ అనే ప్రాణవాయువూ హైడ్రోజన్‌తో దాని మిశ్రమం నీరూ పుష్కలం. ఇటువంటి వాతావరణం సౌరకుటుంబంలో మరే గ్రహం మీద లేదట ! జీవకోటి మనుగడకు గాలి, నీరు అనే ఈ రెండు పదార్థాలు తప్పనిసరిగా కావాలి.

నాలుగు వందల అరవై కోట్ల సంవత్సరాల క్రితం జీవప్రాదుర్భావం జరిగిందని విజ్ఞుల అభిప్రాయం. ఇంత కాలములోనూ ఖండాలు రూపుదిద్దు కోవడంతో అనేక మార్పులు జరగడమూ హిమయుగాలు అవతరించి పోతూ ఉండడం జరిగింది. భూమి మీద ఎన్నో జీవరాసులు ఆవిర్భించాయి. జీవనసమరంలో మనుగడ సాగించలేక కొన్ని జంతుజాతులు కాలక్రమేణా లుప్తమయ్యాయి.

సూర్యుని చుట్టే నవగ్రహాలలో మన భూమి ఒకటి. పరిమాణంలో అయిదవ స్థానం ఆక్రమిస్తుంది. మరే గ్రహం మీదా ప్రాణి కోటి ఉన్నట్టు ఇప్పటి వరకూ జరిగిన రోదసీ పరిశోధనలు నిష్కర్షగా చెప్పలేక పోతున్నాయి.

ఇక ఖండాలు ఇప్పుడు ఉన్న చోటనే ఎప్పుడూ ఉన్నా వాస్తవానికి ఎన్నో మార్పులు జరిగాయి. ఖండాలన్నీ ఒకప్పుడు కోట్ల ఏళ్ల కిందట ఒకే ముద్దగా బృహత్ఖండంగా ఈ భూమి ఉండేది. ఇరవయి కోట్ల సంవత్సరాల కిందట ఈ బృహత్ఖండం విడి వడడం ప్రారంభమై ఖండాలు గా ఇప్పుడున్న చోట స్థిర పడడం మొదలు పెట్టాయి. దీనినే 'ఖండ గమన' మన్నారు. ఈ గమనం ఇప్పటికీ కొన సా గు తూ నే ఉంది. మాట వరుసకు అట్లాంటిక్ మహాసముద్రం ఏడాదికి అయిదు సెంటీమీటర్లు పెరుగుతూ ఉందట!




ఖండాలు ఫలకాలపై పొందు పరచి ఉన్నాయి. భూమి పైపొరమీద ఇరవయి ఫలకాలు ఉన్నాయని శాస్త్రజ్ఞులు చెప్పుతున్నారు. ఈ ఫలకాలు కదిలేట్పుడు ఒకదానికొకటి 'ఢీ' కొడతాయి. అటువంటప్పుడు పర్వతశ్రేణులు రూపుదిద్దుకుంటాయి. ఉదాహరణకు ఉత్తర, దక్షిణ అమెరికాలలోని రాకీ, ఆండీస్ పర్వతశ్రేణుల్నీ ఆసియాలోని హిమాలయ పర్వతాల్నీ చెప్పుకోవచ్చు.

ఒక్కొక్కసారి ఒక ఫలకం మీద మరొక ఫలకం దొర్లి మహాసముద్రాల కిందికి పోవచ్చు. అటువంటప్పుడు ఫలకాలు పక్కలకు ఊగడం

కూడకద్దు. కాలి ఫోర్నియాలోని శాన్ ఆంఢ్రియాస్ ఫాల్ట్ దీనికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఫలకాలు నెమ్మదిగా కదలవు.

**రిక్టర్ స్కేల్ : భూకంప మానం**

సాధారణంగా ప్రపంచంలో ఏడాదిలో దాదాపు అయిదు లక్షల భూకంపాలు సంభవిస్తూ ఉంటాయి. ఇందులో ఒక వంద భూకంపాల వల్ల ప్రమాదాలు జరగవచ్చు.భూకంప కేంద్రంలో స్థాయిని కొలత చేయడానికి 1 - 10 గల రిక్టర్ మానం ఉపయోగిస్తారు.ముందు అంకె కంటె 32 రెట్లు శక్తి వంతమైనందని గ్రహించాలి. 5 సాధరణం. 8 ధ్వంసస్థాయి. 1993 సెప్టెంబరులో లాటూరు (మహరాష్ట్ర) లో సంభవించిన భూకంపం రిక్టర్ స్కేల్ మీద 9 ఉంది.

ఊపులు ఊపులుగా కదులుతూ ఉంటాయి. అటువంటి ఊపులోనే 'భూకంపం' తటస్థిస్తుంది.

ప్రపంచ శీతోష్ణస్థితికి వాతావరణానికీ అనేక కారణాలు హేతువువతూఉంటాయి. ఒక్కొక్కప్పుడు భూమి ఉపరితలమంతా మంచు పొరలతో కప్పబడి ఉంటుంది. కొన్ని కోట్ల ఏళ్లకు ఒక సారి ఇటువంటి హిమప్రళయాలు సంభవించడానికి అవకాశం ఉందని విజ్ఞానుల అభిప్రాయం.

ప్రస్తుతం మనం ఒక హిమాంతర (ఇంటర్‌గ్లాషియల్) ఉష్ణయుగంలో ఉన్నా మన్న మాట. హిమ యుగాల్లో సముద్ర మట్టం పడిపోయే అంతగా సముద్ర జలమంతా మంచుగా మారి పోతుంది. అట్లాగే ఒకప్పుడు అలాస్కా (ఉత్తర అమెరికా) ను సైబీరియాతో కలిపే బుల్లి భూఖండం ఉండేదట! అలాగనే గ్రేట్‌బ్రిటన్‌ను యూరపుతో కలిపే భూం డం కూడ ఉండేదట ! !

అత్యంత ఇటీ వలి హిమ యుగం పదివేల సంవత్సరాల క్రితమే అడుగంటింది. ఉత్తర అమెరికాను యూరపు ఖండాలను అప్పుడు మూడువేల మీటరుల మందంగల మంచుపొర ఆవరించి ఉండేది. హిమయుగంలో హిమనదులు (గ్లేషియర్స్) ఎన్నో ఉంటాయి. అలాంటి హిమనదుల నెమ్మదిగా భూఖండం మీదికి పాకి భూక్షరణానికి లోనుచేసినప్పుడు పర్వత శ్రేణులు మలచబడి లోతైన లోయలు ఏర్పడతాయి. రాకీ పర్వతాలు చూచినట్టయితే ఇటువంటి దృశ్యమే కానవస్తుంది. భూమి చరిత్రలో ఇవి ఇటీవలివే. ఎత్తు లేని పర్వతాలు మంచుచే మలచబడి నున్నగా ఉండడం గమనించనగును. శీతల పర్వత ప్రాంతాల్లో హిమనదుల్ని ఇప్పుడు కూడా చూడవచ్చు.

### చంద్రుడు

చంద్రుడినే చందమామ అని, జాబిలి అనీ అంటారు. వాస్తవానికి భూమి చుట్టూ పరిభ్రమించే ఉపగ్రహమే చంద్రుడు. భూమిచుట్టూ ఒకచుట్టు తిరగడానికి చంద్రుడికి 27 రోజులు పడుతుంది. ఇదియే 'చాంద్రమాసం'. మామూలు నెలకంటె తక్కువ. చంద్రునిపై సూర్యకాంతి పడి ప్రకాశించినప్పుడు వెన్నెల కాస్తుంది. భూమికీ సూర్యునికి సరిగ్గా మధ్యకు చంద్రుడు

**చంద్రుడు**

| | |
|---|---|
| భూమి నుండి దూరం | 384400 కి.మీ |
| వ్యాసం ——— | 3475 కి.మీ |
| కక్ష్యలో తిరిగే కాలం | $27\frac{1}{3}$ భూమి రోజు |
| ఉపరితల ఉష్ణోగ్రత సూర్యుని వైపు | 137°C |
| అవతలివైపు ------ | –169° C |

వచ్చినప్పుడు అది మనకు కనపడదు. అదే అమావాస్య. అలా చంద్రకళలు మారుతూ పౌర్ణమినాడు చంద్రుని ఉపరితలమంతా




ప్రకాశిస్తుంది. దాన్ని పున్నమి వెన్నెల అని అంటాం.మరల చంద్ర కళలు తగ్గుతూ అమా వాస్య చీకటిలో చంద్రుడు అసలు కనిపించడు. చంద్రుని వ్యాసం సూర్యుని వ్యాసంలో 400 రెట్లు చిన్నది. అయితే భూమికి 400 రెట్లు చేరువలో ఉంది. అందుచేతనే సూర్యుడు, చంద్రుడు ఒకే పరిమాణంలో ఉన్నట్లు మనకు కనిపిస్తూ ఉంటాయి. ఏడాదిలో ఒకోసారి మనకు భూమి సూర్యునికి సరిగ్గా మధ్య చంద్రుడు రావడం వల్ల సూర్యుడు మాయమయినట్లు గోచరిస్తుంది. అటువంట ప్పుడు 'సూర్యగ్రహణం' సంభవించిందంటారు. సూర్యునికీ చంద్రునికి మధ్య భూమియొక్క నీడ పడినప్పుడు 'చంద్రగ్రహణం' సంభవించిందని అంటారు.




సూర్యునికి చంద్రునికి మధ్య భూమి వున్నప్పుడు-

సూర్యునికి భూమికి మధ్య చంద్రుడు వున్నప్పుడు-




720 కి.మీ. ఎత్తునుండి భారత ద్వీపకల్ప దృశ్యం. రోదసీ యాన (1967 - జెమినీ) ప్రస్థానంలో తీసిన ఫోటో.



# గణిత శాస్త్రం



**గ**ణితం అంటే అంకెల శాస్త్రం. మిగతా శాస్త్ర విజ్ఞాన రంగాలన్నింటిలోనూ గణితం ప్రధాన భూమిక వహిస్తూ ఉంటుంది. గణితంలో మూడు ప్రధాన విభాగాలు ఉన్నాయి.

**శుద్ధ గణితం :** వినియోగ ప్రమేయంలేని గణిత అధ్యయనం శుద్ధ గణితంగా పరిగణిస్తారు. ఈ శతాబ్దారంభంలో జీవించిన సుప్రసిద్ధ భారతీయ గణితవేత్త శ్రీనివాసరామానుజం ఈ రంగంలో కృషి చేసి ప్రపంచానికి అనేక గణిత సమస్యల పరిష్కారాల్ని అందించాడు.



సుప్రసిద్ధ శుద్ధగణిత వేత్త
శ్రీనివాస రామానుజన్

**వినియుక్త గణితం :** ఇతర కార్యరంగాల్లోను శాస్త్ర రంగాలకు పనికి వచ్చే గణితం.

**సాంఖ్యక శాస్త్రం :** మానవ వనరులు, సహజ సంపద వంటి అనేక విషయాలకు సంబంధించిన సంఖ్యా వివరాల్ని సేకరించి విశ్లేషణ చేయడం. ఉదాహరణకు భారతదేశపు జనాభా లెక్కలు పదేళ్లకు ఒకసారి సేకరించి దేశ ఆర్థికాభివృద్ధికి ప్రణాళికలు సిద్ధపరచడానికి సాంఖ్యాశాస్త్రం (స్టాటిస్టిక్స్) వినియోగపడుతుంది.

## అంకెలు

ప్రపంచ వ్యాప్తంగా ప్రధానంగా మూడు రకాల అంకెలవ్యవస్థ అమలులో ఉంది,

**దశాంశ పద్ధతి :** 10 ఆధారంగా '0' నుండి '9' వరకు అంకెలు ఉన్న పద్ధతిని దశాంస పద్ధతి అని అంటారు. దీనిని అరబిక్ పద్ధతి అని కూడ అంటారు. ఈ పద్ధతి భారతదేశంలోనే ప్రారంభమైనదనడానికి ఆధారాలు ఉన్నాయి. అసలు శూన్య '0' భావనకు ఆది స్థానం భారతదేశమే.

**రోమన్ పద్ధతి :** రెండవ పద్ధతి రోమను పద్ధతి. ఇది ఇంగ్లీషు (లాటిన్) అక్షరాలు I, V, X, L, C, M (1, 5, 10, 50, 100, 1000) ఆధారంగా రూపుగొన్నవి.

రోమన్ పద్ధతిలో I అనే ఇంగ్లీషు అక్షరం 1 సూచిస్తుంది. 2 రాయాలంటే 'II' అలాగే 3 కి III. ఇక 'V' 5ను సూచిస్తుంది. 'X' పదిని, 'L', 50ని, 'C' 100ని, 'M' 1000ని సూచిస్తాయి. ఈ అక్షరాల కలయిక వల్ల ఇతర అంకెలు ఏర్పడతాయి. అధిక విలువగల అక్షరం ముందు, తక్కువ విలువగల అక్షరం వస్తే అది దాని నుండి తీసివేయాలి. తరువాత వస్తే దానికి అది కలపాలి. ఉదాహరణకు XL అంటే 40, LX 60 అని అర్థం.

**బైనరీ పద్ధతి :** మూడవ పద్ధతి బైనరీ పద్ధతి. దీనిని కంప్యూటరులలో వాడుక చేస్తారు. ఇందులో '0', '1' మాత్రం వాడితే సరిపోతుంది.

## తెలుగు అంకెలు - సంఖ్యామానం

| అంకె | స్థానం | సంఖ్య |
|---|---|---|
| ౧ | ఒకటి | 1 |
| ౧0 | పదవ | $10^1$ |
| ౧00 | నూరు | $10^2$ |
| ౧000 | వేయి | $10^3$ |
| ౧0,000 | పదివేలు | $10^4$ |
| ౧,00,000 | లక్ష | $10^5$ |
| ౧0,00,000 | పదిలక్షలు | $10^6$ |
| ౧,00,00,000 | కోటి | $10^7$ |
| ౧0,00,00,000 | దశకోటి | $10^8$ |
| ౧00,00,00,000 | శతకోటి | $10^9$ |
| ౧000,00,00,000 | సహస్రకోటి<br>అర్బుదం | $10^{10}$ |
| ౧0000, 00,00,000 | న్యర్బుదం | $10^{11}$ |
| ౧00000,00,00,000 | ఖర్వం | $10^{12}$ |
| ౧000000,00,00,000 | మహాఖర్వం | $10^{13}$ |
| ౧0000000,00,00,000 | పద్మం | $10^{14}$ |
| ౧00000000,00,00,000 | మహాపద్మం | $10^{15}$ |
| ౧00000000,00,00,000 | క్షోణి | $10^{16}$ |
| ౧000000000,00,00,000 | మహాక్షోణి | $10^{17}$ |
| ౧000000000000000000 | శంఖం | $10^{18}$ |
| ౧0000000000000000000 | మహాశంఖం | $10^{19}$ |
| ౧0000000000000,00,00,000 | క్షితి | $10^{20}$ |

ఇలాగ 1 పక్కన సున్నాలు చేరిస్తే $10^{21}$ మహాక్షితి; $10^{22}$ - క్షోభం; $10^{23}$ - మహాక్షోభం; $10^{24}$ - నిధి; $10^{25}$ - మహానిధి; $10^{26}$ - పరతం; $10^{27}$ - పరార్థం; $10^{28}$ - అనంతం; $10^{29}$ - సాగరం $10^{30}$ - అవ్యాయం; $10^{31}$- అమృతం; $10^{32}$ - అచింత్యం; $10^{33}$ - అమేయం; $10^{34}$ - భూరి; $10^{35}$ - మహాభూరి.

## సమాన సంఖ్యలు

| అరెబిక్ | రోమన్ | బైనరీ | అరెబిక్ | రోమన్ | బైనరీ |
|---|---|---|---|---|---|
| 1 | I | 1 | 50 | L | 110010 |
| 2 | II | 10 | 60 | LX | 111100 |
| 3 | III | 11 | 64 | LXIV | 1000000 |
| 4 | IV | 100 | 90 | XC | 1011010 |
| 5 | V | 101 | 99 | XCIX | 1100011 |
| 6 | VI | 110 | 100 | C | 1100100 |
| 7 | VII | 111 | 128 | CXXVIII | 10000000 |
| 8 | VIII | 1000 | 200 | CC | 11001000 |
| 9 | IX | 1001 | 256 | CCLVI | 100000000 |
| 10 | X | 1010 | 300 | CCC | 100101100 |
| 11 | XI | 1011 | 400 | CD | 110010000 |
| 12 | XII | 1100 | 500 | D | 111110100 |
| 13 | XIII | 1101 | 512 | DXII | 1000000000 |
| 14 | XIV | 1110 | 600 | DC | 1001011000 |
| 15 | XV | 1111 | 900 | CM | 1110000100 |
| 16 | XVI | 10000 | 1,000 | M | 1111101000 |
| 17 | XVII | 10001 | 1,024 | MXXIV | 10000000000 |
| 18 | XVIII | 10010 | 1,500 | MD | 10111011100 |
| 19 | XIX | 10011 | 2,000 | MM | 11111010000 |
| 20 | XX | 10100 | 4,000 | M$\overline{V}$ | 111110100000 |
| 21 | XXI | 10101 | 5,000 | $\overline{V}$ | 1001110001000 |
| 30 | XXX | 11110 | 10,000 | $\overline{X}$ | 10011100010000 |
| 32 | XXXII | 100000 | 200,000 | $\overline{XX}$ | 100111000100000 |
| 40 | XL | 101000 | 100,000 | $\hat{C}$ | 11000011010100000 |

## దశాంశ గుణిజాలు

| ఉపసర్గ | సంకేతం | | గుణిజాంకం |
|---|---|---|---|
| తేరా | T | $10^{12}$ | 1,000,000,000,000 |
| గిగా | G | $10^{9}$ | 1,000,000,000 |
| మెగా | M | $10^{6}$ | 1,000,000 |
| కిలో | k | $10^{3}$ | 1,000 |
| హెక్టా | h | $10^{2}$ | 100 |
| డెకా | da | 10 | 10 |
| డెసి | d | $10^{-1}$ | 0.1 |
| సెంటీ | c | $10^{-2}$ | 0.01 |
| మిల్లీ | m | $10^{-3}$ | 0.001 |
| మైక్రో | μ | $10^{-6}$ | 0.000,001 |
| నానో | n | $10^{-9}$ | 0.000,000,001 |
| పైకో | p | $10^{-12}$ | 0.000,000,000,001 |
| ఫెమ్టో | f | $10^{-15}$ | 0.000,000,000,000,001 |
| అట్టో | a | $10^{-18}$ | 0.000,000,000,000,000,001 |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | | అరెబిక్ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 𒐕 | 𒐖 | 𒐗 | 𒐘 | 𒐙 | 𒐚 | 𒐛 | 𒐜 | 𒐝 | 𒌋 | | బాబిలోనియా |
| Α | Β | Γ | Δ | Ε | Ζ | Η | Θ | Ι | Κ | | గ్రీకు |
| I | II | III | IV | V | VI | VII | VIII | IX | X | | రోమను |
| 一 | 二 | 三 | 四 | 五 | 六 | 七 | 八 | 九 | 十 | | చైనీను |
| • | •• | ••• | •••• | — | •<br>— | ••<br>— | •••<br>— | ••••<br>— | —<br>— | ◯ | మాయా |
| १ | २ | ३ | ४ | ५ | ६ | ७ | ८ | ९ | १० | ० | భారతీయ (హిందీ) |
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౦ | తెలుగు |

రోమనులకు 'సున్నా' లేదు. అందుచేత లెక్కలు కట్టడం దుర్లభం. 15 శతాబ్దాల క్రితం భారత దేశంలో 'సున్నా' (శూన్యం) భావాన్ని (0) ప్రప్రథంగా ప్రవేశపెట్టారు.

# గణిత పరికర్మలు

## సంకలనము :

ఒకటి లేదా అంతకంటే ఎక్కువ అంకెల మొత్తమును సంకలనము లేదా కూడిక అంటారు. దీనికి గుర్తు '+'.

**ఉదా :** ఒక తరగతిలో నలుగురు బాలురు, ఏడు మంది బాలికలు గలరు. మొత్తము 11 మంది.

$$\begin{array}{r}7\\+\ 5\\\hline 12\end{array}\quad\begin{array}{r}6\\+\ 9\\\hline 15\end{array}\quad\begin{array}{r}5\\+\ 3\\\hline 8\end{array}\quad\begin{array}{r}26\\+\ 13\\\hline 39\end{array}\quad\begin{array}{r}36\\+\ 15\\\hline 51\end{array}\quad\begin{array}{r}23\\+\ 92\\\hline 115\end{array}$$

ఒక తోటలో 125 మామిడి చెట్లు, 163 కొబ్బరి చెట్లు, 231 నారింజ చెట్లు కలవు. తోటలో ఉన్న మొత్తం చెట్లు ఎన్ని?

| | |
|---|---|
| తోటలో ఉన్న మామిడి చెట్లు | = 125 |
| కొబ్బరి చెట్లు | = 163 |
| నారింజ చెట్లు | = 231 |
| తోటలోని మొత్తం చెట్లు | = 519 |

ఒక గ్రంథాలయంలో 324 తెలుగు పుస్తకాలు, 184 హిందీ పుస్తకాలు, 226 ఇంగ్లీషు పుస్తకాలు ఉన్నవి. మొత్తం పుస్తకాలు ఎన్ని?

| | |
|---|---|
| తెలుగు పుస్తకాలు | = 324 |
| హిందీ పుస్తకాలు | = 184 |
| ఇంగ్లీషు పుస్తకాలు | = 226 |
| మొత్తం పుస్తకాలు | = 734 |

## వ్యవకలనము :

ఒక అంకె నుండి మరొక అంకెను తీసివేయడాన్ని వ్యవకలనము లేదా తీసివేత అంటారు. దీనికి గుర్తు '–'. దీనిని 'మైనస్' అని చదువుతారు.

**ఉదా :** ఒక ప్యాకెట్‌లో 16 బిస్కట్లు ఉన్నవి. అందులో 5 బిస్కట్లను తినగా ఎన్ని బిస్కట్లు ఉంటాయి? మొత్తం 11 బిస్కట్లు ఉంటాయి.

$$\begin{array}{r}10\\-\ 9\\\hline 1\end{array}\quad\begin{array}{r}13\\-\ 7\\\hline 5\end{array}\quad\begin{array}{r}18\\-\ 6\\\hline 12\end{array}\quad\begin{array}{r}85\\-\ 34\\\hline 51\end{array}\quad\begin{array}{r}64\\-\ 38\\\hline 26\end{array}\quad\begin{array}{r}92\\-\ 47\\\hline 45\end{array}$$

ఒక గంపలో మామిడి అరటి పండ్లు కలిపి 25 కలవు. వాటిలో 12 అరటి పండ్లు. అయిన మామిడి పండ్లు ఎన్ని?

| | |
|---|---|
| గంపలోని మొత్తం పండ్లు | = 25 |
| అరటి పండ్లు | = 12 |
| గంపలోని మామిడి పండ్లు | = 13 |

ఒక పాఠశాలలో 545 మంది విద్యార్థులు కలరు. అందులో బాలురు 325 మంది. అయిన బాలికలు ఎంత మంది?

| | |
|---|---|
| పాఠశాలలోని మొత్తం విద్యార్థులు | = 545 |
| బాలురు | = 325 |
| మిగిలినవారు బాలికలు | = 220 |

## గుణకారము :

ఒక సంఖ్యకు అదే సంఖ్యను మళ్ళీ మళ్ళీ కూడడాన్ని గుణకారము అంటారు. దీనికి గుర్తు 'X' (ఇంటు).

ఉదా : 7 X 5 అంటే 7ను 5 చేత గుణించడం. అంటే $7 \times 5 = 7 + 7 + 7 + 7 + 7 = 35$

ఒక్కొక్క బుట్టలో 6 మామిడి పండ్లు ఉన్నాయి. 3 బుట్టలలో మొత్తం ఎన్ని మామిడి పండ్లు ఉండును?

| | |
|---|---|
| ఒక బుట్టలోని పండ్లు | = 6 |
| రెండవ బుట్టలోని పండ్లు | = 6 |
| మూడవ బుట్టలోని పండ్లు | = 6 |
| మూడు బుట్టలలోని మొత్తం పండ్లు | = 18 |

$4 \times 0 = 0 + 0 + 0 + 0 = 0$ $7 \times 0 = 0 + 0 + 0 + 0 + 0 + 0 + 0 = 0$

'0'తో ఏ సంఖ్యను గుణించినా ఫలితం '0' మాత్రమే వస్తుంది.

$4 \times 1 = 1 + 1 + 1 + 1 = 4$ $5 \times 1 = 1 + 1 + 1 + 1 + 1 = 5$

'1'తో ఏ సంఖ్యను గుణించినా ఫలితం అదే సంఖ్య వస్తుంది.

ఒక్కొక్క తరగతిలో 42 మంది బాలురు కలరు. 4 తరగతులలో ఎంత మంది ఉంటారు?

ఒక్కొక్క తరగతిలో బాలురు = 42 మంది

4 తరగతులలో బాలురు = 42 X 4

మొత్తం బాలురు = 168

ఒక సిమెంటు బస్తా రు. 135 లు. 5 బస్తాల ఖరీదు ఎంత?

ఒక సిమెంటు బస్తా ఖరీదు = 135 రూ॥లు

5 బస్తాల ఖరీదు = 135 X 5

మొత్తం పైసలు = 675

## భాగాహారము :

కొన్ని వస్తువులను సమానమైన భాగాలు చేసి పంచుకోవడాన్నే భాగాహారం అని అంటారు. దీనికి గుర్తు '÷' (డివైడెడ్ బై).

ఉదా : 6 పండ్లను ఇద్దరు పంచుకున్న ఒక్కొక్కరికి ఎన్నేసి వస్తాయి? ఎన్ని మిగులుతాయి?
ఒక్కొక్కరికి 3 పండ్లు వస్తాయి. ఏమి మిగలవు.

10 రూ॥లను ముగ్గురు పంచుకున్న ఒక్కొక్కరికి ఎన్నేసి వస్తాయి? ఎంత మిగులుతుంది?
3 ఒక్కొక్కరికి రూపాయలు వస్తాయి. 1 రూపాయి మిగులుతుంది.

16 రూపాయలను ఇద్దరు సమానంగా పంచుకుంటే ఒక్కొక్కరికి ఎన్నేసి వస్తాయి?

```
2 ) 16 ( 8
    16
    ---
     0
```

$16 \div 2 = 8$

63 మొక్కలను వరుసకు 6 చొప్పున ఎన్ని వరుసలలో నాటవచ్చును? ఎన్ని మిగులుతాయి?

```
6 ) 63 ( 10
    60
    ---
     3
```

10 వరుసలలో నాటవచ్చు.
3 మొక్కలు మిగులుతాయి.

# భౌతిక శాస్త్రం

ద్రవ్యం - శక్తి అధ్యయనం చేసే విజ్ఞానశాస్త్ర శాఖ భౌతిక శాస్త్రం. రసాయన శాస్త్రం భూశాస్త్ర శాఖలను అధ్యయనం చేయడానికి కూడా ఇది కీలకపాత్ర వహిస్తుంది. రోదసీ కుహరంలోకి పరిశోదనా సాధనాల్ని పంపడానికి మానవుడు కాలూనడానికి భూమి చుట్టూ కక్ష్యల్లో కృత్రిమ ఉపగ్రహాల్ని దింపడానికి భౌతిక శాస్త్రం నియమాలే మూలాధారాలు. 17వ శతాబ్దం లో ఐజాక్ న్యూటన్ ప్రప్రథమంగా ప్రచురించిన న్యూటన్ గతి నియమాలే ఈ కార్యకలాపాలన్నిటికి ఆధారం. నేటి నవనాగరికత అంతా ఈ నియమాల ప్రాతిపదికగా తీసుకుని నడుస్తున్నది. ఈ 20వ శతాబ్ది ఆరంభంలో ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ సాపేక్షసిద్ధాంతాన్ని (రెలిటివిటీ) ప్రవచించడంతో భౌతికశాస్త్రం మరో అడుగు ముందుకు వేసింది. అనేక మంది శాస్త్రవేత్తల కృషి ఫలితంగా భౌతికశాస్త్రంలో అనేక విభాగాలు ఏర్పడ్డాయి.

### భౌతిక శాస్త్ర శాఖలు

శబ్ద శాస్త్రం : అకౌస్టక్స్‌సౌండ్ (ధ్వని) ధ్వని తరంగాల అధ్యయం.

**పరమాణు భౌతికశాస్త్రం (అటామిక్ ఫిజిక్స్) :** పర మాణువు, పరమాణు నిర్మాణం, పరమాణు ధర్మాలను గూర్చి అధ్యయనం.

**జీవభౌతిక శాస్త్రం :** బయోఫిజిక్స్ జీవప్రక్రియలకు సంబంధించిన భౌతిక శాస్త్రం.

**విద్యుత్తు గతి శాస్త్రం (ఎలక్ట్రో డైనమిక్స్)** విద్యుత్తు - యాంత్రిక శాస్త్రాల పరస్పర సంబంధాలను గూర్చి అధ్యయనం.

**యాంత్రిక శాస్త్రం (మెకానిక్స్) :** నిశ్చల స్థితిలోనూ కదలుచున్న వస్తువుల గురించి అధ్యయనం.

## న్యూటన్ గతి నియమాలు

ఐజాక్ న్యూటన్ అనే బ్రిటీషు విజ్ఞాని రోదసీలోనూ భూమి మీద వస్తువుల గమనం కింది మూడు గతి నియమాలననరించి ఉంటుందని 1687లో ప్రతిపాదించాడు.

1. ప్రతి వస్తువూ, దాని స్థితిని మార్చుటకు ఏ బాహ్య బలమూ పని చేయకపోతే అది నిశ్చల స్థితిలోగాని సమ వేగంతో ఋజు మార్గంలో పోయే స్థితిలోగాని ఉండి పోతుంది. ఇది వస్తువు యొక్క ధర్మాన్ని సూచిస్తుంది.

2. వస్తువుల త్వరణంలో వాటిపై పనిచేసే బాహ్య బలానికి అనులోమానుపాతంలోనూ, వాటిద్రవ్య రాసులకు విలోమాను పాతంలోనూ ఉంటుంది. అది బల దిశలో ఉంటుంది. వస్తువు యొక్క ద్రవ్యవేగం (మోమెంటం) మార్పురేటు దానిపై కలిగించబడిన బాహ్య బలానికి అనులోమానుపాతంలో ఉండి అదే దిశలో కలుగుతుంది. (ఎఫ్ = ఎమ్ × ఏ)

3. ప్రతి ఒక్క చర్యకు దానికి సమానంగా వ్యతిరేక దిశలో ప్రతిచర్య ఉంటుంది. లేదా రెండు వస్తువులు ఒకదానిపై ఒకటి పరస్పర చర్య జరుపుకున్నప్పుడు ఆ బలాలు రెండూ పరిణామంలో సమానంగానూ దిశలో వ్యతిరేకంగానూ ఉంటాయి.

అంటే తారాజువ్వ ఆకాశంలో పైకిగిసినప్పుడు ఈ సూత్రం పైనే పనిచేస్తుంది. అట్లే రోదసీలోనికి పొయ్యే రాకెట్లు కూడ ఈ సూత్రంపైనే పని చేస్తాయి. రాకెట్ పృష్ఠభాగంనుండి వెలువడుతున్న మండే వాయువు రాకెట్టును నొక్కునప్పుడు రాకెట్టు ముందుకు (పైకి) దూసుకుపోతూ ఉంటుంది.

వాస్తవానికి, నేటి జల, వాయువు, వాహనాలు, యంత్రజగత్తు ఈ న్యూటన్ గతి సూత్రాలపైనే ఆధారపడి పనిచేస్తున్నాయి. (అంటే న్యూటన్ గతి సూత్రాలు నేటి నాగరికతకు జీవగర్ర)

**కేంద్రక భౌతిక శాస్త్రం : (న్యూక్లియర్ ఫిజిక్స్) :** పరమాణు కేంద్రకాన్ని గూర్చి, కేంద్రకంలో జరుగు రాసాయనిక, భౌతిక మార్పులను గూర్చి అధ్యయనం.

**అతిశీల శాస్త్రం (క్రయోజానిక్స్) :** అతిశీతల ఉష్ణోగ్రతను గూర్చి అధ్యయనం.

**చాక్షుస శాస్త్రం : (ఆప్టిక్స్) :** కాంతిని గూర్చి అధ్యయనం.

**ఘన-స్థితి భౌతిక శాస్త్రం : (సాలిడ్ స్టేట్ ఫిజిక్స్):** ఘన స్థితిలో ఉన్న ధాతువుల ధర్మాలు, తాపప్రేషముల ప్రభావాన్ని గూర్చి అధ్యయనం.

**ఉష్ణశాస్త్ర (హీట్) :** ద్రవ్యాలపై ఉష్ణ ప్రభావాన్ని గూర్చి అధ్యయనం.

**ద్రవభౌతిక శాస్త్రం :** (ఫ్లూయిడ్ ఫిజిక్స్) వాయు - ద్రవముల అధ్యయనం.

**భూభౌతిక శాస్త్రం (జియోఫిజిక్స్)** భూమిని గూర్చి భౌతిక శాస్త్ర అధ్యయనం.

**తాపగతి శాస్త్రం (తెర్మోడైనమిక్స్)** పని - శక్తులను గూర్చి అధ్యయనం.

---

## అయస్కాంతత్వం

విద్యుత్తును ఇటీవలే కనుగొన్న మానవుడు అయస్కాంత స్వభావాన్ని ఎప్పుడో ఇనుప వస్తువులన్ని ఆకర్షించే **'సూదంటు రాయి'** ద్వారా తెలుసుకున్నాడు. 'మాగ్నెట్' అనే పదానికి మూలం సూదంటురాయి లభించే ప్రాంతం మాగ్నేసియా గ్రాస్ కావడం **'మాగ్నెటు'** కు ఒకవైపు దక్షిణ ధృవం రెండు వైపు ఉత్తర ధృవం ఉంటాయి. అయస్కాంత బలం ఈ ధృవాల దగ్గర కేంద్రీకృతమై ఉంటుంది. విజాతి ధృవాలు ఆకర్షించుకుంటాయి. సజాతి ధృవాలు వికర్షించు కోవడం మాగ్నెటు స్వభావం. 'దిక్సూచి' (కంపాస్)ని ఈ సూత్రం మీదనే ఆధారపడి నిర్మిస్తారు.

విద్యుదయస్కాంతత్వం ఆకాశంలో శక్తి విద్యుత్ తరంగాల రూపంగా పయనిస్తుంది. ఈ విద్యుత్తరంగజాల

## లేజర్ అంటే ఏమిటి?

లేజర్ - లైట్ ఆంప్లిఫికేషన్ బై స్టిములేటెడ్ ఎమిషన్ ఆఫ్ రేడియేషన్ - **Light Amplification by Stimulated Emission of Radiation** అన్నదానిలో పదాల ప్రారంభ అక్షరాల పదబంధం లేజర్ (LASER). లేజర్ కాంతి పుంజంతో ఇనుము వంటి ధాతువును కోతకోయవచ్చు. సంగీతం పాడించవచ్చు. శస్త్ర చికిత్సలో దీని వినియోగించి ప్రోస్టేట్‌గ్రంధి వాపును నివారింప చేయవచ్చు.

సాధారణ కాంతి విభిన్న తరంగ దైర్ఘ్యాలు కలిగి ఉంటుంది. లేజర్ కాంతి తరంగాలు ఒకే విధంగా ఉండి క్రమపద్దతిలో అతి సన్నని కాంతి పుంజమై శక్తివంతంగా పని చేస్తుంది. మామూలు కాంతి వలె చెల్లాచెదురవ్వదు. తత్ఫలితంగా అది. శస్త్ర చికిత్సలో కోత కోయగలదు. సిడి రామ్ లోని సమాచారాన్ని గాని సంగీతాన్ని గాని తెలిసేలాగ విడదీసి చెప్పగలరు. డి.టి.పి. (డెస్కటాప్ పబ్లిషర్) ప్రింటర్లో వాడుక చేసేది కూడా 'లేజర్ సూత్రమే'.

మంతటిని విద్యుదయస్కాంత వర్ణమాలగా పేర్కొంటారు. ఈ తరంగాలలో చాలవరకు కంటికి కన్పించనివే. కాగా, విద్యుదయస్కాంత వర్ణమాలలో కంటికి కన్పించే ఒక చిన్న భాగాన్ని 'దృశ్యకాంతి' అని అంటారు. ఈ దృశ్యకాంతి తరంగశక్తిని వినియోగించే చెట్లు కిరణజన్య సంయోగక్రియ అనే ప్రక్రియ ద్వారా ఆహారాన్ని సిద్ధపరచుకుంటాయి. మరొక విధంగా చెప్పాలంటే భూమి మీద మనుగడ సాగించే జంతుకోటి అంతా తమ ఆహారవసరాలు తీరటానికి మొక్కల మీదనే ఆధారపడి ఉన్నాయన్న విషయం సత్యం. ఇంద్ర ధనుస్సులో కనిపించే ఏడు రంగులో (ఎరుపు, నారింజ, పసుపు, ఆకుపచ్చ, నీలవర్ణం నీలి, ఊదా) ఈ దృశ్య కాంతిలో ఉన్నాయి.

విద్యుదయస్కాంత తరంగాల్ని రెండు విధాలయిన కొలతలుగా పేర్కొంటారు. 1. తరంగ దైర్ఘ్యం పక్కన పక్క తరంగ శీర్షాల మధ్య దూరం. (ఇది మీటరులలో ఉంటుం ది) 2. పౌనఃపున్యం (ఫ్రీక్వెన్సీ) : సెకనులో జరుగుచున్న తరంగాల సంఖ్య. దానికి 'హెర్ట్జ్' (Hz) కొలత ప్రమాణం.




అయస్కాంత క్షేత్రబలరేఖలు









## ఉష్ణం

వేడిమి మూడు విధాలుగా ఉంటుంది. 1) ఘన పదార్థాల అణువుల ద్వారా ప్రసరించే విధానం 'వహనం' (కండక్షన్) ఉదా: అట్లకాడ ఒకవైపు నిప్పులో పెట్టి రెండోవైపు పట్టుకుంటే చెయ్యి కాలుతుంది. 2) ద్రవ వాయు పదార్థాల ద్వారా వేడిమి ప్రసరించే విధానం - **సంవహనం** (కన్వెక్షన్) ఉదా: పొయ్యి మీద పాత్రలోని నీరు అడుగున వున్న నీరు మొదట వేడెక్కి తరువాత పై నీరు వేడెక్కుతుంది. ఇక మూడవ విధానం **వికిరణం** (రేడియేషన్) వేడిమి ఖాళీ ప్రదేశంలో తరంగాల రూపంలో ప్రసరిస్తుంది. సూర్యుని వేడిమి ఈ విధంగా భూమికి





వికిరణం




ఉష్ణోగ్రతను కొలిచే తెర్మోమీటరు

## కాంతి

**పరావర్తనం**

అద్దంలో చూచుకుంటే కాంతి కిరణాలు పరావర్తనమై ప్రతిబింబం కనిపిస్తుంది.



### వక్రీభవనం

గ్లాసు నీళ్లలో ఒక పెన్సిలు ఉంచితే వంపు కనిపిస్తుంది. కాంతి కిరణాలు నీటిలో వక్రీభవనానికి గురియై వంపు కనిపిస్తుంది.



వక్రీభవనం

## యంత్ర సౌలభ్యం

### తులాదండం మూడు రకాలు

1) బలం - భారం మధ్య ఆధారం ఉంటుంది. 2) ఆధారం బలం మధ్య ఆధారం ఉంటుంది. 3) ఆధారం భారం మధ్య బలం ఉంటుంది.




### వాలుబల్ల

బరువుల్ని దింపడానికి వాలుబల్ల ఉపయోగపడుతుంది. ఆసుపత్రుల్లోనూ, కర్మాగారాల్లోనూ



ఈ వాలుబల్ల సూత్రాన్ని ఉపయోగించే 'రాంప్' లను (మెట్లకు బదులుగా) నిర్మిస్తారు.

### కప్పీలు

బావిలోంచి నీరు తోడడానికి, బరువుల ఎత్తడానికి కప్పీల వల్లనే సులభంగా సాధ్యమవుతుంది.



## ఇంజనీరింగ్ - టెక్నాలజీ

సైన్సు-శాస్త్రం విజ్ఞానం - ఇంజనీరింగు సూత్రాలను పరిశ్రమల్లో వినియోగించే పద్ధతి టెక్నాలజీ రంగానికి చెందుతుంది. వాస్తవానికి మనం ఇప్పుడు టెక్నాలజీ యుగంలో నివసిస్తున్నాం. దీని వినియోగం సర్వాంతర్యామి. ఇంటిలోనూ ఫ్యాక్టరీలోనూ ఆఫీసులోనూ పాఠశాలలోనూ చికిత్సాకేంద్రాల్లోనూ అన్నిట టెక్నాలజీ విస్తరించి ఉంది. ఆధునిక టెక్నాలజీ ప్రజోపయోగ సేవల్లో ప్రస్ఫుటంగా కానవస్తున్నది. తాగేనీటి సరఫరా, వంటకు ఇంధనం, విద్యుత్తు సరఫరా, ఆధునికమైన మురుగునీటి వ్యవస్థ, పెంట కుప్పల్ని తరలించడం, టెలిఫోన్, రేడియో, టెలివిజన్, కృత్రిమ ఉపగ్రహం (శాటిలైట్) ద్వారా ప్రసార వ్యవస్థ - ఒకటేమిటి అన్ని ఆధునిక సౌకర్యాలకూ టెక్నాలజీయే ప్రాతిపదికగా వ్యవహరిస్తున్నది. ఇంటినుంచి పనిచేసే చోటుకు, పాఠశాలకు, ఆఫీసుకు ఎక్కడకు వెళ్లాలన్నా బస్సు, కారు, రైలు ఏదో ఒకటి లేకుండా నిముషం గడవదు. ఆఖరకు సాధారణమయిపోయిన సైకిలు కూడా టెక్నాలజీ ప్రసాదించినదే!

ఆధునిక కర్మాగారాలలో యంత్రాలు నిర్దుష్టంగా పనిచేయాలంటే వాటిని నేడు కంప్యూటరుచే నియంత్రిస్తూ ఉంటారు. నేటి ఆఫీసుల్లో ఎలక్ట్రానిక్ టైపురైటరులు సర్వ సాధారణమయినాయి. ఆసుపత్రుల్లో రోగ నిదానానికి కంప్యూటర్ టోమోగ్రఫీ, సి.టి. స్కానింగ్ మాగ్నెటిక్ రెసొనెన్స్ ఇమేజ్ (ఎమ్.ఆర్.ఐ.), ఇ.సి.జీ. యంత్రాలు, ఎక్స్-రే మెషీన్లు హృదయ స్థాయిని తెలియజేసే ఎలక్ట్రానిక్ యంత్రాలు ఎన్నో వినియోగంలోకి వచ్చి మానవ కల్యాణానికి పనిచేస్తున్నాయి. అల్ట్రాసానిక్ యంత్రాలు శరీరంలోపలి భాగాల్నీ, గర్భస్థ పిండం ఆడ/మగ నిర్ధారణ - అమ్నియోసెంటిసిస్ ప్రత్యక్షంగా చూపిస్తాయి. ఇక ముద్రణ రంగంలోను డి.టి.పి (డెస్క్ టాప్ పబ్లిషింగ్), కలర్ స్కానింగ్ వంటి ఆధునిక ఎలక్ట్రానిక్ పరికరాలు ఎంతో శ్రమ తగ్గించడమేగాక చక్కటి ముద్రణను అందించడానికి ఉపయోగపడుతున్నాయి.

ఈ టెక్నాలజీ అంతా ఇటీవలిదే. 1700 తర్వాతనే పారిశ్రామిక విప్లవంతో ప్రారంభమయి శాంతియుతంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఈ విప్లవం గ్రేట్ బ్రిటన్‌లో ప్రారంభమయింది. దానికి కారణం ఆకాలంలో ఆ దేశంలో పరిస్థితులు అనుగుణంగా ఉండటమే. దేశం శాంతియుతంగా ఉంది. ఐశ్వర్యం మూడు పువ్వులు ఆరు కాయలుగా వికసించి ఉంది. ఈ విప్లవం ఆదిలో జౌళీరంగంలో సంభవించింది. ఆనాడు దారాన్ని వడికి నేత నేయడానికి యంత్ర సాధనాలు అందుబాటు లోకి వచ్చాయి. ఆరోజుల్లో నీటి సదుపాయంవున్న నదీ తీరాల్లో జౌళీ కార్ఖానాలు వెలిశాయి. నీటి చక్రాల వల్ల లభ్యమయ్యే శక్తితోనే జౌళీయంత్రాలు తిరిగేవి. అదే సమయంలో అంటే 18వ శతాబ్దంలో యంత్రం తిరగడానికి ఆవిరిని వినియోగించే ఉపాయం బయటపడ్డది. ఇనుము కూడ తేలికగా లభ్యమవడంతో యంత్ర నిర్మాణం సులభతర మయింది. పారిశ్రామిక విప్లవం గ్రేట్ బ్రిటన్‌లో ప్రారంభమయినప్పటికీ మిగతా యూరపు దేశాలకు ఉత్తర అమెరికా దేశాలకు పాకి వర్ధిల్లింది. ఈ దేశాల్లో మేధావులు నూతన నిర్మాణాలను సిద్ధపరచి అందించారు. బట్టను చలువచేసే పద్ధతిని కొత్త డిజైనులలో నేత విధానం ఫ్రెంచివారు కనిపెట్టారు. చౌకగా దూదితో వస్త్ర పరిశ్రమ వర్ధిల్లుతోంది. సాగుపంటల కోతయంత్రాలు రావడంతో

రైతాంగం అభివృద్ధి చెందింది. ఆవిరి యంత్రాలు ఇనుము 1800లలో పుష్కలంగా లభించడం. ప్రారంభమయిన తరువాత రవాణా సౌకర్యాలు పెరిగాయి. 19వ శతాబ్దంలోనే విద్యుత్తు, తంతి, టెలిఫోన్ సౌకర్యాల్ని కనిపెట్టారు. రేడియో, మోటారు వాహనాలు రూపుగొన్నాయి. పిదప 20వ శతాబ్దం ఆరంభంనాటికి విమానం ఆదిస్వరూపాన్ని రైట్ సోదరులు సిద్ధపరచగా హెన్రీ ఫోర్డ్ మోటారు కారును అందరికీ అందే విధంగా అసెంబ్లీ విధానాన్ని ప్రవేశపెట్టాడు. ఈ శతాబ్దంలో రెండు ప్రపంచ యుద్ధాలు జరిగాయి. వాటి ఫలితంగా సైన్సు, ఇంజనీరింగు, టెక్నాలజీ ఉరుకలు పరుగులు తీసింది. 1950 తరువాత కంప్యూటరు వాడకంలోకి రావడం ఆఫీసుల్లోనూ పనులు సులభతరమైనవి. టెక్నాలజీ అభివృద్ధి చెందడం మానవాళికి సుఖశాంతులు కలిగినా మరోవైపు ఈ ప్రగతి దుర్వినియోగమై వాతావరణం కాలుష్యమయి పోతున్నదని విజ్ఞులు వాపోతున్నారు. కార్లు, ఫ్యాక్టరీలు వదిలే పొగ మురికి రసాయనాలవల్ల గాలి, నీరు, నేల కలుషితమై విషపూరితమవడానికి దారితీసింది. సూర్యరశ్మిలో ఉండే హానికరమైన కిరణాలు భూమిని చేరకుండా రక్షించే వాతావరణపు పొర - ఓజోన్ పొర - క్రమంగా ఈ కాలుష్యాల వల్ల విరిగిపోతున్నదని విజ్ఞానులు గోల పెడుతున్నారు. టెక్నాలజీ ప్రసాదించిన సౌకర్యాలను నిలుపదలచుకోవాలంటే దాని కారణంగా దాపురించిన వాతావరణ కాలుష్యాన్ని అదుపులో పెట్టవలసి ఉంది.

ఇంజనీరింగు అన్నమాట సైన్సు - శాస్త్ర విజ్ఞాన పద్ధతులను వినియోగించి అనేక విధాలయిన మానవ సౌకర్యాల్ని సిద్ధపరచుకొనడం, అందులో విభాగాలు చాలా ఉన్నాయి. అవి ప్రధానంగా:

**సివిలు ఇంజనీరింగు** : భవనాలు, రోడ్లు డాములు, నీటి పారుదల సౌకర్యాలు రైలుమార్గాలు, సొరంగాలు వంటి వాటిని నిర్మించుట.

**మెకానికల్ ఇంజనీరింగు** : యంత్రాలు, ఇంజనులు, మోటారు వాహనాలు, విమానాలు, నౌకలు మొదలుగువాటిని నిర్మించుట.

**మైనింగ్ ఇంజనీరింగు** : గనుల త్రవ్వకం ద్వారా ముడి ఖనిజాల్ని వెలికితీయుట.

**మెటలర్జీ (ధాతు సాధన)** : ముడి ఖనిజాల నుండి ధాతువుల్ని సాధించి శోధించుట.

**కెమికల్ ఇంజనీరింగు** : రసాయన ద్రవ్యాలు వినియోగించి ఔషధాలు, ఎరువులు, సిమెంటు, పంచదార, కాగితం ప్లాస్టిక్కు సామాగ్రి, రంగులు, వార్నీషులు, సబ్బులు, సౌందర్య సాధనాలు మున్నగు వాటిని తయారు చేయుట.

ఎలక్ట్రిసిటీ - ఎలక్ట్రానిక్స్

విద్యుత్తు అన్నది శక్తికి మరోరూపం. దీని ప్రభావం నేటి నాగరికతలో ప్రస్ఫుటంగా కన్పిస్తున్నది. కాసేపు కరెంటు ఆగిపోతే ప్రాణసంకటంగా పరిణమించడం మన అందరి అనుభవమే. ఇంటిలో ప్రతి గదిలోనూ వంటింటితో సహా విద్యుత్తు అవసరం కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది. రేడియో - టివీలకూ, వాషిం మెషీన్‌లు ఫాన్‌లు తిరగడానికి ఇంకా స్నానాల గదిలో గెయిజర్ రూపంలో సర్వాంతర్యామిగా ఈనాడు విద్యుత్తు మన చుట్టూ ఉంది. ఇక రవాణా సౌకర్యాలను నడిపించడంలోనూ

పారిశ్రామిక రంగంలో ఫ్యాక్టరీలు పనిచేయడంలోనూ విద్యుత్తు లేకుండా గడవదు. రైలు, బస్సు, విమానం, నౌకవంటి వాటిలో విద్యుత్తు అవసరం ఎంతైనా ఉంది.

### ఎలక్ట్రానిక్ ఇంజనీరింగు

వార్తాప్రసారానికి టెలిఫోన్, టెలెక్స్, టెలివిజన్, వీడియో పరికరాలు తయారీ వినియోగ రంగాలలోనూ, కంప్యూటరుల తయారీ (హార్డ్‌వేర్) వినియోగం (సాఫ్ట్‌వేర్) మొదలగు వాటికి ఎలక్ట్రానిక్ ఇంజనీరింగు ప్రయోజన పడుతుంది. ఆధునాతన గణిత సాధనాలు కాలిక్యులేటరు, కంపూటరు పరికరాలు రేడియో, టి.వీ. సి.డి.రామ్ ఎలక్ట్రానిక్ సూత్రాల మీదనే ఆధారపడి పనిచేస్తాయి.

### కంపూటరులు

ప్రప్రథమ కంప్యూటరు సాధనం యునైటెడ్ స్టేట్స్‌లోని పెన్సిల్వేనియా యూనివర్సిటీలో నిర్మితమైంది. అప్పుడు దానిని ఎలక్ట్రానిక్ న్యూమరల్ ఇంటిగ్రేటర్ (ఎనియాక్) అన్నారు. కంపూటరుకు ఆది రూపమైన దాని బరువు ఆనాడు 30 మెట్రిక్‌టన్నులు. ఇది 140 చ.మీ. స్థలాన్ని ఆక్రమించి ఉండేది. ఇందులో 18,000 వాల్వులు ఉండేవి. అయితే ఈ నాటి పెర్సనల్ కంపూటరు (పి.సీ) బల్లమీద పెట్టుకునే అంతచిన్నది. పైగా ఎనియాక్ కంటె ఎన్నో రెట్లు శక్తి సామర్థ్యాలు కలది. ఈ పిసీల వినియోగం కార్య రంగాలన్నిటిలోనూ ప్రవేశించి మానవునకు తోడ్పడుతూ సహాయకారిగా ఉంది.



### టెక్నాలజీ చిత్ర చయనిక

నేటి మానవునికి టెక్నాలజీ ప్రసాదించిన ఎలక్ట్రానిక్ సాధన సంపత్తి - ఇందులో టెలిఫోన్, రేడియో, కలర్ టెలివిజన్, వీడియో గ్రఫీ, శాటిలైట్ కమ్యూనికేషన్స్ సామగ్రి, కంపూటర్, మోడెమ్, ఫాక్స్, E - మెయిల్, ఇంటర్నెట్, సైబర్‌స్పేస్ సామగ్రి, సెల్యులర్ ఫోన్, పేజర్, మల్టీమీడియా సి.డి.రామ్ ఇంకా ఎన్నో రకాల ఎలక్ట్రానిక్ పరికరాలు యిందులో ఉన్నాయి.

## కంప్యూటర్ అక్షరాస్యత (లిటరసీ) పరిభాష

**అసెంబ్లర్** : అసెంబ్లీ భాషను తాంత్రిక భాషగా మార్చుట

**అసెంబ్లీ లాంగ్వేజీ** : సంకేతాన్ని, పదాల్ని కంప్యూటర్‌లో ఉపయోగించే పద్ధతి.

**ఇ-మెయిల్** : E-Mail పూర్తి రూపం ఎలక్ట్రానిక్ మెయిల్. భిన్న దూర ప్రాంతాల్లో వున్న కంప్యూటర్ నెట్‌వర్క్ (టెలిఫోన్) ద్వారా సందేశాలు, ఉత్తర్వులు, ఉత్తరాలు వినిమయం చేసుకునే వ్యవస్థ.

**ఎమ్.ఎస్ డి.ఓ.ఎస్.** (MS DOS) : మైక్రోసాఫ్ట్ - డిస్క్ ఆపరేటింగ్ సిస్టమ్ (Micro Soft Disc Operating System) పి.సి.లలో వాడుక చేసే కార్యనిర్వాహక వ్యవస్థ.

**ఏ.ఐ. (AI)** : 'కృత్రిమ మేధ **ఆర్టిఫిషియల్ ఇంటిలిజెన్స్**' - దీనిని సాఫ్ట్‌వేర్‌లో ఉపయోగిస్తారు.

**ఏక్సెస్ (Access)** : దూరాన వున్న కంప్యూటర్‌కు తీగద్వారాగాని, రేడియో ద్వారాగాని డాటా బేస్‌ను కలుపుట.

**కంపాటిబిలిటీ** : రెండు కంప్యూటరుల మధ్య అయోధ్య/సయోధ్య- సాధ్యాసాధ్యాలను సూచిం చునది.

**కంపైలర్** : కంటిన్యూస్ స్టేషనరీ పుట లుగా మడతపెట్టే అఖండ పత్రం.

**కర్సర్** : పర్సనల్ కంప్యూటరు (పి.సి)లలో మానిటర్‌పై ఏదైనా భాగాన్ని నియంత్రించే చిరుసాధనం

**కీ-బోర్డు** : కంప్యూటర్‌లోనికి సమాచా రాన్ని (డాటా) ఎక్కిం చేందుకు ఉపయోగించే సాధనం. చూడటానికి టైపు రైటింగ్ కీ-బోర్డులాగనే ఉంటుంది. ఇందులో 'కీ'లు 106 మాత్రం ఉంటాయి.

**కె. (k)** : కిలో బైట్ - 1024 బైట్‌లు.

**కోబాల్** (Cobol) : కామన్ బిజినెస్ ఓరియెంటెడ్ లాంగ్వేజీ (Common Bussiness Oriented Language) - వర్తక వ్యాపారాలలో వాడుక చేసే ప్రోగ్రామ్ లాంగ్వేజీ.

**గ్రాఫిక్స్** : పి.సి. సహాయంతో ముద్రణకార్యాన్ని చిత్రాలను చక్కబెట్టుట. కంప్యూటరు ద్వారా రేఖా చిత్రాలనూ బొమ్మలనూ తయారు చేయుట.

**చిప్** : సిలికాన్ దిమ్మ (మైక్రో చిప్)

**డాటా బేస్** : ఏదైనా ఒక విషయంపై సమాచారాంశాల్ని ఒక చోట (కంప్యూటర్‌లో) చేర్చి భద్రపరచే విధానాన్ని '**డాటా బేస్**' అంటారు. దీన్ని '**ఎలక్ట్రానిక్ డాటా బేస్**' అని కూడా అంటారు. ఉదా : **చిరునామాలు, నిఘంటువు**లోని పదజాలం మొదలగునవి.

**డి.టి.పి.** DTP : దీని పూర్తి రూపం '**డెస్క్ టాప్ పబ్లిషింగ్.**' 'పెర్సనల్ కంప్యూటర్' సాయంతో ముద్రణ కార్యక్రమం చక్క బెట్టే వ్యవస్థ. భిన్నమైన ఫాంట్ సైజులలో ఏ భాషలో నైనా పాఠ్యాంశాన్ని (టెక్స్‌ట్) ముద్రించే విధానం. వెంచూరా, పేజీ మేకర్ వంటి సాఫ్ట్‌వేర్ సాధనాలు దీనిలో ప్రయోగిస్తారు. సమాచారాన్ని చిత్రా లను కూడా పుటలో ఇష్టమైన సైజులో ఇమడ్చి డిజైన్ చేయవచ్చు. ఉదాహరణకు ఈ పుస్తకం డి.టి.పి. ద్వారానే కూర్చబడింది.

**నెట్ వర్క్** : భిన్న ప్రాంతాలోవున్న కంప్యూటర్‌లు అనుసం ధానం చేసే వ్యవస్థ. ఎల్.ఏ. ఎన్ (LAN) అంటే ***లోకల్ ఏరియా నెట్‌వర్క్***. ఒకే భవనంలో భిన్నమైన గదుల్లో వున్న కంప్యూటర్‌లను కలిపే వ్యవస్థ. భిన్నమైన దూర ప్రాంతాల్లోవున్న కంప్యూటర్‌లను కలిపే వ్యవస్థను ***వైడ్ ఏరియా నెట్‌వర్క్***

(WAN డబుల్ యు.ఏ.ఎన్) అంటారు.

**పిక్సెల్** : పిక్చర్ ఎలిమెంట్ దీని పూర్తి స్వరూపం. కంప్యూటర్ మానిటర్‌పై కనిపించే అతిసూక్ష్మమైన చుక్క.

**పి.సి. (PC)** : పెర్సనల్ కంప్యూటరు. ఇది చిన్న పరిమాణంగల కంప్యూటరు.

**ప్రింట్ అవుట్ (Print out)** : పి.సి.నుండి ప్రింటర్ ద్వారా బయటపడే ముద్రిత పత్రం.

**ప్రింటర్** : కంప్యూటరునుండి డాటాను బయట పెట్టి ముద్రించే టైపురైటరు వంటి సాధనం. వీటిలో రకాలు డాట్ మాట్రిక్స్, లైన్ ప్రింటర్, ఇంక్ జెట్ ప్రింటర్, లేజర్ ప్రింటర్.

**ప్రోగ్రామింగ్ (Programming)** : ఏదైనా ఒక ప్రత్యేకమైన కార్యనిర్వ హణకై కంప్యూటర్‌ను సిద్ధపరచు పద్ధతి.

**ఫార్మట్ డిస్క్ (Format Disk)** : డాటాను స్వీకరించుటకు వీలుగా ఫ్లాపీని ఎలక్ట్రానిక్‌గా గుర్తుపెట్టుట.

**ఫైలు** : డాటా - సమాచార సంచయం.

**ఫోర్ట్రాన్ (Fortran)** : ఫార్ములా ట్రాన్స్‌లేషన్.

**ఫ్లాపీ/ డిస్క్** : సమాచారాన్ని (డాటా) నిల్వ చేసే సాధనం. ఇవి గుండ్రంగా 3.5" లేదా 5.25" సైజులలో లభిస్తాయి. ఇందులో డబుల్ డెన్సిటీ/హై - డెన్సిటీ రకాలు ఉంటాయి. డబుల్ డన్సిటీ కన్న హై-డెన్సిటీ ఫ్లాపీలలో ఎక్కువ సమాచారాన్ని నిల్వ చేయవచ్చు. వీటిలో ముద్రించిన సమాచారాన్ని చెరిపివేసి కొత్త సమాచారాన్ని ఎక్కించే అవకాశం ఉంది.

**బేసిక్ (Basic)** : బేసిక్ ఆల్ పర్పస్ సింబాలిక్ ఇన్‌స్ట్రక్షన్ కోడ్ (Basic All purpose Symbolic Instruction Code)

**బైట్ (Byte)** : కంప్యూటరు ధారణలో ఒక సంకేతం ఆక్రమించే జాగా.

**బైనరీ** : బిట్ బైనరీ అంకె ఆధారంగా ఏర్పడిన 0/1 సంకేతాలు. కంప్యూటరు ఆన్/ఆఫ్ ద్వారా సాధించవచ్చును.

**మల్టీ మిడియా** : ధ్వని, చిత్రం, ఏనిమిషన్, గ్రాఫిక్స్ వంటి భిన్న మాధ్యమాల్ని ఏదైనా నిర్దిష్ట శీర్షికలో వినియోగించుట. సి.డి. రామ్ (కాంపాక్ట్ డిస్క్ రీడ్ ఓన్లీ మెమొరీ)లో మల్టీ మీడియా ప్రధానమైన భూమిక నిర్వహిస్తుంది. విద్యాబోధన, శిక్షణ, వినోద రంగాల్లో సాయపడుతుంది.

**మానిటర్** : ఇది టెలివిజన్ (టివి) తెర స్క్రీన్ లాగా ఉండేది. ఇది డాటాను ప్రదర్శించే సాధనం. దీనిని వీడియో డిస్‌ప్లే యూనిట్ (విడియూ) అని కూడా అంటారు.

**మెమొరీ** : కంప్యూటర్‌లో భద్రపరచగల సమాచార పరిమాణాన్ని 'మెమొరీ' అంటారు. దీన్ని బైట్, కిలో బైట్, మెగాబైట్ (ఎమ్‌బి), గిగాబైట్ (జి.బి).. లలో కొలుస్తారు. అతిచిన్న మెమొరీ యూనిట్. 'బైట్' కిలోబైట్‌లో '1024' బైట్‌లు ఉంటాయి.

**మైక్రోచిప్** : అతిచిన్న సిలికాన్ దిమ్మ - దీని ద్వారానే కంప్యూటరుకు నిల్వచేసే ధారణశక్తి వస్తుంది.

**మోడెమ్** : (మోడ్యులర్ డిమోడ్యులర్) రెండు కంప్యూటరుల మధ్య పరస్పర వినిమయం టెలిఫోన్ ద్వారా చేయవలసి వచ్చినప్పుడు వాడుక చేసే మధ్యంతర సాధనం.

**మౌస్ (Mouse)** : పిసిలో మానిటర్ స్క్రీన్‌మీద

ర్పరేను కావల్సిన చోటుకు నియంత్రించే సాధనం.

**రామ్ (Rom) (ఆర్.ఓ.ఎమ్.)** : రీడ్ ఓన్లీ మెమరీ **(Read Only Memory)** కంప్యూటరులో ఉంచిన సమాచారం (డాటా) స్విచ్చిని ఆఫ్ చేసినా చెరిగి పోదు. కంప్యూటరులో పనిచేసే సాఫ్ట్ వేర్ ప్రోగ్రాములు - డిస్క్ ఫ్లాపీ రూపంలో లభిస్తాయి.

**రేమ్ (Ram)**[redacted] రేండమ్ ఏక్సెస్ మెమరీ [redacted] దీన్ని కంప్యూటరు [redacted] పరిగణిస్తారు. కంప్యూటరుస్విచ్చిని ఆఫ్ చేస్తే నిల్వచేసినది తుడిచి పెట్టుకు పోతుంది. ఎంత ఎక్కువ రేమ్ ఉంటే కంప్యూటరు అంత శక్తివంతమైనదిగా గుర్తింపు.

**విండోస్** : డిస్క్ ఆపరేటింగ్ సిస్టమ్‌ను చిత్రాల సాయంతో ఉపయోగించడాన్ని తేలిక చేసే నూతన **(1995)** సాధనం. ఈ సాధనం ఉపయోగిస్తే ప్రతిదానికి కమాండ్‌ను కొట్టక్కర్లేదు.

[redacted]వేర్ Software : కంప్యూటరును అనేక [redacted]లుగా ఆయా ప్రయోజనాలకు వీలుగా ఉపయోగించే సాధన వ్యవస్థ. ఇది ఫ్లాపీ (డిస్క్)లలో లభిస్తుంది.

**సి.డి. రామ్** : కాంపాక్ట్ డిస్క్ రీడ్ ఓన్లీ మెమొరీ **(Compact Disc Read Only Memory)** సమాచారాన్ని (డాటా)ను భద్రపరచే సాధనం. గుండ్రంగా 4.6" వ్యాసం కలిగి ఉంటుంది. ఇందులో ఎక్కువ సమాచారాన్ని భద్రపరచవచ్చు. చిత్రాలు, కదిలే బొమ్మలు, పాఠ్యాంశాలు, శబ్దం వంటి అన్ని మధ్యమాలను కలిపితే 'మల్టీమీడియా' గా దీనిపై ముద్రించి భద్రపరచవచ్చు. వీటిపై ముద్రించినది కంప్యూటరు సాయంతో చదవడానికి మాత్రమే కుదురుతుంది. ఫ్లాపీ/ డిస్క్‌లో వలె ముద్రించినది చెరిపివేసి మరల కొత్త డాటాను ముద్రించే వీలు ఇందులో లేదు.

**సి.పి.యు. (CPU)** : సెంట్రల్ ప్రాసెసింగ్ యూనిట్ **Central Processing Unit** కంప్యూటరు లోని మేధ. దీనినే మైక్రో ప్రాసెసర్ అని కూడా అంటారు. దాని శక్తి సామర్థ్యాలపైనే కంప్యూటర్ సామర్థ్యం ఆధారపడి ఉంటుంది. ఇందులో సిలికాన్ ముక్కలు వేలాది సూక్ష్మ ట్రాన్సిస్టార్ రూపంలో ఉంటాయి.

**స్కానర్** : ఫోటోలను చిత్రాలను కంప్యూటర్‌లోనికి ఎక్కించ డానికి ఉపయోగించే సాధనం.

**స్క్రీన్** : మానిటర్ మీద కనిపించే తెర.

**హార్డ్ డిస్క్ (HardDisc)** : ప్రతి కంప్యూటరులోనూ తప్పనిసరిగా (చిన్న, పెద్ద) అంతర్భాగంగా ఉండే ఎలక్ట్రానిక్ యంత్ర వ్యవస్థ. ఇది సమాచారాన్ని (డాటా) లోగొని భద్రపరిచే సాధనం. రేమ్‌లో వున్న సమాచారం కంప్యూటరును ఆఫ్ చేస్తే వెంటనే తుడిచి పెట్టుకు పోతుంది. హార్డ్ డిస్క్‌ల మీద ముద్రించ బడిన 'డాటా' భద్రపరుచ బడుతుంది. హార్డ్‌వేర్ కంప్యూటర్‌కు అనుబంధంగా ఉండే హార్డ్ డిస్క్, ప్రింటరు, మోడెమ్, స్కానర్‌లు హార్డ్‌వేర్‌గా పరిగణన.

| | బైట్‌లు | కిలోబైట్‌లు | మెగాబైట్‌లు | గిగాబైట్‌లు |
|---|---|---|---|---|
| **కిలోబైట్ kb** | 1024 | | | |
| **మెగాబైట్ mb** | 1,048,576 | 1024 | | |
| **గిగా బైట్ gb** | 1073741824 | 1048576 | 1024 | |
| **తెరా బైట్ tb** | 1099511627776 | 1073741824 | 1048576 | 1024 |

# పెర్సనల్ కంప్యూటరు (పి.సి.) వినియోగం - సూచనలు

.. తల ముందుకు వెనక్కు జరగకుండా భుజాల మీద నిటారుగా ఉండాలి. మానిటర్‌కు 60 సెం.మీ. దూరంలో ఉండాలి.

2. మెడ బిగుసుకు పోకుండా పైకి పెట్టాలి.

3. భుజ స్కంధాలు దిగువకు ఉంచాలి. ఛాతీ బిగుసుకు పోకూడదు.

4. వీపు నిటారుగా ఉండాలి. తుంటికి ముందుగా వంగి ఉండాలి. వీపు కింది భాగం కొద్దిగా సాధారణమైన వంపు తిరిగి ఉండేలాగ చూచుకోవాలి.

5. మోచేతులు సమ కోణంలో వదలి వేయాలి.

6. మణికట్టు కిందికీ పైకీ ఆడకుండా వదలి వేయాలి.

7. మోకాళ్లు తుంటి కంటె దిగువన ఉండాలి.

8. మోకాళ్లు సరిగా పెట్టుకోవడానికి అనువుగా సీటు ముందుకు వాలి ఉండాలి.

9. తెర (స్క్రీను) కంటికి తిన్నగాను, కొద్దిగా దిగువగాను ఉండాలి.

10. చేతివేళ్లు కొద్దిగా వంపు తిరిగి ఉండాలి.

11. నేల మీద నుంచి దాదాపు 75 సెం.మీ. ఎత్తున 'కీ' బోర్డును ఉంచాలి.



12. కీ -బోర్డు చదును ప్రదేశంపైన ఉంచితే శ్రేష్ఠం. లేదా మోచేతికి దిగువనున్నా ఫరవా లేదు. కంప్యూటర్‌లో దూరాన ఉన్న 'కీ' [illegible] భుజాల ప్రారంభించి మోచేతినంతటినీ కదపాలి. మణి కట్టును తిప్పవలసి వస్తుంది. ఇందువల్ల కీబోర్డు ఆపరేషన్‌లో చేతివేళ్లు అధిక శ్రమకు లోను కావల్సి వస్తుంది. మధ్య మధ్య చేతి వేళ్లకు విశ్రాంతిని ఇవ్వాలి.

13. నేలమీద కాళ్లను అదిమి ఉంచాలి. పొట్టివారు కాళ్లి కింద మెత్తను పెట్టుకోవాలి.

14. మానిటర్‌నుంచి 75 సెం. మీ. దూరంలో దృష్టి ఉండాలి.

పెర్సనల్ కంప్యూటరు వద్ద కూర్చుని పనిచేసే విధం

# రసాయన శాస్త్రం

ద్రవ్య స్వభావాన్ని అధ్యయనం చేసేది రసాయన శాస్త్రం. ద్రవ్యం అనేది రాసాయినిక మూల ద్రవ్యాల మిశ్రమం. ఈ మూల ద్రవ్యాలు ఒక దాని కొకటి సంబంధం ఉండదు. మూలద్రవ్యాల్నే 'మూలకాలు' అనడం కూడ కద్దు. పరమాణువులతో నిర్మితమైనవి. ఈ మూలద్రవ్యాలు. ఒక్కొక్క మూల ద్రవ్యంలో ఈ పరమాణువులు ఒక్కొక్క విధంగా విన్యసింపబడి ఉంటాయి. పరమాణువుల నిర్మాణంలో కొన్ని 'ప్రోటాను' లు గల ఒక 'కేంద్రకం' ఉంటుంది. ఇవి ధన విద్యుదావేశం గలవి.

ఒక్కొక్క మూలద్రవ్యానికి ఒక 'పరమాణ్వంకం' ఉంటుంది. కేంద్రకంలో ఎన్ని ప్రోటానులు ఉంటే ఆ సంఖ్యను 'పరమాణ్వంకం'గా పరిగణిస్తారు. ఈ కేంద్రకం చుట్టూ ప్రోటానుల సంఖ్యకు సమానంగా ఋణ విద్యుదావేశంగల 'ఎలక్ట్రాను'లు భిన్న కక్ష్యల్లో పరిభ్రమిస్తూ ఉంటాయి. మూలద్రవ్యాల వివరాలను కొన్నింటిని పక్కపుటలలో గల పట్టికల్లో చూడనగును.



అతి సరళమైన హైడ్రోజన్ పరమాణువు కేంద్రకంలో ఒక ప్రోటాన్ కక్ష్యలో ఒక ఎలక్ట్రానుతో నిర్మితమైంది.

రసాయన సాంకేతికాన్ని చదవడమెలా?

రాసాయనిక మిశ్రం సాంకేతికంగా తెలపడం రాసాయనిక శాస్త్రవేత్తలకు పరిపాటి. ఇది ఒక విధమైన హ్రస్వలిపి. అణు (మాలిక్యూలు) నిర్మాణంలో ఏఏ మూలద్రవ్యాలు ఎంత పరిమాణంలో ఉన్నాయో దాని వల్ల తెలుసుకో వచ్చును. మాట వరుసకు నీటి రాసాయనిక సాంకేతికం $H_2O$ ఇందులో H అనేది హైడ్రోజన్, O అనేది ఆక్సిజన్. H కి కిందనున్న సంఖ్య అందులోని పరమాణువుల సంఖ్యను తెలియపరుస్తుంది. అంటే ఇక్కడ, నీటి అణువులోరెండు హైడ్రోజన్ పరమాణువులు, ఒక ఆక్సిజన్ పరమాణువు ఉన్నాయని తెలుసుకోవాలి. కొన్ని రాసాయనిక పదార్థాలు చాలా క్లిష్టంగా ఉంటాయి. సిరకా (వినిగార్) అనేది సజలమైన ఎతనాయిడిక్ ఆసిడ్. దీని రాసాయనిక ఫార్ములా $CH_3COOH$ ఇందులో రెండు కార్బన్ రెండు ఆక్సిజన్, నాలుగు హైడ్రోజన్ పరమాణువులు చూపిన విన్యాసంలో ఉన్నాయి. వాటి విన్యాసం కూడా అందులో తెలిపిన పద్ధతిలోనే అమరి ఉంటాయి.

## సాధారణ దినుసులు - వాటి రాసాయనిక నామాలు

| వ్యవహార నామం | ఇంగ్లీషు పేరు | రాసాయినిక నామం | రాసాయినిక సంకేతం |
|---|---|---|---|
| అన్నభేది | గ్రీన్ విట్రోయిల్ | ఫెర్రస్ సల్ఫేట్ | $Fe SO_4$ |
| ఆక్వా ఫోర్టిస్ | | నైట్రిక్ కాసిడ్ | $HNO_3$ |
| ఆక్వా రిజియా | | నైట్రిక్ఆసిడ్ హైడ్రోక్లోరిక్ ఆమ్లం | $HNO_3HCl$ |
| ఉప్పు | కామన్ సాల్ట్ | సోడియం క్లోరైడ్ | $NaCl$ |
| ఇంగిలీకం | సినబార్ | మర్క్యురిక్ సల్ఫైడ్ | $Hg_2S$ |
| కర్పూరం | కేమ్ఫర్ | టెర్పిక్ కీటున్ | $C_{10}H_{16}O$ |
| గ్లాబర్ సాల్ట్ | గ్లాబర్సాల్ట్ | సోడియం సల్ఫేట్ | $Na_2SO_4H_2O$ |
| జిప్సమ్ | జిప్సమ్ | కాల్సియం సల్ఫేట్ | $CaSO_4H_2O$ |
| తినేసోడా | బేకింగ్ సోడా | సోడియం బైకార్బోనేట్ | $NaHCO_3$ |
| దాహకసోడా | కాస్టిక్ సోడా | సోడియం హైడ్రాక్సైడ్ | $NaOH$ |
| నవాసారం | సాల్ అమ్మోనియక్ | అమ్మోనియం క్లోరైడ్ | $NH_4 Cl$ |
| పటిక | ఏలమ్ | డబుల్ సల్ఫేట్ ఆఫ్ అల్యుమినియం పొటాషియం | $K_2SO_4Al_2(SO_4)24H_2O$ |
| బట్టల సోడా | వాషింగ్ సోడా | సోడియం కార్బోనేట్ | $Na_2 CO_3$ |
| బస్తం | కెలోమల్ | మర్క్యురస్ క్లోరైడ్ | $Hg_2Cl_2$ |
| బొమ్మసున్నం (కాల్చినజిప్సం) | ప్లాస్టర్ ఆఫ్ పారిస్ | కాల్సియం సల్ఫేట్ | $Ca SO_4$ |
| భేదిఉప్పు (విరేచన కారి) | ఎప్సమ్ సాల్ట్ | మగ్నీషియం సల్ఫేట్ | $Mg_2 SO_4$ |
| మైలుతుత్తం | బ్లూ విట్రోయిల్ | కాపర్ సల్ఫేట్ | $Cu SO_4$ |
| రసకర్పూరం | కరోజివ్ సబ్లిమేట్ | మర్క్యురిక్ క్లోరైడ్ | $Hg Cl_2$ |
| వెలిగారం | బోరాక్స్ | సోడియం బోరేట్ | $Na_2B_4O_710H_2O$ |
| సింధూరం | రెడ్‌లెడ్ | ట్రైప్లంబిక్ ఆక్సైడ్ | $Pb_3 O_4$ |
| సిరకా | వినిగార్ | సజల అసిటిక్ ఆసిడ్ | $CH_3COOH$ |
| సుద్ద | చాక్ | కాల్సియం కార్బోనేట్ | $CaCO_3$ |
| సున్నం (పొడి)- ముగ్గు | లైమ్ | కాల్సియం ఆక్సైడ్ | $Ca O_3$ |
| సున్నం (తడి) | లైమ్(స్లేకెడ్) | కాల్సియం హైడ్రాక్సైడ్ | $Ca (OH)_2$ |
| సూరేకారం | చిలీ సాల్ట్ పీటర్ | పొటాసియం నైట్రేట్ | $K NO_3$ |
| స్మెల్లింగ్ సాల్ట్ | సాల్ వాలటైల్ | అమ్మోనియం కార్బోనేట్ | $(NH_4)_2 CO_3$ |
| హైపో | హైపో | సోడియం తయో సల్ఫేట్ | $Na_2S_2O_3 5H_2O$ |

# మూలద్రవ్యాల ఆవర్తన పట్టిక (పీరియాడిక్ టేబిల్)

పరమాణ్వాంక క్రమంలో సంకేతాలతో మూల ద్రవ్యాలను అడ్డ వరుసలో పొందుపరచడమైనది. రాసాయనికంగా ఒకే ధర్మాలుగలవి నిడివి వరుసలో కనబడును. 93 తర్వాతి పరమాణ్వాంకం గలవి కృత్రిమమైనవి. మూలద్రవ్యాల పరమాణుభారాలు పక్కపుటలలో పొందుపరచటమైనది.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 హైడ్రోజన్ H | | | | | | | | |
| 3 లిథియమ్ Li | 4 బెరిలియమ్ Be | | | | | | | |
| 11 సోడియమ్ Na | 12 మగ్నీషియమ్ Mg | | | | | | | |
| 19 పొటాషియమ్ K | 20 కాల్షియమ్ Ca | 21 స్కాండియమ్ Sc | 22 టైటేనియమ్ Ti | 23 వెనేడియమ్ V | 24 క్రోమియమ్ Cr | 25 మాంగనీస్ Mn | 26 ఇనుము Fe | 27 కోబాల్ట్ Co |
| 37 రుబిడియమ్ Rb | 38 స్ట్రాన్షియమ్ Sr | 39 యిట్రియమ్ Y | 40 జిర్కోనియమ్ Zr | 41 నియోబియమ్ Nb | 42 మొలిబ్డినమ్ Mo | 43 టెక్నీషియమ్ Tc | 44 రుదేనియమ్ Ru | 45 రోడియమ్ Rh |
| 55 సీజియమ్ Cs | 56 బేరియమ్ Ba | 57-71 లేంథనైడ్ మాలిక | 72 హాఫ్నియమ్ Hf | 73 టాంటలమ్ Ta | 74 వుల్ఫ్రమ్ W | 75 రెనియమ్ Re | 76 ఆస్మియమ్ Os | 77 ఇరిడియమ్ Ir |
| 87 ఫ్రాన్సియమ్ Fr | 88 రేడియమ్ Ra | 89-103 ఆక్టినైడ్ మాలిక | 104 రూథర్‌ఫర్డియమ్ Rf | | | | | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 57 లాంథనమ్ La | 58 సీరియమ్ Ce | 59 ప్రాసియోడిమియమ్ Pr | 60 నియోడిమియమ్ Nd | 61 ప్రొమెథియమ్ Pm | 62 సమేరియమ్ Sm | 63 యూరోపియమ్ Eu |
| 89 ఆక్టినియమ్ Ac | 90 థోరియమ్ Th | 91 ప్రొటాక్టినియమ్ Pa | 92 యురేనియమ్ U | 93 నెప్ట్యూనియమ్ Np | 94 ప్లుటోనియమ్ Pu | 95 అమెరిషియమ్ Am |

| | |
|---|---|
| 1 | — పరమాణ్వాంకం |
| మూలద్రవ్యం — | హైడ్రోజన్ |
| H | — మూలద్రవ్యం సంకేతం |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | 2<br>హీలియమ్<br>He |
| | | | 5<br>బోరాన్<br>B | 6<br>కార్బన్<br>C | 7<br>నైట్రోజన్<br>N | 8<br>ఆక్సిజన్<br>O | 9<br>ఫ్లోరిన్<br>F | 10<br>నియాన్<br>Ne |
| | | | 13<br>అల్యూమినియమ్<br>Al | 14<br>సిలికాన్<br>Si | 15<br>భాస్వరం<br>P | 16<br>సల్ఫర్<br>S | 17<br>క్లోరిన్<br>Cl | 18<br>ఆర్గాన్<br>Ar |
| 8<br>ల్<br>li | 29<br>రాగి<br>Cu | 30<br>జింక్<br>Zn | 31<br>గాలియమ్<br>Ga | 32<br>జెర్మేనియమ్<br>Ge | 33<br>ఆర్సెనిక్<br>As | 34<br>సెలీనియమ్<br>Se | 35<br>బ్రోమిన్<br>Br | 36<br>క్రిప్టాన్<br>Kr |
| 6<br>యమ్<br>d | 47<br>వెండి<br>Ag | 48<br>కాడ్మియమ్<br>Cd | 49<br>ఇండియమ్<br>In | 50<br>తగరం<br>Sn | 51<br>ఆంటిమోనీ<br>Sb | 52<br>టెల్లూరియమ్<br>Te | 53<br>అయోడిన్<br>I | 54<br>జెనాన్<br>Xe |
| 8<br>నమ్<br>'t | 79<br>బంగారం<br>Au | 80<br>పాదరసం<br>Hg | 81<br>థాలియమ్<br>Tl | 82<br>సీసం<br>Pb | 83<br>బిస్మత్తు<br>Bi | 84<br>పొలోనియమ్<br>Po | 85<br>ఏస్టటీన్<br>At | 86<br>రేడాన్<br>Rn |
| | | | | | | | | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 54<br>నిమ్<br>'d | 65<br>టెర్బియమ్<br>Tb | 66<br>డిస్ప్రోసియమ్<br>Dy | 67<br>హోల్మియమ్<br>Ho | 68<br>ఎర్బియమ్<br>Er | 69<br>థూలియమ్<br>Tm | 70<br>యిట్టెర్బియమ్<br>Yb | 71<br>లుటేషియమ్<br>Lu | |
| 6<br>యమ్<br>m | 97<br>బెర్కీలియమ్<br>Bk | 98<br>కాలిఫోర్నియమ్<br>Cf | 99<br>ఐన్‌స్టీనియమ్<br>Es | 100<br>ఫెర్మియమ్<br>Fm | 101<br>మెండలీవియమ్<br>Md | 102<br>నొబెలియమ్<br>No | 103<br>లారెన్షియమ్<br>Lr | 104<br>రుథర్‌ఫోర్డియమ్<br>Rf |

రష్యా రసాయనికవేత్త దిమిత్రీ మెండలీవు మూల
ల పట్టికను సిద్ధపరచాడు. అప్పటికి తనకు తెలియని
ద్రవ్యాల స్థానాల్లో ఖాళీలను అట్టేపెట్టాడు.

## మూలద్రవ్యాలు - కొన్ని వివరాలు

| పరమాణ్వాంకం | మూలద్రవ్యం | సంకేతం | పరమాణు భారం | ఆవిష్కర్త | కాలం |
|---|---|---|---|---|---|
| 1. | హైడ్రోజన్ | H | 1.008 | హెన్రీ కేవెండిష్ | 1766 |
| 2 | హీలియమ్ | He | 4.008 | నార్మన్ లాక్‌యర్, రామ్జి, క్లీన్ | 1868 |
| | | | - | పియర్‌జాల్స్ సీడర్ జాన్సన్ | |
| 3. | లితియమ్ | Li | 6.94 | జోహాన్ ఆగస్ట్ ఆర్ ఫెడ్‌సన్ | 1817 |
| 4. | బెరిలియమ్ | Be | 9.013 | వోక్లాన్ | 1798 |
| 5. | బోరాన్ | B | 10.82 | గేలుసాక్ , తెనార్డ్, డేవీ | 1808 |
| 6. | కార్బన్ | C | 12.011 | ..... ..,..... ....... ...... .... | ప్రాచీనం |
| 7. | నైట్రోజన్ | N | 14.007 | డేనియల్ రూతర్ ఫర్డ్ | 1772 |
| 8. | ఆక్సిజన్ | O | 16.00 | ప్రీస్ట్‌లీ, షేలే,లావ్వాజ్యే | 1774 |
| 9. | ఫ్లోరిన్ | F | 19.00 | హెన్రీమ్వాసా | 1886 |
| 10. | నీయోన్ | Ne | 20.183 | రామ్జి,ట్రావెర్స్ | 1898 |
| 11. | సోడియమ్ | Na | 22.991 | హంఫ్రీ డేవీ | 1807 |
| 12. | మగ్నీషియం | Mg | 24.32 | హంఫ్రీ డేవీ | 1808 |
| 13. | అల్యూమినియం | Al | 26.98 | హాన్స్‌క్రిస్టియన్ అర్ స్టెడ్, వలర్ | 1825 |
| 14. | సిలికాన్ | Si | 28.09 | బర్జీలియస్ | 1823 |
| 15. | భాస్వరం | P | 30.974 | బ్రాండ్ | 1669 |
| 16. | గంధకం | S | 32.064 | .......... .... ..... .... ... | ప్రాచీనం |
| 17. | క్లోరిన్ | Cl | 35.453 | కారల్ షేలే,(హంఫ్రీడేవీ) | 1774 |
| 18. | ఆర్గాన్ | Ar | 39.948 | రామ్జి,రాలే | 1894 |
| 19. | పొటాసియమ్ | K | 39.102 | హంఫ్రీడేవీ | 1807 |
| 20. | కాల్సియమ్ | Ca | 40.08 | హంఫ్రీడేవీ | 1808 |
| 21. | స్కాండియమ్ | Sc | 44.96 | లాన్స్‌ఫ్రెడరిక్‌నిల్సన్ | 1879 |
| 22. | టైటానియమ్ | Ti | 47.90 | రెవరెండ్ విలియమ్ గ్రెగర్ | 1791 |
| 23. | వెనేడియమ్ | V | 50.95 | నిల్స్ గేబ్రియాల్ సెఫ్‌స్ట్రమ్ | 1830 |
| 24. | క్రోమియమ్ | Cr | 52.01 | వోక్లాన్ | 1797 |
| 25. | మాంగనీస్ | Mn | 54.94 | జోహాన్ [illegible] గాన్, షెలే | 1774 |
| 26. | ఇనుము | Fe | 55.85 | ....... .... ... ... ... ... ... .. | ప్రాచీనం |
| 27. | కోబాల్ట్ | Co | 58.93 | జార్జి బ్రాండ్ | 1735 |

## మూలద్రవ్యాలు - కొన్ని వివరాలు

| పరమాణు సంఖ్యాంకం | మూలద్రవ్యం | సంకేతం | పరమాణు భారం | ఆవిష్కర్త | కాలం |
|---|---|---|---|---|---|
| 28. | నికెల్ | Ni | 58.61 | ఆక్సెల్ ఫ్రెడరిక్ క్రున్‌స్టెట్ | 1751 |
| 29. | రాగి | Cu | 63.54 | .......... .... .... .... .... .... | ప్రాచీనం |
| 30. | జింకు | Zn | 65.38 | ......... .. ... ... ... ... ...... | ప్రాచీనం |
| 31. | గాలియమ్ | Ga | 69.72 | బ్వాబౌడ్రన్ | 1875 |
| 32. | జెర్మేనియమ్ | Ge | 72.60 | క్లెమెన్స్ వింక్లర్ | 1886 |
| 33. | ఆర్సెనిక్ | As | 74.92 | ఆల్బర్టస్ మాగ్నస్ | 1193 |
| 34. | సిలీనియమ్ | Se | 78.96 | జోన్స్ జేకబ్ బర్జీలియస్ | 1817 |
| 35. | బ్రోమీన్ | Br | 79.916 | బాలార్డ్ | 1826 |
| 36. | క్రిప్టాన్ | Kr | 83.70 | రామ్సే,ట్రావెర్స్ | 1898 |
| 37. | రుబిడియమ్ | Rb | 85.48 | రాబర్ట్ విల్ హెల్మ్ బున్‌సెన్,కిర్కాఫ్ | 1861 |
| 38. | స్ట్రాన్షియమ్ | Sr | 87.62 | హంఫ్రీడేవీ | 1808 |
| 39. | యిట్రియమ్ | Y | 88.91 | గెడోలిన్ | 1794 |
| 40. | జిర్కోనియమ్ | Zr | 91.22 | మార్టిన్‌క్లాప్ రాత్ | 1789 |
| 41. | నియోబియమ్ (కొలంబియమ్) | Nb | 92.91 | ఛార్లెజ్ హాచెట్ | 1801 |
| 42. | మొలిబ్డినమ్ | Mo | 95.95 | పీటర్ జేకబ్ హెల్మ్(కారల్ షీలే) | 1782 |
| 43. | టెక్నీషియమ్ (మాసూరియమ్) | Tc(Ma) | 99.00 | పెరియం,ఎమిలియోసెగ్రే | 1937 |
| 44. | రుదెనియమ్ | Ru | 101.1 | క్లాస్ | 1844 |
| 45. | రోడియమ్ | Rh | 102.91 | వూలాస్టన్ | 1803 |
| 46. | పెల్లేడియమ్ | P | 106.4 | వూలాస్టన్ | 180.3 |
| 47. | వెండి (రజతము) | Ag | 107.87 | .......... .... .... ... ... .... .... | ప్రాచీనం |
| 48. | కాడ్మియమ్ | Cd | 112.40 | ఫ్రెడ్రిక్ స్ట్రోమెయర్ | 1817 |
| 49. | ఇండియమ్ | In | 114.76 | రీష్, రిఖ్టర్ | 1863 |
| 50. | తగరము (టిన్) | Sn | 118.7 | ........ ......... ... ... ... .. | ప్రాచీనం |
| 51. | ఆంటిమోనీ | Sb | 121.76 | వాలెంటైన్ | 1450 |
| 52. | టెలూరియమ్ | Te | 127.61 | ఫ్రాంజ్ జోసెఫ్‌ముల్లర్ | 1782 |
| 53. | అయిడీన్ | I | 126.92 | బెర్నార్డు కుర్టా | 1811 |

## మూలద్రవ్యాలు - కొన్ని వివరాలు

| పరమాణ్వంకం | మూలద్రవ్యం | సంకేతం | పరమాణు భారం | ఆవిష్కర్త | కాలం |
|---|---|---|---|---|---|
| 54. | జినాన్ | Xe | 131.30 | రామ్సే, ట్రావెర్స్ | 1898 |
| 55. | సీజియమ్ | Cs | 132.91 | కిర్కాఫ్, బున్‌సెన్ | 1860 |
| 56. | బేరియమ్ | Ba | 137.34 | హంఫ్రీ డేవీ | 1808 |
| 57. | లేంథనెమ్ | La | 138.91 | కార్ల్ గస్టవ్ మోసాండర్ | 1839 |
| 58. | సిరియమ్ | Ce | 140.12 | క్లాప్‌రాత్,బర్జీలియస్, హిసింజెర్ | 1803 |
| 59. | ప్రాసియోమియమ్ | Pr | 140.91 | ఔర్ ఫాన్ వెల్జ్ బాక్,బోహుస్లావ్ బ్రౌనర్ | 1885 |
| 60. | నీవోడిమియమ్ | Nd | 144.24 | ఔర్ ఫాన్ వెల్జ్ బాక్ | 1885 |
| 61. | ప్రొమెథియమ్ (ఇలినియమ్) | Pm | 147.00 | మారిన్‌స్కీ,గ్లెండెనిన్, కారిల్ | 1945 |
| 62. | సమేరియమ్ | Sm | 150.35 | బ్వాబౌడ్రన్ | 1879 |
| 63. | యూరోపియమ్ | Eu | 152.0 | డిమార్ సే | 1896 |
| 64. | గెడోలియమ్ | Gd | 157.25 | జె.సి.జి మారిగ్నేక్ | 1880 |
| 65. | టెర్బియమ్ | Tb | 158.92 | మోసాండర్ | 1843 |
| 66. | డిస్ప్రోసియమ్ | Dy | 162.50 | బ్వాబౌడ్రన్ | 1886 |
| 67. | హోల్మియమ్ | Ho | 164.93 | సొరెట్,డిలాఫాంటైన్ | 1878 |
| 68. | ఎర్బియమ్ | Er | 167.26 | కార్ల్‌మూసాండర్ | 1843 |
| 69. | తూలియమ్ | Tm | 168.934 | పీలీ, తియోడోర్.క్లీవ్ | 1878 |
| 70. | యిట్టెర్బియమ్ | Yb | 173.04 | మారిన్యో | 1843 |
| 71. | లూటీషియమ్ | Lu | 174.97 | జార్జి ఉర్బా | 1907 |
| 72. | హాఫ్నియమ్ | Hf | 178.50 | కాస్టర్;హెవిసే | 1922 |
| 73. | టాంటాలమ్ | Ta | 180.95 | ఎకిబర్గ్ | 1802 |
| 74. | టంగ్‌స్టన్ (వుల్ఫ్ రామ్) | W | 183.85 | ఫాస్టో డిఎల్ హుయర్ (జోమాన్ జోన్ ) కారల్ షెలే | 1783 |
| 75. | రెనియమ్ | Re | 186.22 | నాడక్, టాకే, బెర్గ్ | 1925 |
| 76. | ఆస్మియమ్ | Os | 190.2 | ఎస్.టెనాంట్ | 1804 |
| 77. | ఇరిడియమ్ | Ir | 192.20 | ఎస్.టెనాంట్ | 1804 |
| 78. | ప్లాటినమ్ | Pt | 195.09 | జూలియస్ స్కేలిగర్ | |
| 79. | బంగారం | Au | 197.0 | ......... .... ...... .... ..... .... ........ | ప్రాచీనం |

## మూలద్రవ్యాలు - కొన్ని వివరాలు

| పరమాణ్వంకం | మూలద్రవ్యం | సంకేతం | పరమాణు భారం | ఆవిష్కర్త | కాలం |
|---|---|---|---|---|---|
| 80. | పాదరసం | Hg | 200.59 | ......... .... .............. ...... ... ... | ప్రాచీనం |
| 81. | తాలియమ్ | Tl | 204.39 | విలియమ్ క్రుక్స్ | 1861 |
| 82. | సీసం | Pb | 207.21 | ... ... ... ... ... ...... ... ... ... ...... | ప్రాచీనం |
| 83. | బిస్మత్తు | Bi | 208.98 | లెమెరీ, జియాఫ్రాయ్,(వాలెంటైన్ - 1450 | 1737 |
| 84. | పొలోనియమ్ | Po | 210.00 | క్యూరీ దంపతులు | 1898 |
| 85. | ఏస్టాటిన్ (అలబామిన్‌యా) | At | 210.0 | అన్నాసోమర్ కన్య కార్సన్,మెకంజీ ,సెగ్రే | 1931 |
| 86. | రేడాన్ (ఎమనేషన్) | Rn | 222 | ఫ్రీడ్రిష్ ఎర్నెస్ట్‌డోర్న్ | 1900 |
| 87. | ఫ్రాన్సియమ్ (వర్జీనియమ్) | Fr | 223.0 | పియరీ | 1939 |
| 88. | రేడియమ్ | Ra | 226.05 | క్యూరీ దంపతులు | 1898 |
| 89. | ఆక్టినియమ్ | Ac | 227.00 | అంద్రె డెబీర్నీ | 1899 |
| 90. | థోరియమ్ | Th | 232.038 | బర్జీలియస్ | 1828 |
| 91. | ప్రోటాక్టియమ్ | Pa | 231.00 | ఆటోహాన్,లీమైట్నర్,సాడీ | 1917 |
| 92. | యురేనియమ్ | U | 238.03 | మార్టిన్‌క్లాప్ రాత్,ఇ.ఎమ్. పెలిగాట్ | 1789 |
| 93. | నెప్ట్యూనియమ్ | Np | 237 | మాక్మిలన్, ఆబెల్సన్ | 1940 |
| 94. | ప్లుటోనియం | Pu | 242 | సీబార్గ్, కెనడీ, వాల్స్ | 1940 |
| 95. | అమెరిసియమ్ | Am | 243 | మాక్మిలన్ | 1941 |
| 96. | క్యూరియమ్ | Cm | 247 | సీబార్గ్,జేమ్స్,మార్గన్,ఘియోర్ సో | 1944 |
| 97. | బెర్కెలియమ్ | Bk | 249 | తాంప్సన్,సీబార్గ్, ఘియోర్ సో | 1949 |
| 98. | కాలిఫోర్నియమ్ | Cf | 251 | తాంప్సన్,సీబార్గ్,ఘియోర్ సో,స్ట్రీట్ | 1950 |
| 99. | ఐన్‌స్టయినియమ్ | Es | 254 | తాంప్సన్,హార్వే,చాపిన్,ఘియోర్ సో సీబార్గ్ | 1954 |
| 100. | ఫెర్మియమ్ | Fm | 253 | తాంప్సన్,హార్వే,చాపిన్,ఘియోర్ సో సీబార్గ్ | 1955 |
| 101. | మెండలివియమ్ | Md | 256 | తాంప్సన్,హార్వే,చాపిన్,ఘియోర్ సో సీబార్గ్ | 1957 |
| 102. | నోబెలియమ్ | No | 253 | ఫీల్డ్స్ | 1957 |
| 103. | లారెన్సియమ్ | Lw | 257 | ఘియోర్ సో,సికెలాండ్,లార్ష్,లాటి మెర్ | 1961 |
| 104. | రుతర్ ఫర్డియమ్ | Rf | 257 | ఘియోర్ సో బృందం | 1969 |



# జీవపరిణామం : ప్రాణుల పుట్టుక



ఇప్పుడు మనం భూమి మీద చూస్తున్న జీవకోటి వైవిధ్యం అరవయి కోట్ల సంవత్సరాల కిందట నుంచే కనిపిస్తున్నట్లు శాస్త్రవేత్తల అభిప్రాయం. భూమి చరిత్రను అనేక యుగాలుగా విభజించారు. పక్కపుట(237)లో నున్న పటంలో ఆయా యుగాలలో పుట్టి మనిన జీవకోటి వివరాలు స్థూలంగా చూడవచ్చు.

కోట్ల ఏళ్ల క్రితం ఆదిమ జీవమహా యుగం ప్రాటిరోజోయిక్‌లో ఒకే ఒక కణం గల 'అమీబా' అనే ఏకకణ జీవి పుట్టింది. దీనిని ప్రాటిరోజోయిక్ యుగమని పేర్కొన్నారు. పిదప ప్రాచీన జీవ మహాయుగం (పేలియోజోయిక్) నాటికి సముద్రపు కలుపు మొక్కలు, పగడాలు, నత్త, నక్షత్రపు చేప, స్పంజీలుగా జీవులు పరిణామం చెంది సముద్రంలో నీటి అడుగున వృద్ధి చెంది సొరచేప రూపం నుండి నేల బొగ్గు యుగంనాటికి నీటి నుండి క్రమంగా భూమి పొరలలోనికి విస్తరించి బొద్దీగ, తూనీగ, తేలుగా పరిణామాన్ని సంతరించుకున్నాయి.

ఇక 6 కోట్ల ఏళ్ల క్రితం నుండి సాగిన ఆధునిక జీవమహాయుగంలో గుర్రం, ఒంటె, ఏనుగు పరిణామ ఘట్టాలు చక్కగా వరుసగా పొందుపరుపబడుట ఒక విశేషం. సీనోజోయిక్ అనబడే ఈ సస్తనయుగంలో పుష్పించే మొక్కలు, సీతాకోకచిలుక, కోరదంతాల పిల్లి, పక్షి, గుర్రం, ఏనుగు, కోతి, మానవుడు వరుసగా జీవపరిణామ క్రమంలో పరాకాష్ఠను అందుకున్నాయి. పరిశోధనల ఫలితంగా ఈ దీర్ఘ పరిణామ క్రమానికి ఒక నిర్దిష్ట రూపం దిద్దినవాడు బ్రిటిషు జీవశాస్త్రవేత్త చార్లెస్ డార్విన్.

ఏక కణజీవి అయిన అమీబా ఆ తర్వాతి జీవపరిణామాన్ని ప్రాచీన భారతీయ సంప్రదాయంలో దశావతారాలనబడే మత్స్యావతారం, కూర్మావతారం, నరసింహావతారం, వామనావతారం మొదలగు పది అవతారాలుగా వివరించారు.

## డైనాసరస్

జీవ పరిణామక్రమంలో ఎన్నోరకాల వింత జంతువులు ఉద్భవించాయి. మాధ్యమిక జీవ మహాయుగంలో అవతరించిన మహా సరీసృపాలు " డైనాసరస్' ఈ భూమి మీద సంచరించాయనడానికి ఆధారాలు కన్పిస్తున్నాయి. డైనాసరస్ జాతికి చెందిన వాటిని రాక్షస బల్లులు లేదా ఉరుము బల్లులు అని కూడా అన్నారు. వీటిలో కొన్ని దాదాపు 27 మీటరుల పొడవులుగలవి ఉండటం విశేషం. మరి కొన్ని సాధువులు, శాకాహారులు సుమారు 12 మీటరుల ఎత్తు గలవి ఉండేవి. ఇంకా కొన్ని ఘోరమైన మాంసాహారులు నీటిలో చేపవలె ఈదునవి, మరికొన్ని రకాలు పక్షిలాగ గాలిలో ఎగిరేవి. ఈ సరీసృపాల్లో ట్రయనాసరస్, డైనాసరస్, బ్రాంటాసరస్, స్టెగాసరస్ చెప్పుకోదగ్గవి. ఇందులో అంతర్భాగమైన కార్బనోఫెరస్ యుగంలో వెలసిన డైనాసరస్ జాతికి చెందిన వింత జంతువులు వాటి ఆకారాలవల్లగాని, పరిమాణంవల్లగాని ఇప్పటికీ తలచుకుంటేనే భయాన్నీ ఆశ్చర్యాన్నీ ఆసక్తినీ కలిగిస్తాయి. అంతరించి పోయిన నీటి

## జీవపరిణామ క్రమపటం




బొమ్మ ౧౦

జీవపరిణామం - ప్రాణులవ్యుత్పత్తి

జంతువులలో బ్రాంటాసరస్, ట్రెసరాటాప్స్, టిరానోసరస్ ప్రధానమైనవి. బ్రాంటాసరస్ శాకాహారి తలనుండి తోకకు దీని కొలత 20మీటరులు. బరువు 30 మెట్రిక్ టన్నులు. దీని మెడ పొడవుకు తగ్గట్టుగానే దీనితోక కూడ పొడవుగా ఉంటుంది. బ్రాంటాసరస్ అంటే అర్ధ పిడుగువంటి చప్పుడు చేసే సరీసృపం. ప్రాచీన జంతువులను గూర్చి అధ్యయనం చేసిన రిచర్డ్ ఒవెన్ (19వ శతాబ్ది) వీటికి మహా సరీసృపాలు అని అర్థం వచ్చే డైనాసరస్ అని పేరు పెట్టాడు. వీటి ప్రత్యేక లక్షణం పొడవాటి మెడ. డిప్లొడోకస్ అనేది బ్రాంట్ సరస్ కంటె పొడవైన రాక్షాసాకారం కలది. ఇది నీటిలో నివసించేది. కాళ్ల బరువు ఎక్కువ.

ట్రైసెరాటాప్స్ : శిరస్సు రెండు మీటరుల పొడవు. తలవెనుక భాగం కాలర్ మాదిరిగా ఉంటుంది. దానికి ఉండే మూడు కొమ్ములు రెండు కోళ్ళ దగ్గర మరొకటి ముట్టిమీద ఉంటాయి. శాకాహారి.

టిరానోసరస్ : ఇది వెనుక కాళ్ళమీద నిలబడి నడుస్తుంది. ముందు కాళ్ళు చాల కురుచగా నామ మాత్రాన విశిష్టంగా ఉంటాయి. చూడ్డనికి చాల భయంకరంగా ఉంటుంది. దీని దౌడలు బ్రహ్మాండం గానూ బలంగానూ ఉంటాయి. పొడవు 12 మీటరులు, ఎత్తు ఆరు మీటరులు. అంగ నాలుగున్నర మీటరులు.

అల్లోసరస్ : దీని పొడవు పది మీటరులు. మాంసాహారి. నోరు చాల పెద్దది. పెద్ద దౌడ. ఒకేసారి ఎక్కువ ఆహారాన్ని మింగ గలిగేది. డిప్లొడోకస్ వంటి వాటిని పట్టి తినేది.

స్టెగోసరస్: ఇది శాకాహారి. అల్లోసరస్ వంటి మాంసాహారుల బారినుండి ఆత్మరక్షణకై దీని వెన్నుపై బలిష్టమైన వెడల్పాటి సాధనాలు ఉంటాయి. తోకమీద ముళ్ళు ఉంటాయి.

జీవన సమరంలో బలవంతమైనవి మిగలడం బలహీనమైనవి వాటికి ఆహుతయి కాలగర్భంలో కలసి పోవడమూ జరిగి డైనాసరస్ జాతి ఆరున్నర కోట్ల ఏళ్ల కిందటే పూర్తిగా లుప్తమయింది.



# జంతువులు

ఆరున్నర కోట్ల సంవత్సరాల క్రింతం కడసారపు డైనాసర్ లుప్తమయింది. కోకో అనే పక్షి కూడా ఎప్పుడో కన్పించ కుండా పోయింది. ఇంకా ఎన్నో జంతువులు త్వరలోనే లుప్తమయ్యే తరుణ మాసన్న మయిందని విజ్ఞుల అభిప్రాయం. అయినా భూమండలం మీద ఇంకా ఇరవయి లక్షల రకాల జంతు జాతులు మను తున్నాయి. వీటిలో వెంగున పరుగెత్తే చిరుతపులీ ఉంది. నెమ్మదిగా పాకే నత్తా ఉంది. ఇవిగాక గుడ్లు పెట్టే ప్లాటిపస్సు అనే జంతువూ నైపుణిగల వెదపురుగూ ఇంకా మన గలుగుతున్నాయి.

| సస్తన జంతువుల గర్భిణీ కాలం (రోజుల్లో) | | | |
|---|---|---|---|
| ఆవు | 280 | పంది | 113 |
| ఉడుత | 44 | గుర్రం | 337 |
| ఎలుక | 21 | గొర్రె | 148 |
| ఏనుగు | 640 | చింపాంజీ | 237 |
| ఒంటె | 406 | సింహం | 105 |
| ఓరాంగ్ ఉటాన్ | 245-75 | గినీ పిగ్ | 68 |
| కంగారూ | 40 | చుంచు | 21 |
| కుక్క | 62 | హైనా | 110 |
| కుందేలు | 32 | పిల్లి | 62 |
| జిరాఫీ | 395-425 | మేక | 151 |
| తిమింగలం | 365 | పులి | 62 |
| నక్క | 52 | మనిషి | 266-270 |

భూమండలమీద జంతు సంపద ప్రభావం చాలా ఉంది. 460 కోట్ల ఏళ్ల నాడు భూమి ప్రాదుర్భవించినా 60కోట్ల ఏళ్ల నుండియే ప్రాణికోటి జాడలు కన్పిస్తున్నాయి. ఒకప్పుడు స్థూలంగా ఇరవయి లక్షల జంతుజాతులు ఉండవచ్చునని ఒక అంచనా. ఇందులో ఉప జాతులెన్నో ఇంకను లెక్క కట్టవలసి ఉంది.

జంతువుల జీవయాత్రకు అత్యంత అవసరమైన ఆక్సిజన్ అనే ప్రాణవాయువు భూమి మీద సమతూకంలో ఉన్న నాటి నుండీ జీవకోటి మనుగడ సాగుతూ వచ్చిందని చెప్పవచ్చు. మాట వరుసకు చేపవంటి జలచరాలు నదుల్లోనూ సముద్రాల్లోనూ ఉండే నీటిలో కరగివున్న ఆక్సిజన్ పైనే ఆధార పడి బతుకుతూ ఉంటాయి. మిగతా జంతు కోటికి అవసరమైన ఆక్సిజన్‌కు వాతావరణమే ఆధారం. ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని జంతు మనుగడకు అవసర మైన ఆహారానికి ఆధారం వృక్షకోటియే. మాట వరుసకు జింక, లేడి శాకాహారులు, ప్రత్యక్షంగానే గడ్డివంటి వృక్షజాతుల్ని తింటాయి. పులి వంటి మాంసాహారులు పరోక్షంగా జింక, లేడి వంటి శాకాహారుల్ని తిని బతుకుతాయి. అంటే శాకహారులయినా మాంసాహారులైనా తమ తమ ఆహారావసరాలకు వృక్షాలపైనే ఆధారపడుతూ ఉంటాయి అన్నది సత్యం.

**సకేశరుకాలు-అకేశరుకాలు** జంతువుల్ని సకేశరుకాలు అకేశరుకాలు అని రెండు స్థూల వర్గాలుగా విభజించారు. సకేశరుకాలు అంటే వెన్నెముక గల జంతువులు. అకేశరుకాలు అంటే వెన్నెముకలేని జంతువులు. మెదడు బాగా అభివృద్ధి చెందినవే సకేశరుకాలు. వాటిని ఉన్నత స్థాయిలో ఉన్న జంతువులుగా పరిగణిస్తారు. పరిణామక్రమంలో ఇవి మత్స్య, ఉభయచర, సరీసృప, పక్షి, సస్తనాలు ఆరోహణక్రమంలో ఉండుట గమనార్హం. ప్రపంచంలో ప్రముఖ జంతువులన్నీ ఈ భారీ జంతుగణంలోకి చేరినవే. ఇక మిగిలిన

జంతుగణం అకేశరుకాలు సరళజాతికి చెంది మరీ చిన్నవిగా ఉంటూయి. అమిబావంటి ఏకకణ జీవులు, స్పాంజీ మరీ సరళమైనవి. మరి అకశేరుకలు కొన్ని ముఖ్యంగా కీటకాలు క్లిష్ట జీవులు. నేల మీద వున్న జీవులన్నిటి కంటే కీటకాలెన్నో ఎక్కడ పడితే అక్కడ కాన రావడం విశేషం. ఏదో ఒక జీవి కీటకాల్నే భక్షించి వేసే ప్రమాదం లేక పోలేదు. భూమండలంలో నాలుగింట మూడు వంతులు ఆక్రమించిన సముద్రాలు ఎక్కువ జంతుజాలానికి ఆలవాలంగా ఉన్నాయి. నీటిలో కరగివున్న ఆక్సిజన్ మీదనే ఇవన్నీ ఆధారపడి వున్నాయి. ఇంకా కొన్ని జల జంతువుల్లో సస్తనాలయిన తిమింగలం, సీల్ వంటివి కూడా చేరి వున్నాయి. ఇందులో కొన్ని జలచరాలుగా ఉండి గాలినే పీలుస్తాయి. జంతువులకూ వృక్షాలకు ప్రధానమైన వ్యత్యాసమేమి ? వృక్షాలు స్థావరంగా ఒక చోట నుండి మరోక చోటుకు కదల లేవు, కాగా కొన్ని జంతువులు దూర ప్రదేశాలకు వలస వెళ్లి వస్తూ ఉంటాయి. పక్షిజాతుల్లో వలస స్పష్టంగా కనిపిస్తుంది. పశ్చిమ గోదావరి జిల్లా కొల్లేరు సరస్సుకు శీతల ఋతువుల్లో సుదూర ప్రాంతాల నుండి పెలికన్ గూడ కొంగలు వలస వచ్చి గుడ్లు పెట్టి పొదిగి పిల్లలు చేసి రెక్కలు రాగానే మరల ఆది స్థానాలకు మరలి పోతూ ఉంటాయి.

| జంతువుల వేగం : కి.మీ./గం | | | |
|---|---|---|---|
| చిరుతపులి | 170 | ఎలుగు (గ్రిజ్లీ) | 48 |
| సింహం | 80 | పిల్లి | 48 |
| కుందేలు(అడవి) | 72 | ఏనుగు | 40 |
| జీబ్రా | 64 | తేనెటీగ | 18 |
| పందెం గుర్రం | 64 | పంది | 18 |
| సొర(షార్క్)చేప | 64 | కోడి | 14 |
| వేటకుక్క(గ్రేహౌండ్) | 63 | సాలీడు | 2 |
| కుందేలు56 | | గండుతేలు | 0.27 |
| జిరాఫీ | 51 | నత్త | 0.05 |

కొన్ని సస్తనాలు కూడ వలసపోతూ ఉంటాయి. ఉదాహరణకు తూర్పు ఆఫ్రికా నుండి ఒక రకం జింకలు,జీబ్రాలు జిరాఫీలు వగయిరా మందలు మందలుగా వచ్చి మేతను వెతుక్కుంటూ వలస పోతూ ఉంటాయి. ఉత్తర ధృవమండలి నుండి కారిబో, రెయిన్ డీర్ వంటి జంతువులు శీతాకాలంలో దక్షిణానికి వేసవిలో ఉత్తరానికి వలస యాత్రలు చేస్తూ వుంటాయి. సముద్రాల్లో చేప పిల్లలు మందమందలుగా ఆహారాన్ని వెతుకుతూ ఒక చోటునుంచి మరొక చోటుకు పోతూ ఉంటాయి. వాటి వెంట భారీ జలచరాలయిన సొరలు, తిమింగిలాలు పోతూ ఉండడం కద్దు.

**వెన్నెముకలేని జంతు జాతులు**

జంతువులకు వెన్నెముక లేకపోతే వాటిని 'అకేశరుకాలు' అని అంటారు కదా! అకశేరుకాలకు అసలు అస్థి పంజరం అంటూ ఏమీ ఉండదు. కటిల్ ఫిష్ వంటి కొన్ని మత్స్య జాతులకు మాత్రం లోపల గుల్ల వంటిది ఉంటుంది. చాలావాటికి బాహ్యాస్థి పంజరాలు ఉండడం కూడ కద్దు. చిన్న చిన్న స్పాంజి, పురుగులు మొదలు నత్తలు, కీటకాలవరకూ అకశేరుకాలనే పిలువబడటాయి. చాలావరకూ జలచరాలు అకశేరుకాలు. ఇరవయికి పైగా కూటాలుగా ఉన్నట్లు తెలుస్తుంది. జెల్లీ చేప ఆనిమోన్, పగడాలు సీలెంటరేట్స్ జాతికి చెందుతాయి. శంకుజాతులకు గుల్లలు ఉంటాయి. నత్తలు ముత్యపు చిప్పలు, ఆక్టోపస్, స్క్విడ్ ఈ జాతికి చెందుతాయి. అన్నీలిడ్ అనేవి పురుగు జాతికి చెందనవి. సాలెపురుగులు, జెర్రులు, రొకలిబండ, ఇంకా పీత, పెద్ద రొయ్య జాతులు కీటకజాతి (ఆర్త్రపొడా)కి చెందుతాయి. నక్షత్రచేప, (స్టార్ ఫిష్) అర్చిన్ అనునని కవచధారి (ఎక్నోడెర్మ్ జాతికి చెందినది. 1300 రకాల అకేశరకాలు ఉన్నాయి.

కీటక జాతులెన్ని ఉన్నాయో జీవ కోటిలో మిగతా జంతు జాతులన్ని ఉన్నాయని అంటారు. ఒక్కొక్క జాతి కీటకాలు సంఖ్యను లెక్కపెట్టడమనేది అలవికాని పని.

ఎదిగిన కీటకానికి ఆరు కాళ్లు ఉంటాయి. శరీరం మూడు భాగాలుగా విభజింపబడి ఉంటుంది. బాహ్య భాగం గట్టి పెంకు. కొన్నిటికి రెక్కలు ఉండి ఎగర గలుగుతాయి. వాటి కళ్లు క్లిష్టమై, అనేక బుల్లి బుల్లి కటకాలతో నిండి ఉంటాయి. వాటికి వాసన, రుచి తెలుస్తుంది. కొన్నిటికి వినికిడి జ్ఞానం కూడ ఉంటుంది. వీటి రక్తం శీతలం - రంగు ఉండదు. ఉన్నా ఆకుపచ్చ, పసుపు రంగుల్లో ఉంటుంది.

## సకేశరుకాలు

వెన్నెముక గల జంతువుల్ని సకశేరుకాలు అంటారు కదా! సకశేరుకాల్లో మత్స్యజాతులు ఎక్కువ. వాటి సంఖ్య వేల సంఖ్యలో ఉంటుదని ఒక అంచనా. వీటిని మూడు రకాలుగా



విభజించారు. దౌడలు లేనివి ఒక రకం. మెత్తటి ముల్లు ఉండేవి రెండవ రకం. ఇక మూడవ రకంలో ఎముక ఉంటుంది. ఇందులో దౌడలు లేనివి రెండు రకాలు. కొన్నిటికి గుండ్రటి నోరు ఉంటుంది. మెత్తటి ముల్లు ఉండే రకాల్లో సొర చేప చెప్పుకోదగ్గది. వీటిలో 575 రకాలు ఉన్నాయి. ఎముకలు ఉండే మత్స్య జాతుల సంఖ్య అపారం. బొమ్మిడాయి, కట్టచేప, కొర్రమీను, గండుమీను, రవ, పండుగొప్ప మొదలయిన ఆహార యోగ్యమైనవి ఈ కోవ కిందకి వస్తాయి.

## ఉభయచరాలు

ఉభయచరాలు నేలమీదా నీటిలోనూ కూడ సంచరించే సకశేరుకాలు. వీటి రక్తం శీతలం. అంటే వాటి శరీర ఉష్ణోగ్రత పరిసరాలకు అనుగుణంగా ఉంటుంది. ఉభయచరాల్లో 3000 జాతులు ఉన్నాయి. కప్ప, గోదురు కప్పలవంటి ఉభయచరాలు నీటిలోనే గుడ్లు పెడతాయి. అవి పొదిగితే తోక కప్పలు పుడతాయి.

## సరీసృపాలు

సరీసృపాలు గాలి పీల్చి బతికే సకశేరుకాలు. వీటి రక్తం కూడ శీతలమే. ఒకప్పుడు భూమిమీద అత్యంత ప్రభావం చూపిన డైనాసరసు వంటి రాక్షస బల్లులు పుట్టి జీవించి లుప్తమవగా ఇప్పటికీ 5000 రకాల సరీసృపాలు ఉన్నట్లు అంచనా. ఇప్పుడు వీటి పరిమాణం అతి తక్కువ. 15 సెం.మీ. నుండి భారీగా 9 మీటరులు ఉండడం కద్దు. వీటి చర్మం మీద సర్వసాధారణంగా పొలుసులు ఉంటాయి. సరీసృపాలు అన్నీ (ఎక్కడో తప్ప) అండజాలే. అంటే గుడ్లు పెట్టి పిల్లలు చేసే రకాలే. సస్తనాలలోవలె వీటికి ఊపిరితిత్తులు ఉంటాయి. దాదాపు సరీసృపాలన్నీ మాంసాహారులకింద లెక్క. సరీసృపాల్లో ఇప్పటికీ ఉన్నవాటిని నాలుగు రకాలుగా గుర్తించారు. 1. మొసలి; 2. టౌటారా (న్యూజిలాండ్ లో ఉండేది); 3 తాబేలు; 4. బల్లి, సర్పం.

## పక్షులు

ఈకలు, రెక్కలు, ముక్కులు ఉండే జంతుజాతుల్ని పక్షులు అని అంటారు. కొన్ని







తప్ప (నిప్పుకోడి, పెంగ్విన్, ఈముకివీ) మిగతా రకాల పక్షులు ఎగుర గలవు. పక్షులన్నీ ఉష్ణ రక్తం గలవే. అంటే అవి తినే ఆహారం నుంచి ఉష్ణాన్ని సిద్ధపరచుకో గలవు. పక్షుల్లో పదకొండువేల రకాలు ఉన్నాయి. వీటిని 27 ప్రధాన వర్గాలుగా వింగడించారు. పక్షుల వర్గీకరణ అనేకరకాలుగా చేయవచ్చు. నీటి తీరాల్లో ఉండే వాటిని జలపక్షులు అని అంటారు. అవి : బాతు, హంస, కొంగ, పెంగ్విన్, సీగల్.

కొన్ని నేలమీద తిరుగుతూ చెట్లమీద, గోపురాల మీద కాపురాలు ఉండేరకం - పావురం, కాకి, చిలుక. మరికొన్ని వేట పక్షులు - కోడి, గినీ, టర్కీ, కోళ్లు. మరొక రకం చిన్న చిన్న పక్షుల్ని, సస్తనాల్ని వేటాడి తినే రకం - ఉదా : గద్ద, రాబందు, డేగ. ఇక గుడ్లగూబ వంటి పక్షులు రాత్రిళ్లు మాత్రమే బయటకు వచ్చే నిశాచరజాతి.

సరీసృపాలనుండే నేరుగా పరిణామం చెందినవే పక్షులని విజ్ఞుల అభిప్రాయం. వాటి పూర్వీకులకూ వీటికీ సంబంధాలు వున్నాయి. సరీసృపాల్లో వలె కొన్ని పక్షుల కాళ్లమీద పొలుసులు గోచరిస్తాయి. పొలుసులు కెరాటిన్ అనే పదార్థంతో నిర్మితమైనవి. పక్షుల ఈకలు కూడ కెరాటిన్ నిర్మితాలే కావడం గమనార్హం.

పక్షి శరీరం మీద ఉండే ఈకలు ఒకే విధంగా పెరగవు. కొన్ని శరీరభాగాలు ఈకలచే పుష్కలంగా కప్పబడి ఉంటాయి. మరికొన్ని శరీరభాగాల మీద ఈకలు అంతగా పెరిగి ఉండవు. ఎగరటానికి వీలుగా రెక్కమీద బాగా ఈకలు ఉంటాయి. రొమ్ము మీద సన్నని ఈకలు ఉండడం విశేషం. ఒక పక్షి మీద కనీసం 1300 ఈకలు, ఎక్కువగా ఉంటే 12,000 ఈకలు ఉంటాయి. పక్షి అస్థిపంజరం అతితేలిక. అందుచేతనే పక్షి గాలిలో అవలీలగా ఎగుర గలుగుతుంది.

## సస్తనాలు

పిల్లకు పాలిచ్చి పెంచే జంతుజాతుల్ని సస్తనాలుగా పరిగణిస్తారు. దాదాపు సస్తనాలన్నీ తమ శిశువుల్ని గర్భస్థ పిండాలుగా తమ



శరీరాల్లోనే ప్రసవసమయంవరకు ఉంచుకుంటాయి. ప్లాటిపస్ వంటి కొన్ని రకాల సస్తనాలు గుడ్లు పెడతాయి. కంగారూ వంటి జంతువులు పూర్తిగా పెరగని పిల్లలు బయటపడి తమ పొత్తికడుపు బయట సంచిలోకి చేరి పెరుగుతాయి. గుర్రం, జింక, ఆవు వంటి జంతువులు ఈనిన కొద్దిసేపటికే (గంటకే) లేచి నడవడం మొదలు పెట్టడం విశేషం. కుక్క, పిల్లి పుట్టిన కొన్నాళ్ల వరకూ లేచి తిరగ లేవు. తమంతట తాము ఏమీ చేసుకొన లేవు.

సాధారణ సస్తనం చతుష్పాది. అంటే నాలుగు కాళ్లు ఉండి గాలి పీల్చుకుంటుంది. వీటి రక్తం ఉష్ణంగా ఉంటుంది. వీటికి కొన్ని మినహాయింపులు లేకపోలేదు. ఉప్పునీటి సస్తనాలు ఒక ఉదాహరణ. సీలు అనే సముద్ర జీవులకు నాలుగు తెడ్డులు లాంటి కాళ్లు ఉంటాయి. తిమింగలాలకు రెండు తెడ్డులు లాంటి కాళ్లు ఉంటాయి.

## కుక్క జాతి

మనిషికి అనాదిగా తోడుగా ఉన్న జంతువు కుక్క. పశువుల్నీ, మేక, గొర్రెమందల్నీ రక్షించడానికి కుక్క ఎంతో సాయపడేది. కుక్కలన్నీ మాంసాహారులే. వీటిలో నూరుకు పైగా రకాలున్నాయి. వీటికి పసిగట్టే విశేష గుణం మాత్రం ఉంది. ఈ గుణాన్ని ఒక్క ఇంటికాపలాకూ అపరాధ పరిశోధనలో పోలీసులు కుక్కలను ఉపయోగించడం కద్దు. నక్క, తోడేలు కుక్క జాతికి చెందినవే. ఇది మాంసాహారి

## పిల్లి జాతి

పిల్లి జాతికి చెందిన జంతువలన్నీ మాంసాహారులే. వాటి దంతాలు చీల్చడానికి, కొరకడానికి వీలుగా ఉంటాయి. వేగంగా పరుగులెత్తడానికి వీలుగా వాటి శరీరాలు నిర్మితమైనాయి. వాటి కాలిగోళ్ల పంజాలు ప్రాణరక్షణకు బలమయిన ఆయుధాలు. పరిమాణంలో చిన్నవీ, పెద్దవీ తప్ప పిల్లిజాతి అంతా ఒకే రూపం కలవి. గుజరాతులోని గిర్










## బీవర్



ఉత్తర అమెరికాలోనూ యూరపులోనూ ఎక్కువగా కనిపించే బీవర్ అనేక సస్తన జంతువులు నీటి వనరులున్న చోటనే నివసిస్తూ ఉంటాయి. ఇవి నీటిలో ఈదుతాయి. తెలివైన బీవర్‌లు చెట్ల రెమ్మలను కొమ్మలను కొరికినరికి వాటితో బ్రిడ్జీలు, డాములు నిర్మించి తమ పిల్లల భద్రతకు ఆవాసాలను ఏర్పరస్తాయి.

అరణ్యాలలో భీకరంగా తిరుగాడే సింహం మామూలు ఇంటి పిల్లికి బృహత్‌రూపమే. పెద్దపులి, చిరుతపులి, లెపార్డ్, జాగూర్, ఇంటిలో తిరిగే పిల్లి, మాను పిల్లి - అన్నీ పిల్లిజాతికి చెందినవే. తాయిలాండ్, మ్యాన్మార్ దేశాల్లోని పిల్లులు ఒకరకంగా ఉంటాయి. పర్షియా, అంగోరా దేశాల్లోని పిల్లుల బొచ్చు పొడవుగా ఉంటుంది. అమెరికా ఖండంలో పిల్లులు విరివిగా ఉంటాయి. జాగూర్ అనే పిల్లి దక్షిణ అమెరికాలో భయంకరమైన పిల్లి. అమెరికాలో పిల్లిని పెంచి పోషించడం ఒక సరదా. కారుచీకటిలో పిల్లి జాతికి చూపు ఆనదు. అయితే మనిషికంటె చీకటిలో పిల్లి బాగా చూడగలదు. దానికి కారణం పిల్లి కన్నులో వెనుకవైపు పరావర్తింపచేసే ఒక పొర ఉంటుంది. అందుచేత కాంతి అతి తక్కువగా ఉన్నప్పుడుకూడ పిల్లి చూడగలదు.

## నెమరు వేసే జంతువులు

కాలికి గిట్టలుగల జంతువుల్ని నెమరు వేసే జంతువులుగా పరిగణిస్తారు. వీటి జీర్ణాశయంలో నాలుగు వేర్వేరు గదులుగా భాగాలు ఉంటాయి. గడ్డిని గబగబా మేసి దాన్ని కడుపులో ఒక భాగంలో ఉంచి, మరల తీరికగా ఆ గడ్డిని నోటిలోకి తెచ్చుకుని నమలి మరల మింగుతాయి. దీనిని నెమరు వేయుట అంటారు. ఆవు, దుప్పి, పశువులు, జింక, జిరాఫీ. గొర్రె, మేక మొదలయినవి ఈ నెమరువేసే జాతికి చెందిన జంతువులు.

## ఏనుగులు

నేలమీద నివసించే జంతువులన్నిటిలోనూ భారీ శరీరంగలది ఏనుగు. బాగా పెరిగిన ఏనుగు మూడున్నర మీటరులు ఎత్తు ఉండి దాని బరువు దాదాపు ఏడు మెట్రిక్ టన్నులు ఉంటుంది. ఏనుగుల్లో రెండు రకాలు. 1. ఆసియా జాతి ; 2. ఆఫ్రికా జాతి. సాధారణంగా పదినుండి ఏభయి ఏనుగులు కలిసి మందలు మందలుగా జీవయాత్ర సాగిస్తూ ఉంటాయి. వాటి నడకవేగం గంటకు పది కిలోమీటరులు. పెద్ద ఏనుగు దినసరి గడ్డిదాణా 270కిలో గ్రాములు ఉంటుంది.














# వృక్షములు

**భూమండ**లమంతా వృక్షకోటి విస్తరించి ఉంది. కారడవుల్లోనూ పచ్చని పచ్చిక బయళ్లలోనూ మహాసముద్రోపరితలాల మీద వృక్షాల జాడలు మిక్కుటంగా కన్పిస్తాయి. ఎండతో మాడిపోయే ఎడారిలోనూ శీతల పర్వత శిఖరాల్లోనూ ఆయా పరిసరాలకు తట్టుకునే జాతి మొక్కలు ఉండడం కద్దు. భూమండలం మీద పరిసర వ్యవస్థలో వృక్షకోటి పాత్ర




గణనీయమైంది. గాలి, నీరువల్ల కోరుడుకు గురికాకుండా వృక్షకోటి నేలను రక్షిస్తూ ఉంటుంది. అడవి జంతువులకు ఆచ్ఛాదన కల్పిస్తుంది. మానవులకూ జంతువులకూ ప్రాణప్రదమైన ఆక్సిజన్‌ను వృక్షకోటి సమకూరుస్తుంది. ఈ భూగ్రహానికి వృక్షాలు దైవమిచ్చిన విలువయిన ఆస్తులు.

పైన చెప్పినట్లు వృక్షకోటి జగత్తంతా కమ్మి ఉంది. మహా సముద్రాల్లో ప్లాంక్టన్ అనబడే తేలుచూ ఉండే జంతు-వృక్ష మిశ్రమం కన్పిస్తుంది. ఇది దుమ్ము, ధూళిలాగ బహు సూక్ష్మపరిమాణంలో ఉంటుంది. మత్స్య జాతులకూ ఇతర సముద్ర జంతువులకూ ఆహారవసరాలు తీర్చేది ఈ ప్లాంక్టన్‌యే. ఆహార చక్రం చూచినట్లయితే ఎవర్ని ఎవరు తింటున్నారో తెలుస్తుంది. అన్ని ఆహార పదార్థాల కంటె మొదట ఉండేది వృక్షజాతి. వాస్తవానికి జంతువులు వాటి ఆహారాన్ని అవి తయారుచేసుకోలేవు. అయితే వృక్షాలు మాత్రం వాటి ఆహారాన్ని అవే సిద్ధపరుచు కోగలవు. వృక్షాలు కార్బన్ డై ఆక్సైడ్‌ను గాలి నుండి గ్రహించి, నేలనుంచి నీటిని, ఖనిజలవణాల్ని గ్రహించి పిండి పదార్థాలు గాను, ప్రొటీనులు గాను, కొవ్వులు గాను సిద్ధపరుస్తాయి. ఈ కార్యకలాపం పూర్తి కావాలంటే 'శక్తి' అవసరం. సూర్యరశ్మి నుండి ఈ శక్తి లభిస్తుంది. వృక్షాల ఆకులలో ఉండే క్లోరోఫిల్ అనే 'ఆకుపచ్చ' భాగంపై ఈ సూర్యరశ్మి పడినప్పుడు కిరణజన్య సంయోగక్రియ (ఫోటో సింతసిస్) జరిగి వృక్షానికి ఆహారం సిద్ధమవుతుంది. పుట్ట గొడుగులు వంటి శిలీంధ్ర జాతుల్లోకి క్లోరో ఫిల్ ఉండదు. అందుచేత వాటికి అవసరమైన ఆహారాన్ని ఇతర మొక్కల నుండి గ్రహిస్తాయి.

వృక్షాలు కిరణ జన్య సంయోగ క్రియ ద్వారా ఆహారం తయారుచేసుకోవడం అనే ప్రక్రియ ఫలితంగా ఆక్సిజన్ అనే ప్రాణవాయువు వెలువడి వాతావరణంలోకి విడుదల అవుతుంది. ఈ విధంగా, వృక్షాలు జంతుజాతికి చేసే విలువయిన సేవలుగా గుర్తించ వచ్చును. దీనికి కారణం ఆక్సిజన్ లేకుండా జంతుజాతి మనలేదు. ఈ ఋణం తీర్చు కోవడం జంతు జాతికి కూడ తెలుసు. అదెలా అంటే పుష్ప జాతుల్లో ఫలదీకరణ ప్ర క్రియ జంతుజాతులే చేస్తాయి. అంటే మగ పుష్పంలోని మగ కణాల రూపంలో (స్పెర్మ్) పుప్పొడిని స్త్రీ పుష్పంలోని అండాశయానికి మార్పిడి చేసే పని తేనెటీగలు వంటి కీటకాలు చేపట్టి పూర్తి చేస్తాయి.

వృక్షకోటి ఆక్సిజన్‌ను వాతావరణంలోనికి విడచిపెట్టడంతో పాటు మొక్కలు భారీరాశుల్లో నీటిని కూడ విడుదలచేస్తూ ఉంటాయి. అంటే నేలనుండి వేళ్లద్వారా నీటిని లాగి రెమ్మల గుండా; పత్రముల గుండా బాష్పోత్సేకం అనే ప్రక్రియ ద్వారా నీటియావిరిగా వాతావరణం చేరి జలచక్రంలో భాగమవుతుంది.

మట్టికణాలు కలిసి ఉండటానికి మొక్కలు దోహదం చేకూరుస్తాయి. మట్టిలో నీటిని పట్టి వుంచడానికి వేళ్లు సాయపడతాయి. వృక్షాచ్ఛాదనలేని నేల గాలి, నీటి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి ఉంటుంది. వృక్షాలు లేకపోతే పొడి మట్టిని గాలి లేపి వేస్తుంది.

### కిరణ జన్య సంయోగక్రియ

ప్రాణి కోటి మనుగడకు ఆహారం అవసరం. ఆహారం ద్వారానే శక్తి లభిస్తుంది. ఈ శక్తికి మూలధారం 'సూర్యకాంతి'. జీవకోటి కాంతిని తినలేవు. కాగా పచ్చటి వృక్షాలు మాత్రం సూర్యకాంతిని ఉపయోగించి తమ ఆహారాన్ని తాము తయారు చేసుకొనగలవు. ఈ ప్రక్రియనే ***కిరణజన్య సంయోగక్రియ* (ఫోటో సింతసిస్)** అంటారు. ఈ కిరణ జన్యసంయోగక్రియలో ఆక్సిజన్ ప్రాణవాయువు వ్యర్థ పదార్థంగా గాలిలోనికి విడుదల అవుతుంది. ఆక్సిజన్ పీల్చే మనం మనుగడ సాగించ గలుగుతున్నాం. ఇతర జంతుకోటికి కూడా ఆక్సిజన్‌యే ప్రాణదాత!



నీరు మట్టిని వల్లానికి చేర్చి కోరుడుకు గురికాకుండా చేస్తుంది. పాడుసేద్యం వల్లమైదానాలు ఎడారులయ్యే ప్రమాదం సంభవిస్తూ ఉంటుంది.

### వృక్షకోటిలో వైవిధ్యం

భూమండలంపై జీవకోటిలో చెట్లే అతిపెద్దవీ, వయస్సులో పాతవీను. యునైటెడ్ స్టేట్స్‌లోని కాలిఫోర్నియాలో వున్న సీక్వ్యాయా చెట్టు జాతీయపార్కులో వున్న 'జనరల్ షెర్మన్' అనే మహావృక్షం ప్రపంచంలోనే మహా వృక్షం. దాని వయస్సు 3500 ఏళ్ళు. దాని కలప 1400 ఘనపు మీటరులుంటుందని అంచనా. దీనికి భిన్నంగా ఒక నీటి బిందువులో ప్లాంక్టన్‌లో వృక్షసూక్ష్మాలు ఉండడం ప్రకృతి విచిత్రం!

జనరల్ షెర్మన్ కంటె వయస్సులో పెద్దది ఆ రాష్ట్రంలోనే వున్న 4500 ఏళ్ల వయస్సుగల **'మెతుసెలా'** ను పేర్కొనవచ్చును. భారత దేశంలో మద్రాసులోని అడయారు వటవృక్షం పెద్దది. కలకత్తాలోని వటవృక్షం కూడ పెద్దది. ఆంధ్రప్రదేశ్‌లోని అనంతపురం సమీపానవున్న కదిరి వటవృక్షం, మహబూబునగరం సమీపాన వున్న పిల్లలమర్రి వటవృక్షం ఒకవిధంగా పెద్దవైన వృక్షాలుగా పేర్కొనవచ్చు.

మరొక విశేషమేమంటే, వృక్షాలు వైవిధ్యంగల శీతోష్ణ పరిస్థితుల్లో తేలికగా మనుగడ సాగిస్తూంటాయి. అతిశీతల మైన ఆర్కిటిక్, అంటార్కిటికా, హిమాలయా శిఖరాలపైన వృక్షాలు మన గలుగు తున్నాయి. మరొక వైపు అత్యంత వేడిమి ప్రాంతాలయిన ఎడారుల్లో కూడ కొన్నిరకాల మొక్కజాతులు పెరగ గలుగు తున్నాయి. అయితే ఎడారి మొక్కలు పొట్టిగానే వుండడం గమనార్హం. దీనికి మినహాయింపు యునైటెడ్ స్టేట్స్‌లోని కాలిఫోర్నియా, ఆరిజానా ఎడారుల్లో పెరిగే సగౌరారో అనే బొమ్మజెముడు (ఎత్తు 15 మీటర్లు) ను ఉదాహరించ వచ్చును.


నేటి రోదసీ మానవుడు 20వ శత


నన్నయ కాలం 11 శతా.


800 క్రీస్తుపూర్వం రామాయణ ఆది కూర్పు.


సింధునదీలోయ నాగరికత క్రీ.పూ. 3000


వేల సంవత్సరాల వయస్సు గల జనరల్ షెర్మన్

మరొక విచిత్రమేమంటే ఋతువుని బట్టి కొన్ని వృక్షజాతులు ఎండిపోయి మోడులయినట్లు కన్పించినా వాస్తవానికి చావవు. ఇజ్రాయెల్ ఎడారుల్లో ఎండిపోయినట్లగుపించే చెట్లు వర్షం పడినప్పుడు తెల్లవారేటప్పటికి చిగురించడం, మన్నులో వున్న విత్తనాల నుండి మొక్కలు అంకురించి కొద్దిరోజులకే పచ్చటితివాచీ పరచినట్లగపడడం గమనార్హం. అలాగే కెనడా, సైబీరియావంటి ప్రాంతాల్లోని కొద్దివారాల సూర్య రశ్మికి మంచు టండ్రాలు కరగి కొద్దికాలంపాటు వృక్షజాతులు మనుగడ సాగించడం కద్దు.

కాగా వృక్షసంపద పుష్కలంగా వున్న ప్రాంతాలు ఉష్ణప్రాంతాలయిన ఆగ్నేయాసియా, ఇండియా ఆఫ్రికా, దక్షిణప్రాంతాలు, అమెరికా పేర్కొనవచ్చును. ఈ ప్రాంతాల్లో వర్షపు టడవు (రెయిన్ ఫారెస్ట్) ల ప్రభావం ఎక్కువ. అందుచేత ప్రపంచంలో ఇతర ప్రాంతాల కంటె ఈ ప్రాంతాల్లో కనిపించే వృక్షజాతుల్లో వైవిధ్యం మెండు. ఈ వర్షపుటడవులు గత నాలుగుకోట్ల సంవత్సరాలుగా మనుగడ సాగిస్తున్నాయనడానికి దాఖలాలు కూడ ఉన్నాయి.

## పుష్పించే మొక్కలు

పుష్పించే మొక్కలు ప్రకృతి సౌందర్యానికి మూలం. అంతేకాదు, అవి మనిషికి ఎన్నో అవసరాల్ని తీరుస్తాయి. శాకాహారులైన మనుషులకూ జంతువులకూ ఆహారాన్ని చెట్లే సమకూరుస్తాయి. వృక్ష సంపదలో పుష్పించే మొక్కల జాతుల సంఖ్య 2,85,000. మిగతా వృక్షజాతులన్ని కలసి - వాటి సంఖ్య 1,48,000 మాత్రమే. పుష్పించే మొక్కలు రెండు రకాలు. ఏకదళ జాతులు. 2. ద్విదళ జాతులు. ఏకదళ జాతిలో ఒకే బీజపత్రం ఉంటుంది. (ఉదా : వరి) ; ద్విదళ జాతిలో రెండు బీజ పత్రాలు ఉంటాయి. (ఉదా :చిక్కుడు).

పుష్పం ఫలదీకరణం చెందినప్పుడు ఫలం ఉత్పత్తి అవుతుంది. పండిన కొద్దీ కొన్ని ఫలాలు ఎండిపోతాయి. ఉదా: బఠాణీ, కంది, సెనగ, పెసర వంటి అపరాలు. మరికొన్ని కండగల పండ్లుగా ఉంటాయి. ఉదా: టమాటా, ద్రాక్ష, అరటి వగయిరా. పుష్పించే మొక్కల్ని 'ఆంజియో స్పెర్మ్' అని అంటారు. దీనికి అర్థం వాటి విత్తనాల పండు లోపల బరిణెలో ఉన్నట్టు ఉంటాయి. నారింజ జాతుల్లో పండుతొనలో గింజలు అక్కడ అక్కడా పొదగబడి ఉంటాయి. మామిడి, ఆలుబకరా, ఖుర్బానీ వంటి వాటి పండు లోపల గింజ గట్టి పెంకుకట్టి ఉంటుంది.

## చెట్లు, గుల్మాలు

చెట్లు, గుల్మాలువంటి వాటికి కాండం చేవదేరి ఉంటుంది. దీనివల్ల మొక్క పెరిగి పెద్దదవడానికి వీలుంటుంది. కొన్ని రకాలు లతలుగా పెరుగుతాయి. ప్రధానంగా చెట్లు రెండురకాలు. పత్రాలు సూచ్యాకరంగా ఉండేవి కోనిఫర్‌లు. వీటి విత్తనాలు శంకులో ఉన్నట్టు ఉంటాయి. ఇవి అన్నీ సతతహరితాలు. అంటే ఆకురాలు కాలంలో ఆకుల్ని రాల్చవు. ఏడాది పొడవునా ఆకులు రాలుస్తూ కొత్త ఆకుల్ని తొడుగుతూ ఎప్పుడూ ఆకుపచ్చగా ఉంటాయి. వెడల్పాటి పత్రాలు గలవి మరొక రకం. ఇవి పుష్పిస్తాయి. ఫలాల్లో గింజలు ఉంటాయి. ఇవి శిశిరంలో ఆకులు రాల్చి వసంతంలో చిగిర్చి ఆకులు తొడుగుతాయి.

## వృక్షాలు - ప్రజలు

భూమండలం మీద వృక్షసంపద మానవాళికి దైవమిచ్చిన వరమని ఇదివరకే చెప్పడమయింది. పదివేల సంవత్సరాల

క్రితమే మానవుడు తనంతటతాను ఆహారపు మొక్కలను పైరు చేయడం నేర్చుకుని సాగు చేయడం ప్రారంభించాడని అంటారు. పంటలు పండించడం మొదలుపెట్టడంతో మానవుడు గింజలు, పండ్లు వంటి ఆహారసేకరణకై ఒక చోట నుండి మరొక చోటికి వలస వెళ్లవలసిన అవసరం తగ్గిపోయి ఒకే చోట స్థిరనివాస మేర్పరుచుకోవడం ప్రారంభించాడు. దీనితో నాగరికతకు బీజాలు పడ్డాయి. జానపదులు నివసించే చోట్లను నగరాలుగా గుర్తించారు.

పండించే పంటలలో కూడ వైవిధ్యం ఆనాడే ప్రారంభమయిందని చెప్పవచ్చును. ఆహారపు పంటలు సాగుచేయడానికి మేలు రకం విత్తనాలను ఎంచుకోవడం కూడ ప్రారంభమయింది. తన అవసరాలకు మాత్రమే తిండి గింజల్ని పండించడమేగాక అదనంగా ఇతరులకు కూడ ఆహారాన్ని పండించి, అందించగలగడం మానవుడు నేర్చుకుని వాణిజ్య సరళిలో అభివృద్ధి చెందాడు. ఆధునిక శాస్త్రీయ పరిశోధనల ఫలితంగా సాగు పంటల వ్యవస్థలో 1960 నుంచి అధిక దిగుబడిని ఇచ్చే మేలురకం సంకర (హైబ్రిడ్) విత్తనాలు వాడుకలోనికి రావడంతో 'హరిత విప్లవం' అనే పదబంధం అందరి నోళ్లలోనూ నానుతూ ఉంది. ముఖ్యంగా వరి, గోధుమ, జొన్న, మొక్కజొన్న, రాగులు, సజ్జలు వంటి ఆహార ధాన్యాల్లో సంకరజాతుల మేలి విత్తనాలు నేటి రైతుకు అందుతున్నాయి. దీని ఫలితంగా ఆహారధాన్యాల కొరత ముఖ్యంగా దక్షిణ ఆసియా వంటి అభివృద్ధి చెందుతున్న దేశాల్లో చాలావరకు అదుపులోకి వచ్చింది. ఆధునిక శాస్త్రవిజ్ఞాన పరిశోధనల ఫలితంగా బయోటెక్నాలజీ, టిస్యూ కల్చర్, మైక్రో ప్రోపగేషన్ ద్వారా పంటమొక్కల వ్యాప్తి జరగడంతో జెర్మ్ ప్లాజ్మ్‌కు పరిమితులు ఏర్పడి, జీవ వైవిధ్యం (బయో డైవర్శిటీ) గల వృక్షాల బీజవ్యాప్తి (జెర్మ్ ప్లాజ్మ్) తగ్గిపోతూ ఉందనే అపశ్రుతులు వినవస్తున్నాయి, ఈనాడు!!

వృక్షసంపదను అనాదిగా మానవుడు ఎప్పుడూ దుర్వినియోగం చేస్తున్నట్టే కనిపిస్తున్నది. కలపను గృహనిర్మాణానికీ, ఫర్నిచరు చేయడానికీ, వంటసరకుగానూ, కాగితం తయారీలోనూ ఓడలను నిర్మించడానికీ చెట్లను సదా నరికి వేయడం జరుగుతూఉంది. దీనితో ఒకప్పుడు భూమి నంతటినీ ఆవరించివున్న అటవీ సంపద క్రమక్రమంగా కొరవడి పోతూంది.

ఉత్తర అమెరికా, యూరపు ఖండాలలో అడవులు నాశనమై పోయాయి. ఇప్పుడు ఆఫ్రికా, దక్షిణ అమెరికా, ఆసియా ఖండాలలో అడవుల్ని పెద్దపెట్టున నరికి వేస్తున్నారు. ఈ ప్రాంతాల్లో రాత్రనక, పగలనక ప్రతి నిమిషానికీ 12 హెక్టార్ల అడవులు నేలమట్టమయి పోతున్నాయి.

ఈ విధంగా అడవుల్ని ధ్వంసం చేయడంవల్ల ఒకవైపు వృక్షసంపద తరిగిపోవడంతోబాటు వన్యమృగాల ఆవాసాలు కూడ దెబ్బ తింటున్నాయి. తత్ఫలితంగా కొన్ని జంతు జాతులు మనుగడ సాగించలేక లుప్తమయి పోతున్నాయి. ఉష్ణమండల వర్ష పుటడవులు విలువైన వృక్షసంపదకు ఆలవాలం. ఇందులో కొన్ని వృక్షజాతులు ఆహారపంటలను ఇవ్వ డానికీ, మరికొన్ని దీర్ఘవ్యాధుల నివారణకు పనికివచ్చే విలువైన ఓషధులు ఉన్నాయి. అటువంటి సహజ వనరులు మానవ జోక్యంతో మృగ్యమై పోతున్నాయి.

# మానవ శరీరం ఒక రమ్యహర్మ్యం

సమన్వయ విషయంలో మానవ శరీరం ఒక అద్భుతమైన యంత్రం. గుండె నిమిషానికి 70 సార్లు కొట్టుకుంటూ ఈ క్రియ జరిగేటప్పుడు శరీరంలోని- సిరలలోనూ ధమనులలోనూ రక్త ప్రసరణ జరుగుతూ ఉంటుంది. ఈ రక్తప్రసరణ ప్రక్రియలో ధమనుల ద్వారా ప్రాణవాయువు (ఆక్సిజన్)ను మెదడు ఇంకా మిగిలిన శరీర భాగాలకు అందుతూ ఉంటుంది. అట్లే కణ దహనం ఫలితంగా జనించు కార్బన్ డై ఆక్సైడు సిరల మీదుగా గుండె ద్వారా శ్వాస కోశాల్లో చేరి ఆక్సిజన్ ద్వారా రక్తం శుభ్రపడి మరల గుండెచేరి ధమనుల ద్వారా శరీర భాగాలకూ మెదడుకూ చేరుతుంది. గమ్మత్తు ఏమిటంటే అంటే వ్యాధి సోకకుండా శరీరం తగు జాగ్రత్త తనంతటతానే తీసుకొనగలదు. ఎముక విరిగినప్పుడు అతుక్కున్నట్లు గాయాలు మాని పోవుట శరీరం దానికదే చేసుకొన గలదు. శరీరం వ్యాధి నిరోధక శక్తి కలిగి ఉంటుంది. శరీరంలో నిమిషానికి మూడు శతకోటి కణాలు హరించుకు పోతూ కొత్తవి ఎప్పటికప్పుడు పుడుతూనే ఉంటాయి. అయితే, మెదడులోని కణాలు మాత్రం చెక్కు చెదరక దాదాపు నూరేళ్లు మనుతాయి. శరీరంలోని నాడీ మండలం 639 కండరాలకూ సందేశాలను అందిస్తూ 206 చిన్నపెద్ద ఎముకలకు చలనం కలిగిస్తూ ఉంటుంది.

మానవ శరీరం ఒక క్లిష్టమైన వ్యవస్థ. సమతూకం కలది. శరీరంలో అనేక భాగాలు ఉన్నాయి. అందులో ఒక్కొక్కటి ఒక్కొక్క విశిష్టమైన కార్యాన్ని నిర్వహిస్తూ ఉంటుంది. భాగాలు అన్ని సరిగా పని చేసినప్పుడు శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. మన శరీరం గురించి ఎప్పుడూ శ్రద్ధ వహిస్తూ ఉండాలి. సమయానికి శరీరానికి ఆహారం, నిద్ర, వ్యాయామం అందిస్తూ ఉండాలి. అయితే శరీరం దానికదే జాగ్రత్త పడుతూ ఉండడం కూడా సహజం. కొన్ని శరీర భాగాలు కలిసి వ్యవస్థగా ఉంటాయి. మన శరీరంలో సప్త మండలాలు ఉన్నాయి. 1. అస్థిపంజరం 2. జీర్ణ మండలం; 3. మూత్ర వ్యవస్థ; 4. శ్వాస మండలము; 5. గుండె - రక్త ప్రసరణ మండలం : 6. నాడీ మండలం 7. పునరుత్పత్తి మండలం.

శరీరం గురించి మనకు తెలియని విషయాలు చాలా ఉన్నాయి. చిన్న శిశువుల అభివృద్ధి చెంది వయోజనపులయిన తోడనే పెరుగుదల ఆగిపోవటానికి కారణమేమిటన్నది సంగతి ఇంతవరకూ అంతు పట్టలేదు!

## అస్థిపంజరం

శరీరానికి రూపునిచ్చే ఆధారంగా ఉండే చట్రమే అస్థిపంజరం. దీని నిర్మాణంలో అన్ని ఎముకలే. ఈ ఎముక లన్నీ ఒకే రకమైన పదార్థం - కాల్షియంతో నిర్మించబడ్డాయి. బయటికి దృఢంగా ఉన్నా లోపల డొల్ల. ఈ

మానవ శరీరాన్ని గూర్చి పరిశోధన జరిపినకొందరు మహా విజ్ఞానులు



డొల్ల మెత్తటి మూలుగ అనే పదార్థంతో నింపబడి ఉంటుంది. రక్తంలో ఎర్ర కణాలు తెల్లకణాలు ఈ మూలుగలోనే తయారవుతాయి. అస్థి పంజరంలో అనేక రకాలయిన ఎముకలు ఉన్నాయి. చేతుల కాళ్ల ఎముకలు పొడవుగా ఉంటాయి. చీలమండ, మణికట్టు, అరచేతులు, పాదాలు పొట్టి ఎముకలు కలిగి ఉంటాయి. భుజ స్కంధాలు, పుర్రె చదును ఎముకలు కలిగి ఉంటాయి. ఎముకలు విరిగినచో మళ్లీ వాటిని అతుక వచ్చు. యథాస్థలంలో పెట్టి జాగ్రత్తగా కట్టుకట్టి ప్లాస్టరు వేసినచో కొద్ది కాలానికే చక్కగా అతుక్కుని స్వస్థత చేకూరుతంది. ఈ ఎముకలన్నిటిని కీళ్లు జత పరుస్తాయి. అందు



అస్థి పంజరం

చేతనే అస్థిపంజరం సులువుగా కదలగలుగుతుంది. మోకాలు, మోచెయ్యి, 'మడత బందు' కీలు వల్ల కదల గలుగుతాయి. భుజం, తొడ 'బంతి - గిన్నె' కీలు వల్ల కదల గలుగుతాయి.

చూట్టూ 'అస్థిపంజరపు చట్రంలోని ఎముకలను వెన్నెముక సంధాన పరుస్తూ ఉంటుంది. ఈ వెన్నెముకలో 33 ఎముకలు ఉంటాయి. మెత్తగా ఉండే ఉపాస్థితో తయారైన పదార్థం వీటికి ఆధారంగా ఉంటుంది. వెన్నెముకలోని కీళ్లు చేతి, కాలు కీళ్ల వలె ఎక్కువగా వంపు తిరగవు.

## జీర్ణమండలం

శరీర ఇంధనావసరాల్ని సిద్ధపరచేది జీర్ణ మండలం. మనం స్వీకరించే ఆహార పానీయాలు సూక్ష్మకణాలుగా విడివడి శరీరానికి అవసరమయ్యే కణాల్ని రూపొందించడానికి, శక్తినివ్వడానికి వినియోగపడతాయి. ఎన్‌జైమ్‌లు అనబడే రాసాయనిక పదార్థాల్ని శరీరం ఉత్పత్తి చేసుకుంటూ ఉంటుంది. వీటి సహాయం వల్లనే ఆహారం జీర్ణమవుతుంది. జీర్ణ ప్రక్రియ నోటిలో ప్రారంభమవుతుంది. నోటిలోని లాలాజలంలో చాలా ఎన్‌జైములు ఉంటాయి. జీర్ణాశయం (కడుపు)లో ఆహారాన్ని చిన్న చిన్న ముక్కలుగా కొట్టడానికి ఎన్నో

రసాయన పదార్థాలు పనిచేస్తాయి. పాక్షికంగా జీర్ణమైన ఆమాశయపాకం అప్పుడు పొడవాటి

> **జీర్ణమండలం గురించి**
>
> ❋ అన్నవాహిక 25 సెం.మీ. ఉండే గొట్టం, దీని వ్యాసం 12 నుండి 25 మి.మీ. ఆహారాన్ని నోటినుండి కడుపు (జీర్ణాశయం)కు తీసికొని వెళ్లుట దీని పని. ❋ కడుపులో శక్తివంతమైన హైడ్రోక్లోరికామ్లం ఉంటుంది. ఇది ఆహారపదార్థాల్ని విడగొడుతుంది. రోగక్రిముల్ని నాశనం చేస్తుంది. అయితే ఈ ఆమ్లంవల్ల జీర్ణాశయం గోడలుదెబ్బ తినకుండ ఆ గోడలకు మ్యూకస్ అనే అస్తరు ఉంటుంది, ❋ చిన్నపేగు : ఇది ఆరు మీటర్ల నిడివి కలిగి ఉంటుంది నాలుగు సెంమీ. వ్యాసం. ఇచ్చట ఆహారం జీర్ణమై శోషింపబడుతుంది. మిగిలిన పదార్థం పెద్ద పేగుకు చేరుతుంది. ❋ పెద్దపేగు : మీటరు న్నర నిడివి అయిదు సెం.మీ. వ్యాసం కలిగి ఉంటుంది. చిన్నపేగు నుండి చేరిన జీర్ణంకాని పదార్థంలోని నీరు శోషించబడుతుంది. మల ద్వారాల పురీషనాళం ద్వారా ఈ వ్యర్థ ఘన పదార్థం విసర్జించబడుతుంది.

చిన్న పేగులోనికి ప్రవేశించగా అక్కడ జీర్ణ ప్రక్రియ పరిసమాప్త మవుతుంది. మూత్ర పిండాల్లో ద్రవపదార్థాలు విడివడతాయి. అందులో శరీరానికి పనికిచ్చే పదార్థాలు వేరు చేయబడి రక్తంలో కలుస్తాయి. వ్యర్థ



జీర్ణమండలం

పదార్థాలు మూత్రాశయంలో చేరి విసర్జింపబడతాయి.

**కాలేయం:** రక్తం నుంచి ఆల్కహాలును వంటి విషపదార్థాల్ని విడగొట్టి, శరీర రక్తంలోని చక్కెర స్థాయిని నియంత్రిస్తుంది.పైత్య రసాన్ని తయారు చేసి జీర్ణప్రక్రియకు తోడ్పడుతుంది. చక్కెరను గ్లైకోజన్ రూపంలో నిల్వ చేస్తుంది.

**వృక్కకం (పాంక్రియాస్) :** జీర్ణాశయం వెనుక ఉండే గ్రంధి. జీర్ణ ప్రక్రియకు తోడ్పడే ఎంజైమ్ ద్రవాల్ని విడుదల చేస్తుంది. రక్త ప్రసరణలో చక్కెర స్థాయిని నియంత్రించే ఇన్సులిన్‌ను కూడ స్రవింప చేస్తుంది.

**ప్లీహం (స్ప్లీన్) :** పొత్తి కడుపు పైన ఎడమ పక్కన ఉండే ప్లీహం రక్తంలోని విష పదార్థాన్ని వడకడుతుంది. ఇది తెల్ల రక్తకణాల్ని కూడా తయారు చేస్తూ రక్త ప్రసరణలో పోయిన ఎర్రరక్త కణాల్ని తీసి వేస్తుంది. శరీరంలో రక్తనిధి స్థాయిని పరిరక్షిస్తూ ఉంటుంది.

## మూత్ర వ్యవస్థ

మూత్ర వ్యవస్థ : రక్తం అథోబృహాత్సిర ద్వారా మూత్ర పిండం చేరి అక్కడ మలిన పదార్థం మూత్రకోశం చేరి అప్పుడప్పుడు



మూత్ర వ్యవస్థ

మూత్రనాళం ద్వారా విసర్జింపబడుతుంది. శుభ్రపడిన రక్తం మరల శరీర భాగాలకు ప్రసరిస్తుంది. ఒక విధంగా శరీరంలోని ద్రవ స్థాయిని రసాయనాల స్థాయిని నియంత్రణ చేసేది మూత్ర వ్యవస్థయే.

## శ్వాసమండలం

జీవి మనుగడకు అత్యవసర మైంది ఆక్సిజన్. అందుకే దీనిని ప్రాణ వాయువు అని కూడా వ్యవహరిస్తారు. మనం పీల్చే గాలిలో నూటికి 21 వంతులు ఆక్సిజన్ ఉంటుంది. శరీరానికి కావల్సిన ఆక్సిజన్‌ను సరఫరా చేయడంలో శ్వాసకోశాలు ప్రముఖ పాత్ర వహిస్తాయి. ఊపిరి పీల్చినప్పుడు గాలి శ్వాసకోశంలోనికి చొరబడుతుంది. అక్కడ చేరిరక్తంలోనికి ఆక్సిజన్ ప్రవేశిస్తుంది. గుండె ఆ రక్తాన్ని [redacted] ఉంటుంది.. దానితో [redacted] జీవకణాలకు ఆక్సిజన్ చేరుతుంది.

ఊపిరి పీలుస్తు న్నప్పుడు ముక్కు ద్వారాను నోటి ద్వారాను గాలి లోపలికి శ్వాస నాళంద్వారా పోతూ ఉంటుంది. ఈ

> **ఊపిరితిత్తుల గురించి**
>
> * ఊపిరితిత్తులలో (శ్వాసకోశం) ఉండే గాలి సంచులు (ఆల్వేవోలీ) సంఖ్య అరవై కోట్లు.
> * గాలి సంచుల గోడలు 56-93 చ.మీ. విస్తరించి ఉంటాయి.
> * సగటు వ్యక్తి ఊపిరితిత్తులలో మూడు లీటర్ల గాలి ఉంటుంది.
> * నిముషానికి పదిహేను సార్లు గాలిని పీల్చడం - వదలిపెట్టడం జరుగుతుంది. ఈ గాలిరాసి ఒక లీటరు ఉంటుంది. గట్టిగా గాలి పీల్చినప్పుడు డయాఫ్రం అయిదు సెం.మీ. పెరుగుతుంది.

శ్వాసనాళం రెండు శాఖలుగా విభజింపబడి ఉంటుంది. ఒక శాఖ ఎడమవైపు శ్వాసకోశానికి రెండవది కుడివైపు శ్వాసకోశానికి చేరతాయి. శ్వాసకోశాల్నే ఊపిరీతితుత్తలని కూడా అంటారు. శ్వాసకోశంలో శాఖోపశాఖలై చివరకు గాలిగదులుగా ఏర్పడతాయి. వీటిని **'ఆల్వే యూలీ'** అంటారు. పీల్చిన గాలిలోని



శ్వాస మండలం

ఆక్సిజన్ ఈ గాలి గదుల్లోకి శోషింపబడగా అది రక్త ప్రవాహంలోనికి లోగొన బడుతుంది.

## గుండె - రక్త ప్రసరణ మండలం

గుండె అతి సమర్థవంతమైన పంపు. ఇందులో నాలుగు గదులు ఉంటాయి.

పైన ఉన్నవి కుడి, ఎడమ జఠరికలు, కిందవి కుడి, ఎడమ కర్ణికలు. ఊపిరితిత్తులలో తాజాగా ప్రాణ వాయువు (ఆక్సిజన్)ను గ్రహించి రక్తం ఎడమ జఠరికలోనికి ప్రవహిస్తుంది. ఒక వైపుకే తెరుచు కొన్ని ఉన్న కవాటం ద్వారా ఆ రక్తం కిందనున్న ఎడమ కర్ణిక లోనికి పంపు

### గుండె గురించి

* గుండె నిమిషానికి డెబ్బయి సార్లు కొట్టుకుంటుంది (స్పందనాలు). అంటే ఏడాదికి మూడుకోట్ల డెబ్బయి లక్షలసార్లు అన్నమాట. స్పందనాల మధ్య గుండె విశ్రాంతి తీసుకొంటుంది. అంటే డెబ్బయి ఏళ్ళ జీవిత కాలంలో నలభై ఏళ్ళు విశ్రాంతి.
* ప్రతిరోజు గుండె పంపుచేసే రక్తం దాదాపు పదమూడు మెట్రిక్ టన్నులు అంటే 13640 లీటర్లు అన్నమాట.
* హృదయం బరువు పురుషులది 310గ్రాములు స్త్రీలది 260 గ్రాములు.



గుండె

### రక్తం గురించి

* సగటు వ్యక్తిలో అయిదున్నర లీటర్లు రక్తం ఉంటుంది. * పిన్న వయస్కులలో తక్కువ, స్థూలకాయుల్లో ఎక్కువ రక్తం ఉంటుంది. * సగటు వ్యక్తిలో ఎర్ర రక్త కణాలు రెండున్నర లక్షల కోట్లు ఉంటాయి. * సగటు వ్యక్తిలో రక్త నాళాల పొడవు ఒక లక్ష అరవైవేల కి.మీ.

చేయబడి అక్కడ నుండి శరీరభాగాలన్నిటికీ ప్రసార మవుతుంది.

శరీరభాగాలనుండి సిరల ద్వారా గుండె చేరే రక్తం ఆక్సిజన్ రహితంగా ఉంటుంది. అయితే కార్బన్ డై ఆక్సైడ్ వాయువు వ్యర్థ ప్రదార్థంగా ఆ రక్తంలో ఉంటుంది. అందుకే అది 'నీలి రంగు'లో ఉంటుంది. ఈ నీలి రక్తం కుడి జఠరిక చేరి అక్కడ నుండి ఒక కవాటం ద్వారా కుడి కర్ణికలోనికి చేరుతుంది. అక్కడ నుండి ఊపిరితిత్తులను ప్రవేశించి కార్బన్ డైఆక్సైడ్‌ను ఇచ్చివేసి ఆక్సిజన్ గ్రహిస్తుంది.

అనేక రక్తనాళాల ద్వారా శరీరంలోని అన్ని భాగాలకు రక్తం చేరుతుంది. గుండెనుండి తాజారక్తం ప్రవహించే రక్త నాళాల్ని 'ధమను' లని అంటారు. మొదట్లో ఈ ధమనులు పెద్దవిగా ఉంటూ క్రమంగా సన్నంగా మారిపోతూ చివరకు ఇవి అతిసూక్ష్మంగా కైశిక నాళాలుగా మారతాయి. ఈ కైశికనాళాల గోడలు అతి

రక్త ప్రసరణ మండలం

కంఠ సిర
కంఠధమని
ఊర్ధ్వ బృహత్సిర
బృహద్ధమని
కుడి పుపుస ధమని (శ్వాసకోశానికి)
ఎడమ పుపుస సిర
కుడి పుపుసధమని(శ్వాసకోశము నుండి)అధోబృహత్సిర
ఎడమ పుపుస సిర శ్వాసకోశము నుం
అధోబృహత్సిర
హృదయం
కాలేయంలో రక్తనాళాలు
ప్లీహం
మూత్రపిండంలో రక్తనాళాలు
పేగులో రక్తనాళాలు
సిర
ధమని

## రక్త వర్గాలు - బ్లడ్ గ్రూప్‌లు

O → O; O → A; O → B; O → AB; A → A; A → AB; B → B; B → AB; AB → AB

రక్త దాత, ప్రతి గ్రహీతల స్వభావాన్ని బట్టి మానవుల రక్తం ప్రధానంగా నాలుగు వర్గాలు-గ్రూపులు 'A, B, AB, O. గ్రూపు 'AB' సార్వత్రిక గ్రహీత అంటే ఏ గ్రూపుకు చెందిన వారి నుంచి అయిన స్వీకరిచంవచ్చు.

O గ్రూపు సార్వత్రిక దాత ఏ గ్రూపు వారికైనా రక్తాని దానం చేయవచ్చు.

A గ్రూపు రక్తం A గ్రూపు వారుగాని AB గ్రూపు వారుగాని స్వీకరిచంవచ్చు.

B గ్రూపు రక్తం B గ్రూపువార్లు గాని AB గ్రూపువారు గాని స్వీకరించ వచ్చు.

AB గ్రూపు రక్తం AB గ్రూపువారు మాత్రమే స్వీకరించ వచ్చు.

శస్త్ర చికిత్స చేయ వల్సినవప్పుడు రక్త స్రావం జరుగుతుంది. అప్పుడురక్తదాత ప్రతి గ్రహీతల రక్తాన్ని పరీక్షచేసి రక్తవర్గ సమన్వయం కుదిరిన రక్తాన్నే వినియోగిస్తారు.

సాధారణంగా ఉంటాయి. ఇలా అతి సూక్ష్మగా ఉండటం వల్లనే రక్తంలోని ఆహార పోషకాలు, ఆమ్లజని శరీరకణాల్లో చేరి అందలి వ్యర్థ పదార్థాలు, కార్బన్ డై ఆక్సైడ్ వాయువు సూక్ష్మకేశనాళాల ద్వారా నీలి రక్తంలోకి గ్రహింపబడి అది చివరకు సిరల ద్వారా గుండెను చేరుతుంది.

**మెదడు : నాడీమండలం : జ్ఞానేంద్రియాలు**

శరీర సమచార వ్యవస్థలో మెదడు, నాడులు, జ్ఞానేంద్రియాలు ప్రముఖమైన నియంత్రణ పాత్రను పోషిస్తూ ఉంటాయి. పుర్రెలోనే మెదడు ఉంటుంది. పంచేంద్రియాలు అనగా జ్ఞానేంద్రీయాలు నుండి - **చూపు, వినికిడి, వాసన, రుచి, స్పర్శకు** సంబంధించిన - సందేశాలు మెదడుకు చేరుతూ ఉంటాయి. శరీరభాగంలో ఏమి జరుగుతున్నదో ఎప్పటికప్పుడు మెదడుకు ఈ జ్ఞానేంద్రియాల ద్వారా తెలుస్తూ ఉంటుంది. ఈ సందేశాల్ని మెదడు గ్రహించి, వెంటనే ఆలోచన ప్రక్రియకు లోను చేసి సరియైన కార్యాచరణ ఆదేశాలకు మిగిలిన శరీర భాగాలకు అందించి స్పందిప చేస్తాయి.

కణనిర్మితమైన పొడవాటి తంతువులు కట్టలుగా నాడులు ఉంటాయి. వెన్నెముకను చేరి మెదడు ఉంటుంది. ఈ రెండటిని కేంద్రనాడీ మండల వ్యవస్థగా వ్యవహరించడం కద్దు. శరీరంలోని అన్ని భాగాల్లోనూ విస్తరించివున్న నాడులు బాహ్యానాడీ మండల వ్యవస్థగా పేర్కొంటారు. జ్ఞాననాడులు జ్ఞానేంద్రియాల నుండి. సందేశాలను గ్రహించి

**జ్ఞానేంద్రియాల గురించి**

✻ మానవుని కన్నులు చాల .రంగుల్ని గుర్తిస్తాయి. కొందరు మూడు లక్షల వివిధ రంగుల ఛాయల్ని గుర్తించ గలుగుతారు. ✻ మానవుని చెవి సుమారు పదిహేను వందల సంగీత స్వరాల్ని గుర్తించ గలదు. ✻ లోపలి చెవిలోని సర్పిలాకార కాలువ బఠాణి గింజంత ఉంటుంది. ✻ నాలుక మీది రుచి బొడిపెలు ప్రత్యేకమైన పనులు చేస్తూ ఉంటాయి. నాలుక చివరలు తీపినీ ఉప్పునీ గుర్తిస్తాయి. నాలుక పక్కలు పులుపునీ లోపలి భాగం చేదునీ గుర్తిస్తాయి.

**నాడీమండలం గురించి**

✻ సగటువ్యక్తి మెదడు బరువు ఒకటిన్నర కిలోగ్రాము ఉంటుంది. ✻ మెదడులోని నాడీకణా (న్యూరాన్) ల మొత్తం సంఖ్య పన్నెండు వందల కోట్లు. ✻ పెరుగుదల పూర్తి అయితే రోజుకి వేల సంఖ్యలో నశిస్తూ ఉంటాయి. అవి మరల సమకూర్చబడవు. ✻ నాడీ (వార్తల) వేగం గంటకు సుమారు 320 కి.మీ. ✻ వెన్నెముక పొడవు 43 సెం.మీ. మందం రెండు సెం.మీ. బరువు 43 గ్రాములు. ఇందులో 33 వెన్నుపూసలు 31 జతల వెన్నెముక నాడులు ఉంటాయి. ఇవి శరీర కండరాల్ని అదుపులో పెట్టడానికి ఉపయోగ పడతాయి.



మెదడుకు చేరవేస్తూ ఉంటాయి. చలననాడులు సందేశాల్ని మెదడు నుంచి కండరాలకు చేరవేస్తూ ఉంటాయి.

~~మాటవరుసకు ఇప్పుడు ఈ మాటను~~ మీరు చదువుతున్నప్పుడు మీ మెదడులో జరిగే ప్రక్రియ ఏమిటంటే - విడి అక్షరాలను గుర్తుపట్టి పదాలుగా కూడబలుక్కుని వాక్యాలుగా గుర్తించి అందులోని సారాంశం తెలుసుకోవడం - ఈ పని అంతా క్షణంలో ఏన్నోవంతులోనో జరిగిపోతుంది. ఇలా గ్రహించిన కొంత సమాచారం జ్ఞాపకాలుగా మెదడులో ముద్రిత మవుతాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాల ద్రుతిని నియంత్రించడానికీ, జీర్ణమవడంలోనూ ఇంకా ఇతర పనులు నిర్వర్తించడంలోనూ మెదడు మనకు తెలియకుండగానే ఆదేశాలను జారీ చేస్తూ ఉంటుంది. నాడీమండలం సహాయంతోనే మనం ఎక్కడ ఏమి చేస్తున్నదీ మనకు సతతమూ తెలుస్తూ ఉంటుంది.




మెదడులోని జ్ఞానేంద్రియ ప్రాంతాలు
ఆలోచనా ప్రాంతాలు




మెదడుకోత దృశ్యం




చెవి

### వినాళగ్రంథులు:

వినాళ గ్రంథులు (డక్టలెస్ గ్లాండ్స్) శరీరానికి కావల్సిన కొన్ని ద్రవాల్ని తయారుచేసి సరఫరా చేసేవి వినాళ గ్రంథులు.

**పిట్యూటరీగ్రంథి:** ఇది మెదడు పీఠంలో నేరేడు పడంత ఉంటుంది. హార్మోన్‌లను తయారు చేసి విడుదల చేస్తుంది. ఇది మిగతా వినాళగ్రంథుల్ని నియంత్రించే ద్రవాల్ని విడుదల చేస్తుంది.

**హైపోతాలమస్ :** (పిట్యుటరీ గ్రంథిని నియంత్రించేది) ఇది కూడా హార్మోన్‌లను తయారుచేసేదే.

**పీనియల్ గ్రంథి:** ఇది మెదడులోపల ఉంటుంది.




వినాళ గ్రంథి వ్యవస్థ

## కండరమండలం

కీళ్ల సహాయంతోనే ఎముకలు ఇటూ - అటూ కదలుతూ ఉంటాయి. అయితే అసలు కదలికలకు కారణం కండరాలే ! ఎముకలకు కండరాలను బంధించే పట్టేవి దృఢమైన స్నాయు బంధాలు. కండరాలు ముడుచుకున్నప్పుడు ఈ స్నాయు బంధాలు ఎముకల్ని లాగుతుంటాయి. కాగా స్నాయబంధాలు లాగడమేగాని గెంట లేవు. అందుచేత కండరాలు జతలు జతలుగా కలిసి

**కండరాల గురించి**

✻ మానవ శరీరంలో ఉన్న కండరాలు మొత్తం సంఖ్య 639. ✻ అతి పెద్దకండరం : పిరుదు కండరం - దీనిపేరు గూటియస్ మాక్సిమస్. తొడనుండి మొండెం వరకూ ఇది విస్తరించి ఉంటుంది. ✻ అతి చిన్న కండరం : చెవిలోని స్టేపిడియస్. ఈ బుల్లి కండరం రికాబు (స్టిరప్) ఎముక కదలికను నియంత్రిస్తూ ఉంటుంది. ✻ శరీరం బరువులో నలభై శాతం కండరాల బరువే. మీరు నడిచేటప్పుడు. రెండు వందల కండరాల అవసరం ఉంటంది. నృత్యం చేసేటప్పుడు ఇంకను ఎక్కువ కండరాలు పనిచేస్తాయి.



కండర వ్యవస్థ (వెనుకవైపు)

లాగబడతాయి. మెదడు అప్పుడప్పుడు పంపించే సందేశాల్ని బట్టి అవి ముడుచు కోవడమో సడలించుకోవడమో జరుగుతుంది.

కండరకణాలు మూడింట ఒక వంతు మాత్రమే పొట్టిగా అవుతూ ఉంటాయి. అవి సంకోచించినప్పుడు ఎంత పొట్టి కాగలవెమో అంత వరకు పొట్టిగా అవుతూ ఉంటాయి. కణాలన్నీ ఒకేసారి పొట్టి అయితే అనైచ్ఛికంగా కండరం మెలిపడడం కద్దు. ఏదయినా, గబుక్కున పట్టుకోబోతే అలా జరుగుతుంది. సాధారణంగా కండరాలు ఒక క్రమంలో సంకోచించి మొత్తం కండరం అంతా బహు [redacted]కదులుతుంది.

మానవ[redacted]

కండరాలు ఉన్నాయి. కండరాల్లో చా[redacted] పొడవుగా ఉండి సన్నగా ఉంటాయి. వీటి నిర్మాణంలో కణాలన్నీ తంతుమయంగా ఉంటాయి. కాళ్ళుచేతులు కదిపే కండరాలను పట్టీ కండరాలు అంటారు. సూక్ష్మదర్శినిలో చూస్తే పట్టీగా కనిపిస్తాయని అలా అంటారు. ఇవన్నీ ఐచ్ఛిక కండరాలు. ఇవన్నీ మస్తిష్క నియంత్రణకు లోబడి పని చేస్తూ ఉంటాయి. మాట వరుసకు నడిచేటప్పుడు పనిచేసే కండరాలు ఇవియే.

డయాఫ్రమ్ పటలం అనబడే కండరాల పొర చదునుగా ఉండే కణజాలంతో నిర్మిత 'మయి ఉంటుంది. ఇవి ఎటు వంటి నియంత్ర లేకుండా పని చేస్తాయి. ఇలాంటివి శరీరంలో అనేకరకాల పనులు నిర్వర్తించాడానికి ఉపయోగ పడతున్నాయి. మాటవరుసకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, జీర్ణప్రక్రియ వంటివి మనం నిద్ర పోతున్నా మెలుకువగా ఉన్నా పని జరిగిపోతూ ఉంటాయి. ఈ పనులు అనైచ్ఛికనాడుల వలనే నిర్వర్తింపబడతాయి. ఇక మూడవ రకం కండరాలు హృదయంలోనే ఉంటాయి. ఇవి చాలా దృఢంగా ఉంటాయి. పైగా చాల ప్రత్యేకమైన కండరనాడి. వీనిని హృదయ కండరములని అంటారు.

## పునరుత్పత్తి

తండ్రి నుంచి వీర్యకణం తల్లి నుండి అండం - ఈ రెండూ సంయోగమైనప్పుడే శిశువు జీవ యాత్ర మొదలవు తుంది. అంటే స్త్రీ అండాన్ని పురుషుని వీర్య కణం ఫలదీ కరించినప్పుడు ఆ రెండు కణాలు ఏకమై ఒకేకణం గా మారుతుంది. ఆ ఒక్క కణం మరల మరల విభజింప బడి 64 కణాలు గల బంతిగా రూపొంది, అప్పటి నుండి ఆ పిండం శీఘ్రంగా అభి వృద్ధి చెందుతూ పన్నెండు వారాల్లో అన్ని శరీరావయ వాలుగల శిశువుగా రూపొందుతుంది.

ఇలా గర్భందాల్చిన నాటినుండి 9 మాసాల్లో (266 రోజుల్లో) శిశువు పూర్తిగా పెరిగి ప్రసవానికి సిద్ధమవుతుంది.

ప్రసవ సమ యంలో స్త్రీ గర్భాశయ పరి సరాల్లో వున్న శక్తివంతమైన కం డ రా లు సంకోచ వ్యా కో చాల కు గురియై బిడ్డను తల్లి యోని నుండి బయటకు నెట్టి వే స్తా యి. దానినే పురుడు అంటున్నాం.

**మీకు తెలుసా**

* స్త్రీల గర్భాశయం జామకాయంత ఉంటుంది, గర్భిణీ సమయంలో 30సెం.మీ. సాగుతుంది. * ముడుచుకొని ఉన్న పురుషుల ఎపిడిడైమస్‌ను విప్పితే ఆరు మీటర్లు ఉంటుంది. * పుట్టినప్పుడే ఆడపిల్ల అండాశయంలో కొన్ని వేల అపక్వ అండాలు ఉంటాయి, వీటిలో కొన్ని మాత్రం ఆమె జీవిత కాలంలో బహిష్టు సమయంలో విడుదల అవుతూ ఉంటాయి. * పురుషుల శరీరం బయటనే వృషణాశయంలో వృషణాలు ఉంటాయి. దీనికి కారణం వీర్యోత్పత్తికి చల్లటి వాతావరణం అవసరం. * తల్లి అండంలోనూ తండ్రి వీర్యకణంలోనూ 23 డి.ఎన్.ఏ. క్రోమోజోములు ఉంటాయి. వీటి కేంద్రకంలో ఆయా మాతాపితల అనువంశిక ముద్రలు గుర్తించి ఉంటాయి. * పక్వమైన వీర్యకణం పొడవు మిల్లీమీటరులో ఇరవయ్యోవంతు ఉంటుంది. స్త్రీ సంపర్కంలో ఒకసారి విడుదలయిన వేల లక్షల వీర్య కణాలలో ఒక్కటి మాత్రమే ఆ స్త్రీ అండంతో కలసి ఫలదీకరణకు దారితీస్తుంది. * ఆడ, మగ నిర్ధారించేది పురుష క్రోమోజోము మాత్రమే. స్త్రీ పాత్ర ఎంత మాత్రం ఉండదు.



పురుష పునరుత్పత్తి వ్యవస్థ



స్త్రీ - పునరుత్పత్తి వ్యవస్థ





ప్రసవ సమయంలో పిండ స్థితి

## పునరుత్పత్తి

తండ్రి నుంచి వీర్యకణం తల్లి నుండి అండం - ఈ రెండూ సంయోగమైనప్పుడే శిశువు జీవ యాత్ర మొదలవు తుంది. అంటే స్త్రీ అండాన్ని పురుషుని వీర్య కణం ఫలదీకరించినప్పుడు ఆ రెండు కణాలు ఏకమై ఒకేకణంగా మారుతుంది. ఆ ఒక్క కణం మరల మరల విభజింపబడి 64 కణాలు గల బంతిగా రూపొంది, అప్పటి నుండి ఆ పిండం శీఘ్రంగా అభి వృద్ధి చెందుతూ పన్నెండు వారాల్లో అన్ని శరీరావయ వాలుగల శిశువుగా రూపొందుతుంది.

ఇలా గర్భందాల్చిన నాటినుండి 9 మాసాల్లో (266 రోజుల్లో) శిశువు పూర్తిగా పెరిగి ప్రసవానికి సిద్ధమవుతుంది. ప్రసవ సమయంలో స్త్రీ గర్భాశయ పరిసరాల్లో వున్న శక్తివంతమైన కండరాలు సంకోచ వ్యాకోచాలకు గురియై బిడ్డను తల్లి యోని నుండి బయటకు నెట్టివేస్తాయి. దానినే పురుడు అంటున్నాం.

**మీకు తెలుసా**

* స్త్రీల గర్భాశయం జామకాయంత ఉంటుంది, గర్భిణీ సమయంలో 30సెం.మీ. సాగుతుంది. * ముడుచుకొని ఉన్న పురుషుల ఎపిడిడైమస్‌ను విప్పితే ఆరు మీటర్లు ఉంటుంది. * పుట్టినప్పుడే ఆడపిల్ల అండాశయంలో కొన్ని వేల అపక్వ అండాలు ఉంటాయి, వీటిలో కొన్ని మాత్రం ఆమె జీవిత కాలంలో బహిష్టు సమయంలో విడుదల అవుతూ ఉంటాయి. * పురుషుల శరీరం బయటనే వృషణాశయంలో వృషణాలు ఉంటాయి. దీనికి కారణం వీర్యోత్పత్తికి చల్లటి వాతావరణం అవసరం. * తల్లి అండంలోనూ తండ్రి వీర్యకణంలోనూ 23 డి.ఎన్.ఏ, క్రోమోజోములు ఉంటాయి. వీటి కేంద్రకంలో ఆయా మాతాపితల ఆనువంశిక ముద్రలు గుర్తించి ఉంటాయి. * పక్వమైన వీర్యకణం పొడవు మిల్లీమీటరులో ఇరవయ్యోవంతు ఉంటుంది. స్త్రీ సంపర్కంలో ఒకసారి విడుదలయిన వేల లక్షల వీర్య కణాలలో ఒక్కటి మాత్రమే ఆ స్త్రీ అండంతో కలసి ఫలదీకరణకు దారితీస్తుంది. * ఆడ, మగ నిర్ధారించేది పురుష క్రోమోజోము మాత్రమే. స్త్రీ పాత్ర ఎంత మాత్రం ఉండదు.



# లోక విజ్ఞాన పీఠం

## విషయ సూచి



# ప్రపంచం సంగ్రహ స్వరూపం

## ప్రపంచం

ఒక లెక్కప్రకారం భూమి వయస్సు నాలుగు వందల అరవై కోట్లసంవత్సరాలు అని విజ్ఞుల అభిప్రాయం. కాగా జీవపరిణామక్రమంలో ప్రాణం ఉన్న "అమీబా"వంటి ఏకకణ జీవులు ప్రాదుర్భవించి రెండువందల కోట్ల సంవత్సరా లయిందంటారు. మానవ రూపం పాతరాతి యుగంలో వర్ధిల్లి పదిహేడు లక్షల ఏళ్లు అయిందని అంచనా. అప్పుడే మానవుడు వేట, ఆహార సేకరణ మొదలు పెట్టాడు. రెండు కాళ్లమీద నిలబడే మానవుని జాడలు నాలుగు లక్షల ఏళ్ల నాటివి జావాలోనూ చీనాలోనూ ఆఫ్రికాలోనూ కన్పించాయి. 180 వేల ఏళ్లనాడు మనిన నియాండర్తల్ మానవుని పూర్వీకులు పొడవాటి గొడ్డళ్లి ఉపయోగించారు. 70 వేల ఏళ్ల కిందట నియాండర్తల్ మానవుడు మనినట్లు యూరపులోనూ ఉత్తర ఆఫ్రికాలోనూ ఆసియాలోనూ దాఖలాలు కన్పించాయి. అంటే అప్పటికి మొదటి దశ హిమ యుగం ముగిసి నియాండర్తల్ మానవుడు అంతరించింది. నలభయి వేల ఏళ్ల కిందటనే నేటి మానవాకృతి అవతరించింది. ఈ కాలం లోనే మానవుడు సునిశితమైన పనిముట్లు, పదునైన కత్తులు ఉపయోగంలోకి తీసికొనివచ్చాడు. చిత్రకళలోనూ శిల్పకళలలోనూ ఆసక్తిని ప్రదర్శించాడు. దక్షిణ ఫ్రాన్స్‌లోని ఆరిగ్నేషయర్ సంప్రదాయంగల క్రో - మాగ్నన్ మానవునిలో ఇవి గోచరించాయి. పద్దెనిమిది వేల ఏళ్లకిందట హిమయుగం పూర్తిగా అంతరిచడంతో ఆరిగ్నేషయర్ సంస్కృతి కూడా అంతరించి సోలుట్రియన్, మాగ్డలేవియన్ సంస్కృతులు వెలసి, రాతియుగపు కళలు విజృంభించాయి. ఆసియావాసులు పదిహేనువేల ఏళ్లనాడు బేరింగు జలసంధిని దాటినట్లు ఆధారాలు ఉన్నాయి. ఇట్లు గత ఏభయివేలఏళ్లలోనూ అంటే సుమారు 800 మానవతరాలలో (తరం అంటే



స్లియోపితికస్ దశ · ప్రయోపితికస్ దశ · పితెకాంత్రోపస్ దశ · ప్రారంభ హోమో సేపియన్స్ దశ · క్రో - మాగ్నన్ మానవుడు · ఆధునిక మానవుడు

## ప్రపంచం - దేశాలు నగరాలు: కొత్త పేర్లు- పాతపేర్లు

| కొత్త పేరు | పాతపేరు | కొత్త పేరు | పాతపేరు |
|---|---|---|---|
| ఇండోనేషియా | తూర్పు ఇండియా దీవులు | నౌరూ | ప్లెజెంట్ ఐలాండ్ |
| | (డచ్ ఈస్ట్ ఇండీస్) | బంగ్లాదేశ్ | తూర్పు పాకిస్తాన్ |
| ఇరాక్ | మెసపటోమియా | బంజాల్ | బాతుర్స్ట్ |
| ఇరాన్ | పర్షియా | బీజింగ్ | పెకింగ్ |
| ఇస్తాంబుల్ | | బూర్కినోఫాసో | అప్పర్ వోల్టా |
| (కానిస్టాంటనోపిల్) | బైజాంటియమ్ | బెలిజీ | బ్రిటిషు హొండురాస్ |
| కంపూచియా | కాంబోడియా | బోస్నియా, హెర్జ్‌వినా | పూర్వపు జెకోస్లోవేకియా లోని భాగం |
| కిన్షాసా | లియోపాల్డ్‌విల్లీ | | |
| కొరియా | ది హెర్మిట్ కింగ్‌డమ్ | మలావీ | న్యాసాలాండ్ |
| కొటే డీ ఐవరీ | ఐవరీ కోస్ట్ | మలగాసీ | మడగాస్కర్ |
| క్రోషియా(ప్రోవత్సకా) | యుగోస్లావియాలోని భాగం | మలాబ్ | శాంతా ఇజబెల్ |
| గయానా | బ్రిటిషుగయానా | మలేసియా | మలయా |
| గ్రేట్ బ్రిటన్ యునైటెడ్ | | మ్యాన్మార్ | బర్మా |
| కింగ్‌డమ్ యు.కె | బ్రిటిషు దీవులు | యాంగాన్ | రంగూన్ |
| ఘనా | గోల్డ్ కోస్ట్ | లావూస్ | లాక్సగీ |
| జాంబియా | ఉత్తర రొడీషియా | లెసెతో | బసూటోలాండ్ |
| జింబాబ్వే | దక్షిణ రొడీషియా | వనౌతూ | ది న్యూహెబ్రిడిస్ |
| జీబేటీ | ఫ్రెంచి సోమాలీలాండ్ | వియొత్నామ్ | ఇండోచీనా |
| జెయిరీ (కాంగో) | కాంగో (జెయిరీ) | శ్రీలంక | సిలోన్ |
| టాంజేనియా | ట్యాంగన్యీకా, జాంజిబార్ | సాబా | ఉత్తర బోర్నియో |
| టాస్మేనిగూ | నాన్ డీ మాన్స్‌లాండ్ | స్లావక్ రిపబ్లిక్ | పూర్వపు జెకొస్లోవేకియా లోని భాగం |
| టోగో | టోగాలాండ్ | | |
| తాయిలాండ్ | సయామ్ | సురినామే | డచ్చిగయానా |
| తునాలూ | ది ఎల్లిస్ ఐలాండ్స్ | సెంట్‌పీటర్స్‌బర్గ్ | లెనిన్‌గ్రాడ్ |
| తైవాన్ | ఫార్మోసా | స్లొవేనియా | యుగోస్లావియా |
| నమీబియా | సౌత్ వెస్ట్ ఆఫ్రికా | హరారే | సాలిస్బరీ |
| | (నైరృతి ఆఫ్రికా) | హొచిమిన్ సిటీ | సైగాన్ |

అల్విన్ టాఫ్లర్ లెక్క ప్రకారం 62 సంవత్సరాలు) 650 తరాలపాటు మానవుడు గుహజీవితాన్నే సాగించాడు. పిదప, దాదాపు 80 తరాలు దేశ దిమ్మరిగా తిరిగాడు. అలా తిరిగి తిరిగి మానవుడు దేశ దిమ్మరితనానికి స్వస్తి పలికి వనరులున్న ఏదో ఒక చోట స్థిర నివాసం ఏర్పరచుకోవడం మొదలు పెట్టాడు. పశ్చిమ ఆసియాలో పాలస్తీనాలోని జెరికో శిథిలాలు ఇందుకు ఒక ఉదాహరణ. ఆ కాలంలోనే మానవుడు శరీరం కప్పుకోవడానికి బట్ట తయారీకి చేనేత మగ్గాన్ని రూపొందించు కున్నాడు. అలాగనే అవసరాల్ని బట్టి ముడి ఖనిజాలనుండి ధాతువుల్ని సాధించి సిద్ధపరచుకోవడమూ కుమ్మరి సారె, చక్రాలతో బండి వంటి సాధనాలెన్నిటినో రూపొందించు కుంటూ వచ్చాడు. ఇలా మానవుడు ఏ నీటి ప్రవాహ తీరాన్నో ఎంచుకొని స్థిరనివాసం (ఉదాహరణకు నైలు నది, సింధునది, హొయాంగు హొ,. యూప్రటీస్, టైగ్రిస్ నదీతీరాలు) ఏర్పరచుకున్న తరుణంలో మానవులు గుమిగూడేవారు. ఒక చోట చేరి నప్పుడు సంజ్ఞల ద్వారా తమ భావాల్ని పరస్పరగమూ వినిమయం చేసుకుంటూ ఒక దశలో భావాల్ని ప్రకటించడానికే కాబోలు మానవుడు భాషల్ని, మాటల్ని సృష్టించుకున్నాడు.

పిదప కొన్నాళ్లకు భావప్రకటనను లిపిబద్ధం చేయడానికి లిపిని సిద్ధపరచుకొన్నాడు. ఇలా ఆయా ప్రాంతాల్లో భాషా లిపులు పుట్టి వర్ధిల్లాయి. వీటికి ఉదాహరణ చిత్రలిపి, బాణాగ్రలిపి, హైరగ్లిఫిక్, సింధు లిపి వగయిరా. తర్వాత అచ్చుపని ప్రారంభమయ్యే సరికల్లా మరో అరవయి ఆరు తరాలు గడిచాయి. ఆ కాలంలోనే ఈజిప్టు నాగరికత, సుమేరియన్ నాగరికత, బాబిలోనియా నాగరికత, సింధు నాగరికత ఆర్య నాగరికత, మినోవా నాగరికత, హిటైట్ నాగరికత, అస్సీరియా నాగరికత, అయోనియాలో (గ్రీక్) నాగరికత, బైజాంటియన్ నాగరికత, రోమన్ నాగరికత చీనా నాగరికత వంటి సంస్కృతీ సంప్రదాయాలెన్నో అక్కడక్కడ వెలసి వర్ధిల్లి ప్రపంచ వ్యాప్తంగా విస్తరించ దొడగాయి. హొమర్ వంటి గ్రీక్ మహా కవులూ సోక్రటీసు, ప్లేటో, అరిస్టాటిల్ వంటి మహామేధావులూ రచనలు చేసి అందించడం మొదలు పెట్టారు. భారతదేశంలో మేధావులు భావాల్ని సంకలించి వేదాలు, బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు వంటిదర్శనాలు, ఇతిహాస పురాణాలు సిద్ధపరిచారు. మానవ సమాజాల్ని జాగృత పరచి ధార్మిక చింతన వైపుకి మళ్లించ డానికి మహా ప్రవక్తలు కారణజన్ములుగా అవత రించారు. వారిలో కొందరు మానవ ధర్మాలను ప్రవచించి హిందూ, జరతుష్ట్ర, బౌద్ధం, జైనం, క్రైస్తవం, ఇస్లాం, సిక్కు వంటి మత విశ్వాసాలను ప్రచారం చేయడం ప్రారభించారు. ఈ సంస్కృతీ సంప్రదాయాలూ నాగరికతలూ పరిఢవిల్లిన సమయంలోనే బలమైనవారు రాజ్యాలను స్థాపించి సామ్రాజ్యాలుగా విస్తరింప చేయగా విశాల భూమిలో ప్రభుత్వాధిపత్యాలు నెలకొన సాగాయి. అలా ఏర్పడిన మహా సామ్రాజ్యాలలో పేర్కొనదగినవి - మంగోలు సామ్రాజ్యం, ఈజిప్టు సామ్రాజ్యం, బైజాంటియన్, మాసిడోనియన్ సామ్రాజ్యం, ఓటోమన్ సామ్రాజ్యం, ఫొనీషియన్ సామ్రాజ్యం, పవిత్ర రోమన్ సామ్రాజ్యం, బ్రిటిషు సామ్రాజ్యం మున్న గునవి. ఇలా సామ్రాజ్యాలు నెలకొని శాంతి స్థాపన సమయాల్లో మానవ మేధస్సు పదునెక్కి మరింత

పరిణతి చెందడంతో భావవికసన యుగం పరాకాష్ఠ నందు కొన్నది. ఇలా, ఈ తరువాత భావ వికసన యుగంలోనే జర్మనీలో గూటెన్ బర్గ్ (క్రీ.శ. 15వ శతాబ్దంలో అచ్చు యంత్రాన్ని నిర్మించడంతో మానవుడు ప్రగతి పథం మీద పడ్డాడు. కోపర్నికస్ సూర్య కేంద్ర సిద్ధాంతం, గెలీలియో ప్రయోగం, ఐజాక్ న్యూటన్ గతినియమాలు - గురుత్వాకర్షణ బల సూత్రం - ఇవన్నీ అందడంతో మానవాళికి యాంత్రిక సౌలభ్యం చేకూరింది. మరో నాలుగు మానవ తరాలు గడిచేటప్పటికి మానవ భావాలు మత ఛాందసుల ధాటిని తట్టుకొని శాస్త్ర వైజ్ఞానిక పథంపై నడవసాగాయి. తత్ఫలితంగా ఇంగ్లండులో మొదటి సారిగా పారిశ్రామిక విప్లవం (18వ శతాబ్ది) జేమ్స్ వాట్ ఆవిరియంత్రం నిర్మాణంతో ఆరంభమయింది. ఇక క్రమంగా అప్పటినుంచి మానవుడు విశ్రమించక ఏదో ఒక నూతన నిర్మాణాన్ని సమకూరుస్తూనే ఉన్నాడు. ఒకనాటి నిప్పు ఉపయోగం తెలుసుకుని తరువాత చక్రంతో బండి నిర్మించుకుని అచ్చుపని తెలుసుకుని - ఈనాడు సైన్స్ - ఇంజనీరింగు - టెక్నాలజీ, ఎలక్ట్రానిక్స్ సహాయంతో కంపూటర్‌ను నిర్మించగలిగి చంద్ర మండలంపై మానవుడు కాలుమోప గలిగాడు (జూలై 21, 1969). ఈ 20వ శతాబ్ది ఆరంభంలో ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ '$E = mc^2$' అనే భౌతిక సూత్రాన్ని అందించడంతో భౌతికశాస్త్రం (ఫిజిక్స్)లో విప్లవాత్మకమైన మార్పు వచ్చి పరమాణువును బద్దలుకొట్టడంతో పరమాణు శక్తి మానవుని అదుపులోకి వచ్చింది. ఈ విధంగా ఆవిష్కరించిన వాటిలో ముందెన్నడూ 799 తరాలలోనూ కనీవినీ ఎరుగనట్టి శక్తులు, యుక్తులు, సాధన సంపత్తి ఈ 800వ తరంలో మానవుడు కైవసం చేసికొని విరామం లేకుండా ఎప్పటికప్పుడు ప్రగతిని సాధిస్తూనే ఉన్నాడు. ఇటువంటి మానవ కృషి ఫలితాలే నేడు టెక్నాలజీ - రేడియో, టి.వి., కంపూటర్, శాటిలైట్ కమ్యూని కేషన్స్ సమాజ కల్యాణానికీ సుఖ సంతోషా లకూ ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. ఇలా ప్రగతి మానవుణ్ని ఒకవైపు ఆధ్యాత్మిక చింతన వైపుకు మరో వైపు ఐహిక సుఖ సౌకర్యాలకు నడుపుతూ శాంతిని ప్రసాదిస్తున్నది.

## ప్రపంచ దేశాలు

నేటి ప్రపంచంలో సుమారు 600 కోట్ల మంది జనులు నివసిస్తున్నారు, మొత్తం ప్రపంచ దేశాల సంఖ్య సుమారు చిన్నవీ పెద్దవీ కలిసి 200. వారు మాట్లాడే భాషల సంఖ్య మూడువేలు, భాషలన్నిటికీ లిపులు లేవు, ద్వితీయ ప్రపంచయుద్ధానికి ముందు బ్రిటిషు, ఫ్రెంచి ఇతర దేశాల మీద వలసాధిపత్యాన్ని చలాయిస్తూ ఉండేవారు. పిదప కాలంలో చాలాదేశాలకు స్వాతంత్ర్యం సిద్ధించింది, దాదాపు 186 ప్రపంచదేశాలు ఐక్యరాజ్యసమితి (యునైటెడ్ నేషన్స్) లో సభ్యత్వం సంపాదించు కున్నాయి. అయినా కొన్ని దేశాలు ఇంకా స్వేచ్ఛకు నోచుకోలేదు. 1947లో బ్రిటిషు ఇండియా సామ్రాజ్యం విడివడి భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించుటతో మొదలయి 1960లలో పెక్కు ప్రపంచ దేశాలు వలసాధిపత్యంనుంచి విముక్తి పొంది స్వేచ్ఛావాయువులు పీల్చు కున్నాయి. ముఖ్యంగా ఆఫ్రికాలో వాస్తవానికి ఈ20వ శతాబ్ది మానవ స్వేచ్ఛను పతాక స్థాయికి తీసికునివెళ్ళింది!

**ప్రపంచ ప్రజలు :** ప్రపంచ జనాభా నేడు దాదాపు 600 కోట్లు ఉందని పైన చెప్పుకున్నాం. అందులో భారత దేశ జనాభా 95 కోట్లు (1996). ఏడాదికి 1.6% జనాభా పెరుగుతూ ఉంది. మరణించే వారి సంఖ్య కంటె జన్మించే వారి సంఖ్య ఎక్కువగా ఉంది. వెయ్యి జనాభాకి 29 మంది పుడుతున్నారు. వెయ్యి జనాభాకు 11 మంది మరణిస్తున్నారని లెక్క. వెనుకబడిన దేశాల్లో కంటే అభివృద్ధి సాధించిన దేశాల్లో ప్రజల ఆయుస్సు ఎక్కువగా ఉంది. జపాన్‌లో పుట్టిన బిడ్డ ఆయుస్సు 77 అయితే యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్‌దేశాల్లో అది 75. భారతదేశంలో 55 ఉంది. ఇది ఇలా ఉండగా ఆఫ్ఘనిస్తాన్ వంటి బడుగుదేశాల్లో 37 ఉంది. ఆఫ్రికా దేశాల్లో అది 45 ఏళ్ళు. సర్వ సాధారణంగా పురుషులకంటె స్త్రీల ఆయుర్దాయం ఎక్కువన్న సంగతి గమనించ దగ్గది.

ప్రపంచంలోని మానవులంతా ఒకే జాతి (స్పీషీస్) కి చెందినవారు. అది మానవ (హూమో సేపియన్) జాతి. కాగా ప్రపంచంలోని భిన్న ప్రాంతాల్లో గుంపులు గుంపులుగా వేలకొద్దీ ఏళ్ళు తరబడి జీవించడం వల్ల వారి భౌతిక పరిమాణం, చర్మం రంగు, జుట్టు, కళ్ళు వంటి విషయాల్లో వైవిధ్యం కనిపిస్తూ ఉంది. మాటవరుసకు వేడి సూర్యరశ్మి ఎల్లప్పుడూ తగిలే ఉష్ణ ప్రాంతాల్లో నివసించే ప్రజలకు హానికరమైన అతినీలలోహిత కిరణాల బారి నుండి రక్షింప బడడానికి చర్మం నలుపురంగు (మెలనీన్) కలిగి ఉండుట సహజ మైంది. ఇలా వైవిధ్యం కలిగి ఉండుట పరిపాటి అయింది. భిన్నరకాల వారిని వర్గాలుగా వింగడించారు. దీనికి చర్మం వర్ణం (రంగు) ప్రాతిపదిక కావడం దురదృష్టకరం. ఒకో వర్ణం వారు మరొక వర్ణం కంటె ఎక్కువ అనీ, తక్కువ అనీ అనడం తప్పుడు విశ్వాసమయింది. ఈ వర్ణవైషమ్యం వెర్రితలలు వేసి రక్తపాతానికి దారితీసిన దాఖలాలు కూడా ఉన్నాయి.

సర్వసాధారణంగా ప్రపంచ ప్రజలు మూడు వర్ణవర్గాలకు చెందినవారుగా పేర్కొనవచ్చును. యూరపులోను, పశ్చిమ ఆసియాలో, మధ్య ఆసియాలోను ఉన్నవారు తెల్లవారు కాకసాయిడ్ వర్గానికి చెందినవారు. ఆఫ్రికాలోని వారు నల్లజాతి వారు నీగ్రో వర్గానికి చెందిన వారు. తూర్పు, ఆసియా (చీనా, జపాన్) దేశ



కాక్‌సాయిడ్ వర్గం



మంగోలాయిడ్ వర్గం



నీగ్రోయిడ్ వర్గం

వాసులు పసుపు వర్ణంవారు మంగోలాయిడ్ వర్గానికి చెందినవారు.

ఇటీవల కాలంలో ప్రసార ప్రచార సాధనాల వల్ల ఈ అపోహలు క్రమక్రమంగా సమసి పోతున్నట్లు తెలుస్తోంది. ప్రస్తుతం యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ వంటి దేశాలు బహుళవర్ణ సమాజాలుగా రూపొందడం గమనార్హం. అంటే ఈ దేశాల్లోని సమాజాల్లో భిన్నవర్గాలకు చెందిన వారు ఒకే పొరుగున సుఖశాంతులతో జీవిస్తు న్నారు. దక్షిణాఫ్రికా లో వర్గ వైషమ్యం (అపార్తిట్) కూడా ఇటీవల తగ్గుముఖం పట్టింది.

**భాషలు** : ప్రజల సంస్కృతీ వైవిధ్యానికి విశిష్టంగా కనిపించేది వారు మాట్లాడేభాష. పదిలక్షల మందికి పైగా మాట్లాడే భాషలు 160 మాత్రమే. అయితే మూడువందల భాషలకు మాత్రమే లిపి సౌకర్యం ఉంది. ప్రపంచ జనులు మాట్లాడే భాషలు మూడువేల వరకూ ఉన్నాయి. మాందరీన్ చీనా భాషను 78,80,00,00 మంది మాట్లాడటంతో అది అగ్రస్థానంలో ఉంది. తర్వాత 42 కోట్లమంది ఇంగ్లీషు భాషను మాట్లాడు తున్నారు. ఆ తర్వాత తృతీయ స్థానంలో వున్న హిందీ మాట్లాడే వారు 30 కోట్ల మంది భారతదేశంలో ఉన్నారు. స్పానిష్ భాష మాట్లాడేవారు 29,60,00,000. రష్యన్‌భాష మాట్లాడే వారు 28.5 కోట్లు. చాలా భాషలు ఏ కొద్ది ప్రాంతానికో పరిమితమయి పోతాయి. కొద్దిమంది మాత్రమే ఉన్న చిన్న సమాజంలో అనేక భాషలు మాట్లాడడం కూడా కద్దు. మాటవరుసకు మాందరీన్ చీనా భాష చీనా దేశం బయట ఎక్కడా మాట్లాడరు. కొద్దిమంది అంటే కేవలం 34 లక్షల మంది జనాభా మాత్రమే గల పాపువా- న్యూగినీలో 700 భాషలు మాట్లాడడం విశేషం. మరొక విచిత్రం ఏమిటంటే భిన్న భాషలు భిన్న ప్రాంతాల వారు మాట్లాడటం కూడా ఉంది. అవి అంతర్జాతీయ భాషలుగా ఖ్యాతి నార్జించాయి. అందులో ఇంగ్లీషు, స్పానిష్, ఫ్రెంచి ఈ కోవకు చెందుతాయి. ఆఫ్రికా ఒకప్పుడు ఫ్రెంచి వలస ఆధిపత్యానికి గురియై ఉండేది. దేశ జనాభా మాతృభాష మాట్లాడినా అధికార భాషగా ఫ్రెంచి, మాతృభాష రెండూ అమలులో ఉన్నాయి. అలాగే మన భారతదేశంలో ప్రధాన భాషలు 15. ఇవిగాక 160 ఇతర భాషలు ఉన్నాయి. 700 మాండలికాలు కూడ ఉన్నాయి. భారత రాజ్యాంగం ఎనిమిదవ షెడ్యూలులో గుర్తించిన 15 భాషలకూ సాహిత్య చరిత్ర ఉంది. అవి. 1. అస్సామీ; 2. ఉర్దూ; 3. ఒరియా; 4. కన్నడం; 5. కాశ్మీరీ; 6. గుజరాతీ; 7. తమిళం; 8. తెలుగు; 9. పంజాబీ; 10. మరాఠీ; 11. బెంగాలీ 12. మలయాళం; 13. సంస్కృతం 14. సింధీ; 15. హిందీ. 1956లోనూ, ఆ తర్వాతనూ భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడినప్పుడు ఆయా రాష్ట్రాల్లో ఆయా భాషలు అధికారభాష లయ్యాయి. భారతదేశానికి 'హిందీ' జాతీయ భాషగా గుర్తింపబడినది. ఇంగ్లీషు సహభాష (అసోసియేటెడ్ లాంగ్వేజీ) గా కొనసాగు తూంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలుగు అధికార భాష. తర్వాతి భాష ఉర్దూ. గిరిజనులు మాట్లాడే భాషలు (లంబాడీ) కోయ, గొండు, బంజారా, సవర మున్నగునవి.



## ఐక్యరాజ్య సమితి (యు.ఎన్.ఓ.) యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్

రెండవ ప్రపంచయుద్ధ సమయంలో మిత్రపక్షాలుగా వ్యవహరించిన యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా, బ్రిటన్ దేశాల చొరవతో 50 దేశాలను కూడగట్టుకుని 1945లో ఐక్యరాజ్య సమితి నెలకొంది. ప్రస్తుతం ప్రపంచంలోని 186 స్వతంత్ర దేశాలకు ఐ.రా.స. సభ్యత్వం ఉంది (1996). సాధారణ సభ (జనరల్ అసెంబ్లీ) కు సభ్యదేశాలు తమతమ ప్రతినిధుల్ని పంపుతాయి. వీరు మూణ్ణెల్లకు ఒకసారి సమావేశమయ్యే సభలో పాల్గొంటారు. 15 మంది సభ్యదేశ ప్రతినిధులతో ఉన్న భద్రతా మండలి (సెక్యూరిటీ కౌన్సిల్) అవసరమైనన్ని ఎక్కువసార్లు సమావేశమై ప్రపంచశాంతికై నిర్ణయాలు తీసుకుంటుంది. యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్, చీనా, రష్యా శాశ్వత సభ్యత్వం కలిగి ఉంటాయి. మిగతా పదిమంది సభ్యుల్ని రెండేళ్లకు ఒకసారి సాధారణ సభ ఎన్నుకుంటూ ఉంటుంది. అధిక సంఖ్యాక వోటు (కనీసం తొమ్మిదిమంది)తో నిర్ణయాలు గైకొనబడతాయి. శాశ్వత సభ్యులు ఆరుగురు తీర్మానం వీగిపోయే టట్లు చేసే 'వీటో' అధికారం వారికి ఉంది. ఐరాసకు సుమారు 22 ప్రధాన అంగాలు, ఉపాంగాలు ఆయా రంగాల్లో తోడ్పడతాయి.



### ఐ.రా.స. ఆమోదించిన పిల్లల హక్కుల సంగ్రహం

- ★ తమ సొంత తల్లిదండ్రుల (కుటుంబం) తోనూ లేదా వారి శ్రేయస్సుకై శ్రద్ధ తీసుకునే వారితోనూ ఉండే హక్కు పిల్లలకు ఉంది.
- ★ తగిన పోషక ఆహారమూ పరిశుభ్రమైన మంచినీటిని పొందే హక్కు పిల్లలకు ఉంది.
- ★ తగిన జీవన ప్రమాణాన్ని పొందే హక్కు పిల్లలకు ఉంది.
- ★ ఆరోగ్య భద్రతకు సంబంధించిన హక్కు పిల్లలకు ఉంది.
- ★ అంగవికలురైన పిల్లలు ప్రత్యేక శ్రద్ధ, ప్రత్యేక శిక్షణలు పొందే హక్కు వారికి ఉంది.
- ★ తప్పనిసరిగా మాతృభాష మాట్లాడే అవకాశం పొందడమూ వారి మతమూ, సంస్కృతినీ పాటించే హక్కు పిల్లలకు ఉంది.
- ★ ఆడుకునే హక్కు పిల్లలకు ఉంది.
- ★ ఉచిత విద్య పొందే హక్కు పిల్లలకు ఉంది.
- ★ క్రూరత్వం వల్లగాని, నిర్లక్ష్యం వల్లగాని, బాధకు గురికాకుండా సురక్షితంగా ఉండగలిగే హక్కు పిల్లలకు ఉంది.
- ★ బాల కార్మికులుగా, చౌక కూలీలుగా గాని, వెట్టి చాకిరీకి నౌకర్లుగా గాని, సైనికులుగా గాని వినియోగించకూడని హక్కు పిల్లలకు ఉంది.
- ★ అలక్ష్యం, క్రూరత్వం, అన్యాయం నుండి రక్షణ పొందే హక్కు పిల్లలకు ఉంది.
- ★ అందరితో కలిసి వారి సొంత భావాలూ ఆలోచనలూ ప్రకటించుకునే హక్కు పిల్లలకు ఉంది.

# ఐక్యరాజ్య సమితి చిహ్నాలు

| | | | |
|---|---|---|---|
| యునైటెడ్ నేషన్స్ | ప్రపంచ ఆరోగ్యసంస్థ | యునైటెడ్ నేషన్స్ మానవహక్కుల కేంద్రం | యూనివర్సల్ పోస్టల్ యూనియన్ |
| ILO<br>అంతర్జాతీయ కార్మికసంస్థ | UNESCO<br>యునెస్కో | WIPO OMPI<br>ప్రపంచ మేధాసంపత్తి సంస్థ | INSTRAW<br>మహిళా ప్రగతికి అంతర్జాతీయ పరిశోధన శిక్షణసంస్థ |
| యునైటెడ్ నేషన్స్ కాందిశీకులసంస్థ | UNICEF<br>యునిసెఫ్ బాలలనిధి | UNEP<br>పరిసర కార్యక్రమాలసంస్థ | ITU<br>అంతర్జాతీయ తంతివార్తాప్రసార సంస్థ |
| అంతర్జాతీయ పరమాణుశక్తిసంస్థ | మానవ ఆవాసకేంద్రం | undp<br>యునైటెడ్ నేషన్స్ అభివృద్ధి సంస్థ | అంతర్జాతీయ నౌకాసంస్థ |
| యు.ఎన్. యూనివర్సిటీ | వ్యవసాయాభివృద్ధికి అంతర్జాతీయ సంస్థ | F A O<br>ఆహార వ్యవసాయసంస్థ | ప్రపంచ వాతావరణసంస్థ |
| INTERNATIONAL MONETARY FUND<br>అంతర్జాతీయ ద్రవ్యనిధి (ఐ.ఎమ్.ఎఫ్) | అంతర్జాతీయ పౌర విమానయాన సంస్థ | | INTERNATIONAL BANK FOR RECONSTRUCTION AND DEVELOPMENT<br>WORLD BANK<br>ప్రపంచ బ్యాంకు |

# యు.ఎన్.ఓ. ఐక్యరాజ్య సమితి సంగ్రహ స్వరూపం వివిధ విభాగాలు




ప్రపంచం - ఐక్యరాజ్యసమితి

లోక జ్ఞాన పీఠం

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 33. | కజకస్తాన్ ✚ | 16,925 | ఆసియా | 27,27,300 | అల్మా-అటా(అక్మోలా) |
| 34. | కాంగో ✻ | 2,443 | ఆఫ్రికా | 3,42,000 | బ్రజ్జవిల్లీ |
| 35. | కాటార్ ✻ | 559 | ఆసియా | 11,437 | దోహా |
| 36. | కామెరూన్ ✻ | 12,522 | ఆఫ్రికా | 4,75,442 | యావాండే |
| 37. | కిరిబాస్‌టీ | 72 | పసిఫిక్ | 717 | బైరికీ తరావా |
| 38. | కిర్గిజిస్తాన్ ✚ | 4,474 | ఆసియా | 1,98,500 | బిష్కెక్ |
| 39. | కుక్ దీవులు (న్యూజీలాండ్) | 18 | పసిఫిక్ ప్రాంతం | 293 | రోరోటోంగా |
| 40. | కువాయిట్ ✻ | 1,433 | ఆసియా | 17,819 | కువాయిట్ సిటీ |
| 41. | కెనడా ✻ | 29,248 | ఉ.అమెరికా | 92,15,430 | ఒట్టావా |
| 42. | కెన్యా ✻ | 28,113 | ఆసియా | 5,82,600 | నైరోబీ |
| 43. | కేప్ వర్దే ✻ | 370 | ఆఫ్రికా | 4,033 | ప్రయా |
| 44. | కేమాన్ దీవులు | 25 | ఉ. అమెరికా | 260 | జార్జిటౌన్ |
| 45. | కొమోరోస్ ✻ | 607 | ఆఫ్రికా | 1,862 | మోరోనీ |
| 46. | కొరియా ఉత్తర ✚ | 23,048 | ఆసియా | 1,20,538 | ప్యాంగ్యాంగ్ |
| 47. | కొరియా రిపబ్లిక్ ✚ | 44,619 | ఆసియా | 99,263 | సియోల్ |
| 48. | కొలంబియా ✻ | 34,520 | ద.అమెరికా | 11,21,748 | బొగోటా |
| 49. | కోటేడీ ఐవరీ (ఐవరీ కోస్ట్) ✻ | 13,316 | ఆఫ్రికా | 3,22,463 | అబిజాన్ |
| 50. | కోస్టరికా ✻ | 3,005 | ఉ. అమెరికా | 51,100 | శాన్ హొసే |
| 51. | క్రోషియా ✻ | 4,511 | యూరప్ | 56,538 | జాగ్రెబ్ |
| 52. | క్యూబా ✻ | 10,941 | ఉ. అమెరికా | 1,10,860 | హవానా |
| 53. | గయానా ✻ | 816 | ద.అమెరికా | 2,15,000 | జార్జి టౌన్ |
| 54. | గాంబియా | 1,026 | ఆఫ్రికా | 10,688 | బంజూల్ |
| 55. | గినీ ✻ | 6,306 | ఆఫ్రికా | 2,45,857 | కోనక్రీ |
| 56. | గినీ - బిస్సా ✻ | 1,028 | ఆఫ్రికా | 36,125 | బిస్సా |
| 57. | గేబన్ ✻ | 1,012 | ఆఫ్రికా | 2,67,667 | లిబ్రేవిల్లీ |
| 58. | గ్రీస్ ✻ | 10,350 | యూరప్ | 1,31,986 | ఏతెన్స్ |
| 59. | గ్రెనడా ✻ | 92 | ఉ. అమెరికా | 344 | సెయింట్ జార్జిస్ |
| 61. | గ్వాడులూపే (ఫ్రాన్స్) | 378 | ఉ. అమెరికా | 1,780 | బస్సే - టెర్రే |
| 60. | గ్వాతెమాలా ✻ | 10,322 | ద.అమెరికా | 1,08,889 | గ్వాతెమాలా సిటీ |
| 62. | గ్వామ్ దీవులు | 132 | పసిఫిక్ | 541 | అగానా |
| 63. | ఘనా ✻ | 16,446 | ఆఫ్రికా | 2,38,305 | అక్రా |
| 64. | చాద్ ✻ | 6,098 | ఆఫ్రికా | 12,84,000 | ఎన్ జమేనా |
| 65. | చిలీ ✻ | 14,026 | ద.అమెరికా | 7,36,905 | శాంటియాగో |
| 66. | చీనా (పీపుల్స్ రిపబ్లిక్) ✻ | 11,96,360 | ఆసియా | 95,97,000 | బీజింగ్ |
| 67. | చీనా (తైవాన్) | 20,400 | ఆసియా | 36,179 | తాపై |
| 68. | జపాన్ ✻ | 1,24,536 | ఆసియా | 3,77,727 | టోక్యో |
| 69. | జమైకా ✻ | 2,411 | ఉ.అమెరికా | 11,425 | కింగ్‌స్టన్ |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 70. | జర్మనీ * | 81,373 | యూరపు | 356958 | బెర్లిన్ |
| 71. | జాంబియా * | 8,936 | ఆఫ్రికా | 7,52,620 | లుసాకా |
| 72. | జార్జియా ✚ | 5,471 | యూపు | 69,700 | తిబిలిసీ |
| 73. | జింబాబ్వే * | 10,739 | ఆఫ్రికా | 3,90,308 | హరారే |
| 74. | జిబ్రాల్టర్ | 30 | యూరపు | 6.5 | – |
| 75. | జీబౌటీ * | 557 | ఆఫ్రికా | 23,400 | జీబౌటీ |
| 76. | జెక్ రిపబ్లిక్ ✚ | 10,333 | యూరపు | 78,864 | ప్రేగ్/ప్రాహా |
| 77. | జెయిరీ * (కాంగో) | 41,231 | ఆఫ్రికా | 23,44,885 | కిన్షాసా |
| 78. | జోర్డాన్ * | 4,936 | ఆసియా | 89,206 | అమ్మాన్ |
| 79. | టర్కీ * | 60,227 | ఆసియా | 7,79,452 | అంకారా |
| 80. | టాంజేనియా రిపబ్లిక్* | 28,019 | ఆఫ్రికా | 9,45,050 | డోడోమా |
| 81. | టునీషియా * | 8,570 | ఆఫ్రికా | 1,64,150 | టూనిస్ |
| 82. | టోగో * | 3,885 | ఆఫ్రికా | 56,785 | లోమే |
| 83. | ట్రినిడాడ్ & టోబాగో * | 1,260 | ఉ. అమెరికా | 5,128 | పోర్టుఆఫ్ స్పెయిన్ |
| 84. | డెన్మార్క్ * | 5,212 | యూరపు | 43,075 | కోపెన్ హేగన్ |
| 85. | డొమినికన్ రిపబ్లిక్ * | 7,608 | ఉ. అమెరికా | 48,442 | శాంటోడామింగో |
| 86. | డొమినికా * | 71 | ఉ.అమెరికా | 751 | రోజావూ |
| 87. | తజికిస్తాన్ ✚ | 5,638 | ఆసియా | 1,43,100 | దుషాన్బే |
| 88. | తాయిలాండ్ * | 58,584 | ఆసియా | 5,14,000 | బాంకాక్ |
| 89. | తువాలూ | 8 | పసిఫిక్ | 24 | ఫోంగాఫాలే |
| 90. | తుర్కుమెనిస్తాన్ ✚ (తుర్కుమేనియా) | 3,714 | ఆసియా | 4,48,100 | అష్కాబాద్ |
| 91. | నమీబియా * | 1,461 | ఆఫ్రికా | 8,23,145 | విండ్‌హోయెక్ |
| 92. | నార్వే * | 4,331 | యూరపు | 32,38,941 | ఆస్లో |
| 93. | నికరగ్వా * | 4,401 | ఉ. అమెరికా | 1,30,682 | మానగ్వా |
| 94. | నెదర్లాండ్స్ * | 15,385 | యూరపు | 33,937 | ది హేగ్ /అమెస్టర్ డామ్ |
| 95. | నేపాల్ * | 20,812 | ఆసియా | 1,41,400 | ఖట్మాండూ |
| 96. | నైజర్ * | 8,361 | ఆఫ్రికా | 12,67,000 | నియామే |
| 97. | నైజీరియా * | 1,05,264 | ఆఫ్రికా | 9,23,337 | ఆబూజా |
| 98. | నౌరూ | 8 | పసిఫిక్ | 21 | |
| 99. | న్యూకెలోడినియా (ఫ్రాన్స్) | 164 | పసిఫిక్ | 18,576 | |
| 100. | న్యూ జీలాండ్ * | 3,493 | ఆస్ట్రేలియాసమీపాన | 2,68,046 | వెల్లింగ్‌టన్ |
| 101. | పనామా * | 2,583 | ఉ.అమెరికా | 77,082 | పనామా సిటీ |
| 102. | పరాగ్వే * | 4,643 | ద.అమెరికా | 4,06,752 | అసున్షియన్ |
| 103. | పసిఫిక్ దీవులు | 117 | పసిఫిక్ | 1,813 | – |
| 104. | పశ్చిమ సామోవా ✚ | 157 | పసిఫిక్ | 2,831 | ఆపియా |
| 105. | పాపువా న్యూగినీ * | 3,922 | పసిఫిక్ ప్రాంతం | 4,02,840 | పోర్ట్ మొరెస్బీ |
| 106. | పాకిస్తాన్ * | 1,22,812 | ఆసియా | 7,96,095 | ఇస్లామాబాదు |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 107. | పాలావ్ (బెలావ్) ✤ | 18 | పసిఫిక్ | 1,632 | కోరోర్ బెబెవ్‌తాస్ |
| 108. | పెరూ ✻ | 23,088 | ద.అమెరికా | 12,85,215 | లీమా |
| 109. | పోర్టిరికో (యుఎస్‌ఏ) | 3,522 | ఉ.అమెరికా | 8,858 | శాన్ జాన్ |
| 110. | పోర్చుగల్ ✻ | 9,868 | యూరపు | 91,985 | లిస్బన్ |
| 111. | పోలండ్ ✻ | 38,554 | యూరపు | 3,12,683 | వార్సా |
| 112. | ఫిజీ దీవులు ✻ | 771 | పసిఫిక్ | 18,333 | సువా |
| 113. | ఫిన్లాండ్ ✻ | 5,085 | యూరపు | 3,38,127 | హెల్సింకీ |
| 114. | ఫిలిప్పీన్స్ ✻ | 65,649 | ఆసియా | 3,00,000 | మనీలా |
| 115. | ఫ్రాన్స్ ✻ | 57,850 | యూరపు | 5,43,965 | పారిస్ |
| 116. | బంగ్లాదేశ్ ✻ | 1,15,203 | ఆసియా | 1,44,020 | ఢక్కా |
| 117. | బల్గేరియా ✻ | 8,469 | యూరపు | 1,10,911 | సోఫియా |
| 118. | బహమాస్ ✻ | 269 | ఉ. అమెరికా | 13,864 | నస్సా |
| 119. | బహ్రేన్ ✻ | 539 | ఆసియా | 688 | మనామా |
| 120. | బార్బడాస్ ✻ | 260 | ఉ. అమెరికా | 430 | బ్రిడ్జి టౌన్ |
| 121. | బురుండీ ✻ | 5,958 | ఆఫ్రికా | 27,834 | బుజుంబురా |
| 122. | బూర్కినా ఫాసో ✻ | 9,889 | ఆఫ్రికా | 2,74,122 | ఔగడౌగౌ |
| 123. | బెనిన్ ✻ | 5,215 | ఆఫ్రికా | 1,12,622 | పోర్టోనోవూ |
| 124. | బెర్ముడా | 59 | ఉ. అమెరికా | 53 | మామల్టన్ |
| 125. | బెలిజ్ ✻ | 205 | ఉ. అమెరికా | 22,963 | బెల్మోపాన్ |
| 126. | బలూరూస్ ✻ | 10,260 | యూరపు | 2,07,600 | మిన్స్క్ |
| 127. | బెల్జియమ్ ✻ | 10,046 | యూరపు | 30,519 | బ్రస్సెల్స్ |
| 128. | బొలీవియా ✻ | 7,237 | ద.అమెరికా | 10,98,580 | సూకే లా పాజ్ |
| 129. | బోత్స్వానా ✻ | 1,443 | ఆఫ్రికా | 5,81,730 | గాబొరోనే |
| 130. | బోస్నియా& హెర్జెగోవినా ✤ | 5,707 | యూరపు | - - | సారాజెవో |
| 131. | బ్రిటిషు వర్జిన్ దీవులు | 17 | | 130 | రోడ్ టౌన్ |
| 132. | బ్రూనీ దారుస్సలామ్ ✻ | 274 | ఆసియా | 5,800 | బందర్ శేరిబెగవార్ |
| 133. | బ్రెజిల్ ✻ | 1,53,792 | ద.అమెరికా | 85,11,965 | బ్రసేలియా |
| 134. | భూటాన్ ✻ | 1,596 | ఆసియా | 46,600 | తింపూ |
| 135. | మంగోలియా ✻ | 2,318 | ఆసియా | 15,67,000 | ఉలాన్‌బాటర్ |
| 136. | మకావూ (పోర్చుగీసు) | 440 | ఆసియా | 17 | |
| 137. | మడగాస్కర్ (మలగాసీ) ✻ | 12,092 | ఆఫ్రికా సమీపంలో | 5,87,041 | అంతానానారివో |
| 138. | మలావీ ✻ | 9,135 | ఆఫ్రికా | 1,16,672 | లిలోంగ్వే |
| 139. | మలేసియా ✻ | 19,047 | ఆసియా | 3,29,758 | కౌలాలంపూర్ |
| 140. | మాంట్సెరాట్ | 11 | ఉ. అమెరికా | 10.6 | ప్లిమత్ |
| 141. | మారిటేనియా ✻ | 2,161 | ఆఫ్రికా | 10,30,700 | నౌయాకేహాటీ |
| 142. | మారిషస్ ✻ | 1,098 | ఆఫ్రికా సమీపాన | 2,040 | పోర్ట్ లూయీ |
| 143. | మార్టినెక్యా | 359 | ఉ. అమెరికా | 1,097 | ఫోర్ట్-డి-ఫ్రాన్స్ |

| | | | | |
|---|---|---|---|---|
| 144. | మలేషియా * | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
| 145. | మాలి * | 10,135 | ఆఫ్రికా | 12,40,142 | [illegible] |
| 146. | మాల్టా * | 366 | యూరపు | 246 | వెల్లెట్టా |
| 147. | మాల్దీవులు * | 238 | ఆసియా | 298 | మాలే |
| 148. | మాసిడోనియా రిపబ్లిక్ (పూర్వ యుగోస్లావియా) | 2,083 | యూరపు | | స్కోప్జే |
| 149. | మెక్సికో * | 87,341 | ఉ. అమెరికా | 19,58,201 | మెక్సికో సిటీ |
| 150. | మైక్రోనీషియా సంయుక్త రాజ్యాలు | 105 | పసిఫిక్ | 701 | కొలోనియా |
| 151. | మొజాంబిక్ * | 15,583 | ఆఫ్రికా | 7,99,380 | మాపుటో |
| 152. | మొనాకో ✤ | 31 | యూరపు | 1.8 | మొనాకో |
| 153. | మొరోకో * | 26,069 | ఆఫ్రికా | 4,58,730 | రాబట్ |
| 154. | మ్యాన్మార్ (బర్మా) * | 44,596 | ఆసియా | 6,78,000 | యాంగన్ |
| 155. | మోల్డావా రిపబ్లిక్ * | 44,619 | యూరపు | 33,700 | చిషినెవ్ |
| 156. | యుక్రెయిన్ * | 52,000 | యూరపు | 6,03,700 | కీవ్ |
| 157. | యుగోస్లావియా * | 10,519 | యూరపు | 1,79,015 | బెల్‌గ్రేడ్ |
| 158. | యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్* | 1,206 | ఆసియా | 83,657 | అబూధాబీ |
| 159. | యునైటెడ్ కింగ్‌డమ్ * | 58,191 | యూరపు | 2,30,646 | లండను |
| 160. | యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా* | 2,58233 | ఉ. అమెరికా | 90,72,740 | వాషింగ్‌టన్ డి.సి. |
| 161. | యెమెన్ * | 12,302 | ఆసియా | 531000 | శానా ఆ |
| 162. | రష్యా ఫెడరేషన్ * | 1,48,366 | యురేషియా | 1,70,75,000 | మాస్కో |
| 163. | రీ యూనియన్ (ఫ్రాన్సు) | 59.6 | ఆఫ్రికా | 2,511 | - |
| 164. | రుమేనియా * | 22,742 | యూరపు | 2,37,500 | బుఖారెస్ట్ |
| 165. | రువాండా * | 7,554 | ఆఫ్రికా | 26,330 | కిగాలీ |
| 166. | లక్సెంబర్గ్ * | 401 | యూరపు | 2,586 | లక్సెంబర్గ్ |
| 167. | లాత్వియా * | 2,536 | యూరపు | 63,700 | రిగా |
| 168. | లావోస్ రిపబ్లిక్ * | 4,605 | ఆసియా | 2,36,800 | వియెంటియానే |
| 169. | లితువేనియా * | 3735 | యూరపు | 65,200 | విల్నియస్ |
| 170. | లిబియా అరబ్ జమాహిరియా* | 4,700 | ఆఫ్రికా | 17,59,540 | ట్రిపోలీ |
| 171. | లీక్టెన్ స్టీన్ * | 30 | యూరపు | 160 | వాడూజ్ |
| 172. | లెబానాన్ * | 2,806 | ఆఫ్రికా | 10,452 | బీరూట్ |
| 173. | లెసోతో * | 1,943 | ఆఫ్రికా | 30,340 | మాసెరో |
| 174. | లైబీరియా * | 2,640 | ఆఫ్రికా | 1,11,370 | మొన్రోవియా |
| 175. | వనౌతూ * | 156 | పసిఫిక్ | 12,190 | విలా |
| 176. | వర్జిన్ దీవులు (యుఎస్ఏ) | 101 | | 136 | చార్లెట్టీ అమాలీ |
| 177. | వాలిస్ & ఫుతూనా దీవులు (ఫ్రాన్స్) | 15 | | 274 | మాటా-ఉటా |
| 178. | వియెత్ నామ్ * | 71,324 | ఆసియా | 3,29,566 | హానోయీ |

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 179. | వెనిజ్యూలా ※ | 20,712 | ద.అమెరికా | 9,12,050 | కార్కాస్ |
| 180. | శాన్ మారినో ✤ | 24 | యూరపు. | 61 | శాన్‌మారినో |
| 181. | శ్రీ లంక ※ | 17,619 | ఆసియా | 65,609 | కొలంబో |
| 182. | సామోవా※ | 163 | పసిఫిక్ ప్రాంతం | 197 | ఫాగాటోగో |
| 183. | సావోటోమీ & ప్రిన్సిపీ ※ | 122 | | 845 | సావోటోమీ |
| 184. | సింగపూర్ ※ | 2,930 | ఆసియా | 625 | సింగపూర్ |
| 185. | సియెర్రా లియోనీ ※ | 4,297 | ఆఫ్రికా | 73,326 | ఫ్రీటౌన్ |
| 186. | సిరియన్ అరబ్ రిపబ్లిక్ ※ | 13,844 | ఆసియా | 1,85,680 | డమాస్కస్ |
| 187. | సుడాన్ ※ | 24,941 | ఆఫ్రికా | 25,05,813 | ఖార్టూమ్ |
| 188. | సురినామే ※ | 414 | ద.అమెరికా | 1,63,820 | పారామారిబో |
| 189. | సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ ※ | 3,156 | ఆఫ్రికా | 6,22,436 | బాంగూయి |
| 190. | సెకెల్లీస్ ※ | 72 | ఆఫ్రికా సమీపాన | 455 | విక్టోరియా |
| 191. | సెనిగల్ ※ | 8,152 | ఆఫ్రికా | 1,96,722 | డాకార్ |
| 192. | సెయింట్ కిట్స్ & నెవిస్ ※ | 42 | ఉ.అమెరికా | 2,6330 | బెస్సెటెర్రే |
| 193. | సెయింట్ లూషియా ※ | 139 | ఉ.అమెరికా | 616 | కేస్ట్రీస్ |
| 194. | సెయింట్ విన్సెంట్ దిగ్రెనడీన్స్ ※ | 110 | ఉ.అమెరికా | 389 | కింగ్‌స్టన్ |
| 195. | సైప్రస్ ※ | 726 | ఆసియా | 9,251 | నికోషియా |
| 196. | సోమాలియా ※ | 8,954 | ఆఫ్రికా | 6,37,657 | మొగదిషూ |
| 197. | సోలమన్ దీవులు ※ | 355 | పసిఫిక్ ప్రాంతం | 27,556 | హొనియారా |
| 198. | సౌత్ ఆఫ్రికా (దక్షిణ ఆఫ్రికా) ※ | 40,455 | ఆఫ్రికా | 11,27,200 | ప్రెటోరియా |
| 199. | సౌదీ అరేబియా ※ | 1,7119 | ఆసియా | 22,00,000 | రియాద్ |
| 200. | స్పెయిన్ ※ | 39,167 | యూరపు | 50,475 | మాడ్రిడ్ |
| 201. | స్లోవక్ రిపబ్లిక్ (స్లోవేకియా) ✤ | 5,353 | యూరపు | 49,035 | బాతిస్లావా |
| 202. | స్లోవేనియా ✤ | 1,988 | యూరపు | 2,0251 | ల్యూబ్జానా |
| 203. | స్వాజీలాండ్ ※ | 809 | ఆఫ్రికా | 17,400 | మ్బాబేన్ |
| 204. | స్విజర్లండ్ | 6,750 | యూరపు | 41.288 | బెర్న్ |
| 205. | స్వీడెన్ ※ | 8,801 | యూరపు | 41,1615 | స్టాక్‌హోమ్ |
| 206. | హాంగ్‌కాంగ్ (చీనా) | 5,950 | ఆసియా | 78 | హాంగ్‌కాంగ్ |
| 207. | హంగేరీ ※ | 10,257 | యూరపు | 93,032 | బుడాపేస్ట్ |
| 208. | హెయిటీ ※ | 7,041 | ఉ. అమెరికా | 27,750 | పోర్ట్-ఒ-ప్రిన్స్ |
| 209. | హొండూరాస్ ※ | 5,770 | ఉ. అమెరికా | 11,425 | తెగుసిగల్పా |

※ యునైటెడ్ నేషన్స్ సభ్య దేశాలు (1995 1992 తర్వాత యునైటెడ్ నేషన్స్ సభ్యత్వం పొందిన రాజ్యాలు : ✤ అజెర్‌బైజాన్, ఉజ్బెకిస్తాన్, ఎస్తోనియా, కజకస్తాన్, కిర్గిజిస్తాన్, కొరియా (ఉత్తర), కొరియా రిపబ్లిక్, క్రోషియా, జార్జియా, తజకిస్తాన్, తుర్కుమెనిస్తాన్, బోస్నియా & హెర్జ్‌గొవినా, మార్షల్ దీవులు, మాసిడోనియా రిపబ్లిక్, మొనాకో, మోల్డావా రిపబ్లిక్, లాత్వియా లితువేనియా, శాన్ మారినో, స్లొవక్ రిపబ్లిక్, స్లొవేనియా.

# ప్రపంచం : నామ నిఘంటువు

**అబ్రహామ్ లింకన్** (1800 - 1865) యునైటెడ్ స్టేట్స్‌లో బానిసత్వాన్ని నిర్మూలించిన బానిస బంధు. యునైటెడ్ స్టేట్స్‌కు 16వ ప్రెసిడెంట్.




**అరిస్టోఫేన్స్** క్రీ.పూ. 448-385 గ్రీక్ మహా కవి. హాస్య రచయిత.

**అరీలియస్, మార్కస్** క్రీ.శ. 121-180 రోమ్ చక్రవర్తి. స్థితప్రజ్ఞతాతత్త్వానికి చెందిన సిద్ధాంతి. భావుకుడు, రచయిత.

**ఆంటోనీ, మార్కు** క్రీ.పూ 83-30, రోమన్ యోధుడు. జూలియస్ సీజర్ మిత్రుడు. రెండవ నాయకత్రయంలో ఒకరు. ఆక్టేవియస్‌కు ప్రత్యర్థి.

**ఆముండ్సెన్, రోల్డ్** 1872-1928 దక్షిణ ధృవం ఉనికిని కనుగొన్న(డిసె. 1911) నార్వే నావికుడు, దేశాన్వేషకుడు.

**ఆర్మ్‌స్ట్రాంగ్, నీల్** జననం 1930. యునైటెడ్ స్టేట్స్ వ్యోమగామి. ఆల్డ్రిన్‌తోపాటు అపోలో-11 అంతరిక్షయానం చేసి చంద్రమండలంపై కాలుమోపిన ప్రథముడు (జూలై 21, 1969).

**ఆర్కిమిడీజ్** క్రీ.పూ. 287-212. గ్రీక్ గణితవేత్త, భౌతిక శాస్త్రవేత్త. ఆవిష్కర్త. విశిష్ట గురుత్వం, తులాదండంవంటి శాస్త్ర విషయాలను కనిపెట్టిన వాడు.

**ఆరిస్టాటిల్** క్రీ.పూ. 384-322 గ్రీక్ మహామేధావి. గ్రీకు మేధాత్రయం (సోక్రటీస్, ప్లేటో, ఆరిస్టాటిల్)లో ఒకరు. తత్త్వ వేత్త ప్లేటో శిష్యుడు. అలెగ్జాండర్‌కు గురువు.

**అలెగ్జాండర్ దిగ్రేట్** క్రీ.పూ. 356-323. మాసిడోనియా రాజు. గ్రీక్ నగర రాజ్యాల్ని జయించిన వాడు. ఆసియామైనర్, ఈజిప్టు, భారతదేశంకు విస్తరించిన మహా సామ్రాజ్యానికి చక్రవర్తి.

**ఇబ్సెన్, హెన్రిక్** 1828-1906. నార్వే మహాకవి, నాటక రచయిత.

**ఈసోపు** క్రీ.పూ. 620-560 గ్రీక్ జంతు కట్టుకథల రచయిత. ఉదా:- నాన్నా -పులి, నక్క - ద్రాక్ష మొదలగునవి.

**ఏసుక్రీస్తు** క్రీ.పూ 4 క్రైస్తవమతాన్ని స్థాపించినవాడు. పాలస్తీనాలోని నాజరత్ ఆయన నివాస స్థలం.

**ఐన్‌స్టీన్, ఆల్బర్ట్** 1879-1955. సాపేక్ష సిద్ధాంతాన్ని (రెలిటివిటీ తీయరీ) ప్రవచించిన జర్మనీ మహావిజ్ఞాని, యునైటెడ్ స్టేట్స్ పౌరుడు. ఈయన సిద్ధపరచిన భౌతిక శాస్త్ర సూత్రం $E = mc^2$ పరమాణు (ఆటం) బాంబు తయారీకి దారి తీసింది.



**కన్ఫ్యూషియస్** క్రీ.పూ. 551-448. చీనా తత్త్వవేత్త. సంఘ సంస్కర్త. మానవ ప్రవర్తనా నియమావళిని సిద్ధ పరచాడు.



**కాన్‌స్టంటీన్-1** క్రీ.శ. 288-337. కాన్‌స్టాంటినోపిల్‌ను రాజధానిగా నిర్మించిన రోమన్ చక్రవర్తి. క్రైస్తవ ఆరాధనను చట్ట బద్ధం చేసిన వాడు.

**కింగ్ (జూ), మార్టిన్ లూథర్** 1929-68 అమెరికాలో నీగ్రో పౌరహక్కుల నాయకుడు.



**కుక్, జేమ్స్** 1722-79. బ్రిటిషు నావికుడు దక్షిణ పసిఫిక్ యాత్రలు చేసి అంటార్కిటికాను చేరి పరిశోధనలు చేశాడు.

**కుబ్లయిఖాన్** క్రీ.పూ. 1216-94. మంగోలు చక్రవర్తి జెంగిజ్‌ఖాన్ మనుమడు. చీనాలో మంగోలు రాజవంశాన్ని స్థాపించాడు.

**కెనెడీ, జాన్ ఫిట్జెరాల్డ్** 1917-63. యునైటెడ్ స్టేట్స్‌కు 35వ ప్రెసిడెంట్. పౌర హక్కులను ప్రకటించాడు.

**కెల్లర్, హెలెన్ ఆడమ్స్** 1880-1968 అంగ వైకల్యాన్ని అధిగమించిన యునైటెడ్ స్టేట్స్ రచయిత్రి. మాట్లాడడం నేర్చుకున్న అంధురాలు, బధిరురాలు.



**కొలంబస్ క్రిస్టోఫర్**, 1446-1506. స్పెయిన్ కొలువులో వున్న ఇటలీ నావికుడు. అమెరికా ఖండాన్ని కనిపెట్టిన వాడు (1492).

**క్లియోపాత్రా** క్రీ.పూ 69-30. తొమ్మిదవ టాలమీ కుమార్తె. మేటి రాజకీయ ధురంధురాలు. ఈజిప్టుకు అరవరాణి. జూలియస్ సీజర్, మార్క్ ఆంటోనీల ప్రేమను లోగొని తన రాజ్యాన్ని రక్షించుకుని ఆక్టేవియా చేతిలో ఓటమి తర్వాత ఆత్మహత్యకు గురి అయింది.

**గూటెన్‌బర్గ్ జొహానీస్** 1398-1468. అచ్చు యంత్రాన్ని కనిపెట్టిన జర్మనీ వాడు.

**గోటే (గెతే) జోహాన్ వూల్ఫ్ గాంగ్** 1749-1832. జర్మనీ మహాకవి. నవలాకారుడు. నాటక రచయిత (*ఫౌస్ట్*).

**గోర్బచెవ్, మిఖాయిల్ సెర్గివిచ్** జననం 1931. సోవియెట్ రష్యా ప్రెసిడెంటు. 'సోవియెట్' విడిపోవటానికి కారకుడు.

**చర్చిల్ విన్‌స్టన్ (లెనర్డ్ స్పెన్సర్)** 1874-1965. బ్రిటిషు రాజనీతిజ్ఞుడు. బ్రిటిషు ప్రధాని. సాహిత్యంలో నోబెల్ పురస్కార గ్రహీత (1953).

**చాప్లిన్ చార్లీ (ఛార్లెస్ స్పెన్సర్)** 1889-1977 ఇంగ్లీషు సినీమా హాస్య నటుడు, మూకీ నటుడు, నిర్మాత, దర్శకుడు. యునైటెడ్ స్టేట్స్ వాసి 1910-52.



**చియాంగ్ కై షేక్** 1887-1975 కుమిటాంగ్ సైన్యాధి

పతి. చీనా రాజనీతిజ్ఞుడు. చీనా రిపబ్లిక్‌కు అధ్యక్షుడు 1943-49.

**చెకొవ్ (చెకాఫ్) ఆంటోన్ పావ్లొచ్** 1860-1940. రష్యా కథానికా రచయిత, నాటక కర్త.

**జాన్సన్ సామ్యూల్** 1709-84. ఇంగ్లీషు నిఘంటుకారుడు, కవి, విమర్శకుడు.

**జెంగిజ్‌ఖాన్ (చెంగీజ్‌ఖాన్)** 1162-1227. మంగోలు చక్రవర్తి. (ఆసియా - తూర్పు యూరపు) కుబ్లయిఖాన్‌కు తాత.

**జెఫర్సన్, తామస్** 1743-1826. యునైటెడ్ స్టేట్స్‌కు మూడవ ప్రెసిడెంట్. దౌత్యాధికారి. వాస్తుశిల్పి. రచయిత. అమెరికా స్వాతంత్ర్య ప్రకటన కర్త.

**జోన్ ఆఫ్ ఆర్క్** 1412-31 ఫ్రెంచి వీరనారి. ఫ్రెంచివారిలో జాతీయ చైతన్యం తీసుకు వచ్చిన శౌర్యశీలి.

**టాలమీ - 1** క్రీ.పూ. 367-247. ఈజిప్టు రాజు. మాసిడోనియా రాజవంశస్థుడు.

**టాల్‌స్తాయ్ (టాల్‌స్టాయి), లియో నికోలాయేవిచ్** 1828-1910. రష్యా నవలాకారుడు. సంఘ విమర్శకుడు. 'యుద్ధం - శాంతి' ఆయన ప్రముఖ రచన.

**ట్రాట్స్కీ, లియోన్** 1879-1940 రష్యా విప్లవ నాయకుడు. రచయిత. యుద్ధ మంత్రి (1918-25). బహిష్కృతుడై చంపబడ్డాడు.

**డవిన్సీ లియొనార్డో** 1452-1519 బహుముఖ ప్రజ్ఞాశాలి. ఇటలీ దేశస్థుడు. చిత్రకారుడు, శిల్పి, వాస్తుశిల్పి, సంగీత విద్వాంసుడు, ఇంజనీరు, గణితజ్ఞుడు, విజ్ఞాని. 'మోనాలిసా' ఆయన సుప్రసిద్ధ చిత్రం.

**డిస్నీ, వాల్ట్** 1901-1966 యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన కార్టూను (మికీ మౌస్) కథా చలనచిత్రాల నిర్మాత.

**డోస్టొవిస్కీ, ఫ్యోదోర్ మిఖిలోవిచ్**, 1821-81 రష్యానవలాకారుడు. (క్రైమ్ & పనిష్మెంట్)

**తామర్లేన్** 1336-1405 సామర్కండ్ (దక్షిణ పశ్చిమ ఆసియా) పాలకుడు. తార్తార్ విజేత.

**నాసర్, గమాల్ అబ్దెల్** 1918 -1970 ఈజిప్టు సేనాధిపతి, ఐక్య అరబ్ రాజ్యాలకు ప్రధాని, అధ్యక్షుడు (97).

**నెపోలియన్ బోనాపార్టీ** 1769-1821 ఫ్రెంచి యోధుడు. ఫ్రాన్స్ చక్రవర్తి (1804-15).

**నోబెల్, ఆల్ఫ్రెడ్ బెర్నార్డ్** 1833-96. స్వీడన్‌కు చెందిన రసాయినిక శాస్త్రజ్ఞుడు. డైనమైట్‌ను కనిపెట్టినవాడు. దానశీలి. నోబెల్ పురస్కారాల్ని స్థాపించిన వాడు.

**పికాసో, పాబ్లో** 1881- 1973 ఫ్రాన్స్‌లో స్థిరపడిన సుప్రసిద్ధ స్పానిష్ చిత్రకళా కారుడు. శిల్పి.

**ప్లేటో.** క్రీ.పూ. 427-347. గ్రీక్ తత్త్వవేత్త. సోక్రటీస్ శిష్యుడు. అరిస్టాటిల్‌కు గురువు.

**ఫ్రాయిడ్, సిగ్మండ్** 1856-1939 ఆస్ట్రియా నాడీమండల వైద్యుడు. సైకో-ఎనాలిసిస్ సిద్ధాంతాన్ని ప్రవచించినవాడు.

**బిస్మార్క్, ఓటోఫాన్** 1815-98 జర్మనీ రాజనీతిజ్ఞుడు. ఆధునిక జర్మనీకి ప్రప్రథమ ఛాన్సలర్.

**బెర్నార్డ్ షా జార్జి** 1856 -1950 లండన్‌లో స్థిరపడిన ఐర్లాండ్ రచయిత, నాటకకర్త. 'పిగ్మేలియన్' వంటి నాటక రచయిత, విమర్శకుడు.

**బేడెన్ పవెల్** 1857-1941 బ్రిటిషు యోధుడు బాలభట (బాయ్ స్కౌట్) ఉద్యమానికి ఆద్యుడు.

**బెతోవెన్, లడ్విగ్** 1770-1827 జర్మనీ వాగ్గేయ కారుడు.

**బోలివర్, సైమన్** 1783-1830 దక్షిణ అమెరికాలో స్పానిష్ వలస రాజ్యాల విముక్తి పోరాటం సల్పిన వెనిజ్యులా రాజనీతిజ్ఞుడు.

**బ్రెయిల్, లూయీ** 1809,1852. అంధులకు లిపిని సిద్ధపరచినవాడు.

**మండేలా నెల్సన్ ఖుండేలా రోలి హ్లాహ్లా** జననం 1918. దక్షిణ ఆఫ్రికా రాజ నీతిజ్ఞుడు, అధ్యక్షుడు. జాతీయవాది. నల్ల జాత్యభ్యున్నతికి పాటుపడిన వ్యక్తి. 'ఆఫ్రికన్ గాంధీ'గా ప్రసిద్ధి.

**మహమ్మద్** క్రీ.శ. 570-632 ఇస్లాం మత వ్యవస్థాపకుడు. ప్రవక్త. మక్కా జన్మస్థలి. ఖొరాన్ కర్త.

**మార్క్స్, హెన్రిక్ కార్ల్**, 1818- 83. జర్మనీ ఆర్థిక శాస్త్రవేత్త. సమ సమాజ వాది. తత్త్వవేత్త. కమ్యూనిజం గ్రంథం 'దాస్ కాపిటల్' రచయిత.




**మార్కో పోలో** 1254-1324. ఇటలీ (వెనిస్) యాత్రికుడు. కుబ్లయిఖాన్ కొలువులో సదస్యుడు. భారతదేశాన్ని (ఆంధ్ర) సందర్శించి నావికా వాణిజ్యానికి దోహద పరచినవాడు..

**మావో సేటుంగ్** 1893 - 1976 చీనా అగ్ర నాయకుడు. చీనా పీపుల్స్ రిపబ్లిక్ కు అధ్యక్షుడు (1949-59). దీర్ఘ ప్రస్థాన యాత్ర (లాంగ్ మార్చ్) జరిపి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని స్థాపించినవాడు.



**మూలర్, ఫ్రెడరిక్ మాక్స్** 1823-1900. బ్రిటన్‌లో సంస్కృత పండితుడు. జర్మనీలో జన్మించిన భాషా శాస్త్రవేత్త. ప్రాచ్య పవిత్ర గ్రంథాలను పరిష్కరించాడు.




**మైఖెలెంజిలో, భొనా రొటీ** 1475 - 1564. ఇటలీ శిల్పి, చిత్రకారుడు, వాస్తు శిల్పి, కవి.

**రూజ్‌వెల్ట్, తియోడోర్ (టెడ్డీ)** 1858-1919 అమెరికా ఆర్థికవ్యవస్థను పునర్నిర్మించిన వాడు. యునైటెడ్ స్టేట్స్‌కు 26వ ప్రెసిడెంట్. నోబెల్ శాంతిపురస్కార గ్రహీత (1906).

**రూజ్‌వెల్ట్, ఫ్రాంక్లిన్ డీలనో** 1882-1945. యునైటెడ్ స్టేట్స్‌కు 32వ ప్రెసిడెంటు.

**రూసో, జీన్‌ఝాకీస్** 1712-1778 స్విజర్లండ్‌లో పుట్టిన ఫ్రెంచి తత్త్వవేత్త. రచయిత. మేధావి. సంఘసంస్కర్త.

**రైట్ సోదరులు - ఆర్విల్ రైట్** 1871-1948, **విల్బుర్ రైట్** 1867-1912. యునైటెడ్ స్టేట్స్ వాయుతైన సోదరు ఇద్దరూ ఉమ్మడిగా



నేటి విమానానికి మూల రూపాన్ని నిర్మించారు.

లెనిన్ నికొలాయ్ వ్లాదిమిర్ ఇలియెచ్ 1870-1924 రష్యా విప్లవ నాయకుడు. సోవియట్ రష్యాకు ప్రప్రథమ ప్రధాని (1918-24)

వాషింగ్టన్, జార్జి 1732-99 అమెరికన్ జాతిపిత. యునైటెడ్ స్టేట్స్ వ్యవస్థాపకులలో ముఖ్యుడు. ప్రథమ ప్రెసిడెంట్ (1789).



విక్టోరియా 1819-1901. బ్రిటిష మహారాణి (1837-1901) భారతదేశానికి చక్రవర్తిని (1876-1901).

షార్లిమేన్ క్రీ.శ. 742-814. రోమన్ చక్రవర్తి. పవిత్ర రోమన్ సామ్రాజ్య వ్యవస్థాపకుడు. సంస్కృతి పునరుజ్జీవనానికి కారకుడు.



షేక్స్‌పియర్, విలియమ్ 1564-1616 ఇంగ్లండులో పుట్టిన సుప్రసిద్ధ ఆంగ్ల సాహిత్య వేత్త. మహాకవి. నాటక రచయిత.

సీజర్, జూలియస్ క్రీ.పూ. 100-44 రోమన్ యోధుడు. రాజనీతిజ్ఞుడు, చరిత్ర కారుడు. గాల్ విజేత.

సోక్రటీస్ క్రీ.పూ. 469-399 గ్రీక్ తత్త్వవేత్త. ప్లేటోకి గురువు. మహామేధాత్రయంలో ప్రథముడు.

స్టాలిన్, జోసెఫ్ విస్సారియో నోవిచ్ బ్రగాష్విలీ 1879-1953. రష్యా విప్లకారుడు. అధినేత. ప్రధాని (1924-53).

హిట్లర్, అడాల్ఫ్ 1889-1945 జర్మనీ నియంత. నాజీ నాయకుడు. 'మైన్‌కామ్ఫ్' ఆయన స్వీయ చరిత్ర. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభించినవాడు.

హేనిమెన్, సామ్యూల్ 1755-1843 జర్మనీ వైద్యుడు. సారూప్య (హోమియోపతీ) చికిత్సా విధానాన్ని కనిపెట్టిన వాడు.



హెూచిమిన్ (న్గూయెన్ సాన్‌కుంగ్) 1890-1969. వియెత్నామ్ జాతీయ నాయకుడు. కమ్యూనిస్టు అధినేత.




హెూమర్ క్రీ.పూ. 700. గ్రీక్ పురాణ కర్త. "ఒడెస్సీ, ఇలియెడ్" మహాకావ్యాల కర్త. అంధుడని ప్రసిద్ధి.

# ప్రపంచ చరిత్ర - కొన్ని ప్రముఖ ఘట్టాలు

క్రీ.పూ.

460 కోట్ల సం॥లు - భూమి వయస్సు.

200 కోట్ల సం॥లు - జీవ ప్రాదుర్భావం.

17 లక్షల సం॥లు - హోమోసేపియన్ మానవావతరణ.

70,000 నియాండర్తల్ మానవుని అవతరణ

40,000 హిమయుగం - పాతయుగం - పదునైన పరికరాలు.

30,000 నియాండర్తల్ మానవుని నిష్క్రమణ.

20,000 యూరపు గుహలలో కళా ఖండాలు.

12,000 ఆసియాలో నక్క జాతి నుండి కుక్క పెంపకం ఆరంభం.

8,000 సమీప ప్రాచ్య దేశాల్లో వ్యవసాయకృషి.

7000 జెరికో నివాసాలు - దాడుల నుండి రక్షణకై రాతి గోడల నిర్మాణం.

6000 మృణ్మయ-పాత్రలు

5000 పర్షియాలో ఖనిజాన్ని కాల్చి రాగి ధాతు సాధన ప్రారంభం.

4000 పశ్చిమ ఇరాన్‌లో శుశాన్ నాగరికత వర్ధిల్లింది. ఈరుదూ, ఉర్, ఉరుక్, కిష్, లాగాష్ మహా నగరాలు వెలిశాయి.

4236 ఈజిప్టు కాలెండరుపై తేదీ లేఖన - ఆరంభం.

3760 యూదు (జ్యూ)ల కాలెండరుపై తేది లేఖన.

3600 నైఋతి ఆసియాలో కంచు వాడకం.

3500 సుమేరియా (యూఫ్రటీస్ నదీ తీరాన) నాగరికతవర్ధిల్లింది. ※ బాణాగ్ర (క్యూనిఫారమ్) లిపి ※ చిత్రలిపివున్న మట్టి బిళ్లల ( రొసెట్టా) ద్వారా లిఖితాధారాలు.

3200 మెసపటోమియాలో చక్రం నిర్మించారు. ※ క్రీట్‌లో మినోవా నాగరికత ( 3000 - 1100) చిత్రలిపి. ※ వెండి, బంగారం ఉపయోగం. ※ పూర్వ మైసీనియా ( దక్షిణ గ్రీస్) నాగరికత ప్రారంభం. ※ మెసపటోమియా నాగరికత.

3100 ప్రారంభ రాజవంశ పాలన కింద ఈజిప్టు హైరగ్లిఫిక్ లిపి.

3000 తూర్పు మధ్యధరా వైపుకు ఫొనీషియన్ల వలస.

3000 సింధు నాగరికత. ※ ద్రావిడ నాగరికత.

2980 ట్రాయ్‌లో (వాయవ్య టర్కీ) ప్రారంభ స్థిరనివాసాలు.

2850 చీనాలో ఐతిహాసిక స్వర్ణ యుగం.

2780 ఈజిప్టు - గొప్ప పిరమిడుల (చియాప్స్) నిర్మాణం.

2700 ఈజిప్టులో సాహిత్యం. ※ పిరమిడ్‌ల యుగం ప్రారంభం.

2640 సీ - హింగ్ - ఈ అనే చరిత్ర ప్రసిద్ధి కెక్కిన రాణి చీనాలో పట్టు ఉత్పత్తిని ప్రవేశపెట్టింది.

2600 ఈజిప్టులో జ్యామితి.

2400 ఆర్యుల వలస ప్రారంభం.

2371 అక్కాడ్ (ఉత్తర ఇరాక్) సామ్రాజ్యం.

2340 సార్గన్‌చే సెమిటిక్ సుమేరియా నాగరికతల స్థాపన.

2200 మధ్య మినోవా యుగం * కలం, సిరా ఉపయోగించి దీర్ఘలిపి. * సింధునదీ లోయకు ఆర్యుల రాక.

1750 బాబిలోనియాలో.(క్రీ.పూ. 2800 - 1750) హమ్మురాబీ శాసనావళి.

1720 ఈజిప్టులో హిక్సోస్ * యుద్ధంలో రథాల వాడకం ప్రారంభం.

1600 తరువాతి మినోవా నాగరికత - దీర్ఘలిపి. * చీనాలో షంగ రాజవంశపాలన

1546 ఈజిప్టులో మూడవ తోతంగేక్మెస్ హయాములో 18 వ రాజవంశపాలన; నాగరికత ఉచ్ఛస్థితి.

1500 భారతదేశంలో వేదసాహిత్యం; * ఆసియా మైనర్‌లో బలవత్తరమైన ఆర్య సామ్రాజ్యం (మిత్తానీ), * బాబిలోనియా (యూఫ్రటీస్ లోయ) సామ్రాజ్యాలతో ఫోనీషియా లాభసాటి వర్తక వాణిజ్యం నెరిపింది.

1400 ఆసియాలో ఇనుప యుగం.

1390 (మినోవా (క్రీట్) నాగరికత ఉచ్ఛస్థితి.

1350 హిటైట్(టర్కీ ప్రాంతం) నాగరికత (క్రీ.పూ 1900 - 1200) ఉచ్ఛస్థితి.

1300 హీబ్రూల అణచివేత; * ఈజిప్టు నుండి (మోజెస్)కాందిశీకులుగా వెళ్ళిపోవుట - ఫోనీషియాలో స్థిర నివాసాలు.

1250 ఈజిప్టు నుండి ఇజ్రాయెల్‌కు ప్రజల వలస * పాలస్తీనాపైకి హీబ్రూ ( ఇజ్రాయెల్)ల దాడి.

1200 ఈజిప్టుపైకి 'సాగర' వాసుల దాడి * హిటైట్ నాగరికత పతనం ; సాగర ప్రాబల్యం పెరిగింది.

1193 ట్రాయ్ మహానగరాన్ని గ్రీకులు ధ్వంసం చేశారు.

1125 చీనాలో సూదంటు రాయి వాడకం.

1027 చీనాలో చౌ రాజవంశ పాలన (1027 -249).

1005 డేవిడ్, సాలమన్ రాజ్యాల ప్రాబల్యం, * జెరూసలెమ్ అభయ హస్తం (1005 -925).

1000 భారతదేశంలో ఋగ్వేదం.

850 కార్తేజ్ (టూనీషియా ప్రాంతం) స్థాపన.

791 చీనాలో గ్రహణం గూర్చి శాసనం.

776 గ్రీస్‌లో ప్రప్రథమ ఒలింపిక్ క్రీడల నిర్వహణ.

758 రోమ్ నగరం స్థాపన ; దక్షిణ ఇటలీలో గ్రీక్ స్థిర నివాసాలు.

753 రోమ్‌నగర స్థాపన ( రోమలస్).

745 నైరృతి ఆసియాలో అస్సీరియా (నినెవేనో రాజధాని) ప్రబల రాజ్యం.

722 రెండవ సార్గన్‌చే సుమేరియా (ఉత్తర పాలస్తీనా) ముట్టడి.

700 హోమర్‌చే ఇలియడ్, ఒడెస్సే కావ్యాల రచన. * ఇనుము ఉపయోగం.

625 నూతన బాబిలోనియా (చాల్డియన్) సామ్రాజ్యం.

594 గ్రీక్ ( ఏథెన్స్) రాజ్యాంగ సంస్కరణ. * చీనాలో కన్‌ఫ్యూషియస్ క్రీ.పూ. (551-448)

538 బాబిలోనియా పర్షియన్‌ల కైవసం.

509 రోమన్ గణ రాజ్యస్థాపన.

508 ఏథెన్స్‌లో ప్రజాస్వామ్య రాజ్యాంగ ప్రకటన.

500 ఎట్రుస్కన్‌లు ఉత్తర ఇటలీలో ప్రాబల్యంలో ఉన్నారు.

480 పర్షియన్‌లు స్పార్టాను అదుపులో పెట్టారు.

479 గ్రీకులు పర్షియాదాడుల్ని ఎదుర్కొన గలిగారు.

461 ఏథెన్స్‌లో పెరిక్లీజ్ పాలన.

447 పార్థెనాన్ నిర్మాణం ప్రారంభం.

431 ఏథెన్స్ - స్పార్టాను ఘోర యుద్ధం.

425 చరిత్ర కారుడు హెరొడోటస్ (485 425) నిర్యాణం.

406 గ్రీక్ రచయితలు యూరిపిడీజ్, సోఫోక్లీజ్ మరణం.

400 గ్రీక్ చరిత్రకారుడు తుసిడైడిస్ మరణం. * సోక్రటీస్ (470 - 399)కు (హెమ్‌లాక్ విషంతో) మరణ దండన.

347 తత్త్వవేత్త ప్లేటో (427-347) *అరిస్టాటిల్ (384-322) అలిగ్జాండర్‌కు గురువు.

334 మాసిడోనియాలో ( బాల్కన్ దేశాల రాజు ఫిలిప్ హత్య తరువాత) అలిగ్జాండర్ పట్టాభిషిక్తుడయ్యాడు.

333 పర్షియారాజు దరయస్‌ను అలిగ్జాండర్ ఓడిస్తాడు. * ఈజిప్టు అలిగ్జాండర్ కైవసమవుతుంది.

323 అలిగ్జాండర్ (356 - 323) బాబిలోనియాలో మరణిస్తాడు.

323 ఈజిప్టులో టాలమీ పాలన.

221 షిహ హుమాన్ టీ పాలనలో ఉన్న చీనా ప్రాంతం చిన్ రాజవంశం వశ మైంది.

214 అంతకుముందు విడిగావున్న గోడల్ని కలిపి (చీనా గోడ - గ్రేట్ వాల్) కట్టారు.

213 చీనా సంప్రదాయ సాహితి దగ్ధం.

212 విజ్ఞాని ఆర్కిమెడీస్ (287 - 212).

202 చీనాలో హాన్ రాజవంశ పాలన(క్రీ.పూ. 202 - క్రీ.శ. 220)

196 మాసిడోనియా పతనమైన తరువాత గ్రీక్ నగర రాజ్యపాలన నుండి రోమ్ విడివడింది.

124 చీనాలో ప్రభుత్వోద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి మహా విద్యాలయ కేంద్ర స్థాపన.

110 వూ-టీ చక్రవర్తి పాలనలో చీనా సామ్రాజ్యం విస్తరించగా విదేశీ వర్తకవాణిజ్యం.

60 పాంపేలో పాంపే, సీజర్, క్రేసియస్ మొదటి నాయకత్రయ పాలన.

55 బ్రిటన్ పైకి జూలియస్ సీజర్ దాడి.

48 పాంపే సీజర్ వశమైంది.

46 సీజర్ హత్య.

43 రెండవ నాయకత్రయ పాలన, ఆంతోనీ, ఆక్టేవియన్, లేపిడస్.

31 ఆంటోనీ - క్లియోపాత్రాపై ఆక్టేవియన్ నౌకాదళ విజయభేరి.

30 క్లియోపాత్రా ఆత్మహత్య.

19 వర్జిల్ (70 - 19) మహాకవి మరణం.

4 ఏసుక్రీస్తు జననం (తిథి నిర్దుష్టం కాదు)

## క్రీ.శ.

6 చీనాలో ప్రభుత్వ సిబ్బంది. శిక్షణ, పరీక్షలు సువ్యవస్థీకరించబడినాయి.

9 చీనాలో వాంగ్ మాంగ్ నిర్వహించిన తీవ్ర సంస్కరణలు.

30 ఏసుక్రీస్తును సిలువపై వేసి బాధలకు గురిచేసిన (తేదీ నిర్దుష్టం కాదు) సంఘటన.

79 వెసూవియస్ అగ్నిపర్వతం బద్దలయి పాంపే నగరం నాశనమైంది.

180 'పంచ మహాచక్రవర్తుల'లో ఒకడైన మార్కస్ ఆరీలియస్ (121 180). *రోమన్ సామ్రాజ్య పతనం ప్రారంభం.

527 బైజాంటినియన్ ( కానిస్టాంటి నోపుల్ రాజధాని) చక్రవర్తి జస్టీనియన్-1 (క్రీ.శ 483 - 565) తనపేర న్యాయ సూత్రావళిని క్రోడీకరించాడు.

534 ఉత్తర ఆఫ్రికా, ఇటలీ బైజాంటియన్‌ల వశమయ్యాయి.

570 మహమ్మద్ ప్రవక్త జననం.

581 చీనాలో పెద్ద కాలువను తవ్వారు.

618 చీనాలో ట్యాంగ్ రాజవంశ పాలన (618 - 907).

622 హిజీరా మహమ్మదీయ శకం ప్రారంభం. ※ మక్కా నుండి మదీనాకు మహమ్మద్ పలాయనం.

632 మహమ్మద్ సిద్ధి పొందారు.

638 జెరుసలెమ్ ముస్లిముల వశం.

648 అలెగ్జాండ్రియా ముస్లిముల వశమైంది.

645 జపాన్‌లో సోగాతెగ పాలన అంతరించడంతో బౌద్ధం ప్రవేశించింది - చీనా సంస్కృతి ప్రబలింది.

750 ఉమాయ్యద్ (డమాస్కస్ రాజధాని)ల ఆస్థానంలో అబ్బాసిడ్ (క్రీ.శ. 750 - 1258) పాలన ప్రారంభం. ※ కలీఫా పాలన (బాగ్దాద్ రాజధాని) ప్రారంభం. ※ అరబ్బు సామ్రాజ్యం ఉచ్ఛస్థితి.

800 షార్లమాన్ (క్రీ.శ. 742 - 814) పట్టాభిషేకం (పవిత్ర రోమన్ సామ్రాజ్యం).

868 చీనాలో ప్రప్రథమంగా గ్రంథ ముద్రణ.

899 ఆల్ఫ్రెడ్ చక్రవర్తి నిర్యాణం.

900 ఘనా (వాయువ్య ఆఫ్రికా)లో ఉచ్ఛస్థితి.

982 నార్స్‌మెన్‌చే గ్రీన్‌లాండ్ ఆవిష్కరణ.

1016 డెన్మార్క్ రాజు కాన్యూట్ ఇంగ్లండుకు చక్రవర్తి అయ్యాడు.

1086 డూమ్స్‌డే గ్రంథం (భూమిశిస్తు వివరాలు) సంకలన.

1148 డమాస్కస్‌ను కైవసం చేసుకోవడంతో మత యుద్ధంII - క్రూసేడ్ విఫలం.

1161 చీనా యుద్ధాల్లో విదారక ద్రవ్యాల వాడకం. ※ జెంగిజ్‌ఖాన్ (1162 - 1227). మంగోల్ విజేత ఆసియా, తూర్పు యూరప్‌లను జయిస్తాడు.

1215 జాన్ రాజుచే ఇంగ్లండ్‌లో భూస్వాములు 'మాగ్నాకార్టా' మీద చేవ్రాలు చేయిస్తారు.

1241 మధ్య యూరప్‌పైకి మంగోల్‌ల దాడులు.

1250 ఇటలీలో సులోచనాల తయారీ.

1294 విజ్ఞాని రోజర్ బేకన్ నిర్యాణం.

1354 ఓటోమన్ టర్క్‌లు యూరప్‌లో గల్లిపోలీ వద్ద స్థిరనివాసం.

1362 బ్రిటిషు పార్లమెంట్‌లోను, న్యాయస్థానాల్లోనూ ఇంగ్లీషుకు అధికార భాషా స్థాయి.

1363 తైమూరు (తామర్లేన్).

1368 చీనాలో మింగ్ రాజవంశ పాలన (1368 - 1644).

1396 ఆఖరి మత యుద్ధాన్ని (క్రూసేడ్) నికోపోలిన్ వద్ద టర్క్‌లుచే అణచివేత.

1421 జోన్ ఆఫ్ ఆర్క్ సజీవ దహనం.

1438 హాప్స్‌బర్గ్‌లు పవిత్ర రోమన్ సామ్రాజ్య పాలన (1438 - 1806)

1453 శత వర్ష యుద్ధానంతరం బైజాంటియన్ (కానిస్టాంటినోపిల్) పతనం ※ బ్రిటిషు ఆధిక్యత.

1454 యూరప్‌లో గూటెన్‌బర్గ్ చే అచ్చు యంత్ర నిర్మాణం.

1492 క్రిస్టోఫర్ కొలంబస్ అమెరికా, పశ్చిమ ఇండియా దీవుల ఉనికి ఆవిష్కరణ.

1494 యూరప్‌లో అంతర్జాతీయ సంబంధాలు - ఆధునిక దౌత్యనీతి ప్రారంభం.

1499 అమెరిగో వెస్పుస్సీ దక్షిణ అమెరికా ఉనికిని నిరూపిస్తూ దేశపటం తయారీ.

1500 బ్రెజిల్ ఉనికిని పెడ్రోకేబ్రల్ కనుగొన్నాడు.

1507 పోర్చుగీసు రాజప్రతినిధి ఆల్‌బుకర్క్ గోవాలో సామ్రాజ్య స్థాపన.

1513 యూరప్‌లో పునరుజ్జీవనం. * ఉచ్ఛస్థితిలో లియో10 పోప్. * మైకోవిల్లీ రాజనీతిని గురించి 'ప్రిన్స్' గ్రంథాన్ని రచించాడు.

1517 మార్టిన్ లూథర్ సంస్కరణోద్యమంలో 95 సిద్ధాంత వ్యాసాలు సిద్ధపరిచాడు. * టర్క్‌లు ఈజిప్టును వశపరచుకున్నారు.

1519 దేశాన్వేషకుడు మెజిల్లాన్ ప్రపంచ యాత్ర. * బహుముఖ ప్రజ్ఞాశాలి లియోనార్డో డా విన్సీ (1452 - 1519) నిర్యాణం.

1542 పోర్చుగీస్ ప్రప్రథమంగా జపాన్ చేరుట.

1543 సూర్య కేంద్ర సిద్ధాంతాన్ని ప్రవచించిన కోపర్నికస్ నిర్యాణం.

1564 షేక్స్‌పియర్ మహాకవి జననం

1570 పోప్ ఇంగ్లండ్ మహారాణి ఎలిజిబత్తు 1ని బహిష్కరించాడు.

1582 పోప్ గ్రిగరీ XIII (ఇంగ్లీషు) పంచాంగాన్ని (నేటి కాలండరు) సిద్ధపరచాడు

1588 స్పానిష్ ఆర్మడా ఓటమి.

1590 నెదర్లాండ్స్‌లోని జఖరియా జెన్సన్ సూక్ష్మదర్శిని నిర్మించాడు.

1600 భారతదేశంలో ఇంగ్లీషు ఈస్ట్ ఇండియా కంపెనీ స్థాపన.

1601 వర్జీనియా (అమెరికా)లో లండన్ వాసులు వలస ప్రారంభించారు.

1608 హేన్స్ లిప్పర్షే దూరదర్శిని నిర్మించాడు.

1608 క్విబెక్ (కెనడా)ను చాంప్లియన్ స్థాపించాడు.

1613 రష్యాలో జార్ - 1 మైకేల్ రొమానావ్ పాలన.

1614 నేపియర్‌చే గణిత లాగరిథమ్ జంత్రీ.

1616 గెలీలియో శాస్త్ర ప్రయోగాలపై నేరారోపణ.

1620 యాత్రా జనకులు (పిల్‌గ్రిమ్ ఫాదర్స్) 'మే ఫ్లయిర్' నౌకలో న్యూ ఇంగ్లండు (అమెరికా) చేరారు.

1620 నెదర్లాండ్స్ విజ్ఞాని కొమియస్‌చే జలాంతర్గామి (సబ్మేరీన్) నిర్మాణం.

1624 రిచ్లూ ఫ్రాన్స్ ప్రధాని.

1628 విలియమ్ హార్వే విజ్ఞాని 'రక్త ప్రసరణం' గురించి ప్రచురించాడు.

1636 జపాన్ దేశీయులు విదేశాలకు వలస వెళ్లుట నిషేధింపబడింది.

1644 చీనాల్లో మంచూ పాలన ( 1644 - 1911).

1644 ఇటలీలో టోరిసెల్లీచే భారమితి నిర్మాణం.

1649 ఇంగ్లండులో చార్లెస్ 1 ఉరితీత.

1664 ఇంగ్లీషు వారిచే న్యూయార్క్ (అమెరికా) ఆక్రమణ.

1666 లండన్ దగ్ధమైంది * సుప్రసిద్ధ భౌతిక విజ్ఞాని ఐజాక్ న్యూటన్ (1642 - 1727) గురుత్వాకర్షణ బలసూత్రాల నిర్వచన.



1669 ప్రసిద్ధ చిత్రకారుడు రెంబ్రాన్ట్ నిర్యాణం.

1679 ఇంగ్లండ్‌లో హెబియస్ కార్పస్ చట్టం.

1690 లాక్ 'ప్రభుత్వం'మీద రెండు ఉద్గ్రంథాలు అందించాడు.

1694 బాంక్ ఆఫ్ ఇంగ్లండ్ వ్యవస్థాపన.

1695 ఇంగ్లండ్ లో పత్రికా స్వేచ్ఛ.

1696 రష్యాలో పీటర్ మహా చక్రవర్తి జార్.

1712 ఇంగ్లండులో తామస్ న్యూకామెన్ ఆవిరి యంత్రాన్ని నిర్మించాడు.

1713 అమెరికా బానిస వ్యాపారంలో స్పెయిన్ వారికి గుత్తాధికారం.

1714 బ్రిటన్ లో హానోవర్ వంశపాలన ❋ విగ్‌ల అధికారం.

1721 రాబర్ట్ వాల్ పోల్ బ్రిటిషు ప్రధాని.

1733 ఇంగ్లండ్‌లో పారిశ్రామిక విప్లవం - మొదటి దశ.

1751 ఫ్రాన్స్‌లో 'ఎన్‌సైక్లోపీడీ' (విజ్ఞాన సర్వస్వం మొదటి గ్రంథం) ప్రచురణ.

1753 స్లోనేచే బ్రిటిషు మ్యూజియము స్థాపన.

1759 ఫ్రాన్స్‌లో మహాకవి వాల్టేర్‌చే 'కాండీ డే' గ్రంథ రచన.

1762 కేతరీన్ II మహా జారినా చక్రవర్తిని.

1767 వడకు యంత్రం (స్పిన్నింగ్ జెన్నీ)ని జేమ్స్ హార్గ్రీవ్స్ (ఇంగ్లండు) నిర్మించాడు.

1768 ఇంగ్లండ్‌లో రాయల్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ స్థాపన. ❋ 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' సంపుటాల ప్రచురణ.

1773 బోస్టన్ టీ పార్టీ - అమెరికాలో విప్లవం.

1775 జేమ్స్ వాట్ ఆవిరి యంత్రం.

1776 అమెరికా స్వాతంత్ర్య యుద్ధ ప్రకటన. ❋ ఆడమ్ స్మిత్ దేశదేశాల సిరి సంపదలు - వెల్త్ ఆఫ్ నేషన్స్ ప్రచురణ.

1783 వేడిగాలి (మాంట్‌గ్వార్, చార్లెస్) హైడ్రోజన్ గుమ్మటాల్లో మొదటి సారిగా ఎగిరారు.

1784 ఇంగ్లీషు నిఘంటుకారుడు సామ్యూల్ జాన్సన్ నిర్యాణం.

1785 ఎడ్మండ్ కార్ట్‌రైట్ (ఇంగ్లండు) చే మరమగ్గం నిర్మాణం.

1788 ఆర్తర్ ఫిలిప్ నాయకత్వంలో నౌకలు ఆస్ట్రేలియా తీరాలు చేరాయి.

1789 జార్జి వాషింగ్‌టన్ యునైటెడ్ స్టేట్స్‌కు ప్రప్రథమ ప్రెసిడెంటు. ❋ఫ్రెంచివిప్లవం రాజుకుంది. (జూలై 14) ❋ ఫ్రాన్స్‌లో రెయిన్ ఆఫ్ టెర్రర్.

1792 డెన్మార్క్‌లో బానిస వ్యాపారం రద్దు ❋ ఫ్రాన్స్ గణ (రిపబ్లిక్) రాజ్యం ❋ ఈలీవిట్నీచే ప్రత్తి జిన్ యంత్ర నిర్మాణం.

1793 16వ లూయీ ఉరితీత.

1794 ఫ్రాన్స్‌లో రాబస్పియర్ (జాకోబిన్‌లు) పతనం - విప్లవకారుల విజయభేరి ❋ హయిటీలో నీగ్రోల తిరుగుబాటు.

1795 నెపోలియన్ బోనాపార్టీ పారిస్ మూకలను అదుపులో పెట్టాడు.

1800 అలెసెంద్రో వోల్టా (ఇటలీ) చే బ్యాటరీ నిర్మాణం.

1802 బ్రిటన్ - ఫ్రాన్స్ శాంతి సంధి ❋ ప్రప్రథమ ఆవిరి నౌక 'చార్లెట్ దుండాస్' క్లైడ్ నది మీద ప్రయాణించింది.

1804 నెపోలియన్ బోనాపార్టీ ఫ్రాన్స్‌కు చక్రవర్తి.

1805 ట్రఫాల్గర్ యుద్ధంలో నెల్సన్ విజయం.

1806 నెపోలియన్ జర్మన్ సైన్యాన్ని పునర్వ్యవస్థీకరిస్తాడు. ❋పవిత్ర రోమన్ సామ్రాజ్య పతనం.

1807 బ్రిటిషు సామ్రాజ్యంలో బానిస వ్యాపారం రద్దు ❋ యూరప్‌నంతటినీ నెపోలియన్ తన రాజ్యంలో కలుపు కుంటాడు.

1809 అర్జెంటీనా స్వపరిపాలన -ద.అమెరికాలో స్వతంత్రించిన ప్రప్రథమ దేశం.

1819 స్టామ్‌ఫర్డ్ రాఫిల్స్‌చే సింగపూర్ వ్యవస్థాపన.

1821 నెపోలియన్ నిర్యాణం (హెలీనా)

1822 ఫోటోగ్రఫీ కమేరా నిర్మాణం - నిసీఫోరే నీప్సీ (ఫ్రాన్స్).

1823 మన్రో సిద్ధాంతం.

1823 విలియమ్ స్టర్జన్‌చే విద్యుదయ స్కాంతం (ఎలక్ట్రో మాగ్నెట్) నిర్మాణం.

1825 గ్రేట్ బ్రిటన్‌లో ప్రప్రథమ రైలు మార్గ నిర్మాణం (స్టాక్‌టన్ నుంచి డార్లింగ్ టన్‌కు).

1826 డచ్చివారి నౌక అట్లాంటిక్ మహాసముద్రాన్ని మొదటిసారిగా దాటింది.

1827 వాగ్గేయ కారుడు బెతోవెన్ నిర్యాణం.

1827 జాన్ వాకెర్‌చే అగ్గిపుల్ల నిర్మాణం ( ఇంగ్లండు)

1831 ఎలక్ట్రిక్ డైనమా - మైకేల్ ఫారడే (ఇంగ్లండు)

1832 ప్రసిద్ధ జర్మన్ కవి గెతే నిర్యాణం.

1833 కార్మిక శ్రేయస్సును కోరి ఫ్యాక్టరీ చట్టం బ్రిటన్‌లో అమలుచేశారు.

1834 పేదరిక నిర్మూలనానికి (పూర్ లా) బ్రిటన్‌లో చట్టం.

1834 సైరస్ మెక్‌కార్మిక్‌చే (యు.ఎస్.ఏ) - పంటకోత యంత్రం

1835 మొదటి సారిగా 'సోషలిజమ్' పదం వాడుక.

1837 బ్రిటిషు గద్దెపై విక్టోరియా.

1838 లండన్‌లో నేషనల్ ఆర్ట్ గ్యాలరీ వ్యవస్థాపన.

1838 తంతి వార్తా ప్రసారం (ఏకతంతి)- సామ్యూల్ బి. మోర్స్(యు.ఎస్.ఏ)

1839 సైకిల్ నిర్మాణం - కిర్క్ పాట్రిక్ మాక్మిలన్ (స్కాట్లండు).

1840 'పెన్నీ' తపాల బిళ్ల ప్రారంభం.

1841 హాంగ్‌కాంగ్ బ్రిటిషువారి ఆధిపత్యంలోకి వచ్చింది ✻ కారు టైర్‌ల వల్కనైజేషన్ - చార్లెస్ గుడ్ ఈయర్ (యు.ఎస్.ఏ)

1845 కుట్టు మిషను - ఎలియాస్ హెూవే. (యు.ఎస్.ఏ).

1848 కాలిఫోర్నియాలో (పశ్చిమ అమెరికా) బంగారం ( గోల్డ్ రష్) దొరికింది.

1849 సేఫ్టీపిన్-వాల్టర్ హంట్ (యు.ఎస్.ఏ)

1856 బెస్సెమర్ ఉక్కు తయారీ విధానం.

1852 గైరోస్కోప్ నిర్మాణం - రాలీ యోన్ ఫోకల్ట్ (ఫ్రాన్స్)

1852 ఎలక్ట్రికల్ లిఫ్ట్ నిర్మాణం - ఎలీషా ఓటిస్ (యు.ఎస్.ఏ)

1859 చార్లెస్ డార్విన్‌చే 'జీవకోటి ప్రాదుర్భావం మానవ అవతరణ' (ఆరిజన్ ఆఫ్ స్పీషీస్, డిసెంట్ ఆఫ్ మాన్) ప్రచురణ.

1860 గారిబాల్డీ ఇటలీలో అధినేత.

1861 అబ్రహాం లింకన్ అమెరికన్ ప్రెసిడెంటు. ✻ అమెరికా పౌర యుద్ధం ప్రారంభం.

1862 మరతుపాకీ నిర్మాణం రిచర్డ్ గాట్లింగ్ (యు.ఎస్.ఏ ).

1862 ప్రష్యాలో బిస్మార్క్ ప్రాబల్యం.

1865 అబ్రహామ్ లింకన్ హత్య (ఏప్రిల్ 9) ✻ బానిసత్వం రద్దయింది (ఏప్రిల్ 14) ✻ గ్రెగర్ మెండెల్‌చే అనువంశిక సూత్రాలు.

1866 డైనమైట్ (పేలుడు పదార్థం - ఆల్ఫ్రెడ్ నోబెల్ (స్వీడన్)

1867 కెనడాకు డొమినియన్ ప్రతిపత్తి .

1868 జపాన్‌లో షోగన్ పాలన అంతం. ✻ మెయిజీ పునరుద్ధరణ: ✻ ఇంగ్లండులో డిశ్రేలీ స్థానంలో గ్లాడ్‌స్టన్ ప్రధాని.

1868 మోటరు సైకిలు నిర్మాణం - మైచాక్స్ సోదరులు (ఫ్రాన్స్)

1872 టైప్ రైటర్ నిర్మాణం - క్రిస్టాఫర్ షోల్జ్ (యు. ఎస్. ఏ).

1872 బ్రిటన్‌లో రహస్య బ్యాలట్ పద్ధతి.

1874 డిశ్రేలీ మరల బ్రిటిష్ ప్రధాని.




1877 గ్రామఫోన్- థామస్ ఆల్వా ఎడిసన్ (యు.ఎస్.ఏ.)




1876 టెలిఫోన్ - ఆవిర్భావం - గ్రహాం బెల్ (యు.ఎస్.ఏ).




1878 థామస్ ఆల్వా ఎడిసన్, స్వాన్ విజ్ఞానులు విద్యుద్దీపాన్ని సృష్టిస్తారు.



1881 లూయీ పాశ్చూర్ (ఫ్రాన్స్) వ్యాధి నిరోధక టీకా (వాక్సీన్) కనుగొన్నాడు.

1878 మైక్రోఫోన్ - డేవిడ్ హ్యూస్ (ఇంగ్లండు & యుఎస్ఏ)

1884 గ్రీనిచ్ ప్రధాన రేఖాంశ అంతర్జాతీయంగా గుర్తింపబడింది. ✻ ఫాబియన్ సొసైటీ వ్యవస్థాపన. ✻ లూయి వాటర్ మాన్ (యుఎస్ఏ) ఫౌంటేన్ పెన్ నిర్మాణం.

1885 కార్ల్ బెంజ్ (జర్మనీ)చే ఆటోమొబైల్ ఇంజను నిర్మాణం.

1886 జర్మనీలో దాయిమ్లర్. మొట్ట మొదటి మోటరు కారు నమూనాను రూపొందించాడు.

1895 మార్కోనీ (ఇటలీ) తీగలేకుండా (వైర్లెస్) వార్తా ప్రసారం చేశాడు. ✻ - రేను విల్హెమ్ రంజన్ ఆవిష్కరించాడు. ✻ సిగ్మండ్ ఫ్రాయిడ్ మానసిక విశ్లేషణ ప్రచురించాడు. 1895 క్యూరీ దంపతులు




రేడియంను కనుగొన్నారు.




1895 సేఫ్టీ రేజర్ - కింగ్ సి. గిలెట్టీ (యు.ఎస్.ఏ).

1899 దక్షిణాఫ్రికాలో బోయర్ యుద్ధాలు ప్రారంభం (1899 - 1902)

1898 టేప్‌రికార్డర్ - వాల్డే మీర్ పౌల్సన్ (డెన్మార్క్)

1901 రష్యాలో ట్రాన్స్ - సైబీరియన్ రైలుమార్గం వేశారు.

1903 ఆర్విల్లీ & విల్బూర్ రైట్ సోదరులు 'కిట్టీహాక్'(గాలికంటె బరువైన)లో ప్రప్రథమ విమానయానం ( డిసె. 17) చేశారు.

1906 విటమిన్‌లను హాప్కిన్స్ కనుగొన్నారు.

1907 న్యూజిలాండ్‌కు డొమినియన్ ప్రతి పత్తి.

1909 పియరీ ఉత్తర ధృవాన్ని చేరాడు. ✻ బ్లేరియట్ విమానం మీద ఇంగ్లీషు ఛానెల్‌ను దాటాడు ; ✻ దక్షిణ ఆఫ్రికా యూనియన్ రూపొందింది; ✻ హెన్రీ ఫోర్డ్ (అమెరికాలో) చౌకగా మోడలు 'T' మోటారుకారును తయారుచేశాడు. ✻ అముండ్సన్ దక్షిణ ధ్రువాన్ని చేరాడు. (డిసెంబరు 14).

1910 జార్జి V ( 1865 - 1936) బ్రిటిష సింహాసనాన్ని అధిష్ఠించాడు.

1911 చీనాలో విప్లవం.

1912 సన్ యెట్-సెన్ నాయకత్వంలో చీనా గణరాజ్యమయింది.

1914 ప్రథమ ప్రపంచ యుద్ధం ప్రారంభం (1914 - 1918)

1917 రష్యాలో విప్లవం, లెనిన్ రష్యాధినేత.

1919 పారిస్‌లో శాంతి సమావేశం ; ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం యథార్థతను సంపూర్ణ సూర్యగ్రహణం రోజున ( మార్చి 29 ) ప్రయోగాలద్వారా నిరూపణ.

1920 నానాజాతి సమితి సమావేశం. ※ఓటోమన్ సామ్రాజ్యం విచ్ఛిన్నం.

1924 లెనిన్ మరణానంతరం స్టాలిన్ రష్యాధి నేత అయ్యాడు.

1925 టెలివిజన్ నిర్మాణం - జాన్ బెయిర్డ్ (స్కాట్లండ్).

1929 గ్రాఫ్ జెప్లిన్ (జర్మన్) 'గాలి ఓడలో' ఖండాంతర వైమానిక యానాలు ప్రయత్నిస్తాడు. ※అమెరికాలో ఆర్థిక మాంద్యం - వాల్‌స్ట్రీట్‌లో సంక్షోభం (నవం. 30)

1930 జెట్ ఇంజన్ ఫ్రాంక్ విటిల్ (ఇంగ్లండు) నిర్మించాడు.

1933 హిట్లర్ జర్మనీ ఛాన్సలర్‌గా నియంతృత్వ పాలన.

1935 నైలాన్ - వాలెస్ కరోతర్స్(ఇంగ్లండు) కనుగొన్నారు.

1936 ఇంగ్లండ్ గద్దెమీద ఎడ్వర్డ్ VIII రాజు అయ్యాడు. కాని ఆయన సింహాసనాన్ని త్యజించగా జార్జి VI పట్టాభిషిక్తుడయ్యాడు.

1937 చీనాను ఆక్రమించడానికి జపాన్ దాడి.

1938 బాల్ పాయింట్- నిర్మాణం - లాడ్జి స్లావూబిరో (హంగేరీ).

1938 ఛాంబర్లేను, డాల్డియర్, హిట్లర్, ముస్సోలినీ మధ్య ఒడంబడిక ( సెప్టె. 29)

1939 (సెప్టెంబరు 1) ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభం ( 1939 - 45)

1940 విన్‌స్టన్ చర్చిల్ బ్రిటిషు ప్రధాని.

1945 ఎలక్ట్రానిక్ కంప్యూటర్ జె.ప్రెస్పర్ ఎకర్ట్ (యుఎస్ఏ) జాన్ మెకాలే (యుఎస్ఏ)

1945 ఐక్య రాజ్య సమితి ( ఐ.రా.స) పుట్టుక. శాన్ ఫ్రాన్సిస్కోలో 50 దేశాల ప్రతినిధులు సమావేశమై నియమావళిపై సంతకాలు చేశారు.

1945 హిరోషిమా, నాగసాకీ ( ఆగ. 9 ) పై ఆటంబాబు ప్రయోగంతో ద్వితీయ ప్రపంచ యుద్ధం ముగిసింది.

1946 నూరెన్‌బర్గ్ విచారణలో నాజీల ఉరితీత. ※ ఐ.రా.స న్యూయార్క్‌లో ప్రథమ సమావేశం (అక్టోబరు 24)

1947 భారతదేశానికి స్వాతంత్ర్యం ఆగస్టు 15

1948 ట్రాన్సిస్టర్ ఉపయోగంలోకి వచ్చింది.

1949 మావో నాయకత్వంలో చీనాలో ప్రజా గణ రాజ్యస్థాపన.

1950 భారత దేశం గణ రాజ్యం ( రిపబ్లిక్) అయింది.

1952 దక్షిణ ఆఫ్రికాలో వర్ణవ్యత్యాసాన్ని నిరసిస్తూ సత్యాగ్రహాలు ; ఎలిజబత్తు II ※ ఇంగ్లండ్ రాణీ అయ్యింది. 1953 హిలరీ, టెన్సింగ్ ఎవరెస్ట్ శిఖరారోహణ (మే 29) ※రష్యాలో హైడ్రోజన్ బాంబు పరీక్ష ※స్టాలిన్ నిర్యాణం తరువాత కృశ్చెవ్ రష్యాధినేత.

1954 అమెరికా వారు బికినీలో హైడ్రోజన్ బాంబును పరీక్ష చేశారు.

1955 పరమాణు శక్తి వినియోగంలో బ్రిటన్ అమెరికాల సహకారం - జినీవాలో సమావేశం; ※ గ్రంథప్రచురణ యూనివర్సల్ కాపీరైట్ కన్వెషన్ ఆచరణలోకి వచ్చింది.

1956 బుద్ధ జయంతి (2500); ※ సూయజ్

కాలువ కంపెనీని ఈజిప్టు అధినేత నాసర్ జాతీయకరణ చేశాడు.

1957 రష్యాచే మొట్టమొదటి కృత్రిమ ఉపగ్రహం ('లైకా'కుక్క) ప్రయోగం.

1958 రష్యావారి స్పూత్నిక్ 1 భూమిచుట్టూ 688 లక్షల కి.మీ.తిరిగి 11367 సార్లు ప్రదక్షిణం చేసింది; ✻ అమెరికాలో ఎక్స్‌ప్లోరర్ 1 కృత్రిమ ఉపగ్రహ ప్రయోగం.

1959 టిబెట్టులో (చీనా) బహిష్కరించగా దలైలామా భారత దేశ శరణు అర్థించాడు.

1960 దక్షిణ ఆఫ్రికాలో వర్గ వైషమ్యం షార్ప్‌విల్లీ దురంతంలో 67 మందిని కాల్చి చంపారు. ✻ అప్పర్ వోల్టా, కాంగో, నైజీరియా దేశాలకు స్వాతంత్ర్యం. లేజర్‌ను కనిపెట్టిన వారు - థియోడోర్ మెయిమాన్ (యు.ఎస్.ఏ)

1961 కంప్యూటర్‌లో సిలికాన్ చిప్ ప్రయోగం. రష్యాలో యూరీ గెగారిన్ (1943 -68) (ఏప్రి.17) ప్రప్రథమ రోదసీయానం చేసి జయప్రదంగా భూమికి తిరిగి వచ్చాడు.

1962 బురుండీ,రువాండా, జమైకా, ట్రినిడాడ్ - టుబాగో స్వాతంత్ర్యం పొందాయి. అమెరికా - యూరప్ మధ్య టెల్‌స్టార్ మొట్టమొదటి కృత్రిమ ఉపగ్రహం ద్వారా ప్రత్యక్ష టి.వి.ప్రసారం ✻ పరమాణు శక్తిని వినియోగించి 'సవన్నా' నౌక ప్రయాణం. రష్యా అంగారక గ్రహానికి రోదసీ వాహనాన్ని పంపింది.

1963 మలేసియా ప్రాదుర్భావం. ✻ అమెరికా అధ్యక్షుడు కెనెడీ హత్య. ✻ జాంజిబార్, కెన్యా స్వాతంత్ర్యం పొందాయి. ✻ రష్యాలో బ్రెజ్నెవ్ అధినేత అయ్యాడు.

1965 గాంబియా స్వాతంత్ర్యం పొందింది. ✻ "ఎర్లీబర్డ్" వార్తాప్రసార కృత్రిమ ఉపగ్రహం పని చేయడం ప్రారంభం. ✻ తూర్పు పాకిస్తాన్‌లో ఉప్పెన, 16,000 మరణించారు. ✻ టెలివిజన్ ప్రసారాల్లో మొదటిసారిగా సిగరెట్టు ప్రచారం నిషేధం.

1966 చంద్రమండలం మీదకు రష్యా లూనా - 9, అమెరికా జెమినీ - 10 చేరాయి. ✻ బార్బోడాస్, బోత్స్వానా, మలావీ గణ రాజ్యా లయ్యాయి. ✻ చీనాలో సాంస్కృతిక విప్లవం ప్రారంభం.

1967 బ్రిటన్‌లో కలర్ టెలివిజన్ ( బి.బి.సి) ప్రారంభం. ✻ కేప్‌టౌన్‌లో ప్రప్రథమ మానవ గుండె మార్పిడి శస్త్రచికిత్స ( బెర్నార్డ్)

1968 అమెరికా (మెమ్ఫిస్)లో నీగ్రో పౌర హక్కుల నాయకుడు మార్టిన్ లూథర్ కింగ్ (జా) హత్య.



1969 శబ్దవేగాతీత కొంకార్డ్'. మొట్ట మొదటి పయనం.

1969 చంద్రమండలంపై కాలు పెట్టిన మొదటి మానవుడు నీల్ ఆర్మ్ స్ట్రాంగ్. (జూలై 21)

1970 థాలిడమైడ్‌వల్ల వికలాంగులైన పిల్లలకు వారి తల్లితండ్రులకు నష్టపరిహారం ఇవ్వమని కోర్టు తీర్పు.

1971 ఈజిప్టు - రష్యా 15 ఏళ్ల సహకార ఒప్పందం ✻ చీనాకు ఐ.రా.స. సభ్యత్వం. ✻ బంగ్లాదేశ్ అవతరణ డిసెంబరు.

1972 అమెరికా అధ్యక్షుడు రిచర్డ్ నిక్సన్ సుహృద్భావ సమాలోచనలకై మాస్కో సందర్శన.

1973 'స్కైలాబ్'లో 59 రోజులు ఉండి

వ్యోమగాములు సురక్షితంగా భూమిమీదకు తిరిగి వచ్చారు * అరబ్బు - ఇజ్రాయెల్ యుద్ధం.

1974 జర్మనీలో విలియమ్ బ్రాన్డ్ట్ ఛాన్సలర్ పదవికి రాజీనామా. * అమెరికాలో రిచర్డ్ నిక్సన్ రాజీనామా.

1975 షేక్ ముజిబర్ రహమాన్ (బంగ్లాదేశ్) హత్య. * అంగోలాకు స్వాతంత్ర్యం.

1978 ప్రపంచంలో మశూచి నిర్మూలన అయిందని ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రకటన; * డొమనికాకు స్వాతంత్ర్యం.

1979 బ్రిటన్‌లో మార్గరెట్ తాచర్ మహిళా ప్రధాని.* ఇరాన్‌లో అమొతుల్లా ఖోమేనీ అధినేత.

1980 ఇరాన్ - ఇరాక్ ( సెప్టె.) యుద్ధం.

1983 'గాంధీజీ' జీవితంపై ఆటెన్‌బరో చలనచిత్రం నిర్మించాడు. * సౌర కుటుంబం దాటి పయనించడానికి అమెరికా వారు పయోనీర్ - 10 రోదసీ వాహనాన్ని పంపారు (జూన్ 13)

1984 రెండవసారి. రోనాల్డ్ రీగన్ అమెరికా అధ్యక్షుడయ్యాడు. * హాంగ్‌కాంగ్ భవితవ్యంపై బ్రిటిషు చీనా అధికార్ల (1997లో అప్పగించడానికి) ఒప్పందం.

1985 దక్షిణ ఆఫ్రికాపై అమెరికా పరిమిత ఆంక్షలు విధించింది.

1986 గోర్బచెవ్ బహిరంగ రాజనీతి (గ్లాస్ నాత్) పునర్వ్యవస్థీరకణ పెరిస్ట్రోయికా) వినూత్న రాజకీయ భావాల్ని ప్రవేశ పెట్టాడు.

1989 భూతలం నుండి బయలు దేరిన వాయేజర్ - 2 రోదసీ యానం చేసి సుమారు రెండేళ్ల తరువాత 1989 ఆగస్టు 24 నాడు సౌర కుటుంబంలో ఆఖరి గ్రహమయిన నెప్ట్యూన్ తోనూ అయిదు గంటల తర్వాత దాని ఉప గ్రహం ట్రిటాన్ తోనూ సమాగమమయింది.

1990 నెల్సన్ మండేలా చెరనుండి విడుదల. (ఫిబ్ర 10) -* దక్షిణ ఆఫ్రికాలో 'అపార్తిటి' జాత్యాహంకారం అంతం.

1991 డిసె. సోవియట్ రష్యా విభజన అయి 15 విడి రాజ్యాలుగా విడి పోయాయి.

1992 యుగోస్లావియా, జెకోస్లావియా విభజన అయ్యాయి.

1992 క్లింటన్ అమెరికా అధ్యక్షుడు.



1993 కుమారతుంగా చంద్రిక శ్రీలంక ప్రధాని.

1996 క్లింటన్ రెండవసారి అమెరికా అధ్యక్షు డుగా ఎన్నిక.

1997 'క్లోనింగ్' ద్వారా 'డాలీ' గొర్రెని విల్మట్ సృష్టించాడు. * విల్మట్ హాంగ్‌కాంగ్ పాలన గ్రేట్ బ్రిటన్ నుండి చీనా అధీనమైంది. (జూలై 1)



క్లోనింగ్ ప్రక్రియ ద్వారా 'సృష్టికి ప్రతిసృష్టి' 'డాలీ' గొర్రెపిల్ల



# భారత దేశం సంగ్రహ స్వరూపం

**భా**రతదేశం సర్వసత్తాక గణతంత్ర రాజ్యం. ఈ దేశాన్ని 'భరత వర్షమ'నీ, 'భారత్' అనీ 'ఇండియా' అని కూడ వ్యవహరిస్తారు. అయిదు వేల ఏళ్లనాటి వైభవోపేతమైన ఘన చరిత్ర గల దేశం. మౌర్యులు, సాతవాహనులు, గుప్తులు, కుషానులు, మొగలాయి రాజవంశాలు పాలించిన గొప్ప దేశం. పోర్చుగీసు నావికుడు వాస్కోడిగామా భారతదేశానికి (1498) సముద్రమార్గం కనిపెట్టిన తర్వాత విదేశీయుల వర్తక వాణిజ్యాలకు మార్గం సుగమమైంది. అలా భారత దేశానికి వచ్చిన వారిలో వలాందుల (ఢచ్చి-నెదర్లాండ్స్), ఫ్రెంచి, బ్రిటిషు వారున్నారు. అయితే వారిలో అందరూ ఫ్యాక్టరీ (గిడ్డంగు)లు స్థాపించినా చివరకు రాజ్యపాలన బ్రిటిషు వారికి చిక్కింది. అలా వారు దాదాపు 200 ఏళ్లు పాలించి గాంధీ నాయకత్వంలో సాగిన స్వాతంత్ర్యోద్యమ పోరాట ఫలితంగా బ్రిటిషు పాలననుండి విముక్తి పొంది 1947 ఆగస్టు 15 నాడు స్వతంత్ర మైంది. ఆ తర్వాత ఒక రాజ్యాంగాన్ని సిద్ధపరచుకొని 1950 జనవరి 26 నాడు సర్వసత్తాక గణతంత్ర రాజ్య మయింది. చీనా తరవాత ప్రపంచంలోనే అత్యధిక జనాభా గల ప్రజాస్వామ్య దేశాలలో అగ్రగామి భారతదేశం.

## చారిత్రక భారతదేశం

క్రీ.పూ. 3750 నుండి క్రీ.పూ. 1500 వరకూ ప్రాదుర్భవించి మనిన సింధు నాగరికత పరిఢవిల్లిన దేశం భారతదేశం. ఈ నాగరికత సుమేరియా ఈజిప్టు నాగరికతల కంటే మిన్న అని విజ్ఞుల అభిప్రాయం. వేదాలు, ఆరణ్యకాలు, బ్రాహ్మణాలు, షడ్దర్శనాలూ, ఉపనిషత్తులూ బ్రహ్మ సూత్రాల కూర్పు, 'మనుస్మృతి', మహాభారత రామాయణ భాగవతాది కావ్యాలూ అష్టాదశ పురాణేతిహాసాలూ, శిలప్పదికారం, తిరుక్కురళ్ నీతిశాస్త్రం వంటి మహా కావ్యాలను బ్రహ్మాండంగా అల్లి ప్రపంచానికి అందించిన దేశమిది. బౌద్ధాన్ని ప్రవచించిన గౌతమ బుద్ధుడు, జైనమత వ్యవస్థాపకుడు మహావీరుడు వెలసిన దేశం ఇది. ఉత్తరాదిని మౌర్యులు, గుప్తులు దక్షిణాదిన కాకతీయులు, చోళ వంశీయులు (రాజ రాజ చోళుడు), రాయల రాజ వంశీయులు పాలించి స్వర్ణ యుగాలను సృష్టించారు. క్రీ.శ. 4 - 8 శతాబ్దాల మధ్య దక్షిణాదిన 12 మంది - ద్వాదశ ఆళ్వార్లు, 63 శైవ సిద్ధాంత ప్రవక్తలు - అరవత్తి మూవర్లు హిందూ ధర్మ పునరుద్ధరణకు అవిరళ కృషి చేశారు. ఇలాగనే దక్షిణాదిన కాలడిలో జన్మించిన అద్వైతమత ప్రవక్త ఆదిశంకరాచార్యులూ విశిష్టా ద్వైత ప్రవక్త శ్రీ పెరంబ దూరు రామానుజాచార్యులు, ద్వైతమత ప్రవక్త ఉడిపి మధ్వాచార్యులు, శుద్ధాద్వైత మత ప్రవక్త కోనసీమ వల్లభాచార్య మున్నగు వారు పావనం చేసిన దేశం. సూరదాసు, కబీరుదాసు, తుకారామ్, జ్ఞానేశ్వర్,

## భారతదేశం కొన్ని వివరాలు

| | రాష్ట్రం | విస్తీర్ణం చ.కి.మీ. | జనాభా | రాజధాని | అక్షరాస్యత శాతం |
|---|---|---|---|---|---|
| | భారతదేశం | 31,66,414,00 | 84,63,000,00 | న్యూఢిల్లీ | 52% |
| 1. | అరుణాచల్ ప్రదేశ్ | 83,743,00 | 86,45,580 | ఇతానగర్ | 41.59% |
| 2 | అస్సాం | 78,438.00 | 2,24,14,322 | ప్రాగ్జ్యోతిస్పురా | 52.89% |
| 3. | ఆంధ్రప్రదేశ్ | 2,65,04,500 | 6,65,00,000 | హైదరాబాదు | 44..00% |
| 4. | ఉత్తరప్రదేశ్ | 2,94,411.00 | 13,91,12,287 | లక్నో | 41% |
| 5. | ఒరిస్సా | 1,55,707.00 | 3,16,59,936 | భువనేశ్వర్ | 49.00% |
| 6. | కర్నాటక | 1,91,791.00 | 4,49,77,4 | బెంగుళూరు | 56.04% |
| 7. | కేరళ | 38,86,300.00 | 2,30,98,518 | తిరువనంతపురం | 89.91% |
| 8. | గుజరాతు | 1,96,024.00 | 4,13,09,582 | గాంధీనగర్ | 61.29% |
| 9. | గోవా | 3,702.00 | 11,29,793 | పానాజీ | 75.29% |
| 10. | జమ్మూ & కాశ్మీర్ | 1,01,387.00 | 77,00,000 | శ్రీనగర్/జమ్మూ | 75.29% |
| 11. | తమిళనాడు | 1,30,058.00 | 5,58,58,946 | చెన్నై | 62.66% |
| 12. | త్రిపురా | 10,486.00 | 28,00,000 | అగర్తలా | 60.44% |
| 13. | నాగాలాండ్ | 6,579.00 | 12,09,005 | కోహిమా | 61.65% |
| 14. | పంజాబు | 50,362.00 | 20,28,196 | చండీగడ్ | 58.53% |
| 15. | పశ్చిమబెంగాలు | 88,752.00 | 6,60,97,965 | కలకత్తా | 57.70% |
| 16. | బీహారు | 1,73,877.00 | 8,63,74,465 | పాట్నా | 38.48% |
| 17. | మధ్యప్రదేశ్ | 4,43,446.00 | 6,61,81,170 | భోపాల్ | 44.20% |
| 18. | మణిపూర్ | 22,327.00 | 18,37,149 | ఇంఫాల్ | 59.89% |
| 19. | మహారాష్ట్ర | 2,55,252.00 | 7,89,37,187 | ముంబాయి | 64.87% |
| 20. | మిజోరామ్ | 21,081.00 | 6,89,756 | అయిజాపీ | 82.27% |
| 21. | మేఘాలయా | 22,429.00 | 17,74,778 | షిల్లాంగ్ | 49.10% |
| 22. | రాజస్థాన్ | 3,42,239.00 | 4,40,05,990 | జయపూర్ | 38.55% |
| 23. | సిక్కిమ్ | 7,096.00 | 4,06,457 | గాంగ్‌టక్ | 56.94% |
| 24. | హర్యానా | 44,212.00 | 1,64,63,648 | చండీగఢ్ | 55.85% |
| 25. | హిమాచల్‌ప్రదేశ్ | 55,673.00 | 5,17,087 | సిమ్లా | 63.86% |
| | **కేంద్రపాలిత ప్రాంతాలు (యూనియన్ టెరిటరీస్)** | | | | |
| | అండమాన్ & నికోబార్ దీవులు | 8,249.00 | 2,80,661 | పోర్ట్ బ్లెయిర్ | 73.02% |
| | చండీగడ్ | 114.00 | 6,42,015 | చండీగడ్ | 77.8% |
| | డామన్ & డయ్యూ | 112.00 | | - | 71.20% |
| | ఢిల్లీ | 1,483.00 | 94,20,644 | ఢిల్లీ | 75.29% |
| | దాద్రా & నాగర్ హవేలీ | 491.00 | 1,01,586 | సిల్వాసా | 40.71% |
| | పాండిచ్చేరి | 492.00 | 8,07,785 | పాండిచ్చేరి | 74.74% |
| | లక్షదీవులు | 32.00 | 51,707 | కవరట్టీ | 81.78% |

మీరాబాయి, కృష్ణ చైతన్య, వీర బ్రహ్మేంద్రస్వామి మున్నగు భక్త కవులు ఆయా కాలాల్లో నివసించారు. ఈ దేశంలో వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, మాఘుడు, బాణుడు, భాసుడు, శూద్రకుడు, తిరువళ్లువర్, ఇలాంగో అడిగళ్, కంబర్ ఇత్యాది మహాకవులెందరో సృజనాత్మకమయిన మహాకావ్యాల్ని అందించారు. ధన్వంతరి, చరకుడు, సుశ్రుతుడు, వాగ్భటుడు వంటి శాస్త్ర వేత్తలు ఆయుర్వేద చికిత్సా విధానాన్ని సువ్యవస్థీకరించి అందించారు. ప్రపంచానికి శూన్యం (సున్నా - "0") అన్న గణిత భావాన్నీ దశాంశ పద్ధతినీ అందించింది భారతదేశమే. కణాదుడు అనుపేరు గల శాస్త్రవేత్త పరమాణు స్వరూపాన్ని రెండు వేల ఏళ్లనాడే నిర్వచించాడు. గణిత ఖగోళశాస్త్ర రంగాల్లో విశేష కృషి చేసిన ఒకప్పటి ఆర్యభటుడు, భాస్కరాచార్యుడు, వరాహమిహిరుడు, ఇటీవలి శ్రీనివాస రామానుజన్ భారతీయులే.

ఇనుపరాయి, నేలబొగ్గు, బాక్సైటు, మాంగనీసు, రాగి, జింకు, మైకా, పెట్రోలు, చమురు వాయువు, డోలమైటు, బంగారం వంటి విలువైన ఖనిజ నిక్షేపాలెన్నో ఉన్నాయి. భారతదేశానికి గల జల సంపద ప్రపంచంలో మరి కొద్ది దేశాలకే ఉంది. సింధు నదీ దాని అయిదు ఉపనదులూ గంగా యమునా నదులు, బ్రహ్మపుత్రా నది, నర్మదా తపతీ నదులు, మహానది, గోదావరి, కృష్ణా, పెన్నా, కావేరీ తామ్రపర్ణి వంటి నదీ సంపదతో ఏడాది పొడవునా పారే జీవనదులు. ఈ జలసంపదను సద్వినియోగం చేసుకోవడానికి ఇటీవల ఆయా నదులపై భారీ డాములు, ఆనకట్టలు, బరాజులు నిర్మించి పంట పొలాలకు సాగునీటిని పారించి వరి, గోధుమ, జొన్న వంటి ఆహారధాన్యాల్నీ, ప్రత్తి, చెరుకు వంటి వాణిజ్య పంటల్నీ పండిస్తున్నారు. కేరళ, కర్నాటక, తమిళనాడు రాష్ట్రాలు కాఫీ, టీ, సుగంధ ద్రవ్యాలు (ఏలకులు, మిరియాలు వగైరా) తోట పంట దినుసులు పండించి విదేశీ వాణిజ్యం ఆర్జిస్తున్నారు. భారత దేశాన్ని ఉత్తరాదిని హిమాలయాలు పెట్టని గోడల వలె రక్షిస్తున్నాయి. మిగతా మూడు వైపులా సుదీర్ఘమైన కోస్తా తీర ప్రాంతం మత్స్య సంపదకు ఆలవాలమవగా పులి రొయ్య వంటి అత్యధిక విలువ గల మత్స్య వుత్పత్తులను పండించి ఎగుమతి చేస్తున్నారు. దేశం నలుమూలలా పశు సంపద సమృద్ధిగా ఉంది. గొర్రె, మేక, ఆవు, గేదె, కోడి వంటి రకరకాల పశు జాతికి పేరొందింది. ఇలా రాసిలోనూ, వాసిలోనూ ఇంత సిరి సంపదలతో తులతూగే భారతదేశం రత్న గర్భగా పేరు ప్రఖ్యాతులు ఆర్జించడంతో చారిత్రకంగా పెక్కు సార్లు అనేకమైన విదేశీ రాజవంశాలను ఆకర్షించింది. మధ్య ఆసియా నుండి ఆర్యులు, మాసిడోనియా నుండి అలెగ్జాండరు, పశ్చిమ ఆసియా నుండి మహమ్మదు గజనీ, మధ్య ఆసియా నుండి మొగలాయీలు భారత దేశంపై దండయాత్రలు జరిపారు. అంతకు ముందు నందులు, మౌర్యులు, శాతవాహనులు, కుషాణులు, గుప్తులు, పల్లవులు, చేర, పాండ్య, చోళ, చాళుక్య రాజ్య వంశాలు దేశాన్ని మొత్తంగాను పాక్షికంగాను పాలించాయి. పైన వివరించినట్టు భారతదేశానికి సముద్ర మార్గం ఏర్పడిన తర్వాత

డచ్చి, ఫ్రెంచి, బ్రిటిషు, పోర్చుగీసు వర్తక వాణిజ్య కార్యకలాపాలకై భారతదేశానికి వచ్చి అప్పటి పాలకులలోని అనైక్యతను ఆసరాగా తీసికొని కొన్ని ప్రాంతాలు కైవసం చేసు కొని స్థావరాలు ఏర్పరచుకుని చాలకాలం (17 నుండి 19శతా.) పాటు వలస పాలన సాగించారు.

## స్వాతంత్ర్య పోరాటం

బ్రిటిషు వర్తకుల (బ్రిటిషు ఈస్టిండియా కంపెనీ) ఏలిక సమయాన 1857లో ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం ప్రారంభమయింది. దీనినే 'సిపాయిల తిరుగుబాటు' అని చరిత్ర కారులు అభివర్ణించారు. ఆ తరువాత 1858లో భారతదేశ పాలన బ్రిటిషు క్రౌన్ పాలన కిందికి తెస్తూ విక్టోరియా మహారాణి ప్రకటించింది. స్వాతంత్ర పిపాసువులు కొందరు 'భారత జాతీయ కాంగ్రెసు' అను సంస్థను (1885) స్థాపిం చారు. తర్వాత లాల్-పాల్-బాల్ నాయకత్వంలో స్వాతంత్ర్య పోరాట ఘట్టం ఊపునందుకొంది. 1908లో 'స్వరాజ్యం నా జన్మహక్కు - దానిని సాధించి తీరు తాను', అని బాలగంగాధర్ తిలక్ ఎలుగెత్తి అరిచారు. సురేంద్రనాథ్ బెనర్జీ వంటి మహా నాటకులు స్వదేశీ ఉద్యమాల్ని చేవట్టి ప్రజలలో రాజకీయచైతన్యం ఇనుమడింప చేశారు.

ఇలా స్వాతంత్ర్య పోరాటం కాంగ్రెసు ఆధ్వర్యంలో సాగుతుండగా 1915లో దక్షిణ ఆఫ్రికా నుంచి స్వదేశానికి తిరిగి వచ్చిన తక్షణం మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ భారత రాజకీయరంగ ప్రవేశం చేశారు. ఆయన నాయకత్వం లభించడం దేశప్రజల అదృష్టం. అందుకే ఆయనను 'జాతి పిత' గా గౌరవిస్తున్నారు. గాంధీ రాజకీయ నాయకత్వంలో సత్యాగ్రహమనే ఆయుధంతో అహింసా సిద్ధాంతాన్ని పాటిస్తూ శాసనోల్లంఘన, సహాయ నిరాకరణ (1921), ఉప్పు సత్యాగ్రహం (1930), క్విట్ ఇండియా (1942) వంటి అనేక మహోద్యమాలు నిర్వహించబడగా రక్తరహిత విప్లవం ద్వారా 1947 ఆగస్టు 15 నాడు స్వాతంత్ర్యాన్ని సంతరించుకున్న దేశం భారతదేశం. ఈ కార్యక్రమంలోని భాగంగానే విదేశీ సరుకులను తగుల బెట్టడం ఆనాడు ఒక ఉద్యమంగా నడిపారు. విప్లవ వీరులు అల్లూరి సీతారామరాజు, భగత్ సింగ్, నేతాజీ వంటి అనేక మంది యోధులు అమరవీరులయ్యారు.

## స్వాతంత్ర్యానంతర భారతదేశం

స్వాతంత్ర్యానంతరం భారత దేశ పాలనకు జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వం లభించడం భారత ప్రజల అదృష్టం. నెహ్రూ చారిత్రక అవగాహన గల మహా మనీషి. పాశ్చాత్య అభ్యుదయ భావాల్ని బాగా జీర్ణించుకున్న మహా మేధావి. సమ సమాజ సోషలిస్టు భావాలు గలవాడు. దూరదృష్టి గలవాడు. గాంధీజీకి రాజకీయ వారసుడు. ఇన్ని ఉత్తమ నాయకత్వ లక్షణాలు కలబోసిన ఆయన ప్రప్రథమ భారత ప్రధాని అయ్యాడు. ఆ తర్వాత రాజ్యాంగ నిర్మాణానికి మొదట సత్యనారాయణ సిన్హా పిదప రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన పండిత పరిషత్తు - 'రాజ్యాంగ పరిషత్తు' ఏర్పడి రాజ్యాంగాన్ని సిద్ధపరచుకొని 1950 జనవరి 26 నాడు భారతదేశం సర్వసత్తాక గణతంత్ర

వ్యవస్థగా రూపుగొన్నది. రాజ్యాంగంలో 8వ షెడ్యూలులో గుర్తించిన ఈ 15 భాషా సంస్కృతుల ఆధారంగా 1956లో భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా భారతదేశం పునర్వ్యవస్థీకరింప బడింది. వీటిలో సంస్కృతానికీ, సింధీకి ప్రత్యేక రాష్ట్రాలు లేవు.

ఆర్థిక వ్యవస్థ రాజ్యాంగ నియమావళికి లోబడి మిశ్రమ ఆర్థికవ్యవస్థ (మిక్సెడ్ ఎకానమీ)ను చేపట్టి గణతంత్ర పాలన సాగించు కుంటున్న ప్రజాస్వామిక దేశం భారత దేశం. నిష్ణాతు లయిన స్వదేశీ నిపుణులు 1951 నుండి రూపొం దించి ఇప్పటికి (1996) ఎనిమిది పంచవర్ష ప్రణాళికల్ని సిద్ధ పరచుకొని, సహజ వనరుల్ని సమీకరించి సద్వినియోగపరచు కుంటున్న దేశం భారత దేశం. భాక్రా - నంగల్, నాగార్జునసాగర్, శ్రీశైలం ప్రాజెక్టు, శ్రీరామసాగర్ వంటి భారీ డాము లెన్నిటినో నిర్మించి నదీజల సంపదను కాలువ వ్యవస్థ ద్వారా పంటనీటిని పొలాలకు మళ్లించి అధిక దిగుబడి వంగడాల్ని రసాయన ఎరువుల్ని ఆధునిక శాస్త్రీయ సేద్య పద్ధతుల్ని రైతాంగానికి అందించగా 'హరిత విప్లవం' (గ్రీన్ రివల్యూషన్) దేశంలో సంభవించింది (1970). ఉన్నత సాంకేతిక విద్యావనరులను పెంచి దేశ పారిశ్రామికాభ్యుదయస్థాయిని ద్విగుణీకరించు కొనటయే గాక స్వయంకృషి ద్వారా ఆహార పంటల దిగు బడిలో స్వయం సమృద్ధిని సాధించు కుంటూ అదనపు పంట దినుసుల్ని విదేశాలకు ఎగుమతి చేసి విదేశీ మారకం పొందు పరచుకో గలగటం గమనించాలి. శాస్త్రీయంగా పశు సంపద గుణ గణాభి వృద్ధిని సాధించి పాల దిగుబడి పెరిగి 'శ్వేత విప్లవం' (వైట్ రివల్యూషన్) సంభవించి (1980) క్షీరోత్పత్తులు అందరికీ అందు తున్నాయి. భారత దేశ కోస్తా తీరం దేశానికి మూడు వైపులా ఉంది. దాని నిడివి సుమారు 7500 కి.మీ. దీన్ని ప్రణాళికా బద్ధంగా అభివృద్ధి చేయడంతో చేపలు, రొయ్యల దిగుబడి పెరిగింది (1990). ఇటీవల కోస్తా తీరాల్లో ముఖ్యంగా ఉప్పునీటి కయ్యలు ఉన్న చోట ఉప్పాటేయలు ఉన్నచోట భారీ స్థాయిలో రొయ్యల ఉత్పత్తిక్షేత్రాలలో

**భారత దేశం ప్రధానమైన వివరాలు–**

ఉనికి : 68; 7′ - 98; 25′ తూర్పు రేఖాంశాలు.
8;4′ - 97;6′ ఉత్తర అంక్షాంశాలు.
రాజధాని : న్యూ ఢిల్లీ
విస్తీర్ణం : 32,87,263 చ.కి.మీ.
చుట్టు సరిహద్దు రేఖ పొడవు : 15,200 కి.మీ.
ఉత్తర-దక్షిణ దూరం (కాశ్మీర-కన్యాకుమారి) : 3214 కి.మీ.
తూర్పు - పడమర దూరం : 2933 కి.మీ.
జనాభా : 95 కోట్లు అంచనా (1996)
పట్టణ జనాభా : 23% (1991)
గ్రామీణ జనాభా : 77 %
అక్షరాస్యత: 52% (1991)
అధికార భాష : హిందీ, సహ భాష ఇంగ్లీషు.
(రాజ్యాంగం 8వ షెడ్యూల్‌లో పేర్కొన్న భాషలు- ఆయా రాష్ట్రాల్లో అధికార భాషలు (సింధీ, సంస్కృతం తప్ప) : అస్సామీ, ఉర్దూ, ఒరియా, కన్నడం, కాశ్మీరీ, గుజరాతీ, తమిళం, తెలుగు, పంజాబీ, బెంగాలీ, మరాఠీ, మలయాళం, సంస్కృతం, సింధీ, హిందీ.

మత్స్య కృషి జరుగుతూంది. ఇప్పుడు స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత పారిశ్రామికంగా అభివృద్ధి చెంది దేశంలో యంత్రపు పనిముట్లు, స్కూటర్లు, మోటారు కార్లు, రైలు పెట్టెలు, రైలు ఇంజనులు, బస్సులు ఇత్యాది రవాణా వాహన సామాగ్రి, ఇనుము - ఉక్కు, అల్యూమినియం, సిమెంటు, పంచ దార, ప్లాస్టిక్ సామాగ్రి, హై-టెక్ పరిశ్రమ అయిన కంప్యూటర్ సాఫ్ట్ వేర్, నౌకా నిర్మాణం వంటి అనేక పరిశ్రమల్లో ఇంజనీరింగు సామాగ్రి తయారై దేశావసరాలకేగాక విదేశాలకు గూడ ఎగు మతి అవుతూంది. ఇంత ప్రాచీన - ఆధునిక చరిత్ర గల భారతదేశ రిప్లబిక్ అయిదు దశాబ్దాల ఆధునిక చరిత్రగల ప్రజాస్వామ్య భారతదేశానికి సరిహద్దులు ఉత్తరాన హిమాలయ పర్వత శ్రేణులు, దక్షిణాన హిందూ మహా సముద్రం, తూర్పు న బంగాళాఖాతం, పశ్చిమాన అరేబియా సముద్రం. పొరుగున ఉత్తరాన నేపాల్, భూటాన్, చీనా, ఆఫ్ఘనిస్తాన్, దక్షిణాన శ్రీలంక, మాల్దీవులు, తూర్పున బంగ్లాదేశ్, మ్యాన్మార్ (బర్మా), పశ్చిమాన పాకిస్తాన్ ఉన్నాయి. ఈ భారతదేశపు ప్రజలు భిన్న మతవర్గాలకూ భిన్న భాషా సంస్కృతులకూ చెందిన వారు. వీరంతా కాకసాయిడ్, మంగోలాయిడ్, ద్రావిడ, నార్డిక్ ఆర్యులు, ప్రోటో - ఆస్ట్రలాయిడ్, పశ్చిమ బ్రాకీ - సెఫాలిస్, నీగ్రిటో మానవ వర్గాలకూ ఉప వర్గాలకూ చెందిన వారు.

**భారత దేశం - రాష్ట్రాలు, నగరాలు : కొత్తపేర్లు - పాతపేర్లు**

| కొత్తపేరు | పాతపేరు | కొత్తపేరు | పాతపేరు |
|---|---|---|---|
| అలంపురూ | అలెప్పీ | ఛత్రపతి శివాజీ టెర్మినస్ | విక్టోరియా టెర్మినస్ |
| అలువా | అల్వాయీ | తమిళనాడు | మద్రాసు రాష్ట్రం |
| కన్నూర్ | కననూర్ | తిరువనంతపురం | త్రివేంద్రమ్ |
| కర్ణాటక | మైసూరురాష్ట్రం | తూత్తుకుడి | టూటికోరిన్ |
| కాంచీపురం | కంజీవరం | త్రిసూర్ | ట్రిచూర్ |
| కొచ్చి | కొచ్చిన్ | పాండిచ్చేరీ | పుదుచ్చేరీ |
| కొడగు | కూర్గ | పానాజీ | పంజీమ్ |
| కొల్లం | క్వయిలాన్ | పూణే | పూనా |
| కొజికోడ్ | కాలికట్ | మడికేరీ | మెర్కరా |
| ఖెడే | ఖెరా | మైలదుత్తరై | మాయవరం |
| చింతామణి దేశ్‌ముక్ | చర్చిగేట్ | విజయవాడ | బెజవాడ |
| టెర్మినస్ (సి.ఎస్.టి)(సి.డి.టి.టెర్మినస్) | | వారణాసి | బనారస్(కాశీ) |
| చెన్నై | మద్రాసు | వైజాగ్/విశాఖపట్నం | వైజాగ్‌పట్టం/వాల్తేరు |

భారత దేశం అనేక సంస్కృతీ సంప్రదాయాలకు నిలయం. ప్రాచీన కాలంలో భరతముని నృత్య సంప్రదాయానికి సంబంధించిన 'నాట్యశాస్త్రం' అనే లక్షణ గ్రంథం అందించారు. దేశంలో ఉత్తరాదిని కథక్ నృత్యం దక్షణాది నిభరతనాట్యం, కూచిపూడి, పేరిణి, ఆంధ్రనాట్యం నృత్య సంప్రదాయాలు నైర్పతి భారతదేశం (కేరళ)లో కథకళి, మోహినీఆట్టం సంప్రదాయాలు, తూర్పున మణిపురి నృత్య సంప్రదాయం పేర్కొన దగినవి. ఇంకా సంగీత సంప్రదాయాల్లో ఉత్తరాదిని హిందూస్తానీ వాగ్గేయకారుడు తాన్‌సేన్, దక్షిణాదిని కర్నాటక సంప్రదాయంలో అన్నమయ్య, రామదాసు, తాగయ్య, ముత్తుసామి దీక్షితులు, శ్యామశాస్త్రి, స్వాతితిరునాళ్ మున్నగువారు సుప్రసిద్ధ వాగ్గేయకారులు.

స్త్రీల కట్టు, బొట్టు, తలకట్టు విషయంలో దేశవ్యాప్తంగా విభిన్న వేషభూషణ అంలకరణ సంప్రదాయాలు గోచరిస్తున్నాయి.

ఇంకను దేశంలో చిత్ర సంప్రదాయాలు పెక్కు. అజంతా ఎల్లోరా గుహలలోని వర్ణచిత్రాలు అతి ప్రాచీనమైనవి. ఇవేగాక దృశ్యకళలలో పేరెన్నిక గన్నవి కాంగ్రా, రాజస్తానీలు చెప్పుకోదగ్గవి. శిల్పకళ వాస్తుశిల్ప కళలలో సార్నాధ్, అమరావతీ, నాగార్జున కొండలలో బౌద్ధ సంప్రదాయం, దక్షిణాదిని దేవాలయ వాస్తు సంపద జగత్ప్రసిద్ధిని గన్నవి.

ఆదిమ జాతులు - గిరి జనులు ఈశాన్యంలో నాగా, దక్షిణాదిని ఇరుళ, కాడర్, గదబ, కోయ, లంబాడీ, చెంచు, సవర, గోండ్, మధ్యప్రదేశ్‌లో భిల్లు, సంతాళ్‌లు ప్రధానంగా ఉన్నారు. భారతదేశపు ప్రధాన భూభాగానికి ఆవలనున్న ప్రాంతాలు నైర్పతి దిశలో లక్షదీవులు ( కేరళ సమీపాన), తూర్పున అండమాన్ - నికోబార్ దీవులు. ఈ దీవులలో అడవుల సంపద అపారం.లక్షదీవులలో కొబ్బరి విస్తారంగా పండుతుంది.

## భారతీయ స్త్రీ - కట్టుబొట్టు జుట్టు తీరుతెన్నులు














# భారత రాజ్యాంగం



అవిభాజ్య భారతదేశానికి 1946 డిసెంబరు 6వ తేదీన రాజ్యాంగ విధాన పరిషత్తు ఏర్పడింది. 1947 జూన్‌లో దేశవిభజన తీర్మాన ఫలితంగా ప్రత్యేక పాకిస్తాన్‌కు ఏర్పాటు జరిగిన తరువాత ఆ పరిషత్తు భారత రాజ్యాంగ నిర్మాణానికే పరిమితమైంది. పాకిస్తాన్ ప్రతినిధులు ఆ పరిషత్తు నుండి వైదొలగారు. 1947 ఆగస్టు 14నాడు రాజ్యాంగ పరిషత్తు సచ్చిదానందసిన్హా అధ్యక్షతన సమావేశమైంది. కొన్నాళ్లకు సిన్హా మరణించగా బాబూ రాజేంద్రప్రసాదు ఆ పరిషత్తుకు అధ్యక్షుడయ్యాడు. రాజ్యంగ ముసాయిదా ప్రతి ఫిబ్రవరి 1948లో సిద్ధమైంది. రాజ్యాంగానికి తుదిమెరుగులు దిద్దిన దానిని ఆమోదించారు (1949). 1950 జనవరి 26 నాడు రాజ్యాంగం అమలులోకి రావడంతో భారతదేశం 'రిపబ్లిక్' అయింది. అంటే భారతదేశం ప్రజాసత్తాక గణతంత్ర రాజ్యంగా ప్రకటితమయిందన్న మాట. ఈ రాజ్యాంగాన్ని నిర్మించిన ప్రముఖులలో వల్లభ్‌భాయి పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, ఎన్.జి. రంగా, కళావెంకటరావు, కల్లూరి సుబ్బారావు మొసలికంటి తిరుమలరావు, నీలం సంజీవ రెడ్డి, భోగరాజు పట్టాభి సీతారామయ్య, మోటూరి సత్యనారాయణ, దుర్గాబాయి, బి.ఆర్. అంబేద్కర్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, చక్రవర్తుల రాజగోపాలాచారి (రాజాజీ) ప్రభృతులు ఉన్నారు. రాజ్యాంగం అమలులోనికి వచ్చిన తర్వాత రాజ్యాంగ పరిషత్తే దేశంలో మొట్టమొదటిసారిగా సార్వత్రిక ఎన్నికలు (1952)లో జరిగే వరకూ **పార్లమెంటు** వ్యవహరించింది.

భారత రాజ్యాంగంలో ప్రధాన అంశాలు ఏమిటంటే - ప్రాథమిక హక్కులు (ఫండమెంటల్



భారత దేశం అనేక సంస్కృతీ సంప్రదాయాలకు నిలయం. ప్రాచీన కాలంలో భరతముని నృత్య సంప్రదాయానికి సంబంధించిన 'నాట్యశాస్త్రం' అనే లక్షణ గ్రంథం అందించారు. దేశంలో ఉత్తరాదిన కథక్ నృత్యం దక్షణాది నిభరతనాట్యం, కూచిపూడి, పేరిణి, ఆంధ్రనాట్యం నృత్య సంప్రదాయాలు నైర్రుతి భారతదేశం (కేరళ)లో కథకళి, మోహినీఆట్టం సంప్రదాయాలు, తూర్పున మణిపురి నృత్య సంప్రదాయం పేర్కొనదగినవి. ఇంకా సంగీత సంప్రదాయాల్లో ఉత్తరాదిని హిందూస్తానీ వాగ్గేయకారుడు తాన్‌సేన్, దక్షిణాదిని కర్నాటక సంప్రదాయంలో అన్నమయ్య, రామదాసు, తాగయ్య, ముత్తుసామి దీక్షితులు, శ్యామశాస్త్రి, స్వాతితిరునాళ్ మున్నగువారు సుప్రసిద్ధ వాగ్గేయకారులు.

స్త్రీల కట్టు, బొట్టు, తలకట్టు విషయంలో దేశవ్యాప్తంగా విభిన్న వేషభూషణ అలంకరణ సంప్రదాయాలు గోచరిస్తున్నాయి.

ఇంకను దేశంలో చిత్ర సంప్రదాయాలు పెక్కు. అజంతా ఎల్లోరా గుహలలోని వర్ణచిత్రాలు అతి ప్రాచీనమైనవి. ఇవేగాక దృశ్యకళలలో పేరెన్నిక గన్నవి కాంగ్రా, రాజస్తానీలు చెప్పుకోదగ్గవి. శిల్పకళ వాస్తుశిల్ప కళలలో సార్నాధ్, అమరావతీ, నాగార్జున కొండలలో బౌద్ధ సంప్రదాయం, దక్షిణాదిని దేవాలయ వాస్తు సంపద జగత్ప్రసిద్ధిని గన్నవి.

ఆదిమ జాతులు - గిరి జనులు ఈశాన్యంలో నాగా, దక్షిణాదిని ఇరుళ, కాడర్, గదబ, కోయ, లంబాడీ, చెంచు, సవర, గోండ్, మధ్యప్రదేశ్‌లో భిల్లు, సంతాళ్‌లు ప్రధానంగా ఉన్నారు. భారతదేశపు ప్రధాన భూభాగానికి ఆవలనున్న ప్రాంతాలు నైర్రుతి దిశలో లక్షదీవులు ( కేరళ సమీపాన), తూర్పున అండమాన్ - నికోబార్ దీవులు. ఈ దీవులలో అడవుల సంపద అపారం.లక్షదీవులలో కొబ్బరి విస్తారంగా పండుతుంది.

## భారతీయ స్త్రీ - కట్టుబొట్టు జుట్టు తీరుతెన్నులు
















# భారత రాజ్యాంగం



అవిభాజ్య భారతదేశానికి 1946 డిసెంబరు 6వ తేదీన రాజ్యాంగ విధాన పరిషత్తు ఏర్పడింది. 1947 జూన్‌లో దేశవిభజన తీర్మాన ఫలితంగా ప్రత్యేక పాకిస్తాన్‌కు ఏర్పాటు జరిగిన తరువాత ఆ పరిషత్తు భారత రాజ్యాంగ నిర్మాణానికే పరిమితమైంది. పాకిస్తాన్ ప్రతినిధులు ఆ పరిషత్తు నుండి వైదొలగారు. 1947 ఆగస్టు 14నాడు రాజ్యాంగ పరిషత్తు సచ్చిదానందసిన్హా అధ్యక్షతన సమావేశమైంది. కొన్నాళ్లకు సిన్హా మరణించగా బాబూ రాజేంద్రప్రసాదు ఆ పరిషత్తుకు అధ్యక్షుడయ్యాడు. రాజ్యంగ ముసాయిదా ప్రతి ఫిబ్రవరి 1948లో సిద్ధమైంది. రాజ్యాంగానికి తుదిమెరుగులు దిద్దిన దానిని ఆమోదించారు (1949). 1950 జనవరి 26 నాడు రాజ్యాంగం అమలులోకి రావడంతో భారతదేశం 'రిపబ్లిక్' అయింది. అంటే భారతదేశం ప్రజాసత్తాక గణతంత్ర రాజ్యంగా ప్రకటితమయిందన్న మాట. ఈ రాజ్యాంగాన్ని నిర్మించిన ప్రముఖులలో వల్లభ్‌భాయి పటేల్, జవహర్‌లాల్ నెహ్రూ, ఎన్.జి. రంగా, కళావెంకటరావు, కల్లూరి సుబ్బారావు మొసలికంటి తిరుమలరావు, నీలం సంజీవ రెడ్డి, భోగరాజు పట్టాభి సీతారామయ్య, మోటూరి సత్యనారాయణ, దుర్గాబాయి, బి.ఆర్. అంబేద్కర్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, చక్రవర్తుల రాజగోపాలాచారి (రాజాజీ) ప్రభృతులు ఉన్నారు. రాజ్యాంగం అమలులోనికి వచ్చిన తర్వాత రాజ్యాంగ పరిషత్తే దేశంలో మొట్టమొదటిసారిగా సార్వత్రిక ఎన్నికలు (1952)లో జరిగే వరకూ **పార్లమెంటు** వ్యవహరించింది.

భారత రాజ్యాంగంలో ప్రధాన అంశాలు ఏమిటంటే - ప్రాథమిక హక్కులు (ఫండమెంటల్



రైట్స్), ఆదేశికసూత్రాలు (డైరెక్టివ్ ప్రిన్సిపుల్స్), కార్యనిర్వాహక శాఖ (ఎగ్జిక్యూటివ్) రాష్ట్రపతి (ప్రెసిడెంట్), ఉపరాష్ట్రపతి (వైస్ ప్రెసిడెంట్), మంత్రి వర్గం (కేబినెట్), లోక్‌సభ, రాజ్యసభ, న్యాయవ్యవస్థ (జుడీషియరీ - సుప్రీంకోర్టు), ఎన్నికల సంస్థ (ఎలక్షన్ కమీషన్), ప్రభుత్వోద్యోగుల్ని ఎంపిక చేసి నియోగించే శాఖ (పబ్లిక్‌సర్వీసెస్ కమీషన్) - ఈ అంగాల ఏర్పాటు - హక్కులు, విధులు, నిర్వహణ నిర్దుష్టంగా రాజ్యాంగంలో పొందుపరిచారు. ఇందులో లోక్‌సభను 'దిగువ సభ' అనీ లేదా ప్రజాప్రతినిధుల సభ అనీ రాష్ట్రాల ప్రతినిధులతో కూడిన రాజ్యసభను 'ఎగువసభ' అనీ అంటారు. లోక్‌సభ, రాజ్యసభ కలసి ఉమ్మడిగా 'పార్లమెంటు' అవుతుంది. దేశావసరాలకు తగినట్టు ప్రజాహిత శాసనావళినీ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠం చేసే శాసనాలను ఎప్పటికప్పుడు సిద్ధపరచడం పార్లమెంటు విధులలో ప్రముఖమైనవి. రాజ్యాంగానికి మొట్ట మొదటి సవరణ 1951 లో జరిగింది. ఇప్పటికి 74 సార్లు (1995) భారత రాజ్యాంగాన్ని సవరించారు.

**రాష్ట్రపతి :** భారతదేశానికి రాజ్యాంగ రీత్యా అధిపతి 'రాష్ట్రపతి' దేశపాలన అంతా రాష్ట్రపతి పేరు మీదనే జరుగుతుంది. పార్లమెంటు ఉభయసభలు (లోక్‌సభ, రాజ్యసభ), రాష్ట్రాలలోని శాసనసభలలోని సభ్యులు కలసి నియోజక ఎలక్టోరల్ కాలేజీ వర్గంలో ఏర్పడి రాష్ట్రపతిని ప్రతి అయిదేళ్ళ కొకసారి ఎన్నుకుంటారు. పరిపాలన అంతా రాష్ట్రపతి పేరుమీదనే జరిగినప్పటికీ కేంద్రమంత్రివర్గ సలహా మేరకు మాత్రమే అధికారాలను చలాయించాల్సి ఉంది. అధికారాలను స్వతంత్రంగా చలాయించడానికి



భారతదేశం - రాష్ట్రపతులు
1950 - 1997


బాబు రాజేంద్ర ప్రసాద్


సర్వేపల్లి రాధాకృష్ణ


జాకీర్ హుస్సేన్


వి.వి. గిరి


ఫకృద్దీన్ అలీ అహ్మద్


నీలం సంజీవరెడ్డి


జ్ఞాని జైల్‌సింగ్


ఆర్. వెంకటరామన్


శంకర్‌దయాల్ శర్మ


కె.ఆర్. నారాయణన్

వీలులేదు. సుప్రీంకోర్టు, హైకోర్టు న్యాయమూర్తులు, ప్రధాన న్యాయమూర్తి, రాష్ట్ర గవర్నర్లు, అటార్నీ - జనరల్, కంప్ట్రోలర్ అండ్ ఆడిట్ - జనరల్ (సి.ఏ.జీ), ప్రభుత్వోద్యోగులను ఎంపిక చేసి నియమించే యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ (యు.పి.ఎస్.సి) అధ్యక్షుల్నీ, సభ్యులు, విదేశాలలో దౌత్యప్రతినిధుల్ని నియామకం చేయడం వంటి కీలకమైన అధికార పదవుల్లో నియమించే అధికారం రాష్ట్రపతికి ఉంది. ఇక రాష్ట్రపతికి ఉన్న రాజ్యాంగపరమైన అధికారాలు; శిక్షలు తగ్గించడం, మాఫీ చేయడం ప్రధానమైనవి. మరణదండన విధించిన వారికి క్షమాభిక్ష పెట్టి విడిచిపెట్టడం, శిక్ష తగ్గించే అధికారం రాష్ట్రపతికి ఉంది. సంధి ఒప్పందాలు చేయవచ్చు. అత్యవసర పరిస్థితి (ఎమర్జెన్సీ) ప్రకటించవచ్చు.

**ప్రధాని :** భారతదేశంలో రాజ్యాంగం ప్రకారం దేశ ప్రధాని పదవి అతికీలకమైంది. అయిదేళ్లకొకసారి పార్లమెంటుకు జరిగే సార్వత్రిక ఎన్నికలలో అత్యధిక సంఖ్యాబలం (మెజారిటీ) వున్న రాజకీయ పార్టీ నాయకుడ్ని ప్రధానిగా మంత్రివర్గం ఏర్పాటు చెయ్యమని రాష్ట్రపతి ఆహ్వానిస్తారు. అప్పుడు తన ఇష్టం వచ్చిన వారిని మంత్రివర్గ సభ్యులుగా ఎంపిక చేసుకోగా రాష్ట్రపతి ప్రధానిచేతను, అతని మంత్రివర్గ సభ్యులచేతనూ ప్రమాణ స్వీకారం చేయిస్తారు. ప్రధాని ఇష్టానుసారం మంత్రివర్గ సభ్యులను తీసి వేయుట గాని, మరికొందరిని చేర్చుటగాని చేయవచ్చును. ప్రధాని తన పదవికి రాజీనామా చేసినచో మంత్రివర్గం రద్దు అవుతుంది. మంత్రివర్గ నిర్ణయాలన్నీ ప్రధాని అధ్యక్షతన జరిగిన మంత్రివర్గ (కేబినెట్) సమావేశాల్లోనే తీసుకొనబడతాయి. ఒక విధంగా ప్రధాని అనుసంధాత. ప్రభుత్వం తరపున పార్లమెంటులో ముఖ్య ప్రతినిధి ప్రధానియే.

భారతదేశం - ప్రధాన మంత్రులు
1950 - 1997


జవహర్‌లాల్ నెహ్రూ


గుల్జారీలాల్ నందా


లాల్ బహదూర్ శాస్త్రి


ఇందిరా గాంధీ


మొరార్జీ దేశాయి


చరణ్ సింగ్


రాజీవ్ గాంధీ


విశ్వనాథ్ ప్రతాప్ సింగ్


చంద్రశేఖర్


పి.వి. నరసింహారావు


అటల్ బిహారీ వాజ్‌పేయి


దేవెగౌడ

ఐ.కె. గుజ్రాల్




# భారతదేశ చరిత్ర - ప్రముఖ ఘట్టాలు

క్రీ. పూ.

3000 సింధు నదీలోయ నాగరికత.

1500 ఆర్యుల రాక - వేద యుగం ;

1000 గంగామైదానానికి ఆర్యుల రాక. ఋగ్వేద సంకలనాలు.

900 కురుక్షేత్ర యుద్ధం.

800 రామాయణం ; మహాభారత కావ్యాల ఆది కూర్పు).

603 బింబిసారుని మగధ పాలన

600 ఉత్తరభారత్‌లో మహాజానపదులు. 6వ శతా. జైన: మత ప్రవక్త మహావీరుడు

* బౌద్ధమత ప్రవక్త గౌతమబుద్ధుడు

551 అజాతశత్రు పాలన.

550 ఉపనిషత్తుల సంకలనం.

518 డరయస్ సింధునది వైపుకు సైలాక్స్‌ను నౌకా సాహసయాత్ర పంపుట.

364 నంద రాజవంశ పాలన (364 - 324)

326 భారతదేశంపై ఆలెగ్జాండర్ దండ యాత్ర.

321 నంద రాజవంశాన్ని తుదముట్టించి మౌర్య చంద్రగుప్తుడు I మౌర్యవంశాన్ని పాటలీపుత్రం రాజధానిగా చాణుక్యుని సాయంతో పాలన.

323 చంద్రగుప్తుని ఆస్థానంలో గ్రీకు రాయబారి యాత్రా చారిత్రకుడు మెగస్తనీస్.

3 వశతా.అశోకుని పాలన (272 –233).

187 శుంగవంశ పాలన ( 187 - 175) 146 ఖారవేలుడు కళింగ రాజ్య స్థాపన;

26 దక్షిణాదిని పాండ్య ( మధుర), చేర (కేరళ) రాజ్యవంశాల ఏలిక.

క్రీ.శ.

40 సింధులోయలో శకుల పాలన

52 భారతదేశంలో (సెయింట్ తామస్) క్రైస్తవ మత ప్రచారం ప్రారంభం.

78 శాలివాహన శకయుగం ప్రారంభం.

98 కనిష్కుని పాలన ( 98 - 117)

319 గుప్తసామ్రాజ్య స్థాపన చంద్రగుప్త I పాలన (319 - 335).

350 సముద్రగుప్తుడు ఉత్తర భారత దేశం, దక్కను ప్రాంతాన్ని జయించాడు.

380 చంద్రగుప్త II విక్రమాదిత్య పాలన * ఫాహియాన్ రాక గుప్తుల స్వర్ణయుగం - సాంస్కృతిక పునరుజ్జీవనంలో కాళిదాసు ఇతర మహాకవులు, గణిత వేత్త ఆర్యభటుడు, వరాహమిహిరుడు, సుశ్రుతుడు (వైద్యం) మనిన కాలం * హిందూధర్మ పునరుద్ధరణ.

606 హర్షవర్ధనుని పాలన .

609 చాళుక్యుల పాలన .

639 హుయాన్ స్యాంగ్ రాక ( 629 -645).

670 ఇత్సింగ్ రాక.

712 మహమ్మద్ - బిన్ - కాసీమ్ సింధుపై దాడి.

753 రాష్ట్ర కూటుల పాలన.

892 తూర్పు చాళుక్య పాలన.

985 చోళ రాజ్యవంశ పాలన.

1026 మహమ్మద్ గజనీ సోమనాథ స్వర్ణ దేవాలయాన్ని కొల్లగొట్టుట.

1191 ఢిల్లీరాజు పృథ్వీరాజ్ చౌహాన్ ఘోరీ మహమ్మదీను ఓడించాడు. తరాయిన్ యుద్ధం.

1206 ఢిల్లీలో కుతుబుద్దీన్ ఐబెక్ బానిసవంశ రాజ్యాన్ని స్థాపించాడు.

1221 భారతదేశంపై మంగోలు చక్రవర్తి జెంగిజ్‌ఖాన్ దాడి.

1232 ఢిల్లీ సమీపమున కుతుబ్ మినార్ నిర్మాణ ప్రారంభం.

1296 అల్లావుద్దీన్ ఖిల్జీ పాలన.

1298 మార్కోపోలో భారతదేశ సందర్శన.

1320 ఘియాసుద్దీన్ తుగ్లక్ ఢిల్లీలో తుగ్లక్ రాజవంశాన్ని స్థాపించాడు.

1333 ఇబ్న్ బతూతా భారతదేశ సందర్శన.

1351 ఫిరోజ్ షా తుగ్లక్ పట్టాభిషేకం.

1398 భారతదేశంపై తైమూర్ దాడి.

1451 ఢిల్లీలో లోడీ (1451 - 1526) వంశ పాలన.

1489 బీజాపూరులో అదిల్‌షా రాజవంశ పాలన.

1490 అహమ్మద్ నగరంలో నిజాం షా రాజవంశం.

1498 వాస్కోడిగామా (పోర్చుగీసు నావికుడు) కాలికట్ (కేరళ)కు చేరిక.

1510 గోవా పోర్చుగీసువారి కైవసం.

1518 గోల్కొండలో కుతుబ్ షాహీ రాజవంశం.

1526 పానిపట్టు యుద్ధం-1 - లోడీ రాజులను బాబర్ ఓడించి మొగలు రాజ్యాన్ని స్థాపించాడు.

1530 బాబర్ తర్వాత గద్దె మీద హుమయూన్.

1538 సిక్కుమత స్థాపకుడు గురునానక్ మరణం.

1539 షర్షాహుమయూన్‌ను ఓడించి ఢిల్లీ చక్రవర్తి అయ్యాడు.

1555 సికిందర్ షా నుండి హుమయూన్ ఢిల్లీ సింహాసనాన్ని దక్కించు కొన్నాడు.

1556 హుమయూన్ మరణం; * అక్బర్ పాలన ప్రారంభం. * రెండవ పానిపట్టు యుద్ధంలో హేమూని అక్బర్ ఓడించాడు.

1564 హిందువులు చెల్లించవలసిన 'జిజియా' పన్నును అక్బర్ రద్దు చేశాడు.

1582 హిందూ - ముస్లిముల మధ్య సఖ్యతను సాధించుటకు 'దీన్ - ఇలాహీ' (దైవంలో విశ్వాసం) అక్బర్ ప్రకటించాడు.

1597 అక్బర్ తన దండయాత్రలను ముగించు కొన్నాడు. * రాణా ప్రతాప్ మరణం.

1600 ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ స్థాపన.

1602 నెదర్లాండ్స్ ఈస్టిండియా కంపెనీ స్థాపన.

1605 అక్బర్ మరణం; * జహంగీర్ పాలన ప్రారంభం.

1609 పులికాటు ( మద్రాసు సమీపం)లో డచ్చివారి ఫ్యాక్టరీ నిర్మాణం.

1631 షాజహాన్ తన భార్య ముంతాజ్ స్మృతికి చిహ్నంగా ఆగ్రాలో 'తాజమహాలు' ను నిర్మించాడు.

1639 మద్రాసులో ఇంగ్లీషువారి ఫోర్ట్ సెయింట్ జార్జికోట నిర్మాణం.

1658 ఔరంగజేబు తుది మొగల్ చక్రవర్తి. అయ్యాడు * మరల జిజియా పన్ను పునరుద్ధరణ.

1707 ఔరంగజేబు మరణం - మొగల్ రాజ్యం పతనం ప్రారంభం.

1720 పూణేలో బాజీరావు పీష్వా పాలన.

1739 పర్షియారాజు నాదిర్షా ఢిల్లీ కైవసం.

1742 బెంగాలుపై మహారాష్ట్రుల దండ యాత్ర; * డూప్లే ఫ్రెంచి గవర్నరు అయ్యాడు.

1757 ప్లాసీ యుద్ధం— — ఇంగ్లీషువారు రాబర్ట్ క్లైవ్ నాయకత్వంలో బెంగాలు నవాబు సిరాజ్ - ఉద్ - దౌలా మిర్ జాఫర్ ను ఓడించారు.

1768 హైదరాలీతో బ్రిటిషువారి సంధి.

1772 వారన్ హేస్టింగ్స్ బెంగాలు గవర్నరు.

1773 వలస పాలనను నియంత్రిస్తూ బ్రిటిషు రెగ్యులేటింగ్ చట్టం చేసింది.






# భారతదేశ చరిత్ర - ప్రముఖ ఘట్టాలు

క్రీ. పూ.

3000 సింధు నదీలోయ నాగరికత.

1500 ఆర్యుల రాక - వేద యుగం ;

1000 గంగామైదానానికి ఆర్యుల రాక. ఋగ్వేద సంకలనాలు.

900 కురుక్షేత్ర యుద్ధం.

800 రామాయణం ; మహాభారత కావ్యాల ఆది కూర్పు).

603 బింబిసారుని మగధ పాలన

600 ఉత్తరభారత్‌లో మహాజానపదులు. 6వ శతా. జైన: మత ప్రవక్త మహావీరుడు

* బౌద్ధమత ప్రవక్త గౌతమబుద్ధుడు

551 అజాతశత్రు పాలన.

550 ఉపనిషత్తుల సంకలనం.

518 డరయస్ సింధునది వైపుకు సైలాక్స్‌ను నౌకా సాహసయాత్ర పంపుట.

364 నంద రాజవంశ పాలన (364 - 324)

326 భారతదేశంపై అలిగ్జాండర్ దండ యాత్ర.

321 నంద రాజవంశాన్ని తుదముట్టించి మౌర్య చంద్రగుప్తుడు I మౌర్యవంశాన్ని పాటలీపుత్రం రాజధానిగా చాణుక్యుని సాయంతో పాలన.

323 చంద్రగుప్తుని ఆస్థానంలో గ్రీకు రాయబారి యాత్రా చారిత్రకుడు మోగస్తనీస్.

3 వశతా.అశోకుని పాలన (272 –233).

187 శుంగవంశ పాలన ( 187 - 175) 146 ఖారవేలుడు కళింగ రాజ్య స్థాపన.

26 దక్షిణాదిని పాండ్య ( మధుర), చేర (కేరళ) రాజ్యవంశాల ఏలిక.

క్రీ.శ.

40 సింధులోయలో శకుల పాలన

52 భారతదేశంలో (సెయింట్ తామస్) క్రైస్తవ మత ప్రచారం ప్రారంభం.

78 శాలివాహన శకయుగం ప్రారంభం.

98 కనిష్కుని పాలన ( 98 - 117)

319 గుప్తసామ్రాజ్య స్థాపన చంద్రగుప్తI పాలన (319 - 335).

350 సముద్రగుప్తుడు ఉత్తర భారత దేశం, దక్కను ప్రాంతాన్ని జయించాడు.

380 చంద్రగుప్త II విక్రమాదిత్య పాలన * ఫాహియాన్ రాక గుప్తుల స్వర్ణయుగం - సాంస్కృతిక పునరుజ్జీవనంలో కాళిదాసు ఇతర మహాకవులు, గణిత వేత్త ఆర్యభటుడు, వరాహమిహిరుడు, సుశ్రుతుడు (వైద్యం) మనిన కాలం * హిందూధర్మ పునరుద్ధరణ.

606 హర్షవర్ధనుని పాలన .

609 చాళుక్యుల పాలన .

639 హుయాన్ స్యాంగ్ రాక ( 629 -645).

670 ఇత్సింగ్ రాక.

712 మహమ్మద్ - బిన్ - కాసీమ్ సింధుపై దాడి.

753 రాష్ట్ర కూటుల పాలన.

892 తూర్పు చాళుక్య పాలన.

985 చోళ రాజ్యవంశ పాలన.

1026 మహమ్మద్ గజనీ సోమనాథ స్వర్ణ దేవాలయాన్ని కొల్లగొట్టుట.

1191 ఢిల్లీరాజు పృథ్వీరాజ్ చౌహాన్ ఘోరీ మహమ్మద్‌ను ఓడించాడు. తరాయిన్ యుద్ధం.

1206 ఢిల్లీలో కుతుబుద్దీన్ ఐబెక్ బానిసవంశ రాజ్యాన్ని స్థాపించాడు.

1221 భారతదేశంపై మంగోలు చక్రవర్తి జెంగిజ్‌ఖాన్ దాడి.

1232 ఢిల్లీ సమీపమున కుతుబ్ మినార్ నిర్మాణ ప్రారంభం.

1296 అల్లావుద్దీన్ ఖిల్జీ పాలన.

1298 మార్కోపోలో భారతదేశ సందర్శన.

1320 ఘియాసుద్దీన్ తుగ్లక్ ఢిల్లీలో తుగ్లక్ రాజవంశాన్ని స్థాపించాడు.

1333 ఇబ్న్ బతూతా భారతదేశ సందర్శన.

1351 ఫిరోజ్ షా తుగ్లక్ పట్టాభిషేకం.

1398 భారతదేశంపై తైమూర్ దాడి.

1451 ఢిల్లీలో లోడీ (1451 - 1526) వంశ పాలన.

1489 బీజాపూరులో అదిల్ షా రాజవంశ పాలన.

1490 అహమ్మద్ నగరంలో నిజాం షా రాజవంశం.

1498 వాస్కోడిగామా (పోర్చుగీసు నావికుడు) కాలికట్ (కేరళ)కు చేరిక.

1510 గోవా పోర్చుగీసువారి కైవసం.

1518 గోల్కొండలో కుతుబ్ షాహీ రాజవంశం.

1526 పానిపట్టు యుద్ధం-1 - లోడీ రాజులను బాబర్ ఓడించి మొగలు రాజ్యాన్ని స్థాపించాడు.

1530 బాబర్ తర్వాత గద్దె మీద హుమయూన్.

1538 సిక్కుమత స్థాపకుడు గురునానక్ మరణం.

1539 షర్షాహుమయూన్‌ను ఓడించి ఢిల్లీ చక్రవర్తి అయ్యాడు.

1555 సికిందర్ షా నుండి హుమయూన్ ఢిల్లీ సింహాసనాన్ని దక్కించు కొన్నాడు.

1556 హుమయూన్ మరణం; * అక్బర్ పాలన ప్రారంభం. * రెండవ పానిపట్టు యుద్ధంలో హేమూని అక్బర్ ఓడించాడు.

1564 హిందువులు చెల్లించవలసిన 'జిజియా' (జాట్టు)పన్ను అక్బర్ రద్దు చేశాడు.

1582హిందూ - ముస్లిముల మధ్య సయోధ్యను సాధించుటకు 'దీన్ - ఇ-ఇలాహీ' (దైవంలో విశ్వాసం) అక్బర్ ప్రకటించాడు.

1597అక్బర్ తన దండయాత్రలను ముగించు కొన్నాడు. * రాణా ప్రతాప్ మరణం.

1600ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ స్థాపన.

1602 నెదర్లాండ్స్ ఈస్టిండియా కంపెనీ స్థాపన.

1605 అక్బర్ మరణం; * జహంగీర్ పాలన ప్రారంభం.

1609 పులికాటు ( మద్రాసు సమీపం)లో డచ్చివారి ఫ్యాక్టరీ నిర్మాణం.

1631 షాజహాన్ తన భార్య ముంతాజ్ స్మృతికి చిహ్నంగా ఆగ్రాలో 'తాజమహలు' ను నిర్మించాడు.

1639మద్రాసులో ఇంగ్లీషువారి ఫోర్ట్ సెయింట్ జార్జికోట నిర్మాణం.

1658 ఔరంగజేబు తుది మొగల్ చక్రవర్తి. అయ్యాడు * మరల జిజియా పన్ను పునరుద్ధరణ.

1707ఔరంగజేబు మరణం - మొగల్ రాజ్యం పతనం ప్రారంభం.

1720పూణేలో బాజీరావు పీష్వా పాలన.

1739 పర్షియారాజు నాదిర్షా ఢిల్లీ కైవసం.

1742 బెంగాలుపై మహారాష్ట్రుల దండ యాత్ర; * డూప్లే ఫ్రెంచి గవర్నరు అయ్యాడు.

1757 ప్లాసీ యుద్ధం— —ఇంగ్లీషువారు రాబర్ట్ క్లైవ్ నాయకత్వంలో బెంగాలు నవాబు సిరాజ్ - ఉద్ - దౌలా మిర్ జాఫర్ ను ఓడించారు.

1768 హైదరాలీతో బ్రిటిషువారి సంధి.

1772 వారన్ హేస్టింగ్స్ బెంగాలు గవర్నరు.

1773 వలస పాలనను నియంత్రిస్తూ బ్రిటిషు రెగ్యులేటింగ్ చట్టం చేసింది.

1775 మొదటి ఇంగ్లీషు -మరాఠా యుద్ధం.
1782 సాల్బాయి సంధి.
1780 మైసూరు యుద్ధం II.
1784 హైదరాలీని బ్రిటిషువారు ఓడించారు.
1784 పిట్స్ ఇండియా చట్ట నిర్మాణం.
1792 ఇంగ్లీషువారు - టిప్పుసుల్తాను మధ్య 3వ మైసూరు యుద్ధం * శ్రీరంగపట్నం సంధి
1793 బెంగాలులో శాశ్వత పరిష్కార చట్ట (పెర్మెనెంట్ సెటిల్ మెంటు) నిర్మాణం.
1798 వెల్లస్లీ గవర్నరు- జనరల్ అయ్యాడు.
1799 4వమైసూరు యుద్ధంలో టిప్పు సుల్తాన్‌ను బ్రిటిషువారు ఓడించారు. మైసూరు విభజన.
1801 బ్రిటిషు ఆధిపత్యంలోనికి కర్ణాటక.
1803 మరాఠా యుద్ధం.
1818 మరాఠీవారిని బ్రిటిషువారు అదుపు లో పెట్టారు.
1828 విలియమ్ బెంటింక్ గవర్నర్-జనరల్ * సతీసహగమనం నిషేధం (1829)* థగ్‌ల అణచివేత (1837).
1841 రంజిత్ సింగ్ నాయకత్వంలో సిక్కు పాలన.
1845 సిక్కుల అణచివేత.
1848 డల్‌హౌసీ గవర్నరు - జనరల్.
1848 పంజాబు బ్రిటిషువారి అధీనం.
1853 ఇండియాలో బొంబాయి నుండి థాణా వరకు మొట్టమొదటి రైలుమార్గ నిర్మాణం.
1857 ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం *(సిపాయిల తిరుగుబాటు).*
1858 భారతదేశపాలన ఈస్టిండియా కంపెనీ అధీనం నుండి బ్రిటిషు క్రౌన్ పాలన కిందికి తెస్తూ విక్టోరియా మహారాణి ప్రకటన.
1861 భారతీయ శిక్షాస్మృతి (ఇండియన్ పీనల్ కోడ్) * ఇండియన్ కౌన్సిల్ చట్టం * హైకోర్టుల చట్టం .
1869 మోహన్ దాస్ కరమ్‌చంద్ గాంధీ జననం.
1877 బ్రిటిషురాణి భారతీయ చక్రవర్తిని (ఎంప్రెస్ ఆఫ్ ఇండియా)గా ప్రకటన.
1885 భారతజాతీయ కాంగ్రెసు స్థాపన - బొంబాయిలో మొదటి సమావేశం
1892 భారతీయ పరిపాలనను నియంత్రిస్తూ చట్టం.
1899 కర్జన్ గవర్నర్-జనరల్ & వైస్రాయి.
1905 బెంగాలు విభజన ప్రతిపాదన.
1906 ముస్లిమ్ లీగ్ స్థాపన.
1908 వార్తాపత్రికల చట్టం.
1909 మింటో - మార్లే చట్టం.
1911 జార్జి V చక్రవర్తి మేరీరాణి ఢిల్లీలో దర్బారు. * రాజధాని కలకత్తా నుంచి ఢిల్లీకి మార్పు.
1914 ప్రపంచయుద్ధం - I ప్రారంభం.
1915 మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ భారత రాజకీయ రంగ ప్రవేశం.
1939 రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభం.
1945 రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది.
1947 ఆగస్టు 15 భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది.
1948 జన 30 నాథూరామ్ గాడ్సేచే మహాత్మా గాంధీ హత్య * ఏర్పాటు.
1949 నవ. 26 భారతరాజ్యాంగాన్ని రాజ్యాంగ పరిషత్తు (కానిస్టిట్యుయెంట్ అసెంబ్లీ) సిద్ధం చేసింది.
1950 జన. 26 భారత రాజ్యాంగం అమలులోనికి రావడంతో భారతదేశం ప్రజాసత్తాక గణ తంత్ర రాజ్యమయింది. * రాజేంద్రప్రసాద్ బాబు మొదటి రాష్ట్రపతి గాను, జవహర్ లాల్ నెహ్రూ ప్రధానిగాను ఎన్నుకోబడ్డారు * డిసె. 15 వల్లభ్‌భాయి పటేల్ మరణం.

1951-56 మొదటి పంచవర్ష ప్రణాళిక

1952 రాజ్యాంగం ప్రకారం మొదటి సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. రాజేంద్రప్రసాదు రాష్ట్ర పతిగాను. నెహ్రూ ప్రధాని గాను మరల ఎన్నుకోబడ్డారు.

1953 మే 29 ఎవరెస్ట్ శిఖారారోహణ.

1954 భారత - చీనా దేశాల మధ్య 'పంచశీల' ఒప్పందం

1955 ఆవడి కాంగ్రెసు సమావేశంలో సోషలిస్ట్ పేటర్న్ ఆఫ్ సొసైటీ తీర్మానం.

1956 భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ. * ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. * రెండవ పంచవర్ష ప్రణాళిక (1956-61)* హిందూ కోడ్ బిల్లు * (నవ. 1) రెండవ సార్వత్రిక ఎన్నికలు * రాజేంద్ర ప్రసాద్ రెండవసారి రాష్ట్రపతి * జవహర్‌లాల్ నెహ్రూ మరల ప్రధాని

1958 పార్లమెంటు శాసనం ద్వారా కొల తులా మాన పద్ధతి మెట్రిక్ విధానానికి మారింది.

1959 బొంబాయి రాష్ట్రాన్ని విభజించగా మహారాష్ట్ర - గుజరాతు రాష్ట్రాలు ఏర్ప డ్డాయి.

1961 పోర్చుగీసు అధీనంలో ఉన్న గోవా, డయ్యూ, డామన్ భారతదేశంలో విలీన మయ్యాయి * మూడవ పంచవర్ష ప్రణాళిక (1961-66).

1962 మూడవ సార్వత్రిక ఎన్నికలు * సర్వేపల్లి రాధాకృష్ణన్ రాష్ట్రపతి. * జవహర్ లాల్ నెహ్రూ మరల ప్రధాని * ఉత్తర భారత సరిహద్దుపై చీనా దాడి (సెప్టె 19)

1963 నాగాలాండ్ రాష్ట్రం ఏర్పాటు.

1964 జవహర్ లాల్ నెహ్రూ మరణం (మే 27) * లాల్ బహదూర్ శాస్త్రి ప్రధాని.

1965 ఇండో - పాకిస్తాన్ యుద్ధం ( రాన్ ఆఫ్ కచ్)

1966 టాష్ కెంట్ లో లాల్ బహదూర్ శాస్త్రి - అయూబ్ మధ్య సమావేశం అంగీకారానికి వచ్చుట. *లాల్ బహదూర్ శాస్త్రి టాష్‌కెంట్ లో హఠాన్మరణం (జన.2) *ఇందిరాగాంధీ ప్రధాని అయ్యారు. * హర్యానా, పంజాబు రాష్ట్రాల ఏర్పాటు 4వ పంచవర్ష ప్రణాళిక (1966-71)

1967 4వ సార్వత్రిక ఎన్నికలు జరిగాయి * ఇందిరాగాంధీ మరల ప్రధాని. *జాకీరు హుస్సేన్ రాష్ట్రపతి.

1969 మద్రాసు రాష్ట్రం తమిళనాడుగా పేరు మార్చుకుంది. * జాకీర్‌హుస్సేన్ మరణం * వి.వి. గిరి రాష్ట్రపతి అయ్యారు. *14 షెడ్యూల్డు బ్యాంకులు జాతీయకరణం చేయబడ్డాయి.

1970 మేఘాలయా రాష్ట్రం ఏర్పడింది * పూర్వపు సంస్థానాధీశులకిచ్చే రాజ భరణాలు ( ప్రీవీ పర్సులు) రద్దయ్యాయి.

1971 హిమాచలప్రదేశ్ రాష్ట్రం ఏర్ప డింది *లోక్‌సభ మధ్యంతర ఎన్నికలు జరిగాయి. * ఇందిరాగాంధీ మరల ప్రధాని * ఇండో - పాక్ యుద్ధం *బంగ్లాదేశ్ అవతరణ (డిసె. 17) * 5వ పంచవర్ష ప్రణాళిక (1971 - 76)

1972 మణిపూర్, త్రిపురా రాష్ట్రాలు ఏర్పడ్డాయి *అరుణాచల ప్రదేశ్, మిజోరమ్ కేంద్రపాలిత రాష్ట్రాలయ్యాయి. * రాజగోపాలాచారి మరణం.

1973 మైసూరు రాష్ట్రం పేరు 'కర్నాటక'గా మారింది.

1974 ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ రాష్ట్రపతి.

1975 సర్వేపల్లి రాధాకృష్ణన్ మరణం (ఏప్రి.17) * సిక్కిమ్ 22వ రాష్ట్రంగా

భారతదేశంలో విలీనమయ్యింది *అత్యవసర పరిస్థితి (ఎమర్జన్సీ) ప్రకటన (జూన్ 25) * కలకత్తా, మద్రాసు దూరదర్శన్ ( టి.వి) కేంద్రాలు స్థాపన *కట్టుబానిసత్వం (బాండెడ్ లేబర్) నిర్మూలన.

1976 రాజ్యాంగానికి 42వ సవరణ ఫలితంగా భారతదేశం సోషలిస్టు సెక్యులర్ రిపబ్లిక్ అయింది.

1977 లోక్ సభ రద్దయింది * రాష్ట్రపతి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్ మరణం *అత్యవసర (ఎమర్జన్సీ) పరిస్థితి సడలింపు (మార్చి 21) * లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలలో జనతా పార్టీ విజయం * మొరార్జీ దేశాయి ప్రధాని * 1977 నీలం సంజీవరెడ్డి ఏకగ్రీవంగా రాష్ట్రపతిగా ఎన్నిక

1978 కాంగ్రెసు (ఐ) పార్టీ ఏర్పడింది.

1979 మొరార్జీ దేశాయి ప్రధాని పదవికి రాజీనామా (జూలై15) * మదర్ తెరిసాకు నోబెల్ పురస్కారం.

1980 లోక్ సభకు మధ్యంతర ఎన్నికలలో ఇందిరాగాంధీ విజయం సాధించి ప్రధాని అయ్యారు.

1982 వినోబా భావే మరణం ( నవ.15).

1983 సముద్రగర్భంలో ( బొంబాయి సమీపాన) పెట్రోలు నిక్షేపం బయటపడింది.

1984 ఫిబ్ర 26 - ఇన్సాట్ 1 కృత్రిమ ఉపగ్రహం పని ప్రారంభం.

1984 ఏప్రిల్ రాఖేష్ శర్మ ప్రప్రథమ భారతీయ రోదసీ నివాసి ( సోయుజ్ టి II) * ఎవరెస్టు శిఖరారోహణ చేసిన ప్రప్రథమ భారతీయ మహిళ కుమారి బిచేంద్రీపాల్ * జూన్ 6 పంజాబులో తీవ్రవాదుల ఆగడాలను అరికట్టడానికి అమృతసర్‌లోని స్వర్ణదేవాలయంలో 'ఆపరేషన్ బ్లూ స్టార్' చర్య. *అక్టో.31 ఇందిరా గాంధీ హత్య * రాజీవ్ గాంధీ ప్రధాని అయ్యారు. * డిసె. లోక్ సభకు 8 వ సార్వ త్రిక ఎన్నికలలో కాం గ్రెసు (ఐ) విజయం సాధించగా రాజీవ్ గాంధీ మరల డిసె. 3న ప్రధాని అయ్యారు * భోపాల్ గ్యాస్ దుర్ఘటన.

1985 డి.సె.26 భారత జాతీయ కాంగ్రెస్ శతజయంతి వార్షికోత్సవం.

1986 జన 13 ఇండియన్ ఎయిర్ లైన్స్ ఫోకర్ (44) విమానాన్ని నడిపిన మొదటి మహిళా కమాండర్ సౌదామిని దేశ్‌ముఖ్ *ఫిబ్ర. 17 సుప్రసిద్ధ తత్త్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి తన 90 వ ఏట సిద్ధి పొందారు.

1987 బోఫోర్స్, ఫెయిర్ ఫాక్స్ కుంభ కోణాలు బయటపడ్డాయి.

1989 9వ లోక్‌సభకు సార్వత్రిక ఎన్నికలు * నేషనల్ ఫ్రంట్ పార్టీ తరపున వి.పి. సింగ్ నాయకత్వంలో అల్పసంఖ్యాక మైనారిటీ ప్రభుత్వం ఏర్పడింది. (డి.సె.3)

1991 మే 21 రాజీవ్ గాంధీ హత్య * లోక్‌సభకు 10వ సార్వత్రిక ఎన్నికలు. జూన్‌లో పి.వి. నరసింహారావు భారత ప్రధాని.

1993 స్కామ్ కుంభకోణం * లాతూరు (మహారాష్ట్ర) లో భూకంపం (రిక్టర్ స్కేలు - 9)

1994 ఆర్థిక సంస్కరణలు.

1995 హవాలా కుంభకోణం.

1996 11వ లోక్‌సభకు సార్వత్రిక ఎన్నికలు * 13 పార్టీల అధినేతగా దేవెగౌడ సంకీర్ణ (కొయిలేషన్) ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి ప్రధాని అయ్యారు.

1997 దేవెగౌడ ప్రభుత్వం పతనం.* ఇంద్రగుప్త గుజ్రాల్ ప్రధాని (ఏప్రిల్ 11).




# భారతదేశం స్వాతంత్ర్య పోరాట చరిత్రలో ప్రముఖ ఘట్టాలు

1498 వాస్కో-డిగామా పోర్చుగీసు నావికుని నౌక కాలీకట్‌కు చేరిక.

1611 ఈస్టిండియా కంపెనీవారు భారత దేశంతో వ్యాపారం చేయడానికి మచిలీపట్టణం వద్ద ఫ్యాక్టరీల స్థాపన.

1615 ఈస్టిండియా కంపెనీ తరపున సర్ తామస్ రో రాయబారిగా మొగలాయి చక్రవర్తి జహంగీరు దర్బారుకు వచ్చి కంపెనీ వ్యాపార కేంద్రాల స్థాపనకు అనుమతి పొందాడు.

1639 ఫోర్ట్ సెయింట్ జార్జికోట స్థాపన (మద్రాసు).

1707 మొగలు చక్రవర్తి ఔరంగజేబు మరణం.

1757 'ప్లాసీ యుద్ధం' - ఈస్టిండియా కంపెనీ వారికి బెంగాలును పాలించే సిరాజుద్దౌలా మధ్య జరిగింది * సిరాజుద్దౌలా ఓటమి.

1774 మొదటి బ్రిటిషు గవర్నరు - జనరల్ వారెన్ హేస్టింగ్స్.

1835 భారతదేశంలో ఇంగ్లీషు విద్యావిధానం ప్రారంభం.

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం (సిపాయిల తిరుగుబాటు)

1858 బ్రిటిషు ఇండియా కంపెనీ పాలన నుంచి ఇంగ్లీషు రాజరికం (క్రౌన్) అధీనం * విక్టోరియా మహారాణి బ్రిటిషు చక్రవర్తినిగా పాలన ప్రారంభం * మొదటి వైస్రాయి లార్డ్ కానింగ్

1882 'ఆనందమఠం' నవలలో బంకించంద్ర ఛటర్జీ 'వందేమాతరం' గీతం ప్రస్తావన.

1885 భారతజాతీయ కాంగ్రెసు స్థాపన.

1905 వైస్రాయి లార్డ్ కర్జన్ బెంగాలు విభజన ప్రతిపాదన.

1906 'వందేమాతరం' ఉద్యమం.

1908 'స్వరాజ్యం నాజన్మహక్కు' అని గర్జించి, సెప్టె.23న భారతజాతిని మేల్కొలిపిన తిలక్‌కు జైలుశిక్ష.

1910 బెంగాలు విభజన రద్దు.

1911 కలకత్తా నుండి ఢిల్లీకి రాజధాని మార్పు.

1914 మొదటి ప్రపంచయుద్ధం. (1914-1919)

1915 దక్షిణాఫ్రికా నుంచి తిరిగి వచ్చిన గాంధీజీ భార త రాజ కీయ రంగ ప్రవేశం. 1916 అనిబి సెంట్‌చే హోమ్ రూల్ ఉద్యమం * జవహర్ లాల్ నెహ్రూ లక్నో కాంగ్రెసు సభలో మొదటి సారిగా గాంధీ జీని కలును కున్నారు.



1917 బీహారు రైతులకోసం 'చంపారన్ సత్యాగ్రహం'
1918 గాంధీజీ గుజరాతు రైతులకోసం 'కైరా సత్యాగ్రహం'
1919 రౌలట్ చట్టం - రాజకీయ ఆందోళన ప్రారంభం * అమృతసర్‌లో జలియన్ వాలాబాగ్ దుర్ఘటనం - ఊచకోత - ఏప్రి 13న డయ్యర్ సేనాని జరిపించిన కాల్పులలో వెయ్యిమంది అమాయిక పేదలు చనిపోయారు * మౌలానా అబుల్ కలామ్ అజాద్, గాంధీ మద్దతుతో అలీ సోదరులు ఖిలాఫత్ ఉద్యమం. (టర్కీషు ఖలీఫా పునరుద్ధరణను సమర్థిస్తూ) * పరిమిత స్వయంరాష్ట్ర ప్రతిపత్తి పాలనాధికారం ఇస్తూ మాంటేగు - చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు.
1920 గాంధీజీ అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించారు. * జాతీయ కాంగ్రెసుకు గాంధీజీ నాయకత్వం లభించింది.
1920 బాల గంగాధర తిలక్ మరణం * ఆగస్టులో గాంధీజీ అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం ప్రారంభిం చారు. * జాతీయ కాంగ్రెసుకు గాంధీజీ నాయకత్వం లభించింది * సంస్కరణలపట్ల నిరసన ప్రదర్శన * విదేశీవస్త్ర దహనం * విద్యార్థులు తరగతుల బహిష్కరణ.
1921 మలబారులో ముస్లిం మోప్లా విప్లవం * వేల్స్ యువరాజు భారత సందర్శన - నిరసన హర్తాళ్ * 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య 'రామదండు' నాయకత్వంలో చీరాల - పేరాలలో మునిసిపల్ పన్నులు చెల్లించడానికి నిరాకరణ * ఆంధ్రులైన పింగళి వెంకయ్య గాంధీజీ సూచనపై కాంగ్రెసు త్రివర్ణపతాకాన్ని రూపొందించారు * గాంధీజీ కొల్లాయి గుడ్డ ధారణ.
1922 సహాయనిరాకరణ ఉద్యమానికి నాయ కత్వం కాంగ్రెస్ గాంధీజీకి అప్పగించింది. * చౌరీ - చౌరావద్ద దౌర్జన్య కాండ * ఉద్య మాన్ని గాంధీజీ తాత్కాలికం గా నిలుపు దల చేశారు * హరిజనుల దేవాలయ ప్రవేశానికి సెప్టె.24 నిర్ణయం * కన్నెగంటి హనుమంతు నాయకత్వాన గుంటూరు జిల్లా పల్నాటిసీమలో 'అడవిపుల్లరి' సత్యాగ్రహం * విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నాయకత్వం * గాంధీజీ అరెస్టు - ఆరేళ్ళ కారాగారశిక్ష


కన్నెగంటి హనుమంతు

1923 మోతీలాల్ నెహ్రూ (కార్యదర్శి), చిత్తరంజన్ దాస్(అధ్యక్షుడు) స్వరాజ్యపార్టీని ప్రారంభించారు * స్వరాజ్య వాదులు కౌన్సిళ్ళలో ప్రవేశించి ప్రభుత్వాన్ని లోపలనుంచే ఎదుర్కొనాలనే నిర్ణయం.
1925 అఖిల భారత ఖద్దరు సంఘం రూపొందింది.
1927 జవహర్ లాల్ నెహ్రూ లాహోరు కాంగ్రెసు సభకు అధ్యక్షుడు * ఇందిరా గాంధీ ప్రియ దర్శినిచే వానరసేన ఏర్పాటు.
1928 గాంధీజీ గుజరాత్ లో హెచ్చు భూమి శిస్తును ప్రతిఘటిస్తూ 'బార్డోలీ సత్యాగ్రహం * సైమన్ గోబ్యాక్ ఊరేగింపు - నిరసన ప్రదర్శన మద్రాసులో టంగుటూరు ప్రకాశం సిపాయిల తుపాకీ గుండ్లకు గుండె నిచ్చి ధైర్యంగా ఎదురు నిలిచాడు.
1929 భారతదేశానికి డొమినియన్ స్టేటస్ వైస్రాయి లార్డ్ ఇర్విన్ ప్రతిపాదించారు. * నెహ్రూజీ రావీ

నది ఒడ్డున అర్ధ రాత్రి డిసె.31 న త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసి పూర్ణ స్వాతంత్ర్యం కోసం తీర్మానించారు.

1930 భారత ప్రజలు స్వాతంత్ర్యం కోసం జనవరి 26 న పోరాడు తామని ప్రతి జ్ఞ. * దేశవ్యాప్తంగా గాంధీజీ ఉప్పు న త్యాగ్రహం ప్రారంభం * కాంగ్రెసు మొద టి రౌండ్ టేబుల్ న మావే శాన్ని బహిష్కరించింది.



1931 విప్లవ వీరుడు భగత్‌సింగ్ ఉరితీత * గాంధీ - ఇర్విన్ ఒప్పందం * లండన్‌లో రెండవ రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది. కాంగ్రెసు ప్రతినిధిగా గాంధీ ఓడలో వెళ్ళి హాజరయ్యారు * 'సరిహద్దు గాంధీ' అబ్దుల్ గఫార్ ఖాన్‌ను డిసెంబరు 25 న అరెస్టు చేశారు.

1932 కాంగ్రెసు ఉద్యమం అణగదొక్క బడింది * లండన్‌లో రౌండ్ టేబిల్ సమావేశం - III * 'కమ్యూనల్ అవార్డు ను వ్యతిరేకిస్తూ సెప్టె. 24 హరిజన నాయకుడు డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ఆధ్వర్యాన 'పూనా ఒడంబడిక' కుదిరింది.

1933 భారతదేశం సంస్కరణలు మీద శ్వేత పత్రం (బ్రిటిషు పార్లమెంటు).

1934 సహాయ నిరాకరణోద్యమానికి స్వస్తి * కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఏర్పాటు.

1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టం * చట్టంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల స్వరూపం విషయమై కొన్ని మార్పులు.

1936 లక్నో కాంగ్రెసు మహాసభలో సోషలిజమ్‌ను తన ధ్యేయంగా కాంగ్రెస్ పార్టీ ఆమోదించాలని నెహ్రూ అభ్యర్థించారు.

1937 ఫిబ్ర. భారత ప్రభుత్వ 1935 నూతన చట్టం ప్రకారం రాష్ట్రాలలో ఎన్నికలు జరిగాయి * పెక్కు రాష్ట్రాల్లో కాంగ్రెసు మంత్రి వర్గాలను ఏర్పాటు చేసింది * ఉమ్మడి మద్రాసులో రాజాజీ మంత్రి వర్గంలో ఆంధ్రులు గిరి, ప్రకాశం, గోపాల రెడ్డి మంత్రులు.

1938 ఫార్వర్డ్ బ్లాక్ పార్టీని సుభాస్ చంద్రబోస్ ఏర్పాటు చేశారు.

1939 సంస్థానాల ప్రజల పోరాటాన్ని జాతీయ కాంగ్రెసు బలపరిచింది. * అఖిలభారత దేశీయ సంస్థానాల ప్రజల మహాసభకు నెహ్రూను అధ్యక్షునిగా ఎన్నిక. * 2వ ప్రపంచ యుద్ధం ప్రారంభం. * బ్రిటిషువారి వైఖరికి నిరసనగా రాష్ట్రాలలోని మంత్రివర్గాలు రాజీనామా.

1940 వ్యక్తి సత్యాగ్రహం గాంధీజీ నాయకత్వాన ప్రారంభం. మొదటి సత్యాగ్రాహి వినోబా భావే.

1942 క్రిప్స్ మిషన్ రాక * కాంగ్రెసు, ముస్లిం లీగ్ రెండూ క్రిప్స్ ప్రతిపాదనలను నిరాకరిం చాయి * కాంగ్రెసు ఆగస్టు 8న క్విట్ ఇండియా తీర్మానం ఆమోదించింది * ఆగస్టు 9న కాంగ్రెసు నాయకులు దేశవ్యాప్తంగా అరెస్టయి నారు * కాంగ్రెసును చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించారు. * జపాన్ సహకారంతో ప్రవాసం

1917 బీహారు రైతులకోసం 'చంపారన్ సత్యాగ్రహం'
1918 గాంధీజీ గుజరాతు రైతులకోసం ఖైరా సత్యాగ్రహం'
1919 రౌలట్ చట్టం - రాజకీయ ఆందోళన ప్రారంభం * అమృతసర్‌లో జలియన్ వాలాబాగ్ దురంతం - ఊచకోత - ఏప్రి 13న డయ్యర్ సేనాని జరిపించిన కాల్పులలో వెయ్యిమంది అమాయిక పేదలు చనిపోయారు * మౌలానా అబుల్ కలామ్ అజాద్, గాంధీ మద్దతుతో అలీ సోదరులు ఖిలాఫత్ ఉద్యమం. (టర్కీషు ఖలీఫా పునరుద్ధరణను సమర్థిస్తూ) * పరిమిత స్వయంరాష్ట్ర ప్రతిపత్తి పాలనాధికారం ఇస్తూ మాంటేగు - ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు.
1920 గాంధీజీ అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించారు. * జాతీయ కాంగ్రెసుకు గాంధీజీ నాయకత్వం లభించింది.
1920 బాల గంగాధర తిలక్ మరణం * ఆగస్టులో గాంధీజీ అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం ప్రారంభిం చారు. * జాతీయ కాంగ్రెసుకు గాంధీజీ నాయకత్వం లభించింది * సంస్కరణలపట్ల నిరసన ప్రదర్శన * విదేశీవస్త్ర దహనం * విద్యార్థులు తరగతుల బహిష్కరణ.
1921 మలబారులో ముస్లిం మోప్లా విప్లవం * వేల్స్ యువరాజు భారత సందర్శన - నిరసన హర్తాళ్ * 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య 'రామదండు' నాయకత్వంలో చీరాల - పేరాలలో మునిసిపల్ పన్నులు చెల్లించడానికి నిరాకరణ * ఆంధ్రులైన పింగళి వెంకయ్య గాంధీజీ సూచనపై కాంగ్రెసు త్రివర్ణపతాకాన్ని రూపొందించారు * గాంధీజీ కొల్లాయి గుడ్డ ధారణ.


కన్నెగంటి హనుమంతు

1922 సహాయనిరాకరణ ఉద్యమానికి నాయ కత్వం కాంగ్రెస్ గాంధీజీకి అప్పగించింది. * చౌరీ - చౌరావద్ద దౌర్జన్య కాండ * ఉద్య మాన్ని గాంధీజీ తాత్కాలికం గా నిలుపు దల చేశారు * హరిజనుల దేవాలయ ప్రవేశానికి సెప్టె.24 నిర్ణయం * కన్నెగంటి హనుమంతు నాయకత్వాన గుంటూరు జిల్లా పల్నాటిసీమలో 'అడవిపుల్లరి' సత్యాగ్రహం * విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నాయకత్వం * గాంధీజీ అరెస్టు - ఆరేళ్ళ కారాగారశిక్ష
1923 మోతీలాల్ నెహ్రూ (కార్యదర్శి), చిత్తరంజన్ దాస్(అధ్యక్షుడు) స్వరాజ్యపార్టీని ప్రారంభించారు * స్వరాజ్య వాదులు కౌన్సిళ్ళలో ప్రవేశించి ప్రభుత్వాన్ని లోపలనుంచే ఎదుర్కొనాలనే నిర్ణయం.
1925 అఖిల భారత ఖద్దరు సంఘం రూపొందింది.
1927 జవహర్ లాల్ నెహ్రూ లాహోరు కాంగ్రెసు సభకు అధ్యక్షుడు * ఇందిరా గాంధీ ప్రియ దర్శినిచే వానరసేన ఏర్పాటు.
1928 గాంధీజీ గుజరాత్ లో హెచ్చు భూమి శిస్తును ప్రతిఘటిస్తూ ' బార్డోలీ సత్యాగ్రహం * సైమన్ గోబ్యాక్ ఊరేగింపు - నిరసన ప్రదర్శన మద్రాసులో టంగుటూరు ప్రకాశం సిపాయీల తుపాకీ గుండ్లకు గుండె నిచ్చి ధైర్యంగా ఎదురు నిలిచాడు.
1929 భారతదేశానికి డొమినియన్ స్టేటస్ వైస్రాయి లార్డ్ ఇర్విన్ ప్రతిపాదించారు. * నెహ్రూజీ రావీ

నది ఒడ్డున అర్ధ రాత్రి డిసె.31 న త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసి పూర్ణ స్వాతంత్ర్యం కోసం తీర్మానించారు.

1930 భారత ప్రజలు స్వాతంత్ర్యం కోసం జనవరి 26 న పోరాడు తామని ప్రతి జ్ఞ. * దేశవ్యాప్తంగా గాంధీజీ ఉప్పు న త్యాగ్ర హం ప్రారంభం * కాంగ్రెసు మొద టి రౌండ్ టేబుల్ న మావే శాన్ని బహిష్కరించింది.



1931 విప్లవ వీరుడు భగత్‌సింగ్ ఉరితీత * గాంధీ - ఇర్విన్ ఒప్పందం * లండన్‌లో రెండవ రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది. కాంగ్రెసు ప్రతినిధిగా గాంధీ ఓడలో వెళ్ళి హాజరయ్యారు * 'సరిహద్దు గాంధీ' అబ్దుల్ గఫార్ ఖాన్‌ను డిసెంబరు 25 న అరెస్టు చేశారు.

1932 కాంగ్రెసు ఉద్యమం అణగదొక్క బడింది * లండన్‌లో రౌండ్ టేబిల్ సమావేశం - III * 'కమ్యూనల్ అవార్డు ను వ్యతిరేకిస్తూ సెప్టె. 24 హరిజన నాయకుడు డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ ఆధ్వర్యాన 'పూనా ఒడంబడిక' కుదిరింది.

1933 భారతదేశం సంస్కరణలు మీదశ్వేత పత్రం (బ్రిటిషు పార్లమెంటు).

1934 సహాయ నిరాకరణోద్యమానికి స్వస్తి * కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఏర్పాటు.

1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టం * చట్టంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల స్వరూపం విషయమై కొన్ని మార్పులు.

1936 లక్నో కాంగ్రెసు మహాసభలో సోషలిజమ్‌ను తన ధ్యేయంగా కాంగ్రెస్ పార్టీ ఆమోదించాలని నెహ్రూ అభ్యర్థించారు.

1937 ఫిబ్ర. భారత ప్రభుత్వ 1935 నూతన చట్టం ప్రకారం రాష్ట్రాలలో ఎన్నికలు జరిగాయి * పెక్కు రాష్ట్రాల్లో కాంగ్రెసు మంత్రి వర్గాలను ఏర్పాటు చేసింది * ఉమ్మడి మద్రాసులో రాజాజీ మంత్రి వర్గంలో ఆంధ్రులు గిరి, ప్రకాశం, గోపాల రెడ్డి మంత్రులు.

1938 ఫార్వర్డ్ బ్లాక్ పార్టీని సుభాస్ చంద్రబోస్ ఏర్పాటు చేశారు.

1939 సంస్థానాల ప్రజల పోరాటాన్ని జాతీయ కాంగ్రెసు బలపరించింది. * అఖిలభారత దేశీయ సంస్థానాల ప్రజల మహాసభకు నెహ్రూను అధ్యక్షునిగా ఎన్నిక. * 2వ ప్రపంచ యుద్ధం ప్రారంభం. * బ్రిటిషువారి వైఖరికి నిరసనగా రాష్ట్రాలలోని మంత్రివర్గాలు రాజీనామా.

1940 వ్యక్తి సత్యాగ్రహం గాంధీజీ నాయకత్వాన ప్రారంభం. మొదటి సత్యాగ్రాహి వినోబా భావే.

1942 క్రిప్స్ మిషన్ రాక * కాంగ్రెసు, ముస్లిం లీగ్ రెండూ క్రిప్స్ ప్రతిపాదనలను నిరాకరించాయి * కాంగ్రెసు ఆగస్టు 8న క్విట్ ఇండియా తీర్మానం ఆమోదించింది * ఆగస్టు 9న కాంగ్రెసు నాయకులు దేశవ్యాప్తంగా అరెస్టయినారు * కాంగ్రెసును చట్ట వ్యతిరేక సంస్థగా ప్రకటించారు. * జపాన్ సహకారంతో ప్రవాసం




లో నేతాజీ సుభాస్ చంద్రబోస్ అజాద్ హింద్ ఫౌజ్ (ఇండియన్ నేషనల్ ఆర్మీ) ను ఏర్పాటు చేసి సింగపూర్ లో "స్వతంత్ర భారత ప్రభుత్వా"నికి సుభాస్ చంద్రబోస్ నాయ కత్వాన ప్రారంభోత్సవం చేశారు.

1943 లార్డ్ వేవెల్ భారతదేశానికి గవర్నరు - జనరల్ 8 వైస్రాయి అయ్యాడు * కాంగ్రెసు - ముస్లింలీగ్ మధ్య ఏకాభి ప్రాయం కుదరక వేవెల్ ప్రతిపాదించిన పరిష్కారమార్గం అంగీ కారయోగ్యం కాలేదు.

1945 సిమ్లా మహాసభ జరిగింది * జపాన్ ఓటమితో నేతాజీ నాయకత్వంలోని అజాద్ హింద్ ఫౌజ్ బ్రిటిషు వారికి లొంగుబాటు * జాతీయ సేనా సిబ్బంది (ఐ.ఎన్.ఏ.)ని 'ద్రోహచర్య' కింద ప్రత్యేక న్యాయస్థానంలో విచారణ.

1946 రాయల్ ఇండియన్ నేవీలో సైనిక తిరుగు బాటు (ఫిబ్రవరి 18) * లార్డ్ పెతిక్ లారెన్స్ నాయకత్వంలో కేబినెట్ మిషన్ రాక (ఆగ.19) * కాంగ్రెసు, ముస్లింలీగ్ రెండూ ఈ ప్రతి పాదనను అంగీకరించలేదు * తరువాత కాంగ్రెసు అంగీకరించి ప్రభుత్వం ఏర్పాటు * సెప్టె . జవహర్ లాల్ నెహ్రూ ప్రధానిగా తాత్కాలిక కేంద్రమంత్రి మండలి ఏర్పాటు *దేశ వ్యాప్తంగా ముస్లింలీగ్ అల్లర్లు చెలరేగాయి - కలకత్తాలో హిందువులపై ముస్లిముల దౌర్జన్యకాండ * హిందువులు తిప్పి కొట్టారు. * రాజ్యాంగ పరిషత్తులో చేరమని వైస్రాయి లీగ్‌ను అర్థించుట * ప్రత్యేక పాకిస్తాన్‌కు పట్టుదల * మొదట సత్యనారాయణ సిన్హా పిదప రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన పండిత పరిషత్తు - రాజ్యాంగ పరిషత్తు ఏర్పాటు * చివరకు ప్రత్యేక పాకిస్తాన్ ఏర్పాటుకు అంగీకారం కుదిరింది.

1947 జూన్1948 నాటికి ఇండియాను విడిచిపెట్టి వెళ్ళిపోతామని 1947 ఫిబ్రవరి 20నాడు బ్రిటిష్ ప్రధాని అట్లీ ప్రకటన * ఆగస్టు 15 పాలనా బాధ్యత బదలాయించ డానికి లార్డ్ మౌంట్ బాటన్‌ను వైస్రాయిగా నియామకం - మార్చి 24న పదవీ బాధ్యతలు స్వీకరించాడు. * ఆగస్టు 14-15 బ్రిటిషు ఇండియా దేశ విభజన (పాకిస్తాన్ - ఇండియా) * భారతదేశం స్వతంత్ర దేశంగా ప్రకటన * బదలాయింపు ఆగస్టు 15 జరగాలని జూలై 1న బ్రిటిషు పార్లమెంటు ఇండియా ఇండి పెండెన్స్ ఆక్టును సిద్ధపరచారు * పాలనా బాధ్యత బదలాయింపు (ట్రాన్స్ ఫర్ ఆఫ్ పవర్) జరిగింది. - *మొదటి భారత ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ ఎర్రకోట బురుజు మీద నిలబడి 'ట్రీస్ట్ విత్ డెస్టినీ' చారిత్రాత్మక మైన ప్రసంగం * లార్డ్ మౌంట్ బాటన్ స్వతంత్ర భారత దేశానికి మొదటి గవర్నర్ - జనరల్ అయ్యాడు.



1948 జనవరి 30 గాంధీజీ నిర్యాణం. * భారత్ యూనియన్‌లో సంస్థానాలు విలీనం

విషయంలో హైదరాబాదులో నిజాము వ్యతిరేకించాడు. * సెప్టె. 13న హైదరాబాద్‌పై 'పోలీసు చర్య' జరపగా సంస్థానాల విలీనం పూర్తి చేశారు. * రాజేంద్రప్రసాదు అధ్యక్షతన రాజ్యాంగ పరిషత్తు ఏర్పాటు. 1949 నూతన రాజ్యాంగం సిద్ధం. 1950 జనవరి 26 నూతన రాజ్యాంగం అమలులోనికి వచ్చింది. భారత దేశం రిపబ్లిక్ అయింది. రాజేంద్రప్రసాదు మొదటి రాష్ట్రపతి, జవహర్‌లాల్ నెహ్రూ మొదటి ప్రధాని.



## గాంధీ పేజీలు



### గాంధీ పథం

*కఠోరమైన క్రమశిక్షణ గాంధీజీకి ఆరోప్రాణం. వ్యక్తిత్వ వికాసానికి ఆయన మార్గదర్శక సూత్రాలు పది :*

1. మిత భాషిత్వం.
2. వినదగునెవ్వరు చెప్పిన వినినంతనే వేగపడక. వివరింపదగున్.
3. కాలాయాపన చేయ కూడదు - సమయపాలన పాటించాలి.
4. నిరాడంబరతను పాటించాలి.
5. ఖర్చుపెట్టే ప్రతి పైసా లెక్కపెట్టాలి. నీ సంపదకు నీవు ధర్మకర్తవు మాత్రమే!
6. ప్రార్థనకు అలవాటు కావాలి.
7. వ్యాయామం చేయాలి.
8. మిత భోజనం (బతకటానికే తినాలి).
9. దినచర్యను రాయాలి.
10. మేధస్సుకంటె హృదయం గొప్ప.

### గాంధీజీ దృష్టిలో సప్త పాపాలు....

1. నీతిలేని రాజకీయాలు.
2. పని చేయకుండానే (అధర్మ) సంపాదన.
3. ఆత్మ తృప్తి (మనసు) లేని సుఖానుభూతి.
4. శీలరహిత శాస్త్రజ్ఞానం.
5. ఉదార స్వభావం లేని వ్యాపారం.
6. మానవత లేని విజ్ఞానం.
7. త్యాగరహిత ఆరాధన.

*గాంధీజీ ఈ సప్త పాపాలను సామాజిక పాపాలుగా పేర్కొని ప్రజలను వాటికి దూరంగా ఉండమని బోధించాడు.*



సామ్రాజ్యవాదానికి ఒక సవాలు బాపూజీ చరఖాయుధం

### రఘుపతి రాఘవ....

రఘుపతి రాఘవ రాజారాం
పతిత పావన సీతారాం ॥ర॥

1. ఈశ్వర అల్లా తేరేనామ్
   సబ్‌కో సన్మతి దేభగవాన్ ॥ర॥
2. సుందర విగ్రహ మేఘశ్యామ్
   గంగా తులసి సాలగ్రాం ॥ర॥

రామ రామ రామ రామ రామ రామ
రామ రామ రామ రామ సీత రామ
రామ రామ్ ॥2॥

## గాంధీజీ తారక మంత్రం

"మీకు నేనొక తారకమంత్రం ఉపదేశిస్తున్నాను. మీ మనస్సు ఊగిసలాడుతున్నప్పుడుగాని ఏదైనా సంక్షోభంలో ఇరుక్కున్నప్పుడుగాని కింది విషయాన్ని గుర్తించుకోండి --

మీ జీవితకాలంలో మీకు తారసపడిన దరిద్రుణ్ణి బలహీనుణ్ణి ఒకసారి తలుచుకోండి. అప్పుడు మీరు వేయబోయే అడుగు అతనికేమైనా ప్రయోజనం ఉందా? అతని జీవితమూ జీవిత ధ్యేయమూ సఫలీకృతమవుతుందా? ఆకలిగా ఉన్న వానికిగాని నైరాశ్యంవల్ల గాని కుంగిపోతున్నవానికిగాని ఉపశమనం ఏమైనా కలుగుతుందా? అని ప్రశ్నించుకోండి.

వీటికి సరైన సమాధానం లభించినప్పుడు మీ ఊగిసలాటా సంధిగ్ధావస్థా మబ్బులా తొలగిపోయి మనసు కుదుటపడి మీకు ప్రశాంతి లభిస్తుంది." -- గాంధీ



### వైష్ణవ జనతో.....

వైష్ణవ జనతొ తేనే కహియే
జోపీడపరాయీ జాణేరె
॥వై॥

1. పరదుంఖీ ఉపకారకరేతోయే
మన అభిమానవ ఆణేరె
॥వై॥

సకలలోకమా సహునీ వందే
నిందానకరే కేణిరె
వాన కాఛ మన నిశ్చలరాజీ
ధన ధన జననీ తేనిరే ॥వై॥

2. సమ దృష్టినే తృష్ణా త్యాగి
పరస్త్రీ జానే మాతరె
జిహ్వాథకే అసత్యనబోలె
పరధన నవ ఝాలె హాథ్‌రే ॥వై॥

# భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న కొందరు యోధులు

| | | | |
|---|---|---|---|
| అంబేద్కర్ | 1891 - 1956 | ఝాన్సీరాణి లక్ష్మీబాయి | 1835 - 1858 |
| అనంత శయనంఅయ్యంగార్ | 1891 - 1978 | టంగుటూరి ప్రకాశం | 1872 - 1957 |
| అరవింద ఘోష్ | 1872 - 1950 | తాంతియా తోపే | మరణం-1859 |
| అరుణ అసఫాలీ | మరణం 1996 | తిరుమలరావు, మొసలికంటి | 1901 - 1979 |
| అల్లూరి సీతారామరాజు | 1897 - 1924 | త్రిపురనేని రామస్వామి | 1886 - 1943 |
| అసఫాలీ | - - | దయానంద సరస్వతి | 1824 - 1883 |
| ఆక్టేవియన్ హ్యూమ్ | 1829 - 1912 | దాదాభాయి నౌరోజి | 1825 - 1917 |
| ఆచార్య నరేంద్ర దేవ్ | 1889 - 1956 | దుగ్గిరాల గోపాలకృష్ణయ్య | 1889 - 1928 |
| అనిబిసెంట్ | 1847 - 1933 | దుర్గాబాయి దేశ్ ముఖ్ | 1909 - 1981 |
| ఇందిరా గాంధి | 1917 - 1984 | నానాసాహెబ్ | 1821 - 1859 |
| ఈశ్వరచంద్ర విద్యాసాగర్ | 1820 - 1891 | నీలం సంజీవరెడ్డి | 1913 - 1996 |
| ఉద్దామ్ సింగ్ | 1899 - 1940 | పద్మజానాయుడు | 1900 - 1975 |
| ఉన్నవ లక్ష్మీనారాయణ | 1873 - 1958 | పింగళి వెంకయ్య | 1885 - 1963 |
| ఎమ్.ఎన్.రాయ్ | 1886 - 1954 | పుచ్చలపల్లి సుందరయ్య | 1903 - 1985 |
| కల్లూరి సుబ్బారావు | 1900 - 1959 | పొట్టి శ్రీరాములు | 1901 - 1952 |
| కళా వెంకట్రావు | 1900 - 1958 | ప్రతివాది భయంకరా చార్యులు | 1910 - 1978 |
| కన్నెగంటి హనుమంతు | మరణం -1922 | ఫెరోజ్ షా మెహతా | 1845 - 1915 |
| కస్తూర్బాగాంధి | 1869 - 1943 | బంకించంద్ర చటర్జీ | 1838 - 1894 |
| కృపలానీ,జె.బి | 1888 - 1982 | బాలగంగాధరతిలక్ | 1856 - 1920 |
| కామరాజ్ నాడార్ | 1902 - 1975 | బిపిన్‌చంద్రపాల్ | 1858 - 1920 |
| కాలేల్కర్ | 1885 - 1981 | బులుసు సాంబమూర్తి | 1886 - 1958 |
| కాశీనాథుని నాగేశ్వరరావు | 1867 - 1938 | బూర్గుల రామకృష్ణారావు | 1889 - 1967 |
| కొండా వెంకటప్పయ్య | 1866 - 1948 | బెజవాడ గోపాలరెడ్డి | 1907 - 1997 |
| ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ | 1890 - 1993 | బొనర్జీ డబ్ల్యు.సి. | 1844 - 1906 |
| ఖాన్ సాహెబ్ | 1883 - 1958 | భగత్‌సింగ్ | 1907 - 1931 |
| గరిమెళ్ల సత్యనారాయణ | 1893 - 1952 | భోగరాజు పట్టాభి సీతారామయ్య | 1880 - 1959 |
| గుల్జారీలాల్ నందా | జననం - 1897 | మదన్ మోహన్ మాలవ్యా | 1861 - 1946 |
| గోపాలకృష్ణ గోఖలే | 1866 - 1915 | మహదేవ గోవింద రానడే | 1842 - 1901 |
| గౌతు లచ్చన్న | 1909 - జననం | మహమ్మద్ ఇక్బాల్ | 1873 - 1933 |
| చంద్రశేఖర్ ఆజాద్ | 1906 - 1931 | మహమ్మదాలీ జిన్నా | 1875 - 1948 |
| చిత్తరంజన్ దాస్ | 1870 - 1925 | మాడపాటి హనుమంతరావు | 1885 - 1965 |
| చింతామణి సి.వై. | 1880 - 1941 | ముట్నూరి కృష్ణారావు | 1879 - 1945 |
| చిలకమర్తి లక్ష్మీనరసింహం | 1867 - 1946 | మొరార్జీ దేశాయి | 1896 - 1995 |
| జయప్రకాష్ నారాయణ్ | 1902 - 1979 | మోటూరి సత్యనారాయణ | 1902 - 1995 |
| జవహర్ లాల్ నెహ్రూ | 1889 - 1964 | మోతీలాల్ నెహ్రూ | 1861 - 1931 |

| | | | |
|---|---|---|---|
| మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ | 1869 - 1948 | వల్లభ్‌భాయి పటేల్ | 1875 - 1950 |
| మౌలానా అబుల్ కలాం అజాద్ | 1888 - 1958 | విఠల్‌భాయి పటేల్ | 1873 - 1933 |
| మౌలానా మహమ్మదలీ | 1878 - 1931 | విజయలక్ష్మీ పండిట్ | 1900 - 1994 |
| రంగా ఎన్.జి | 1896 - 1995 | వినాయక్ దామోదరసావర్కర్ | 1883 - 1966 |
| రమాబాయి రానడే | 1862 - 1924 | వినోబా భావే | 1895 - 1982 |
| రవీంద్రనాథ్ టాగూర్ | 1861 - 1941 | షౌకత్ అలీ | 1873 - 1938 |
| రాజ్‌గురు | 1911 - జననం | సత్యమూర్తి | 1887 - 1943 |
| రాజగోపాలాచారి ( రాజాజీ) | 1878 - 1972 | సరోజినీ నాయుడు | 1879 - 1949 |
| రాజారామ్‌మోహన్‌రాయ్ | 1772 - 1833 | సయ్యద్ అహమద్ ఖాన్ | 1817 - 1898 |
| రాజేంద్రప్రసాద్ | 1884 - 1963 | సానే గురూజీ | 1899 - 1950 |
| రామమనోహర్ లోహియా | 1910 - 1968 | సుబ్రమణ్య భారతి | 1882 - 1921 |
| రామస్వామి వెంకట్రామన్ | 1911 - జననం | సుబ్రహ్మణ్యం, ఎర్నేని - దండిసత్యాగ్రహి | |
| లాల్ బహుదూర్ శాస్త్రి | 1904 - 1966 | సుభాష్ చంద్రబోస్ ( నేతాజీ ) | 1897 - 1845 |
| లాలాలజపతి రాయ్ | 1865 - 1928 | సురేంద్రనాథ్ బెనర్జీ | 1848 - 1925 |
| వరాహగిరి వెంకట గిరి | 1894 - 1980 | స్వామి రామానందతీర్థ | 1903- 1972 |

## భారతదేశ స్వాతంత్ర్య పోరాటం - కొందరు సమర యోధుల చిత్ర చయనిక


జె.బి. కృపలానీ


వినోబా భావే


కొండా వెంకటప్పయ్య


బిపిన్ చంద్రపాల్


బాలగంగాధర్ తిలక్


గౌతు లచ్చన్న


పట్టాభి సీతారామయ్య


బెజవాడ గోపాల రెడ్డి


సరోజిని నాయుడు


అరుణ అసఫాలి


అనిబిసెంట్


సురేంద్రనాథ్ బెనర్జీ

# భారతదేశం - నామ నిఘంటువు




**అంబేద్కర్:** 1891 - 1956 జాతీయవాది. భారత రాజ్యాంగ స్రష్ట. నిమ్న వర్గాల వారి అభ్యున్నతికి పాటుపడ్డ మహా మేధావి.



**అక్బర్:** 1542-1605 ఘనకీర్తిని పొంది భారతదేశాన్ని వరిపాలించిన మొగలాయి చక్రవర్తి. జిజియా అనే జుట్టు పన్నును రద్దు చేశాడు. దీన్-ఇ-ఇలాహీ అనే సర్వమత ధర్మాలతో కూడిన నూతన మతాన్ని స్థాపించాడు.

**అజాద్ మౌలానా అబుల్ కలామ్ :** 1888 - 1958 జాతీయ నాయకుడు. స్వాతంత్ర్య సమర యోధుడు. ఖిలాఫత్ ఉద్యమాన్ని ప్రోత్సహించాడు. కేంద్ర మంత్రి.



**అన్నాదొరై :** 1909 - 1969 తమిళనాడులో ద్రవిడ మున్నేట్ర కజగము అధినేత. రాష్ట్ర ముఖ్య మంత్రి (1967-69). ప్రముఖ రచయిత. దక్షిణాది 'గాంధీ'గా ప్రసిద్ధి.




**అమీర్ ఖుస్రో:** 1252 - 1324 చిస్తీ సంప్రదాయానికి చెందిన సూఫీ గురువు. తుగ్లక్ కొలువులో ఆస్థాన కవి. తుగ్లక్‌నామా, నుహిసిపేర్, తాజుల్‌ఫతుహే ఈయన ప్రముఖ రచనలు.

**అరవింద ఘోష్** 1872-1950: పాండిచ్చేరిలో అరవిందాశ్రమం స్థాపించిన భారతీయ తత్త్వవేత్త. పూర్వాశ్రమంలో విప్లవయోధుడు. ఆయన రచనలలో 'సావిత్రి' ప్రధానమైంది. 'మదర్'గా సుప్రసిద్ధురాలైన ఫ్రెంచి మహిళ ఆయన శిష్యురాలు.



**అశోకుడు:** క్రీ.పూ. 3వ శతా. భారతదేశ చరిత్రలో ఘనకీర్తి నార్జించిన మౌర్య చక్రవర్తి. బుద్ధుని బోధనల వల్ల ప్రభావితుడై బౌద్ధ భిక్షువుగా మారాడు. తన కుమార్తె 'సంఘమిత్ర'ను ఆగ్నేయాసియా కు పంపి బౌద్ధమత వ్యాప్తికి తోడ్పడ్డాడు. దేశంలో 49 చోట్ల శిలాస్తూపాలు ప్రతిష్ఠించాడు.

**అనీబిసెంట్** : 1847 - 1933 జాతీయవాది. మద్రాసులో దివ్యజ్ఞాన సమాజం (తియోసాఫికల్ సొసైటీ) లో ప్రముఖ సభ్యురాలు. భారత స్వాతంత్ర్యానికి పాటు పడి అందుకోసం హోమ్‌రూల్ ఉద్యమం నడిపిన ఆంగ్ల మహిళ. జిడ్డు కృష్ణమూర్తిని అతని బాల్యంలోనే చేరదీసి అతనిని మహా ప్రవక్తగా మలచడానికి చేసిన కృషి చివరకు ఫలించలేదు.

**ఇందిరా గాంధీ**: 1917 - 1984: భారతదేశానికి మూడవ ప్రధాని (ప్రైమ్ మినిస్టర్). జవహర్ లాల్ నెహ్రూ ఏకైక పుత్రిక. భారత స్వాతంత్ర్య సమర




యోధురాలు. వానరసేనకు నాయకురాలు. *'గరీబీ హటావ్'* అనే నినాదాన్నిచ్చి బీదజనోద్ధరణకై అనేక కార్యక్రమాలు చేపట్టిన ధీమంతురాలు. శౌర్యశీలి.

**ఇక్బాల్, మహమ్మద్** 1875 - 1933 : 'సారే జహాసే అచ్చా హిందూస్తాన్ హమారా' అనే సుప్రసిద్ధ దేశభక్తి గేయాన్నందించిన ఉర్దూ - పారశీక మహాకవి.

**ఇత్సింగ్** : క్రీ.శ. 635 - 713. అసలు పేరు చాంగ్ వెన్ మింగ్. నలందా విద్యాపీఠాన్ని (తామ్రలిప్తి) సందర్శించి బౌద్ధాన్ని గూర్చి అధ్యయనం చేసి 56 గ్రంథాలను చీనా భాషలో ప్రచురించాడు.

**ఇబ్న్ బతూతా**: క్రీ.శ. 1304 - 1378. అసలుపేరు అబ్దుల్లా మహమ్మద్ ఇబ్న్ బతూతా. ముస్లిం యాత్రికుడు. తుగ్లక్ కొలువులో ఖాజీగా నియమింపబడ్డాడు. అరబ్బీలో యాత్రా చరిత్ర వ్రాశాడు.

**ఇలంగో అడిగళ్** : క్రీ.శ. 2వ శతా. తమిళ మహాకవి. పాండ్య దేశవాసి. *'శిలప్పదికారం (కడియం కథ)'* అనే ప్రాచీన కావ్యాన్ని రచించాడు.

**ఈ.వి.ఆర్. నాయకర్** : 1879 - 1873 తమిళనాడుకు చెందిన సంఘ సంస్కర్త. 'ద్రావిడ కజకం' వ్యవస్థాపకుడు. అన్నాదురైకు గురువు. వెనుకబడిన తరగతులవారికి ఆశాజ్యోతి.




**ఈశ్వర చంద్ర విద్యాసాగర్**: 1820-1891 సంఘ సంస్కర్త. బెంగాల్‌లో స్త్రీ పునర్వివాహ ఉద్యమ కర్త.




**ఏక్‌నాథ్**: క్రీ.శ.16వ శతా. ప్రముఖ మరాఠీ భక్త కవి. *ఏక్‌నాథ్ భగవత్, రుక్మిణీ స్వయంవర్, భారుద* ఈయన రచనలు.

**ఔరంగజేబు** : 1618 - 1707: రాజ్యకాంక్ష ఎక్కువగా గల ఆఖరి మొగలాయి చక్రవర్తి.

షాజహాను మూడవ కుమారుడు. దారాషుకో, మురాద్ అనే అన్న దమ్ముల్ని రాజకీయ హత్యలకు గురి చేశాడు. రెండో అన్నను తరిమి వేశాడు. తండ్రిని చెర శాలలో పెట్టించి 1658లో తాను గద్దెను ఎక్కాడు. హిందూ మత ద్వేషి. ఆలయాల్ని కొల్ల గొట్టాడు. శివాజీ ఈయనకు ప్రత్యర్థి.



**కంబర్:** 12వ శతా. తమిళ మహాకవి. 12,000 వృత్తాలలో 'రామావతారం' అనే రామాయణ కావ్యాన్ని అందించాడు.

**కనిష్కుడు:** క్రీ.శ. 78-105 సుప్రసిద్ధ భారతదేశ చక్రవర్తి. కుషాన్ రాజ వంశీయుడు. బౌద్ధాన్ని చీనా, టిబెట్టుకు విస్తరింపచేశాడు. పెషావరు ఈయన రాజధాని.

**కబీరుదాసు :** 1443 - 1518 గొప్ప రామభక్తుడైన ముస్లిం మహాకవి. కబీరు చేనేత పని చేసేవాడు. భక్తి గీతాలు అల్లి పాడేవాడు.

**కర్జన్ :** 1859 - 1925 జార్జి నతేనియల్ కర్జన్. రాజకీయ ధురంధరుడు. భారత దేశంలో బ్రిటిష్ వైస్రాయి. విద్యా సంస్కర్త. సాంఘిక, ఆర్థిక సంక్షేమ కార్య క్రమాలు నిర్వహించాడు.

**కస్తూర్బా గాంధీ:** 1869 - 1943 మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధీ ధర్మపత్ని. గాంధీ అడుగు జాడల్లోనే ఆమె జీవితం గడిచింది.




**కల్హణుడు:** 11వ శతా. ప్రాచీన కాశ్మీర దేశ చరిత్రను తెలిపే *'రాజతరంగిణి'* సంస్కృత గ్రంథకర్త.

**కామరాజ్ నాడార్ :** 1902 - 1975 జాతీయ నాయకుడు. పూర్తి పేరు కామాక్షీ కామరాజ్ నాడార్. "చూద్దామ్" అని అర్థం వచ్చే 'పార్ కలామ్' ఆయన ఊతపదం. 'కామ రాజ్‌ప్లాన్' ఆయన రాజనీతి చతురతకు తార్కాణం. పదేళ్లు తమిళ నాడు ముఖ్య మంత్రిగా ఉన్నాడు.




**కార్వే, డి.కే. :** 1858 - 1962 పూర్తి పేరు ధోనేధో కేశవ కార్వే. స్త్రీ జనాభ్యుదయానికి కృషిచేసిన సంఘ సంస్కర్త. ఎస్.ఎన్.డి.టి (శ్రీమతి నాథిబాయ్ దామోదర్ తేకరసే) మహిళా కేంద్రాన్ని స్థాపించాడు. దానికి 1951లో యూనివర్శిటీ ప్రతిపత్తి లభించింది.

**కాళిదాసు:** క్రీ.శ. 4వ శతా. పంచ మహా కవులలో (సంస్కృతం) ఒకరు. ఈయన కావ్యాల్లో ప్రధానమైనవి: *ఋతు సంహారం, రఘువంశం, కుమారసంభవం.* నాటకాలు: *అభిజ్ఞాన శాకుంతలం, మాళవికాగ్నిమిత్రం, విక్రమోర్వశీయం.*

**కిప్లింగ్ రుడ్‌యార్డ్:** 1865 - 1936: ప్రముఖ ఇంగ్లీషు కవి. భారతదేశంలో పుట్టి పెరిగినవాడు. నోబెల్ (సాహిత్య) పురస్కార గ్రహీత (1907). *ది జంగిల్ బుక్, కిమ్,*

రిక్కీ-టిక్కీ-తావీ (పాము-ముంగిస పోరాటం) బాబా బాబా బ్లాక్ షీప్ వంటి బాల సాహిత్యాన్ని సృష్టించిన వాడు.

కృపలానీ జె.బీ. : 1888 - 1982: అచ్చమైన జాతీయవాది. భారత స్వాతంత్ర్య సమర యోధుడు. జీవన్‌లాల్ భగవాన్‌దాస్ కృప లానీ ఈయన పూర్తి పేరు. సుచేతా కృపలానీ *(ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి)* ఈయన అర్థాంగి.

క్లైవ్ రాబర్ట్ : 1725 - 1774 భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్య స్థాపనకు గట్టి పునాదులు వేసిన బ్రిటిషు యోధుడు. ఈస్టిండియా కంపెనీలో గుమాస్తాగా చేరి అంచె లంచెలుగా పైకివచ్చిన పరిపాలనా దక్షుడు. ప్లాసీ యుద్ధం (1757) లో సిరాజ్-ఉద్-దౌలాను ఓడించి బెంగాలు గవర్నరు అయ్యాడు.

గజనీ మహమ్మద్: క్రీ.శ. 10వ శతా. భారతదేశం మీద పదిహేడుసార్లు దండ యాత్రలు చేసి సోమనాథ దేవాలయం వంటి హిందూ దేవాలయాల్ని కొల్ల గొట్టినవాడు.

**గాంధీ, మోహన్‌దాస్ కరమ్‌చంద్ : 1869-1948** భారత జాతిపిత. సుప్రసిద్ధ జాతీయ నాయకుడు. ఈయనకు గల ఉదాత్త భావాల కు ప్రభావితురాలై ఆనిబి సెంటు ఈయనను 'మహాత్మా' అని పిలువ నారంభించినది. దక్షిణాఫ్రికాలో నల్లజాతి విముక్తికై పోరాటం సల్పాడు. కైరా, చంపారన్ సత్యాగ్రహాలు, శాసనోల్లంఘనం, సహాయ నిరాకరణ, ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా మహోద్యమాలు నిర్వహించి నడిపాడు. మై ఎక్స్ పరిమెంట్స్ విత్ ట్రూత్ ఈయన స్వీయ చరిత్ర.

**గాలిబ్** : ఉర్దూ పారశీక రచయిత. ఈయన వ్రాసిన రుబాయిలు ప్రసిద్ధి కన్నవి.

**గిరి** : నాలుగోవ భారత రాష్ట్రపతి. పూర్తి పేరు వరహాగిరి వెంకట గిరి. జాతీయ నాయకుడు. కార్మిక రంగంలోకృషి చేశాడు.

**గుజ్రాల్ ఐ.కే.**: (జననం : 1930) భారత ప్రధాని (యునైటెడ్ ఫ్రంట్). 1997 ఏప్రిల్ నుంచి.

**గురుగోవింద్‌సింగ్ : 1666-1708** సిక్కుమత ప్రవక్త. ఆయన తండ్రిని ఔరంగజేబు చంపించగా ప్రతీకారచర్యగా సిక్కుధర్మ సంస్థాపనకై శపథం చేసి దీక్షతో సంత్ సైనిక సింగ్ (ఖాల్సా) పవిత్ర దళాల్ని సమీకరించి వారిని చైతన్యవంతం చేసి 'జపనామా' విజయ పత్రాన్ని సిద్ధపరచి ఔరంగజేబుకు పంపాడు. చక్రవర్తి దర్బారుకు రమ్మని కబురు పంపాడు కానీ అది చేరేలోపునే ఔరంగజేబు మరణించాడు. సిక్కు పవిత్ర గ్రంథం *'గ్రంథ సాహెబు'* ఈయన రచన.

**గోఖలే గోపాలకృష్ణ: 1866 - 1915** ఆధునిక ప్రజాస్వామ్య సంక్షేమ రా జ్యానికి భాష్యం

చెప్పిన జాతీయ వాది. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీని




(1905) స్థాపించాడు. దేశ ప్రజ అంతా అక్షరాస్యులు కావాలంటూ 1912లో ప్రాథమిక విద్యా బిల్లును ప్రవేశపెట్టిన విద్యావేత్త.

**గోవింద వల్లభ్ పంత్** : 1887-1961 ఉత్తరప్రదేశ్‌కు చెందిన జాతీయవాది. 'భారతరత్న' పురస్కార (1957) గ్రహీత. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి. కేంద్ర మంత్రి.

**గౌతమ బుద్ధుడు:** క్రీ.పూ. 567-489 సిద్దార్థుడు, తథాగతుడు అన్నవి ఈయన పేర్లు. బౌద్ధమత స్థాపకుడు. అహింసా తత్వాన్ని ప్రబోధించిన మహా మహనీయుడు.



ఈయన బోధనలు త్రిపిటకాలలో పొందు పరచబడ్డాయి. 29వ ఏట సర్వసంగ పరిత్యాగియై మహాభి నిష్క్రమణ చేసి తపస్సు తర్వాత మహాపరినిర్వాణ (అరిషడ్వర్గాల్ని పరిహరించుకొనుట) స్థితిని పొందాడు.

**గౌతులచ్చన్న** : (జననం 1909) ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్న స్వాతంత్ర్య సమరయోధుడు. బడుగువర్గాల అభ్యున్నతికి పాటు పడుతున్న జాతీయవాది.

**చంద్రగుప్తుడు I** : క్రీ.పూ. 313 చాణక్యుని సహాయంతో మౌర్య సామ్రాజ్యాన్ని స్థాపించిన వాడు. పరాక్రమశాలి. మెగస్తనీస్ అనే గ్రీక్ యాత్రా చారిత్రకుడు (క్రీ.పూ. 302) ఈయన దర్బారులో ఉండి 'ఇండికా' అన్న గ్రంథాన్ని వ్రాశాడు.

**చంద్రగుప్తుడు II** : ఈయన్ని చంద్రగుప్త విక్రమాదిత్యునిగా వ్యవహరిస్తారు. భారతీయ మహాచక్రవర్తులలో ఒకడు. ఈయన పాలనా క్రీ.శ. 375-413 కాలం స్వర్ణయుగమని చారిత్రకులు పేర్కొంటారు. చీనా యాత్రికుడు ఫాహియాన్ ఈయన కాలంలోనే భారతదేశాన్ని సందర్శించాడు. నవరత్నాలన బడే తొమ్మిది మంది మహా విద్వాంసులలో మహాకవి కాళిదాసు ఒకరు. ఈయన రాజ్యంలో సంస్కృతం అధికార రాజభాష.

**చంద్రశేఖర్ ఆజాద్** : 1906-1931 విప్లవ వీరుడు. భారత స్వాతంత్ర్య సమర యోధుడు.

**చాణక్యుడు:** క్రీ.పూ. 4వ శతా. మౌర్య సామ్రాజ్య స్థాపనలో రెండవ చంద్రగుప్తునికి సాయపడి కీలకపాత్ర వహించిన రాజకీయ ధురంధరుడు. పరమనైష్ఠికుడు. మహా విద్వాంసుడు. రాజనీతి చతురుడు. విష్ణుగుప్తుడు, కౌటిల్యుడు ఆయనకు గల పేర్లు. ఈయన రచన అర్థశాస్త్రం భారత రాజనీతిని వివరించే లక్షణ గ్రంథం.

**చిత్తరంజన్ దాస్** : 1870-1925 'దేశబంధు' బిరుదాంకితుడు. హోమ్‌రూల్ ఉద్యమంలో పాల్గొన్న జాతీయ నాయ కుడు. టంగుటూరి ప్రకాశంకు రాజకీయ మిత్రుడు.

**చైతన్య ప్రభువు:** క్రీ.శ. 1485-1533 అసలు

పేరు 'నిమాయి'. బెంగాలులో కృష్ణభక్తి సంప్రదాయంలో భక్తి ఉద్యమాన్ని చేపట్టిన మహా భక్తుడు.




**జగజీవన్‌రామ్ :** 1908-1986 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్న ప్రముఖ హరిజన జాతీయ వాది. కేంద్రమంత్రి.

**జయదేవుడు:** 12వ శతా. గొప్ప కృష్ణసంప్రదాయ భక్తుడు. సుప్రసిద్ధ సంస్కృత గేయ కావ్యం *'గీత గోవిందం'* కర్త. ఉత్కళ నివాసి. లక్ష్మణసేన మహారాజు కొలువులో ఆస్థాన కవి.

**జయప్రకాష్ నారాయణ:** -1979 సర్వోదయ నాయకుడు. ప్రముఖ భారత స్వాతంత్ర్య యోధుడు. సోషలిస్టు. 1957 నుంచి క్రియాశీలక రాజకీయాలకు దూరంగా ఉంటూ 1975 లో, 'సిటిజన్ ఫర్ డెమొక్రసీ' ఉద్యమాన్ని చేపట్టి అవి నీతి నిర్మూలనకై నడుం బిగించి, 'టోటల్ రివల్యూషన్' నినాదాన్నిచ్చి 1977లో కాంగ్రెసు ఓడిపోవడానికి కారకుడయ్యాడు. 1979




**జవహర్‌లాల్ నెహ్రూ :** 1889-1964 రాజనీతిజ్ఞుడు. ప్రముఖ జాతీయవాది.



స్వాతంత్ర్య సమర యోధుడు. ప్రప్రథమ భారత ప్రధాని (1947-64). గాంధీజీకి రాజకీయ వారసుడుగా ప్రసిద్ధి. సమసమాజ స్థాపనకు కృషి చేశాడు. చైతన్యవంత మైన దౌత్యనీతిని పాటించి ప్రపంచ దేశాల్లో విభిన్న రాజనీతి పద్ధతులకు భాష్యం చెప్పి శాంతి కాముకుడుగా పేరొంది ప్రపంచ శాంతికై 'పంచశీల' ను ప్రకటించాడు. *గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ, స్వీయ చరిత్ర, డిస్కవరీ ఆఫ్ ఇండియా* అన్నవి ఆయన సుప్రసిద్ధ రచనలు.

**జహంగీరు :** 1569 - 1627 నాలుగవ మొగలాయి చక్రవర్తి. అక్బర్ పుత్రుడు. నూర్జహాన్ ఈయన ధర్మపత్ని. షాజహాన్ ఈయన కుమారుడు. మత సహన వాదిగా కీర్తి నార్జించాడు. ఈయన అసలు పేరు సలీమ్. అనార్కలీ అనే దాసీకన్యను ప్రేమించి భగ్న ప్రేమికుడైన ఈయన కథ సాహిత్య లోకంలో సుప్రసిద్ధమైంది.

**జాకీర్ హుస్సేన్ 1897-1969:** భారతదేశానికి మూడవ రాష్ట్రపతి. గాంధీజీ ప్రవచించిన బేసిక్ విద్య (నయీ తాలీమ్)కు ఈయన భాష్యకారుడు.

**జామినీ రాయ్ :** 1887-1972 ప్రముఖ భారతీయ చిత్రకారుడు. కలకత్తా వాసి.

**జైల్‌సింగ్ :** 1916-94 భారతదేశానికి ఏడవ రాష్ట్రపతి (1982-87). సిక్కుమత సంప్రదాయంలో 'జ్ఞానీ' బిరుదాంకితులు. కేంద్ర మంత్రి (1980-82).

**జ్యోతిరావుఫూలే :** 1827 - 1890 మహారాష్ట్ర సంఘ సంస్కర్త. నిమ్న వర్గాలకు ఆశాజ్యోతి.



**జ్ఞానేశ్వర్:** 1275-1296 భక్తి ఉద్యమ కారుడు. జ్ఞానదేవ్ ఈయనకు మరొక పేరు. 'జ్ఞానేశ్వరీ' (*భావార్థ దీపిక*), *గీత, అమృతానుభవం* ఈయన మరాఠీ రచనలు. హిందూమతం లోని భిన్న సంప్రదాయాల మధ్య సామరస్యం సాధించడానికి విశేష కృషిచేశాడు.

**ఝాన్సీ లక్ష్మీబాయి** : 1835-1858 భారత స్వాతంత్ర్య సమర యోధురాలు. సుప్రసిద్ధ వీరనారి. ధైర్య సాహసి. పౌరుష శాలిని. మనూ బాయి ఈమె అస లు పేరు. బ్రిటిష ప్రభువు డల్ హౌసీపై ధ్వజం ఎత్తింది. 1857లో సిపాయిల తిరుగు బాటు (ప్రథమ భారత స్వాతంత్ర్య సమరం)లో అతి భీకర యుద్ధం చేసి వీర మరణం పొందినది.

**టాగూర్, రవీంద్రనాథ్:** 1861-1941 జగత్ప్రసిద్ధి చెందిన బెంగాలీ మహా కవి. ఈయన రచన *'గీతాంజలి'*(1913) కి నోబెల్ పురస్కారం లభించినది. బహు ముఖ ప్రజ్ఞాశాలి. చిత్ర కారుడు, వాగ్గేయ కారుడు, నాటక కర్త. *నౌకాభంగం, గోరీ, రెడ్ ఓలియాండర్స్* ఆయన రచనలలో సుప్రసిద్ధమైనవి. *చండాలిక* బౌద్ధ వస్తువుగల రచన. శాంతినికేతన్, శ్రీనికేతన్ ఆయన స్థాపించిన విద్యా కేంద్రాలు.




**టిప్పు సుల్తాన్** : 1753-1799 దక్షిణ భారత దేశాన్ని ఏలిన ముస్లిం చక్రవర్తులలో ప్రముఖుడు. హైదరాలీ కుమారుడు. మైసూరు దగ్గర శ్రీరంగపట్నం ఈయన కార్యస్థానం. నాలుగవ మైసూరు యుద్ధం (1798-99) వెలెస్లీ ప్రకటించగా రణరంగంలో వీరమరణం పొందాడు.

**డల్‌హౌసీ** : 1812-1860 భారతదేశాన్ని పాలించిన బ్రిటిషు గవర్నర్ - జనరల్ (1848-56). ఈయన కాలంలో ఇండియాలో రైలుమార్గం, తపాలా సౌకర్యాలు నెలకొన్నాయి. ఉన్నత విద్యా సౌకర్యాలు అందించాడు. రూర్కీలో ఇంజనీరింగు కాలేజీ ఈయన హయాము లోనే నెలకొంది.

**డూప్లే:** 1697-1768 ఫ్రెంచి రాజనీతివేత్త. భారతదేశంలో ఫ్రెంచి పలుకుబడికి దోహదం చేసిన ఫ్రెంచి గవర్నరు జనరల్ క్లైవ్ చేతిలో ఓటమిని చవి చూచాడు.

**తాంతియా తోపే** : ప్రథమ భారత స్వా తంత్ర్య సమరయోధుడు. నానా సాహెబుకు మిత్రుడు. ఝాన్సీలక్ష్మీ బాయితో కలసి యుద్ధ తంత్ర జ్ఞతను నడిపాడు. 1859లో పట్టుబడగా ఉరి తీశారు.



**తాతా, జె.ఆర్.డి.** : 1904-1993 ప్రముఖ పారిశ్రామిక వేత్త. పూర్తి పేరు జహింగీర్ రతన్ దాదాబాయ్ టాటా. కళాపోషకుడు, విజ్ఞానాభి లాషి. ప్రప్రథమంగా విమానాన్ని నడిపిన భారతీయ పైలట్.

ాన్సేన్ : 1506-1585 సుప్రసిద్ధ హిందూ స్తానీ ాగ్గేయ కారుడు. గ్వాలియర్ సంస్థానంలో ంగీత విద్వాంసుడు. తర్వాత అక్బరు ొలువులో ఆస్థాన సంగీత విద్వాంసుడు. దీపక్ ాగం ఆయన ప్రత్యేకత.

**ిలక్, బాలగంగాధర్**: 1856-1920 'స్వరాజ్యం ా జన్మహక్కు' అని ఎలుగెత్తి చాటిన ప్రముఖ ారత జాతీయవాది, దేశభక్తుడు. మహా ిద్వాంసుడు. లాల్-బాల్-పాల్ నాయకత్రయం ో రెండవవారు. 'లోకమాన్యుడు'గా ఆయన ప్రసిద్ధి ని పొందాడు. 'కేసరి', పత్రికకు సంపాద కుడు. రాజద్రోహం అభి యోగానికి గురిఅయి నాడు. సమాజ చైతన్యానికి గణపతి నవరాత్రి ఉత్సవాలు ప్రారంభించాడు. *గీతా రహస్యం* ఈయన రచన.

**తులసీదాసు** : 16వ శతా. *'రామచరిత మానస్'* ను రచించిన హిందీ మహాకవి. *కవిత్వ రామాయణ, జానకీ మంగళ కృష్ణ, గీతావళీ, ఛందావతి* మున్నగునవి ఈయన ఇతర రచనలు.

**తోడర్‌మల్లు** : అక్బర్ కొలువులో ప్రధాన మంత్రి. రాజకీయ ధురంధరుడు. రాజా తోడర్‌మల్లుగా ప్రసిద్ధి.

**తోరువత్తు** : 1856-1877 ఇంగ్లీషు కవయిత్రి. భారతీయ మహిళ అయిన ఈమె ఫ్రెంచి, ఆంగ్ల భాషలలోని కావ్యాల్ని చదివి ఆయా భాషల్లో కవితలల్లింది.

**త్యాగయ్య** : 1767-1847 సుప్రసిద్ధ కర్ణాటక వాగ్గేయకారుడు. ఉంఛ వృత్తి చేస్తూ 2400 కీర్తనలను అల్లి అందించాడు. ఈయన అల్లిన ఘనరాగ పంచరత్నాలు ప్రసిద్ధమైనవి. నౌకా చరిత్ర' ఈయన రచనలలో నృత్య నాటిక.

**దండి** : క్రీ.శ. 660-680 మహాకవి. దక్షిణ భారతంలో కాంచీపుర పల్లవరాజా కొలువులో ఆస్థాన కవియని విజ్ఞుల అభిప్రాయం. *'కావ్యాదర్శం'* (అలంకార శాస్త్రం) *దశకుమార చరిత్ర* (గద్య ప్రబంధం) దండి రచనలు.

**దయానంద సరస్వతి స్వామి** : 1824-1883: ఆర్య సమాజ స్థాపకుడు (1875). *సత్యార్థ ప్రకాశ* ఈయన రచన.

**దలైలామా**: జననం 1935. 14వ టిబెట్టు బౌద్ధ ప్రవక్త. ప్రస్తుతం ఈయనకు భారతదేశం ఆశ్రయమిచ్చింది. నోబెల్ శాంతి పురస్కార గ్రహీత.

**దేవెగౌడ** : జననం 1933. భారత ప్రధాని (1996 నుంచి) యునైటెడ్ ఫ్రంట్ నాయకుడు.

**నందలాల్ బోస్** : 1883-1966 వర్ణ చిత్రకారుడు. రవీంద్రనాథ్ టాగూర్ నెల కొల్పిన కళాభవన్‌లో ప్రధానాచార్యుడు. జానపద బాణీని ఈయన అను సరించాడు.

**నందా గుల్జారీలాల్** : జననం 1898 సదాచార పరాయణుడు. తాత్కాలిక భారత ప్రధానిగా వ్యవహరించేవాడు.

**నరేంద్ర దేవ్** : 1889-1956 జాతీయ వాది, దేశభక్తుడు. భారత స్వాతంత్ర్య సమర యోధుడు. ప్రజాసేవకుడు.

**నాదిర్షా** : 1688-1747 మొగలాయి పాలన అంతిమ దశలో భారతదేశం పైకి దండయాత్ర చేసిన ఇరాన్ చక్రవర్తి (షా). ఆ

దండయాత్రలోనే ప్రతిష్ఠనార్జించిన కోహినూరు వజ్రం, నెమలి సింహాసనం ఆయనకు దక్కాయి.
**నానా ఫడ్నవీస్:** 1742-1800 పాలనా దక్షుడు. మహారాష్ట్రకు చెందిన రాజనీతివేత్త. పీష్వా రాజకీయాల్లో పాల్గొని ఇంగ్లీషు వారిని ఓడించడానికి పూను కున్నాడు. పూణే, బెల్గాం పట్టణ ప్రాంతాలను అభివృద్ధి చేశాడు.
**నానా సాహెబు :** ప్రథమ భారత స్వాతం త్ర్య సమరంలో పాల్గొన్న వీరుడు. దండుపంత్ ఈయన అసలు పేరు. ఝాన్సీలక్ష్మీబాయితో కలసి పోరాడాడు.



**నారాయణగురు :** 1855 - 1928 కేరళ ప్రాంతంవాడు. ఒకే దేవుడు, ఒకే మతం, ఒకే కులం అని ఈయన విశ్వాసం. సంఘసంస్కర్త.




**నివేదిత :** 1867-1911 అసలు పేరు నోబేల్. ప్రజా సేవకురాలు. ఐర్లాండ్ వనిత. వివేకానందుని స్ఫూర్తితో హిందూమతావ లంబియై ప్రజాసేవలో నిమగ్నమైంది. కలకత్తా ఆమె కార్యస్థానం.




**నౌరోజీ, దాదాబాయ్ :** 1825-1917 ప్రముఖ జాతీయ నాయకుడు. పార్సీ, హోమ్‌రూల్ ఉద్య మానికి అధ్యక్షుడు. ఆర్థిక శాస్త్రవేత్త. జాతీయ ద్రవ్యస్థితిని గూర్చి పరిశోధనలు జరిపినవాడు.
**పతంజలి :** క్రీ.పూ.2వ శతా. సంస్కృత వ్యా కర్త. పాణిని రచించిన 'అష్టా ధ్యాయి' అనే సంస్కృత వ్యాకరణానికి మహా భాష్యకర్త. వ్యాకరణ మునిత్రయంలో ఈయన మూడవవాడు.
**పద్మిని:** 13 వ శతా. అతిలోక సుందరి. రాజ పుత్ర వనిత. చిత్తోడ్‌గడ్ రాణి. గుహిలీ రాజపుత్ర రాజవంశానికి చెందిన రాణా రత్నసింహుని పట్టమహిషి. అల్లాఉద్దీన్ ఈమెను అద్దంలో చూచి మోహించగా యుద్ధం జరిగింది. పాతివ్రత్యాన్ని రక్షించుకోడానికి ఆమెతోపాటు చాలా మంది రాజపుత్ర స్త్రీలు అగ్నిలో దూకారు.
**పాణిని :** క్రీ.పూ. 7వ శతా. 3995 సూత్రాలు గల 'అష్టాధ్యాయి' ని రచించిన సంస్కృత వ్యాకరణ కర్త. భాషా శాస్త్ర పండితుడు.
**పురుషోత్తముడు :** క్రీ.పూ. 340 పరాక్రమ శాలి. దేశభక్తుడు. గ్రీక్ ప్రపంచ విజేత అలి గ్జాండర్ ప్రపంచాన్నంతటిని జయించాలని బయలుదేరి భారతదేశంలోకి ప్రవేశించబోతుం డగా జీలం నది ఒడ్డున తన సేనలతో దీటుగా నిలిచి పోరాడిన యోధుడు.
**పృథ్వీరాజు :** క్రీ.పూ. 12 వ శతా. ఢిల్లీ రాజధానిగా భారతదేశాన్ని పాలించిన కట్టకడపటి హిందూరాజు. చౌహాన్ రాజ వంశీయుడు. రాణీ సంయుక్త భర్త. ఘోరీ మహ్మదుతో తలపడి పోరాడిన భారతీయ యోధుడు.
**ఫెరోజ్ షా మెహతా :** 1845 - 1915 భారత జాతీయ కాంగ్రెస్ (1885) వ్యవస్థాపక సభ్యుడు.
**బంకిం చంద్ర చటర్జీ :** (1838 - 1894)

బెంగాలీ నవలా రచయిత. వందేమాతరమ్ జాతీయగీత రచయిత. ఈ గీతాన్ని 'ఆనందమఠం'అనే నవలలో పొందు పరిచాడు

**బసవేశ్వరుడు :** 12వ శతా. కర్ణాటక రాష్ట్రంలోని సుప్రసిద్ధ వీరశైవ ప్రవక్త. ఈయన రచన 'బసవ వచనాలు' నీతివంతమైన జీవన విధానానికి మార్గ దర్శక బోధిని.

**బాణుడు :** క్రీ.శ 7వ శతా. సుప్రసిద్ధ సంస్కృత గద్యకవి. ' కాదంబరి',' హర్ష చరిత్ర' ఈయన ప్రధాన రచనలు. హర్షుని ఆస్థానకవి.



**బాబర్ :** 1483 - 1530. భారత దేశంలో మొగలాయీ సామ్రాజ్యాన్ని వ్యవ స్థాపించిన మహావీరుడు. జెంగిజ్‌ఖాన్ (తల్లివైపు) , తైమూరు (తండ్రివైపు) రాజవంశాలకు చెందినవాడు. హుమాయూన్‌కు తండ్రి. 'బాబర్ నామా'లో ఈయన చరిత్రను పొందుపరచారు.

**బిందుసారుడు :** క్రీ.పూ 297 - 272. మగధ చక్రవర్తి. అశోకుని తండ్రి.

**బిపిన్ చంద్ర పాల్ :** 1858 - 1920. భారత స్వాతంత్ర్య సమరయోధుడు. జాతీయవాది. లాల్ - బాల్ - పాల్ నాయకత్రయంలో ఒకరు. మహావక్త.

**బెంటింక్ విలియమ్ :** 1774 - 1839. విలియమ్ కావెండిష్ బెంటింక్ పూర్తిపేరు. బెంగాల్ గవర్నర్ - జనరల్ . భారత దేశంలో బోధనాభాషగా ఇంగ్లీషును ప్రవేశ పెట్టాడు. ఆధునిక వైద్యకళాశాల (మద్రాసు, కలకత్తా) లను నెలకొల్పాడు. 'సతీసహగమనమ'నే దురాచారాన్ని రూపుమాపుటకు రాజా రామ్‌మోహన్ రాయ్‌కు తోడ్పడ్డాడు.

**భగత్ సింగ్ :** 1909 - 1931 భారత స్వాతంత్ర్య సమర యోధుడు . బ్రిటిషు పాలన అంతమొందించడానికి కేంద్ర పార్లమెంటులో బాంబు పేల్చి నందుకు ఉరిశిక్షకు గురియైన విప్లవయోధుడు.

**భరతముని :** క్రీ.శ 4వ శతా. భరతనాట్య శాస్త్రకర్త. 36 అధ్యాయాలలో 3000 శ్లోకాలలో నాట్యశాస్త్రం అనే లక్షణ గ్రంథాన్ని సిద్ధపరచాడు.

**భర్తృహరి :** నీతి, శృంగార , వైరాగ్య శతకాలను సుభాషితాలుగా రచించిన సంస్కృత మహాకవి.

**భవభూతి :** క్రీ.శ 7వ శతా. ఉత్తర రామ చరిత్ర, మహావీర చరిత్ర, మాలతీ మాధవీయం అన్న మూడు సంస్కృత నాటకాలు వ్రాసిన మహాకవి.

**భారవి :** సంస్కృత పంచకావ్యాలలో ఒకటైన కిరాతార్జునీయం వ్రాసిన మహాకవి.

**భాసుడు :** క్రీ.పూ. 3వ శతాబ్దం 'స్వప్నవాసవదత్త' మున్నగు 13 నాటకాల్ని వ్రాసిన సంస్కృత మహాకవి.

**మదన్‌మోహన్ మాలవ్యా :** 1861 - 1946 జాతీయవాది, గొప్ప పార్లమెంటేరియన్. బెనారసు హిందూ యూనివర్శిటీ వ్యవ స్థాపకుడు.

మ దర్ తెరిసా : 1910-1997 దీనజన బంధు. యుగోస్లావియాకు చెందిన ఈ మహిళ




భారతదేశానికి వచ్చి ( 1918) కలకత్తాలో 'మిషనరీస్ ఆఫ్ ఛారిటీస్' వ్యవస్థాపించి మానవ సేవను కొన సాగించి ప్రపం విస్తరింప జేసింది.



**మధ్వాచార్యులు :** 1198 - 1275. ద్వైతమత స్థాపకుడు, ప్రవక్త. అసలు పేరు వానుదేవుడు. జీవాత్మ, పరమాత్మ వేరు అని బోధిస్తూ ద్వైతానికి భాష్యం చె బుతూ సర్వ మూల గ్రంథాన్ని 37 సంపు టాలలో వ్రాశాడు.

**మనువు :** క్రీ.పూ. 2వ శతా. సంఘ శాసన కర్త భారతీయ ధర్మశాస్త్రం అయిన 'మనుస్మృతి' కర్త.

**మహమ్మద్ బిన్ తుగ్లక్ :** క్రీ.శ 14 వ శతా. భారతదేశంలో సుల్తానా రాజ వంశ స్థాపకుడు, రాజ ధానిని ఢిల్లీ నుండి దేవగిరికి, మరల ఢిల్లీకి మార్చి నాడు.



**మహావీరుడు :** క్రీ. పూ. 544 - 599 జైనమత వ్యవస్థాపకుడు. గౌతమ బుద్ధుని సమకాలికుడు. 'అహింసయే పరమ ధర్మం' అతని ప్రధాన బోధన.

**మాఘుడు :** క్రీ.శ. 7వ శతా. పంచ కావ్యాలలో ఒకటైన 'శిశుపాలవధ' ను వ్రాసిన సంస్కృత మహాకవి.

**మొరార్జీ దేశాయి :** 1896 - 1995. భారత ప్రధాని ( 1977 - 79). పూర్తిపేరు మొరార్జీ రంఛోడ్‌లాల్ దేశాయి. జాతీయ నాయకుడు. నిరాడంబరుడు.

**మోతీలాల్ నెహ్రూ :** 1861 - 1931 జాతీయవాది. భారత స్వాతంత్ర్య సమర యోధుడు జవహర్‌లాల్ నెహ్రూకు తండ్రి.

**మౌంట్ బాటెన్ :** 1900 - 79. భారత దేశానికి ఆఖరి వైస్రాయి. భారత స్వాతంత్ర్య తుది ఘట్టంలో అధికారాన్ని బదలాయింపు చేసిన బ్రిటిషు అధికారి. స్వతంత్ర భారత దేశానికి మొట్ట మొదటి గవర్నర్ - జనరల్.




**రంజిత్ సింగ్ :** 1780 : 1839. పంజాబు మహారాజు. సిక్కు రాజ్య కూటమిలో సు కార్ చకీయా శాఖకు నాయకుడు. ఆఫ్ఘన్ రాజును ఓడించి (1822) లాహోరు, అమృతసర్ రాజధానులను వశపరచుకున్నాడు.

**రమణ మహర్షి :** 1879 - 1950. తనను తాను తెలుసుకొనగలగడమే సర్వోత్తమ మైనజ్ఞానం అని ప్రవచించిన ఆధునిక మహర్షి

తమిళనాడులోని తిరువణ్ణామలై (అరుణాచలం) ఆయన స్థావరం.

**రాజగోపాలాచారి చక్రవర్తి : 1878 - 1972** రాజాజీగా ప్రసిద్ధుడు. జాతీయ నాయకుడు మహాత్మాగాంధీగారి వియ్యంకుడు. భారత స్వాతంత్ర్య సమర యోధుడు. పాత్రికేయుడు. రచయిత *(వ్యాసర్ విరందు. చక్రవర్తి తిరుమగన్).*




**రాజరాజ చోళుడు :** క్రీ.శ. 10 తంజావూరు రాజధానిగా చోళరాజ్యాన్ని ఏలిన చక్ర వర్తులలో ప్రముఖుడు. కళాపోషకుడు. వాస్తు శిల్పకళను పోషించాడు. బృహదీశ్వరాలయం ఈయన నిర్మించినదే.

**రాజారామమోహన్ రాయ్ : 1772-1833.** బ్రహ్మ సమాజ సంస్థాపకుడు. నాటి బ్రిటిష గవర్నర్ - జనరల్ బెంటింక్ సహాయముతో 'సతీ సహగమనం' అనే దురాచార నిర్మూలనకు కృషిచేసిన సంఘ సంస్కర్త.



**రాజీవ్ గాంధీ : 1944-1989.** భారత ప్రధాని (1984 - 1989). ఇందిరాగాంధీ జ్యేష్ఠపుత్రుడు. బీద జనోద్ధరణకై అనేక కార్యక్రమాలు చేపట్టాడు.

**రాజేంద్రప్రసాద్ : 1888-1963.** జాతీయ వాది (బీహారు). భారత దేశానికి తొలి రాష్ట్ర పతి. భారత స్వాతంత్ర్య సమర యోధుడు. భారత రాజ్యాంగాన్ని సిద్ధపరచిన రాజ్యాంగ పరిషత్తుకు అధ్యక్షుడుగా వ్యవహరించాడు.

**రాణా ప్రతాప్‌సింగ్ :** *16 శతా. రాజపుత్ర* యోధుడు. మేవాడ్ మహారాజు.

**రానడే మహాదేవ గోవింద : 1842 - 1901** భారతీయ విద్వాంసుడు. దేశభక్తుడు గోఖలేకు గురువు.

**రామకృష్ణ పరమహంస : 1836-1886.** ఆధ్యాత్మిక సాధకుడు (బెంగాలు). ఆధునిక భారతీయ ప్రవక్త. వివేకానంద స్వామికి గురువు. సర్వ మతసారాన్ని ప్రపంచమంతా చాటాడు.




**రామన్ సి.వి. : 1888 - 1970** పూర్తి పేరు చంద్రశేఖర్ వెంకట రామన్. సుప్రసిద్ధ భౌతిక శాస్త్రవేత్త. ఈయన కనిపెట్టిన 'రామన్ ఎఫెక్ట్' (స్పెక్ట్రోస్కోపీ) జగ త్ప్రసిద్ధిగాంచి, నోబెల్ పురస్కారానికి (1928) అర్హుడ య్యాడు.




**రామానుజాచార్యులు: 1077-1157.** విశిష్టాద్వైత మత ప్రవక్త. శ్రీవైష్ణవ మతంలో తెంగళ్ సంప్రదాయాచార్యులు. యతిరాజు అని

వ్యవహార నామం. శ్రీపెరుంబుదూరు (తమిళనాడు) ఆయన కార్య కేంద్రం. శ్రీభాష్య కర్త. గద్యత్రయం ఈయన మరొక రచన.



**రాయ్ ఎమ్.ఎన్.** : 1887-1954. తత్త్వవేత్త. హేతువాది. రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ వ్యవస్థాపకుడు. అసలు పేరు నరేంద్ర నాథ్ భట్టాచార్య.




**లాల్ బహదూర్ శాస్త్రి:** 1904-1966 భారత దేశానికి ద్వితీయ ప్రధాని. సచ్ఛీలుడుగా ప్రసిద్ధి. శాంతి కాముకుడు.




**లాలా లజపతిరాయ్** : 1865-1929 జాతీయవాది భారత స్వాతంత్ర్య సమర యోధుడు. 'పంజాబు కేసరి' అని ఈయనకు బిరుదు. ద్వీపాంతర శిక్ష (మాండలే - బర్మా) అనుభవించిన దేశ భక్తుడు.




**లోహియా రామ్ మనోహర్** : 1910-1967. సమసమాజవాది. సోషలిస్టు.

**వల్లభ్‌భాయి పటేల్:** 1875-1950. జాతీయవాది. భారత స్వాతంత్ర్య పోరాటాన్ని నైతిక మార్గంలో నిర్వహించిన ధైర్యశాలి. గాంధీజీకి నమ్మిన బంటు. 'ఉక్కు మనిషి' గా సుప్రసిద్ధుడు. భారత స్వాతంత్ర్యానంతరం భారత ఉప ప్రధానిగా వ్యవహరించాడు. 520 పెద్ద, చిన్న స్వదేశీ సంస్థానాలను భారత ప్రభుత్వంలో విలీనం చేసి దేశ సమైక్యతను పరిరక్షించిన దక్షతగల పాలకుడు.




**వళ్ళువర్:** తిరువళ్ళువర్‌గా ప్రసిద్ధి. 2000 ఏళ్ళనాటివాడని చెబుతారు. తిరుక్కురళ్ తమిళ నీతిశాస్త్ర గ్రంథ కర్త.



**వాత్స్యాయనుడు** : క్రీ.శ.2వ శతా. కామశాస్త్ర గ్రంథకర్త.

**వాల్మీకి** : కాలం తెలియదు. ఋషి సంస్కృతంలో ఆది కవి. 'రామాయణ' కావ్యకర్త. కావ్యవైతాళికులలో ప్రసిద్ధుడు.




**వాస్కోడిగామా:** 1460-1524. దేశాన్వేషకుడు.

యూరపు నుండి సముద్ర మార్గాన ఆఫ్రికాను చుట్టి (1498) భారత దేశం (కాలికట్టు) చేరిన మొట్టమొదటి పోర్చుగీసు నావికుడు.

**విజయలక్ష్మీ పండిట్:** 1900-1994 జాతీయవాది. భారత స్వాతంత్ర్య సమరయోధురాలు. జవహర్‌లాల్ నెహ్రూ సోదరి. యునైటెడ్ నేషన్స్‌కు ప్రెసిడెంటు (1954).

**వినోబా భావే :** 1895-1982. భూదాన యజ్ఞ స్థాపకుడు. ఈయన ఆంధ్ర ప్రదేశ్‌లోని పోచంపల్లి గ్రామంలో మొట్ట మొదట భూదాన యజ్ఞాన్ని ప్రారంభించాడు. గాంధేయుడు. ఆధునిక భారత యోగి. గాంధీగారి 'వ్యక్తి సత్యాగ్రహం' లో ప్రప్రథముడు.

**విశ్వనాథ్ ప్రతాప్ సింగ్ :** జననం 1931. ఏడవ భారత ప్రధాని (1989-91). వెనుకబడిన తరగతుల అభ్యున్నతికై "మండల్ కమీషన్" ఏర్పాటు చేసినవాడు.

**వెంకటరామన్, రామస్వామి :** జననం 1911. ఎనిమిదవ రాష్ట్రపతి. భారత స్వాతంత్ర్య సమర యోధుడు. తమిళనాడు రాష్ట్ర మంత్రి వర్గంలోనూ కేంద్ర మంత్రివర్గంలోనూ సభ్యుడుగా ఉండేవాడు.

**వేదాంత దేశికులు :** క్రీ.శ.1300 ప్రాంతం. విశిష్టాద్వైత మతంలో, వేదాలకు ప్రాధా న్యాన్నిచ్చే వడగల్ వైష్ణవ సంప్రదాయానికి చెందిన ప్రధానాచార్యు లలో ప్రముఖుడు.

**శంకర పిళ్ళై:** 1902-1989. కార్టూన్ చిత్రకారుడు. చిల్డ్రన్ బుక్ ట్రస్టు వ్యవస్థాపకుడు. బాలబాలికలలో చిత్రకళా సృజనాత్మకతను వెలికి తీయడానికి పోటీలు నిర్వహించిన బాలబంధు.

**శంకరాచార్య:** క్రీ.శ. 8వ శతా. హిందూ మతంలో శైవ ప్రధానమైన అద్వైత సంప్రదాయాన్ని ప్రవచించిన మహా ప్రవక్త. కాలాడి ఈయన జన్మస్థలి.



**శంకర దయాళ్ శర్మ:** జననం ✻ తొమ్మిదవ భారత రాష్ట్రపతి (1992 -1997). ఆంధ్ర ప్రదేశ్‌కు గవర్నరు (1984).

**శివాజీ :** 1627-1680. మహారాష్ట్ర రాజ్య వ్యవస్థాపకుడు. మొగలాయి చక్రవర్తి ఔరంగజేబుతో తలపడ్డాడు. 'ఛత్రపతి' బిరుదాంకితుడు.




**షర్షా:** 16వ శతా. (ఆఫ్ఘన్) మొగల్ చక్రవర్తి. హుమాయూన్‌ను తరిమి వేసి భారత దేశాన్ని పాలించిన సూర్ రాజవంశీయుడు. రైతువారీ పద్ధతిని ప్రవేశ పెట్టాడు. భూముల సర్వే, శిస్తు వసూళ్ళు ఈయన కాలంలోనే ప్రారంభమయ్యాయి.

**షాజహాన్ :** 1592 - 1666. ఐదవ మొగలాయీ చక్రవర్తి అక్బర్ మనుమడు. జహంగీర్ కుమారుడు.



షాజహాన్ అసలు పేరు ఖుర్రమ్. ముంతాజ్ మహల్ ఈయన పట్టమహిషి. ఆమె మరణానంతరం సుప్రసిద్ధమైన 'తాజ మహల్'ను నిర్మింపచేశాడు. ఈయన పాలన స్వర్ణయుగంగా ప్రసిద్ధి.

**షిరిడి సాయిబాబా** : 1843-1919. దివ్య పురుషుడుగా ప్రసిద్ధి. మహారాష్ట్రలోని అహ్మద్ నగర్ జిల్లాల్లో నాసిక్ సమీపంలో ఈయన పేర దేవళం ఉంది.

**సత్య సాయిబాబా** : జననం 1927. అనంతపురం జిల్లా పుట్టపర్తిలో ప్రశాంతి నిలయం ఈయన కార్య కేంద్రం. భక్త పరంపర ఉంది. సంఘసేవ చేస్తున్న ఆధ్యాత్మిక మార్గదర్శి.

**సావర్కర్ వినాయక దామోదర్** : 1883 - 1996 భారత స్వాతంత్ర్య సమరయోధుడు. హిందూత్వం ఈయన బాట. మహావక్త.

**సుబ్రమణ్య భారతి** : 1 8 8 2 - 1 9 2 1. జాతీయవాది. సుప్రసిద్ధ తమిళ మహాకవి. పాత్రికేయుడు. దేశభక్తి గేయకర్త. భారత స్వాతంత్ర్య ఉద్యమంలో తన దేశభక్తి కవితల ద్వారా ప్రజలలో చైతన్యం తీసుకువచ్చాడు.

**సుభాస్ చంద్రబోసు** : 1897-1945 (?) *'నేతాజీ'* ఈయన వ్యవహారనామం. భారత స్వాతంత్ర్యోద్యమ నాయకులలో ఈయన మహా సాహసికుడు. *'ఆజాద్ హింద్ ఫౌజు' (ఇండి యన్ నేషనల్ ఆర్మీ)* సర్వ సేనాధిపతి. 'మీరు రక్తం ఇవ్వండి. నేను మీకు స్వాతంత్ర్యం తెచ్చి పెడతానని ఐ.ఎన్.ఏ. వీరులకు ప్రబోధించాడు.

**సురేంద్రనాథ్ బెనర్జీ** : 1848-1925. భారత జాతీయ కాంగ్రెసు వ్యవస్థాపకులలో ఒకడు. మహావక్త. మేధావి. 'బెంగాలు విభజన' వ్యతిరేక పోరాటంలో ప్రముఖ పాత్ర వహించాడు.

**సూరదాసు** : 16వ శతా. భక్తకవి. కృష్ణ భక్తుడు. శుద్ధాద్వైత మతప్రవక్త వల్లభాచార్యుని శిష్యుడు. వ్రజభాషలో "సూర్ సాగర్" ఆయన కీర్తనావళి.

**స్వామి రామతీర్థ** : 1873-1905. పంజాబు రాష్ట్రీయుడు. ఆధ్యాత్మిక చింతనుడు.

**స్వామి వివేకానంద** : 1863-1902. హిందూమత ప్రాశస్త్యాన్ని లోకానికి ప్రచారం చేసిన ఆధునిక ప్రవక్త. అసలు పేరు నరేంద్రనాథ దత్తు. రామకృష్ణ పరమహంస శిష్యుడు. రామకృష్ణ మిషన్, సేవాధర్మ సంస్థ వ్యవస్థాపకుడు.



**హర్షుడు** : క్రీ.శ. 590-647. మహా చక్రవర్తి. ఈయన కాలంలోనే చీనా యాత్రికుడు హుయాన్‌స్యాంగ్ భారత దేశాన్ని సందర్శిం చాడు. నాడు నలందా విద్యాపీఠం ఉచ్చదశలో ఉండేది. "నాగానందం' ' "ప్రియ దర్శిక" రెండు నాటకాలు వ్రాసి మహాకవిగా సుప్రసిద్ధు డయ్యాడు.

**హుమాయూన్** : 16 శతా మొగలాయి చక్రవర్తి. శూరుడు. అక్బర్ తండ్రి. బాబరు మనవడు.

**హుయాన్‌స్యాంగ్** : క్రీ.శ. 604-664. హర్షునికాలంలో భారత దేశం సందర్శించిన చీనా యాత్రా చరిత్రకారుడు. 657 బౌద్ధ లిఖిత గ్రంథాలను సేకరించి చీనాకు తీసుకు వెళ్ళి 74 సంపుటాల్లో చీనాభాషలో పొందుపరచాడు.



**హేస్టింగ్స్ వారెన్** : 1732-1818. బ్రిటిషు ఈస్ట్ ఇండియా కంపెనీ తరపున ప్రప్రథమ గవర్నర్-జనరల్‌గా భారతదేశాన్ని పాలించినవాడు.



# ఆంధ్రప్రదేశ్ సంగ్రహస్వరూపం

దాదాపు రెండు వేల ఏళ్ల చరిత్రగల ప్రాంతం ఆంధ్రప్రదేశ్. 1956లో నవ. 1 భాషాప్రయుక్త రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ ఫలితంగా నేటి ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. అంతకు ముందు తెలుగు మాట్లాడే ప్రాంతం వారికి ప్రత్యేక రాష్ట్రం కావాలని పొట్టి శ్రీరాములు ఆమరణ దీక్ష పట్టి 1952 (డిసె 15)లో అమరుడుకాగా 1953 (అక్టో 1) లో ఏడు కోస్తా జిల్లాలు, నాలుగు రాయలసీమ జిల్లాలతో కర్నూలు రాజధానిగా 'ఆంధ్ర రాష్ట్రం' ఏర్పడింది. చారిత్రకంగా ఈ ప్రాంతాన్ని సాతవాహనులు, విష్ణు కుండినులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, రాష్ట్ర కూటులు, చోళ, చాళుక్య, కళింగ, కాకతీయ, గోల్కొండ, మొగలాయి, అసఫ్ జాహీ బ్రిటిషు వలస రాజవంశాలు ఆయాకాలాల్లో పాలించాయి. భారతదేశం బ్రిటిషు పాలన కిందకు వచ్చినప్పుడు మద్రాసు ప్రెసిడెన్సీలో అంతర్భాగంగా కోస్తా, రాయలసీమ ప్రాంతాలు ఉండేవి. మిగతాది అసఫ్ జాహీ నిజాం ఏలుబడిలో తెలంగాణా ప్రాంతంగా ఉండేది. ప్రస్తుతం 23 జిల్లాలతో కోస్తా, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు ఆంధ్రప్రదేశ్‌గా అలరారుతూంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మూడు సహజ భాగాలుగా ఏర్పడి ఉంది. 1. కోస్తా మైదానాలు; 2. తూర్పు కనుమలు; 3. పశ్చిమాన దక్కను పీఠభూమి. జల సంపద అపారం. జీవనదులు గోదావరి, కృష్ణా, పెన్నా పశ్చిమమునుండి తూర్పు వైపుకు పారుతూ బంగాళాఖాతంలో సాగర సంగమవుతున్న ప్రాంతాల్లో జగత్ప్రసిద్ధిగన్న అతిసారవంతమైన భారీ డెల్టాలు ఏర్పడ్డాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పటిష్ఠమైన రైతాంగంతో భారత దేశానికే ఒక పెద్ద ధాన్యాగారమని ప్రసిద్ధి. నెల్లూరు జిలాల్లో పులికాటు, కృష్ణా జిల్లాలో కొల్లేరు సరస్సులు ఉన్నాయి. తుంగభద్రా, మంజీర, వంశధార, చిత్రావతి, పాపఘ్ని, నాగావళి, సగిలేరు, సువర్ణముఖి మొదలైనవి ఈ రాష్ట్రానికి ఇతర జలాధారాలు, గోదావరి, కృష్ణానదుల మీద డెల్టా రూపుగొనే చోట్ల నూటాయభయి ఏళ్ల క్రితమే ఆనకట్టలు కట్టి పంట నీటిని సాగుకు పొలాలకు అందించారు. ఇటీవల, వాటిని పునర్నిర్మించగా నాటికి ధవళేశ్వరం వద్ద 'కాటన్ బరాజు' విజయవాడ వద్ద 'ప్రకాశం బరాజు' అని పేర్లు పెట్టారు. గోదావరి నదికి ఎగువన నిజామాబాదు జిల్లాలో పోచంపాడువద్ద శ్రీరామసాగరం, కృష్ణా నది మీద ఎగువన శ్రీశైలం, నాగార్జున సాగరం ప్రాజెక్టులను నిర్మించి పంట నీటితోబాటు జలవిద్యుదుత్పత్తి చేస్తున్నారు. ఈ మూడింటినీ భారీ డాములుగా పరిగణిస్తున్నారు. ఇంత భారీ పంట నీటి వనరులు కలిగి ఒక ప్రముఖ వ్యావసాయిక

రాష్ట్రంగా ప్రసిద్ధిగాంచిన ఆంధ్రప్రదేశ్‌లో హరిత విప్లవం (గ్రీన్ రివల్యూన్) పరిఢవిల్లి(1970) పండే పంటలు: వరి, జొన్న, రాగి, సజ్జ, వేరు సెనగ, ఆముదాలు, చెరకు, పొగాకు, ప్రత్తి, ద్రాక్ష, నిమ్మ, బత్తాయి, చీనీ, జామ, దానిమ్మ ఇతర పండ్ల జాతులు భారీ ఎత్తున పండుతున్నాయి. ఫలితంగా ఆర్థిక వ్యవస్థ ద్విగుణీకృతమైంది. కృష్ణా, గోదావరి నదీ ప్రాంతాలలో చమురు వాయువు, పెట్రోలు తైల నిక్షేపాలను వెలికి తీసి తెర్మల్ విద్యుదుత్పత్తికీ రసాయన ఎరువుల ఫ్యాక్టరీలకూ ఇంధన సౌకర్యాల నందిస్తున్నారు. శ్వేత విప్లవ ఫలితంగా క్షీరోత్పత్తులు పెరిగి హార్లిక్స్, ఐస్‌క్రీమ్ పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. సింగరేణి, రామగుండం బొగ్గుగనుల ప్రాంతంలో తెర్మల్ విద్యుత్తు కేంద్రాలు నెలకొని పని చేస్తున్నాయి. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి ప్రధాన రేవు పట్టణం విశాఖ పట్టణం. ఇది దేశంలో గల పెద్ద రేవు పట్టణాల్లో ప్రముఖమైంది. దీనిని అనుకుని నౌకానిర్మాణ కేంద్రం, రసాయన ఎరువులు, భారీ ఉక్కు పరిశ్రమ, జింకు కర్మా గారం, హెవీప్లేట్స్ & వెసల్స్ ఫ్యాక్టరీ ఉన్నాయి. కాకినాడలో గోదావరి ఫెర్టి లైజర్స్, నాగార్జు ఫెర్టిలైజర్స్ ఫ్యాక్టరీలు నెలకొని పనిచేస్తున్నాయి. రాజధాని హైదరాబాదు నగరం శివార్లలో అనేక భారీ పరిశ్రమలలో హెవీ ఎలక్ట్రికల్స్ ఎలక్ట్రానిక్స్ ఔషధాలు, భారత డైనమిక్స్, ఆల్విన్, రిఫ్రిజిరేటర్స్ పేర్కొనదగినవి. రాష్ట్రంలో కాకి రాయి (ఇనువ రాయి), ముగ్గు రాయి (బెరైటిస్) బంకమన్ను, సున్నపురాయి, మైకా, మాంగనీసు మున్నగు ఖనిజనిక్షేపాలున్నాయి. అంతర్జాతీయ మెట్ట పంటల పరిశోధన కేంద్రం (ఇక్రిశాట్) హైదరాబాదు సమీపాన పటాన్‌చెరులో ఉంది. రాష్ట్రంలో 11 విశ్వ విద్యాలయాలున్నాయి. 13 ఇంజనీరింగు

**ఆంధ్రప్రదేశ్ ప్రధానమైన కొన్ని వివరాలు**

**ఆంధ్రదేశ అవతరణ : నవం, 1, 1956**
**ఉనికి : $12^{\circ}14$, $19^{\circ}54'$ ఉ అక్షాంశ, $76^{\circ}50'$, $84^{\circ}45'$ రేఖాంశ**
**విస్తీర్ణం : 2,75, 068 చ.కి.మీ.**
**రాజధాని : హైదరాబాదు (భాగ్యనగరం)**
**జనాభా : 6,68,80,000 (1991)**
**జనాభావృద్ధి : 2% ( ఏటా)**
**పట్టణ జనాభా : 80%**
**గ్రామీణ జనాభా: 20%**
**జిల్లాలు : 23**
**భాష : తెలుగు, ఉర్దూ**
**అక్షరాస్యత : 45.11%**
**గ్రామాలు సంఖ్య : 29, 379**
**మహానగరాలు : 6**
**మండలాలు : 1116**
**పట్టణాల సంఖ్య : 9**
**సముద్రతీరం : 982 కి.మీ.**
**లోక్ సభా నియోజకవర్గాలు : 42**
**రాజ్యసభా నియోజక వర్గాలు : 18**
**శాసన సభా నియోజక వర్గాలు : 294**
**పురుషులు : 3, 36, 2300**
**స్త్రీలు : 3, 31,84, 280**

కాలేజీలు, 9 మెడికల్ కాలేజీలు ఉన్నాయి. సుమారు 50,000 ప్రాథమిక పాఠశాలు, 7000 హైస్కూళ్లు, 1300 జూనియరు కాలేజీలు, 300 డిగ్రీ కాలేజీలు విద్యా సౌకర్యాలను కల్పిస్తున్నాయి. 12 సంగీత కళాశాలలు, కూచిపూడి నృత్య కేంద్రం. రాజధాని నగరంలో రవీంద్రభారతి రాష్ట్రస్థాయి రంగస్థల కేంద్రం. బస్సు, రైలు సౌకర్యం అన్ని జిల్లాలోనూ ఉంది. విమాన సౌకర్యం హైదరాబాదు, తిరుపతి విశాఖ పట్టణం, విజయవాడలకు ఉంది. పుణ్య క్షేత్రాలు రాష్ట్రమంతటా అల్లు కుని ఉన్నాయి. తిరుపతి (చిత్తూరు జిల్లా) శ్రీ వెంకటేశ్వర స్వామి ప్రసిద్ధిగన్న దివ్యక్షేత్రం. శ్రీశైలం (కర్నూలు జిల్లా)లోని మల్లికార్జున భ్రమరాంబలవారి శైవ క్షేత్రం. కర్నూలులో మంత్రాలయం శ్రీరాఘవేంద్ర స్వామి (ద్వైతం) వారి తీర్థస్థలి. విజయవాడలో కనకదుర్గక్షేత్రం. అనంతపురం జిల్లాలోని పుట్టపర్తి సత్యసాయి బాబా వారి ప్రశాంతి నిలయ కేంద్రం ప్రపంచం నలుమూలల నుంచీ భక్తుల్ని ఆకర్షిస్తూంది విశాఖ జిల్లాలోని సింహాచలం శ్రీవరాహ నరసింహస్వామి వారి దివ్య సన్నిధి, అహెూబలం లక్ష్మీ నరసింహ స్వామివారి వైష్ణవ క్షేత్రం ఉన్నాయి. అట్లే నల్గొండ జిలాల్లో యాదగిరి నర్సింహ స్వామి వారి సన్నిధి, ఆ సమీపంలోనే కొలనుపాలకలో మహావీరుని జైన క్షేత్రం, మెదకు జిల్లాలో వెసీలియన్ క్రైస్తవ దేవాలయం (చర్చి), వరంగల్లు - ఖాజీపేటలో దర్గా ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రాలు. కూచిపూడి నాట్యం, ఆంధ్రనాట్యం, పేరిణీ తాండవం శాస్త్రీయ నృత్య కళారీతులు. ఆంధ్రప్రదేశ్ జానపద కళలకు కాణాచి : శ్రీకాకుళం - జముకి కథ, విజయనగరం - బొబ్బిలి తూర్పు భాగోతం, విశాఖపట్నం - తప్పెటగుళ్లు, తూర్పు గోదావరి జిల్లా - కోలసంబరం (రామచంద్రపురం) పశ్చిమ గోదావరి జిల్లా గొల్లకులాపం (చాట పర్రు), కృష్ణా జిల్లా భామాకలాపం - పగటి వేషాలు, గుంటూరు జిల్లా పిచ్చుగుంట్లు, పల్నాటి వీరగాథలు, ప్రకాశం జిల్లా కొయ్య బొమ్మలాట, నెల్లూరు జిల్లా తోలు బొమ్మలాట. చిత్తూరు -వీధి నాటకాలు, అనంతపురం-గురవయ్యలు, కర్నూలు - కొమ్ములవారు, మెదక్ - గొల్ల సుద్దులు, వరంగల్లు - ఒగ్గు కథ, నిజామాబాద్ - చిందు భాగవతం, కరీంనగరం - చిరుత రామాయణం ఇలా అనేక స్థానిక జానపద కళారూపాలు జానపదులకు వినోదాన్ని అందిస్తున్నాయి. ఇవిగాక, రాష్ట్రమంతటా బుర్ర కథ వినోద ప్రచార సాధనంగా ఉంది. నేడు తెలుగు నాట సినిమా సంస్కృతి ప్రజాదరణ పొందుటతో రాష్ట్రంలో దాదాపు మూడు వేల సినిమా థియేటర్లు పని చేస్తున్నాయి. ఎనిమిది తెలుగు దిన పత్రికలు, నాలుగు ఇంగ్లీషు దిన పత్రికలు, మూడు ఉర్దూ దిన పత్రికలు, రెండు హిందీ దిన పత్రికలు వార్తా సమాచారాన్ని అందిస్తున్నాయి. వీటితోబాటు దూరదర్శన్, రేడియో కేంద్రాలు మరో మూడు ఉపగ్రహ ఛానెల్సు ( ఈ టీ.వి, జెమినీ టీ.వి, సిటీ కేబుల్) ఎలక్ట్రానిక్ మీడియాలో సమాచార విజ్ఞాన వికాస వినోదాల్ని అందిస్తున్నాయి.

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం - జిల్లాల వివరాలు (1991)

| వరుస సంఖ్య | జిల్లాపేరు | విస్తీర్ణం చ.కి.మీ. | జనాభా | జిల్లా కేంద్రం | అక్షరాస్యత శాతం |
|---|---|---|---|---|---|
| 1. | అనంతపురం | 19,130 | 31,83,781 | అనంతపురం | 42 |
| 2. | ఆదిలాబాదు | 16,128 | 20,80,231 | ఆదిలాబాదు | 33 |
| 3. | కడప | 15,359 | 22,59,154 | కడప | 48 |
| 4. | కరీంనగరం | 11,823 | 30,43,228 | కరీంనగరం | 37 |
| 5. | కర్నూలు | 17,658 | 29,73,709 | కర్నూలు | 40 |
| 6. | కృష్ణా | 8,727 | 36,93,179 | చిలకలపూడి (మచిలీపట్నం) | 53 |
| 7. | ఖమ్మం | 16,029 | 22,00,081 | ఖమ్మం | 41 |
| 8. | గుంటూరు | 11,391 | 40,85,904 | గుంటూరు | 46 |
| 9. | చిత్తూరు | 15,152 | 32,49,565 | చిత్తూరు | 50 |
| 10. | తూర్పుగోదావరి | 10,807 | 45,41,306 | కాకినాడ | 49 |
| 11. | నల్గొండ | 14,240 | 28,50,183 | నల్గొండ | 38 |
| 12. | నిజామాబాదు | 7,956 | 20,34,794 | నిజామాబాదు | 34 |
| 13. | నెల్లూరు | 13,076 | 23,90,485 | నెల్లూరు | 48 |
| 14. | పశ్చిమ గోదావరి | 7,742 | 35,13,979 | ఏలూరు | 53 |
| 15. | ప్రకాశం | 17,624 | 27,50,340 | ఒంగోలు | 40 |
| 16. | మహబూబునగరం | 18,432 | 30,71,765 | మహబూబునగరం | 30 |
| 17. | మెదకు | 9,699 | 22,64,124 | సంగారెడ్డి | 32 |
| 18. | రంగారెడ్డి | 7,492 | 25,28,208 | హైదరాబాదు | 49 |
| 19. | వరంగల్లు | 12,846 | 28,11,174 | వరంగల్లు | 39 |
| 20. | విజయనగరం | 6,539 | 21,01,394 | విజయనగరం | 34 |
| 21. | విశాఖపట్టణం | 11,161 | 32,72,110 | విశాఖపట్టణం | 46 |
| 22. | శ్రీకాకుళం | 5,837 | 23,14,442 | శ్రీకాకుళం | 36 |
| 23. | హైదరాబాదు | 217 | 30,43,228 | హైదరాబాదు | 72 |
| | ఆంధ్రప్రదేశ్ | 2,77,068 | 6,63,04,854 | హైదరాబాదు | 44 |

### ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, భౌగోళికంగా మూడు ప్రాంతాలుగా ఉంది.

1. **కోస్తా ప్రాంతం** : 9 జిల్లాలు : శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు.
2. **రాయలసీమ** : 4 జిల్లాలు : అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు.
3. **తెలంగాణా** : 10 జిల్లాలు : హైదరాబాదు, రంగారెడ్డి, మెదకు, మహబూబునగరం, నిజామాబాదు, ఆదిలాబాదు, కరీంనగరం, వరంగల్లు, ఖమ్మం, నల్గొండ.

# ఆంధ్రప్రదేశ్ - జిల్లాల సంగ్రహస్వరూపం

## శ్రీకాకుళంజిల్లా

ఇది ఉత్తర కోస్తా జిల్లా. తీర ప్రాంతం మైదానాలు. పాలకొండ, పార్వతీపురం, టెక్కలి కొండ ప్రాంతాలు. నాగావళి, వంశధార నదులు



ప్రధాన జలవనరులు. లాంగుల్య, సువర్ణముఖి, గరీబుగెడ్డ మహేంద్ర తనయ బాహుద, వేగవతి ఇతర జలాధారాలు. వరి ప్రధాన మైన పంట. రాగులు కూడా పండుతాయి. జీడిమామిడి తోటలకు ప్రసిద్ధి. మాంగనీసు ఖనిజానికి చీపురుపల్లి ప్రసిద్ధి. గరివిడి ప్రాంతంలో ఫెర్రో - మాంగనీసు కర్మాగారం ఉంది. పలాసలో జీడిపప్పు పరిశ్రమ, తీర ప్రాంతంలో ఉప్పు కోఠాలారాలు ఉన్నాయి. ఆముదాల వలసలో పంచదార ఫ్యాక్టరీ ఉంది. శ్రీకూర్మం వైష్ణవ క్షేత్రం, అరసవల్లిలో సూర్య నారాయణ దేవళం, ముఖలింగంలో శివాలయం, శాలిహుండంలో బౌద్ధ స్తూపాలు చూడదగిన స్థలాలు.

**మండలాలు**

1.ఇచ్ఛాపురం 2. కవిటి 3. కంచిలి 4. సోంపేట 5. మందాస 6. పలాస 7. వజ్రపు కొత్తూరు 8. సంతబొమ్మాళి 9. పోలాకి 10. గార 11. శ్రీకాకుళం 12. ఎచ్చెర్ల 13. రణస్థలం 14. లావేరు 15. గంగువారి సిగడం 16. రాజాం 17. రేగిడి ఆమదాలవలస 18. వంగర 19. వీర ఘట్టం 20. సీతం పేట భామిని 22. కొత్తూరు 23. పాత పట్నం 24. మెలియాపుట్టి 25. నందిగాం 26. టెక్కలి 27. కోటబొమ్మాళి 28. నరసన్నపేట 29. ఆమదాల వలస 30. పొందూరు. 31. సంతకవిటి 32. బూర్జ 33. పాలకొండ 34. సరవకోట 35. హీరమండలం 36. సారవకోట 37. జలుమూరు

**శ్రీకాకుళం జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 5837 చ.కి.మీ.**

**జనాభా : 23,21,000**

**అక్షరాస్యత : 36%**

**రెవెన్యూ డివిజనులు : 3**

మండలాలు 37

**శాసనసభ నియోజక వర్గాలు : 12**

**లోక సభ నియోజకవర్గాలు : 1**

**జిల్లా కేంద్రం : శ్రీకాకుళం**

**విజయనగరం జిల్లా:** శ్రీకాకుళం, విశాఖ జిల్లాలను విభజించగా ఉత్తర కోస్తా జిల్లా ఏర్పడింది. ఇది పూర్వం విజయనగరం సంస్థానం. ఈ జిల్లా గోముఖీ (గోస్తనీ) చంపావతి, జంఝావతి, నాగావళి, శారదా, సువర్ణముఖి నదులు పారే ప్రదేశం. వరి, రాగులు, సజ్జ ఆహారపు పంటలు. ఉలవలు, చెరకు, నువ్వులు, వేరుసెనగ వాణిజ్యపు పంటలు.

బొబ్బిలి కోట సుప్రసిద్ధ పర్యాటక స్థలం. మాంగనీసు, ఇనుపరాయి, అభ్రకం, బంకమన్ను, గ్రాఫైటు ప్రధానమైన ఖనిజసంపద. నెల్లిమర్లలో



**విజయనగరం జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 6539 చ.కి.మీ.**

**జనాభా : 21,11,000**

**అక్షరాస్యత : 34%**

**రెవెన్యూ డివిజనులు : 2**

**శాసనసభ నియోజక వర్గాలు : 12**

**లోక సభ నియోజకవర్గాలు : 2**

**జిల్లా కేంద్రం : విజయనగరం**

జనప నారమిల్లు, సీతానగరంలో పంచదార మిల్లు ఉన్నాయి. నూలు పరిశ్రమలు కూడ ఈ జిల్లా లో ఉంది.

## విశాఖపట్టణంజిల్లా

ఈ ఉత్తర సర్కారు జిల్లాలో తూర్పు కనుమలు ఈశాన్యం నుండి నైరృతికి కోస్తాకు సమాంతరంగా లోపలికి విస్తరించి ఉన్నాయి. తీరరేఖలో అక్కడక్కడ బాడువాలు ఉన్నాయి. గూడెం ప్రాంతంలోని మాడుగుల మాచ్‌ఖండ్

**మండలాలు**

1.కొమరాడ 2. గుమమలక్ష్మీ పురం 3. కురుపాం 4. జియ్యామ్మవలస 5. గరుగు బిల్లి 6. బాలాజీపేట 7. తెర్లాం 8. మెరక మండిదం 9. గరివిడి 10. చీపురు పల్లి 11. గార్ల 12. నెల్లిమర్ల 13. పుస్పటిరేగ 14. భోగాపురం 15. డెంకాడ 16. విజయనగరం 17. జామి 18. కొత్త వలస 19. లక్కవరపుకోట 20. వేపాడ 21. శృంగవరపు కోట 22. గంట్యాడ 23. బొండపల్లి 24. గజపతినగరం 25. మెంటాడ 26. పాచిపెంట 27. సాలూరు 28. మక్కువ 29. పార్వతీపురం 30. సీతానగరం 31. బొబ్బిలి 32. మీదంగి 33. దత్తిరాజేరు 34. రామబద్రాపురం

నదికి ఆదిస్థానం. అది పశ్చిమంగా ప్రవహించి ఒరిస్సా రాష్ట్రంలో ప్రవేశిస్తుంది. శారద నది చోడవరం, అనకాపల్లి, ఎలమంచిలి ప్రాంతాల్లో పారుతూంది. మేఘాద్రి గెడ్డ, వరాహ, సరుగుడు గెడ్డ, తాండవ - చిన్న నీటి వనరులు. లోయలు సారవంతమైన నల్లరేగడి నేలలు. వరి, సజ్జలు ప్రధానమైన ఆహారపు పంటలు. మెస్తానార వాణిజ్యపు పంట. ఈ జిల్లా రంగురాళ్లకు ప్రసిద్ధి.

తూర్పు తీరంలో విశాఖపట్టణం ప్రధానమైన రేవు పట్టణం. సహజమైన హార్బరు వసతి కలది. అవుటర్ హార్బరు వసతి ఉండుటచే ఇనపరాయి ఎగుమతి అవుతూ ఉంటుంది. కోరమాండల్ ఎరువుల కర్మాగారం, పెట్రోలు శుద్ధి కర్మాగారం, ఉన్నాయి. ఇటీవల గంగవరం వద్ద కట్టిన విశాఖ ఉక్కు కర్మాగారం మేటి ఫ్యాక్టరీగా ప్రసిద్ధి, జింకు ఫ్యాక్టరీ, హెవీ ప్లేట్స్ & వెసల్స్

...ఫ్యాక్టరీలతో పారిశ్రామికంగా అభివృద్ధి



చెందుతున్న జిల్లా. విశాఖలో బీచ్, లాసన్ బే, డాల్ఫిన్ నోస్ ప్రముఖ వినోద స్థలాలు. సింహాచలంలో వరాహ నరసింహ స్వామి సన్నిధి పురాతన వైష్ణవ దేవళం. బొర్రా గుహలు, బొజ్జన

**విశాఖపట్నం జిల్లా ముఖ్యాంశాలు**

విస్తీర్ణం : 11161 చ.కి.మీ.

జనాభా : 32,85,000

అక్షరాస్యత : 46%

రెవెన్యూ డివిజనులు : 3

శాసనసభ నియోజక వర్గాలు : 13

లోక సభ నియోజకవర్గాలు : 2

జిల్లా కేంద్రం : విశాఖపట్టణం

కొండ, అరకు లోయ పర్యాటక స్థలాలు. ఈ జిల్లాలో సవర, గదబలు, కొండరెడ్లు ఆదిమ జాతులవారు ఉన్నారు.

**మండలాలు**

1.ముంచింగిపుత్తు 2. పెదబాయలు 3. హుకుంపేట 4. దుంబ్రిగూడ 5. అరకులోయ 6. అనంతగిరి 7. దేవరపల్లి 8. కె. కోటపాడు 9. సబ్బవరం 10. పెందుర్తి 11. ఆనందపురం 12. పద్మనాభం 13. భీమునిపట్నం 14. విశాఖపట్నం 15. పెదగంట్యాడ 16. గాజువాక 17. పరవాడ 18. అచ్యుతాపురం 19. రాంబిల్లి 20. ఎస్. రాయవరం 21. నక్కపల్లి 22. పాయకరావుపేట 23. కోటవూరట్ల 24. నాతవరం 25. కొయ్యూరు 26. గూడెంకొత్తవీధి 27. చింతపల్లి 28. గంగరాజు మాడుగుల 29. పాడేరు 30. చిడికాడ 31. చోడవరం 32. అనకాపల్లి 33. మునగపాక 34. కశింకోట 35. యలమంచిలి 36. మాకవరపాలెం. 37. నర్సీపట్నం 38. గోలుగొండ 39. రోలుగుంట 40.రావికమతం 41. మాడుగుల 42. బుచ్చయ్యపేట

## తూర్పు గోదావరి జిల్లా

ఈ కోస్తా జిల్లాలో సగానికి పైగా మైదానం, తూర్పున సారవంతమైన డెల్టా. పశ్చిమాన తూర్పు కనుమల కొండలు, మన్యపు ప్రాంతం. తుని, పిఠాపురం ప్రాంతం,రాజమండ్రి, కాకినాడ, రామచంద్రపురం ప్రాంతంలో కొన్ని భాగాలు మెట్ట భూములు. అమలాపురం, రాజోలు, ముమ్మడివరం, కొత్తపేట, కాకినాడ (భాగం) రామచంద్రపురం, రాజమండ్రి ప్రాంతాలు సారవంతమైన డెల్టా భూములు. ఇందులో రాజోలు, కొత్తపేట, ముమ్మిడివరం, అమలాపురం అన్నీ కలిసి కోనసీమ అయింది. జిల్లాలో మూడింట ఒక వంతు అటవీ ప్రాంతం, నాణ్యమైన కలప లభిస్తుంది. వెదురు, టేకు, కలప,కుంకుడు, తేనె, చింతపండు ప్రధానమైన మన్యపు సరుకులు. ఈజిల్లాలో కోరింగ వద్ద ఉప్పునీటికుక్కలకు చేపలను పట్టే పిల్లులకు రక్షిత ప్రాంతం ఉంది.

ప్రధానమైన జీవనది గోదావరి ఈ

జిల్లాలో గౌతమి, వశిష్ఠ పాయలుగా పారుతూ బెండమూర్లంక, కోరింగ, అంతర్వేది



ప్రాంతాల వద్ద సాగర సంగమ మవుతుంది. ఈ జిల్లాలో తటాక సదుపాయాలు మెండు.

**తూర్పుగోదావరి జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 10,807 చ.కి.మీ.**

**జనాభా :45,46,000**

**అక్షరాస్యత : 49%**

**రెవెన్యూ డివిజనులు : 4**

**శాసనన సభ నియోజక వర్గాలు : 21**

**లోక సభ నియోజక వర్గాలు : 3**

**జిల్లా కేంద్రం : కాకినాడ**

ద్రాక్షారామ, అనపర్తి ప్రాంతాల్లో పాతాళ గంగ లభిస్తుంది. యేలేరు ఇతర వాగులు ఈ జిల్లాలో ఇతర జలాధారాలు. గోదావరి నది రాజమండ్రికి ఎగువన పాపికొండల దగ్గర మైదానంలోకి అఖండ గోదావరిగా ప్రవేశిస్తుంది. ఇక్కడ నుండి డెల్టా ప్రారంభ

**మండలాలు**

1. వై. రాయవరం 2. అడ్డ తీగల 3. రాజఒమ్మంగి 4. కోటనందూరు 5. తుని 6. తొండంగి 7. కొత్తపల్లి 8. కాకినాడ 9. కరప 10. కాజులూరు 11. తాళ్లరేవు 12. ఐ. పోలవరం 13. కాట్రేని కోన 14. ఉప్పల గుప్తం 15. అల్లవరం 16. మామిడికుదురు 17. రాజోలు 18. మల్కిపురం 19. సఖినేటిపల్లి 20. పి. గన్నవరం 21. రావులపాలెం 22. ఆత్రేయపురం 23. కడియం 24. రాజమండ్రి 25. సీతానగరం 26. దేవిపట్నం 27. మారేడుమిల్లి 28. రంపచోడవరం 29. గంగవరం 30. యేలేశ్వరం 31. ప్రత్తిపాడు 32. శంఖవరం 33. గొల్లప్రోలు 34 పిఠాపురం 35. సామర్లకోట 36. పెదపూడి 37. రామచంద్రపురం 38. పామర్రు 39. ముమ్మిడివరం 40. అయినవల్లి 41. అమలాపురం 42. అంబాజిపేట 43. కొత్తపేట 44. కపిలేశ్వరపురం 45. ఆలమూరు 46. మండపేట 47. రాజానగరం 48. కోరుకొండ 49. గోకవరం 50. జగ్గంపేట 51.కిర్లంపూడి 52. పెద్దాపురం 53. బిక్కవోలు 54. రాయవరం 55. అనపర్తి 56. రంగంపేట 57. గొండేపల్లి.

మవుతుంది. దిగువన ధవళేశ్వరం వద్ద రెండు పాయలు అవడంతో అక్కడ 150 ఏళ్ల నాడు ఆర్థర్ కాటన్ ఆనకట్టను కట్టి పంటనీటిని అందించగా దానిని ఇటీవల (1974) పునర్నిర్మించగా 'కాటన్ బరాజు' పేరుతో కాలువ వ్యవస్థ ద్వారా సాగునీటిని పంట పొలాలకు అందిస్తున్నారు. వరి ప్రధాన మైన పంట. కొనసీమలో కొబ్బరి, అరటి, లంక పొగాకు తోటలు కలవు. నర్సరీలు కడియపులంకలో ఉన్నాయి.

రాజమండ్రిలో కోటి లింగాలు, ద్రాక్షా రామంలో భీమేశ్వరాలయం ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు.

## పశ్చిమ గోదావరి జిల్లా

ఇది కోస్తా జిల్లా. 1925లో కృష్ణా జిల్లాను విభజించగా ఈజిల్లా ఏర్పడినది. నైసర్గికంగా కొండ ప్రాంతం, మెట్టప్రాంతం, సారవంతమైన డెల్టా ప్రాంతంగా మూడు

విభాగాలుగా ఈ జిల్లా ఉంది. శీతోష్ణస్థితి, వ్యవసాయానుకూలంగా ఉంది. కాలువ నీటి పారుదల పుష్కలంగా ఉన్న ఈ జిల్లా వరి,



చెరకు పంటలకు ప్రసిద్ధి. పోలవరం మన్య ప్రాంతం. అడవులు దాదాపు 11 శాతం విస్తరించి వున్నాయి. పాతాళగంగ నిక్షేపాలున్నాయి. జీవనది గోదావరి ఈజిల్లాలో పారుతూ పక్క జిల్లాలోని అంతర్వేదివద్ద సాగరసంగమ మవుతుంది. తమ్మిలేరు, బైనేరు, ఎర్రకాలువ, జల్లేరు రాళ్లమడుగు, గుండేరు మున్నగు ఏరులు ఇతర జలాధారాలు. కొల్లేరు పెద్ద సరస్సు. గూడ కొంగ (పెలికాన్) వంటి వలస పక్షులకు స్థావరం. ఇది వన్య ప్రాణిరక్షణకు అభయారణ్య ప్రాంతం. జిల్లా విస్తీర్ణంలో సుమారు సగం పంట భూమిగా వర్గీకరించబడింది. ముప్పాతిక పంట నేలకు నీటి సదుపాయం కలదు. అరటి, కొబ్బరి, మామిడి, దేశవాళీ లంక పొగాకు తోటలకు ప్రసిద్ధి. ఇప్పుడు ఆయిలుపామ్ నూనె గింజలపంట సాగువుతూంది. పశుసమృద్ధి, మత్స్య సంపద ఉంది. కొల్లేరు, ఉప్పుటేర్లు ప్రాంతాల్లో లాభసాటి పులిరొయ్య పెంపకం ఉంది. వ్యవసాయం పరిశోధన క్షేత్రాలు మార్టేరు

**మండలాలు**

1. పోలవరం 2. తాళ్ళపూడి 3. కొవ్వూరు 4. చాగల్లు 5. నిడదవోలు 6. ఉండ్రాజవరం 7. పెరవలి 8. పెనుగొండ 9. ఆచంట 10. పోడూరు 11. ఎలమంచలి 12.పాలకొల్లు 13.నర్సాపురం 14. మొగల్తూరు 15. భీమవరం 16. కాళ్ళ 17. ఆకివీడు 18. భీమడోలు 19. దెందులూరు 20. ఏలూరు 21. పెదపాడు 22. పెదవేగి 23. లింగపాలెం 24. చింతలపూడి 25. టి. నర్సాపురం 26. జీలుగుమిల్లి 27. బుట్టాయగూడెం 28. కొయ్యలగూడెం 29. గోపాలపురం 30. దేవరపల్లి 31. తాడేపల్లి గూడెం 32. పెంటపాడు 33. తణుకు 34. అత్తిలి 35. ఇరగవరం 36. పెనుమంటు 37. వీరవాసరం 38. పాలకోడేరు 39. ఉండి 40. గణపవరం 41. నిడమర్రు 42. ఉంగుటూరు 43. ద్వారకాతిరుమల 44. కామవరపుకోట 45. జంగారెడ్డి గూడెం 46. నల్లజెర్ల.

(వరి), కొవ్వూరు (అరటి), నర్సాపురం (కొబ్బరి), తణుకు (చెరకు)వద్ద ఉన్నాయి.

**పశ్చిమ గోదావరి జిల్లా ముఖ్యాంశాలు**

విస్తీర్ణం : 7742 చ.కి.మీ.

జనాభా : 35,28,000

అక్షరాస్యత : 53%

రెవెన్యూ డివిజనులు : 3

మండలాలు 46

శాసనసభ నియోజక వర్గాలు : 16

లోక సభ నియోజకవర్గాలు : 2

జిల్లా కేంద్రం : ఏలూరు

కృష్ణా - గోదావరి బేసిన్‌లో చమురు వాయు తైల నిక్షేపాలు పుష్కలం (లింగన బొయించర్ల, ఏనుగు వాని లంక)

సేద్యాధార పరిశ్రమలు మెండు. బియ్యపు మిల్లులు డెల్టా ప్రాంతమంతా ఉన్నాయి. పంచదార ఫ్యాక్టరీలు - తణుకు (చాలపెద్దది) చాగల్లు, పాలకొల్లు భీమడోలులలో ఉన్నాయి. తణుకులో జవుళీ మిల్లులు రసాయన ఎరువుల మిశ్రమం, రాకెట్టు ఇంధనం, గౌరీపట్నం వద్ద కాగితం మిల్లు, కొబ్బరినూనె మిల్లు ఉన్నాయి. నర్సాపురం క్రోషేలేసు కుటీర పరిశ్రమ విదేశీ మారకం ఆకర్షిస్తూంది. పీచు పరిశ్రమ, అజ్జరం ఇత్తడి పరిశ్రమ, ద్వారాకా తిరుమల సమీపంలో రిఫ్రాక్టరీ ఇటుకల తయారీ ఉన్నాయి.

**పుణ్యక్షేత్రాలు** : నర్సాపురంలో వైష్ణవ దేవాలయం - ఎంబరుమానారు సన్నిధి, పాలకొల్లులో క్షీరారామలింగేశ్వర స్వామి శైవ క్షేత్రం పెనుగొండ శ్రీ కన్యకాపరమేశ్వరి దేవస్థానం, పట్టిసీను (కొవ్వూరు వీరభద్ర క్షేత్రం, భీమవరంలో భీమేశ్వరాలయం ఉన్నాయి.

## కృష్ణా జిల్లా

డెల్టా మైదానాలు పశ్చిమాన మెట్ట భూములు కోస్తా ఈ జిల్లా ప్రత్యేకత. బందరు, దివిసీమ, గన్నవరం, కైకలూరు, విజయవాడ డెల్టా ప్రాంతాలు. జగ్గయ్యపేట, నందిగామ, తిరువూరు, నూజివీడు మెట్ట భూములు. కొండపల్లి (విజయవాడ) జమ్మలవాయి దుర్గ (తిరువూరు) కొండప్రాంతం. కైకలూరుకు ఉత్తరాన్ని కొల్లేరు సరస్సు ఉంది. వర్షపు నీరంతా ఈ సరస్సులో చేరుతుంది. తీర రేఖలో అక్కడక్కడ ఉప్పు బాడువాలు ఉన్నాయి. వర్షాకాలంలో ఈ జిల్లా పర్యటిస్తుంటే పచ్చని తివాచీ పరచినట్లుంటుంది ఈ పంట పొలాలు, ఇసుక దిబ్బలు సముద్ర మట్టానకి 15 మీటర్ల వరకూ ఎత్తు ఉంటాయి. జిల్లా ప్రధానమైన నీటి వనరు కృష్ణానది. ఈ నది మీద గత శతాబ్దిలో విజయవాడవద్ద కట్టిన ఆనకట్టను పునర్నిర్మించి 'ప్రకాశం బరాజు' అని పేరు పెట్టారు. (1955). డెల్టా ప్రాంతం అంతటా కాలువ వ్యవస్థ అల్లుకొని ఉంది. వరి, జొన్న



**మండలాలు**

1. గంపలగూడెం 2. తిరువూరు 3. ఎ. కొండూరు 4. విస్సన్నపేట 5. చట్రాయి 6. ముసునూరు 7. నూజివీడు 8. బాపులపాడు 9. మోటూరు 10. మందవల్లి 11. కైకలూరు 12. కలిదిండి 13. ముదినేపల్లి 14. కృత్తివెన్ను 15. బంటుమిల్లి 16. పెడన 17. మచిలీపట్నం 18. కోడూరు 19. నాగాయలంక 20. అవనిగడ్డ 21. చల్లపల్లి 22. ఘంటసాల 23. తోట్లవల్లూరు 24. కంకిపాడు 25. పెనమలూరు 26. విజయవాడ (ప) 27. విజయవాడ (గ్రా) ఇబ్రహీంపట్నం 28. కంచికచెర్ల 29. చందర్లపాడు 30. జగ్గయ్యపేట 31. వత్సవాయి 32. పెనుగంచిప్రోలు 33. నందిగామ 34. వీరుళ్ళపాడు 35. జి. కొండూరు 36. మైలవరం 37. రెడ్డిగూడెం. 38. ఆగిరిపల్లి 39. గన్నవరం 40. ఉంగుటూరు 41. గుడివాడ 42. గుడ్లవల్లేరు 43. గూడూరు 44. పామర్రు 45. .మొవ్వ 46. పమిడిముక్కల 47. వుయ్యూరు.

ప్రధాన ఆహారపు పంటలు. చెరకు, వేరుసెనగ, పొగాకు వాణిజ్యపు పంటలు. జిల్లా రైతాంగం ఆధునిక సేద్య విధానాల్ని చేపట్టి అధిక

**కృష్ణాజిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 8727 చ.కి.మీ.**

**జనాభా : 36,98,000**

**అక్షరాస్యత : 53%**

**రెవెన్యూ డివిజనులు : 4**

**శాసనసభ నియోజక వర్గాలు : 17**

**లోక సభ నియోజకవర్గాలు : 2**

**జిల్లా కేంద్రం : మచిలీపట్టణం (చిలకలపూడి)**

దిగుబడుల్ని సాధిస్తూంది. జిల్లా పాడి పరిశ్రమకు ప్రసిద్ధి. గుడ్లవల్లేరులో గేదెల పాడి సమృద్ధిగా ఉంది. సీమ పందుల పెంపకం, చేపల చెరువులు, రొయ్యల చెరువులు అపారం. కాకిరాయి రూపంలో ఇనుపరాయి జగ్గయ్య పేటలో లభిస్తూంది. కొండపల్లిలో క్రోమైట్ అధికం. పరిటాల వజ్రాలకు ప్రసిద్ధి. జగత్ప్రసిద్ధికెక్కిన 'పిట్టు' వజ్రం ఇక్కడిదే. సిమెంటు, పంచదార, ఔషధ పరిశ్రమలున్నాయి. మచిలీపట్నంలో సాంకేతిక పరికరాల పరిశ్రమ సాగుతూంది. గోల్డు కవరింగ్ పరిశ్రమకు చిలకలపూడి ప్రసిద్ధి. విజయవాడలో కనకదుర్గ గుడి ప్రసిద్ధ యాత్రాస్థలి. జగ్గయ్య పేట, ఘంటసాల, కొండపల్లికోట చారిత్రక స్థలాలు. మొగల్రాజపురంలో గుహ శిల్పాలు పేర్కొన దగినవి. చిలకలపూడిలో పాండు రంగ స్వామి దేవాలయం ఉంది. కూచిపూడి నృత్య కేంద్రం మొవ్వ సమీపాన ఉంది. ఆంధ్ర మహా విష్ణుదేవళం శ్రీకాకుళంలో ఉంది.

## గుంటూరు జిల్లా

పల్నాటిసీమ అంతర్భాగంగా ఉన్న ఈ కోస్తా జిల్లాలో తీరప్రాంతం డెల్టా మైదానం, పశ్చిమాన మెట్ట భూములు, (వినుకొండ) కొండలు ఉన్నాయి. మైదానాలు నల్లనేలగలవి. తీరరేఖను ఆనుకుని ఇసుక దిబ్బలు ఉన్నాయి. అడవులు ఆర్థికంగా చెప్పుకోదగ్గవికావు. గడ్డి భూములు పశువుల మేతకు పనికి వస్తాయి. స్వాతంత్ర్య పోరాట సమయంలో 'అడవిపుల్లరి' అనే మేతపన్ను ఉండేది. కృష్ణానది డెల్టా కొంతభాగం గుంటూరుకు విస్తరించి ఉండడం చేత ఆ నీటివనరు ఆధారంగా తెనాలి, బాపట్ల ప్రాంతంలో వరిసాగు బాగా ఉంది. గుండ్లకమ్మ, నాగలేరు, కంబం చెరువు ఇతర జలాధారాలు. వరి, జొన్న, సజ్జ, కొర్రలు ప్రధాన ఆహారపు పంటలు. వర్జీనియా పొగాకు జగత్ప్రసిద్ధి. నాగార్జున సాగరు కాలువ వల్ల

**మండలాలు**

1. బెల్లంకొండ 2. అచ్చంపేట 3. అమరావతి 4. తుళ్లూరు 5. మంగళగిరి 6. తాడేపల్లి 7. దుగ్గిరాల 8. కొల్లిపర 9. కొల్లూరు 10. భట్టిప్రోలు 11. రేపల్లె 12. నగరం 13. నిజాంపట్నం 14. కర్లపాలెం 15. బాపట్ల 16. కాకుమాను 17. పెదనందిపాడు 18. చిలకలూరిపేట 19. నర్సారావుపేట 20. రొంపిచర్ల 21. ఈపూరు 22. సావల్యపురం 23. నూజెండ్ల 24. వినుకొండ 25. బోళ్లపల్లి 26. కారంపూడి 27. దుర్గి 28. వెల్దుర్తి 29. మాచెర్ల 30. రెంటచింతల 31. గురజాల 32. దాచేపల్లి 33. మాచవరం 34. పిడుగురాళ్ళ 35. రాజుపాలెం 36. క్రోసూర్ 37. పెదకూరపాడు 38. తాడికొండ 39. పెదకాకాని 40. తెనాలి 41. వేమూరు 42. చెరుకుపల్లి 43. పిట్టలవానిపాలెం 44. పొన్నూరు 45. వట్టిచెరుకూరు 46. ప్రత్తిపాడు 47. యడ్లపాడు 48. నాదెండ్ల 49. నెకరికల్లు 50. ముప్పాల 51. సత్తెనపల్లి 52. ఫిరంగిపురం 53. మేడికొండూరు 54. గుంటూరు 55. చేబ్రోలు 56. టి. తుళ్ళూరు 57. అమృతలూరు.

పంటనీరు అందడంతో మిర్చి, ప్రత్తి, పండ్లతోటలు, తమలపాకుల తోటలు,

**గుంటూరు జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 31,391చ.కి.మీ.**

**జనాభా : 41,07,000**

**అక్షరాస్యత : 46%**

**రెవెన్యూ డివిజనులు : 3**

మండలాలు — 57

**శాసనసభ నియోజక వర్గాలు : 19**

**లోక సభ నియోజకవర్గాలు : 4**

**జిల్లా కేంద్రం : గుంటూరు**

పూలతోటలు పెంచుతున్నారు. దుగ్గిరాల పసుపుకు ప్రసిద్ధి. వడ్లపూడి నారింజ, నిమ్మ తోటలు కలవు. జీడిమామిడి వేటపాలెం ప్రాంతంలో సాగవుతూంది. ఉప్పునీటి కుక్క, చేపలు పట్టే పిల్లికి ఈ జిల్లాలో రక్షిత ప్రాంతం ఉంది.

అగ్నిగుండాలలో రాగి నిక్షేపాలు ఉన్నాయి. ఈ.జిల్లా వజ్రపు గనులకు ప్రసిద్ధి. జగత్ప్రసిద్ధికెక్కిన 'కోహినూరు' వజ్రం సత్తెనపల్లిలోని కోడూరుగనిలో దొరికిందని జనశ్రుతి. జిల్లా పొగాకు పదును పరిశ్రమకు ప్రసిద్ధి. ప్రత్తి - నూలు మిల్లులు, నూనెమిల్లులు ఉన్నాయి. చేపల చెరువులు, రొయ్యల చెరువులు ఉన్నాయి. నిజాంపట్నం చిన్న రేవు. సిమెంటు పరిశ్రమ ఉంది. గుంటూరు పొగాకు వాణిజ్యానికి అంతర్జాతీయ కేంద్రం.

అమరావతి, భట్టిప్రోలు బౌద్ధ శిథిలాలు, ఉండవల్లి గుహాలయాలు, కోటప్పకొండ జాతరకు, మంగళగిరి త్రికోటీశ్వర (శ్రీ పానకాల స్వామి) ఆలయానికి ప్రసిద్ధి. ఎత్తి పోతల జలపాతం పర్యాటక కేంద్రం.

## ప్రకాశం జిల్లా

నెల్లూరు, గుంటూరు, కర్నూలు జిల్లాలలోని కొన్ని ప్రాంతాల్ని విడగొట్టగా ఈ దక్షిణ సర్కారు కోస్తా జిల్లా (1971) ఏర్పడింది. సారవంతంకాని ఇసుక నేలలు ఈ కోస్తా





జిల్లా ప్రత్యేకత. వెలిగొండ పర్వతశ్రేణి కనిగిరి ఉత్తర ప్రాంతాన్ని తాకుతుంది. ఒంగోలు సమీపంలో ఉన్నవాటిని చీమకుర్తి కొండలు అంటారు. గిద్దలూరు, మార్కాపురం ప్రాంతాలకు ఈశాన్య ఋతుపవనాల తాకిడి తగిలినా వర్షపాతం తక్కువ. అయితే పాతాళగంగ పుష్కలం. నల్లమల - వెలిగొండ మధ్య ప్రాంతాన్ని 'కంబంలోయ' ప్రాంతంగా పేర్కొనడం కద్దు. తీరరేఖ ఇసుక దిబ్బల మయం. ఈ జిల్లాలో గుండ్లకమ్మ నది, దోమలేరు, మేకేరు, పాలేరు చిన్న నీటి వనరులు. ఈ జిల్లా అనావృష్టి ప్రాంతంగా గుర్తింపబడింది. ప్రజలకు కూలిపని దొరకదు. పొట్టకూటికి ఇతర జిల్లాలకు కూలిపనికై పోతూ వస్తూ ఉంటారు. వరిసాగు తక్కువ. జొన్న, రాగులు, సజ్జ వంటి చిరుధాన్యాలూ అవరాలూ పండిస్తారు. పొగాకు, ప్రత్తివంటి వాణిజ్యపు పంటలు కూడా ఉన్నాయి. కొంజేడువద్ద ఇనుపరాయి దొరుకు తుంది. మార్కాపురం పలకరాయికి ( పసిద్ధి. కందుకూరులో అల్యూమినియం నిక్షేపాలు ఉన్నట్లు తెలుస్తూంది. కందుకూరులోని దేవాలయ శిథిలాలు తప్ప చెప్పుకోదగ్గ చూడదగిన స్థలాలు తక్కువ.

**మండలాలు**

1. సంతమగులూరు 2. బల్లికురవ 3. మార్టూరు 4. యద్దనపూడి 5. ఇంకొల్లు 6. పర్చూరు 7. కారంచేడు 8. చీరాల 9.వేటపాలెం 10. చినగంజాం 11. నాగులుప్పలిపాడు 12. ఒంగోలు 13: కొత్తపట్నం 14. టంగుటూరు 15. సింగరాయకొండ 16. ఉలవపాడు 17. గుడులూరు 18. లింగసముద్రం 19. పామూరు 20. చంద్రశేఖరపురం 21. కొమరోలు 22. గిద్దలూరు 23. రాచర్ల 24. కంబెబం 25. అర్ధవీడు 26. దోర్నాల 27. యర్రగొండపాలెం 28. పుల్లలచెరువు 29. త్రిపురాంతకం 30. కురిచేడు 31. దర్శి 32. ముందలమూరు 33. అద్దంకి 34. జనకనరం పంగులూరు 35. కొరిసపాడు 36. మద్దిపాడు 37. సంతనూతలపాడు 38. కొండపి 39. జరుదుపల్లి 40. కందుకూరు 41. వోలేటివారిపాలెం 42. పెదచర్లపల్లి 43. కనిగిరి 44. వెలిగండ్ల 45. బెస్తవారిపేట 46. తార్లుపాడు 47. మార్కాపురం 48. పెద అరవీడు 49. దొనకొండ 50. పొదిలి 51. తాళ్లూరు 52. చీమకుర్తి 53. మద్రిపూడి 54. పొన్నలూరు 55. హనుమంతుని పాడు 56. కొనకనమిట్ల.

**ప్రకాశం జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 17,626 చ.కి.మీ.**

**జనాభా : 27,59,000**

**అక్షరాస్యత : 40%**

**రెవెన్యూ డివిజనులు : 3**

**శాసనసభ నియోజకవర్గాలు : 13**

**లోక సభ నియోజకవర్గాలు : 2**

**జిల్లా కేంద్రం : ఒంగోలు**

## నెల్లూరు జిల్లా

ఈ దక్షిణ కోస్తా జిల్లా రాతి మైదానం, సారవంతమైన మైదానం, తీరస్థ ఇసుక పర్రలు అనే మూడు రకాలుగా ఉంది. పశ్చిమాన రాతి మైదానం. కొండల్లో ఎత్తైన ఉదయగిరి దుర్గం వెయ్యి మీటర్ల ఎత్తు ఉంది. సారవంతమైన భూమి నెల్లూరు పరిసరాల్లో పెన్నానది డెల్టా ప్రాంతానికి పరిమితమైంది. జిల్లాకు ఆగ్నేయంలో ఉప్పునీటికయ్యలు, పులికాటు సరస్సు ఉన్నాయి. శ్రీహరికోట అనే ఇసుక మయమైన చిన్న దీవి ఈ ప్రాంతంలో ఉంది. సరుగుడు తోపులు ఇసుక నేలల్లో ఉన్నాయి. పశ్చిమమనుంచి ప్రవహిస్తున్న పెన్నాననది ఈజిల్లాలో సాగర సంగమవుతున్నది. గొగ్గేరు,

కొల్లేరు, పిలపేరు, కండ్లేరు, సర్వేపల్లి చెరువు, రాళ్లబండి చెరువు నక్కలగండి చెరువు



పాండువ గండి అనేవి చిన్న నీటి వనరులు. వరి ప్రధానమైన ఆహారవు పంట. మొలగొలుకులు అనే వరిరకం పొరుగు రాష్ట్రమైన తమిళనాడుకు ఎగుమతి

వెల్లూరు జిల్లా ముఖ్యాంశాలు

విస్తీర్ణం : 13076 చ.కి.మీ.

జనాభా : 23,92,000

అక్షరాస్యత :48%

రెవెన్యూ డివిజనులు : 3

శాసనసభ నియోజక వర్గాలు : 11

లోక సభ నియోజకవర్గాలు : 3

జిల్లా కేంద్రం : నెల్లూరు

అవుతుంది. జొన్న, సజ్జ, రాగులు పండుతాయి. ఇటీవల పులిరొయ్య ఉప్పు నీటి కయ్యలు ఉన్న చోట సాగవుతూంది. వెంకటగిరి జరీ చీరలు సుప్రసిద్ధమైనవి. ఈ జిల్లా మైకాకు జగత్ప్రసిద్ధి.

మండలాలు

1. కావలి 2. బోగోలు 3. అల్లూరు 4. విడవలూరు 5. ఇందుకూరుపేట 6. తోటపల్లిగూడూరు 7. ముత్తుకూరు 8. వెంకటాచలం 9. చిల్లకూరు 10. కోట 11. వాకాడు 12. చిత్తమూరు 13. సూళ్లూరుపేట 14. తడ 15. దొరవారి సత్రం 16. పెళ్ళకూరు 17. నాయుడుపేట 18. బాలాయపల్లి 19. వెంకటగిరి 20. డక్కిలి 21. రాపూరు 22. కలువాయి 23. అనంతసాగరం 24. మర్రిపాడు 25. సీతారామపురం 26. ఉదయగిరి 27. వరికుంటపాడు 28. కొండాపురం 29. జలదండి 30. దగదర్తి 31. కొడవలూరు 32. కోవూరు 33. నెల్లూరు 34. మనుబోలు 35. ఓజిలి 36. గూడూరు 37. సైదాపురం 38. పొదలకూరు 39. చేజెర్ల 40. ఆత్మకూరు 41. దుత్తలూరు 42. వింజమూరు 43. కలిగిరి 44. హనుమసముద్రంపేట 45. సంగం 46. బుచ్చిరెడ్డి పాలెం.

గూడూరు, గూడల దొన, దుండిగం వద్ద మైకా ఖనిజ తవ్వకాలు జరుగుతున్నాయి. సూళూరుపేట ప్రాంతంలోని నెలుంబాక కొండల్లో ఇనుపరాయి నిక్షేపాలు ఉన్నట్లు నిర్ధారణ అయింది. జిప్సం కూడ లభిస్తుంది. గూడురులో గాజులు, పింగాణి పరిశ్రమకు ప్రసిద్ధి. ఉదయగిరి కోట, నెల్లూరు, జొన్నవాడ వేదగిరి దేవళాలు ప్రసిద్ధి గాంచాయి. శ్రీహరి కోటలో గోదసీ వాహన ప్రయోగ కేంద్రం ఉంది.

## చిత్తూరు జిల్లా

ఈ రాయల సీమ జిల్లాలో కొండలతో నిండిన పీఠభూమి మైదానాలు ఉన్నాయి. తూర్పు కనుమలు నైరృతి నుండి ఈశాన్య దిశకు విస్తరించి ఉన్నాయి. మదనపల్లి ప్రాంతంలో ఉన్న హార్స్‌లీ కొండ ఎత్తు 1250మీ. పుంగనూరు, వాయల్పాడులో కొండలు

ఉన్నాయి. పుత్తూరు ప్రాంతంలోని నగరి కొండలు ప్రముఖమైనవి. ఈ జిల్లా అటవీ సంపదలో విలువైన చందనం (మంచిగంధం) లభిస్తుంది. ఈ జిల్లాలో జీవనది ప్రవహించడం లేదు. పాపఘ్ని, గొడ్డువంక, సువర్ణముఖి వంటి ఏరుల్లో వర్షా కాలంలోనే నీరు కన్పిస్తుంది. కొన్ని ప్రాంతాలు అనావృష్టి క్షామ పీడిత ప్రాంతాలుగా గుర్తింప బడ్డాయి. మెట్ట పంటలు పండిస్తారు. వరి, రాగులు, సజ్జ, జొన్న ఆహారపు పంటలు. వేరుసెనగ, చెరకు వాణిజ్యపు పంటలు మామిడి, చీనీ తోటపంటలు ఉన్నాయి. బియ్యాన్ని ఇతర జిల్లాల నుండి దిగుమతి చేసుకుంటారు. అటవీ సంపదలో విలువైన చందనం ప్రముఖమైంది. కాళహస్తి ప్రాంతంలో ఇనుపరాయి నిక్షేపాలు ఉన్నాయి. నారాయణ నగర్‌లో బంగారపు గనులు ఉన్నాయి. తిరుపతి, కాళహస్తి ప్రాంతాలు ఇత్తడి కంచు సామగ్రికి ప్రసిద్ధి. తిరుపతి దివ్య క్షేత్రంలో మొక్కుబడులనుండి లభించిన తలనీలాలతో విగ్గులు, సవరాలు తయారీ కుటీర పరిశ్రమగా ఉంది.



హార్సలీ కొండలు, మదనపల్లి ప్రాంతాలలో ఆరోగ్యదాయకమైన వాతావరణం.

**మండలాలు**

1. తిరుపతి(ప) 2. తిరుపతి (గ్రా) 3. రేణిగుంట 4. యేర్పేడు 5. శ్రీకాళహస్తి 6. తొట్టంబేడు 7. బుచ్చినాయుడు ఖండ్రిగ 8. వరదయ్యపాలెం 9. సత్యవీడు 10. నాగలాపురం 11. పిచ్చాటూరు 12. కోవనూరు 13. నింద్ర 14. విజయపురం 15. నగరి 16. నారాయణవరం 17. పుత్తూరు 18. కార్వేటినగరం 19. శ్రీరంగరాజపురం 20. పాలసముద్రం 21. గంగాధర నెల్లూరు 22. గుడిపాల 23. చిత్తూరు 24. యాదమర్రి 25. బంగారుపాలెం 26. పలమనేరు 27. కుప్పం 28. గూడుపల్లె 29. శాంతిపురం 30. రామకుప్పమ్ 31. వెంకటగిరికోట 32. బైరెడ్డిపల్లె 33. గంగవరం 34. పెద్దపంజ 35. పుంగనూరు 36. రామసముద్రం 37. మదనపపల్లె 38. కురబాలకోట 39. బి. కొత్తకోట 40. పెద్ద తిప్పసముద్రం41. ములకలచెరువు 42. తంబళ్లపల్లె 43. పెద్దమాండ్యం 44. గుర్రంకొండ 45. కలకాడ 46. కంబంవారిపల్లె 47. ఎర్రావారిపాలెం 48. చంద్రగిరి 49. కమ్మపల్లె 50. వరమల్‌పేట 51. వెదురుకుప్పం 52. పెనుమూరు 53. పూతలపట్టు 54. తవనంపల్లె 55. ఐరాల 56. సోమాల 57. చౌడేపల్లి 58. నిమ్మనపల్లె 59. వాయల్పాడు 60. కలికిరి 61. సోడం 62. పీలేరు 63. రొంపిచర్ల 64. చిన్నగొట్టిగల్లు 65. పులిచర్ల 66. పాకాల.

తిరుమల కొండపై శ్రీ వెంకటేశ్వర స్వామి (బాలాజీ, శ్రీనివాస) దివ్యసన్నిధి ఏడాది పొడువునా యాత్రికుల నాకర్షిస్తుంది. దిగువ తిరుపతిలో తిరుచానూరు అలివేలు మంగ క్షేత్రం, పాపనాశనం, శ్రీకాళహస్తి శైవక్షేత్రం హిందువుల పవిత్ర యాత్రా స్థలాలు.

**చిత్తూరు జిల్లా ముఖ్యాంశాలు**

విస్తీర్ణం : 15,152 చ.కి.మీ.

జనాభా :32,61,000

అక్షరాస్యత :50%

రెవెన్యూ డివిజనులు : 4

మండలాలు – 66

శాసనసభ నియోజక వర్గాలు : 15

లోక సభ నియోజకవర్గాలు : 2

జిల్లా కేంద్రం : చిత్తూరు

చంద్రగిరి కోట రాయల నాటి చారిత్రిక స్థలం. కురబలకోట సమీపంలో జిడ్డు కృష్ణమూర్తి సంప్రదాయంలో నడుస్తున్న రిషి వేలీవిద్యా కేంద్రం ఉంది. తిరుపతి సమీపంలో శ్రీ వెంకటేశ్వర అభయారణ్యంలో పెద్దపులి, చిరుతపులి, జింకలు ఉన్నాయి.

## కడప జిల్లా

ఈ రాయలసీమ జిల్లాలో ఎత్తుపల్లాలు వున్నా కొండలు ఎక్కువ. ఏరులు కూడ ఎక్కువయే . ఈ జిల్లాలో బద్వేలు, రాజంపేట, సిద్ధవటం లోయలూ దట్టమయిన అడవులతో నిండి వెలిగొండ శ్రేణి పొరుగు జిల్లా నెల్లూరుకు సరిహద్దుగా పోతూంది. పాలకొండ శ్రేణి కడప



పట్టణం మధ్యగా పోతుంది. శేషాచలం, లంకమల శ్రేణులు నల్లమలలో కలిసిపోతున్నాయి. జమ్మలమడుగుకు 8 కి.మీ. దూరంలో గండికోట కనుమ ఉంది. కడప జిల్లాలో వేసవి తీవ్రంగా ఉంటుంది. అతివృష్టికి అనావృష్టికి ఆలవాలమై కరువు ప్రాంతంగా గుర్తించబడింది. జిల్లా అటవీ సంపదలో పేర్కొనదగినవి ఇరుగుడుచేవ (రోజ్‌వుడ్) ఎర్రచేవ, ఏపి. పెన్నానది పశ్చిమం నుండి తూర్పుగా ప్రవహిస్తూంది. కుందు, సగిలేరు, చిత్రావతి, పాపఘ్ని, చెయ్యేరు (బాహుదా) పీఠభూమి మీద ప్రవహించే నదులు. పింఛా, మాందవి గుంజన ఏరు చిన్న నీటి వనరులు. ఈ జిల్లా ప్రధాన జలాధారం 'కర్నూలు -కడప కాలువ' పెన్నా నదిమీద ఆక్విడక్టు ద్వారా కడప చెరువు చేరుతూంది. సగిలేరు ఆనకట్ట నుండి నీరు మామిళ్ళచెరువు చేరుతూంది. జొన్న, వరి, రాగులు, సజ్జ, అపరాలు, వేరుసెనగ ముఖ్యమైన కడప జిల్లా పంటలు. చీని

**మండలాలు**

1. నరసాపురం 2. పొరుమామిళ్ల 3. బద్వేలు 4. గోపవరం 5. నందలూరు 6. పెనగలూరు 7. చిట్వేలు 8. కోడూరు 9. ఓబులవారిపల్లె 10. పుల్లంపేట 11. రాజంపేట 12. సుందుపల్లి 13. సాంబేపల్లి 14. చిన్నమండం 15. గాలివీడు 16. చక్రాయపేట 17. వేంపల్లి 18. వేముల 19. పులివెందల 20. లింగాల 21. సింహాద్రిపురం 22. కొండాపురం 23. మైలవరం 24. పెద్దముడియం 25. రాజుపాలెం 26. దువ్వూరు 27. ఎస్. మైదుకూరు 28. బి. కోడూరు 29. బ్రహ్మంగారి మఠం 30. అట్లూరు 31. ఒంటిమిట్ట 32. సిద్దవటం 33. వీరబల్లె 34. రాయచోటి 35. రామాపురం 36. లక్కిరెడ్డి పల్లి 37. పెండ్లి మర్రి 38. వీరపునాయనిపల్లె 39. తొండూరు 40. ముద్దనూరు 41. జమ్మలమడుగు 42. ప్రొద్దుటూరు 43. చాపాడు 44. కాజీపేట 45. చెన్నూరు 46. కడప 47. చింతకొమ్మదిన్నె 48. వల్లూరు 49. కమలాపురం 50. ఎర్రగుంట్ల.

నారింజ, మామిడి పండ్లకు ప్రసిద్ధి. లంక మల్లేశ్వరం వద్ద చిరుతపులికి, కవిలెకోడి వంటి అడవిపక్షికీ అభయారణ్యాం ఉంది. పైరిటీస్ ఖనిజం దొరుకుతుంది. క్వారీల నుండి కడప నాపరాళ్లు లభిస్తున్నాయి. రాజంపేట నుండి

చీనా బంకమన్ను ఎగుమతి అవుతూంది. ఆస్బెస్టాస్, డోలమైట్, బైరైటీస్, మాంగనీసు,

| కడప జిల్లా ముఖ్యాంశాలు |
|---|
| విస్తీర్ణం : 15,359 చ.కి.మీ. |
| జనాభా : 22,68,000 |
| అక్షరాస్యత :48% |
| రెవెన్యూ డివిజనులు : 3 |
| శాసనసభ నియోజక వర్గాలు : 11 |
| లోక సభ నియోజకవర్గాలు : 2 |
| జిల్లా కేంద్రం : కడప |

ఇనుప రాయి ఇతర ఖనిజాలు, ఎర్రగుంట్లలోని సిమెంటు ఫ్యాక్టరీ భారీ స్థాయి కలది. అక్కడే బేరియం ఫ్యాక్టరీ కూడ ఉంది. ఈ జిల్లాలో చూడదగిన స్థలాలు : తాళ్లపాక అన్నమయ్య జన్మస్థలి, పుష్పగిరి మఠం, బ్రహ్మంగారి మఠం (కందిమల్లయపల్లి). చారిత్రకస్థలం ఒంటిమిట్ట, సిద్ధవటం కోట.



## అనంతపురం జిల్లా

రాయల సీమలో తరచూ అనావృష్టికి గురి అయ్యే జిల్లా. ఇటీవల (1995) పుట్టపర్తి సత్య సాయిబాబా ఆధ్వర్యంలో జిల్లా నీటి కరువుకు పరిష్కారంగా చెరువులు నిర్మించి గొట్టాల ద్వారా గ్రామాలకు నీటిని అందించడానికి ఏర్పాట్లు జరిగాయి. పెన్నానది ఈ జిల్లాలో జీవనది. చిత్రావతి నది బుక్క రాయసముద్రం తటాకానికి నీటిని అందిస్తుంది. హగరీ, తడకలేరు, కుశావతి, పాపఘ్ని చిన్న నీటి వనరులు, హగరీనది మీద భైరవవానితిప్ప ప్రాజెక్టు నిర్మించారు. వరిగింజలు చల్లి పండిస్తారు, ఊడ్చరు. అయినా వరి పంట బహు తక్కువ. జొన్న, సజ్జ, రాగి వంటి చిరు ధాన్యాలు వర్షాధారం మీద పండిస్తారు. ప్రత్తి, వేరుసెనగ వాణిజ్యపు పంటలు. నూనె, దూది మిల్లులు ఉన్నాయి. పట్టు పరిశ్రమ ఉంది. ధర్మవరం నేత పట్టుచీరలకు ప్రసిద్ధి. ఉరవకొండ చేనేతకు ప్రసిద్ధి. గుత్తికోట, లేపాక్షి శిల్ప సంపద, చిత్రకళ,

**మండలాలు**

1. గుంతకల్లు 2. గుత్తి పెద్దవడుగూరు 4. యాడికి 5. తీడిపత్రి 6. పెట్లూరు 7. యెల్లనూరు 8. తాడిమర్రి 9. ముదిగుబ్బ 10. తాలుపుల్ల 11. నంబులి పులికుంట 12. గుండ్లపెంట 13. కదిరి 14. నల్లచెరువు 15. తనకల్లు 16. ఆమదగూరు 17. ఓబులదేవర చెరుటకి 18. 19. చిలమతూరు 20. లేపాక్షి 21. హిందూపురం 22. పరిగి 23. మడకసిర 24. రోళ్ల 25. అగిలి 26. గునిబంగ్ 27. అమరాపురం 28. కుందుర్పి 29. సెతూరు 30. బ్రహ్మసముద్రం 31. గుమ్మగట్ట 32. రాయదుర్గ 33. దండినిహిరేవల్లి 34. బొమ్మనహాళ్ 35. విడు పనకల్లు 36. వజ్రకరూరు 37. పామిడి 38. సింగనమల 39. పెద్దపప్పురు 40. నార్పాల 41. బేతాళపల్లి 42. ధర్మవరం 43. బుక్కపట్నం 44. నల్లమడ 45. పుట్టపర్తి 46. కొత్త చెరువు 47. సోమందేపల్లి 48. పెనుకొండ 49. రోడ్డం 50 చెన్నకొత్తపల్లి 51. రామగిరి 52. కంబిదూరు 53. కల్యాణదుర్గ 54. బెలుగుప్ప 55. కనేకల్లు 56. ఉరవకొండ 57. కుదేరు 58. గార్లదిన్నె 59. బుక్కరాయ సముద్రం 60. అనంతపురం 61. రస్తాడు 62. కనగనపల్లి 63. ఆత్మకూరు.

తాడిపత్రిలో విజయనగర కాలంనాటి శిల్ప సంపద, పెనుకొండలో గగన్ మహల్ కోట,

> **అనంతపురం జిల్లా ముఖ్యాంశాలు**
>
> విస్తీర్ణం : 19,130 చ.కి.మీ.
>
> జనాభా : 31,84,000
>
> అక్షరాస్యత :42%
>
> రెవెన్యూ డివిజనులు : 3
>
> శాసనసభ నియోజక వర్గాలు : 14
>
> లోక సభ నియోజకవర్గాలు : 2
>
> జిల్లా కేంద్రం : అనంతపురం

కటారుపల్లిలో వేమన సమాధి, ఆలూరు కోనలోని పాతాళ గంగ, హేమవతిలో జైనక్షేత్రం, కదిరిలోని మర్రి వటవృక్షం అనంతపురం జిల్లాలోని చూడదగిన స్థలాలు.

## కర్నూలు జిల్లా

నల్లమలై, ఎర్రమలై దట్టమైన అడవులతో నిండిన రాయల సీమ జిల్లా. ఈ



రెండు పర్వత శ్రేణుల మధ్య నున్న కొయిల కుంట్ల, సిరివేలు, నంద్యాల, నందికొట్కూరు ప్రాంతం సారవంతమైన నేల ద్వారా కర్నూలు - కడప కాలువ పారుతూంది. నల్లమలై ప్రాంతమంతా ప్రకృతి రామణీయకతకు ప్రసిద్ధి. ఎర్రమలై కొండల్లో తామరాజుపల్లె, రాంపూరు ప్రాంతాల్లో కనుమలు ఉన్నాయి. అటవీ ప్రదేశం కంబం - నందికొట్కూరు ప్రాంతంలో ఉంది. ఎత్తైన ప్రాంతాల్లో వున్న అడవులు నాణ్యమైన కలప నిస్తున్నాయి. రోళ్లపాడు వద్ద బట్ట మేక పక్షి, నేల నెమలి వంటి జంతువులకూ శ్రీశైలం వద్ద పెద్దపులి, రేచు కుక్కలకు అభయారణ్యాలున్నాయి. తుంగభద్రా, హంద్రీ, కుందూ నదులు ప్రధాన జలాధారాలు. తుంగభద్రా నది జిల్లా ఉత్తర సరిహద్దుగా ప్రవహించి కృష్ణా నదిలో సంగమేశ్వరం వద్ద కలుస్తొంది. భవనాశి, పాలేరు, సక్కిలేరు, ఆలేరు చిన్న నీటి వనరులు. వేడినీటి జల గుండాలు నల్లమలై, ఎర్రమలై కొండల్లో కానవస్తాయి. జొన్న, చిరుధాన్యాలు బాగా

> **మండలాలు**
>
> 1. కర్నూలు 2. నందికొట్కూరు 3. పగిడియాల 4. కొత్తపల్లి 5. శ్రీ శైలం 6. ఆత్మకూరు 7. వెలుగోడు 8. బండి ఆత్మకూరు 9. మహానంది 10. రుద్రవరం 11. ఆళ్ళగడ్డ 12. చాగలమర్రి 13. ఉయ్యాలవాడ 14. సంజామల 15. కోకు 17. పీపల్లి 18. తుగ్గలి 19. మద్దికెర 20. చిప్పగిరి 21. హాలాహర్వి 22. హోలగుండ 23. ఆదోని 24. కౌతాలమ్ 25. కొసిగి 26. మంత్రాలయం 27. నందవరం 28. సి. బెలగాల్ 29. గూడూరు 30. కల్లూరు 31. ఓర్వకల్లు 32. మిడితూరు 33. జూపాడు బంగళా 34. పాములపాడు 35. గడివేముల 36. నంద్యాల 37. గోసపాడు 38. శిరివేలు 39. డోర్నిపాడు 40. కోయిల కుంట్ల 41. బనగానపల్లి 42. బేతంచర్ల 43. ధోన్ 44. కృష్ణగిరి 45. దేవరకొండ 46. పత్తికొండ 47. ఆలూరు 48. అస్పరి 49. పెద్దకడుబూరు 50. ఎమ్మిగనూరు 51. గోనెగొండ్ల 52. కోడుమూరు 53. వెల్దుర్తి 54. పాణ్యం

పండుతాయి. వరి తక్కువ. పత్తిసాగు ఎక్కువ. పైసర, కంది, సెనగవంటి అపరాలు పండుతాయి. బైరైటిస్, ఇనుపరాయి, బంగారం ఖనిజ సంపద

**కర్నూలు జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 17,658 చ.కి.మీ.**

**జనాభా : 29,73,000**

**అక్షరాస్యత : 40%**

**రెవెన్యూ డివిజనులు : 3**

**శాసనసభ నియోజక వర్గాలు : 13**

**లోక సభ నియోజకవర్గాలు : 2**

**జిల్లా కేంద్రం : కర్నూలు**

ఉంది. జొన్నపురి వద్ద ఒకప్పుడు వజ్రపు గనులు ఉండేవి . జవుళీ, సిమెంటు, కాగితం, వంటనూనె పరిశ్రమలు ఉన్నాయి. కృష్ణా నదిపై శ్రీశైలం వద్ద భారీడాము పంటనీటిని జలవిద్యుత్తును సరఫరా చేస్తున్నది. ఈ జిల్లాలో శ్రీశైలంవద్ద ప్రసిద్ధమైన భ్రమరాంబ-మల్లిఖార్జున శైవక్షేత్రం, మహానంది వద్ద మరొక శైవక్షేత్రం, అహోబలం వద్ద లక్ష్మి నరసింహ వైష్ణవ క్షేత్రం, మంత్రాలయంవద్ద శ్రీరాఘవేంద్ర స్వామి వారి ద్వైత మఠం ఉన్నాయి.

## మహబూబునగరం జిల్లా

ఈ తెలంగాణా జిల్లా మధ్య మధ్య కొండలతో ఉండి ఉత్తరం నుండి ఆగ్నేయానికి వాలు కలిగి ఉంది. కల్వకుర్తి ,నాగర-కర్నూలు, కొల్లాపురం, అలంపురం, గద్వాల, ఆత్మకూరు, మఖ్తల్ పీఠభూమి ప్రాంతంలో మంచి అడవులు ఉన్నాయి. జిల్లాకు ఆగ్నేయ సరిహద్దుగా కృష్ణా నది ప్రవహిస్తూంది. కృష్ణానదికి ఉపనది భీమానది పారుతూంది. దిండివాగు, పెద్దవాగు, మూసాపేట ప్రాజెక్టు సరళాసాగర్ ఇతర జలాధారాలు. వరి సాగు తక్కువ. జొన్న పంట ఎక్కువ. సజ్జ, రాగులు వంటి చిరుధాన్యాలు కూడ పండుతాయి. వేరుసెనగ, ఆముదాలు వాణిజ్య పంటలు. కురవిందం వంటి రాళ్ళకు ప్రసిద్ధి. కృష్ణానదీలోయలో ఖనిజాల్ని తవ్వుతున్నారు. చీరలు వంటి చేనేత వస్త్రాలకు

**మహబూబు నగరం జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 18,432 చ.కి.మీ.**

**జనాభా : 30,77,000**

**అక్షరాస్యత : 30%**

**రెవెన్యూ డివిజనులు : 4**

**శాసనసభ నియోజక వర్గాలు : 13**

**లోక సభ నియోజకవర్గాలు : 2**

**జిల్లా కేంద్రం : మహబూబు నగరం**

**మండలాలు**

1.కొందుర్గ 2. ఫరూక్‌నగర్ 3. కొత్తూరు 4. కేశంపేట 5. తాళకొండపల్లి 6. అమంగల్ 7. మాడ్గుల్ 8. వంగూరు 9. ఉప్పునూతల 10. అచ్చంపేట 11. అమరాబాద్ 12. కొల్లాపూర్ 13. వేపంగండ్ల 14. అలంపురం 15. మనాపాడ్ 16. వడ్డేపల్లి 17. జీజ 18. ఘట్ 19. తారూర్ 20.మంగ్నూర్ 21. మక్తల్ 22. ఉట్కూర్ 23. నారాయణ్‌పేట 24. దామరగిద్ద 25. దౌలతాబాదు 26. కొడంగల్ 27. బొంబానపేట 28. కోసిగి 29. మద్దూరు 30. కోయిల్ కొండ 31. హన్‌వాడ 32. యమన గండ్ల 33. బాలానగర్ 34. మిడ్జిల్ 35.వెల్దండ 36. కల్వకుర్తి 37. తెల్కపలి 38. బాలమూర్ 39. లింగాల్ 40. పెద్దకొత్తపల్లి 41. కోడేర్ 42. పానగల్లు 43. పెబ్బేర్ 44. ఇటిక్యాల 45. మల్దకల్లు 46. గద్వాల 47. ఆత్మకూరు 48. నార్వ 49. ధన్‌వాడ 50. దేవరకద్ర 51. మహబూబ్‌నగరం 52. జడ్చర్ల 53. తిమ్మాజీపేట 54. తాండూర్ 55. నాగర్‌కర్నూల్ 56. గోపాల్ పేట 57. వనపర్తి 58. కొత్తకోట 59. చిన్నచింతకుంట 60. శంకలమండి 61. బూత్‌పూర్ 62. ఘనాపూర్ 63. పెద్దమందడి 64. బిజ్నపల్లి.

గద్వాలు, కొత్తకోట ప్రసిద్ధి. పట్టు పరిశ్రమ సాగుతూంది.



అలంపురంలో పశ్చిమ చాళుక్య దేవళం, పానగల్లుకోట, కొయ్యల కొండ కోట, ఉమామహేశ్వరం, శ్రీరంగపట్నంలోని దేవళాలు యాత్రా స్థలాలు.

## రంగారెడ్డి జిల్లా

ఈ తెలంగాణా జిల్లా రాజధాని నగరం హైదరాబాదును చుట్టి వున్న జిల్లా. ఆగ్నేయంలో రాచకొండ శ్రేణి, అనంతగిరి శ్రేణులు ఉత్తరం నుంచి దక్షిణానికి చిట్టడ వులతో విస్తరించి ఉన్నాయి. మౌలాలీ, గోల్కొండ, నల్లకొండ, తిరుమలగిరి రాజధాని వైపు వ్యాపించి ఉన్నాయి. చిన్న పెద్ద తటాకాలు అక్కడక్కడ ఉన్నాయి. మూసీనది, వుండా చెరువు, ఆసిఫ్‌నగర్ చెరువు ఈ జిల్లాకు జలాధారాలు. జొన్నలు, రాగులు పండుతాయి. వరి పంట తక్కువ. చెరువులు, దిగుడుబావులు, బోరుబావులు ప్రధానమైన నీటివనరులు. ద్రాక్ష తోటపంటగా ప్రసిద్ధి. ద్రాక్ష ఎగుమతి కూడ అవుతుంది. కోళ్ల పరిశ్రమ, కోడిగుడ్ల ఉత్పత్తి అపారం. గ్రానైట్, సున్నపురాయి, క్వార్ట్జ్ పుష్కలం. హైదరాబాదును ఆనుకుని వున్న ప్రాంతాలలో పారిశ్రామికాభ్యుదయం మెండు. కేంద్ర ప్రభుత్వరంగ పరిశ్రమలు ఎలక్ట్రానిక్స్, డైనమిక్స్, కేబుల్స్ వంటి భారీ పరిశ్రమలు నెలకొన్నాయి. అనంతగిరి జాతర, గోల్కొండ కోట, గండిపేట చెరువు సమీపాన



**మండలాలు**

1. శంకరపల్లి 2. రాజేంద్ర నగర్ 3. సేరిలింగంపల్లి 4. బాలానగర్ 5. కుతుబుల్లాపూర్ 6. మేడ్చల్ 7. షామీర్‌పేట 8. మల్కాజిగిరి 9. కీసర 10. ఘటకేసర్ 11. ఉప్పల్ 12. హయత్‌నగర్ 13. సరూర్ నగర్ 14. ఇబ్రహీంపట్నం 15. మంచాల 16. యాచారం 17. కందుకూరు 18. మహేశ్వరం 19. శంషాబాద్ 20. మొయినాబాద్ 21. షాబాద్ 22. పూడూర్ 23. గండేడ్ 24. కుల్కచెర్ల 25. దోమ 26. పర్గి 27. యాలాల్ 28. బషీరాబాద్ 29. తాండూరు 30. పెద్దేముల్ 31. బంట్వారం 32. మార్పల్లి 33. మోమిన్‌పేట్ 34. నవాబ్‌పేట్ 35. చేవెళ్ల 36. వికారాబాదు 37. ధారూర్.

ఓషన్ పార్క్ అనే జలవినోద క్షేత్రం పర్యాటక స్థలాలు ప్రసిద్ధి.

**రంగారెడ్డిజిల్లా ముఖ్యాంశాలు**

విస్తీర్ణం : 7,493 చ.కి.మీ.

జనాభా : 25,52,000

అక్షరాస్యత : 49%

రెవెన్యూ డివిజనులు : 3

మండలాలు : 37

శాసనసభ నియోజక వర్గాలు : 6

లోక సభ నియోజకవర్గాలు :

జిల్లా కేంద్రం : హైదరాబాదు (వికారాబాదు)

## ఆదిలాబాదు జిల్లా

ఆంధ్రప్రదేశ్‌కు ఉత్తర సరిహద్దుగా వున్న జిల్లా. గోదావరి ఈ జిల్లాకు పశ్చిమం నుండి తూర్పుకు దక్షిణ సరిహద్దుగా ప్రవహిస్తూంది. గోదావరి ఉపనది పెన్గంగ మహారాష్ట్ర నుండి ప్రవహిస్తూ ఈ జిల్లా ఉత్తర సరిహద్దుగా దక్షిణానికి ప్రాణహితగా ప్రవహిస్తూ ఆదిలాబాదు, బోథ్, ఉట్నూరు, ఖానాపూర్ ప్రాంతాలగుండా పారుతూంది.

**మండలాలు**

1. వాంఖిడి 2. కాగజ్‌నగర్ 3. సిర్పూర్ 4. కాతాల 5. బెజ్జూరు 6. దహెగామ్ 7. వేమన పల్లి 8. కోటపల్లి 9. చిన్నూర్ 10. జైపూర్ 11. మంచిర్యాల 12. లక్సెట్టిపేట 13. దండేపల్లి 14. జన్నారం 15. కడం 16. ఖానాపూర్ 17. మామడ 18. లక్ష్మణ్‌చందా 19. నిర్మల్ 20. దిల్వార్పూరు 21. లొహెషా 22. ముధోల్ 23. తానూర్ 24. కుబీర్ 25. భైన్సా 26. కుంతల 27. సారంగపూర్ 28. బోథ్ 29. బజార్ హత్నూర్ 30. తలమడుగు 31. తామ్సీ 32. జైనద్ 33. బేల 34. నార్నూర్ 35. జైనూర్ 36. కెరమెరి 37. ఆసీఫాబాద్ 38. రెబ్బెన 39. భీమిని 40. నెన్నాల్ 41. మందమర్రి 42. బెల్లంపల్లి 43. తాండూరు 44. కాశిపేట 45. తిర్యాని 46. సిర్పూర్ 47. ఉట్నూర్ 48. నేరడికొండ 49. ఇచ్చోడ 50. గుడి హత్నూర్ 51. ఆదిలాబాదు 52. ఇంద్రవెల్లి.

కడంనది మీద కట్టిన డాముపల్ల పంటనీరు లభిస్తూంది. సిర్పూరు ప్రాంతంలో తటాకాలు బావులు ద్వారా సాగునీరు లభిస్తూంది. ఈ జిల్లా అటవీ సంపదకు ప్రసిద్ధి. వరి, గోధుమ పంటలు పండుతాయి. కాగా జొన్న విస్తారం.



**ఆదిలాబాదు జిల్లా ముఖ్యాంశాలు**

విస్తీర్ణం : 16133 చ.కి.మీ.

జనాభా : 13,88,358

అక్షరాస్యత : 33%

రెవెన్యూ డివిజనులు : 3

మండలాలు : 52

శాసనసభ నియోజక వర్గాలు : 19

లోక్‌సభ నియోజకవర్గాలు : 1

జిల్లా కేంద్రం : ఆదిలాబాదు

ప్రత్తి, చెరకు వాణిజ్యపు పంటలు. ఈ జిల్లాలో నేలబొగ్గు విస్తారంగా లభిస్తుంది. మందమర్రిలోను, బెల్లంపల్లి లోను బొగ్గు తవ్వకం ఎక్కువ. సున్నపు రాయి, చీనా బంకమన్ను ముఖ్యమైన ఖనిజసంపద. సిమెంటు పరిశ్రమ, కాగజ్ నగర్‌లో కాగితం మిల్లు (సిర్పూరు) భారీ పరిశ్రమలు ఉన్నాయి. నిర్మల్ కొయ్యబొమ్మల తయారీకి ప్రసిద్ధి. ప్రకృతి రామణీయకతకు ఈ జిల్లా ప్రసిద్ధి. కుంతల జలపాతం, పోచారం జలపాతం పర్యాటక స్థలాలు. రాష్ట్రంలో వున్న ఏకైక సరస్వతీ దేవాలయం బాసరలో ఉంది. గోండ్ ఆదిమజాతి ఈ జిల్లా ప్రత్యేకత.

## మెదకు జిల్లా

రాజధాని నగరం హైదరాబాదుకు సమీపంలో వున్న తెలంగాణా జిల్లా. కొండలు, మెట్ట భూములు ఉన్న ప్రదేశం. బాలాఘాటు కొండలు, ఇతర పర్వత శ్రేణులు విస్తరించి ఉన్నాయి. కవాద్, ప్రాణహిత ప్రాంతంలో పెద్దపులి, కృష్ణజింక, శివరాం వద్ద చిత్తడి నేలల్లో మొసలి, పులి, చిరుతపులి, కొండగొర్రెలు వంటి వన్యమృగాలకు అభయారణ్యాలు ఉన్నాయి. గోదావరి ఉపనది అయిన మంజీర ప్రధాన జలాధారం. ఇది కర్ణాటక రాష్ట్రంలో పుట్టి అనంతగిరులను దాటి జిల్లాలో దాదాపు నూరు కిలోమీటరులు ప్రవహించి ప్రక్కనున్న నిజామాబాదు జిల్లాలోని గోదావరి నదిలో కలుస్తుంది. పసుపులేరు (హరీ) మరొక చిన్ననది. చిన్న, పెద్ద తటాకాలు, దిగుడు బావులు, బోరులు ఇతర జలాధారాలు. తెలంగాణా జిల్లాల్లో వరి పండే ప్రాంతాల్లో ఇది ఒకటి. మెదకు పేరు కూడ 'మెతుకు' నుండి వచ్చిందేనని విజ్ఞుల అభిప్రాయం. జొన్న, అపరాలు పండుతాయి. అంత ర్జాతీయ మెట్ట పంటల పరిశోధనా కేంద్రం - ఇక్రిశాట్ పటాన్‌చెరులోనే ఉంది. పండ్ల పరిశోధన కేంద్రం సంగారెడ్డిలో ఉంది. యద్దుమల్లారం వద్ద ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ ఉంది. రాజధాని నగరం సమీపంలోనే ఉండడం వల్ల హెవీ ఎలక్ట్రికల్స్ వంటి అనేక భారీ, చిన్న తరహా పరిశ్రమలు నెలకొని ఉన్నాయి. జహీరాబాదులో ఔషధాలు, పంచదార ఫ్యాక్టరీలు




**మండలాలు**

1. మెదక్ 2. రామాయంపేట 3. దుబ్బాక 4. సిద్దిపేట 5. చిన్నకోడూరు 6. నంగనూరు 7. కొండపాక 8. జగ్దేవపూర్ 9. వార్గల్ 10. తూప్రాన్ 11. జిన్నారం 12. రామచంద్రాపురం 13. పటానుచేరు 14. సంగారెడ్డి 15. కొండాపూర్ 16. సదాశివపేట్ 17. మున్పల్లి 18. కోహీర్ 19. జహీరాబాద్ 20. న్యైల్‌కల్ 21. మానూర్ 22. కేంగ్డీ 23. కాల్హేర్ 24. శంకరంపేట25. పాపన్నపేట 26. రంగంపేట 27. వెల్దుర్తి 28. శంకరం పేట 29. చేగుంట 30. మీర్‌దొడ్డి 31. దౌలతాబాదు 32. గజ్వేల్ 33. వార్గల్ 34. శివంపేట 35. నరసాపూర్ 36. హత్నూర 37. పుల్కాల్ 38. జీరాసంగం 39. రైకోడ్ 40. నారాయణఖేడ్ 41. రేగోడ్ 42. అల్లాదుర్గ 43. టేక్మల్ 44. కొడిపల్లి 45. ఆందోలు.

ఉన్నాయి. కొండాపూర్‌లో పురాతత్వ [redacted] 112 కి.మీ ప్రవహిస్తుంది. మంజీర [redacted] కి.మీ. ఈ జిల్లాలో ప్రవహించి కుందుర్తి వద్ద గోదావరిలో కలుస్తుంది.

మెదక్‌లోని వెసీలియన్ చర్చి చెప్పుకోదగ్గ పర్యాటక స్థలాలు.

**మెదక్ జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 9,699 చ.కి.మీ.**

**జనాభా : 22,70,000**

**అక్షరాస్యత :32%**

**రెవెన్యూ డివిజనులు : 3**

**శాసనసభ నియోజక వర్గాలు : 10**

**లోక సభ నియోజకవర్గాలు : 2**

**జిల్లా కేంద్రం : సంగారెడ్డి**

**నిజామాబాదు జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 7,956 చ.కి.మీ.**

**జనాభా : 20,36,000**

**అక్షరాస్యత :34%**

**రెవెన్యూ డివిజనులు : 3**

**శాసనసభ నియోజక వర్గాలు : 9**

**లోక సభ నియోజకవర్గాలు : 1**

**జిల్లా కేంద్రం : నిజామాబాదు**

## నిజామాబాదు జిల్లా

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి వాయువ్య దిశలో మహారాష్ట్ర సరిహద్దులో వున్న జిల్లా. కొండలు మిట్టలుగల ప్రాంతం. మిగతాది మెట్ట మైదాన ప్రాంతం. అడవుల్లో టేకు, ఇరుగుడు చేవ కలప లభిస్తుంది. గోదావరి ప్రధానమైన జీవనది. ఇది గోదావరిలో కలుస్తుంది. ఎడ్లకట్టవాగు మరొక జలాధారం. నిజాంసాగరం బన్సవాడ, నిజామాబాదు, ఆర్మూరు ప్రాంతాలకు 150 కి.మీ. నిడివిగల కాలువ ద్వారా పంటనీటిని అందిస్తుంది. పోచంపాడు వద్ద గోదావరిపై భారీ శ్రీరామసాగర్ డామును ఇటీవల నిర్మించి



**మండలాలు**

1. నందిపేట 2. ఆర్మూర్ 3. బాలకొండ 4. మార్తాడ్ 5. కమ్మర్‌పల్లి 6. సిరికొండ 7. మాచారెడ్డి 8. దోమకొండ 9. భిక్నూర్ 10. తాడవాయి 11. లింగంపేట్ 12. నాగిరెడ్డి పేట 13. ఎల్లారెడ్డి 14. నిజామ్‌సాగర్ 15. పిట్లం 16. బిచ్‌కుండ 17. జుక్కల్ 18. మద్నూర్ 19. కోటగిరి 20. బోధన్ 21. రాంజల్ 22. నవిపేట 23. మక్లూర్ 24. జక్రాన్‌పల్లి 25. వేల్పూర్ 26. భీంగల్ 27. ధార్పూర్ 28. కామారెడ్డి 29. సదాశివనగర్ 30. గంధారి 31. బన్సవాడ 32. బిర్కూర్ 33. వర్ని 34. నిజామాబాదు 35. డిచ్‌పల్లి 36. ఎడపల్లి.

పంట నీటిని అందిస్తున్నారు. పోచారం, రామడుగు, చిన్న చెరువులు ఇతర జలాధారాలు. తెలంగాణా జిల్లాలో వరి సాగుకు ప్రధానమైన ప్రాంతం. జొన్న ఇతర చిరుధాన్యాలు పండుతాయి. చెరకు వాణిజ్యపు పంట. బోధన్ వద్ద భారీ పంచ దార మిల్లు ఉంది.

## కరీంనగరం జిల్లా

ఈ ఉత్తర తెలంగాణా జిల్లా కొండ ప్రాంతం, పీఠభూమి కలిసి ఉన్నాయి. బాలాఘాట్ కొండలు జిల్లాలో విస్తరించి ఉన్నాయి. కుర్రపల్లి - జగిత్యాల మధ్య నుంచి ఈ కొండలు గోదావరి ఒడ్డు వరకూ వ్యాపించాయి. మరొక శ్రేణి సునీ-మాలంగూరువరకూ ఉన్నాయి. కంచెర్ల, మార్కులగుట్ట 700 మీటరుల ఎత్తు గలవి. మరొక శ్రేణి మన్నేరు నదీలోయవరకూ వ్యాపించి ఉన్నాయి. మిగతా ప్రదేశం పీఠభూమి ప్రాంతం. గోదావరిలోయ దట్టమైన అరణ్య ప్రాంతం. టేకు, బిల్లు, చిరుమాను, నల్లమద్ది వంటి అనేక రకాల కలప సంపదకు ఈ జిల్లా ప్రత్యేకత. గోదావరి, మన్నేరు నదులు ఈ జిల్లాకు తూర్పు, ఉత్తర సరిహద్దులుగా సహజంగా ఏర్పడి ఉన్నాయి. గోదావరి నది ఈ జిల్లాలో 282 కి.మీ. పారుతూంది. ఈ జిల్లా మెట్ట ప్రాంతాలు ఎక్కువ. వరి, జొన్న

**కరీంనగర్ జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 11,823 చ.కి.మీ.**

**జనాభా : 30,37,000**

**అక్షరాస్యత : 37%**

**రెవెన్యూ డివిజనులు : 3**

**శాసనసభ నియోజక వర్గాలు : 13**

**లోక సభ నియోజకవర్గాలు : 2**

**జిల్లా కేంద్రం :కరీంనగరం**

ఆహారపు పంటలు. ఆముదాలు వాణిజ్యపు పంట, జిల్లా అంతటా ఇనుపరాయి లభిస్తూంది. దీని నుండి నాటు పద్ధతిలో ఇనుము ధాతుసాధన చేసి పదునైన కత్తులు చేసేకార్ఖానాలు



**మండలాలు**

1.రామగుండం 2. కమాన్‌పూర్ 3. మంథెని 4. కాటారం 5. మహాదేవపూర్ 6. ముత్తావరం 7. తాడిచెర్ల 8. ముత్తారం 9. శ్రీరాంపూర్ 10. ఓదెల 11. జమ్మికుంట 12. కమలాపూర్ 13. ఎల్కతుర్తి 14. భీమదేవరపల్లి 15. హుస్నాబాద్ 16. కొహెడ 17. బెజ్జంకి 18. ఇల్లంకుంట 19. సిరిసిల్లా 20. ముస్తాబాద్ 21. గంభీరావుపేట్ 22. ఎల్లారెడ్డిపేట 23. కోనారావుపేట్ 24. చందుర్తి 25. కత్లాపూర్ 26. మెట్‌పల్లి 27. ఇబ్రహీంపట్నం 28. మల్లాపూర్ 29. రాయకల్ 30. సారంగపురం 31. ధర్మపురి 32. వెల్గటూర్ 33. ధర్మారం 34. పెద్దపల్లి 35. సుల్తానాబాద్ 36. వీణవంక 37. హుజూరాబాదు 38. సైదాపూర్ 39. చిగురుమామిడి 40. తిమ్మాపూర్ 41. కేశవపట్నం 42. మానకొండూరు 43. కరీంనగరం 44. బోయినపల్లి 45. వేములవాడ 46. కోడిమార్ 47. మేడిపల్లి 48. కోరట్ల 49. జగిత్యాల 50. గొల్లపల్లి 51. పెగడపల్లి 52. జాలపల్లి 53. చొప్పదండి 54. రామడుగు 55. గంగాధర 56. మల్యాల్.

కోనసముద్రంలోనూ ఇబ్రహీంపట్నంలోనూ ఉన్నాయి. నేలబొగ్గు, స్లేటైట్ ఖనిజం పుష్కలం. టాల్క్ అన్ని చోట్ల దొరుకుతుంది. రామగుండం వద్ద సూపర్ తెర్మల్ విద్యుత్కేంద్రం విద్యుదుత్పత్తిని చేసి ఇతర చోట్లకు సరఫరా చేస్తోంది. రసాయన ఎరువుల ఫ్యాక్టరీ రామగుండం వద్ద ఉంది. ఈ జిల్లాలో వెండితో చేసే ఫిలిగ్రీ సామగ్రి కుటీర పరిశ్రమగా ప్రసిద్ధి చెందింది. వేములవాడ, కాళేశ్వరం శైవ క్షేత్రాలు, ధర్మపురి, మంథెని పట్టణాల్లో దేవళాలు ఉన్నాయి.

## వరంగల్లు జిల్లా

ప్రాచీన చరిత్ర కలిగి ఒకప్పుడు కాకతీయ సామ్రాజ్యానికి రాజధానిగా ఉన్న జిల్లా. కొండలు, పీఠభూమి ప్రాంతాలు జిల్లా అంతట విస్తరించి ఉన్నాయి. చంద్రగిరులు ప్రధానమైనవి. లక్నవరం సరస్సుకు తూర్పుగా కందికల్లు కొండలు ఉన్నాయి. పాకాల, ఏటూరునాగారం ప్రాంతం అడవుల మయం - పెద్దపులి, అడవిదున్నలకు అభయారణ్యాలుగా ప్రసిద్ధి. గోదావరి ప్రధానమైన జలాధారం. గోదావరినది ఈ జిల్లాలో 64 కి.మీ ప్రవహిస్తోంది. ములుగు, పాకాల ప్రాంతం అడవులలో టేకు, ఇప్ప, నల్లమద్ది

**వరంగల్లు జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 12,846 చ.కి.మీ.**

**జనాభా : 28,19,000**

**అక్షరాస్యత : 39%**

**రెవెన్యూ డివిజనులు : 3**

మండలాలు 50

**శాసనసభ నియోజక వర్గాలు : 13**

**లోక సభ నియోజకవర్గాలు : 2**

**జిల్లా కేంద్రం : వరంగల్లు**

కలప లభిస్తున్నాయి. పాలేరు, మున్నేరు ఇతర జలాధారాలు. వైరా నది కృష్ణానదికి ఉపనది. పాకాల చెరువు, రామప్ప చెరువు, లక్మవరం చెరువు, చిన్నాపురం చెరువులు భారీ నీటి వనరులు. వీటిని కాకతీయ ప్రభువులు తవ్వించారు. జొన్న, వరి పంటలు ప్రధానమైనవి. వేరుసెనగ, పెసలు పండుతాయి. వరంగల్లులోని



**మండలాలు**

1. చిట్యాల్ 2. భూపాల్‌పల్లి 3. వెంకటాపూరం 4. ఏటూరునాగారం 5. మంగపేట 6. తాడ్వాయి 7. కొత్తగూడెం 8. గూడూర్ 9. మహబూబాబాద్ 10. బలేపాల్ 11. డోర్నకల్ 12. మరిపెడ 13. దంతాలపల్లి 14. తొర్రూర్ 15. కొడకండ్ల 16. దేవరుప్పల 17. లింగాల్‌ఘనపూర్ 18. జనగాం 19. బచ్చన్నపేట 20. చేరియాల్ 21. మద్దూరు 22. వార్మెట్టు 23. ఘన్‌పూర్ 24. ధర్మసాగర్ 25. హసన్‌పర్తి 26. పరకాల 27 మొగుళ్ళపల్లి 28. రేగొండ 29. ఘవాపూర్ 30. ములుగు 31. గోవిందరావుపేట 32. నల్లబెల్లి 33. ఖనాపూర్ 34. చెన్నారావుపేట 35. నెక్కొండ 36. కేసముద్రం 37. నెల్లికుదురు 38. పర్వతగిరి 39. రాయపర్తి 40. పాలకుర్తి 41. రఘునాథపల్లి 42. జఫర్‌గడ్ 43. హన్మకొండ 44. ఆత్మకూర్ 45. శాయంపేట 46. దుగ్గొండి 47. నర్సంపేట 48. సంగం 49. వర్ధన్నపేట 50. గీసుకొండ.

కాకతీయ కోట తోరణం, హన్మకొండలోని వెయ్యిస్తంభాల గుడి, ములుగు ప్రాంతంలో వున్న రామప్పగుడి శిల్ప సంపదకు ప్రసిద్ధి. ఈ శివాలయంలోని నంది విగ్రహం నల్లరాతిని మలచగా చక్కటి నునుపుతో ఫలించింది. ఇది కాకతీయ రాజులు 13వ శతాబ్ది నాటిది. గుడి చుట్టూ ఎత్తునవున్న సాలభంజికలు ముఖ్యంగా అలసాకన్యలు చూడ ముచ్చటగా ఉంటాయి. రామప్పగుడిని ఆనుకొని రామప్ప చెరువు ప్రాంతాన్ని పర్యాటక కేంద్రంగా రూపొందించారు. వరంగల్లు నగరంలో కాకతీయ యూనివర్సిటీ, వైద్య కళాశాల, రీజినల్ ఇంజనీరింగు కాలేజి వంటి ఉన్నత వృత్తి విద్యా సంస్థలు నెలకొని పనిచేస్తున్నాయి. ఈ జిల్లాలో లంబాడీ (బంజార) ఆదిమ జాతుల వారున్నారు.

## ఖమ్మం జిల్లా

ఈ జిల్లాలో మన్యం ప్రాంతం ఎక్కువ. కొండలు, మిట్టలు ఉన్నాయి. గోదావరి లోయను ఆనుకుని ఒక పర్వతశ్రేణి సింగరేణి నుండి ముందుకు సాగి అశ్వరావుపేటవరకూ పోతూంది. ఎర్రగుట్ట, మర్రిగుట్ట, రాజుగుట్ట కొండలు వీటిలో ప్రధానమైనవి. భద్రాచలం, నూగూరు ప్రాంతాలు మన్యపు ప్రాంతాలు. మిగతా ప్రదేశం మెట్ట పీఠభూమి. సగానికి పైగా సాంద్రమైన అడవులలో టేకు, చందనం, పాల, ఇప్ప, చిన్నంగి, బండారు వెదురు రకాలు ఎక్కువ. పాపికొండ ప్రాంతంలో పెద్దపులి, జింకలకు, కిన్నెరసాని ప్రాంతాలు శాకాహార జంతువుల

**ఖమ్మం జిల్లా ముఖ్యాంశాలు**

విస్తీర్ణం : 16,029 చ.కి.మీ.

జనాభా : 22,26,000

అక్షరాస్యత :41%

రెవెన్యూ డివిజనులు : 3

శాసనసభ నియోజక వర్గాలు : 9

లోక సభ నియోజకవర్గాలు : 2

జిల్లా కేంద్రం : ఖమ్మం

**మండలాలు**

1. వజీద్ 2. వెంకటాపురం 3. చెర్ల 4. దుమ్ముగూడెం 5. భద్రాచలం 6. చింతూరు 7. వీరరామచంద్రపురం 8. వెలేరు 9. అశ్వరావుపేట 10. దమ్మపేట 11. సత్తుపల్లి 12. వెంసూరు 13. పెనుబల్లి 14. కల్లూరు 15. తలడ 16. వైరా 17. యెర్రుపాలెం 18. మధిర 19. బోనకలు 20. చింతకాని 21. ముదిగొండ 22. నేలకొండల్లి 23. కూసుమంచి 24. తిరుమలాయపాలెం 25. ఖమ్మం (గ్రా) 26. ఖమ్మం (ప) 27. కామేపల్లి 28. గార్ల 29. బయ్యారం 30. గుండాల 31. పినపాక 32. మణుంగూరు 33. అశ్వాపురం 34. బూరుగంపహాడ్ 35. కూనవరం 36. కుకునూర్ 37. ములకలపల్లి 38. చంద్రుగొండ 39. జూలూరాడు 40. ఎంకూర్ 41. కొంజెర్ల 42. సింగరేణి 43. యెల్లందు 44. తేకులపల్లి 45. కొత్తగూడెం 46. పాల్వంచ.



అభయారణ్యాలున్నాయి. గోదావరి నది 180 కి.మీ ఈ జిల్లాలో ప్రవహిస్తున్న నది. వాయువ్యం నుంచి కిన్నెరసాని వచ్చి గోదావరిలో కలుస్తుంది. మున్నేరు పశ్చిమానుండి వచ్చి నల్గొండ జిల్లాలోని కృష్ణానదిలో సంగమిస్తుంది. బయ్యారం చెరువు, వైరా, కట్టలేరు, పాలేరు వంటివి చిన్న నీటి వనరులు. జొన్న ప్రధానమైన ఆహారపు పంట. వరి ఇతర చిరుధాన్యాలు కూడ పండుతాయి. వేరుసెనగ, నువ్వులు, పొగాకు వాణిజ్యపు పంటలు. ఈ జిల్లాలో కోయ ఆదిమజాతివారున్నారు. ఈ జిల్లాలో ఖనిజ సంపద మెండు. నేలబొగ్గుకు సింగరేణి ప్రసిద్ధి. ఇనుపరాయి, సున్నపురాయి ఇతర ఖనిజాలు. సింగరేణి, కొత్తగూడెం ప్రాంతాలు బొగ్గు తవ్వకానికి ప్రసిద్ధి. దీనిని ఆధారంగా తెర్మల్ విద్యుత్కేంద్రాలు నెలకొని విద్యుదుత్పత్తి చేసి ఇతర చోట్లకు పంపుట జరుగుతూంది. బేరియం, క్రోమైట్, గ్రాఫైట్ నిక్షేపాలు కూడా ఎక్కువే. సిమెంటు, బేరియం పరిశ్రమలు ఉన్నాయి.

ఖమ్మం చారిత్రిక ప్రసిద్ధి కలది. కోర్కొండ బౌద్ధ శిథిలాలు, కూడలి, లక్ష్మీపురం, నేలకొండపల్లి, నాగుల వల, వెంకటాపురం జాతరలకు ప్రసిద్ధి. భద్రాచలంలో కంచెర్ల గోపన్న (రామదాసు) కట్టించిన రామాలయం సుప్రసిద్ధ దేవళం. ముఖ్యంగా శ్రీరామనవమికి భారీ ఉత్సవాలు జరుగు తాయి.

## హైదరాబాదు జిల్లా

## రాజధాని మహానగరం

ఆంధ్ర ప్రదేశ్ రాజధాని హైదరాబాదు మహానగర (మెట్రో) ప్రాంతం చుట్టూరా రంగారెడ్డి జిల్లా ఉంది. మహానగరాన్ని ఆనుకుని శివారు ప్రాంతాల్లో కుత్బుల్లాపూర్, ఎల్.బి. నగర్, మల్కాజిగిరి, కాప్రాన్ మునిసిపాలిటీలు ఉన్నాయి. మహానగరంలో సికింద్రాబాదు ఒక పెద్ద బస్తీ. ఈ మహానగరంలో మూసీ నది ప్రవహిస్తుంది.

హైదరాబాదు (భాగ్య నగరం) కేంద్రంగా నిజాం వంశీయులు దాదాపు 150 ఏళ్ళు పాలించారు. భారత దేశానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత 1948లో 'పోలీసు చర్య' జరిగిన అనంతరం ఇండియన్‌యూనియన్‌లో అం త ర్భా గ మైం ది. ఒకప్పుడు దీన్ని సౌధాల మహానగరం (సిటీ ఆఫ్ పాలెసెస్) గా పేర్కొనేవారు. ఇప్పుడు హైదరాబాదు మెట్రో ప్రాంతం 16 మండలాలుగా విభజింపబడింది.

**హైదరాబాదు జిల్లా ముఖ్యాంశాలు**

**విస్తీర్ణం : 217 చ.కి.మీ.**
**జనాభా : 31,46,000**
**అక్షరాస్యత : 73%**
**రెవెన్యూ డివిజనులు : 4**
**శాసనసభ నియోజక వర్గాలు : 14**
**లోక్ సభ నియోజకవర్గాలు : 2**
**జిల్లా కేంద్రం : హైదరాబాదు**

హైదరాబాదును ఆనుకుని పెక్కు భారీ పరిశ్రమలు నెలకొని పనిచేస్తున్నాయి. ఇందులో ఔషధ రసాయనాలు ఆల్విన్ మెటల్ వర్క్స్, హెవీ ఎలక్ట్రికల్స్, పేలుడు (డెటనేటర్స్) పదార్థాలు పేర్కొనదగినవి. రాష్ట్ర రాజధాని కావడం వల్ల ప్రభుత్వ సచివాలయం (సెక్రెటెరియేట్), వివిధ శాఖాధిపతుల (డైరెక్టరేట్స్) సంచాలక కార్యాలయాలు నగరం నడిబొడ్డున ఉన్నాయి. మహానగరానికి మంచి నీటి సదుపాయం హిమాయత్సాగరం, ఉస్మాన్ సాగరం ద్వారానూ మంజీర నీటి పథకం ద్వారానూ అందుతున్నాయి. రైలు, బస్సు,


హైదరాబాదు మహానగరం
(హైదరాబాదు & సికింద్రాబాదు) 16 మండలాలు (1996 వరకు)
1. అంబర్‌పేట
2. అమీర్‌పేట
3. ఆసిఫ్‌నగర్
4. ఖైరతాబాదు
5. తిరుమలగిరి
6. నాంపల్లి
7. బండ్లగూడ
8. బహదూర్‌పురా
9. మారేడ్‌పల్లి
10. షేక్‌పేట
11. సైదాబాదు
12. హిమాయత్‌నగర్
బొల్లారం
అల్వాల్
రాష్ట్రపతి నిలయం
అమ్ముగూడ
తిరుమలగిరి
బోయినపల్లి
బేగంపేట
అమీర్‌పేట
పంజగుట్ట
సికింద్రాబాదు
లాలాగూడ
హుసేన్‌సాగర్
రాజభవన్
ఖైరతాబాదు
ముషీరాబాద్
రామ్‌నగర్
విద్యానగర్
అంబర్‌పేట
హిమాయత్‌నగర్
నారాయణగూడ
శాంతి నగరం
నాంపల్లి
మెహిదీపట్నం
గోల్కొండ కోట
అబిడ్స్
కోఠీ
బేగంబజారు
అఫ్జల్‌గంజ్
కార్వాన్
మూసీనది
సాలార్‌జంగ్ మ్యూజియం
మలక్‌పేట
దిల్‌సుఖ్‌నగర్
హైకోర్టు
చార్మినార్
జుమ్మామసీదు
యాకుత్‌పురా
సైదాబాదు
చందూలాల్ బారాదారి
లాల్‌దర్వాజా
గాంధీనగర్
ఫలక్‌నుమా
చాంద్రాయణగుట్ట
హైదరాబాదు

విమాన సౌకర్యాలు రాష్ట్రంలో పలుచోట్లకు రాష్ట్రేతర ప్రాంతాలకు ఉన్నాయి.

హైదరాబాదు చుట్టుపక్కల గుట్టలు మిట్టలు దిక్కుటంగా ఉన్నాయి. వీటిలో మౌలాలీ వైపు గోల్కొండ కోట దగ్గర, తిరుమల గిరి (నల్లకొండ) ప్రముఖమైనవి.

సనత్‌నగర్ ప్రాంతంలోని పారిశ్రామికవాడ (ఇండస్ట్రియల్) రాష్ట్రంలో పెద్దది. ఇందులో అనేక చిన్న పెద్ద పరిశ్రమలు నెలకొని ఉఆన్నయి. హైదరాబాదులో ఉన్నత విద్యావ్యవస్థ 1918 వ్యవస్థాపింపబడిన ఉస్మానియా యూనివర్సిటీతో ప్రారంభమైంది. జవహర్‌లాల్‌నెహ్రూ టెక్నాలజికల్



గౌతమ బుద్ధుని ఏకశిలా విగ్రహం

యూనివర్శిటీ, ఎన్.జి.రంగా వ్యవసాయ యూనివర్శిటీ, హైదరాబాదు యూనివర్శిటీ ప్రముఖమైన ఉన్నతవిద్యా కేంద్రాలు. సెంటర్ ఫర్ సెల్యులర్ అండ్ మొలిక్యులర్ బయాలజీ (సిసిఎమ్‌బి), నేషనల్ జియోఫిజికల్ రిసెర్చి ఇనిస్టిట్యూట్ (ఎన్‌జిఆర్ఐ) సమీపాన ఉన్న పటాన్ చెరూ మెదకు జిల్లా (మెట్ట వ్యవసాయ కేంద్రం) పేర్కొన దగిన 'ఉన్నత' వైజ్ఞానిక పరిశోధనా కేంద్రాలు.

ఈ మహానగరంలో చూడదగ్గ స్థలాలు చాలా



గోల్కొండ నవాబులు నిర్మించిన చార్మినార్ (1591)

ఉన్నాయి - సాలారుజంగు మ్యూజియమ్, ఆర్కియలాజికల్ మ్యూజియము (ఈజిప్షియన్ మమ్మి), చార్మినార్, జుమ్మా మశీదు, పురాణా హవేలీ శిథిలాలు, ఫలక్‌నుమా పాలెసు, లుంబినీ పార్కు, హుస్సేను సాగర్‌లో ఇటీవల ప్రతిష్ఠించిన అతి పెద్దదైన ఏకశిలతో శిల్పించిన బౌద్ధ విగ్రహం పేర్కొనదగినవి. ఇంకను రాజధానిలోని భవన నిర్మాణాలు గోళాకార డోములతో అలరారుతూ ఇందు ఇండో-పార్సనిక్ వాస్తు సంప్రదాయం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. బిర్లా ప్లానిటేరియం-సైన్సు సెంటర్, టాంకుబండ్ మీద నెలకొన్న తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణంలో తెలుగు జాతి కీర్తి ప్రతిష్ఠల్ని నేలనాలుగు చెరుగుల చాటిన మహనీయుల శిల్ప విగ్రహాలు, నగరానికి సమీపంలో ఉన్న జలక్రీడా వినోదాలకు ఆలవాలమైన ఓషన్ పార్కు రంగస్థల కేంద్రమైన రవీంద్ర భారతి, గోల్కొండ కోట ప్రముఖమైనవి. పాతనగరంలోని చుడీ బజారు, ముత్యాల అంగళ్లు, సికింద్రాబాదు, పాతనగరం (ఓల్డ్ సిటీ), బేగం బజారు ప్రసిద్ధ టోకు విపణి కేంద్రాలు. అబిడ్స్, సుల్తాన్‌బజారు, జనరల్ బజారు మున్నగునవి షాపింగు సెంటర్లు, హైదరాబాదులో సావనీర్లుగా లభించేవి - మంచి

ముత్యాలు, లక్కగాజులు, ఆక్సిడైజ్డ్ మెటల్ సామగ్రి, లేపాక్షిలో హస్తకళా వస్తువులు, పుల్లారెడ్డి నేతి మిఠాయిలు వగయిరా.

## నల్గొండ జిల్లా

ఈ దక్షిణ తెలంగాణా జిల్లాలో కొండలు, మిట్టలు, పీఠభూమి ప్రాంతం ఎక్కువ. పశ్చిమం నుంచి తూర్పుకు నేల వాలి ఉంది. కృష్ణానది ప్రధానమైన జీవ నది. మూసీ, ఆలేరు, కృష్ణకు ఉపనదులు అహల్య, పెద్దవాగు, కొంగల్ చిన్న నీటివనరులు. కృష్ణానదిపై నందికొండ వద్ద బహుళ ప్రయోజన డాము నాగార్జునసాగరును నిర్మించారు (1967). ఇది వరదలను ఆదుపు చేయడానికే గాక జవహర్ కాలువ వ్యవస్థ,

**మండలాలు**

1. రాజపేట 2. ఆవేరు 3. గుండాల 4. తిరుమలగిరి 5. తుంగతుర్తి 6. నూతనకల్లు 7. ఆత్మకూరు 8. మోతే 9. నడిగుడెం 10. కోదాడ్ 11. మెడ్లచెరువు 12. మట్టంపల్లి 13. నేరెడిచర్ల 14. దామెరచర్ల 15. పెద్దపూరం 16. పెద్ద అడిసెర్లపల్లి 17. చంగంపేట 18. గుండ్లపల్లి 19. దేవరకొండ 20. చింతపల్లి 21. మర్రిగుడ 22. నారాయణపురం 23. చౌటుప్పల్ 24. పోచంపల్లి 25. బీబీనగర్ 26. బొమ్మల రామారం 27. తుర్కపల్లె 28. యాదగిరిగుట్ట 29. ఆత్మకూరు 30. మోతుకూరు 31. జీజిరెడ్డి గూడెం 32. సూర్యాపేట 33. చేవేముల 34. మునగాల 35. చిలుకూరు 36. హుజూరు నగర్ 37. గరేదపల్లి 38. పెన్పాహాద్ 39. మిర్యాలగుడ 40. త్రిపురారాం 41. నిజామానూరు 42. అనుముల 43. గుతంపోడు 44. నాంపల్లి 45 చందూరు 46. ముంగోడు 47. చిట్యాల 48. రామన్నపేట 49. వెలిగొండ 50. భువనగిరి 51. నార్కెట్‌పల్లి 52. శాలిగేరారం 53. నక్రేకల్లు 54. కేతిపల్లి 55. వేములపల్లి 56. తిప్పర్తి 57. కంగల్ 58. నల్గొండ 59. కట్టంగూరు.

లాల్‌బహదూరు కాలువ వ్యవస్థ ద్వారా పంట నీటిని ఇతర జిల్లాలకు సరఫరా చేస్తూ జలవిద్యుదుత్పత్తిని కూడ చేస్తూన్నది. దిండి ప్రాజెక్టు నుంచి కూడా పంట నీరు లభిస్తున్నది. జొన్న, వరి, సజ్జ ప్రధానమైన ఆహార పంటలు, ఆముదాలు, వేరుసెనగ వాణిజ్యపు పంటలు,

**జిల్లా ముఖ్యాంశాలు**

విస్తీర్ణం : 14,240 చ.కి.మీ.

జనాభా : 28,32,000

అక్షరాస్యత : 38%

రెవెన్యూ డివిజనులు : 3

శాసనసభ నియోజక వర్గాలు : 12

లోక సభ నియోజకవర్గాలు : 2

జిల్లా కేంద్రం : నల్గొండ

సున్నపురాయి, పలకరాయి ఈ జిల్లా ఖనిజ సంపద. కొండల మధ్య పచ్చికలున్నచోట గొర్రెల పోషణ జరుగుతూంది. బియ్యపు మిల్లులు ఆముదాల నూనె మిల్లులు, వేరుసెనగ, నూనె, సిమెంటు మిల్లులు ఉన్నాయి.



పోచంపల్లి టై అండ్ డై - చీరలకు ప్రసిద్ధి. భూదాన ప్రారంభోత్సం ఈ జిల్లాలోనే వినోబా భావే ప్రారంభించారు (1951). ఇటీవల ఈ గ్రామంలో స్వామి రామానంద తీర్థ గ్రామీణ విశ్వ విద్యాలయం నెలకొంది (1995). నాగార్జునకొండమీద పురాతన వస్తు సంగ్రహాలయం ఉంది.



# ఆంధ్రప్రదేశ్ చరిత్ర : కొన్ని ప్రముఖ ఘట్టాలు

## క్రీ.పూ.

1000 ఆంధ్రను గూర్చి ఐతరేయ బ్రాహ్మణంలో మొదటి ప్రస్తావన.

500 ఆంధ్రుల రాక - స్థిర నివాసాలు.

323 మెగస్తనీస్ తెలుగుదేశ సందర్శన .

263 బౌద్ధం ఆంధ్రలో ప్రవేశం ✻ సాత వాహన రాజ్య స్థాపన - శ్రీముఖుడు సింహాసన మెక్కాడు. (శ్రీకాకుళం, ధాన్యకటకం రాజధానులు) ✻ సాతవాహన పాలన సామ్రాజ్యస్థాయి నందుకొంది. ✻ కణ్వులపై పులోమావి జయభేరి.

## క్రీ.శ.

62 శకుల్ని జయించి గౌతమి పుత్ర శాతకర్ణి ఆంధ్రసాతవాహనరాజ్యాన్నిపునః స్థాపన. గంగానది నుండి కన్యాకుమారి వరకు సామ్రాజ్యం విస్తరించింది. నహపానా నాణాలు ముద్రించాడు.

75 కృష్ణానదీ లోయలో (నాగార్జున కొండ) మహాయాన బౌద్ధంలోని మాధ్యమిక సంప్రదాయన్ని నాగార్జునాచార్య ప్రచారం చేశాడు.

78 శాలివాహనశకం ప్రారంభం.

163 సాతవాహనుల పతనం. కృష్ణానదీ తీరాన ఇక్ష్వాకుల రాజ్యస్థాపన.

250 ఇక్ష్వాకుల వైభవం. అమరావతీ, నాగార్జున కొండ స్తూపాల విస్తరణ.

200 మచిలీపట్నంలో బృహత్ఫలాయనులు, వేంగీలో శాలంకాయనులు.

350 స[illegible] దండయాత్ర. విష్ణు కుండినులు ఉత్తరాన, పల్లవులు దక్షిణాన ప్రబలమైన రాజ్యాలు.

398 ఫాహియాన్ చీనా యాత్రికుని సందర్శన.

400 విష్ణుకుండినులు వేంగీలోనూ.

600 పల్లవులు కంచిలోనూ హిందూ మతాన్ని పోషించారు. ఉండవల్లి, మొగల్రాజపురం (విజయవాడ) లలో శైవమతాన్ని పోషిస్తూ గుహాలయాలు శిల్పించారు ✻ ఆగ్నేయాసియా రాజ్యాలతో నౌకా వాణిజ్యం నెరపారు. ✻ బౌద్ధతర్క పండితుడు దిఙ్నాగ (480-569) వేంగీలో ఉండేవాడు.

631 తూర్పు చాళుక్య రాజ్యస్థాపన. పులకేశి II తన సోదరుడు కుబ్జ విష్ణువర్ధనుని వేంగీరాజుగా చేస్తాడు.

640 హుయాన్‌స్యాంగ్ తెలుగుదేశ సందర్శన.

671 చీనా యాత్రికుడు ఇత్సింగ్ సందర్శన

750 పూర్వ మీమాంస సంప్రదాయాన్ని ప్రవేశ పెట్టిన కుమారిలబట్టు దక్షిణాదిని బౌద్ధం క్షీణించడానికి కారకుడయ్యాడు ✻ వామాచార సంప్రదాయ ప్రవేశం. బౌద్ధ పంచారామాల్ని శైవ మతాచార్యులు చేజిక్కించుకుని శైవ క్షేత్రాలుగా మార్చారు.

848 ప్రఖ్యాత తూర్పు చాళుక్యరాజు గుణగ విజయాదిత్యుని కాలంలో తెలుగు భాషకు రాజ పోషణ లభించింది.

948 వేంగీలో పోరాటాలు.

985 చోళ సామ్రాజ్య స్థాపన - రాజరాజ-1
999 రాజరాజ చోళుని సహాయంతో తూర్పు చాళుక్య రాజ్య పునఃస్థాపన.
1000 కాకతీయ రాజ్యపాలన ప్రారంభం.
1022 రాజేంద్రుని కుమారుడు రాజరాజ నరేంద్రుని కుళోత్తుంగ చోళుడుగా చోళ సామ్రాజ్యధిపతి అయ్యాడు. ✻ నన్నయ్య మహాభారతాన్ని (ఆది, సభా, అరణ్య భాగాలు) తెలుగులో రాశాడు.
1104 పల్నాటి వీర యుద్ధం.
1135 వెలనాటి చోళులు (1135 - 1206) తెలుగుదేశాన్ని పరిపాలించారు.
1155 బసవేశ్వరుని వీరశైవ ప్రచారం.
1158 రుద్రదేవుడు కాకతీయ పాలన.
1198 కాకతీయరాజు గణపతి దేవుడు వరంగల్లు గద్దెనెక్కుతాడు. ✻ సాతవాహనుల తరువాత తెలుగు మాట్లాడే ప్రాంతమంతా ఒకే రాజ్య పాలనలోకి వస్తుంది ✻ విదేశీ వాణిజ్యాన్ని ప్రోత్సహించడానికి బాపట్ల సమీపాన మోటుపల్లి రేవులో అభయశాసనం కాకతీయరాజులు ప్రకటిస్తారు.
1200 'చాపకూడు' సహపంక్తి భోజనాలను పల్నాటి మంత్రి బ్రహ్మనాయుడు ప్రోత్సహించాడు.
1200 తిక్కన మహాభారతాన్ని అరణ్య పర్వం తప్ప 15 పర్వాలలో పూర్తి చేశాడు.
1228 కాకతిగణపతిదేవుని మరణం.
1258 కాకతీయ సామ్రాజ్యానికి రుద్రమదేవి రాణి ✻ దక్షిణాన చోళుల్ని, ఉత్తరాదిన యాదవుల్ని అదుపులో పెడుతుంది.
1261 ముత్తుకూరువద్ద పాండులతో పోరాడుతూ నెల్లూరు మనుమసిద్ధి వీరమరణం.
1271 ఇటలీ యాత్రికుడు మార్కోపోలో మోటుపల్లి సందర్శన.
1273 దేవగిరిపై అల్లాఉద్దీన్ ఖిల్జీ దండ యాత్ర.
1296 కాకతీయ సింహాసనంపై ప్రతాపరుద్రుడు.
1303 అల్లాఉద్దీన్ వరంగల్లుపై దాడి.
1307 దేవగిరి పతనం.
1309 రెండవసారి వరంగల్లుపై దాడి.
1323 వరంగల్లు కోట ఢిల్లీ సుల్తాన్ ఘియాసుద్దీన్ తుగ్లక్ కైవసం ✻ ఆఖరి కాకతీయరాజు ప్రతాపరుద్రుడు బందీఅయి దారిలో ఆత్మహత్యకు గురి అయ్యాడు.
1326 కొండవీడులో రెడ్డిరాజ్యం.
1326 కంప్లీ పతనం. హరిహర బుక్కరాయల్ని మహమ్మద్ బీన్ తుగ్లక్ చెరబడతాడు.
1336 విద్యారణ్యస్వామి ఆశీర్వాదబలంతో హరిహరబుక్క రాయలు హంపీవద్ద విజయనగర సామ్రాజ్య స్థాపన.
✻ వరంగల్లు సింహాసనంపై కాపయ నాయుడు.
1347 గుల్బర్గాలో బహ్మనీ సుల్తానేట్‌రాజ్యస్థాపన. ✻ మహాభారతంలో మిగిలిన అరణ్యాపర్వాన్ని ఎర్రన (1300 - 1370) పూర్తి చేశాడు.
1354 కాపయ-ప్రోలయ నాయకత్వంలో వరంగల్లు సింహాసనంపై హరిహర సోదరుడు బుక్క.
1358 కొండవీటి రెడ్ల కింద కోస్తా ప్రాంతంలో తెలుగు నాయకులు సామంతరాజులవుతారు.
1367. కాపయ మరణానంతరం అనపోత,రేచర్ల ప్రముఖులు తెలంగాణాలో పాలకులవుతారు.
1383 కుమారరెడ్డి కాటయ వేమారెడ్డి పాలన.
1410 పెదకోమటి వేమారెడ్డి దర్బారులో శ్రీనాథుడు ఆస్థానకవి.

1406 విజయనగర గద్దెపై సాళువ దేవరాయ.
1425 సర్వజ్ఞ సింహ పాలనా కాలంలో పోతన మహాకవి
1443 కృష్ణానదికి ఉత్తరాన బహ్మనీరాజ్య స్థాపన.
1490 సాళువ నరసింహ రాయలుతో సాళువ రాజ్యం అంతమైంది.
1505 వీరనరసింహారాయలుతో తుళువ రాజవంశపాలన ప్రారంభం.
1509 తుళువరాజు శ్రీకృష్ణదేవరాయలు విజయనగర చక్రవర్తిగా సామ్రాజ్యాన్ని బాగా విస్తరించాడు * సాహిత్య పోషణ, (అష్టదిగ్గజాలు) కళలకు పోషణ లభించింది.
1518 తెలంగాణాలో గోల్కొండ రాజధానిగా కుతుబ్‌షాహీ వంశపాలన ప్రారంభం.
1530 విజయనగర రాజులు అచ్యుత రాయ, రామ రాయ పాలన.
1543 సదాశివ పాలన.
1550-80 మల్కాభిరాముడుగా పేరొందిన ఇబ్రహీం కుతుబ్‌షాహీ పాలన. గోల్కొండ సామ్రాజ్యం స్థిరపడింది. సరస్సులు, తటాకాలు నిర్మాణం ప్రజోపయోగ పనులు జరిగాయి.
1565 రామరాయ - ముస్లిములకు మధ్య రక్కసి తంగడి వద్ద పోరాటం. రామరాయ ఓటమి.
1570 అరవీటి రాజవంశపాలన. తిరుమల రాయలుతో ప్రారంభం.
1589 భాగ్యనగరం (హైదరాబాదు) స్థాపన.
1591 మహమ్మద్ కులీచే చార్మినార్ నిర్మాణం.
1592 చంద్రగిరి విజయనగర రాజధాని అయింది.
1611 తూర్పు కోస్తా తీరాన ఇంగ్లీషు ఫ్యాక్టరీ స్థాపన.
1623-59 మధురలో తిరుమల నాయకరాజు * తెలుగు సాహిత్య పోషణ * తంజావూరులో రఘునాథనాయకరాజు.
1639 చంద్రగిరిరాజు నుండి దాన పట్టా పొంది ఇంగ్లీషువారు మద్రాసులో ఫోర్ట్ సెయింట్ జార్జి కోటను నిర్మించారు.
1651 ముస్లిం సైన్యాలు విజయనగర వారసుల్ని ఓడిస్తాయి.
1656 గోల్కొండపై ఔరంగ జేబు దాడి.
1678 శ్రీరంగరాయ III మరణంతో విజయ నగర సామ్రాజ్యం పతనమైంది.
1687 మొగలాయి సైన్యాలకు లొంగి గోల్కొండ పతనం ప్రారంభం.
1701 క్రైస్తవ మార్పిడి ప్రారంభం.
1724 అసఫ్‌జాహీ (నిజాం) వంశపాలన ప్రారంభం.
1746 తెలుగులో ముద్రణ ప్రారంభం - నూరు జ్ఞాన వచనాలు *(బైబిలు)*
1747 బొబ్బిలి పతనం.
1764 వాగ్గేయకారుడు త్యాగయ్య జననం.
1768 ఈస్ట్ ఇండియా కంపెనీకి ఉత్తర సర్కారులను నిజాం ఇచ్చాడు.
1800 నిజాము రాయలసీమ జిల్లాలను (దత్త మండలాలు) ఈస్ట్ ఇండియా కంపెనీకి ఇచ్చాడు.
1802 శాశ్వత పరిష్కారం (పర్మినెంట్ సెటిల్‌మెంటు).
1806 తెలుగు ముద్రణలో టైపుల అభివృద్ధి.
1816 వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు పిండారీ దాడులను తరిమి కొట్టాడు.
1820 తామస్‌మన్రో నాయకత్వంలో పోళిగార్ల ఆగడాల అణచివేత.
1829 తూర్పు కోస్తాలో పెనుతుఫాను-బందరు ఉప్పెన

.1839 వృత్తాంతిని మొట్ట మొదటి తెలుగు వార్తాపత్రిక.

1843 ప్రప్రథమ విజ్ఞాన పత్రిక సేద్యచంద్రిక హైదరాబాదు.

1848 సంఘ సంస్కర్త సాహిత్యవేత్త కందుకూరి వీరేశలింగం జననం.

1852 గోదావరిపై ధవళేశ్వరం (రాజ మండ్రి) వద్ద ఆర్థర్ కాటన్‌ఆనకట్ట నిర్మించాడు. ✻ పశ్చిమ గోదావరి (నాటి కృష్ణా) జిల్లా నర్సాపురం వద్ద వర్నాక్యులర్ పాఠశాలను జి.ఎన్.టేలర్ ప్రారంభించాడు.

1855 విజయవాడ వద్ద కృష్ణా నదిపై ఆనకట్ట. ✻ నోబెల్ కాలేజీ స్థాపన.

1886 విశాఖపట్టణంలో సరస్వతీ నిలయం మొదటి గ్రంథాలయం స్థాపన.

1893 తెలుగుదేశంలో మొదటి రైలుమార్గ నిర్మాణం.

1909 గాడిచర్ల హరిసర్వోత్తమరావుపై రాజద్రోహ అభియోగం.

1912 ప్రప్రథమ దినవార్తాపత్రిక 'ఆంధ్రపత్రిక' ✻ తెలుగు వారికి ప్రత్యేక రాష్ట్రం కావాలని నిడదవోలులో జరిగిన కృష్ణాజిల్లా సభలో మొదటి సారిగా ప్రస్తావన.

1913 ఆంధ్ర మహాసభ స్థాపన. ✻ ప్రత్యేక రాష్ట్ర తీర్మానం.

1918 హైదరాబాదులో ఉస్మానియా యూనివర్శటీ స్థాపన.

1920 దేశభక్తుడు కన్నెగంటి హనుమంతు వీరమరణం.

1922 మన్యంలో అల్లూరి సీతారామరాజు 'పితూరీ'

1926 వాల్తేరులో ఆంధ్ర యూనివర్శిటీ స్థాపన.

1931 తెలుగులో మొదటి శబ్ద చిత్రం (టాకీ 'భక్త ప్రహ్లాద').

1937 'శ్రీబాగ్' ఒడంబడిక. ✻ దుర్గాబాయిచే ఆంధ్ర మహిళా సభ (మద్రాసు) స్థాపన.

1946 ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి టంగుటూరు ప్రకాశం ప్రీమియర్.

1947 భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. ✻ విజ్ఞాన సర్వస్వ నిర్మాణానికి తెలుగు భాషా సమితి స్థాపన. (మద్రాసు)

1948 హైదరాబాదులో సంస్థానంలో 'పోలీసు చర్య' నిజాం సంస్థానం భారతయూనియన్‌లో విలీనం (సెప్టె).

1949 తెలంగాణా రైతు పోరాటం.

1952 బూర్గుల రామకృష్ణారావు మంత్రి వర్గం.

1952 డిసెంబరు 15 ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుకై పొట్టి శ్రీరాములు 58 రోజులు ప్రాయోపవేశం చేసి మద్రాసులో ఆత్మార్పణం చేసి అమరుడయ్యాడు.

1953 అక్టో. 1 కర్నూలు రాజధానిగాను గుంటూరులో హైకోర్టుతోను ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. టంగుటూరి ప్రకాశం మొదటి ముఖ్యమంత్రి అయ్యారు (1953 - 55).

1954 'విజ్ఞాన సర్వస్వం' మొదటి సంపుటాన్ని (తెలుగు భాషా సమితి) భారతరాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ విడుదల చేశారు.

1955 లో జరిగిన మధ్యంతర ఎన్నికల తర్వాత బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు.

1956 ఆంధ్రప్రదేశ్ అవతరణ నవం. 1 ✻ హైదరాబాదు రాజధానిగా నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రి.

1960 లో దామోదరం సంజీవయ్య ముఖ్యమంత్రి అయ్యారు.

1962 నీలం సంజీవ రెడ్డి మరల ముఖ్య మంత్రి అయ్యారు.

1964లో కాసుబ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు. * ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం స్థాపన - దీనికి తర్వాత ఎన్.జి. రంగా పేరు పెట్టారు (1996).

1967 నాగార్జున సాగర్ నిర్మాణం పూర్తి.

1969 ప్రత్యేక తెలంగాణాకై ఆందోళన.

1971 పి.వి. నరసింహారావు ముఖ్యమంత్రి అయ్యారు.

1972 ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికి ఆందోళన

1973 జలగం వెంగళ్రావు ముఖ్యమంత్రి అయ్యారు.

1974 హైదారాబాదు కేంద్ర యూనివర్శిటీ స్థాపన.

1975 ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణ.

1978 మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు.

1983 శాసనసభ సార్వత్రిక ఎన్నికలలో తెలుగు దేశం విజయం * పార్టీ నాయకుడు నందమూరి తారక రామారావు (ఎన్.టి.ఆర్) ముఖ్య మంత్రి.

1984 పద్మావతీ మహిళా యూనివర్శిటీ స్థాపన.

1985 తెలుగు యూనివర్శిటీ స్థాపన.దీని పేరు నవంబరు 1, 1996నాడు పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్సిటిగా మార్పు చేశారు.

1986 హైద్రాబాదులో టాంక్‌బండుపై తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త కళాప్రాంగణం ప్రారంభోత్సవం నవం. 1.

1989 శాసనసభకు సార్వత్రిక ఎన్నికలు కాంగ్రెస్ (ఐ) విజయం * మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి.

1994 శాసన సభ సార్వత్రిక ఎన్నికలు తెలుగుదేశం విజయం. ఎన్.టి.ఆర్ ముఖ్యమంత్రి.

1995 సంపూర్ణ మద్యనిషేధం అమలు.

1995 సెప్టె. 1 నారా చంద్రబాబు నాయుడు రాష్ట్ర ముఖ్యమంత్రి.

1996 జన. 18 ఎన్.టి. రామారావు మృతి. డిసె. మర్రి చెన్నారెడ్డి మృతి.

## కొందరు తెలుగు ప్రముఖుల జయంతి/వర్ధంతి వివరాలు

| పేరు | జయంతి | వర్ధంతి |
|---|---|---|
| విప్లవనాయకుడు అల్లూరి సీతారామరాజు | 4-7-1897 | 7-5-1924 |
| చిత్రకారుడు దామెర్ల రామారావు | 8-3-1897 | 20-5-1957 |
| జాతీయనాయకుడు టంగుటూరి ప్రకాశం పంతులు | 23-8-1872 | 20-5-1957 |
| సంఘసంస్కర్త కందుకూరి వీరేశలింగం పంతులు | 16-4-1848 | 27-5-1919 |
| మహాకవి గురజాడ వేంకట అప్పారావు | 21-9-1861 | 30-11-1915 |
| మహాకవి శ్రీశ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు) | 2-1-1910 | 15-6-1983 |
| సంగీతకళానిధి ద్వారం వేంకటస్వామి నాయుడు | 3-11-1893 | 25-11-1964 |
| రంగస్థలనటుడు బళ్ళారి రాఘవ | 2-8-1880 | 17-4-1946 |
| జ్ఞానపీఠ పురస్కార గ్రహీత విశ్వనాథ సత్యనారాయణ | 6-10-1895 | 18-10-1976 |
| భారత రాష్ట్రపతి సర్వేల్లి రాధాకృష్ణన్ | 5-9-1888 | 17-4-1975 |
| సంఘ సేవిక దుర్గాబాయి దేశ్‌ముఖ్ | 15-7-1909 | 9-5-1981 |
| అమరజీవి పొట్టి శ్రీరాములు | 16-3-1901 | 15-2-1952 |

# ఆంధ్రప్రదేశ్ నామ నిఘంటువు:

ప్రముఖుల సంగ్రహ పరిచయం

**అక్కన్న - మాదన్న:** 17వ శతా. కుతుబ్‌షాహీ రాజవంశంలో అబుల్ హసన్ కుతుబ్‌ట్‌షాహీ తానీషా కొలువులో సేనాపతి, ప్రధాని పదవులు నిర్వహించిన ఉద్దండులు,

**అనంత కృష్ణ శర్మ, రాళ్ల పల్లి 1893 - 1979:** సంగీత సాహిత్యము లందు పరిశోధనలు చేసిన పండితుడు, విమర్శకుడు. తాళ్ళపాక అన్నమయ కీర్తనలను వెలికి తీసినవాడు.

**అన్నమాచార్య 1424 - 1503:** పదకవిత పితామహుడు వాగ్గేయకారుడు. కడప జిల్లా తాళ్లపాకవాసి.

**అప్పకవి, కాకునూను :** 17వ శతా. 'అప్పకవీయ' మనే ఆంధ్ర లక్షణ గ్రంథకర్త.

**అప్పయ దీక్షితులు:** 1424 - 1503. 'ఆంధ్రత్వ మాంధ్ర భాషాచనాల్పస్య తపహః ఫలమ్' అన్న ఆంధ్రాభిమాని.

**ఆనంద గజపతి:** 1850 -97 విజయనగర సంస్థానాధీశుడు. కవి పండిత పోషకుడు. సంగీత, సాహిత్యాభివృద్ధికి కృషిచేశాడు.

**ఆపస్తంబుడు:** క్రీ.పూ. 800 - 600 (మధ్య కాలం). యజుర్వేదపు మానవ ప్రవర్తనా నియామాళిని సిద్ధ పరచిన మొట్ట మొదటి సూత్ర కర్త. మహాసంఘ సంస్కర్త, గృహ ధర్మ సూత్రాల్ని సంస్కృతంలో రచించాడు.

**ఆరుద్ర :** జననం 1925 అసలు పేరు భాగవతుల శంకరశాస్త్రి. రచనలు: సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర .(13 సం) త్వమేహం, సినీవాలీ, కూనాలమ్మ పదాలు, సినీ గేయ రచయిత.

**ఉన్నవ లక్ష్మీనారాయణ:** 1873 -1958 స్వాతంత్ర్య సమర యోధుడు. సుప్రసిద్ధ తెలుగు సాంఘిక నవల 'మాలపల్లి' రచయిత. సంఘ సంస్కర్త.

**ఎన్.టి. రామారావు:** (1923-1996) పూర్తి పేరు నందమూరి తారకరామారావు. రాష్ట్ర ముఖ్యమంత్రి, సుప్రసిద్ధ సినీ నటులు.

**ఎఱ్రాప్రగడ:** 14వ శతాబ్ది. 'మహాభారతం' చివరి భాగం (అరణ పర్వం) గ్రంథాన్ని తెనిగించిన కవిత్రయంలో ఒకరు. 'ప్రబంధ పరమేశ్వరు'డని బిరుదు కలదు.

**కందుకూరి వీరేశలింగం :** 1848 - 1919. సంఘ సంస్కర్త. ఆధునిక సాహిత్య యుగకర్త. స్త్రీ. పునర్వివాహ ఉద్యమకర్త. ఈయన 'రాజశేఖర చరిత్ర' తెలుగులో మొట్టమొదటి నవల. స్వీయ చరిత్ర, ఆంధ్ర కవుల చరిత్ర ఇతర రచనలు. వివేకవర్ధిని , సతీహితబోధ ఈయన ప్రారంభించిన తెలుగు పత్రికలు.

**కనకమ్మ, పొణకా :** 1896 - 1963. సుప్రసిద్ధ సంఘసేవిక. నెల్లూరులో కస్తూరిబాయి మహిళా విద్యా కేంద్రాన్ని స్థాపించారు.

**కన్నాంబ, పసుపులేటి :** 1912 - 64. సుప్రసిద్ధ రంగ స్థల, సినిమా నటి. హరిశ్చంద్ర, 'ద్రౌపదీ వస్త్రాపహరణం' మున్నగు చలనచిత్రాల్లో కథానాయిక.

**కాటన్, సర్ ఆర్థర్** 1803-1899. ధవళేశ్వరం వద్ద గోదావరి నది మీద ఆనకట్టను నిర్మించి డెల్టాను సస్యశామలం చేసిన బ్రిటిషు ఇంజనీరు (ఈస్టిండియా కంపెనీ ఉద్యోగి). కృష్ణా, కావేరీ నదుల మీద కూడ ఆనకట్టలు కట్టాడు.

**కామేశం, శొంఠి :** 1890 - 1954. 'ఆస్యూ దారు సంరక్షక' విధానాన్ని రూపొందించిన సుప్రసిద్ధ ఇంజనీరు.

**కామేశ్వరరావు, భమిడిపాటి** : 1897 - 1958. 'హాస్య బ్రహ్మ'గా ప్రసిద్ధుడయిన హాస్య నాటక కర్త 'బాగు బాగు' 'చటతపలు, పెళ్లి ట్రెయినింగ్' ఈయన. రచనలు.

**కేరీ, విలియమ్** : 1761 - 18334. తెలుగు వ్యాకర్త. నిఘంటు నిర్మాత.

**కాల్డ్‌వెల్, రాబర్ట్** : 1814 - 91. ద్రావిడ భాషా వేత్త. ఏ కంపేరటివ్ గ్రామర్ ఆఫ్ ద్రవిడియన్ లాంగ్వేజస్ ఈయన రచన.

**కాళేశ్వరరావు, అయ్యదేవర** : 1882 - 1962. జాతీయ వాది. స్వాతంత్ర్య సమర యోధుడు. సంఘ సంస్కర్త. ఆంధ్ర శాసన సభాపతి (స్పీకర్) ఈయన స్వీయ చరిత్ర: నా జీవితం - నవ్యాంధ్ర

**కుటుంబరావు, కొడవటిగంటి** : 1909 - 1980. ప్రముఖ సాహిత్య వేత్త. కథా రచయిత, పిల్లల మాస పత్రిక 'చందమామ' సంపాదకుడు (1953-80).

**కులీ కుతుబ్ షా** : గోలకొండ రాజ్య సంస్థాపకుడు (1550-1580). భాగ్యనగర్(హైదరాబాద్) నిర్మాత.పూర్తి పేరు మాలిక్ ఇబ్రహీం కులీకుతుబ్‌షా

**కుమారిల భట్టు** 8వ శతా: మేధావి. సుప్రసిద్ధ మీమాంస పండితుడు. 'శ్లోకవార్తిక' ఈయన రచన. బౌద్ధం క్షీణించడానికి కారకుడు అని ప్రతీతి.

**కూల్డ్రే, ఆస్వాల్డ్** : 1882 - 1958. ఆంధ్రుల చిత్ర కళా పునరుజ్జీవనానికి తోడ్పడిన బ్రిటిషువాడు. అడవి బాపిరాజు, దామెర్ల రామారావు వంటి వారికి స్ఫూర్తినిచ్చి ప్రోత్సహించినవాడు.

**కృష్ణదేవరాయలు**: 1489 - 1530 విజయగరం సామ్రాజ్య నేత. తుళువ వంశీయుడు. అష్టదిగ్గజాలను పోషించడమేకాక తాను స్వయంగా 'ఆముక్త మాల్యద' అను కావ్యాన్ని రచించి రాజకవిగా పేరొందాడు.

**కృష్ణమాచార్యులు, కాశీ**: 1872 - 1967. తర్కవేదాంత పండితులు, ఆస్థాన కవి (1962).

**కృష్ణమూర్తి, మొక్కపాటి** : 1910 - 1962. చిత్ర కారుడు, శిల్పి, రచయిత 'వరూధిని', 'పురిటాలు' ఈయన సుప్రసిద్ధ చిత్రాలు.

**కృష్ణమూర్తి శాస్త్రి, శ్రీపాద**: 1866 - 1961. ఆధునిక తెలుగు కవి. ఆస్థానకవి. కల భాషిణీ, భోజరాజ విజయం, గౌతమీ మహత్త్వం, శ్రీ కృష్ణభారతం మున్నగు 200 గ్రంథాలు రచించారు.

**కృష్ణశాస్త్రి, దేవులపల్లి వెంకట** : 1897-1980. తెలుగు నాట భావకవితోద్యమానికి ఆద్యుడు. కృష్ణపక్షం, ఊర్వశీ ప్రవాసం ఆయన ప్రధాన రచనలు. సినీ గేయ రచయితగా సుప్రసిద్ధుడు.

**కృష్ణస్వామిఅయ్యర్, అల్లాడి** : 1883 - 1953. సుప్రసిద్ధ న్యాయశాస్త్ర వేత్త. న్యాయవాది. ముసాయిదా భారత రాజ్యాంగాన్ని సిద్ధ పరచిన వారిలో ప్రముఖుడు.

**కేశవరావు, జమలాపురం** : 1908 - 1914 హైదరాబాదు (నిజాం) రాష్ట్రంలో ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు.

**కేసరి, కె.ఎన్.** : 1875 - 1953. దాన శీలి. కోట నరసింహం అసలు పేరు. ప్రముఖ ఔషధశాల 'కేసరి కుటీరం' స్థాపకుడు. స్త్రీ జనోద్ధరణకై. గృహలక్ష్మి పత్రికను స్థాపించాడు.

**క్షేత్రయ** : 1600 - 1660. శృంగార పదకర్త. వాగ్గేయకారుడు. 'మువ్వగోపాల' మకుటంతో ఈయన పదాలు ప్రసిద్ధి చెందాయి.

**గణపతి దేవుడు** : ఓరుగల్లు రాజధానిలో కాకతీయ చక్రవర్తి (1199 - 1262) రుద్రమదేవి తండ్రి. రామప్పగుడి (పాలంపేట) నిర్మాత. కవి పండిత పోషకుడు.

**గరిమెళ్ల సత్యనారాయణ**: 1893 - 1952. స్వాతంత్ర్య

సమరయోధుడు. దేశభక్తి గేయ రచయిత. 'బాబు మా కోర్దీ తెల్లదొరతనం' వంటి దేశభక్తి గీతాలు రాసి తెలుగు వారిలో జాతీయ చైతన్యం గలిగించిన కవి.

**గురజాడ వెంకట అప్పారావు :** 1861-1915 'దేశమంటే మట్టి కాదోయ్' అనే దేశభక్తి గీతాన్ని అందించిన నవ్యాంధ్ర కవితా వైతాళికుడు. ఈయన 'కన్యాశుల్కం' 'పూర్ణమ్మ కథ' సుప్రసిద్ధ రచనలు.

**గుర్రం జాషువా:** 1895 - 1971. సాంఘిక అసమానతలపై ఈయన రాసిన కవితలు ప్రసిద్ధి చెందాయి. 'గబ్బిలం' 'ఫిరదౌసి', ముంతాజ్ మహల్, క్రీస్తు చరిత్ర మున్నగునవి ప్రసిద్ధ రచనలు.

**గోపాలకృష్ణయ్య దుగ్గిరాల** 1889-1920 సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమరయోధుడు 'ఆంధ్రరత్న' బిరుదాంకితుడు. రామదండు ఈయన సేన.

**గోపాలా చార్యులు, డి.వి.:** 1872 - 1920. ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యుడు 'వైద్య రత్న' బిరూంకితుడు.

**గోపాలా చార్యులు, ధర్మవరం :** 1840 - 1912. ప్రముఖ నాటక రచ్నయిత.

**గోపీచంద్, త్రిపురనేని :** 1910 - 1962. ఆధునిక తెలుగు రచయిత. సంఘ సంస్కర్త.

**గోరా (గోపిరాజు రామచంద్ర)** 1902-1975. హేతువాది సంఘ సంస్కర్త నాస్తికవాది. స్వాతంత్ర్య సమరయోదుడు.

**గౌతమీ పుత్రశాతకర్ణి:** క్రీ.శ. ఒకటవ శతా. ఆంధ్ర సాతవాహనవంశరాజులలో 28వ చక్రవర్తి (క్రీ.శ. 62-86).

**ఘంటసాల వెంకటేశ్వరావు :** మరణం 1978. సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. సినీ గాయకుడు.

**చలం :** 1894 - 1979. సాహిత్యస్రష్ట. పూర్తిపేరు గుడిపాటి వెంకటాచలం. స్త్రీకి స్వేచ్ఛ ఈయన రచనలలో మూలవస్తువు. 'చిత్రాంగి, సావిత్రి, శశి, పాపం, మైదానం' ఈయన ప్రధాన రచనలు

**చిన్నయసూరి :** పరవస్తు 1809 - 1862. బాల వ్యాకరణ కర్త. సుప్రసిద్ధ తెలుగు వ్యాకర్త. నీతి చంద్రిక (పంచతంత్ర కథలు) కర్త.

**చిలకమర్తి లక్ష్మీనరసింహం :** 1861 - 1945. సుప్రసిద్ధ తెలుగు నాటక రచయిత. జాతీయ వాది. *గయోపాఖ్యానం, పారిజాతాపహరణ, సీతాకళ్యాణం* మొదలగు నాటకాలు రచించారు. 'భరత ఖండము చక్కని పాడిఆవు' వంటి దేశభక్తి గేయాలు రచించారు.

**చెంచయ్య, దరిశి:** 1890-1964 విప్లవ వాది. స్వాతంత్ర్య సమర యోధుడు, స్త్రీ జనోద్ధారకుడు, సంఘ సంస్కర్త. గద్దర్ రాజకీయ పార్టీ కార్య కర్త. 'నేనూ - నాదేశమూ' ఈయన రచన.

**జగన్నాథ పండిత రాయలు:** 17వ శతా. కోనసీమ సంస్కృత విద్వాంసుడు. మొగలాయి జహంగీరు - షాజహాన్ కొలువుల్లో పండితుడు. దారాషుకోకు గురువు. *రసగంగాధరం, భామినీ విలాసం, గంగాలహరి* వంటి ఉద్గ్రంథాలు ఈయన సంస్కృత రచనలు.

**జాయప సేనాని. :** 13వ శతా. గణపతిదేవుని కొలువులో సేనాని. గొప్ప కళావేత్త. *గీతరత్నావళి, వాద్య రత్నావళి, నృత్య రత్నావళి* అనే ప్రసిద్ధ సంస్కృత గ్రంథాల రచయిత.

**జి.డి. నాయుడు:** 1893 - 1974. పూర్తి పేరు గోపాల్ దొరైస్వామి నాయుడు. ప్రముఖ పారిశ్రామిక వేత్త (కోయంబత్తూరు).

**జిడ్డు కృష్ణమూర్తి :** 1895 - 1986. తత్త్వవేత్త రచయిత. సుప్రసిద్ధ 'ది ఫేట్ ఆఫ్ ది మాస్టర్' ఈయన రచన. సత్యసందర్శన చేసిన ఆధ్యాత్మికుడు. ఈయన రచనల సంఖ్య 712.

**జ్ఞానానంద స్వామి :** 1896-1969. తత్త్వ వేత్త. సుప్రసిద్ధ భౌతిక శాస్త్ర వేత్త. భూపతిరాజు లక్ష్మీ

తేజోమూర్తుల చిత్ర చయనిక యుగయుగాలుగా తెలుగు కీర్తి పతాకాన్ని ఎగురవేసి జాతిని చైతన్యవంతం చేసిన కొందరు ప్రముఖులు



శాలివాహనుడు
(1వ శతాబ్ది ఉత్తరార్థము



నన్నయ భట్టు
(11వ శతాబ్ది)



పలనాటి బ్రహ్మనాయుడు
(12వ శతాబ్ది ఉత్తరార్థము)



తిక్కన
(13వ శతాబ్ది)



రాణి రుద్రమాంబ
(పరిపాలనా కాలము
క్రీ.శ. 1262 - 1289)



ఎర్రాప్రగడ
(14వ శతాబ్ది)



అన్నమాచార్యుడు
(1424-1503)



పోతన
(15వ శతాబ్ది)



ద్ధేంద్రయోగి
(15వ శతాబ్ది)



శ్రీ కృష్ణదేవరాయలు
(1480 - 1530)



మొల్ల
(16వ శతాబ్ది)



వేమన
(17వ శతాబ్ది)



తానీషా
(పరిపాలనా కాలము
1672 - 1687)



పోతులూరి
వీర బ్రహ్మేంద్ర స్వామి
(17వ శతాబ్ది)



క్షేత్రయ్య
(17వ శతాబ్ది)



రామదాసు
(17వ శతాబ్ది)



త్యాగయ్య
(1767-1847)



సర్ ఆర్థర్ కాటన్
(1803 - 1899)



కందుకూరి
వీరేశలింగం
(1848-1919)



గురజాడ
అప్పారావు
(1861-1939)



రఘుపతి
వెంకటరత్నం నాయుడు
(1862-1939)



అల్లూరి
సీతారామరాజు
(1897-1923)



మహబూబ్
అలీఖాన్ పాషా
(1866-1911)



టంగుటూరి
ప్రకాశం
(1872-1957)



పింగళి
వెంకయ్య
(1876-1963)



ముట్నూరి
కృష్ణారావు
(1861-1939)



బళ్ళారి రాఘవ
(1880-1946)


సర్.సి.ఆర్. రెడ్డి
(1880-1951)


త్రిపురనేని
రామస్వామి చౌదరి
(1886 - 1943)


సర్వేపల్లి రాధాకృష్ణన్
(1888 - 1975)


గుర్రం జాషువా
(1895 - 1971)


స్వామి రామానంద తీర్థ
(1963 - 1972)


యల్లాప్రగడ సుబ్బారావు
(1895 - 1948)


సురవరం ప్రతాపరెడ్డి
(1896 - 1953)


పొట్టి శ్రీరాములు
(1903 - 1952)


ఖ్దూం మొహియుద్దీన్
(1908 - 1963)


దుర్గాబాయి దేశ్‌ముఖ్
(1909 - 1981)


శ్రీశ్రీ
(1910 - 1983)


ఎన్.టి. రామారావు
(1925 - 1996)

నరసింహ రాజు అసలు పేరు. గొరగనమూడి (ప॥గో॥జిల్లా)వాసి.ఆంధ్ర యూనివర్శిటీ ప్రొఫెసరు.

**తిక్కన :** 13వ శతా. 'మహాభారతాన్ని' తెనిగించిన కవిత్రయంలో ఒకరు. విరాట పర్వం మొదలు 15 పర్వాలను ఆంధ్రీకరించారు. నిర్వచనోత్తర రామాయణం మరొక కావ్యం.

**తిమ్మరసు, సాళ్వ :** 15-16 శతా. మధ్య కృష్ణదేవరాయలకు ప్రధాన మంత్రి. యుక్తిపరుడు. 'అప్పాజీ' అని మహారాజు పిలుస్తూ ఉండేవాడని ప్రసిద్ధి.

**తిరుపతి వేంకట కవులు:** వీరు జంటకవులు. దివాకర్ల తిరుపతి శాస్త్రి 1872-1929. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి 1810-1950 'అష్టావధానం'లో సుప్రసిద్ధులైరి. నాటక కర్తలు - మృచ్ఛకటికం, ముద్రారాక్షసం - సంస్కృత నాటకాల్ని తెనిగించారు. *శ్రవణానందం, నానాదేశ సందర్శన, పాండవోద్యోగ విజయాలు* వీరి ప్రసిద్ధ రచనలు.

**తెనాలి రామకృష్ణుడు :** 16వ శతా. అష్టదిగ్గజ కవులలో వికటకవి. ఈయన రచన *'తెనాలి రామకథలు'* హాస్యపూరితాలు. *'పాండురంగమహాత్యం'* ఈయన రచించిన ప్రబంధ కావ్యం - నిగమ శర్మ పాత్ర గొప్పది.

**త్యాగయ్య :** 1767 - 1847. సుప్రసిద్ధ కర్ణాటక వాగ్గేయ కారుడు. ఉంఛవృత్తి చేస్తూ భక్తి కీర్తనలల్లి పాడుతూ ఉండేవాడు

**దాశరథి :** 1927 - 1987. మహా కవి. పూర్తి పేరు దాశరథి కృష్ణమాచార్యులు. స్వాతంత్ర్య యోధుడు. *'తిమిరంలో సమరం, అగ్నిధార, గాలిబ్ గీతాలు, రుద్రవీణ'* మున్నగునవి ఆయన కవితలు. అధికార భాషా సంఘం అధ్యక్షులు.

**దిఙ్నాగాచార్యుడు :** క్రీ.శ. 480 - 569. గొప్ప బౌద్ధ తర్క పండితుడు. వేంగీనగరం. ప్రమాణసముచ్చయం, న్యాయ ప్రవేశం, 'హేతు చక్ర ముకరం' ఈయన ప్రసిద్ధ రచనలు.

**దుర్గాబాయి దేశ్‌ముఖ్ :** 1909 - 81 ఆంధ్ర మహిళాసభ వ్యవస్థాపకురాలు (1937). భారత స్వాతంత్ర్య సమరయోధురాలు. స్త్రీ జనాభ్యుదయానికై తన యావత్తు జీవితాన్ని అంకితం చేసి 'సేవామాత'గా కొనియాడబడింది.

**ధర్మారావు, తాపీ :** 1887-1973. రచయిత. పత్రికా సంపాదకుడు. వ్యవహార భాషావాది. 'తాతాజీ' ఆయనకు వ్యవహారనామం. 'దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు' 'పెళ్లి - దాని పుట్టుపూర్వోత్తరాలు' 'విజయవిలాసం' పై హృదయోల్లాస విమర్శ వ్రాశాడు.

**ధూర్జటి :** 16వ శతా. అష్టదిగ్గజ కవి. *శ్రీ కాళహస్తీశ్వర* మహాత్మ్యము ఈయన ప్రసిద్ధ రచన.

**నటరాజ రామకృష్ణ :** జననం. సుప్రసిద్ధ నాట్యాచార్యుడు, మరుగునపడిన పేరిణీశివతాండవం, ఆంధ్రనాట్యం పునరుద్ధరించి పోషించినవాడు.

**నన్నయ :** 11వ శతాబ్ది. మహాభారతాన్ని తెనిగించిన కవిత్రయంలో మొదటివాడు. ఆదికవి. ఆంధ్ర వాగనుశాసనుడు బిరుదాంకితుడు. రాజరాజ నరేంద్రుని కొలువులో కులసచివుడు. ఆది, సభా పర్వాలు, అరణ్యపర్వంలో భాగం తెనిగించాడు. *ఆంధ్ర శబ్ద చింతామణి* ఈయన మరొక రచన.

**నన్నె చోడుడు :** 'కుమార సంభవం' అనే మహాప్రబంధకావ్యాన్ని తెలుగులో రచించిన శివ కవి. కవిరాజ శిఖామణి బిరుదాంకితుడు, నన్నయ తిక్కన కవీశ్వరుల నడుమ కాలంలో జీవించాడని ప్రసిద్ధి. ముందు కాలం వాడనీ అంటారు.

**నరసింహ దాసు, తూము :** 1790 - 1833. సంప్రదాయ కీర్తనలు రచించిన వాగ్గేయ కారుడు.

**నాగయ్య, చిత్తూరు :** 1904-1973. ఉన్నత శ్రేణి

ా నటుడు. 'వందేమాతరం, సుమంగళి, స్వర్గసీమ, ర, వేమన' రామదాసు చలన చిత్రాల్లో నాయక ధారి.

ర్జునాచార్య : క్రీ.శ. - 2వ శతా. బౌద్ధులలో మాధ్యమిక యాన సంప్రదాయ ప్రవక్తగా ప్రసిద్ధి. సాతవాహన క్రి గౌతమీ పుత్ర శాతకర్ణికి సన్నిహితుడు ఈయన క్షేత్రం. కృష్ణా నదీలోయలోని శ్రీపర్వతంమీద నున్న ర్జున కొండ 'సుహృల్లేఖ' ఈయన ప్రసిద్ధ రచన.

శ్వరరావు పంతులు, కాశీనాథుని: 1867 - 1938. సిద్ధ దేశభక్తుడు. 'దేశోద్ధారక' బిరుదాంకితుడు. ధపత్రిక' దిన పత్రికను స్థాపించాడు. (1912). గు పత్రికారంగంలో వైతాళికుడు. అధిక ప్రాచుర్యం బాధానివారిణి 'అమృతాంజనం' వ్యాపారి. 'భారతి' పత్రికను ప్రత్యేకంగా స్థాపించాడు (1923).

సుదమ్మ, యలివర్తి : 1922 - 1985. జగత్ప్రసిద్ధి సైన విజ్ఞాని. చర్మ పరిశోధనలో దిట్ట.

యణదాసు, ఆదిభట్ల : 1834 - 1945 రంగస్థల కారుడు, హరికథా పితామహుడు. యక్షగానాలు, కథ ప్రబంధాలు రచించాడు.

యణరెడ్డి, సింగిరెడ్డి : జననం 1931. మహావక్త. కవి 'విశ్వంభర' అను కావ్యానికి జ్ఞానపీఠ్ పురస్కారం ంచింది (1989) విశ్వనాథుడు నవ్వనిపువ్వు, కర్పూర ంతరాయలు, నాగార్జున సాగరు మట్టీ, మనిషి, శం ఈయన ఇతర కవితలు. 'సినారే'గా సినిమా ాలు రాసి ప్రసిద్ధులయ్యారు.

, వెంకటేశ్వరరావు : 1908 - 1985 సుప్రసిద్ధ పత్రికా పాదకుడు, రచయిత. 'ఆంధ్రప్రభ', ఆంధ్రజ్యోతి పత్రికలకు సంపాదకుడు. *కొత్తగడ్డ, సీత జోస్యం, హరి మాట* ఈయన రచనలు.

ము :మీర్ ఉస్మాన్ అలీఖాన్. అసఫ్‌జాహీ వంశంలో ఏడవవాడు. భారత స్వాతంత్ర్యానంతరం 'పోలీసు చర్య' (1948) తర్వాత హైదరాబాదు సంస్థానాన్ని భారతప్రభుత్వంలో విలీనమైన తరుణంలో 'రాజప్రముఖ్'.

మ్యానిజ్ : 16వ శతా. విజయనగర సామ్రాజ్యం సందర్శించిన పోర్చుగీసు యాత్రా చరిత్రకారుడు.

పట్టాభి సీతారామయ్య, భోగరాజు : 1880 - 1959. జాతీయ నాయకుడు, పాత్రికేయుడు, ఆంధ్రబ్యాంకు, ఆంధ్ర ఇన్సూరెన్సు వంటి వాణిజ్య సంస్థలను స్థాపించిన వ్యాపార శీలి. 'కాంగ్రెసు చరిత్ర' ఈయన ప్రసిద్ధ రచన.

పద్మజా నాయుడు : 1900 - 1975. పరిపాలనా దక్షురాలు సంఘసేవిక. పశ్చిమ బెంగాల్ గవర్నర్.

పద్మరాజు, పాలగుమ్మి : 1915 - 1983. విశ్వ విఖ్యాత కథా రచయిత. 'గాలివాన' అను ఈయన కథ న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ వారి అంతర్జాతీయ పురస్కారాన్ని పొందింది (1949).

పానుగంటి లక్ష్మీనరసింహారావు : 1865 - 1960. సుప్రసిద్ధమైన 'సాక్షి' వ్యాసాల కర్త. 'జంఘాల శాస్త్రి' పాత్ర ఈయన సృష్టియే.

పొట్టి శ్రీరాములు : 1901 - 1952. గాంధేయుడు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రానికై 58 రోజులు ఆమరణ ఉపవాసవ్రతం కొనసాగించి ఆత్మార్పణ చేసి 'అమరజీవి' గా ప్రసిద్ధుడయ్యాడు.

పోతన : 1470 - 1535. ఆంధ్రమహాభాగవతం రచించాడు. ప్రముఖ భక్తకవి, "పలికెడిది భాగవతమట పలికించెడి వాడు రామ భద్రుండట." ఈయన ఉవాచ. 'భోగినీ దండకం' వీరభద్ర విజయం ఈయన ఇతర రచనలు.

ప్రకాశం, టంగుటూరి : 1872 - 1957. సుప్రసిద్ధ జాతీయ నాయకుడు. స్వార్థత్యాగి. భారత స్వాతంత్ర్య సమరయోధుడు. 'ఆంధ్రకేసరి' ఆయనకు ప్రజలిచ్చిన

బిరుదు. ఆంధ్ర రాష్ట్రానికి ప్రప్రథమ ముఖ్యమంత్రి (1953 - 55).

**ప్రతాపరుద్రుడు :** 13వ శతా. ఆఖరి కాకతీయ చక్రవర్తి. గొప్ప సాహిత్య పోషకుడు. 'నీతిసారం' ఈయన ప్రసిద్ధ రచన.

**ప్రతాపరెడ్డి, సురవరం :** 1896 - 1954. సాంస్కృతికవేత్త, *గోలకొండ*, పత్రికాధిపతి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర అయన ప్రసిద్ధ రచన.

**ప్రభాకర్ శాస్త్రి , వేటూరి :** 1888 - 1950. మహా పండితుడు. తాళ్లపాక అన్నమాచార్యుని పదకవితలను ప్రచారం చేసిన సుప్రసిద్ధ పరిశోధకుడు.

**బాపిరాజు, అడవి :** 1895 - 1952. సుప్రసిద్ధ రచయిత. 'నారాయణరావు' ఆయన ప్రసిద్ధ రచన చిత్రకారుడు.

**బాపు :** జననం 1933. అసలు పేరు సత్తిరాజు లక్ష్మీ నారాయణ. కార్టూన్ చిత్ర కారుడు. సినిమా దర్శకుడు (సాక్షి, ముత్యాలముగ్గు).

**బాలమురళీ కృష్ణ, మంగళంపల్లి :** జననం - 1928 సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. వాగ్గేయకారుడు.

**బాలసూర్యప్రసాదరావు, కందుకూరి :** దేవి జమీందారు. విజ్ఞాన సర్వస్వ నిర్మాత.

**బుచ్చి బాబు :** 1916 - 1967. శివరాజు వెంకట సుబ్బారావు ఈయన అసలు పేరు. కథకుడు నాటక కర్త. ఆశావాది. 'చివరకు మిగిలేది' ఆయన ప్రసిద్ధ నవల.

**బులుసు సాంబమూర్తి :** 1886 - 1958. దేశభక్తి పరాయణుడు. భారత స్వాతంత్ర్య సమర యోధుడు. మద్రాసు శాసన పరిషత్తు అధ్యక్షుడు.

**బెజవాడ గోపాలరెడ్డి :** 1907-1997. జాతీయవాది. ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి (1955). సాహితీవేత్త, 'అమె తళుకులు' కవి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, తెలుగు భాషా సమితి అధ్యక్షులు.

**బ్రహ్మనాయుడు :** క్రీ.శ. 12వ శతా. సమతావాది. రాజకీయ ధురంధరుడు, సంఘసంస్కర్త, పల్నాటి సీమను పాలించిన హైహైయ రాజసంస్థానంలో మహామంత్రి. చాపకూడు సహపంక్తిని ప్రోత్సహించినవాడు.

**బ్రౌన్ చార్లెస్ ఫిలిప్ :** 1798 - 1884. తెలుగు సాహిత్యాభిమాని. భాషా సేవకుడు. నిఘంటుకర్త. ప్రాచ్య తాళపత్రాల సేకరణ సాగించాడు.



**భయంకరాచారి :** 1910 - 1978, అసలు పేరు. ప్రతివాది భయంకర వెంకటా చారి. విప్లవ కారుడు. కాకినాడ బాంబు కేసులో ముద్దాయి. శిక్షపడి అండమానులో ఖైదీ.

**భాగ్‌మతి :** 16వ శతా. కులీమ్‌కుతుబ్ షా ఇష్టపత్ని. భాగ్యనగరం(హైదరాబాద్) ఈమె పేరు మీదనే నిర్మితమైంది.

**మల్లన, పావులూరి :** 12వ శతా. ప్రసిద్ధ శాస్త్రీయ 'గణిత' గ్రంథ రచయిత.

**మహబూబ్ ఆలీఖాన్ పాషా :** 1866-1911. నిజాం సంస్థానాన్ని పాలించిన అసఫ్ జాహీ రాజవంశ పాలకుడు. ఆర్తజననిత్యపోషకుడుగా సుప్రసిద్ధుడయ్యాడు.

**ముట్నూరి కృష్ణారావు :** 1879-1945. జాతీయవాది. 'కృష్ణాపత్రిక' సంపాదకుడు.

**మునిమాణిక్యం నరసింహారావు.** ప్రసిద్ధ హాస్య రచయిత. హాస్య కథా రచనలో ఉద్దండుడు. ఆయన వ్రాసిన సాంసారిక నవలలలో 'కాంతం' పాత్ర సృష్టించి ఘన కీర్తిని ఆర్జించాడు.

